# విషయసూచిక

# ఉదయిని


సాహిత్యపత్రిక

సంపుటము 1 భావ, శరత్తు

సంచిక ౧ శా. శ. ౧౮౫౬


## కిరణాలు

లోకప్రవృత్తి నంతనూ కలవరపరిచే నేటి ఆర్థికమాంద్యమురోజులలో సహా తెలుగు నాట వెలువడుచున్న క్రొత్తపత్రికలకు లెక్కలేదు. నిత్యజీవనమే యింత దుశ్శకముగా ఉండగా పదిమందిచేత డబ్బు అభిలషించుదగు కాని, అపట్టు సమకూడదనే భయము గమనించ కుండా జేబు నులుపుకో సిద్ధపడరు కాని పూచీ తెలియని చిన్నతనమని నిందించబోతే అనింద్యులు ఎంతోమంది మిగులరు సంస్కారులు,—క్రియావశముచేత కాకపోతే పక్షపాత వశముచేత నయినానూ. డబ్బుమాటలు, సౌఖ్యముమాటలు గమనించనీయని ఒకభావో ద్రేకం పత్రికనుడిగా వ్యక్తి చిమ్ముకో చూచింది కాబోలు; ఆవేశి దేశమంతటనూ రగలక పోదనే ఆశ ఒక ధైర్యమూ ఇస్తున్నది కాబోలు, పూచీ గమనించినప్పుడు కూడా. మరి యీ ఉన్నపత్రికలు చాలక క్రొత్తపత్రికలు వచ్చి చేయగలిగిన విశేష మేమిటని ప్రశ్న వేసరుతున్నారు జనులు: భావము పోల్చుకు క్రొత్తగా పత్రికలు వచ్చి గొంతు విచ్చుతున్నది యేపాటి లాని అనుభవము లెక్కిస్తున్నారు. ఆశయుతలులుమాత్రం ప్రజాచిత్తములో వ్యవ సాయమునకు తృషితములై ఉన్నమాట వాస్తవం.

ఈఅన్నిటనూ ముఖ్యముగా చిందులుతొక్కుతూ కానవచ్చేది సాహిత్యప్రవృత్తి ఒకటి. దేశములో తరుచై జరుగుతున్న సాహిత్యోత్సవములు కూడా ఈఉద్రేకమును నిదర్శిస్తున్నవి. ఇందులకు సాహిత్యపరమైనది ప్రత్యేకము పత్రిక కావలె నన్నది ఒకలక్ష్య ముగా పేరుకున్నది. సాహిత్యనిర్మాణము అపరిమితముగా జరుగుతున్నదని కాదు. నిజా నికి, ప్రశస్తమైన సాహిత్యం తనివి తీరా రావడంలేదనే అసంతుష్టి భావుకలోకములో వ్యాప్తమై ఉన్నది. ఒకరు కొన్న గ్రంథము కాని, పత్రిక కాని, పదిమంది (శక్తులైనా తాము కొనక) ఉపయోగించుకొని, కాక అసలే చూడక, సాహిత్యమునూ సంస్కృతినీ

ఉపేక్షపాలుచేసే అలవాటు దేశములో పాకిఉండడంవల్లనూ, నీచతరములైన ఆశయాభిరుచులు రగిల్చి జనాదరము లాగుకొనే పూనికలు జయము కాంచడంవల్లనూ, ప్రదర్శనార్థమై మాత్రమే నిలిపిన ఆత్మగౌరవముతోపాటు మహదాశయకల్యాణమును కోలుపుచ్చే కొందరు సారస్వతుల శోచనీయములైన ప్రయత్నాలవల్లనూ పెక్కురు సమర్థులైన సాహిత్యవీరులు గ్రంథరచనమునకు గాని, సిద్ధగ్రంథముల ప్రకటనమునకు గాని, పత్రికాది నిర్వహణమునకు గాని, కొంత ఉపసంహృతి పట్టిఉన్నారు. ఇన్ని పత్రికలకు నారి సంకల్పము సరిగా, ఏకముఖముగా, తీంద్రకొన్నట్టు లేదు. ఆంధ్రభారతి, గ్రంథాలయసర్వస్వము, సాహితి, సఖి, శారద, కళ, జయంతి మొదలైనపత్రికలు అనల్పమైన సాహితీసేవ సలిపి అంతరించినవి. కృష్ణాపత్రిక, భారతి మొదలైనవి ప్రశస్తముగా తత్కార్యము సాగిస్తూనే ఉన్నవి. (వాణిజ్యముపోషణమున నిలద్రొక్కుకొన్న భారతి రచయితలకు ఆర్థికపోషణ మిచ్చే ఔదార్యముకూడా ప్రారంభము చేసింది.) కాని నాటినుండి నేటివరకూ సాహిత్యము గతులు నిరూపిస్తూ, తత్పరిణామమునకు తోడ్పడుతూ దాని కోసమై ప్రత్యేకము నిలిచి బ్రదికిన పత్రిక లేకపోయింది. నాటికీ నేటికీ కలిగినమార్పు దేశములో సాహిత్యమునెడ ఉత్సుకతనూ, ఉత్సాహమునూ పెంచినదయ్యా కొన్ని సిద్ధహస్తాలు ఏఆశకూ లొంగని ఆభిజాత్యములో ముహూర్తము వేచి బిగియడం చూస్తున్నది. ఇంతసంచలనం రేగిన కలావ్యాపారము రచనకు వచ్చేసరికి ఒకానొకతలములు తరుచు దాటడం లేదన్నది మాటలమార్పుతో బహుజనమతముగా నిల్చిఉన్నది. కాని ఉత్కృష్టమైన సారస్వతము ఏరి గమనిస్తే యెంతో ఉన్నతమైనవిలువలు అట కానవస్తున్నమాట నిజం. ఇక నవీనులు భావగతిలోనూ, రచనలోనూ నవ్యత మెరుగులు దిద్ది అభివృద్ధి సంపాదించే సూచనలు కనబరుస్తున్నారు. వ్రాతకు ప్రోత్సాహమూ అనకాశమూ కలిగి, అభిప్రాయాలపరిపాకం ప్రతిభకు ఊత యిస్తే, ఇటు సారస్వతమునెడల దేశములో 'శ్రద్ధ' పెరిగితే, గర్వించదగ్గ సాఫల్యము చేపడుతుంది. అనన్యముగా సాహితీసేవకు పూనుకొన్న పత్రిక యిట్టియెడ పెక్కుకిరణాల సార్థకత చూపగల దన్నది ఒకమతముగా మాత్రమే ఆగక అంతటా అవసర మనిపించుకొంటున్నది. నవ్యసాహిత్యమహోదయమున వెలువడ్డ కావ్యధోరణుల అనుకరణములూ ప్రతిధ్వనులూ సహా మ్రోయక మానని యీగడియలలో నవ్యరీతుల ఒరవళ్లు చూపే పాశ్చాత్త్యసాహిత్యవీథిని పదనుపడ్డ ఆశయములూ, ఆదర్శములూ, సాంప్రదాయికములైన ప్రాచ్యుల కలాస్వప్నాలతో బాంధవించి అదనైన మెరుగులు దిద్దుతూ, ప్రతిభావికాసక్రమమును పరిశీలించి వివరించగల విమర్శమూ, నలిగిన దారులనూ, తప్పక కొత్తదారులనూ చింపుకవడే సద్రచనలూ ఏకత్రపరుస్తూ సర్వవిభాల ఉత్తేజనము సంపాదించడంకోసమై యింకా ఒకపత్రిక—ఒకపత్రికలో కొందరు—చేయి చేసుకోవలసే ఉన్నది. (ఒకపత్రిక అంటే ఒక్కటే పత్రిక అని కాదు.)

# కి ర ణా లు

ఒకరాష్ట్రము నంతనూ ఉఱ్ఱూతలూచి విప్లవము నడిపించగల ప్రాభవము సారస్వతములో కనబడ్డదట. ప్రకృతిశాస్త్రమథనము మొదలు విద్యాపీఠము లన్నిటనుండీ విజ్ఞాన రోచులు సమన్వయపడి మానుషవిచారవీధిని, అనుభవముత్రోవల, నడిచినడిచి కావ్యకలావాటికనుసహా సొంపులు తిరుగవచ్చే ఔచిత్యము తెలియవచ్చింది. వ్యక్తిజీవనము లోకముతో గాఢముగా, విస్తృతముగా కలియగట్టుకొని, వ్యక్తిమనస్సు—మానసికవపువు—క్రియలలో, కళలలో విరియించుకోవలసిన సభ్యతారీతులలో ఆంధ్రులపట్ల నేటివెనుబాటు దుఃఖకరమే కాని, వారి సహజమైన ప్రతిభా, వారి నేటి సంకల్పగతులూ పరికిస్తే ఉత్కటమైన ఆశా, ఉత్సాహమూ చేపడక మానవు. ఎంతెంతటి ప్రాతికూల్యములు వీచుతున్నా, ఇప్పటి అతృప్తిలో, తహతహలో ఏకాశయులకు కొందరకు సమాయోగము కుదిరితే సాఫల్యము చేపడక మానదు.

ఇట్టి సమాయోగములకు ప్రయత్నాలు ఈనడుమ పెక్కువిధాల జరుగుతున్నవి. (ఒకమూలనుండి అఖిలభారతపరిషత్తుకే పిలుపులు వినవస్తున్నవి!) కాని, యిప్పటి ఆంధ్రసాహిత్యరంగమున కానవచ్చే మూడు నాలుగుతరాల అభిప్రాయసంఘర్షణములూ, పక్షాభినివేశముల ఇరుకాటములూ, కేంద్రసమాయోగప్రయత్నాలలో సహా తబ్బిబ్బుగా తమప్రభావము కొంతవరకు పరచుకొంటున్నవని చెప్పవలెను. అయితే, రుచికీ, ప్రామాణ్యబుద్ధికీ సంబంధించినంతవరకు నవీనులలో పరస్పరము సమాధానమూ, సమ్మతీ తగినంతగా ఉండనే ఉన్నవి.

వాడుకభాషకు సారస్వతమే లేనిదే అసలు వ్యాకృతభాషతో పోటీ యేమిటని అధిక్షేపించిన క్రీ. ౧౯౧౩ ముద్ర గుద్దించుకొని పాతకాలములో చేరిపోయింది. నేటికి చియ్యబట్టిన వాడుకభాష ప్రయోగమైనా పరిమితప్రయోజనముతోనే ఆగుతుందని,—ఏనాడో వ్యాకృతభాషలో రచించిన భారతాదులు నేటికీ మన మనస్సులకు, నాటివారికివలెనే, సన్నిహితములై ఉండగా, వాడుకభాషరచనలు వాడుకనుడికారాలు మారగల కాలాంతరములో (ఇప్పుడయినా ఒకప్రదేశమువాడుక వేరొకప్రదేశమునవలె) దూరభవత కప్పుకొంటవని,—ఆక్షేపణము ఉన్నా, వాడుకభాషయే ప్రజాసామాన్యమునకు భావము అందించగల అపరిమితప్రయోజనముగల జీవద్భాష అనీ, కాలాంతరీయులకూ, భాషాంతరీయులకూ సౌలభ్యము గురిచూచి సూత్రాలలో ఇముడడంకంటె భాషాస్వాముల హృదయవ్యక్తికి అనుకూలమై వాడుకనుడికారాలతీపి అంకినంతగా పీల్చుకొనడం సాహిత్యమునకు సహజము కాగా, అది యెందులకూ అరికట్టక ప్రకృత మనుసరిస్తే వివేకమనీ మతాంతరము బిగ్గరగా ఘోషించేవరకూ వచ్చిఉన్నాము. క్రియకు, అంతకాలము ఆస్వాద్యమై ఇప్పటికీ మనోజ్ఞము కాకపోని వ్యాకృతభాష ఒకానొక సందర్భాల సమ్మతి పడసిన

వాడుకభాషకు కాందిశీకము కావలె ననడం అనుచితమనీ, వాడుకభాషకు సంప్రదాయసిద్ధీ, విలాసమూ, ప్రయోజనమూ ఉన్నవి కనుక అది స్వీకరించదగినదే కాని అనన్యము కాజాలదనీ, ఆధునికకళానిష్ణాతులునహా సౌందర్యసంపాదనముపట్ల వ్యాకృతభాషయోగ్యత చూచి తీరుతున్నారనిన్నీ, కాక, రెండూ ఏవో ఒక ప్రయోజనముకై కిలమెక్కి సాహిత్యము కట్టివేస్తూఉన్నప్పుడు రెంటనూ చేయితిప్పుకొని భాగ్యము పెంచుకొందామనిన్నీ అభిప్రాయములు, స్పష్టముగా కాని అస్పష్టముగా కాని, పరిపాకమునకు ఉద్యమిస్తున్నవి. ఇంతకూ, ఏ సభ్యభాషయందూ సహజ (దార్శనిక) వ్యాపారమై తెలియవచ్చే వ్యాకృతినుండి కాక, అభ్యాసవశాత్తు తెలుగుభాషయందు ఏర్పడిన కృతికితనుండి చింపుకపోయే ప్రయోగ పద్ధతి స్వైరతకే ప్రాధాన్యము నిలపక రమ్యమైనసొంపులు అలవరుచుకోగల స్థితికయినా ఈ వాడుకభాషవాదము తోడుపడగలదన్నది కూడా ముఖ్యముగా గమనించదగ్గమాట. ఇట్లు వివాదాలకు విడివడి రంగుల బాణసంచాలలో చేతులు విసరుకొన్న స్కంధావారములు గుడారాలు చివికి తూర్పువెలుగులో సౌహార్దములు చల్లుకోబోతున్నవి. అథవా, యిందుల కెంతో వ్యవధి పట్టదు.

మన మొక దశాంతరమే ప్రవేశిస్తున్నామని చెప్పవలెను. గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు ప్రభృతుల ప్రాభవము కేంద్రప్రవాహమునుండి ఉపసంహరించుకొంటూఉండగా తత్ప్రాభవములందు, ఇతర ప్రోద్బలములపదనులో, ఉపజ్ఞమెలకువలతో సాహితీక్షేత్రము పండించిన సాహితీసమితి ప్రాభవమున యువమనస్సులు, ఇతర ప్రోద్బలములసంతరింపులతో, ఉపజ్ఞమెలకువలతో, లేచి ఘట్టము మార్చుతా మంటున్నవి. క్రొత్త అవసరాలకు వైఖరులు నిలుపుకోగల ప్రతిభాశాలులు ప్రాతవారిలోనుండి సాగి ఒకరిద్దరు ముందుకు దూసుక రానేవచ్చు; కాని యిట ఘట్టము మారుతున్నామనీ, ఆ కవులప్రతిభ బహుముఖవ్యుత్పన్నమనీ మాత్రమే మన మనుకోవలసినమాట. కడచిన పాతికేండ్ల కలావ్యాపారములకు పర్యాలోకనముగా కావ్యరత్నభండారము, నవ్యకవితాపరామర్శము మొదలైన 'సారాంశముల' యెడల తాత్పర్య మేర్పడుతున్నది. మరిన్ని, కేంద్రగ్రంథాలయము, కేంద్రపుస్తక విక్రయశాల, కేంద్రపరిషత్తు మొదలైన కంజాయింపులతో సాహిత్యమును కార్యరంగముగానహా చక్కబరుచుకొనడం తత్కళావికాసమునకు దోహదమే అని వైశాల్యములు వలచుకొంటున్నారు సారస్వతులు. ఇప్పుడు అందరూ ఒక్కచో, ఒక్క అగ్రము విడక కళాసంపత్తికి ప్రాధాన్య మిచ్చి సాహిత్యమును సమర్థించే నిమిత్తమై భూమి కల్పించి అనర్థాలు తప్పించగల అవకాశం ప్రత్యేకపత్రికయెడ సహజం.

ఇంతులకిందులకుగాను 'ఉదయిని' దీవనలు తాల్చింది.

రసాస్వాదనముబట్టి మనస్సుకు సంస్కృతి ప్రసాదించే ఉత్కృష్టసాహితీకలాభ్యు

దయానికి 'ఉదయిని' సంతతము తూర్పుదిక్కయి ద్వారము తెరుస్తుంది.

* * * *

ఆ అభిలషించిన సాహిత్యపత్రిక నడిపేవిధానములో పరణభేదము లున్నవి. అథమము మాసపత్రికఅయినా కావలెనని ఒకసలహా. కొంతవరకు సర్వతోముఖసౌష్ఠవము రూపించగలపత్రిక, అది యెప్పటికి వచ్చేదయినా, ఒకఆరోగ్యము కళాచిత్తములో రేపగలదు. ప్రతినెలా యింతపాటి సద్గ్రంథము ఒకపత్రిక దేశమునుండి యేరుకోగలకాలము మన కింకా కొంతయినా దూరమున్నది. ప్రస్తుతము ద్వైమాసికి నింపుకోనడమే చేయి నిండినపని. ద్వైమాసికిగానయినా ఇది ఉత్తమరచనయే ధరిస్తుందని ప్రతిజ్ఞచేయడంకంటె, అది ఒకలక్ష్యముగా ఆభిముఖ్యము చూపడం వివేకముగా, అందుబాటుగా కనబడుతుంది. మరి నిలుపుకొన్న ఉద్దేశాలకు తగ్గబలము చూచుకోనిదే ఆ ఉద్దేశాలు ప్రకటించడమూ, అందులకై పత్రిక చేబూనడమూ సాహసమంటూ రాగల ఆక్షేపణకు సమాధానప్రాయముగా, కొంతవరకు అన్నిపాగాలవారూ 'ఉదయిని'కి ఆశీస్సూ తోడ్పాటూ ప్రసాదిస్తున్నారని నిజం చెప్పవలసి ఉన్నది: ఇది ఒక కృతజ్ఞతా, ఒకప్రార్థనా కూడాను.

రచనలకైనా, మొదటితరగతులవారి కౌశలాలు సేకరించుకొన్నమాత్రాన మురిసి ఆగక, పెరుగుదల చూపే చక్కనిచేతులవిన్యాసాలకు తగినంతగా ఆహ్వాన మీయడం పత్రికకు కర్తవ్యేతరము కాదనేసంగతి మరవరానిది. కళాసృష్టికి ప్రయత్నములంటూ దొరికినవంటే విధిగా పత్రికలు పూలకారుగా ప్రదర్శించి అందుకు ప్రోత్సాహ మీయవలసిందే అనికూడా చెప్పేవా రున్నారు. కాని యెప్పుడైనా ఆలాగు అవిమర్శముగా పోగుచేసుకొని ప్రోత్సహించగల మెట్టు ఉంటే మన పది గడవగలిగినామని చెప్పవలెను. విమర్శమన్నది ఆ సృష్టిక్రియ లోటుపడి ఉండగా విజృంభించేదనీ, సృష్టిక్రియ వెల్లివిరిసినప్పుడు విమర్శము వచ్చినది యెక్కడా తక్కువే అనీ ఒకమతము విమర్శము తక్కువైన కొద్దీ కళాసంపద పెరిగినట్టే అని కాని, విమర్శమును తలయెత్తనీక రచనలు గుణించుకొన్న దెల్లా మంచిమాట అని కాని ఊహాలు పెంచుతున్నదికూడా. కాని, విమర్శమన్నది యెంతో సభ్యమైన సహజవ్యాపారమై కళ మన అనుభవవీథిని నిలిచినప్పుడు ఆ అనుభవమును, ఆస్వాదనమును మనము తెలుసుకో యత్నించగా, అది రసనను చక్కబరుస్తుందని యేమరకుంటే, మనస్సుకు, ఆలోచనకు,—అదీ ఆకళలగురించిన ఆలోచనకు,—శోధనమిచ్చే విమర్శము ఆ కళలకు విరుద్ధము కాక తోడ్పడ్డదే అవుతుందని చెప్పనే అక్కర ఉండదు. ఇక టి. ఎస్. ఈలియటు కవి నిరూపించినట్టు, ఉత్కృష్టమైన కళాసృష్టి వెల్లివిరిసినప్పుడే ఉత్కృష్టమైన విమర్శమూ—రూపుకట్టినది యెంతైతే ఏమి—ఉండగలిగిందని చెప్పి ఊరకుండక, ప్రాణి కంతకూ పనిచెప్పే కళాసృష్టి ఆకళను గురించిన మనోవ్యాపారమైన

విమర్శమును, అది వ్యక్తము కాకపూర్వమే, తనలో లయముచేసుకొని తనలోనే రూప మిూయగలదనీ, కనుకనే ఆసమయాలలో వెలువడే కేవలవిమర్శమూ పరిమాణతః తక్కువ కావచ్చుననీ, రూపుకట్టిన విమర్శమాత్రం ఉత్కృష్టమైనదే కాగలదనీ సమన్వయము లకు యత్నించనూవచ్చు. ఆమెట్టు మన కిపుడు లభించిలేదనీ చులకనగా చెప్పనచ్చు. మరి ఒక్కొకపుడు,—తరుచు,—సృష్టిపరమైన ప్రతిభకు విమర్శము ఒరవళ్లు చూపి, కళా సత్త్వములు మనస్సుకు పట్టించి తోడుపడగలదన్నది గ్రహించడం కష్టము కాదు. పత్రి కోద్యమమూ, అనుభవమువిలువలు పరిశీలించుకొనే తాత్పర్యమూ అంతటా పెరిగిన యీ రోజులలో విమర్శము మరీ సన్నిహితమై కరుర్చున్నది. అది కళకు ఋణపక్షమని యెంచి కుదించుకొనడం ఉన్నతికీ, కళాభ్యుదయానికీ భంగకరమనే గ్రహించవలసిఉంటూన్నది.

* * * *

సాహిత్యకళయందూ, చిత్రకళయందూ—కళామాత్రతత్త్వజ్ఞతలో మనస్సు తిరిగి తిరిగి—చెయితిరిగిన రసపక్షపాతి శ్రీ అడివి బాపిరాజుగారు తమప్రాతింకోపాటు 'ఉదయిని' స్వప్నమునకు దేశికమూ, రూపకమూ అయిన ముఖచిత్రము రచించి దీనికి బొట్టు పెట్టినవా రయినారు.

మనకు అర్ధోదయమేనట.

జీవనపరిప్లుతిలో త్రచ్చుకొని మొలకెత్తిన చైతన్యము తనను లేపుకొన్న జ్యోతిః పుంజముదీవనలు త్రావి తనయందు రసదేవతాత్వము నెఱపుకొన్నది.

తనకన్నులవెలుగును రసాత్మకముగా నిరూపించుకొనడంలో—ఆవెలుగు తనరసాత్మ కతను నిరూపించడంలో—తనకు సంతతాభ్యుదయము చూచుకొన్నది.

* * * *

ఏఉద్యమాలకూ భర్త్సనయే సోకుతున్న యీనాట పనిర్ధారణలకూ ఒత్తిడి చేయక యీవినీతప్రయత్నమున వందలునహా చేతి కందిచ్చి బుజాలు కలిపిన మిత్రులకు, అభిమానులకు, యథాశక్తి తోడ్పడ్డ యితరమిత్రులకున్ను, అబ్బురపాటుతో కృతజ్ఞత వందించడంకంటె మించి, వారిమనస్సులో శబలించిన సౌందర్యము చూచి ముగ్ధమాంగల్య ములు ఏరుకొంటున్నది 'ఉదయిని.'

ఇకముందు వచ్చే సాయమునకంతా కృతజ్ఞతాభివందనముల జల నిర్మించినట్టే: పత్రికనడకయే వారివారికి కృతజ్ఞత ఊర్చుతున్నట్టు కాదూ?

కొంపెల్ల జనార్దనరావు



# శరదుత్సవము

నా హృదయ మిప్పు డరమూత నగవులందె
కనెను శాంతిదేవత కడగంటిచూపు
బ్రతికినన్నాళ్ళ కీ ముహూర్తమున విరిసె
తొలివలపు మించు జీవమాధుర్యరుచులు.

మిగుల కంపించు నా పేదమేని నిపుడు
సుమమృదులహస్త మేదియో నిమురుచుండె
కన్నతల్లి దీవనతోడి కౌగిలింత
జారుతీయని కన్నీటిచలువ లొలయ.

విరిసె కాబోలు, జగదధీశ్వరు శిఖావ
తంసకుసుమమ్ము! దిగ్దిగంతమ్ములందు
సౌరభోచ్ఛ్వాసముల వెదజల్లుచున్న
దానుకూల్యమ్ముతో శారదానిలమ్ము.

ఇంత లేమబ్బుచిరుతున్కయేని లేదు
విప్పిరేమొ నిశారాజ్ఞి వెల్లగొడుగు
ఏమి శ్రవణోత్సవ మ్మిపు డీ విశాల
గగనమున కోటిదివిజశంఖములు మ్రోగు.

చంద్రికావసనాంచలోచ్చాలనములు
చిరవిరహవాసనల నెగజిమ్ముకొనుచు
తాండవించెడు నమృతసౌందర్యలక్ష్మి
ఉర్వి కీనాడె తొలిశరదుత్సవమ్ము.

ఎంత స్వేచ్ఛయొ నే డీయనంతసృష్టి
గానమొనరించు ప్రతిజీవకణము గూడ
శైలగర్భాంతరాళ నిర్ఝరమువోలె
నెదియొ కళపెళలాడు నా యెడద నెగయ.

నరకలోకపు చీకటితెరలవంటి
వెన్నిశి లేగె నొకస్వప్నమేని లేక:
ఇంతమాధుర్య మింతప్రశాంతిసౌఖ్య
మింతసౌందర్య మెట దాగె నింతవరకు ?

ఓ సఖీ ! ఓ సుహాసినీ ! ఓ శరద్వి
భావరీన ర్తకీ ! కవిభావనావి
లాసినీ నిత్యసైరంధ్రి ! ఓ సమస్త
లోకమోహిని ! ఓ స్వప్నలోకరాజ్ఞి !

బాష్పకుంఠితకంఠాన పాడలేక
నా యెడద నింపుకొందు సౌందర్యరసము
నిలుపుకోలేన ! నాలోన నేనె విరిసి
రాలిపోదు వృంతచ్యుతప్రసవమట్లు.

ఈ యమృతశాంతియే చాలు నెపుడు నీ క
టాక్షభిక్షున కా మరణాంత, మింక
శ్రీ చరణలాక్షతోడ నా హృదయకుసుమ
దళము లనురాగరసరంజిత మ్మొనర్తు.

# యాత్ర

పైరగాలితరంగాలపై నపూర్వ
పరిమళవిలాసములు వెల్లివిరియసాగె
ఓసఖీ ! చూడు మిరుగట్ల నొరసికొనుచు
పొంగుచున్న దానందప్రపూర మిపుడు.

ముంగురులపైన పూవులు ముడువవలదు
వలదు తిలకమ్ము, కైసేత వలదు మేన
విడినకబరీభరము ముడివేయవలదు
కాల మిది గాదు మనయలంకారములకు.

తరతరమ్ముల ప్రేమస్వతంత్రతు లరుగు
దారి బోయెదము నూతనాధ్వగుల మనల
పరిహసించెడు పాడుప్రపంచముఁకె
పారవేయుము నీయలంకారభరము.

మూఢవిశ్వాస శృంఖలమ్ముల విదల్చి
వలపుగౌగిటిముడి పట్టువడితిమేని
మనశరీరసుఖస్పర్శమునకు నేటి
యణు వణువు గూడ నవజీవ మనుభవించు.

కోరికల నెల్ల మరచి నీకొరకు నేను
నాకొరకు నీవు తొలివేగుబోక రాలు
పూలజతవోలె, ఈసుధాపూరమందు
తేలిపోదము జన్మజన్మాలయాత్ర.

## కృతజ్ఞత

భస్మరాసులనుండి పావనత మేలు
కొలిపినట్టి భాగీరథీజలమువోలె
జన్మజన్మాల హృదయకశ్మలమునుండి
ప్రాణశక్తి రగుల్చె నీపై నిప్రేమ.

నా నిరాలోక లోకమ్ములోన నిన్ను
యుషసిగ తలంచుకొన్న ముహూర్తమందు
అనుభవమె గాని, వెలిసేయ నలవిగాని
'పరిచయమ్మ'న నను నేనె మరచిపోదు.

ఇంతనెత్తావి వాసించునేని యెడద
ఎన్నిస్మృతు లెన్నికోర్కె లెన్నెన్నికలలు
జగదజస్రసహస్రవసంతలక్ష్మి
ఎదుర మూర్తీభవించె నాయెడద కొరకె.

# ఉ ద యి ని

అలరునకు బోలె నా హృదయమ్మునకును
జన్మమున కొక్కటే వికాసమ్ము సకియ !
వలపు వెదజల్లి సుఖదుఃఖములకు వెలిగ
ధాత్రిగర్భాన గాంచు నాత్మప్రశాంతి.

వలచి నిను విసిగించిన యాములకు ఫలము
ఆ మరణ మేను ప్రేమగాయకుడ నౌదు
నీవు మాత్రము పూలవెన్నెలల రేల
ప్రేమనృత్యోత్సవమ్ము గావించుకొనుము.

నా హృదయరక్తమే లలనా ! విలాస
లాక్షగా నీ పదాల కలంకరింతు
నీ వసంతకల్యాణైకనృత్యమందు
సన్ను నుససార గాన మ్మొసర్పనిమ్ము.

వేదుల సత్యనారాయణశాస్త్రి

---

*
* *

ఇపుడె తూరుపునుంచి
ఈదరవార్త:
విసిగిపోతూన్న ప్రాణాల
కొసలె పట్టి వివశమౌతూన్న
అవయవాలనె ఆపి పట్టి
మానవాళి పొలిమేరద్వారమ్ము కడనె
శతాబ్దులు నిలిచిన ఓర్పు
సొమ్మసిల్లిన దని.

మద్దుకృష్ణ

# అపరోధము

కీర్తనము చేసి బ్రాహ్మీముహూర్తమందు
గురుని, బ్రణమిల్లి పరమేశ చరణములకు,
విధివిహితకృత్యముల్ యథావిధి నొనర్చి
మననచేయ గూర్చుంటి శ్రీ మంత్రజపము.

పంచబాణంబు లిక్షుచాపంబు బూని
నిజజపారుణ కాంతి నిండించి దిశలు
ఎలనగవుతో జగత్తు మోహింపజేయు
తల్లి ధ్యానించినాను ప్రత్యక్షమందు.

* * *

అల్ల ఏనాడో నీ నవయౌవనమున
మల్లికాస్వచ్ఛ కౌశేయ మహిత వగుచు
ముగ్ధునిగ నన్ను జేసిన మోహనమగు
త్వత్కృపామూర్తి యెదుట ప్రత్యక్షమయ్యె.

అంత భయ మయ్యె, వడకె సర్వాంగకములు !
పీఠమున నుండ తల్లిని బిలిచినాను
ఇపుడు రావల దరుగు మెందేని యనుచు
ఎంత బ్రతిమాలినను విన, వేమి సేతు !

ధ్యానభంగము చేసికో దలచి యంత
మీలితంబైన నా నేత్రమిథున మపుడు
తెరచి చూచితి, నెదుర దోతెంచినావు
చిరునగవుతోడ, నింకేమి చేయగలను !

* * *

పగలు రేయును నపరాధ బహుశతంబు
చేయు నను పుత్రబుద్ధి రక్షింపుమంచు
బాష్పగద్గదితాక్షరపంక్తితోడ
విశ్వజనని బ్రసన్న గావించుకొంటి.

నా. న. శా.

# జయభేరి

నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను.

నేను సైతం
విశ్వవృష్టికి
అశ్రు వొక్కటి ధారపోశాను.

నేను సైతం
భువనఘోషకు
వెర్రిగొంతుక విచ్చి మ్రోశాను.

* *

ఎండకాలం మండినప్పుడు
గబ్బిలంవలె
క్రాగిపోలేదా ?

వానకాలం ముసిరిరాగా
నిలువు నిలువున
నీరు కాలేదా ?

శీతకాలం కోతపెట్టగ
కొరడుకట్టీ
ఆకలేసీ కేకలేశానే !

* *

నే నొకణ్ణే
నిల్చిపోతే,
చండ్రగాడ్పులు, వానమబ్బులు, మంచుసోనలు
భూమిమీదా
భగ్నమౌతాయి.

## క వి త



నింగినుండీ తొంగిచూచే
రంగురంగుల చుక్కలన్నీ
రాలి నెత్తురు క్రక్కుకుంటూ
వెలిపోతాయి.

పగళ్ళన్నీ పగిలిపోయీ,
నిశీథాలూ విశీర్ణిల్లీ,
మహాప్రళయం జగంనిండా
ప్రగల్భిస్తుంది.

*　　　*

నే నొకణ్ణే ధాత్రినిండా
నిండిపోయీ,
నా కుహూరుత శీకరాలే
లోకమంతా జల్లులాడే
ఆ ముహూర్తా
లాగమిస్తాయి.

*　　　*

నేను సైతం
ప్రపంచాబ్జపు
తెల్లరేకై పల్లవిస్తాను.

నేను సైతం
విశ్వవీణకు
తంత్రినై మూర్ఛనలు పోతాను.

నేను సైతం
భువన భవనపు
బావుటానై పైకి లేస్తాను.

శ్రీరంగం శ్రీనివాసరావు

# అన్వయము

౧

కాశ మతిసరిని ఆకాశో సుని సవ్వింది ;
తరంగవంపుల కడలి సురుంగుపాటి రువ్వింది ;
వెన లోకల- తెలివిగేసేసవి.

కొంస లాగనిది వర్ష ప్రహస్త్రరించిన గోష్టు,
చలితుపానులు దూసి చాని గ్రీష్మఘగాష్పు
ఏల యిటు రాపిళ్ళు కడంగు ?

వై లాను సుషమ బింబముకట్టి గాలులు
తడవి సాగిన ముహూర్తము కన్ను విచ్చంగా,
ఏల యిటు రాపిళ్లు విడవు ?

౨

కమలమ్మో, కలువయో, కలల అందపునెల వె
ఆ బింబముమహాస్సు లోమనికి పట్టినా
మని నాకు తగుల మొక్కొకరు.

సుషమ ఆ వృతిలో ఉసురులు విదారించు
నెరసు లెందుండి ?—తరణిమహాస్సు లోలిచి కాం
కలు కొప్పు ముడిచారు కాక !—

అది అభావ్యము వారికి : అటు ప్రాకృతము, సాజ
మగు రేకు విచ్చితే, అది నాకు చిచ్చులు వి
లోకించితే, ఎవరి దోసంగు ?

౩

కూర్చిపెట్టినవి తగులము వితాకించు
కామనస్సులు నింగి రాపాడు పలుకులు
తరణివెల్గుల కుద్దితారి.

## క వి త

అవి ప్రభుప్రభులు నా ఆత్మ నాటుక, వెన్నె
లలు పుట్టలుగఁ దూఱి అలజడి వెలార్చినది
యెవరి తప్పని దండడింతు ?

క్రొంబూచురేకు విఘూర్ణించు చిచ్చులు
కన్నీట విలిచి యొక్కటి నింద శిరమూఁగ,
అదెరేకు వలచు, తారాశ.

౨

ఇటు వసంతశర ద్వారిష్ఠశోభలు గూడు
కట్టిన నిశాంతము వికాసమ్ము వలపంపు
నెడ, అంచు లేమిటికి నాకు ?

ఋతుమాధురులు రంగరించి పదనారు నా
కిరణాల గుబురు రాగిలు, నెందో పిలుపు లై
గిలిగించు ప్రకృతికొంటెతకు.

అట ఒక్క అమృతహిమాని నా తోలుటోఁతు
లంటెః మనక విదల్చు అచ్చవెల్గు పోరాడి
పడ గెత్తి పాడుకొంటాను.

కొంపెల్ల జనార్దనరావు

# పుంతలో ముసలమ్మ

పికిలిపిట్ట పిర్రుమంటె
ఒక తెబళ్లు జల్లుమంటె
సంత బయట గోల్లుమంటె
పొట్టకొరకు ముసలమ్మ
తుప్పిగంతు లేయుచుంటె
సకలజనులు సంతసమున
దానిచుట్టు మూగుచుంటె
పోయిపోయి ముసలమ్మ
పొలిమేరను నిలిచియుంటె
పూజిత మన దానిదే
పుంతలోన రాయిదే !

హద్దుకొరకు అంకెకొరకు
కాలిబాట తుడుచుకొరకు
దూరములను తెలుపుకొరకు
పాతిపెట్టి మైలురాయి
నేటి దేవతాయెనే ?
ప్రజలకు మతి పోయెనే ?
అహా !
పూజిత మన దానిదే
పుంతలోన రాయిదే.

చావలి బంగారమ్మ

# చిన్న

చిన్న ఆడుకొంటోంది
చిలక ఆడుకొంటోంది
పొన్న ఆడుకొంటోంది
పొట్టి ఆడుకొంటోంది
చూడ రండి చూడ రండి
కన్ను లుంటే—

గచ్చకాయల్ తెచ్చుకొంది
గవ్వ లెన్నొ తెచ్చుకొంది
అరుగుమీద పోసుకొంది
చేతు లెత్తి ఆడుతోంది
చిన్న ఆడుకొంటోంది
చిలక ఆడుకొంటోంది
పొన్న ఆడుకొంటోంది
పొట్టి ఆడుకొంటోంది
చూడ రండి చూడ రండి
కన్ను లుంటే—

లక్క పిడతల్ తెచ్చుకొంది
కందిపప్పు తెచ్చుకొంది
నిప్పు లేక నీళ్ళు లేక
బువ్వ వండి పెడుతోంది
చిన్న ఆడుకొంటోంది
చిలక ఆడుకొంటోంది
పొన్న ఆడుకొంటోంది
పొట్టి ఆడుకొంటోంది
చూడ రండి చూడ రండి
కన్ను లుంటే—

# ఉ ద యి ని

తాటాకుల్ తెచ్చుకొంది
పెళ్లికూతురిని చేసింది
పెళ్లికొడుకుని చేసింది
పసుపు కుంకుం కాటి కట్టి
బట్టు కట్టి చీర కట్టి
మెళ్లోను దండ వేసి
పల్లకీ లేకుండ
బాజాలు లేకుండ
బ్రాహ్మణా లేకుండ
పెళ్ళిళ్లు చేస్తోంది
చిన్నా ఆడుకొంటోంది
చిలక ఆడుకొంటోంది
పొన్నా ఆడుకొంటోంది
పొట్టి ఆడుకొంటోంది
చూడ రండి చూడ రండి
కన్ను లుంటే——

నవ్వు లెన్నో నవ్వుతోంది
బువ్వ లెన్నో వండుతోంది
పెళ్ళి ళ్లెన్నో చేస్తోంది
ముద్దుల్లు కురుస్తోంది
వెన్నెల్లు కాస్తోంది
చిన్నా ఆడుకొంటోంది
చిలక ఆడుకొంటోంది
పొన్నా ఆడుకొంటోంది
పొట్టి ఆడుకొంటోంది
చూడ రండి చూడ రండి
కన్ను లుంటే——

చింతా దీక్షితులు

# ఆ కొండ

మేఘశలాకలు
అభ్రవీథిపై
అటు యిటు
పోతున్నాయ్.

గువ్వ డొక్కడు
కవ కనపడమిని
రెక్క లార్చుకొని
కూపెట్టె.

కొండగద్దెపై
సంజకాంతిలో
స్వర్ణదీప్తిలో
భావుకు డున్నాడు.

ప్రణయదీప్తితో
నీశ్వరి నారయు
దోయి లెత్తుకొని
నిల్చొని యున్నాడు.

ద్వారపార్శ్వమున
ఈశ్వరి 'కనకం'
సుభగముఖంతో
తరళించెన్.

దోయిలి దించుకు
భావుకు డొదిగి
ప్రేమోత్సుకతన్
కౌగిలైన్.

భావస్నిగ్ధుని
పాటల నందుకు
మేఘమాలికలు
మెల్ల చనెన్.

ఉ ద యి ని

నిల్చినచేరిని,
దించినదోయిలి
చూచి గువ్వదు
రివ్వుమనెన్.

సజమబ్బులు
పాటల ఫూనుకు
సొంపురంగుల
విహరించె.

విహ్వలించినా
గువ్వ డొక్కడూ
కవ కేరన్ విని
రివ్వుమనె.

జనమంచి కామేశ్వరరావు

---

## ప్రబోధము : వనవాసి

వలిపెపు మేలిగాలిపడవగా, సుఖవన్నయరీతులన్, దిశాం
చలతల దివ్యతీర్థముల, స్నానమునాడగ దేలిపోవు కో
కిలమొలసంజపాట; పులకింప జగంబు, రచింపు భక్తిమం
గళ గళమా ! రమారమణ గానసుధారస ఖండకావ్యముల్.

ఈ చెలులాడుమబ్బుపార లెవ్వరికై దెస లంటి రోయు, దో
బూచుల నాడు చుక్కవలపున్నసబోడుల, హాసమల్లికా
రోచుల ప్రేమసౌరభము రోదసి నిండగ బారు నేరికై,
ఆ చతురప్రశస్తప్రణయైకయశస్విని బాడు చిత్రమా !

పులకితయామినీసితకపోలములన్ దరహాసచంద్రికల్
తొలంకెడు, దివ్యసౌరభతతుల్ తెలిమబ్బుల విచ్చి స్వర్ణదీ
పులినములందు దేలె, వలపుంబువుదొన్నెల చైత్రలక్ష్మి తే
నెలయులుపా లిడెన్, హృదయనీరజమా ! ప్రభు బూజసేయుమా !

కాశూరి వెంకటనరసింగరావు

# మిణుగురు మీటు

మూకసంధ్యామరంద బంధూకరక్తి
తెగిపడిన తేటికంతమై తేజముడుగ
లే గులాబీల జలదాల రేకులెల్ల
కనలిపోయిన రక్తపు కణము లయ్యె.

పాడువడియున్న జీవితప్రాంగణముల
పలుకరించునె వెన్నెల వలపురేలు ?
కరగిపోయిన బంగారు కలలయలల
తోచునే చుక్కపూవుల తోరణాలు ?

కాలవాహిని కలుషమై వాలవేల
కాలు జారిన యానాటి కాళరాత్రి
గర్భమందున నవయు నా క్రమగీతి
తేలిపో నొక్క చిరునవ్వు తెప్ప లేదె ?

మవ్వపున్ వలపుతారల మువ్వమ్రోత
సవ్వడులు లేని యీ నిశాసమయమందు
చెప్పుచుందువు ఖద్యోత జీవులకును
వెలుగు స్ఫురియింప నర్తింప వలయు నంచు.

శ్రీరంగం నారాయణబాబు

# ప్రేమతత్వం

కవి: కవికొండల వెంకటరావు

"వీరికి వారెంతో వారికి వీరంత అని అంటూంటానే నేను, ఆ మాస్టరుగా, హిందూదేశాన్ని ఓ అమెరికాదేశపుస్త్రీ తిడితే అమెరికాదేశాన్ని ఓ హిందూదేశపు మగవాడు తిట్టేడు" అన్నాడు శశిభూషణమహాశయుడు, ఒకానొక చదివేసిన పుస్తకం మూసి మేజాబల్లమీద పడేస్తూ. సుజాత ఆ పడేసిన పుస్తకమ్మీద కొంతసేపు పుటలు విప్పి చూస్తూ, "ఏమిటండో ఇందులో ఎంచక్కటి బొమ్మ లున్నాయి! ఇన్నాళ్ళనుంచీ చదువుతూ వొఖనాడూ చూపెట్టినారు కారు," అంది. "మన బొమ్మలు కావవి. మన క్రింద తలక్రిందుగా నడిచేమనుష్యుల బొమ్మ లవి," అన్నాడు శశిభూషణుడు. "కాదండీ, తలక్రిందుగా నడవడం ఏమిటి? సరిగా కాళ్ళమీద నిలుచున్న మనుష్యులవేనండీ. మన కిం దుండడ మేమిటి? మననెత్తిమీద దెగిరిపోయ్యేవాళ్ళనిలా గిగిసిస్తూన్నారంటే—మీరు ఇందులో బొమ్మలు చూచారా? ఊరకే అక్షరాలే చూచారా?" అని ఆ పుస్తకంలోని ఒకబొమ్మ సుజాత పుట బాగా విప్పి శశిభూషణుని మొగమ్మీది కంటా పెట్టింది. శశిభూషణుడు "ఉండు. అదేమిటి. చేతి కందియ్యి," అన్నాడు. సుజాత అందిచ్చింది.

శశిభూషణుడు చేత బట్టి, "దానిమాటే నే నన్నది" అన్నాడు. "దాని కేమొచ్చింది. నిక్షేపంలా గుంది" అంది సుజాత. "అలా గైతే నీవుకూడా ఓవేషం అలా వేసుకొని బయలుదేఱు రేపటినుంచి" అన్నాడు శశిభూషణుడు. "ఎక్కడికి బయలుదేరేది?" అని అడిగింది. "అక్కడికే అమెరికాకు" అన్నాడు శశిభూషణుడు. "అమెరికాకు కాదు గాని రోజూ షికారువెళ్ళడముకు బాగుంటుంది ఈవేషం. ఎవరూ ఆడ దనుకోడానికి వీలుండదు. అయితే అసలు ఆడదేనా ఇది?" అని పరకాయించి చూడ్డం ప్రారంభించింది సుజాత ఆ బొమ్మకేసి, హాస్యభావం కుదించి. శశిభూషణుడు "ఏం? సందేహం కలిగిందా?" అన్నాడు. సుజాత "ఏమీ లేదు మఱి" అని గొంతుక గ్రేటుకొని, "మీసాల్లేవు ఆడదే" అంది. శశిభూషణుడు "మీసాలు చాలామంది మగవాళ్ళ కుండవు. అదా కని పెట్టావు!" అన్నాడు. సుజాత కొంచెం విసు గభినయించి, "నాకు తెలియడం లేదు. మీరు చెప్పండి. చదివిన ట్టున్నారు గ్రంథమంతా" అంది. "దానికోసం చదవక్కఱలేదు" అన్నాడు శశిభూషణుడు. "అయితే చదవకుండానే చెప్పండి" అంది సుజాత. శశిభూషణు డన్నాడు, "చదివేశాక చదవకుండా చెప్పడ మెల్లాగ్గాని—చూచేవా మఱి ఆడది మగాడివేషం వేసికొని అచ్చు మగాడిలా గుంది: ఆడదానివి నీవన్నా ఆనవాలు పట్టలేక పోయినావు" అని.

సుజాత తనశరీరం నఖశిఖపర్యంతం ఒకసారి చూచుకొని తిరిగి బొమ్మకేసి చూచి, "తెలియ కేం లేండి. జుట్టునుబట్టి తెలియదూ?" అని, "జుట్టుకూడా కత్తిరించుకుందీ ఇది?

ఇందాకటినుంచి కాళ్లు చేతులు ముక్కూ చూస్తూ ఏమో వస్తువులు తీసే స్తే తీసేసుండవచ్చు ననుకున్నా; జుట్టుకూడా కత్తిరించుకున్నారండీ?" అంది. శశిభూషణుడు మాటుమాటాడ కుండా ఆశ్చర్య నిమగ్ను యయిపోతూవున్న సుజాత ముఖంకేసి చూస్తూవున్నాడు.

అంతలో ఎవరో వీధితలుపు తట్టిన ట్టయింది.

ఎంతో చనువుగా సరాగంగా సమర్శగా అన్యోన్యం అప్పటిదాకా చిలకాగోరిం కల్లాగు మాట్లాడుకుంటూవున్న జంపతు లిద్దఱూ చటక్కున ఒకరినుండి యొకరు దూరమై తూష్ణీంభావాన్ని సుజాత లోపలియింట్లోకి శశిభూషణుడు వీధితలుపు తీయడానికి నిష్క్రమించారు. మఱోనిమిషానికి శశిభూషణుడు తనస్నేహితుడైన మదనమోహానునితో దిరిగి ప్రవేశించినాడు. అప్పుడు వారిరువురికీ యిలా సంభాషణ జరిగింది.

మదనమోహానుడు:—నీవు షికారువస్తాను అని నాతో జెప్పి సరిగా సాయంత్రం అయిదు గంటలకు పిలవమని తలుపు గడేసు క్కూచున్నావు?

శశిభూషణుడు:—నేను నామనస్సు మార్చుకున్నాను. నే నీపూట షికారాను.

మదనమోహానుడు:—టష్: మగాడి మన స్సింత మాటిమాటికి పోయీాదిగా వుంటే ఆడవాళ్ళకు వచ్చిందీ!

శశిభూషణుడు:—మఱచిపోయే నడగడం. ఏది నీసుప్రియ? ఆమె రాలేదేం నీతో?

మదనమోహానుడు:—ఆమె తనమనస్సు మార్చేసుకుంది. రానం దీ పూట షికారు.

శశిభూషణుడు:—ఏం?

మదనమోహానుడు:—ఎప్పుడూ ఏ యింట్లోవాళ్లూ బయలుదేరరు; మనమే బయలుదేఱి అందటిళ్లకు వెళ్లాలి: అన్నిచోట్లకు వెళ్లాలి, అంది.

శశిభూషణుడు:—షికారుకు వెళ్ళడంలోకూడా పేరంటానికి వెళ్ళడంలోలా పిలవలేదని రాలేదని పట్టింపు లుంటాయిటోయి? నే నెప్పుడూ వినలేదు. పరదాకు, సహవాసానికి, ఆరోగ్యానికి పొయ్యేటానికి.

మదనమోహానుడు:—అపురు మఱి. అయితేం?

శశిభూషణుడు:—క్షమించాలి. ని న్ననవసరంగా ఆపుచేస్తున్నా, నీసడక్కూడా పాడుచేసి.

మదనమోహానుడు:—దానికేంలే: రోజూ వుండేనదకే. అయితే రావు? రావన్నమాటే?

కడదెబ్బతో మదనమోహానుడు గమ్మున వచ్చినదారినే వెళ్ళిపోయినాడు. శశిభూషణుడు అతనివెనకాతలే తనయింటి వీధితలుపు తిరిగి వేసి లోపలకు వెళ్ళిపోయినాడు.

మదనమోహానుడు ఆవెళ్ళడం వెళ్ళడం షికారువెళ్ళక తిరిగి తనయింటికే వెళ్ళినాడు. అతని కొంటిగా నడచిపోవడం అలవాటు లేదు. ఎవరో ఒకరు కూడా వుండాలి. అందు-

చేత అయిదున్నర అయిదు నలభై అయిదు నిమిషాలకు తిరిగి తనయింటికి వచ్చి భార్యతో "ఈవేళ పోనీ ఎవరింటికీ వెళ్లకుండా తిన్నగా కాస్తదూరం మనిద్దఱం వెళ్ళి వద్దాం: రా! శశిభూషణరావు రానన్నాడు" అని చెప్పినాడు. భార్య "చూచేరా! మీకు పరాభవం అయింది. నే రాకుంటే ఎవరూ మీతో రారు"అని గబగబా——కొంచెం అవకాశమిద్దాం ముస్తాబుకు.

శశిభూషణుడు తిన్నగా ఇంటిలోనికి వెళ్లేసరికి సుజాత ఏలా గుంది ? శశిభూషణుని పొడుగుపంట్లాము తొడిగింది. తొడిగి చూచుకుంది. పొడుగైంది. అది తీసివేసి మోకాలి లాగు తొడిగింది.

అది సరిపోయిన ట్లాపించింది. కాళ్ల నున్న పట్టాగొలుసులు తీసేసుకుంది. మోకాలి లాగుమీది కో ఇస్త్రీచేసిన మగని కమీజు తొడుక్కుంది. కమీజుచేతులు సుజాత చేతి వ్రేళ్ల నన్నింటినీ మింగేసాయి. కమీజు వడివడి తీసేసుకు మగని మోచేతిచొక్కా తొడిగింది. ఏమనుకుందో అది మళ్లీ తీసి, బనియ నొకటి తొడుక్కొని బనియనుమీద మోచేతిచొక్కా తొడుక్కుంది. చేతుల బంగారుసీలగాజులు తీసేసుకుంది. మెళ్లో వస్తువులు తీసేసుకుంది. అద్దంముందు నించొని అందం చూచుకుంటూ ముక్కుపుడక చెవికమ్మలు తీసేసుకుంది. ఇక తలకట్టూ పాపిడీ ఆ సంగతి ఆలోచించుకుంటూవుంది. అప్పటికి శశిభూషణుడు ఆమె వెనకాలకు వెళ్లి, నఖశిఖపర్యంతం చూచి, "నాగరికతలో సగందారి నున్నావు కాబట్టి గబుక్కున ఈవేషం వేయగలిగావు. అదే కడియాలు వంట గాజులు చెవికాడలు ముక్కుకాడలు వుంటే ఇంత త్వరగా ఇంత పూర్తిగా నవనాగరికత లోనికి రాగలిగియుందువా?" అన్నాడు. సుజాత అంది: "ఇంకా పూర్తిగా రాందే. ఈ పాపిడీ ఈజటా ఇదంతా కప్పిపుచ్చడం ఎలా?" అంది.

"ఎందుకు?" అన్నాడు శశిభూషణుడు. "నే నీరోజు మీతో పూర్తిగా మగవాని లాగు షికారు బయలుదేఱ దలచుకున్నాను" అంది. "అయితే సందేహం ఎందుకు? నాలా వుంచుకో జుట్టు" అన్నాడు శశిభూషణుడు. "అదే చూస్తున్నా. ఆడదాని జుట్టు మగాడికోసం అన్నట్టు మొగు డున్నన్నాళ్లూ వుణ్ణిచ్చి, మొగుడు పోవడంతోనే తీసేస్తూ వుంటారు మన పెద్దలు. అంచేత మీ అనుమతి పొంది కాని జుట్టు మార్చరాదేమో?" అంది సుజాత. "ఆమాత్రం అధికారం నాయం దీవఱకు నీ వుంచియున్నావని తెలిసుంటే ఈపాటికి మార్చివేయకుండా వుందునా" అంటూ ఓ కత్తిరి తెచ్చి——శశిభూషణుని కలవాటే తన సొంతక్షౌరమందు చిట్టిచిట్టి కత్తిరింపులు తన తలను తన చెంపలను తన మీసాలను చేసికోవడం——చక్కగా ఇరవై నిమిషాల్లో——ఆమె బుజాలమీదొ రుమాలు కప్పి, ఆమెజుట్టు గుజ్జుపుజూలు కత్తిరింపుగా కత్తిరించి, తడి రాచి, పాపిడి దీసి, "ఇదిగో

చేతికర్ర, అవిగో మేజోళ్లూ జోళ్లూ—నీకు సరిపోవచ్చు ననుకుంటాను. అజత నాకు బిగువైతే ఆమూల పడేశా" నని యామె కందిచ్చినాడు. సుజాత అవి తొడుక్కొని యాకర్ర పుచ్చుకుని "మరి మీరు?"అంది. శశిభూషణుడు "నేనూ రావాలీ?" అన్నాడు. సుజాత "దారి చూపించడానికి వద్దూ? ఎటు షికారు వెడితే బాగుంటుందో నాకేం తెలుసు" అంది. శశిభూషణుడు తన మామోలుప్రకారం తయారైనాడు. గడియారం ఠంగున సాయంకాలం ఆరుగంటలు కొట్టింది. ఇద్దఱూ బయలుదేఱినారు.

అక్కడ మదనమోహానుని భార్య సుజాతల్లే తారుమారురూపం దాల్చలేదు గాని ఆడవాళ్లల్లో ఆడదా మగాడా అనుకునేలాగుమాత్రం కట్టి, చుట్టి, తొడిగి బయలుదేఱింది, —ఒకింత పక్కపాపిడీ, కించిత్తు వాలుజడ, చంకలరైక, సన్నపటకా, తొమ్మిదిమూళ్ల తెల్లచీర, ఒక మణికట్టుగొలుసు, ఒక జబ్బసూది, ఒక వ్రేలి నుంగరపుగడియారం, కాళ్లనో పెద్దాపురపు ఎఱ్ఱజోలు జాఱుడుచడావులు, చేతిలో పట్టుత్రాటను వ్రేలాడే నీరెండ గొడుగు,—అన్నింటితోనూ. మదనమోహానుడు తన మణికట్టు గడియారం చూచి "ఆరైంది" అన్నాడు. "నాదాంట్లో ఆరుంపావు అయింది"అంది భార్య, తన చిటికెన వ్రేలియుంగరపు గడియారంలోకి చూచి. "ఎటెడదాం" అన్నాడు మదనమోహానుడు. "ఎటైనా సరే" అంది భార్య. అని "శశిభూషణరావు రానన్నాడుగా షికారు. వాళ్లింటికేసి మానేసి మనం ఈవీధిని వెళ్లి వచ్చేటప్పుడు వస్తే ఆలా వారింటికేసి వచ్చి, 'అంతా కులాసాగా నున్నారా?' అని అడుగుదాం" అంది. "ఆ ప్రశ్నకూడా ఎందుకు? నే నిప్పుడేగా చూచి వచ్చినాను?" అన్నాడు మదనమోహానుడు. "ఏమో ఆతని భార్యకు సుస్తీగా వుండి బయలుదేఱకపోవచ్చును" అంది సుజాత. "నీమాత్ర ముదారభావం నాదగ్గఱ లేకపోయింది చూచేవా? ఎలాగన్నా ఆడవాళ్లు ఆడవాళ్లవిషయమై ఇట్టే అనుకుంటారు. అయితే కావచ్చును ఆలాగే చేదాము" అని అనుకొన్నదారినే బయలుదేఱినారు వీ రిద్దఱున్నూ.

పరస్పరం పరమాశ్చర్యం పడేటట్టుగా శశిభూషణదంపతులు, మదనమోహన దంపతులు ఆ వారివారి నడకల్లో ఎదురైనారు. కాని మదనమోహన దంపతులు సుజాతను గుర్తించలేదు. సుజాతను ఎవరో కొత్తపురుషునిగా భావించి, ఆ స్నేహితు డుండడంచేత తనతో నాడు శశిభూషణుడు షికారు రానన్నాడన్నట్టుగా మదనమోహాను డూహించేడు. మదనమోహానుని భార్యాకూడా ఆలాగే ఊహించింది. ఎదురై ఓనిమిషం నించోవడంలో అసురసంజ కమ్ముకుపోతూంది. ఆగి పలుకరించేసమయ మంతగా కాదనుకొని అయినా తెలుసుకుందామని మదనమోహానుని భార్యే కొంచెం చొఱవచేసి "మేం తెలుసుకోవచ్చునా మీ కొత్తస్నేహితుణ్ణి" అంది.

శశిభూషణుడు "ఎందుకు తెలిసికోకూడదు. ఇతడు నాకు కావలసిన స్నేహితుడు. హృషీకేశరథో. కటక్‌నుంచి వచ్చినాడు. రథోగారూ! వీరు నా మిత్రదంపతులు. రోజూ మేమంతా షికారు వెళ్లుతుంటాం. ఈవేళ మీరు వస్తానంటే వారితో వెళ్లక మీతో బయలుదేరాను" అని ఎఱుకపఱచినాడు. సుజాతయు మగనియూహ గ్రహించి గొంతు కొంచెం మార్చుకోని, "చాలా సంతోషమైంది మిమ్మల్ని చూడ్డంవల్ల" అని ఒక కైకైమొక్కం మదనమోహానుని భార్యకు, ఒకటి మదనమోహానునకు నిచ్చి, "సెలవండీ" అంది. వారు గాని వీరు గాని మఱి ఆగలే. ఎవరిళ్లకు వారు వెళ్లిపోయినారు.

మదనమోహాన దంపతులు ఇంటికి వెళ్లి భోజనాలుచేసికోని ఇష్టాగోష్ఠి నా సాయం కాలపు విహృతిని దలంచుకొనుచు క్రొత్త స్నేహితుడైన రథోగారినిగుఱించి విమర్శించడం మొదలుపెట్టేరు. ఆసమయానికి శశిభూషణుడు అక్కడకు వచ్చేడు. వచ్చి "ఏమి టను కుంటున్నారు" అన్నాడు.

ఏమీ లేదు క్రొత్త స్నేహితుణ్ణిగూర్చి అంటూ మదనమోహానుడు, "అతగాని జుత్తుకత్తిరింపు, పాపిడితీత అతినాగరికంగా వున్నాయి సుమా" అన్నాడు. అనగానే మదనమోహానుని భార్య అంది, "వుంచుకుంటే ఆలాంటి జుట్టూ ఆలాంటి పాపిడీ వుంచు కోండి గాని, ఆలాంటివారుమాత్రం కాబోకండి. అతగాడు మగవాడూ నే నాడుదాన్నీ అగుదుమా కాదా! అతడు నాచేయి పట్టుకుంటే నాకు పవిటన్నా సర్దుకోవాలని బుద్ధి పుట్టందే. ఉత్తఆడుది ఆడుదానిచెయి కదిపిన ట్టుండిపోయింది—" అని.

శశిభూషణుడు "అయితే అతగానిఆత్మ ఆడఆత్మయేమో" అన్నాడు. మదన మోహానుడు"ఆత్మల్లోకూడా ఆడఆత్మలు మగఆత్మలూ ఉంటాయిటోయి?" అని అడిగేడు. వెంటనే మదనమోహానునిభార్య అందుకుంది: "ఉండవు మఱీ! నా కెన్నాళ్లనుంచో కుతూ హలం అని తెలుసునుగదా మీకు, జోడు తొడుక్కుని షరాయి తొడుక్కుని వీథంట నడవడానికి—నడవనిస్తున్నారా నన్ను? నడుస్తా నన్నప్పుడల్లా ఆలాంటి దిరీసు వేస్తే ఆడదానికి ఆడహృదయం ఎగిరిపోతుందంటూ నిలేస్తున్నారే. మీపరిభాషలో ఆడహృదయా లుండగాలేంది మఱొకరి పరిభాషలో ఆడఆత్మలు ఉండకూడదూ" అని.

మదనమోహానుడు అన్నాడు: "అయితే నిజంగా ఈవిషయం ఇంకా పరిశోధించ వలసినదే శశిభూషణ్. మీస్నేహితుణ్ణి పొద్దున్నే మాయింటికి కాఫీకి రమ్మన్నామని చెప్పి తీసికోనిరా, నీకు స్నేహితులైనవారు మాయింటికి రాకుండా వెళ్లుటకు వల్లకాదు" అని. మదనమోహానునిభార్య అంది: "మఱచిపొయ్యేవు సుమా, సుజాతను కూడా వెంట బెట్టుకుని రా" అని.

## ప్రేమతత్వం

సుజాత యప్పటి కప్పుడే రాతి రింటివద్ద తా నొక్క_ర్తుకా యుండలేక వచ్చి పొంచుండి సమయంలో ఎదర బడి, "ఈపరిశోధనకు కాఫీ దండగకూడా ఎందుకు మదన్! మగవేషం వేసికొన్నా నీతో చెయిచెయి చాలనం చేస్తువుంటే ఆడదాన్నైపోయి 'తల్లో పూవన్నా లేదే? మెళ్ళో పూసన్నా లేదే' అని తల్లడిల్లిపోయేను. చెప్పొద్దూమటి" అంది. మదన మోహను డదో ఆశ్చర్యంతో చూడసాగినాడు. మదనమోహానునిభార్య వెంటనే "ఎందుకు ఆ ఆశ్చర్యము? ఎంత తెనుగుమీాటినా మాహృదయాలు మావే. మాపవిత్రత మాదే. మాహృదయా లెక్కడికీ ఎగిరిపోవు. మీారిద్దఱు మగవాళ్లూ వీధిగడప అవతల వుండండి. మేమిద్దఱం ఆడవాళ్లం రహస్యం చెప్పికోవాలి." అని మగవాళ్ల నిద్దఱను అవతలకు వెళ్లి పొయ్యేటట్టు చేసింది. తలుపు గెడవేసి మదనమోహానునిభార్య సుజాత కో కత్తి రిచ్చి, "నాజుత్తు కత్తిరించు. తత్క్షణం కత్తిరించు" అంది. "అబ్బా! ఆ పాపపు పనినేను జేయ లేనమ్మా! అది మగవాడు చేయాలిసిందే." అని సందేహించింది సుజాత.

మదనమోహాన శశిభూషణులు కిటికీగుండా చూస్తు వింటూవున్నారు. "అయితే నీజుట్టు నీమగ డిష్టపడి కత్తిరించేను?" అంది మదనమోహానునిభార్య. "కాకుంటే ప్రేమించే మగడే కాడు" అంది సుజాత. "పూర్వం పువ్వువెట్టి ప్రేమిస్తే యిప్పుడు కత్తిరించి ప్రేమించే డన్నమాట" అంది మదనమోహానునిభార్య. "అవునూ! ప్రేమ ప్రేమే; దానికీ జుట్టుకూ దానికీ పువ్వుకూ సంబంధ మేమిటి? తెలివితక్కువదానా! తలుపు తియ్యి" అని సుజాత తలుపు తీసింది.

మదనమోహానుడు తలుపు తీయగానే లోపలకు వెళ్లినాడు. సుజాత వెలుపలకు వచ్చి శశిభూషణునితో చెట్టాపట్టా వేసికొన్నదై "ప్రేమకు ఇల్లుకూడా అవసరంలే దను కుంటాను. మెత్తని యిసుకతిన్నెలమీాద పచ్చని అడవుల్లోను ఎత్తైన పర్వతాలమీాద పక్షుల్లాగు, లేళ్లలాగు, గంధర్వుల్లాగు ప్రేమించుకోవచ్చు ననుకుంటాను" అంటూ నడిచింది. వారి ఇంట్లోనుంచి మదనమోహానదంపతులు వీధి నడచు శశిభూషణదంపతుల్ని చూస్తూ ఏమనుకోడానికీ తోచక, "స్త్రీపురుషులకు ప్రధానమైనది ప్రేమ. అది శాశ్వతము" అని అనుకున్నారు. తలుపు వేసుకున్నారు. లోపల దీపము: వెలుపల వెన్నెల.

# వీణ

## అడివి బాపిరాజు

### ఒకటి

ఆనందమూర్తిగళము అన్నిరాగాల ఆనందానికి నిలయం. 'ఏమి పాట పాడతారండీ!'; 'అది సరస్వతీకంఠము గదాండీ!'; 'కాకలీమృదులం—అహో!' అని సంగీతప్రియులు ఆశ్చర్యులై పోతూ ఉంటారు. ఇంతవరకు ఏగురువుదగ్గరా శుశ్రూష చేయలేదు. తండ్రిగారి సంగీతం వినిన్ని, గానసభలలో జనించిన సంగీతమహాప్రవాహంలో లయమైపోయిన్ని నేర్చుకున్నపాటే యింత పులకరింపు లైతే, స్వరేశ్వరుల పాదతీరాన్నో ఆనందమూర్తి పూజలు సలిపినట్లయితే అఖిలభారతదేశానికి నాయకమణి యైపోవలసినదే గదా!—అని విద్వాంసులు భరతశాస్త్రి సంతోషబాష్పాల ఎడమబొటనవ్రేలితో తుడుచుకొన్నారు.

శుభముహూర్తం చూచి ఆనందమూర్తినైన నిన్ను శ్రీస్వరేశ్వరులవ్రమోల మీ తండ్రి శిష్యునిగా అప్పగించి వచ్చినాడు. పదహారుసంవత్సరాల బాలకుడవు. సరస్వతి అవతరించిన శ్రీస్వరేశ్వరుల పీఠముద్రమోల దేహానికి పులకలు, మనస్సుకు మఱపు, ఆత్మకు పరమానందము వరము లిచ్చే ఉత్కృష్టకళ గానవిద్యను అభ్యసించే దీక్ష పూనినావు.

ప్రౌఢరాగాలు ప్రవహించే పరమసౌందర్యప్రదేశాలలో తాండవించినావు. దివ్య గాయకుల కృతిగభీరతలలో తేలినావు. గానకళాసూత్రం, శ్రుతిరహస్యం, గురువులవారు ఆనందమూర్తికి ఉపదేశించే జ్ఞానముద్రను ధరించినారు.

### రెండు

స్వరూపపతి వీణానిర్మాత. తరతరాలనుంచి ఆతనికుటుంబమువారు వీణలు రూపొందిస్తూనే ఉన్నారు. స్వరూపపతితండ్రి అకళంకపతి స్వరేశ్వరులవీణ నిర్మించినాడు.

గాయకుడు దినదినము సంగీతలోలుడై ఉండాలె నంట. ఆతని కంఠగతస్వనప్రవాహ శ్రుతులతో మేళవించే ధ్వనిరాశి మధురమూర్తిని ఆవీణాకారులు నిర్మించేవారంట. మానవాతీతమయిన ఒకశక్తి ఆవీణాజనకునిచేతిలో ప్రవహించునంట. సంగీతము మూర్తీభవించిన వీణాస్వరూపము ఆమహాకల్పనలోనుంచి ప్రత్యక్షమవునంట.

ఆనందమూర్తి స్వరూపపతిగ్రామానికి విచ్చేసినాడు. ఓ ఆనందమూర్తీ! నీసంగీతము స్వరూపపతి నిమీలితదృష్టితన్మయతలో విన్నాడు. ఆసాయంకాలపు అరుణకాంతులలో నీపాట తీవలై అలముకపోయినది. రాగాలాపనరక్తిమ, రాగస్థాయి విహంగపథము, నీ దివ్య గాంధర్వాన ఓలలాడి, 'జన్మాన్ని అలముకుపోయిన పాపలతలు తెంపబడ్డాయి; నేను

ముక్తుణ్ణి' అనుకున్నాడు స్వరూపపతి. ప్రాణమే రాగప్రవాహరేఖలో లీనమయిందట. ఉత్కృష్టనాదస్వరూపము, మహోత్తమమైనట్టి వీణామతల్లిని నిర్మించి తన జన్మ పావనం చేసుకుందామని స్వరూపపతి ఉవ్విళ్లూరిపోయినాడు. ఆ దినాన్నుంచి వీణాకారునికీ వైణికునికీ నాదబిందుకళాపూజయే, ఆనందపథవిహారమే. కలశము కలలూరినది. దండము రూపించినది. తుంబీఫలము, మీటలు ప్రత్యక్షమయినాయి. సింహకరాళశిరము రేఖలుతిరిగినది. పంచపనసల పరువాలు, దంతథావళ్యకాంతులు, బంగారుసుడులు, లతాపుష్పవిన్యాస చతురమైన శిల్పసౌందర్యము; సూక్ష్మ, స్థూల, వివిధ విచిత్రతంత్రీవైదగ్ధ్యము తళుక్కుమనే అద్భుతవల్లకీబాల ఒక్క దివ్య ముహూర్తంలో సాక్షాత్కరించింది.

తీగలు సారించి, మీటలు బిగించి, గుళ్లు సవరించి, ఒయ్యారంగా వల్లకిని వలెవాటు వేసి భారతీదేవిని ఆత్మసారూప్యం చేసుకొని, ఆనందమూర్తీ! నీవు శ్రుతులు చూచుకొన్నావు. కంఠ గీతీపరిమళంతో దివ్యనాదాన్ని లయింపజేశావు. స్వరూపపతి ఆనందపరవశుడై మూర్ఛపోయినాడు. అతడు వీణలో కలసిపోయినాడు.

మూడు

ఆనందమూర్తీ! నీయశము దేశదేశాల వెలిగిపోయినది. మహారాజులు నిన్ను రప్పించుకున్నారు. కళాద్రష్టలు నీపాటలో త్రసరేణువులైపోయినారు.

ఆనాటి సభ మహాపండితులసభ. వాండ్లను మెప్పించుట కళాబ్రహ్మలకును వెఱపు కలుగజేస్తున్నది. నీవు ఉప్పొంగిపోయినావు. ఈనాటికి నీజన్మ సఫల మయినదో లేదో నీకు వ్యక్తమైపోవు ననుకున్నావు. వీణామతల్లిని హృదయమార పూజించినావు. మహాసభకు నమస్కరించినావు. విద్యుల్లతికలగు నీవేళ్ళు వీణతీగెలపై ప్రసరించినవి.

ఆనాటి శ్రుతి ఓంకారము. మొదట కళాచమత్కృతులు చూపించినావు. కళారసజ్ఞత అల్పమై కళాజ్ఞానరూపమైన గానవిద్వత్తె పండితు లంతా హర్షించేటట్లు విజృంభింప చేసినావు. స్వరకల్పన, తాళగతివిచిత్రత, కష్టతమమైనవానిని సునాయాసముగా వెదజల్లినావు.

ఇంతలో ఆనందమూర్తీ, నీవు మైమరచి ఆనందలహరీవేగమువై విజృంభించినావు.

అది మధురాతిమధురమగు రాగవికాసము. అది లయామృతవాహిని. నాలుగు తీగలూ శ్రుతి గళములోని కాకలీప్రేంఖితస్వనవల్లరి.

ఎన్ని కాలములు పైకి ఉబికినావో. శ్రుతాశ్రుతములైన కాలాల నెన్నింటి సూక్ష్మమైపోయినావో.

ఆసభ పూర్తిఅయినది. ఆనందరక్తినుల విరిసిఉన్నటువంటి మోములో ఆనందమూర్తి కన్నుల నీళ్లను తుడిచేవారిని, కళ్లు మూసి ఊగిపోతూఉన్నవారిని, స్థైర్యం తప్పి ఏఅదృశ్యలోకాలకో ప్రవహించిపోయిన ప్రాణరహిత దేహాలను పరికించినాడు.

వాళ్లమధ్య అందాలప్రోవై, బంగారుతీగయై, చెమరించు అమృతానందోష్ఠయై, గీతావిష్టయైన త్రిభంగాకృతియై, గానలయాకృతార్థనిమీలితయై, నేపాళదేశ శ్వేతతారా దేవీవిగ్రహమై పదహారేళ్ళ బాలిక తెల్లని కేతకీపన్నగిలా కనబడినది. ఆఅమ్మాయినే పే విస్తుపోతూ చూస్తూ ఆనందమూర్తి సర్వమూ మఱచిపోయినాడు. ఆతనిహృదయం తాళగతులు తప్పినది. ఆతనికోర్కెలు రాగమిశ్రమాలయినవి. ఆతనిప్రజ్ఞాను ప్రకృతిశ్రుతిహీనమై వెర్రిదానిలా తీగలు, గుళ్ళు, మీటలు సవరిస్తూనే ఉన్నది.

నాలుగు

ఆలోచనలతో నిండి, ఆలోచనలు లేని కలలతో ఆనందమూర్తి, నిశిదినరకరా ఏలాగో నడచినావు. దిండ్లు పరిచిన కృష్ణాజినముపై చదికిలంపడి నిట్టూర్పు పుచ్చినావు. సేవకుడు వల్లకిని దాల్చిన పేటిక తీసికొనివచ్చుట యెరుగవు. దీపాలవెలుగులు తెల్లనిగోడలపై నీనీడను ఆడింపజేసినవి. దృష్టిలేని చూపులతో చూసితివి. అంతా నిశ్శబ్దము. గృహయజమాని స్నానానికి లెమ్మని ప్రార్థించుట యెరుగవు. ఆ బాలికే ఎక్కడచూసిని ప్రత్యక్షమవుతున్నది. నీవు ప్రేమతపస్వివి అయితివా?

ఏమహారాగము సృష్టించుకొంటున్నావో అని గృహయజమాని చప్పుడు లేని పదాలతో వెనకకు వెళ్లిపోయినాడు.

ఆనందమూర్తికడకు ఒకముదుసలి ఆబాలికను తీసుకొనివచ్చినట్టయినది. ఆనందమూర్తి కంపించిపోయినాడు. బాలిక అర్పించు నమస్కారమును అందుకొనవు, ఋషివంటి ఆవృద్ధునకు నమస్కార మిడవు. నీవు నిలుచుండినావు. మీరు ముగ్గురును అట్లనే నిలుచుండిపోయినారు. ఆబాలికమోము వివర్ణమగుచున్నది, సిగ్గుచే రక్తిమము తాల్చుచున్నది. గృహయజమాని వచ్చి, "స్వామీ! ఈలాగు వచ్చినారు. తమకుమార్తెతో ఈయూరు ఎప్పుడు వేంచేసినారు?" అని ప్రశ్నిస్తే, ఓఆనందమూర్తీ, అది కల కాదనుకొన్నావు. ఆ బాలిక నీవైపు చూస్తూనూ ఉన్నది, అవ్యక్తమధురమగు హాసంతో కన్నులు నేలవైపు వాలుస్తూనూ ఉన్నది.

గృహయజమాని మిమ్మల్నందరినీ ఆసనాలపై అధివసింపచేసినాడు.

ఆవృద్ధుడు నీమొగమై, "బాబూ! ఇది నామనుమరాలు! మాకుటుంబము సంగీత కుటుంబం. ఈబాలికకు గానవిద్య పూర్తిగా నేర్పినాము. ఆమె సర్వకాలమూ స్వయంకృషి.

చేస్తూనే ఉంటుంది. ఆబాలికకు తగిన వరుడు నేటివరకున్నూ మాకు గోచరింపలేదు. నాయనా, నీవు దివ్యపురుషునిలా ప్రత్యక్షమైనావు. నీకీర్తిలో జోగి నీ కీబాలికను సమర్పించి ధన్యుణ్ణవుదామని నాగ్రామాన్నుండి ఈనాటిసభకు వచ్చినాను. ఈబాలిక ఫిడేలువాద్యము నందు రాలు కరిగించు విమలగాంధర్వం వినిపించగల కళామూర్తి సుమా" అని మనవిచేసి కొన్నాడు.

ఆనందమూర్తీ, నీమోము ప్రఫుల్లమైపోయింది. విద్యుల్లతలు నిశ్చలమిన ట్లయింది. ఈవిచిత్రము నమ్మవచ్చునా? ఇది ఐంద్రజాలికమా?

ఐదు

ఆదంపతుల జీవితం మహానదిలోని పడవలా తేలిపోతూఉన్నది.

ఆనందమూర్తివీణ, ప్రేమబాల 'వాయిలీన' (ఫిడెలు), రెంటుజంత్రాల సంగమములో అంతర్వాహినియై వారిరువురి ప్రేమయున్నూ చేరిపోయింది.

ఒకళ్ళను మించిన అందం ఒకళ్ళది. ఒకళ్ళప్రేమను మించిన ప్రేమ ఒకళ్ళది.

వారిబ్రతుకు వేయితావుల పూతోట అయిుది. వా రందులోని కోయిలలు.

ఆఱు

నాటికి నాటికి ప్రేమబాలకు భర్తపై అనురాగం ఎక్కువై పోయింది. 'ఆతని స్వరూపం ఏదివ్యమూర్తి కున్నదీ!' అనుకొన్నది. ఒక్కనిమేషమైనా నాథుణ్ణి చూడలేక మనలేదు. ఎన్నిముహూర్తములైనా ఆతనిమోము తిలకిస్తూ ఆనందామృతములో సొక్కిపోతూఉండేది. ఏదేనివంకతో ఆతనిని స్పృశించేది. ఆతనిముంగురులు దిద్ది పరవశ అయిపోవునది. ఆతనిని చిరుగాలివలె చుట్టివేయునది. ఆతని వెడదఉరాన్ని తనమోము దాచుకొని వణకిపోవునది.

నానాటికి ఆనందమూర్తీ! నీపత్ని గళనర్తితమగు మధురగాంధర్వమే నిన్ను మూలమంట కదల్చివేయునది. నీవీణలోని మహాస్వరప్రసారము నిన్ను యోగముద్రలో నిల్పివేయునది. నీపత్ని నీపాటలోని యొకశ్రుతి యైనది.

ప్రేమబాలకు కాంతునిపై ప్రేమ విజృంభించినది. గానకళాభిరుచి సన్నగిల్లినది. ఆనందమూర్తికి ప్రణయినీవిలాసము చిఱునవ్వుమాత్రము తెచ్చునది. ఆనాటి ప్రేమావిష్టుడు కాడు.

ఏడు

ఆతని పాటకు, ఆతని తపస్సుకు ఆమె ప్రేమావేశము చిన్న అపశ్రుతి అయింది.

ఆమె ప్రణయరాగాలపనంలో నాథుని గానయోగం దోషస్వర మైంది.

♦ ♦ ♦ ♦

ఆనందమూర్తీ! వీణామతల్లికి నమస్కారంచేసి ఆమెను ధరించి నాదప్రవాహం కల్పించుకొని విచిత్రాలైన కృతులు, తానంపోకడలు, లయవిజ్ఞానం స్వనింపచేస్తూ మైమరచిపోతూ ఉంటే, దివ్యసుందరగాత్ర అయిన నీ ప్రేమబాల హృదయం కంటక వృక్షాన్ని కొట్టుకున్న ట్లయ్యేది.

ఆ దినాల్లో నీ చూపులకు ప్రేమబాల అదృశ్య! ఆమె ప్రేమపూజ నీకు వేడిగాడ్పు! ఆమె కౌగిలింతలు ఇనుపసంకెళ్ళు! పరీమళ చుంబనము నాభీపుష్పమధురము.

♦ ♦ ♦ ♦

“ప్రేమబాలను అనిమేషుడవై చూస్తూ ప్రవహించిపోయిన మధురాతిమధురములగు సంధ్యలు, చంద్రికాయామినులు, నక్షత్రప్రకాశాలు, సౌరభదినాలు మాయమైపోయాయే! ఆనాటి ఆనందమూర్తివేనా? నాథా, నాలో ఏమిలోపము వచ్చింది? నా దివ్యసౌందర్యము కలమాత్రమై ఆరతికర్పూరంలా హరించి పోయిందా? నీ దృఢపరిష్వంగడోలికల్లో దెస లంటానే ప్రభూ!”

ఎనిమిది

ఆనందమూర్తీ! నీహృదయావేదన విచిత్రమైంది. బాలికల గానకళాభ్యాసం భర్తల కొరకా? నీ జీవితానికి అణువు అణువునా గాంధర్వం నిలపుతా ననుకొన్నావు. గాన మూర్తితో కలిసిపోయి ఐక్యమైపోతుంది నీబ్రతుకు, త్రివేణీ సంగమంలా, అనుకున్నావు. ప్రేమబాల మూఢప్రవాహం అనిన్నీ. తన గానతపస్సులో సంపూర్ణయోగం లేదా? గానంయొక్క వేరుస్వరూపం అనుకున్న ప్రియకాంత, అత్తరువు రాచిన బంగారుకమలం మాత్రమేనా? లేక ఆమెను తనసంగీతంలో లయింపచేసుకొనే శక్తి తనకు నశించి పోయిందా?

ఆమె అందము చూసి నువ్వు లజ్జిస్తున్నా వేమి? ఆమె పన్నీరు పోసిన వేడినీటిలో సువాసనద్రవ్యాల పిండి నలుగు పెట్టికొని, తళుక్కుమనే నగలు పూవులు చీర ధరించి, చిత్రకారునికీ కవికీ భావాని కందని అందంతో వస్తే, నువ్వలా పెడమొగం పెడతావు. శుకుడవా? ఋష్యశృంగుడవా? రసంలేని విద్వత్తవా?

వివాహమై రెండుసంవత్సరాలు కాలేదు. ప్రేమరసవాహినిలో ఆ దంపతులు ఇంకా సంపూర్ణస్నాతులు కాలే. ఇంతలో ప్రణయభంగము శూర్పణఖలా వచ్చి పడింది.

ప్రేయసిని తీసుకువెళ్ళకుండానే ఆనందుడు సభలకు వెళ్లుతున్నాడు. సభలో జరిగిన విచిత్రాలు ఆమెకు చెప్పడు. క్రొత్తరాగాలూ, పాటలూ వినిపింపడు. అసలు నెలకు రెండురోజులన్నా ఇంటిదగ్గిర ఉండడు.

ప్రేమబాల విషాదబాల అయిపోయింది. ఆమె హృదయంలో అపశ్రుతినాదాలు వకదాన్ని వకటి తరుముకువస్తూవున్నవి. దొడ్డిలో గోపాలకుని కిష్టమ్మపదం, బంగారు పిచికల కలకలస్వనము, వీధిలో ముష్టివాండ్ర తందానపాట, భర్తగారి ఉత్కృష్టమైన వీణాగానం అన్నీ ఆమె జీవితానికి పెళపెళార్భాటాలయి, ఉరుముల ధ్వనులయి, కంపించి వేసేవి. అందాలప్రోగయిన ఆప్రేమబాల యీనాడు వడిలి, కవిలిపోయిన పువ్వులా అయి పోయింది. వంటలక్క పచనరహస్యాలల్లో ప్రత్యక్షంచేసే రుచులు ప్రేమబాల నోటికి విషా లయిపోయినవి.

తొమ్మిది

ఓ ఆనందమూర్తీ! నువ్వా వెన్నెలలో వీణను ధరించి ఆ వసంతకాల వనసౌభాగ్యాన్ని స్వరాలల్లోకి మార్చావు. వెన్నెలే రాగ మయింది. ఆకుల కలకలలు లయలయ్యాయి. అత్యద్భుతమైనటువంటిన్ని, పరిమళపూరితమయినటువంటిన్ని ఒక క్రొత్త రాగము ఆరోజున సృజించావు. రాగాలాపన ప్రవహింపచేశావు. హృదయ కంఠ శిరఃప్రదేశ జనితాలయిన మూడుస్థాయిలూ "స్వతో రంజయతి శ్రోత్రం స్వరమి త్యభిధీయతే" అన్నట్లు రసస్వరూపాలయిన స్వరాల నన్నీ నిలుపుకున్నావు. ఆరాగము మహాఋషి వెంకటమఖి రచించిన డెబ్బదిరెండు మేళాలల్లో శుద్ధధైవతాన్ని ఆధారంచేసుకున్న ఎనిమిదవస్థానంలోనిది అయిఉన్నది. ఆరాగం గ్రహ, అంశ, మంద్ర, తార, న్యాస, అపన్యాస, సన్యాస, విన్యాస, బహుత్వ, అల్పత్వము లనే పదిలక్షణాలను కలిగిఉంది. ఆరాగం పూర్వమేళంలోని ఇందుచక్రంలోనిది. ఆరాగం దేశీయ ఔత్తరాహ సాంప్రదాయాల కలయికలోనిది.

ఆ రాగాలాపన ప్రథమాన్ని ఆక్షిప్తిక మైంది. ఆనందమూర్తీ, రాగవర్ధని చేసినావు. ఆరోహణమై, అవరోహణమై తానంలోకి దిగినావు. వేయిచంద్రులొక్కసారి పుష్పాలల్లే విరిసిన ట్లయింది. పల్లవి ప్రారంభించి కీర్తనలోకి విజృంభించావు. ఆరాగము 'వసంతచంద్రిక' అని పేరు పెట్టుకొన్నావు. అహా! ఆగానము పరమమాయాసౌందర్య పూరితం అయిపోయింది.

ఉదయాన్నే ప్రాణప్రియుడు తన్ను పలకరించిన పలుకులో, హాస్యరసపూరితమైన నర్మభాషణలో వేయిఅర్థాలు గ్రహించుకొని ప్రేమబాల ఉలిక్కిపడినది. ఆమెను మధుర

తరంగాలు ముంచివేసినవి. ఆమె హృదయంలో వెన్నెలలు పిండి ఆరబోసినవి. ఆ సాయంత్రం పన్నీట జలకమాడింది. కలలూరు చీనాంబరము ధరించినది. ఒకటి రెండు ముద్దుగులుకు నగలతో గంభీరంగా అలంకరించుకున్నది. మల్లెపూలు జడవేసుకున్నది. నెత్తిపై కనకాంబరాలు జరీసూత్రంతో కట్టి, అర్ధచంద్రిక అలంకరించుకున్నది. ఆరాత్రి దీపాలవెలుగుల్లో ఆమె దివ్యసౌందర్యరాశి, ప్రేమతేజస్విని.

తోటలోకి కిటికీలు తెరచిఉన్న వాళ్ల శయనమందిరము శ్రీ శుకులవారి హృదయంకూడా కరిగించివేసేటట్లు ప్రేమబాల అలంకరించింది.

కిటికీలోంచి వెన్నెట్లో సన్నజాజి, గులాబి, మల్లె, తీగెసంపెంగ పొదలమధ్య ఉన్న శిలావేదికపైన కృష్ణాజినం పరచుకుని తన్మయుడయి వీణ పాడుకుంటూఉన్న భర్తను చూచింది, నెమ్మదిగా దొడ్డిగుమ్మంమెట్లు దిగి, నాథు డున్న శిలావేదికదగ్గరకు పోయి, ప్రేమబాల భర్తప్రక్కనే కూర్చున్నది.

ప ది

ఆ పవిత్రనిశాఘటికల్లో ఆవీణ దివ్యస్వనాలు విరజల్లివేసింది. ఆనందమూర్తి ప్రేమబాలకూడా అట్టి మహాఅద్భుతమయిన బాణి, గంభీరత, మాధుర్యాతి మాధుర్యము ఎన్నడూ చూరగొనియుండలేదు. నిమేషాలు గడియ లయ్యాయి, యామ మయింది. తుంబుర, నారద, శారదాదేవుల వీణలను అపశ్రుతి భూయిష్ఠాలని అనిపించేటట్టు విజృంభించిపోతూంది.

ఇంతలో ఆవీణ ప్రేమబాలకు ఒక యక్షిణిలా తోచింది. ప్రేమబాలను హేళన చేస్తూ ఆ విచిత్రగానంలో విజృంభించిపోతూఉన్న ట్లయినది. భర్త యీలోకములో లేడు. ఏ గాంధర్వలోకంలోనో! "ప్రేమకన్న ఉత్కృష్టమైన గాంధర్వము వేయిరెట్లు ఎక్కువ; ఓయి వెర్రిబాలికా, యిక్కడనుంచి శీఘ్రంగా నీ పడకటింటిలోకి పో! యీ గానకళాపుంజము నాపతి సుమా! నువ్వు నారాజుకూ నాకూ అడ్డంవచ్చేటట్టు చేశావు కాని నేను నీఆటలు సాగనివ్వలేదు. నీ ఫిడేలుపాట మంత్రంచేసి నా యీ నాథుణ్ణి దూరం చేస్తానని అనుకున్నావా!" అని ఆవీణ ఆ మంత్రగానంలోనే పలికినట్లు అయింది.

ప్రేమబాలకు చెమటలు పట్టినవి. ఆమె గజగజ వణికిపోయింది. ఏలా లేచి నడిచి వెళ్లిందో! శయనగృహందాకానైనా వెళ్లలేదు. "ప్రభూ, యింతేనా" అంటూ కనకాంబరం మొక్కలవద్ద గుభాలున పడి మూర్ఛపోయింది.

ఆనందమూర్తీ! నీ గానతపస్సు పూర్తిఅయినది. ఆ ఆనందముయొక్క పులకలు

నీ మనస్సులో చిరుకెరటాలు కాగా నువ్వు గంధర్వయువరాజులా లేచినావు. నీ హృదయం ఆ యీనాటి నూత్నరాగము, కృతి, తాళము పాడుకుంటూవుండగా, ఆ ధ్యానములో ఏలా చేరావో నీ పడకగది. దారిలో పడివున్న ప్రేమబాల నీకు కనబడలేదు. పల్యంకముపై పత్ని లేదన్న భావమే నీకు కలగలేదు. ఘోరబ్రహ్మచారిలా, సరస మెరగని పరమ మూర్ఖునిలా, ప్రణయంలో పులకరించిపోని బాలకునిలా శయనగృహం అందం కనిపెట్టక, అగరుధూపాలు ఆనందించిపోక, శయనమందిరం నింపివేసిన వివిధపుష్పపరిమళాల్లో ఓలాడిపోక, శిల్పహృదయ అయిన నీభార్య అలంకరించిన శయనమందిరంయొక్కా తల్పం యొక్కా సౌందర్యవిన్యాసాలల్లో తోగిపోక, లంబభుజుడులా మంచంమీద పడుకుని నిద్ర పోయినావు. సంగీతము జీవితాన్ని కర్కశంచేస్తుందా?

ఇంతలో ప్రేమబాలపై ఒక చిరువెన్నెల చెలికత్తెలా వ్రాలి, శీతలోపచారాలు చేసి ఆమెను మృదుహస్తాలతో స్పృశిస్తూ మూర్ఛలోనుంచి లేపింది. ప్రేమబాలకు లోకమంతా యింకా చీకటిగానే ఉంది. కళ్లు నులుముకుంటూ ఏల అక్కడ పడివున్నదో, శయనమందిరంలో ఎందుకు లేదో? ఆమెకు అర్థంకాకుండానే తూలుతూ పడకగదిలోకి వెళ్లింది. ఆ దీపాలవెలుతురులో భర్త గుర్రుపెట్టి నిదురపోవటం వినీ చూచీ గబుక్కున సంపూర్ణజ్ఞానం కలుగగా తెల్లబోయి చూచింది. భర్త ఎప్పుడూ గుఱ్ఱుపెట్టలేదు. ఆమెకు అప్పుడు భర్తయొక్క హృదయం ప్రేమరహితమైన మరుభూమిలా తోచింది.

దివ్యాంగనా అనుకున్న వల్లకీబాల తనకీ నాథునికీ తెగతెంపులు కలగజేయడానికి జన్మించిన రాక్షసి అని తా నెప్పుడూ అనుకోలేదే! నాథుని చేరవచ్చి రెండేండ్లు కాలేదు, ప్రణయస్వరూపమైన వీణామతల్లి పరమశత్రు వయిందా? ఓ వీణాదేవి! నీ కేమిఅపకారం చేసిందమ్మా? తన పతిని నిన్ను ప్రేమించ వద్దన్నదా? నీస్నేహంలో తన్మయుణ్ణి కావద్దన్నదా? కళాస్రష్ట ల్లేరా? వాళ్ల హృదయాలల్లో నివసిస్తూఉన్న ప్రాణకాంతల్ని మరచారా? నీకు దయ లేదు. నీ హృదయం వట్టిగాలి. నీ బ్రతుకు కర్రమొద్దు. నువ్వు తన నాథుణ్ణి లోహపాశాలు వేసి బంధించావు. నువ్వు మామూలువీణవు కావు! నువ్వు రాక్షసివి!! పెనుభూతంలా తన కుటుంబములో ఆవిర్భవించావు. ఈరోజుతో నీజీవితం సమాప్తి!!

పదకొండు

ప్రేమబాల మహోగ్రబాల అయినది. ఆమె కన్నులు విస్ఫులింగాలు రాల్చినవి. ఆమె కాత్యాయని, మహాకాళీమూర్తి! భయంకర చండీమాత రెండు అంగలలో సంగీత మందిరాన్ని చేరుకుంది. పూజాపీఠంమీద వల్లకీపేటిక తెరిచింది. ఆవీణను మోటుగా

యీవలకు లాగింది. ఆవీణాబాల గజగజ లాడిపోయింది. ప్రేమబాల తీగెలన్ని ముక్కలు ముక్కలుగా తెంపివేసింది, మీటలు వూడబెరికింది. గుబ్బా, తంత్రీపీఠమూ దూరముగా విసిరివేసింది. తుంబీఫలము లాగివేసింది. సింహాముఖము చితకగొట్టటానికి సిద్ధంపడుతూ ఉండగా, వక్కపరుగున ఆనందమూర్తి "ఆ! ఆ!" అనుకుంటూ వచ్చిపడ్డాడు.

మయిమరచి నిద్రపోతూవున్న ఆనందమూర్తికి చటుక్కున ఓకల వచ్చింది. ఒక మహాశక్తి భయంకరంగా తన్ను తరుముకువస్తూ, "ఓయీ! నీవు నామీద భక్తి మానేశావు. ఇందుకు అంతా నీవీణే కారణం!" అని అంటూ తనవీణను ఆతని చేతుల్లోంచి లాగి ముక్కలుచేయడానికి ప్రారంభించిందట! ఆనందమూర్తికి గుండె దడదడమంటూ చెమటలు పడుతూఉండగా తటాలున మెలకువ వచ్చింది. "అమ్మయ్యో!" అంటూ శయన మందిరం చేరుకున్నాడు.

ఓ ఆనందమూర్తి! మహోగ్రమూర్తి అయిన భార్యను చూచి నిశ్చేష్టపోయావు. ఆమెచేతులలో రూపం మారిపోతూవున్న నీ అనుంగువల్లకిని చూచి కెవ్వున అర్చి ఆవీణ మీద మూర్ఛపోయావు.

ప్రేమబాలకు స్మృతి తెలిసింది. తాను చేసిన పని చూసుకుంది. మూర్ఛలో మునిగిఉన్న భర్తను చూసింది. భర్త అల్లా పడిఉన్నాడేమి? అయ్యో, వారికి ఆపత్తు కలగలేదు కదా? పరమశివా, ఏమి టీ ఘోరం! ఆవీణ తానేనా పాడుచేసింది? నిజమా? నిజమా? భర్తను తనఒళ్లోకి చేర్చుకుంది. ఆతని తలను తనహృదయాని కద్దుకుంది. ఆయన మోమున పెదవులతో స్పృశించింది. ఆమె లోచనాంచలాల్లోంచి జలజల బిందు ప్రవాహము వెచ్చగా నాథుని తలపై, మోముపై పడి, తడిపివేస్తూ ఆనందమూర్తికి మెలకువ తెప్పించినది.

పన్నెండు

ఆనందమూర్తి కళ్లు తెరవగా ప్రేమపూరితమై, ప్రేమచే విషాదమేఘావృతమై, కోలమై, లలితరేఖాపూర్ణమై, బంగారువెన్నలా స్విన్నమై, వివర్ణమై, ముంగురులు ఆవరించినదియై, విషాదంలోకూడా వింత సౌందర్యయుతమైన ప్రేమబాల తన ప్రేయసియొక్క మోము ప్రత్యక్షమైంది. ఆతని గుండె పరమకరుణచే దడదడలాడినది. ప్రేమబాల, ఏనాడు తనకూ తనప్రజ్ఞకూ అడ్డంవచ్చింది? ఏనాడు తనవిద్యను ప్రోత్సాహించలేదు! ఆమె తనజీవితప్రవాహంలో వేరొక శైవాలినీ బాలలా సంగమించినప్పటినుంచీ, తన కళాచాతుర్యం వేయిరెట్లు వృద్ధికాలేదా? ఎందుకూ తనకూ తనప్రేమమూర్తికీ ఈలాంటి హృదయభేదము వచ్చిందిః స్వరూపవతీ, నువ్వు నిర్మించిన వీణ పరమసాధ్వీమతల్లి, దివ్యాంగన.

ఆమెకు హృదయంలో ప్రేమ తప్ప ఇంకేమి ఉంటుంది? ఈ విషాదనాటకం అంతా తమ మనస్సుల్లో జన్మించిందేనా?

ఆతని హృదయంలోని ప్రేమ మహాప్రవాహం, ఉప్పెనలా వచ్చిపడింది. చటుక్కున ఆనందమూర్తి, ప్రేమబాల ఒళ్లోంచి నువ్వు లేచినావు. ఆమెను నిండుతమిమై నీ హృదయాని కదుముకొన్నావు. అశ్రుపూరితనయనాల్ని, చెదిరిన ముంగురులతో నిండిపోయిన మోమును, కలిగిపోయిన పువ్వులతో గజిబిజి అయిన పొంకమైన శిరాన్ని చుంబించినావు. ఆమె సుళ్లుతిరుగు చెక్కిళ్లు, చిరుగడ్డము, తేనెలూరు పెదవులు ముద్దుకొన్నావు.

ప్రేమబాల ఆశ్చర్యచకిత, ఆనందమయి మైపోయింది. ఆమె కన్నుల్లో, ఫాలంలో, కేశసౌభాగ్యంలో, చెక్కిళ్లల్లో, గడ్డంలో, పెదవుల్లో, విచిత్రకాంతులు అలమినవి.

ఇరువురూ వల్లకీబాలను నూత్నతంత్రులతో అలంకరించినారు. అన్నీ సవరించినారు. యథాప్రకారం వీణామతల్లి పరమగాంధర్వమూర్తి మైపోయింది.

నాథునికడ నేర్చుకున్న ఆనాటి విద్వత్తతో ప్రేమబాలవీణను మీటింది. ఆవీణ

"చైతన్యం సర్వభూతానాం వివృతిం జగదాత్మనాం
నాదబ్రహ్మ తదానందం అద్వితీయం"

అయింది.

ఆముప్పురూ ఒకళ్లల్లో ఒకళ్లయినారు.

---

# దొంగతనం

కొంపెల్ల సూర్యారావు

సోమప్పతాత ఒకనాడు తెల్లారగట్టే పొలం మెళ్ళి చూసేసరికి ముసు గేసుకుని ఎవడో వంకాయలు కోస్తున్నాడు.

"ఎవడురా నాతోటలో వంకాయలు కోసేవాడూ ?" అని గట్టిగా కేకేసేడు సోమప్ప తాత.

ఆ కోసినవంకాయ లన్నీ అక్కడే దిమ్మరించి పారిపోతున్నాడు వీరిగాడు.

సోమప్పతాత "ఆగరా, ఆకాయలు పట్టుకు పోరా" అని కేకలేస్తే వా డక్కడ లేడు.

అవన్నీ మూటకట్టి వీరిగాడింటి కెళ్ళేడు తాత.

"ఒరే వీరిగా! ఈకాయలు పుచ్చుకోరా, నే నేమీ అనను" అన్నాడు. ఎందు కొస్తాడు వాడు?

తాత అందరితోటీ "చూశారా! ఎంతో ఆశపడి తిందామని కోసినవాడు 'ఈకా యలు తీసుకోరా' అంటే తీసుకోకండా వున్నాడు. వా డీ కూరొండుకు తినేవరకూ నేను స్నానానికి వెళ్ల"నని కూచున్నాడు.

ఎల్లా అయితే నేమి వీరిగాణ్ణి బతిమాలి కాయ లిచ్చి తాతగార్ని బతిమాలి స్నానా నికి పంపేసరికి తాతలు దిగొచ్చేరు.

ఈసంగతి ఊరంతా తెలిసింది.

'వీరిగాడు దొంగ' అంటే 'వీరిగాడు దొంగ' అన్నారు. మర్నాటినుంచి ఊళ్లో అన్నీ పోవడం మొదలెట్టేయి.

కొట్టుకున్న అటుకులు దగ్గిర్నించీ, దాచుకున్న మినపసున్ని దగ్గిర్నించీ పోడమే.

ఓనా డో అత్తగారు కోడలు దొంగతనంగా మినపసున్నివుండ మింగుతోంటే పట్టు కుంది. పెద్ద కజ్జా అయింది. కాని అంతా అన్నారు: అది పెద్ద దొంగతనం అని చెప్పడానికి వీల్లేదు. తినడానికి తీసుకుందేమో ఒకవుండ. అందరిళ్లల్లోనూ పోయీ వన్నీ ఆ అమ్మాయే తీసుకు తింటోందా? ఇంటికోడ లయేక ఇంటో వస్తువ తిండానికి ఆమాత్రం స్వతంత్రం లేదూ?" అన్నారు.

ఆరోజు మొదలుకొని తినుబండా లేమున్నా కోడళ్లు తీసుకు తినేవారు. వెండి, ఇత్తడి సామాను లేం పోయినా వీరిగాడు తీసే డనేవారు.

## దొంగతనం

"వీరిగాణ్ణి పట్టుకుంటేనే కాని దొంగతనా లాగవు" అన్నా డొకడు. ఆపళంగా "వీరిగాణ్ణి పట్టుకుంటేనే కాని దొంగతనా లాగవు" అన్నా రంతాను.

"వెంకయ్యగారితో ఆలోచిస్తే మంచిది" అన్నా డొకడు. "వెంకయ్యగారితో ఆలోచిస్తే మంచిది" అన్నా రంతాను. తక్షణం వీరిగాణ్ణి పట్టుకునే ప్రయత్నం విషయం వెంకయ్యగారితో ఆలోచించడానికి వెళ్లేరు కొంతమంది.

"వెంకయ్యగారూ !" అన్నారు.

"ఏం గావాలి" అన్నాడు వెంకయ్యగారు.

ఇల్లా ఇల్లాటి సంగ తన్నారు.

"వెంకయ్యగారూ ! వీడి పొగ రడిచేమార్గం చూడాలండీ, విదిలిపెడితే వీడు మనిషి కాడూ !" అన్నారు.

"అదెంత పని ! వెధవకి కఠినవరకం వెయించి పారెయ్యొచ్చు. మీరు నే చెప్పినట్టు సాక్ష్య మిద్దురూ మీ కెందుకు, మూడు నిమషాలూ !" అన్నాడు వెంకయ్య.

"అల్లాగే, చెయ్యండి వెంకయ్యగారూ, మీ రేం జేసినా సరే" అన్నారు.

"వినం డయితే—రాత్రికి రాత్రి నా యింట్లో గడ్డిమే టెత్తుకు పోయేడని పోలీసు రిపోర్టు పారేస్తున్నాను. సాయంత్రాని కల్లా వాణ్ణి పట్టుకుపోతారు—మీ రంతా సాక్ష్యం పలకం డంతే" అన్నాడు.

"ఒకటి కాదండీ, రెండో మూడో అని పెడితే ఇంకా ఘాటుగా వుంటుందేమో ?" అన్నాడు సుబ్బయ్య కాబోసు.

పెద్ద న్నన్నాడు: "అబ్బే చాలు. 'రెం డెల్లా పట్టి కెళ్ళేడు ఒక్క పీనుగ ?' అని అడగరూ—పదిమంది నమ్మద్దూ మాటంటే?" అన్నాడు.

"కాదు పెద్దన్నా ! అదే బాగుంది. ఎం చేతంటే రెం డున్నాక ఒకటి పట్టికెళ్లి ఇంకో టట్టే పెడతాడా, దొం గయేక ! ఎల్లాగో సాయం పట్టేస్తాడు గాని !" అన్నాడు వెంకయ్య.

"పెద్దన్నా ! ను వ్వొరికే తెలిసినట్టు మాట్టాడకు" అన్నా రంతాను.

పోలీసా ళ్లొచ్చేరు. వీరిగాణ్ణి పట్టేరు.

"నిజం చెప్పు వెధవా" అన్నారు.

"నేను గడ్డేం జేసుకోను. నా కేం దూడా, దుడికా ? బాబయ్యా—ఎక్కడ దాచు కుంటాను పోనీ మీరే శిత్తగించండి !" అన్నాడు.

"గడ్డేం జేసుకుంటా వేం! మరెందుకు తెచ్చేవురా? మరెందు కెత్తుకొచ్చేవు? తిందామని తెచ్చేవురా? పోదవండి వెధవని" అన్నాడు వెంకయ్య.

"వాడిల్లంతా చూ స్తే ఒక్క పరకేనా లేదు, వాణ్ణి ఏమని పట్టుకోం" అని కాస్త తటపటాయించేరు పోలీసు.

"నేనో మా టంటానూ! దొంగతనం చేసిన వస్తువ ఎవడేనా కనపడీ లా దాచుకుంటా ట్టండీ?" అన్నాడు వెంకయ్య.

"ఆ మాట నిజమే. వీడే దొంగ" అన్నా రంతా.

♦ ♦ ♦ ♦

మర్నాడు.

మెల్లిగా ఎవడో ఊదేడు అసలు సంగతి. దానితో పోలీసు చక్కా ఒచ్చేరు.

'ఏం చెప్మా మళ్లీ వొచ్చేరూ!' అని ఏభై మంది చేరేరు. వెంకయ్య ఇల్లంతా పరీక్షగా చూస్తున్నారు పోలీసు.

'ఇదేదో వుంది' అని సగంమంది జారిపోయేరు.

"పెరడే లేదు ఆట్టేను, ఎక్కడేసేవయ్యా నువ్వు గడ్డిమేట్లూ?" అన్నారు పోలీసు వెంకయ్యని.

"వెయ్యండే వేసే నంటానుటండీ? ఆపెరడు చాలదూ? అక్కడే వేసేను. మీ రెవర్నేనా అడగొచ్చు కావలి స్తేనూ—అదేమిటండోయ్!" అని సమాధానం చెప్పేడు వెంకయ్య.

ఊళ్ళోవాళ్ళు పాతికమందీ ఊరుకున్నా రిటూ అటూ చూస్తూను.

"అయినా—నీకు దూడా దుబ్రా లేదుటే! నువ్వు గడ్డెందుకోసం కొన్నావు?" అని గట్టిగా చూసేరు పోలీసు.

ఊళ్ళోవాళ్ళల్లో కొంచెం ఇంచుమించు పదిహేనుగురికి పన్లుండి వెళ్ళిపోయేరు.

"ఏమీ లేకపోతే నేను తినడానికి టండీ గడ్డి? మా పెత్తల్లిగారి వాళ్ళకి లేవూ? వాళ్ళకోసం కొన్నాను—కొని మూడురోజు లవ లేదు. మీరు కావలి స్తే కనుక్కోండి ఎవర్నేనా!" అన్నాడు వెంకయ్య.

పక్కని నించున్న వాళ్ళలో ఒకడు ఇంకోడితోటి, "ఔను. శీతమ్మగారికి ఇయనేగా ......" అని సణిగేడు.

"ఏమో ఎదో ఒకటి మని కెందు కూరుకుందూ" అన్నాడు ఆ ఇంకోడు ఆఒకడితో.

"మధ్యన వీళ్ళ కెందుకూ—ఊరుకోక" అనుకుంటూ కడంవాళ్ళు చక్కాపోయేరు.

"భోజనానికి పోదాం" అన్నాడు ఆ రెండోవాడు గట్టిగా.

"భోజనానికి పోదాం" అన్నాడు ఆ మొదటివాడు ఇంకొంచెం గట్టిగా.

మెల్లిగా నాలు గడుగులు జారేరు. గబుక్కున ఆక లెక్కువై కాబోసు గబాగబా నాలుగిడుగు లేసి సందు మళ్ళేరు. తరవాత వాళ్ళిష్టం. ఇంక వెంకయ్యా, పోలీసాళ్ళా మాత్రం వున్నారు. ఇంతట్లో మునసబుగారు చక్కా వొచ్చేరు.

"సరే! మీ పెత్తల్లిగా రిల్లెక్కడయ్యా?" అన్నారు వెంకయ్యని పోలీసు.

మునసబుగారు అడ్డమొచ్చి: "ఇదంతా ఎల్లా వున్నా ఊళ్ళో అన్నీ పోవడమేనండి ఈ మధ్య. ఈయనకి పెరడు లేదే అనుకోండి. గడ్డిమేట్లు వేసేడు—వెయ్యలేదు. ఒకవేళ పెర డుండి గడ్డిమేట్లు వేసిననాడు కూడా వాడు ఎత్తుకు పోయీవాడే. అందులో ఏమీ సందేహం లేదు. వా డంతటివాడు మాత్రం అవును" అన్నాడు.

ఆ పళంగా ఓ పదిమంది పోగడి "ఆ మాట మాత్రం నిజం" అన్నారు.

పోలీసు "సరే. పదిరూపాయి లియ్యండి. లేకపోతే కేసు మీ మీదకి తిరుగుతుంది" అని దబాయించేరు వెంకయ్యని.

పదిమందీ అటు చూసేరు.

వెంకయ్య:—"నా కేం పట్టింది! మధ్యన! ఊళ్లోవా ళ్ళందర్నీ చందావే సిచ్చుకోమనండి కావలిస్తే!"

"తెలివైన వాడివే!" అని చక్కా పోయేరు పదిమందీ.

# ముక్తి : ప్రేమ

మంగిపూడి పురుషోత్తమశర్మ

ముక్తిపేరిట నీయందలి జీవచైతన్యమును హత్య చేయకుము.

యోగేశ్వరుడగు శ్రీకృష్ణుడే జీవనమును పూర్ణముగా ప్రేమించెను, అవలంబించెను.

శ్రీకృష్ణుని జీవనసారము క్రీడ—జగత్క్రీడ; అంతే కాని, అగాధము, అచింత్యము, పరమైకాంతికము నై సర్వవికాసదమనమగు 'అచలభావము' కాదు.

ఆ యఖండరసమూర్తి తనయందలి యనంతరసములతో, అనంతభావములతో గావించు నిత్యక్రీడయే రాసలీల.

విశ్వరంగమందు ఆ జగదేక నటునితో చేయిచేయి కలిపి, అడుగులో అడుగు వేయు నర్తకబృందమే ధన్యము. ఏమన, జీవితముయొక్క పూర్ణానందము వారిది, పూర్ణ ఫలము వారిది.

శ్రీకృష్ణుడు జననమాదిగా చంపిన యసురగణమంతయు ఎవ్వరని ప్రశ్నించుకోగా మానవుని యందలి ప్రేమ—ముక్తి స్వరూపుడగు భగవానుని వికాసము నరికట్టు వివిధ తమశ్శక్తులే యని జవాబు వచ్చినది.

శ్రీకృష్ణుడు అనేకాసురసంహారమును జేసి మానవకోటికి మార్గరక్షకుడైనాడు. అయితే ఆతడు సంహరించిన యసురులలో కెల్ల సూక్ష్మరూపుడు, మాయావి, బలీయుడు—ధర్మాసురుడు లేక శాస్త్రాసురుడు.

ఈ ధర్మాసురుని జన్మనివాసములు అహంకార రాజ్యమునందు; ఈ శాస్త్రాసురుని విచార విహారములు అజ్ఞానరాజ్యమందు.

ఈ యసురుడు సర్వదా అప్రాకృతమగు పరిశుద్ధవేషమున గోచరించుచు తన విశిష్టస్వరూప ప్రభావ మాత్రమున మానవహృదయముపై కానరాని యమితాధికారమును గడించి దానిని వశంవదము కావించుకొనును.

ఈ యసురుడు తన 'ఆస్తిక దుస్తులతో' పరమేశ్వరుని జంఝా చేబూని ఆయన సత్యశక్తుల తోనే ముష్కరముగా పోరాడును.

ఈ యసురుడు పరమేశ్వరుని యుత్తమసింహాసనమునే యాక్రమించుకొని, తానే మోక్ష నాథుడుగను, ముక్తిప్రదాతగను ప్రకటించుకొని, విశ్వాసము కల్పించి, తన ధర్మ

వాగురలచే ముక్తికై పరితపించు మానవహృదయమును మఱింత నిబద్ధముగా జేయును.

ఈ ధర్మబ్రహ్మ తన కల్పనా ప్రభావముచే మొదట సత్యభ్రాంతి జనకములగు స్వాప్నికస్వర్గములను నిర్మించి అందు మానవాత్మకు సంతుష్టి నొడగూర్చి, క్రమముగా దాని చుట్టును దుర్భేద్యమగు అచలాయతనమును నిర్మించును.

ఈ యచలాయతనముయొక్క యినుపద్వారముపై పెద్ద సువర్ణాక్షరములతో 'ముక్తిమందిర' మని చెక్కబడి యుండును; కాని యీ పాషాణగృహమున భగవానుని సత్యముక్తి ప్రకాశ మెక్కడ ?

ఓ ముక్త్యన్వేషీ! జాగ్రత్త! నీ మోక్షాసక్తిచే, మోక్షాతురతచే నీయాత్మచుట్టును చైతన్య శోభా విలసితమగు ముక్తిసౌధమును రచించుటకు మారుగ, తుదకు నిర్జీవపాషాణ కుహరమును—శ్మశానస్థమగు గోరీని, నిర్మించి అందు నీవే పూడిపోగలవు.

మోక్షేశ్వరుడగు శ్రీకృష్ణు డందుకే సాధకమండలికి ఈ ధర్మాసుర రాజ్యమునుండి తప్పించుకొన్న గాని అసలు ముక్తి లేదని బహువిధములుగా నిదర్శించి చాటినాడు.

చూడుడు, ఎవరు ధన్యులైరి ? ధర్మాసురుని నిరంతరోపాసనమున అంధులై, సాక్షాత్ యజ్ఞేశ్వరునికే నియమభంగభయమున అన్నభిక్షమును తిరస్కరించిన యజ్ఞదీక్షితులగు మహాబ్రాహ్మణులా ? లేక ఏ ధర్మము, ఏ కర్మము నెఱుగక, ఏ మహావిధినిషేధముల నభ్యసింపక తమ సహజసరళ హృదయకుసుమముల భగవానుని కర్పించి యాతని తమ మృష్టప్రేమాన్నముచే సంతుష్టుని గావించిన పామర బ్రాహ్మణపత్నులా ?

శ్రీకృష్ణభగవాను డీయర్థమునే పండితులకొరకిట్లు ప్రవచించియున్నాడు:—"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ."

ఏమనగా, ఆయనసంతోన్నతుని అందుకోగల 'ధర్మనిచ్చెనను' తయారుచేయగల బ్రహ్మ యింకను పుట్టవలసియే యున్నాడు.

ముక్తిస్వరూపుడగు భగవానునికి మూర్తికల్పన చేయుటకై చిరతపోమగ్నమైన భారతవర్షము తుదకు తన యన్వేషణయొక్క పూర్ణఫలముగ సంతుష్టి చెంది లోకమునకు సమర్పించినది నిరంజన నిర్గుణబ్రహ్మమును గాదు, నిర్వాణాధిష్ఠితమగు ధ్యానిబుద్ధమూర్తిని గాదు, శ్మశానవాసియగు జటాశంకరుని గాదు, నిత్యక్రీడాభిరాముడగు బాలగోపాలుని.

ముక్తియొక్క ముఖ్యలక్షణము క్రీడ; క్రీడ బాల్యముయొక్క తావి; అందుచే ముక్తి, క్రీడ, బాల్యము—ఈ మూడును ఏకవస్తువుయొక్క పర్యాయవాచకములు.

రసో వై సః. అదియే రసము; అదియే ప్రేమ; అదియే శ్రీకృష్ణుడు.

భారతరసగర్భమును అమృత పిపాసువులగు దివ్యులు చిరకాలము చిలికి చిలికి తీసి సుసీభవింపజేసిన 'రసగోలా' శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణుడు భారతవర్షముయొక్క హృదయము; భారతతపస్సుయొక్క పూర్ణఫలము; భారతజగత్తుయొక్క భాగ్యసర్వస్వము.

విశ్వదేవతావలయమునకు శ్రీకృష్ణుడు కేంద్రబిందుస్థానము.

నిత్యలీలామయు డగుటచే శ్రీకృష్ణుడు నిత్యబాలుడు.

* * * *

నియతిని, ధర్మమును, ఆచారమును ఉల్లంఘించుటే బాలుర నియతి, ధర్మము, పద్ధతి. వారికి సర్వధర్మాతివర్తనమందు, విప్లవమందు, అరాజకమందు తీరని వినోదము; అది లౌల్య మనుడు, క్రౌర్య మనుడు, దౌష్ట్య మనుడు, కాని యదియే వారి యాట; అదియే వారి యానందము.

బాలురు సర్వధర్మశూన్యులు కారు; వారి రాజ్యమును సుశాసిత మొనర్చు సుందర సుమధుర ధర్మము—ధర్మములకెల్ల పరమధర్మము—ప్రేమ.

యోగభిక్షూ! నీ వా ప్రేమరాజ్యమున, ఆస్వర్గరాజ్యమున, ఆముక్తిరాజ్యమున, ఆ శ్రీకృష్ణుని దివ్యదేహ సామ్రాజ్యమున లీనము కా గోరుదువేని ఆరసవాహినియందు దాగియున్న ధర్మకాళీయుని ముందుగా నిర్జింపుము; అతని సహస్రశిరస్సులపై నిర్దయగా నృత్యము సలుపుము. అప్పుడే నీ వారసతరంగిణిలో స్వేచ్ఛగా ఓలలాడగలవు.

ముక్తియాత్రీ! ముక్తిపేరిట నీవు వెతకునది జీవితమున కవ్వలి శాంతియైనచో నిశ్చయముగా నీవు చేరునది ముక్తి కాదు, మృత్యువు. అది నిత్యశాంతి కావచ్చును, కాని శాశ్వత మృత్యుశాంతి మాత్రమే.

ముక్తి యెప్పుడును సజీవము, సానందము, స్వతంత్రము. అది జీవనముయొక్క యవసానము కాదు, పరిపాకము; విరామము కాదు, వికాసము; నిర్వాణము కాదు, నిత్యజీవన ప్రవేశము; జన్మరాహిత్యమును గాదు, జన్మమరణములు ఆయమృతసాగరవీచికల యుత్థానపతనములు మాత్రమే. అది జన్మబంధమునుండియే కాదు, మరణశృంఖలము

నుండియు విమోచనము. ముక్తి మిథ్య కాదు, సత్యము; శూన్యము కాదు, పూర్ణము; అంధకారము కాదు, జ్యోత్స్న. అది యహంకారమునుండి ముక్తి, అజ్ఞానమునుండి ముక్తి, దుఃఖమునుండి ముక్తి, దౌర్బల్యమునుండి ముక్తి; దేశకాల నిబంధనల నుండి, ఆచారములనుండి ముక్తి; భయమునుండి ముక్తి, దాస్యమునుండి ముక్తి; అది సర్వతోముఖస్వతంత్రము, విశృంఖల విలాసము.

ముక్తికై కన్నులు మూసికొని యఱ్ఱులు సాచుకొని యెచటికో పరుగులెత్తు ఓ రిక్తాన్వేషీ! నీ హృదయాంతరమున, నీ పాదతలమున కొనలుసాగుచు నల్లుకొనుచున్న కోమల ముక్తిలతను నీ నిష్ఠురపదాఘాతములక్రింద నేల వృథా నలగ ద్రొక్కెదవు? తెరవుము నీ కన్నులను, అద్దుము నీ పెదవులపై, అదిమికొనుము నీ హృదయమున ఆజ్యోతిర్లతను, ఆయానందవల్లిని; ధన్యుడ వయ్యెదవు.

ముక్తిసాధకుడా! ఇంక తుదిమాట. ఎంతకాలము నీవు మరణమందలి శూన్యమునే ముక్తిగా భ్రమించి శుష్కసైకత పరిభ్రమణము చేయుదువో అంతకాలమును సత్య ముక్తి స్వరూపుడగు శ్రీకృష్ణుడు నీకు కరగతము కానేరడు—ఏమనగా శ్రీకృష్ణుడు మధురజీవన బృందావన విహారి కాని శూన్య సహారా సంచారి కాడు.

తత్ సత్.

# ఆనందం

## "చలం"

లోకం ఆనందమయం. ఆనందంకోసమే ప్రయత్నిస్తుంది. ప్రతిజీవియొక్క పరమావధీ ఆనందమే. పశువులు, పక్షులు అన్నిటికి బాధనుంచి తప్పించుకోవాలనీ హాయిగా బ్రతకాలనీ వొక్కటే ప్రయత్నం. మనుష్యులు హాయిగా బతకడమే కాకుండా కొన్నివిధాలైన ఆనందాన్నికూడా పొందాలని చూస్తారు. బాధ కావాలని కోరేవా రెవరూ లేరు. కోరి బాధ లుపడేవాళ్లూ, సుఖాన్ని త్యజించేవాళ్లూ లేకపోలేదు. చచ్చినవాళ్లని మరిచిపోక స్మారికే జ్ఞాపకం చేసుకొని యేడ్చేవాళ్లూ, ఇతరులసౌఖ్యంకోసం తమ ఆనందాన్ని వొదులుకొనే వాళ్లూ, నోట్లోంచి కడ్డీలు దూర్చుకొనేవాళ్లూ, పంచాగ్నులమధ్య తపసు చేసేవాళ్లూ వున్నారు. కాని ఆబాధ వాళ్లకి ఆనందం గనక, లేక ఆనందకరమైంది ఆబాధవల్ల సమకూరు తుంది గనక, ఆబాధ పడతారు.

ఆనందం అనేకరకాలు. ముఖ్యం పంచేంద్రియాలవల్ల సంపాయించేది. మనసువల్ల పొందేది. ఉన్నతమైన ఆలోచనలూ, సంభాషణా స్నేహమూ ప్రేమా మొదలైనవీ, సౌందర్యంవల్ల కలిగే ఆనందం, అందమైన కథలూ, నాటకమూ, సంగీతమూ, బొమ్మలూ మొదలైనవాటివల్ల కలిగే ఆనందం. ఈ ఆనందంలోనే ఎక్కువ తక్కువ లున్నాయి. తిని నిద్రపోయి జంతువులవలె బ్రతుకులో పొందే ఆనందం, గంతువేసి నవ్వి అల్లరిగా ఉంటే వొచ్చే ఆనందం, తృప్తిపడి నా కింకేమి అక్కర్లేదని శాంతంగా వుండే ఆనందం, లోకమంతా తనకే కావాలనే అధికారాలకి ధనార్జనకి కష్టపడుతూ పొందే ఆనందం, దేశాల్ని సంఘాల్ని బాగుచెయ్యాలనీ, కొత్తవిజ్ఞానాన్ని సంపాయించాలనీ, కొత్తలోకాల్ని కనిపెట్టాలనీ ప్రయత్నిస్తో జీవితా న్నర్పించే ఆనందం.

ఇవే కాక మనకు తెలీనివీ, తెలుసుకోలేనివీ, యీ భూలోకానికే చెందినవీ, యింకా మనము చూసే ఆకాశానికీ యితర గోళాలకీ చెందినవీ అనేకవిధములైన ఆనందాలు వుండవొచ్చు. చీమ పొందే ఆనందం వుంది, మనం పొందే ఆనందం వుంది. భేదం యింద్రియభేదంవల్ల కలుగుతోంది. దానికళ్లూ మనకళ్లూ ఒకటే కాంతిని చూడవు. చెవులు ఒకటే ధ్వనిని వినవు. అట్లానే మనకే యింకా బలమైన చెవులు,—కళ్లు వుంటే, ఆకాశధ్వనులు,—కాంతులు,—ఆకులు చేసే రహస్యసంగీతాలు,—కీటకాల సంభాషణ—యెన్ని వినగలమో, చూడగలమో! అంతే కాదు, యీ పంచేంద్రియాలు వుండబట్టి యీ ఆనందాన్ని అనుభవిస్తూన్నాము. పది జ్ఞానేంద్రియా లుంటే—పదిరకాలు——యీ అయిదు కాక, యింకోవిధమైనవి వుంటే——కొంచెం ఆలోచిస్తే తెలుస్తుంది—అనంతమైన ఆనందాలు వుండ డానికి వీలుందని. భూలోకంలో యీ విధమైన ఆనందా లున్నయి : చంద్రలోకంలో, అనూ రాధలోకంలో, ఆర్ద్రలోకంలో—చెప్పలేము.

ఇవన్నీ శరీరాలకు సంబంధించిన ఆనందాలు. మతాలు యింకో ఆనందాన్ని గురించి చెపుతాయి. ఆ ఆనందాన్ని స్వర్గలోకంలో పొందుతా మంటారు. ఆ ఆనందం రెండువిధాలు. భూలోకపు ఆనందాలవంటివే శరీరానికి సంబంధించినవీ; రెండోది ఈశ్వరుడి సాన్నిధ్యంవల్ల గాని, స్తోత్రంవల్ల గాని, లేక ఐక్యంవల్ల గాని, కలిగే ఆనందమూ. ఆస్వర్గానందాలకి భూ— ఆనందాలకి విరోధం. అవి కావాలంటే వీటిని త్యజించాలి; ముఖ్యంగా ఆస్వర్గం సంగతి తెలిసినవాళ్లు కొన్ని నీతుల్నీ చట్టాల్నీ ఏర్పర్చారు. వాటిని అతిక్రమించకుండా సంచరిస్తే ఆ స్వర్గమూ ఈశ్వరుడూ దొరుకుతారు. కాని ఆప్రకారము చేస్తున్న మనుషు లెవరూ కనబడరు. ఎవరికీ అది నిశ్చయం లేదనుకుంటా. ఒకవేళ అందరూ వివేకవంతులై ఆ స్వర్గంకోసం క్షణభంగురమైన యీ భూలోక ఆనందాలని త్యజించి ఆ శాస్త్రప్రకారము ఆచట్టాలు, ఆధర్మాలు అనుష్ఠిస్తా రనుకోండి; ఆ స్వర్గం యెట్లా ఉన్నా యీ భూలోకం ధ్వంసమై పోతుంది. ఇప్పుడున్న తమాషా నవ్వూ, ప్రేమా, స్నేహమూ, అన్నీ నశించి యీ లోకం నివాసయోగ్యం కాకుండా పోతుంది. ప్రజలు ఎంత త్వరలో యీ లోకాన్ని విడిచి ఆలోకానికి వెళితే అంత ఉత్తమంగా తోచాలి. మొత్తానికి ఎవర్ని చూసినా ఈశ్వరుడూ, ఆయనలోకమూ, దానిమార్గమూ, వీటిసంగతి మాట్లాడేవాళ్లే గాని, యీ లోకాన్ని విడిచి ఆలోకానికీ, దాని ఆనందాలకోసము తొరగా ప్రయాణమవుతున్న వాళ్లు యెవరూ కనుపించరు.

ప్రతివాళ్లు బాధనుంచి తప్పించుకొని ఆనందాన్ని పొందుదామని చూస్తారు గాని ఆనేర్పు గలిగి ఆనందాన్ని పొందగలిగేవాళ్లు కొద్దిమందే కనబడతారు. మన 'ఇన్‌స్టింక్టు' ఆనందంకోసం బలీయముగా వుంది. తనకు బాధ కలిగించే పనులనించి మనశరీరం తనంతట తానే తప్పుకుంటుంది కాని మనమనసుకి మాత్రం యింకా ఆ 'ఇన్‌స్టింక్టు' రాలేదు. జ్ఞానము, నేర్పు యింకా సంపాయించలేదు. ఏది తమకు ఆనందం యిస్తుందో, బాధలనించి యెట్లా తప్పుకోగలరో మనుషులు నేర్చుకోలేదు. కనకనే యెవడు వొచ్చి "ఆనందం" అని కేకలు వేసినా వాడివెంట పరుగెత్తుతారు.

ఆనందంవిషయమై కొన్ని నిబంధనలు కనబడుతున్నాయి.

నాకు ఆనందం కావాలి, నేను ఆనందం అనుభవించాలని ప్రయత్నిస్తే వొచ్చేట్టు కనబడదు. ఒకకార్యము ద్వారానే కలుగుతుంది. మనసు ఆకార్యంమీద వుండాలి గాని ఆనందంమీద వుంటే ఆనందం చెదిరిపోతుంది. తీపి కావా లన్నవాడు తీపికోసం వెతికితే ఎక్కడన్నా కనబడుతుందా? తీపి నివ్వగల చెరుకుకోసం వెదకాలి. అట్లానే ఆనందం కావలిస్తే ఒంటరిగా కూచుని ఎవరికీ లేకుండా కొంత ఆనందం సంపాయించుకోవాలంటే అది క్షుద్రరూపాల ప్రసన్నమవుతుంది. ఒక్కనిమిషంలో నశిస్తుంది. మనము జీవిస్తున్నాము, మనకి ఆనందం కావాలి—అనేధ్యాస లేకుండా జీవితాన్ని గొప్పగొప్ప వుద్యమాల్లో,

ఇవన్నీ శరీరాలకు సంబంధించిన ఆనందాలు. మతాలు యింకో ఆనందాన్ని గురించి చెపుతాయి. ఆ ఆనందాన్ని స్వర్గలోకంలో పొందుతా మంటారు. ఆ ఆనందం రెండువిధాలు. భూలోకపు ఆనందాలవంటివే శరీరానికి సంబంధించినవీ; రెండోది ఈశ్వరుడి సాన్నిధ్యంవల్ల గాని, స్తోత్రంవల్ల గాని, లేక ఐక్యంవల్ల గాని, కలిగే ఆనందమూ. ఆస్వర్గానందాలకి భూ— ఆనందాలకి విరోధం. అవి కావాలంటే వీటిని త్యజించాలి; ముఖ్యంగా ఆస్వర్గం సంగతి తెలిసినవాళ్లు కొన్ని నీతుల్నీ చట్టాల్నీ ఏర్పర్చారు. వాటిని అతిక్రమించకుండా సంచరిస్తే ఆ స్వర్గమూ ఈశ్వరుడూ దొరుకుతారు. కాని ఆప్రకారము చేస్తున్న మనుషు లెవరూ కనబడరు. ఎవరికీ అది నిశ్చయం లేదనుకుంటా. ఒకవేళ అందరూ వివేకవంతులై ఆ స్వర్గంకోసం క్షణ భంగురమైన యీ భూలోక ఆనందాలని త్యజించి ఆ శాస్త్రప్రకారము ఆచట్టాలు, ఆధర్మాలు అనుష్ఠిస్తా రనుకోండి; ఆ స్వర్గం యెట్లా ఉన్నా యీ భూలోకం ధ్వంసమై పోతుంది. ఇప్పుడున్న తమాషా నవ్వూ, ప్రేమా, స్నేహమూ, అన్నీ నశించి యీ లోకం నివాస యోగ్యం కాకుండా పోతుంది. ప్రజలు ఎంత త్వరలో యీ లోకాన్ని విడిచి ఆలోకానికి వెళితే అంత ఉత్తమంగా తోచాలి. మొత్తానికి ఎవర్ని చూసినా ఈశ్వరుడూ, ఆయనలోకమూ, దానిమార్గమూ, వీటిసంగతి మాట్లాడేవాళ్లే గాని, యీ లోకాన్ని విడిచి ఆలోకానికీ, దాని ఆనందాలకోసము తొరగా ప్రయాణమవుతున్నవాళ్లు యెవరూ కనుపించరు.

ప్రతివాళ్లు బాధనుంచి తప్పించుకొని ఆనందాన్ని పొందుదామని చూస్తారు గాని ఆనేర్పు గలిగి ఆనందాన్ని పొందగలిగేవాళ్లు కొద్దిమందే కనబడతారు. మన 'ఇన్‌స్టింక్టు' ఆనందంకోసం బలీయముగా వుంది. తనకు బాధ కలిగించే పనులనించి మనశరీరం తనంతట తానే తప్పుకుంటుంది కాని మనమనసుకి మాత్రం యింకా ఆ 'ఇన్‌స్టింక్టు' రాలేదు. జ్ఞానము, నేర్పు యింకా సంపాయించలేదు. ఏది తమకు ఆనందం యిస్తుందో, బాధలనించి యెట్లా తప్పుకోగలరో మనుషులు నేర్చుకోలేదు. కనకనే యెవడు వొచ్చి "ఆనందం" అని కేకలు వేసినా వాడివెంట పరుగెత్తుతారు.

ఆనందంవిషయమై కొన్ని నిబంధనలు కనబడుతున్నాయి.

నాకు ఆనందం కావాలి, నేను ఆనందం అనుభవించాలని ప్రయత్నిస్తే వొచ్చేట్టు కనబడదు. ఒకకార్యము ద్వారానే కలుగుతుంది. మనసు ఆకార్యంమీద వుండాలి గాని ఆనందంమీద వుంటే ఆనందం చెదిరిపోతుంది. తీపి కావా లన్నవాడు తీపికోసం వెతికితే ఎక్కడన్నా కనబడుతుందా? తీపి నివ్వగల చెరుకుకోసం వెదకాలి. అట్లానే ఆనందం కావలిస్తే ఒంటరిగా కూచుని ఎవరికీ లేకుండా కొంత ఆనందం సంపాయించుకోవాలంటే అది క్షుద్రరూపాల ప్రసన్నమవుతుంది. ఒక్కనిమిషంలో నశిస్తుంది. మనము జీవిస్తున్నాము, మనకి ఆనందం కావాలి—అనేధ్యాస లేకుండా జీవితాన్ని గొప్పగొప్ప వుద్యమాల్లో,

లోకక్షేమానికి ప్రపంచానందానికి చేసే ఘనప్రయత్నాలలో ఐక్యమయ్యే మనిషి పొందే ఆనందం స్వార్థపరులు పొందనట్టు తోస్తుంది. మొదటిరకపు ఆనందపు స్వభావమే ఉత్తమ మయిందిగా ఉంటుంది. ఒక ఆనందమైన కథను గాని బొమ్మను గాని సృష్టించే ఆనందం తలుచుకోండి!

ఈ ఆనందం ఎవరికీ యివ్వను; నేనే దాచుకుంటాను—అన్న నిమిషాన ఆనందం మాయ మౌతుంది. చెట్టునున్న పువ్వును జేబులో దాచుకొన్నట్టు, ఎవ రెత్తుకుపోతారో అని భార్యల్ని దాచుకొనేవాళ్లు యీ విషయమై కొంచెం ఆలోచిస్తే బావుంటుంది. చక్కగా యోచిస్తే యితరులనించి దాచుకొన్నామనే తృప్తి తప్ప ఏమాత్రమూ వాళ్లు ఆనందాన్ని పొందలేదు.

తనే ఆనందం పొందాలనే కార్యాలకన్న యితరులకి ఆనంద మివ్వాలన్న ఉత్సాహంతో చేసేకార్యాలు ఎక్కువ ఆనందాన్నిస్తాయి. తిండి తినడానికీనీ, సంగీతం పాడ్డానికీనీ భేదం ఆలోచించండి. అందువల్లనే ప్రేమవల్ల వొచ్చే ఆనందం అద్వితీయమైనది. ఎందుకంటే ప్రేమ వున్నప్పుడు తనకి ఎంత ఆనందం వొస్తుం దనేధ్యాస వుండదు. ఎంతసేపూ ఇతరులకి ఎంత ఆనందం యివ్వగల మనేయోచనే బలంగా వుంటుంది.

ప్రపంచమంతా ఆనందం పొంగి పొర్లిపోతుంది. దాన్ని అందుకోగలిగిన హృద యాలు వుండాలి. లోకంఅంతా కాంతి వుంది. కాని కన్ను వుంటే గాని ఆకాంతి అర్థం కాదు. ఎంత శక్తిగల కన్ను వుంటే అంత కాంతి ఉపయోగపడుతుంది. లోకమంతా శక్తితో నిండి వుంది. ఆ శక్తిని ఉపయోగపరచుకొనే యంత్రాన్ని పట్టి ఆశక్తి వ్యక్తమౌతుంది—అట్లానే ఆనందము. ఆకాశం, సముద్రము, గాలి, యిసిక, స్నేహితము, తోటలు, నదులు, కీట కాలు, పసిపిల్లలు, నవ్వు అన్నీ ఆనందమే. తెలుసుకొనే హృదయం వుండాలి. ఆ హృదయా నికి ఎంతశక్తి వుంటే అంత ఆనందాన్ని తీసికోగలదు. వెన్నెల అందరికే కాస్తుంది. వెన్నెల రాకుండా కిటికీలు మూసుకునేవా ళ్లున్నారు. వెన్నెల చాలదని ఎలెక్ట్రిక్లైట్లు పెట్టుకొనేవా ళ్లున్నారు. వెన్నెల వుందని గుర్తులేక చూస్తో నడిచేవా ళ్లున్నారు. ఎంత హాయిగా వుంది వెన్నెల, అనేవా ళ్లున్నారు. వెన్నెలలోని ఆనందాన్ని భరించలేక గీతాల్లోకి ఆ ఆనందాన్ని పొర్లేటట్టు చేసేవా ళ్లున్నారు. ఆ ఆనందం అతీతమై వాళ్లకే తెలీని పిచ్చిబాధలో పడిపొయ్యే ఆత్మ లున్నాయి.

ప్రతిజీవికీ కొంతశక్తి వుంది, కొంతకాలం వుంది. ఈ శక్తినీ కాలాన్నీ ఆనందంలో కూర్చుకొనే తెలివితేటలు లేవు. జీవితము "ఆర్ట్", ఒక కళ. మనము వివేకవంతుల మైతే మనశక్తి నంతా ఆనందంగా మార్చుకోగలం. మనకాలమంతా మన కానంద మిచ్చేటట్టు

చెయ్యగలం. ఈ మహాశక్తి మనమనసులోనే వుంది. ఆశక్తి మనపుటకవల్లనో, సంస్కారం వల్లనో కొంత కలుగుతుంది. కొంత మనకి చిన్నప్పుడు యితరులు నేర్పిన "అలవాట్ల"వల్లా, పెద్దై మనకు మన మిచ్చుకొనే శిక్షణవల్లా యేర్పడుతుంది.

లోకంలో మొత్తానికి యెవరు ఆనందవంతులుగ కనబడుతున్నా రంటే, వాటిస్వభావాలకీ, గుణాలకీ వేటివేటిమధ్య వున్నారో ఆపరిస్థితులకీ సమత్వం కలిగించుకున్నవాళ్లు. చాపలు ఎంతమంది మందిరాల్లో వుంటే యేంలాభం? ఏనుగులు సముద్రాలమధ్య తెల్లని యిసుకల్లో పడుకుంటే యేంసౌఖ్యం? తక్కువస్థితిలో వున్నా ఎక్కువస్థితిలో వున్నా, సరిపోవాలి—లోకానికీ వ్యక్తికీ సంధి కుదరాలి. వ్యక్తిలోని శక్తులన్నీ చక్కగా వినియోగమయే పరిస్థితులు వుండాలి. చిత్రకారుని చిత్రించవొద్దని ఆజ్ఞపెట్టి మహారాజుగా చేసినా అతనికి తృప్తి వుండదు. తనకళకోసం బాధలోనే వుంటాడు.

లోకంలో అనేకవిధాలైన ప్రాణు లున్నాయి. కంటి కగపడని సూక్ష్మజీవులనించి మనుషులవరకు—అనేకస్థితులతో,"ప్లేన్సు"లో బ్రతికేవి వున్నాయి. వేటిగుణాలు, ఆకారం, కష్టాలు, ఆనందం, ఇంద్రియాలు, బుద్ధి వాటివే. కీటకాల్లో అనేకరకాలు; పక్షుల్లో—చేపల్లో—జంతువుల్లో—అనేకభేదా లున్నాయి. అట్లానే మనుష్యుల్లోనూ వున్నాయి. దేశంవల్ల, రేస్ వల్ల, పరిస్థితులవల్ల కలిగే భేదాలు గాక మనిషికి మనిషికి ముఖంలో—కంఠంలో—దేహాకారంలో—రేఖలలో—గుణాలలో—రుచులలో, భేదా లున్నాయి. ఈభేదాల్ని మతప్రవక్తలూ, నీతిప్రవక్తలూ ఒప్పుకోరు. సర్వమానవులకు ఒకటే మతవిశ్వాసమూ, ఒకటే నీతి చట్టమూ విధిస్తారు. ఒకరికి కుదిరిన మందు యింకోరికి కుదురుతుందనీ, ఒకరికి ఆనంద మిచ్చిన విషయం యింకోరికి ఆనంద మిచ్చితీరాలనీ మూఢాభిప్రాయం ప్రజల నింకా వదలలేదు. అసంఖ్యాకాలయిన ఆనందాల్నీ, సౌందర్యాలనీ, అభిరుచుల్నీ ఏర్పరచిన సృష్టి కొల్లబోలేదు: వాటి నన్నిటిని వివిధరీతుల అనుభవించేందుకే వివిధాలైన స్వభావాలను యేర్పరచింది. ఏకత్వం, సమానత్వం సృష్టిసూత్రానికే విరుద్ధము.

ఒకకాలంలో దేశాలకీ సంఘాలకీ సరిపడిన నీతీ, ఆచారమూ ఇంకోకాలంలో కూడా సరిపడి తీరాలనీ, ఒకదేశానికి, ఒకజాతికి అనుకూలించిన పరిస్థితులు ఇంకోదేశానికీ, జాతికీ అనుకూలించాలనీ వాదించేవారు అనేకులు. ఎట్లా మనిషిమనిషికి రూపమూ బుద్ధీ మారుతుందో అట్లానే వారిస్వభావాన్ని, సంస్కారాన్ని, బుద్ధిని బట్టి నీతీ, ఆనందమూ మారతాయంటే సనేమి అంగీకరించరు.

ఈ మతసిద్ధాంతులూ, నీతి ప్రవక్తలూ,

రోడ్డుమూలలనించి వుపన్యాసాలిచ్చే దేవభృత్యులూ, ఎవరికి తోచినట్టు వారు యీ బాధ లన్నీ తప్పించుకుని ఆనందపడేవిధాలు ప్రకటిస్తో వుంటారు.

"సత్యం చెప్పండి, బాధలన్నీపోతాయి." "నాగేశాల్ని చదవండి." "క్రీస్తుని నమ్మండి." "యోగం చెయ్యండి." "తొట్టికవైద్యం." "కారుకూటిపసిగిరెల్లు." "చచ్చినవారితో సంభాషణ." "అపక్వాహారం." "సర్వభ్రాతృత్వం—ఆలయసూనలు—స్వరాజ్యం—లైబ్రరీలు"—యిట్లాంటివాటిద్వారా వేవేల చిరతరానందాన్ని ప్రపంచాలకి ప్రకటిస్తున్నారు.

ఇవన్నీకూడా ఆనందాన్ని యిచ్చేమాట నిజమే కాని కొన్నికొన్ని కొందరికి మాత్రమే యిస్తాయి. కాకి చచ్చినయెలకని తింటే ఆనందమని చనుక్కి చెప్పి, చేప నీటిలో యీదమని నక్కకి చెప్పిన ట్లుంటుంది. ప్రతివాడూ తనకానందానికీ తనస్వభావానికీ సరిపడే ఆనందం కావాలో అది కనుక్కోవాలి. ఆస్వభావంకు ఆఆనందంవేప్పు యీడుస్తుంది. కాని యీ ప్రకటనలను చూచి మోసపోతారు. ఈ ప్రకటనల్లో ముఖ్యమైనవి శాస్త్రాలు, సిత్రాలు, ఆచారం, ధనము, అధికారం మొదలైన భ్రాంతులు. ఒక యోగి వొచ్చి ఆసనము చూప గానే అందరు ఆసనాలు ప్రారంభిస్తారు. పండితుడు వొచ్చి బుర్ర గోకగించ మనగానే గోరి గిస్తారు. శాంతి లేక కొట్టుకొనే ధనవంతుడు భార్య కావాలని యేడ్చి, పెళ్లి చేసుకుని ఎందుకు చేసుకున్నానని యేడుస్తాడు. పిల్లలు లేరని యేడ్చేవాళ్లు, ఉద్యోగం చేస్తో ఎప్పుడూ నవ్వని దురదృష్టవంతుడు, ప్లీడరై కవులవెంట పరుగులెత్తే రసికుడు, పెళ్లి చేసుకుని సమ్మ కంగా నిలవలేని స్త్రీ, చదువుకుని ఆరోగ్యం పోగొట్టుకున్న రోగి, కథలు చదివి సినీమాలు చూసి భ్రమసి యిల్లు వొదిలి పరిగెత్తి తిరిగి వొచ్చిన భోగి—అంగదూ, యిట్లాంటి మూర్ఖులు—తమ ఆనందా తెలీక మాటలు నమ్మి మోసపోయిన దౌర్భాగ్యులు. తనకు లేనివొస్తువ ఆనందం యిస్తుం దనుకోడం యీ భ్రమలలో ముఖ్యమైనది.

"ఈ పెళ్లి నరకంరా" అని యెంతమంది యెన్నివిధాల చెప్పినా బాలబ్రహ్మచారి నమ్మడు. నీ పెళ్లాన్ని వదలవేం అంటాడు. "ధనంవల్ల సౌఖ్యం లేదు" అని ధనికు డెంత అరిచినా బీదవాడు నమ్మడు. ధనమంతా నా కియ్యవేం?—అంటాడు. ఆ పెళ్లాన్నీ ధనాన్నీ వొదిలే ఆత్మబలం వాళ్లకి లేదనేసంగతి వీళ్లకి తెలీదు.

కొందరికి దేశవిప్లవం, కొందరికి తిండి, కొందరికి ప్రేమ, కవిత్వం, తగాదాలు,—నిద్ర,—యిట్లా అనేక ఆనందా లున్నాయి—తత్వాన్నిపట్టి మారుతో. ఎవరు చెప్పిన మాటా వినకండా, తన స్వభావాన్నీ యిన్‌స్టింక్టునీ నమ్ముకుంటే, యే మనిషికి అతని ఆనంద మెందో స్పష్టమౌతుంది—యే మృగానికి దాని ఆహార మెదో అర్థమైనట్టు. కాని

యీ మనుషుల్లో జన్మమంతా మాంసము తినే ఆవులూ, గడ్డి మేసే సింహాలూ వున్నాయి— పైగా అజీర్ణ మెందుకా అని ఆవు అనేకరకాలమాంసం రుచిచూస్తుంది, సింహం రకరకాల గడ్డి తెప్పించుకుని మేస్తుంది. కాని ఆ గడ్డిని ఇదీ మాంసాన్ని అదీ వొదిలే తెలివితేటలు గాని ధైర్యం గాని శక్తి గాని వాటికి వుండవు.

కవిత్వం చదివి, "ఆహా, సూర్యాస్తమయం ఎంత అందమైనది! నేను చూడనే లేదే" అని వొకడు సాయంత్రం గోదావరిగట్టున కూచుంటే, ఆ ఆనందం వొస్తుందా? ఆవడలో, యింటితగాదాలో, సినీమాకథో, ఎదో తలచుకుంటో కూచుంటాడు అంతసేపూ!

అట్లానే కొందరికి త్యాగం ఆనందం యిస్తుంది——కొన్ని పరిస్థితులలో. కాని ప్రతి వుపన్యాసకుడూ, గ్రంథకర్తా త్యాగం చెయ్యమనేవాడే—కవిత్వానికనీ, సత్రానికనీ, కొడుకు పెళ్లికనీ, దేశానికనీ, పత్రిక్కి చందాకనీ. త్యాగంవల్ల ఆనందం వొస్తుం దనుకుంటారు. ఆనందంవల్ల త్యాగం కావాలి. అందరి స్వభావాలకూ ఒకేవిధమైన త్యాగం పనికిరాదు. ఏ స్వభావానికి ఏ విధమైన త్యాగం ఆనంద మిస్తుందో అదే అవసరమూ, ఆరోగ్యమూ. కొందరికి అసలు త్యాగమే పనికిరాదు. చాలమంది త్యాగాలు ఏడుస్తో చేస్తారు. మతమూ, ధర్మమూ, 'డ్యూటీ' అని పేర్లు పెట్టి త్యాగాలు చేస్తారు. సాధారణంగా భార్యలూ, తల్లులూ చేసే త్యాగాలన్నీ యిట్లాంటివే. ఎవరి కేత్యాగం అవసరమో అది వాళ్ల ఆనందమే నిర్ణయించాలి. ఒక స్త్రీ తన భర్తని వొదిలి, పిల్లని వొదిలి, ప్రియుడివెంట వెడుతుంది. ఇంకో స్త్రీ పనికిమాలిన భర్తకోసం ప్రియుణ్ణి, లోకాన్ని, పిల్లల్ని వొదులుకుంటుంది. ఇంకో ఆమె బిడ్డకోసం భర్తనీ, సంఘాన్నీ, నీతినీ వొదులుతుంది. వీటిల్లో సంఘానికి నచ్చినవి మెచ్చుకుంటారు. తక్కినవాటిని ఖండిస్తారు. కాని ఏది ధర్మమో ఎవరికి వారు నిర్ణయించుకోవలసిందే గాని మనుషులు గాని, శాస్త్రాలు గాని నిర్ణయించలేవు.

దేశానికి ప్రతివాడూ త్యాగం చెయ్యాలని ఉంటారు. అక్కర్లేదంటే తిడతారు. ఎవరి హృదయం దేశభక్తితో పరవశ మౌతుందో వాళ్లసర్వమూ త్యాగం చెయ్యనే చేస్తారు. ఇది మన ధర్మం కనక చెయ్యాలి అనే ప్రసక్తే వుండదు. "ఇది నా ధర్మం" అనుకునేటప్పటికే, ఇతరులు విధించిన ధర్మమని వ్యక్తమౌతుంది. అట్లా దేశభక్తివల్ల ఆనందం రానివాళ్లు ధర్మమనీ, కీర్తికనీ, పక్కవాడు చేశాడనీ, చాలమంది చేశారు, త్వరలోనే చింతించారు. వారి స్వభావం ఆత్యాగానికి తగినది కాదు గనక.

సుఖమూ, బాధా పరిస్థితులు తెచ్చిపెడుతో వుంటాయి. చాలామంది ఏమీ ఆలోచించకుండా అనుభవిస్తో బతుకుతారు. తా మెంతవరకు 'ధలకు కారణమో,

తప్పించుకోడానికి తమ ప్రయత్న మెంతవరకు వుపయోగపడుతుందో, యోచించరు. కర్మ లోను, జ్యోతిషంలోనూ నమ్మకం యీ నిద్రకు తోడ్పడి, జోల పాడుతుంది.

జీవితంలో సంతోషం లేనప్పుడు కొత్త సంతోషాలు కల్పించుకోగలం. బాధలు తటస్థించినపుడు నిగ్రహించుకోగలం. బాధని యెదిరించి పోట్లాడితే చాలావరకు లోబడు తుంది. కాని ఆ జ్ఞానమూ శక్తీ చాలా కొద్దిమందికే వుంది.

లోకం సౌందర్యాన్ని కల్పిస్తుంది. కాని అనుభవించమని బలవంతపెట్టగలదా? అట్లానే జీవితం, కష్టాల్ని కల్పిస్తుంది. కాని అనుభవించమని బలవంతపెట్టలేదు.

వెయ్యికి తొమ్మిదివందల తొంభై మందికి ప్రత్యేకంగా ఏదో అంతరాని ఆనందాన్ని సాధించాలనే 'అర్జి' వుండదు. ఇంకా మృగాల స్థితిలోనే వున్నారు. సుఖంగా తినడమూ, కనడమూ, చావడమూ వాళ్లు చెయ్యవలసినదల్లా. అదే వాళ్ల ఆనందం. కాని ఆ సంగతి గమనించరు. ఘనకార్యాలు చేసినవాళ్లసంగతి వినీ, కనీ, చదివీ, తమకు లేనికష్టాలు వున్నా యనుకుని వారి ననుకరించబోతారు. నరకం, స్వర్గం సంగతులు విని, భయపడి, ఆశపడి భక్తినీ, వైరాగ్యాన్నీ నటిస్తారు. దానివల్ల బాధలు అప్పులు రోగాలు యిన్ని పడతారు. ఎంత తన కున్నా, శాస్త్రాలు ఎంత ఘోషించినా, ఎన్ని తత్వాలు పాడినా, ఎందరూ విరాగులూ కారు, ధర్మాత్ములూ కారు: ఆ పాడేవారికీ తెలుసు. "ఎన్నాళ్లీ ముచ్చటలు— తనువులు శాశ్వతమా" అని పాడి విరక్తి పుట్టిస్తాడు. కాని ఒక్క గుప్పెడు బియ్యం మీదో, ఒక్క కానీ మీదో మనకి విరక్తి కలిగితే చాలు ఆపూటకి, పాడికి తృప్తి.

తమ జీవితంలో ఆనందం ఎట్లా కలుగుతుందో తెలిసినా ఆ ఆనందంకోసమే ప్రయ త్నం చేసి ఆటంకాలను వొదుల్చుకునేవాళ్లు చాలా కొద్దిమంది. ప్రతి పనివిషయమై కూడా "ఇది నా ఆత్మకి ఆరోగ్యమా కాదా? నాకు లభ్యమైన కాలాన్నీ, శక్తినీ, ధనాన్నీ ఆనందరూపంగా మారుస్తున్నానా లేదా?" అని విమర్శించరు. మొహమాటం, ప్రతిష్టా, భేషజం, కపటమూ యిన్ని అడ్డం వొస్తాయి.

వొంటినిండా చీముతో, చెయ్యి యెత్తలేక వొణికేవాడికి కానీ యివ్వము, మనకి అక్కర్లేని పత్రికకి చందాగా అప్పుడే యింకోడు నాలుగు రూపాయిలు పట్టుకుపోతాడు.

మనం మీటింగులకి ప్రెసిడెంట్లుగా వుండడం, అనుష్టించే కర్మకలాపాలు, తగా దాలు, అన్నీ ఏమాత్రమైనా ఆరోగ్యాన్ని యిస్తాయా? ఉత్తరలోకంలో నమ్మకం లేనివాడు బ్రాహ్మలకాళ్లు కడిగి తద్దినం పెడతాడు—బ్రాహ్మణ్ణి తిట్టే కమ్మబ్రాహ్మణ్ణి పూజ్చేసి దక్షిణ లిస్తాడు.

# ఆనందం

మన వేషం, బట్టలు, జుట్టు, తిండి, మనం పెట్టే భోజనాలు, ఆడేమాటలు, అన్నీ ఏమీ ఆనందం యివ్వని శుష్కమైన ప్రదర్శనాలు—ఎన్ని! జీవన మంతా వాటితోనే వృథాగా గడిచిపోతుంది. మనకి ఆనందం యిచ్చేవాటిని అనుభవించడానికి జంకుతాము—ఎవరు చూస్తున్నారో అనే భయంతో, చక్కని మనిషి నడుస్తోవుంటే తేరి చూడ్డానికి భయం—బోగమాట చూడ్డానికి భయం—బట్టలేని బొమ్మలూ, వెంకటచలంగారి కథలూ ఇవన్నీ రహస్యంగా ఆనందిస్తాము.

ఇట్లా ఏళ్లకి ఏళ్లు గడిచిపోతాయి. మనకి ఆనందం వుందని యితరులు అనుకోడానికి ఆనందాన్ని ధారపోస్తాము. మనము కట్టే డాబైన యిళ్లు, మోసే బంగారునగలు, చేసే గొప్ప పెళ్లిళ్లు, ఖర్చులు, కష్టాలు, ఏడిపించుకు తినే అల్లుళ్లు—అన్నీ ఒక్కరవ్వ ఆనందాన్ని యివ్వవు. కొడుకుని ద్వేషిస్తాము; వొదిలే ధైర్యం లేదు. భార్యలు భర్తల్ని, భర్తలు భార్యల్ని వొదిలే ధైర్యం లేదు. ఇష్టం లేనివాడు వొస్తే వొద్దని చెప్పే ధైర్యం లేదు.

నీ జీవచరితం దేనికై, ఏ ఆనందానికై, ఏర్పడిందో చూడు. ఆ ఆనందం నీతి గానీ కాకపోనీ, ధర్మం కానీ అధర్మం కానీ, ఉన్నతం కానీ కాకపోనీ,—అన్నిటినీ—బంధువుల్ని, కులాన్ని, నీతిని, చివరకి నీ సౌఖ్యాన్ని అన్నిటిని త్యజించి అవసరమైతే ఆ అధర్మాన్ని ఆశ్రయించు. ఆ ప్రయత్నమే, ఆ కష్టమే, ఆ రాపిడే, ఆత్మకి ఆనందాన్ని యిస్తుంది. నీ ఆత్మలో కొత్త విస్తీర్ణం, నీ కళ్లముందు కొత్తలోకాలు వెలుగుతాయి. తప్పు గాని, ఒప్పు గాని, వెనక ముందు చూడకు. తప్పైతే దిద్దుకోడానికి చాలాకాల ముంది. వెనకముందులు యోచించే చచ్చుబతుకుకంటె ధీరత్వంతో ముందుకు సాగి గోతిలో పడేవాడికి యెక్కడి ఆనంద ముంది యీ లోకంలో.

ఈ ఆనందాల్లో డిగ్రీ లున్నాయి. పేడ తింటో సుఖించే పురుగూ, కాంతిలో ఎగురుతో అరిగే చిలకా, డబ్బు లెక్కపెడుతో తన్మయంలో పడే పిసినారీ, దేశంకోసం గుండు దెబ్బ దిని చస్తో ధన్యు ణ్ణనుకున్న యోధుడూ, స్త్రీబొమ్మను చెక్కి తను కల్పించిన ఆనందాన్ని తాను చూసి మూర్ఛిల్లే శిల్పీ, అనంతవిశ్వంతో తన ఆత్మని కలిపి సర్వజీవుల సుఖదుఃఖాలు తనలో అనుభవింపగల యోగీ, అందరూ ఆనందాన్నే అనుభవిస్తున్నారు. కాని అన్నీ ఒకటే డిగ్రీలోవి కావు. లోకం చూసిన కొద్దీ యీ అనుభవం విషయంలో కూడా 'లైఫ్' (life) లో గొప్ప 'ఎవల్యూషణ్' కలుగుతున్నట్టు తోస్తుంది.

కొత్త ఆనందాలనూ, సగంసగం తోచి తా మందుకోలేని సౌందర్యాలనూ, అనుభవించే విధం తెలీక తపనపడి జీవులు తమ ఇంద్రియాలశక్తిని మార్చుకోవాలని ఒకరూపం వించి యింకోరూపం పొందుతున్నట్టు తోస్తుంది. రెక్కలపురుగు యింకా విస్తీర్ణతను

కోరికోరి చిలక కావచ్చు. పిల్లి యింకా బలాన్నీ, గంభీరాన్నీ కోరి సింహం కావొచ్చు. అట్లానే ఒకడు తనలో లేని శక్తుల్ని కోరికోరి ఏ జన్మలో నైతే నేం, ఏ లోకంలో ఐతే నేం, పాటకుడూ, వస్తాదూ, యోగీ, లేక కిన్నరుడూ, రాక్షసుడూ, గా మారవొచ్చు. అట్లాంటి మార్పు రాకపోతే, నాహృదయంలో చూచాయగా తోచే యీ ఉన్నతాసంచాలూ, నేను కలలుగనే యీ లోకాలకి సంబంధించని సౌందర్యాలూ, నేను పొందాలని కోరే మానవాతీతమైన శక్తులూ, యివన్నీ అర్థవిహీన మౌతాయి. భోజనమూ, ఆరోగ్యమూ, ధనమూ వుండి కూడా ఆత్మలు ఎందు కిట్లా తమకే తెలీని ఆరాటాలలో బాధపడాలి? పాకేపిల్ల ఎన్నిసార్లు పడి దెబ్బలు తగిలినా నడవాలని ఎందుకు ప్రయత్నం చెయ్యాలి? అదే ననుకుంటా, యీ సృష్టిసూత్రం, మనం అందుకోగలిగినంతవరకు.

"నీ కిం కేం కావాలి, ఎందు కట్లా వెతుకుతా" వంటారు మిత్రులు.

"కారణం లేని యీఆరాటం—యీసృష్టికి, అర్థ మేమిటి, నీతి ఏమిటి, పాప మేమిటి, నేను నమ్మేవి చేసేవి సత్యమా—అనేమీమాంస; కొత్తసౌందర్యాలకోసం, ఎండమావుల కోసంవలె, రెప్ప లార్చుకుంటో పరుగులు; మనకి కానిది, మన మందుకో లేనిది, మనము miss అయింది, ఎంతో లోకం, ఎంత జీవితం, కాలం, అందం, వృథాపోతుం దనే దిగులు;—ఇవేమీ లేకండా, తక్కినవారివలె బతికి కూడోకూడదా?" అని అడుగుతుంది శ్రమపడ్డ ఆత్మ.

కాని యేం లాభం? ఎందు కావిధంగా ఆ రెక్కలు కొట్టుకుంటో పరుగులెత్తుతావు?, నేను నీకు పళ్లు పెడతాను, ఆడచిలకని తెస్తాను, నాయింటో వుండ మని చిలక నడిగి ఏం లాభం?

# ట్రాజడీ

పి. వి. రాజమన్నారు

సహృదయహృదయాహ్లాదకరమైనది సత్కావ్యమని అంగీకరిస్తారు విబుధు లందరు. అందుచేత ఆగుణం ఏకావ్యంలో కనపడినా ఆకావ్యానికి గౌరవం ఇవ్వాలి. అలాగే కావ్యరూపాల్లో ఏరూపమైనా ఆగుణానికి అవకాశం ఇచ్చేటట్టి దైతే దాన్ని కేవలం నవీన మని గర్హించడం సమంజసం కాదు. సహృదయులు మనదేశంలోనే కాక ఇతర దేశాల్లో కూడా ఉంటారనే అభిప్రాయంతో ఇతర వాఙ్మయాలను పరికిస్తే అనేక నూతనకావ్య స్వరూపాలు కనబడక మానవు. మనవాఙ్మయంలో లేని రూపాలు రసోత్కర్షకు అను గుణంగా ఉండేవి మనము గ్రహించడంవల్ల మనవాఙ్మయము పుష్టి అవుతుంది కాని ఎన్నటికిని క్షీణింపదు.

అట్టి నూతనకావ్యరూపాల్లో ఒకటి 'ట్రాజడీ'. ఏదో నిదర్శనంగా భాసమహా కవి "ఊరుభంగము" ఉన్నప్పటికీ నిజంగా మన పూర్వనాటకపరిణామములో 'ట్రాజడీ'కి స్థానం లేదనే చెప్పాలి. నాటకం మంగళాంతంగా ఉండవలెనన్న సంప్రదాయంచేతనో, విలాసార్థంగా విలోకించు చుండిన రాజపోషకులకు నచ్చకుండుటచేతనో, మరి ఏకారణము చేతనో చెప్పలేము. అయితే పాశ్చాత్యవాఙ్మయాల్లో మాత్రం ఈరూపానికి అత్యున్నత స్థానం ఇచ్చారు.

♦ ♦ ♦ ♦

ట్రాజడీలక్షణా లేవి అన్నప్రశ్నకు ప్రత్యుత్తరం సూక్ష్మంగా ఇవ్వడానికి వీలుకాదు. సంస్కృతంలో అలంకారశాస్త్రాల్లో ప్రతిరూపకభేదానికి లక్షణాలు స్పష్టంగా వర్ణింపబడి ఉంటవి. అట్టిగ్రంథాలు పాశ్చాత్యభాషల్లో అరుదు. ఏవో కొన్ని ఉన్నప్పటికి వాటిని ప్రమాణపదముగ భావించి అందులోని లక్షణాలను అతిక్రమించకపోవడం సంభవించదు. అరిస్టాటల్‌వంటి విబుధులు నిర్ణయించిన నియమాలకు గౌరవము ఒసగినప్పటికిన్నీ అనేక మహాకవులు వాటిని పూర్తిగా నిరాకరించిరి. పాశ్చాత్యనాటకచరిత్రలో బాగా విదిత మయ్యే అంశం ఏమిటంటే—కావ్యాల ననుసరించి లక్షణగ్రంథాలు వ్రాయబడతవి గాని లక్షణగ్రంథాల ననుసరించి కావ్యాలు వ్రాయబడవు. స్వతంత్రప్రతిభయే పాశ్చాత్య నాటకవైభవానికి జీవాధారము గాని పూర్వలక్షణపరిపాలన కాదు. ఈకారణముచేత 'ట్రాజడీ' అనే ఒక్కనాటకరూపంలోనే వివిధభిన్నరీతులు కనబడుచున్నవి. పురాతన గ్రీకుట్రాజడీలకున్నూ మధ్యయుగమునందలి షేక్స్పియర్ ట్రాజడీలకున్నూ, ఇబ్సన్ మొద లగు నవీనుల ట్రాజడీలకున్నూ అనేకవిషయాల్లో భేదాలు కనబడుచున్నవి. అయినప్పటికి

సామాన్యగుణాలు, ముఖ్యలక్షణాలు, ప్రధానాంశాలు కొన్ని ఉండక మానవు గదా. వాటిని విపులంగా వర్ణించడానికి పూనుకోనక, స్పష్టంగా సూచించడానికి ప్రయత్నిస్తాను ఇప్పుడు.

'ట్రాజడీ' అన్నపదాన్ని తెలుగులో 'విషాదాంతనాటకం' అని తర్జుమాచేస్తున్నాము. 'ట్రాజడీ' అనేపదం వ్యుత్పత్తి దానిలక్షణాలను విదితంచెయ్యగల గాని తెలుగు పదం మాత్రం దానిరూపాన్ని కొంత నిరూపిస్తున్నది. అనగా, అంతంలో విషాదముగల నాటకం ట్రాజడీ అని స్ఫురిస్తుంది. ఈ నామధేయం ఎలా సార్థకమో చూతాము. "విషాదము" అంటే సరిపోదు. విషాదం ఎవరికి? నాటకంలోని పాత్రలకా, సభలోని సామాజికులకా? నాటకంలోని పాత్రల కంటే—ఎట్టిపాత్ర కైనా సరేనా? విషాదం ఎన్నో కారణాలవల్ల కలుగవచ్చును గదా, ఏకారణ మైనా యుక్తమేనా, కాక కొన్ని [illegible] రసాశ్రయంగా ఉండుటచే ఉచితములుగా గణింపబడునా?... లేక, సభ్యుల కంటెనా,—వారు అనుభవించు విషాదము లోకసాధారణమైనదా—భిన్నమా? నిజంగా విషాదప్రతిపాదకమైన కృతికి కళాప్రపంచంలో చేరడానికి అర్హత ఉంటుందా?—అని ఇత్యాది ప్రశ్నలు అనేకములు బయలుదేరుతవి.

సర్వకాల సర్వదేశ సర్వపరిస్థితులందును లలితకళలు ఆనందదాయకములే. ఆస్వాదించే ఇంద్రియములలో భేద మున్నప్పటికీ, జనించే భావాల్లో భేదా లున్నప్పటికీ కళాప్రపంచానికి చెందిన కృతికి—పాట కానిండు, కావ్యం కానిండు, పటము కానిండు—ఆహ్లాదకరత్వము సామాన్యలక్షణము. ఇది సర్వజనీనమై సర్వసమ్మతమైన సంగతి. అందుచేత విషాదకరత్వం గుణంగా గలకృతి కళాప్రపంచానికి చెందజాలదు. అయితే 'ట్రాజడీ' నిస్సంశయంగా కళాప్రపంచంలో ఉచ్చస్థానాన్ని అలంకరిస్తున్నది. ఈసమస్యకేమి సమాధానం? ఆలోచిస్తే స్ఫురిస్తుంది. ప్రదర్శింపబడే వస్తువు ఎట్టిదైనప్పటికీ, పోషింపబడే రసము ఏదైనప్పటికీ నాటకం మంచిదైతే సభ్యులు ఆనందమే అనుభవిస్తారు. కనుక, 'విషాదాంత' మనడంలో విషాదమే ఆఖరున అనుభవిస్తారని అన్వయించుకోవటం తప్పు. ప్రదర్శింపబడునది విషాదము. సభ్యు లనుభవించునది ఆనందము. అనగా ట్రాజడీ విషాదాంతమైనా ఆనందదాయకమే. ఇది నిర్వివాదాంశము.

అయితే, రంగముమీద ప్రదర్శింపబడే వస్తువు, కథాసంవిధానము, ఏవిధంగా విషాదకర మైనప్పటికీ కళాపరమైన ఆహ్లాదానికి కారక మవుతుందా? మరిన్ని, నాటకంలో ఏపాత్రకు విషాదం సంప్రాప్తించినా సమానమేనా? కాదు.

మరణం విషాదకరమైనదే. అయినా నాటకాంతంలో తొంభైయేళ్ల వృద్ధుడు పుత్రపౌత్రాదులు చుట్టూ చేరి కొలుస్తూఉంటే, పరంపదించడం ప్రదర్శిస్తే విషాదకరంగా

ఉంటుందా? బందిపోటుదొంగ గోడ దూకి కాలు జారి మెడ విరిగి చస్తే విషాదరసం ఉప్ప తిల్లుతుందా? ఇలాగే ఉదాహరణాలు ఊహించుకోవచ్చు.

కానీ, రసపోషణకు యుక్తమైన విషాదకారణాల జాబితా తయారు చేశారా ఎవరైనా అని ప్రశ్నించకండి. అలా చెయ్యడం అసాధ్యం. అలా చేసి అందులోవి తప్ప మరెవ్వీ ఉపయోగించకూడదని చట్టం ఏర్పరచడం అక్రమం. క్రొత్తక్రొత్త కారణాలు, భావాలు, సంఘటనలు, స్పర్ధలు, సమస్యలు చమత్కారంగా అల్లి రసము చిప్పిల్ల చేయ గలవారు మహాకవులు. వారు నిరంకుశులు. ఒక్క షేక్స్పియర్ నాటకాలని నిదర్శనంగా తీసుకొని చూస్తే తెలుస్తుంది, స్వప్రతిభ ప్రకటించడానికి ఎంత అవకాశం ఉంటుందో.

ఇక ట్రాజడీ తత్వాన్ని నాకు తోచినరీతిని పర్షించడానికి యత్నిస్తాను. ట్రాజడీవల్ల కలిగే ఆనందానుభవానికి మూలము కరుణరస నిష్పత్తి. అథవా కొన్నిసమయములలో శాంతరస నిష్పత్తి. నాటకంలోని పాత్రకు విషాదం సంభవించడంవల్ల కరుణ, శాంత రసాలు నిష్పత్తి అవడానికి ముఖ్యంగా రెండు అంశాలు ఆవశ్యకములు. ఒకటి, ఆపాత్ర యెడల సహృదయులకు సానుభూతి జనింపవలెను. రెండు, సంభవించిన విషాదము లోక న్యాయాదర్శాలకు విరుద్ధంగా కనబడవలెను.

కేవలం సజ్జనులుగా నుండువారు, అనగా నిష్కళంకులు లోకంలో అరుదు. నాటకం లోకవృత్త్యనుకరణమే గనుక నాటకాలలోని పాత్రలును అట్లే. సుగుణ దుర్గుణ సంకలితమగు మానవప్రకృతి ఎన్నికోట్ల రూపములు దాల్చుచున్నదో మన మెరుగుదుము. వీటిలో ఒక ప్రత్యేకరూపమును సృజించి ఆ పాత్రయందు సహృదయుల సానుభూతి కలుగు నట్లు చేయగలశక్తి కవీంద్రులది. అవగుణములు ఎక్కువ యుండినను కొందరియెడ మనకు సానుభూతి జనింపచేయగల శక్తి వారియొద్ద నున్నది. రూపము లనంతములు గనుకనే ప్రతియుగమునను గొప్పనాటకములు రచింపబడుచున్నవి.

పదుగురిచే మంచివా డనిపించుకొన్నవానికి సహితం ఏదో ఒక దుర్గుణం ఉండ వచ్చును. ఆ దుర్గుణంవల్ల ఆతడు దుర్గతికి రావచ్చును. అంతవరకు ధర్మమే, న్యాయమే. కాని తత్కారణంవల్ల లోకాభిప్రాయానికి అతీతమైన కష్టము సంభవించినపుడు లోకా దర్శానికి విరుద్ధ మనిపించును. అన్యాయ మనిపించును. అప్పుడే సాత్త్వికమైన జాలి, కరుణ రసము, ఉద్భవిల్లగలదు. ఒతెల్లోకు ఈర్ష్య అను దుర్గుణ మున్నది, నిజమే. అకారణంగా భార్య పాతివ్రత్యాన్ని సంశయించాడు. అయినా అంత మాత్రానికి స్త్రీహత్య, ఆత్మహత్య వంటి ఘోరవిపత్తులకు పాలవడం ధర్మవిరుద్ధంగానే కనబడుతుంది. ఇది ఒక తీరు.

కొందరు మహాకవులు తమ ట్రాజడీలలో ధర్మవిరుద్ధమైన విషాదం ఇంకొక తీరుగా ప్రదర్శించారు. అకారణంగా—అనగా మనుష్యమాత్రులు ఊహింపగల కారణం లేకుండా—మానవులు దుఃఖ మనుభవించడం చిత్రించి కరుణతో గూడా శాంతరసమును పోషించి యున్నారు. ఈ శాంతరసము లోకవిముఖత్వము, ఐహికవిషయ నిరసన—వీటిపై ఆధారపడి ఉంటుంది. సంఘము నెదుర్కొని ప్రవర్తించే సత్పురుషునికి సైతము సంఘ దౌర్జన్యముచే కలుగు కష్టనష్టములు ప్రదర్శించినప్పుడును ఈ రసమే పోషింపబడును. ఇబ్సన్ ట్రాజడీలు కొన్ని ఈ తరగతికి చెందినవి.

ఏవో కొన్ని ఈలాంటివి ముఖ్యాంశాలు సూచించాను గాని భావి నాటకకర్తలకు లక్షణాలను, నిబంధనలను ఎవరు నియమించగలరు? నిరంకుశులు కవులు. ప్రతిభానిష్కరణము స్వతంత్రసిద్ధము. ఉపన్యాసాలకన్నా ఉత్సాహానికే శక్తి. సృష్టి మొదలు; విమర్శ తర్వాత. ఆంధ్రనాటక పరిణామంలో ట్రాజడీ వికసించవలె నంటే పరిషత్తులు తోడు గావు, తీర్మానాలు ఉపకరింపవు. కవీంద్రుల ప్రతిభ—సహృదయుల ఆసక్తి—ఇవియే అవసరములు.

# మాతృభాష

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఎం.ఏ., బి.ఎల్.

సాహితికి అమరత్వము నిచ్చునది సహజభావము. ఇది యాత్మతేజమున వృద్ధినందును. పతితమనసున నవతరించుట కిది సరాసరి తెన్నునే కాంక్షించును. సహజోచ్చారణమే ఈ స్పష్టపథము.

సహజభావ మెందుండునో సహజోచ్చారణమును నందే యుండును. పూవురేఖలు పూవుభాష. పూఁదావి పూవుతలఁపు. చల్లనితలఁపు చక్కనిదళమున నున్నదని భాష్యకారుఁడొకఁడు దాఁపల నిలిచి తెలుపవలెనా? ఒకరివకాలత్తకై ఆశపడక తనమన సిట్టిదని ద్రష్ట హృదయమునకు పువ్వురేఖ తెలిపివేయదా? సహజభావమునుండి సహజభాషను చించివేయు టెవ్వరితరము? ఒక్కండు రెండురీతుల ట్లగపడు అద్భుతము వానియందు లేదా?

పువ్వుకను కలలు పూవుమోమున మంచుతుంపురులందు తళ్ళొత్తును. కవికలలు కవికన్నులందే ఇంద్రధనువులు చిత్రించును. పువ్వుమానసమునుండి వెడలు బుడిబుడినుడులు కేసరములట్లు గోచరించును. సహజసాహితి కుసుమసదృశము. దానిభావము గుప్పున నుప్పొంగును. దాని చక్కఁదనము తావికెరటాలతో లేచు భావవాతూలమై మనసున సోఁకును.

ఒకరి ఉద్బోధము గాని ప్రేరణ గాని లేక పువ్వు ఆత్మవికసన మందును. పుష్ప హృదయమున నిదురించు సొబగు కిరణస్పర్శ నందినంతన లేచి పక్కున నవ్వును. మనుజుని హృదయమందలి సహజశక్తి ప్రకృతిస్పర్శ నంది పుష్పించును. కళలకు ప్రాపు సహజశక్తి. కళాకుశలులు స్వయంభువులు, స్వీయబోధకులు. వీరిలో సాహిత్యోపాసకులు ముఖ్యులు. వీరిభావములు, వీరిభాష వీరికి సహజమై, ప్రత్యేకమై యుండును. వీరిసహజశక్తి వీరిస్వాతంత్ర్యమునకు కన్నతల్లి యగును.

తలఁపునకును, భాషకును అవినాభావసంబంధ మున్నదనియు అంతరంగమందైనను భాషయందే భావము జాలువారు ననియు మనశ్శాస్త్రము వాకొనుచున్నది. తల్లితలఁపులందును తల్లిజీవమందును తొమ్మిదినెలలు పెరిఁగిన శిశువు తల్లికి ప్రతిబింబమై యుండి, జిలిబిలి పలుకులు తల్లియక్కున నేర్చి, తల్లినీడయందే భావిజీవనస్వప్నము లల్లికొనును. సాహిత్యము సహజమై యుండవలెననిన తల్లిమాటయందే అది యవతరింపవలెను. ఆత్మబీజమునుండి యుద్భవించినభావము అంటుమొక్కవలె గుజ్జుగఁ బడియుండక అనంతకాలమునఁ దనశాఖలు

చాఁపుచు అద్భుతవృద్ధి నందును. శతాబ్దులును సహస్రాబ్దులును దీనిశీతలచ్ఛాయయందు ఎంతేని హాయి నందును.

మాతృభాషమహత్త్వమును గుర్తించిన భారతీయులలో మొదటివారు వంగీయులు. ఆంగ్లమందు అభిజ్ఞత సంపాదించి, దానిని వంగమాతృకయందు గుమ్మరించుకొనినారు. పందొమ్మిదవ శతాబ్దమునకు తొలుత తోఁచిన ఆంగ్లకవులు వీరి కెంతేని భావనావేశమును కలిగించిరి.

"ఐరోపాయందు లేటిన్‌భాష గ్రంథభాషగా నున్నపుడు ఐరోపాయందు సాహిత్యవృద్ధి లేదు. ప్రత్యేకభాషలు ప్రత్యేకసాహిత్యమును వృద్ధిచేసినపిదప బహుళసాహిత్యశక్తి నంది ఆఖండ మెంతేని ఉన్నతిని వడసినది. వివిధభాషలతో వెలయు భారతదేశమున నిట్టియభివృద్ధి గోచరించునుగాక. యావద్భారతమున కొక్కభాష యనునాశయందు నాకు నమ్మకము లేదు. రాజకీయముగ నట్టి దొకటి అవసరమై యుండవచ్చును. భావవ్యక్తీకరణమునకు సహజమైనభాష మాతృభాషయే. ఆంగ్లమున పద్యము లల్లి, అభిప్రాయమునకై అపుడపుడు కొందఱు తమరచనలను నా కంపుచుందురు. వీరు ఒక్క మద్రాసురాజధానిలోనివారే. వీరు మాతృభాషలోనే తమ గ్రంథములు వ్రాసి స్వీయప్రజల తీర్మానము నందుట మేలు. వీరిభాషయందు గొప్పందన ముండుచో దానిని నేర్చికొనియో భాషాంతరీకరణములందు దానిసత్తువను గ్రహించియో ఒరు లానందింతురు. అమూల్యనిక్షేపము గలిగిన దయ్యు వాడుకమాట కాని సంస్కృతము నేఁడు మనకు సాహిత్యోచ్చారణము కాఁజాలదు. ఇంగ్లీషును తొలుత చేఁబట్టినది మేము. అందలిశక్తి నెఱిఁగి మాభాషను వృద్ధిచేసికొంటిమి. ప్రపంచమహాసాహిత్యములలో వంగసాహితి ఒక్కటైనది." అని రవీంద్రుఁ డిటీవల మేరీకళాశాలయందు (ఈ యంశములు పత్రికలలో వెలువడలేదు) తెలిపినాఁడు. ఇట్టి యుద్బోధనమును రవీంద్రుఁడు పెక్కేండ్లనుండి పెక్కుచోటులందు చేయుచున్నాఁడు.* రవీంద్రునినుడువులను ప్రతిదక్షిణసీమస్థుఁడును మననముచేసికొనవలెను. మన

* సింహళవాసుల నుద్దేశించి రవీంద్రుఁ డిట్లనినాడు:"... You have not yet been inevitably urged to take up that living instrument, your own language. You have not yet fully strung her and tuned her. You would have surely felt the necessity of it, if your soul were fully awake and if it responded to the ceaseless messages of beauty that come to you from your horizon and blessings that meet you from the bosom of your earth. You indulge in the vanity of mastering a language which is not of your heart and of your birth-right, which does not belong to your past nor to your future and owing to that obsession in her children, your country is waiting in vain for her wealth of literature which only can help her to discover her own

రాజధానిలో నేఁడు సాహిత్యమే లేదను భావము ఆతని హృదయమున తలసూపెనని తెలిపిన తప్పు కాదని తలఁతును. మాతృభాషకు మనము పెక్కుఆమడలదూరమం దుంటి మని ఆతఁడు గ్రహించినాఁడు.

భాషావిషయకప్రసంగము సలుపుచు ఆంధ్రదేశమందలి ఒకానొకచోటును పేర్కొని అందు సాహిత్యవాతావరణము లేదని నే ననినపుడు, "కోథాయ్ ఆఛె?" ("ఎందున్నది?") అని రవీంద్రుఁ డనినాఁడు. "అది హృదయమందుండవలెను.—మీమాటయం దడఁగియున్న

soul and to bring out the treasure lying hidden in the lightless corner of her mind......I hope that my coming to your country will not end in an ephemeral sensationalism, that even when I leave your shore the memory of it will speak to you about the greatest of your problems, which is that of finding your own true voice—not that of your master—in your own language. In order to justify your existence, you must make yourself heard to your own self and to others. Do not waste your time and intellect in carefully imitating other people, however great they may be, imitating their idioms and being utterly lost in a vagueness of futile inanity. I shall consider myself as having failed in my message if I have not sufficiently impressed you with the truism that you cannot belong to yourself if you do not produce your own literature as the truest document of the mastery of your mind, and also if I have not persuaded you to believe that you must have a continental background of your culture, which is the Indian background that will vitalize your thoughts and enrich your imagination." సింధు రాష్ట్రీయులను గుఱించి ఆతఁ డిట్లు తెలిపినాఁడు:"...... Modern Sind has contributed so little to the cultural renaissance that is sweeping over India to-day. This poverty is traceable, it seems to me, to the Sindhees looking for inspiration where only demoralization is to be had. Sindhees are under the shadow of a cheap, foreign, imported culture. It is a sight at once ludicrous and pathetic to see their young men strutting about in foreign dresses, muttering foreign accents, imitating foreign gestures. We in Bengal were the first to come under the foreign fascination, but we soon strove to free ourselves and in the process of refinding ourselves, we released forces which have given us a new pride, entirely our own. *We may learn from other people but we can get inspiration only from within ourselves.* My advice to modern Sindhees is to remember and by remembering to recapture the glory that once flourished on the banks of the Indus. Let them be themselves true to life that has nourished them for centuries and their old glory will blossom again."

చెన్నపురియందున్న పదమూఁడుదినములలో దాక్షిణాత్యుల కీపాఠము నాతఁడు పలుమాఱు ఉద్బోధించినాఁడు. "మీవిజ్ఞాన"మను తీవను మీటి "ఇదియే నాతుదివా" క్కని పలికి, రవీంద్రుఁడు చెన్నపురియువకుల నుండి తరలిపోయినాఁడు.

భావమును గ్రహించితిని. మీరు నిక్కము వాకొంటి"రని నే నంటిని. మాతృభాషమీఁది అభిమానము మనలో సున్నయని నే నెఱుఁగుదును. ఆంధ్రు లందఱును ఎఱుఁగుదురు. సారస్వతమునకు గంగోత్తరియగు హృదయమును విదేశపుసరుకులో పూఁడ్చిపెట్టిన మనము సాహితీసేవకులమనియు, మాతృదేవి నారాధించు మహనీయుల మనియు రవికవి కెట్లు తెలుపుదును? కవిమాటలు భావగర్భితములు. అందు మోమోట ముండదు. మోటుగ నాతఁడు మాటలాడఁడు. రవీంద్రుని "కోథాయ్ ఆఛే" అనువాక్యమునకు నే నెంతేని ప్రబోధ మందితిని. మాతృభాషపైఁగల నిరాదరము కడతేఱినపుడును, ఆంధ్రు లాత్మవికాస మందినప్పుడును, శక్తిగల సారస్వతసేవకులు ప్రజలచే గుర్తింపఁబడుదురు. స్త్రీలను సంబోధించుచు రవీంద్రుఁ డింకను ఇట్లు తెలిపినాఁడు: "మారాష్ట్రములలో తొలుత మాతృభాషయెడల నిర్లక్ష్యము చూపినవారు పురుషులు. స్త్రీలే తల్లిమాటలపై నభిమానముఁ జూపి దానిని నిలువఁ బెట్టిరి. ఇచటఁగూడ మాతృభాషను స్త్రీలు కాపాడఁజాలుదురని తలంతును." చదువు పేరిట నేఁ డెందఱెందఱో పాశ్చాత్యవిద్యావ్యామోహమునందును, ప్రతీచీసభ్యతానుకరణ మందును సమయమును వ్యర్థముచేయుచున్నారు. మేగీకళాశాలయందలి బాలిక లనేకలు ఆంగ్లమునందే ఈఁదులాడుదురు. రవీంద్రుఁడు వీరి కొసరించిన ఉద్బోధనము సముచిత మైనది.

చెన్నపురి విద్యార్థులసభయందు రవీంద్రుఁడు వంగభాషోద్ధరణమునుగుఱించియు, ఆయుద్యమముతో తనకుఁగల జోక్యమునుగుఱించియు వివరించినాఁడు. "రాజకీయ, మత, సారస్వతోద్యమములు నదీమతల్లులట్లు బంగాళమునఁ గలిసినవి. నే నప్పుడే జన్మించితిని. మితిమీఱిన అలంకారములు భాషకు సంకెలలై యున్నపుడును, ప్రాఁతపద్ధతులప్రమోల పలువురు బద్ధాంజలులై యున్నపుడును, బంకించంద్రుఁడు భాషావిప్లవమును దెచ్చి నవీన రచనావిధానమును నిర్మించినాఁడు. మతవిప్లవమున నాతండ్రి పాల్గొని వెలియైనాఁడు. పిన్న నాఁడే భాషోద్యమముతో నేను జోక్యము గలిగించుకొన్నాను. ఒకరు చెప్పినది వేదమని నే నెన్నఁడును నమ్మలేదు. నాకు తోఁచినరీతిని, నాస్వాతంత్ర్యకాంక్షను పురస్కరించుకొని పండ్రెండవయేఁటనే కవిత చెప్పఁదొడంగితిని. రానురాను పలువురు నన్ను వెక్కిరించిరి. నారచనలందు చిక్కు లున్నవనియు, అవి ఎవ్వరికిని బోధపడవనియు పలికి పలువురు మూతులు విఱిచిరి. వంగవైష్ణవకవిత్వమును కొంత చదివి, దానిని మనసునకు పట్టించు కొంటిని. వెలియైతిని. నావెలి నాకు స్వేచ్ఛ నొసఁగినది...నాపద్యములు వంగపుష్పములు నిలుచునంతకాలము నిలువఁదగిన వైనవి.....కాలానుసారమైన మార్పు నందనిభాష వృద్ధిఁ గనఁజాలదు." అని యాతఁ డనినాఁడు. సాహిత్యవిషయమున చెప్పఁగలవాఁడు

రవీంద్రుని మించినఘనుఁడు నేఁడు పృథ్వియందు లేఁడు. ఆంధ్రభాషోద్ధరణమునకై శ్రమించు బుద్ధిమంతులకు రవీంద్రునినుడువులు చక్కనిదివ్వెలై యుండునని నా తలంపు.

సహజశక్తికి సహజమైన కాయము మాతృభాష యగుటచు శక్తివృద్ధినిబట్టి యదియుఁ బెంపొందుచుండును. మనుజునిమానసము జడము కాదు. అనుక్షణ మది వృద్ధి నందుచుండును. పరిపూర్ణత్వమును చేరఁ దలఁచు యాత్రికుఁడు మానవుఁడు. నిలుకడగ నిలుచు మానవుఁడు జీవము లేనివాఁడే. ఎడతెగక ముందడుగు వేయునాతఁడు మనుష్యత్వమునకు చేటు లేకుండ నుండును. తన గమ్యస్థానమును—వివిధజన్మఘట్టములు దాటియైనను—చేరఁగలఁడు. ఈతని హృదయమందు ప్రస్ఫుటించుశక్తి ఈతనియాత్ర ముగియువఱకు క్రొత్తదళముల నీనుచు వికసించుచునే యుండును. హృదయప్రసవమున తొలుకాడు మరందమే సారస్వతమునకు జీవమిచ్చు అమృతము. ఇది యమరేంద్రునుండి ఖగనాథుఁడు తెచ్చి యిచ్చినది కాదు. ఆత్మనందనమున మనుజుఁ డందఁజాలు సుధ యిది.

ప్రపంచసాహిత్యాచారులు ఆత్మనందనమును కనుఁగొనఁ దప మొనరించి, ఉద్దేశసిద్ధి నందుదురు. సాహితీసేవకుఁడు సంయమి కాఁడు కాని తపసి. ఇంద్రియములకు తాళములు బిగించి ఇతఁ డంతరంగమందు ఎందో కట్టువడి యుండఁడు. హృదయనిభృతమున కొండొక వడి తడపినను, అందుండి అపూర్వధనము నీతఁడు కొల్లఁగొట్టుకొని వచ్చును. సాహిత్యోపాసకుఁడు రసహృదయుఁడైన 'మునిముచ్చు'. కళాకామిని కొంపోవు మేఘవీథులం దీతఁడు తూఁగుటుయ్యాలనూఁగును. తారకలతో సయ్యాటలాడును. స్వాతంత్ర్యప్రియుఁడై ఎట్లు కావలయుననిన నీతఁ డట్లగును. ఒకపరి పరమహంసయై ఆత్మదక్షిణేశ్వరమున తన్మయనృత్యమొనరించును. వేఱొకపరి నటరాజై వెలయును. ఇంకొకమాఱు జగన్మోహినియై దిక్కులందు వలపులు మేల్కొలుపును. మఱొకమాఱు మానసమానససరోవరమున రాజహంసయై తేలియాడును. ఇఁకొకతూరి అపూర్వవారిచరమై ఆత్మరత్నాకరమునఁ గ్రుంకులిడి, వెలలేని మానికములు చేఁబట్టును. హృదయకుంజమున నాత్మభావనాసంశ్లేషమున నాత్మవిస్మృతుఁడై యున్నతఱి తనయల్లికయం దీతఁ డెన్నేని భువనములఁ జేర్చుకొనును. నిభృతయోజనమున నిమగ్నుఁడై యుండ అద్భుతభావవిద్యోతములు తళ్కొత్తి ఈతని కనులెదుట దివ్యదృశ్యములు ప్రదర్శించును. వీనిని కాంచినంతన యీతఁడు నూతనావతారమందిన తేజస్వి యగును. సహజశక్తి చేయఁజాలని కార్య మేది? చేరఁజాలని తావల మేది? ఎరువుసొమ్ము బరువైనది. ఎంగిలికూడు నీచమైనది. ఆత్మనిర్భరత్వమో! ఇది ఆమ్నాయచతుష్టయమట్లు గురుగంభీరమైనది! వియత్తలము దీనికి గొడుగై దిగ్వలయమున వంగి దీనికి జోహారొనరించును. దీని కుఱఁగల నిలుచునది స్వాతంత్ర్యము. సృష్టికి ప్రతిసృష్టి చేయఁ గలుగునది, దృఢనిశ్చయ ఇచ్ఛాశక్తులను తన స్యందనముపై నిలుపునది స్వాతంత్ర్యము.

సహజశక్తికి స్వాతంత్ర్యము కుడిబుజము. ఇవి రెండును సాహిత్యమునకు ప్రాపులై, నూతన భువననిర్మాణమున దానికి సాయపడును. సాహిత్యోపాసకుడు సృష్టికర్త ఏల యగు చున్నాడో ఎఱుగమా?

సాహితీవ్రతుడు జగన్మోహిని యగు నటిని కదా! జగన్మోహిని సహజవిజ్ఞాని యని అడుగువా రెవ్వరు? కళకు వర్ణవిభేదములును స్థలకాలములును అడ్డుగట్టు లగునా? కళాహృదయమునుండియు, కళావదనమునుండియు వెడలు దివ్యతేజము అస్పష్టములగుట నెఱుంగునా? ఆశయములకు ఆకసమున చిల్లు చుక్కయు త్రెపుచిప్పలకు, మహాస్వప్నములకు, కళలకు మనుష్యసులభ వ్యత్యాసము లెట్లు పొసగును? కళాకాంతకు భాషాబాధకములు సంకెల కట్టెడి కట్టుబాటు ఏది? కొండొక మాతృభాషయందు అవతరించి, బాలియందు బృందావనమాధుర్యము ను ప్రవహింపజేసిన శక్తి అందే కట్టుదిట్టయై యుండక విశ్వవిహారమునకు నిజవైభవమును విజృంభింపజేసి జ్ఞానధనంజయులను విజయక్షేత్రమున కుఱికొల్పును. పుట్టినచోటనే కట్టుదిట్టయై యుండు భాష భాష కాదు. గొడ్డుమోతు గొడ్డేయైన నది సాహిత్యము నెట్లగును? ఇది పలువురతో సంబంధబాంధవ్యముల నెట్లేర్పఱుచుకొనును? గ్రీకు, ఫ్రెంచ్, జర్మన్, ఆంగ్ల సారస్వతములు ఒక్కచో బిఱ్ఱబిగిసి నిలిచినవా? వీనియందలి విభూతి ఒకరు దాచబెట్టు కొనిన సొమ్మయినదా? నేటి వంగసాహిత్యము? అన్నికడలందలి అర్వాచీన సాహిత్యోపాసకుల కారాధ్యదేవత కాలేదా? నేటి వంగ సాహిత్యమును, రవీంద్రుడను ఎల్లరహృదయపేటికలందు నాదరస్థానము నందలేదా? "ఓహో! విహంగి! ఓరే! విహంగమా!!" యని ఆవేశపూరితుడై రవీంద్రు డుచ్చరించినపుడు దశదిశ లాతని సంగీతముచేసి నెగయలేదా?

రవీంద్రుని ఆవేశమునుండియే ఆతనికవిత్వము ఉబికినది. నిలిచి ఉపన్యసింపుమనిన, ఆతడు నిట్టూరుపు విడుచును. "చెట్లును పక్షులును ఉపన్యసించునా?" యనును. కవిచంద్రుని హృదయము జగదీశునిచేతి వీణె. వీణియ మీటు అంగుళి యున్నపుడే అందలి అమృతస్రవంతి పొంగి పొరలును. అదృశ్యుడై బృందావనవిహారి సారస్వతవ్రతుని హృదయతంత్రిని మీటినపుడే ఆతడు విశ్వమోహన గీతికలు పాడును. సాహిత్యోపాసకులు విశ్వవిద్యాలయములందును, పాఠముల కొలుములందును తయారుకారు. దీర్ఘపఠనము పాండిత్యమును ప్రసాదించునేమో కాని సాహితీ విభూతిని కాదు. పుష్పములును, కాంతులును, గీతములును మనుష్య కర్మాగారమందు నిర్మింపబడు వస్తువులు కానట్లే సాహిత్యమును మనుష్యనిర్మిత వ్యవస్థలందు నిర్మాణ మందదు. దివితేజ మొక్కొకపుడు ఒక్కొక మనుజుని వాక్కులను తూరగొట్టములు చేసికొని భూతలమున ప్రవహించి సాహిత్య కేదారములు తడుపును. ప్రతి సాహితీవ్రతుని హృదయమునుండియు దివ్యశక్తి "నిమిత్తమాత్రమ్ భవ సవ్యసాచి"

యనుచు, మరీచీపంక్తుల నాతని లేఖినినుండి ప్రసరింపఁజేయును. జగదీశుఁడు ప్రత్యక్షమై పోతనను భాగవతము వ్రాయుమనెనఁట. మఱియొక మహాకవిని నిద్దురపోనిచ్చి శారదాంబ నిశీథినీనిస్తబ్ధతయందు ఉద్గ్రంథమును లిఖించెనఁట. ఆధ్యాత్మికమైన ఆవేశము మనుష్య మానసము నాటపందిరి గావించుకొనినపుడే, అందుఁ జెవులపండు వొనరించుచు కనులకు విందుసేయుచు సాహిత్యనృత్తగీతోత్సవము గోచరించును. కవియంతరంగము 'కమలభవ నర్తను'నిచేతి జవనిక. మఱుంగుననుండి వెడలు కవితాభామిని దివ్యనర్తనుని మధురమంజుల నిస్వనమునకు తనగీతమును తనగమనికను మేళగించును.

ఆవేశము ఐహికమైనదనుట తప్పు. అది జాహ్నవీపూరమువంటిది. ఉపాసకుని హృదయశిఖరమునుండి యుఱుకుతఱి అది స్వర్గమును తనయెడందయం దిడికొనియే యుం డును. ఆవేశఝరియందు అద్భుతదివ్యభావములు కొట్టుకొనివచ్చి కవిముఖమునుండి వెలు వడును. గురుగంభీరకార్యములును, గురుతర కావ్యములును ఈ శక్తివలననే నివ్వటిల్లును. రాశిరాసులుగ విన్నుపై ప్రోవగు సాంధ్యరాగములును, ప్రకృతిముఖమున చిప్పిలు అందంపు టలలును ఆవేశసముద్భూతములే. గగనమునంతను దనరెక్కలమఱుంగునఁ జుట్టివేయ గమ కించుచు రివ్వురివ్వున వాతూలమున నెగయు విహంగమునందు పరిఢవిల్లుశక్తి ఆవేశము కాక మఱేది? వికిరగీతికలను రేపకడ వసుమతీముఖమున వెదఁజల్లున దిదియే కదా! దీనికతననే కదా అనంతవారాశి అనంతకీర్తనము నాలాపించును! దీనికతననే కదా తమబొజ్జలం దిముడ్చుకొనిన రతనపుకణికలను మేఘము లింద్రధనువులని క్రక్కివేయును! దీనికతననే కదా వనలక్ష్మి కిలకిల నగును! దీనికతననే కదా మనుష్యహృదయమందు నిద్దురవోవు సహజశక్తి వేయిపడగ లెత్తి వేయిమణుల మరీచీగుచ్ఛమును సాహిత్యమున కప్పన మొనరించును!

ఆవేశ మెఱుఁగనివాఁడు కళారాధకుఁడు కాలేఁడు; మనుజుఁడే కాలేఁడు. లలిత కళలందును మనుష్యత్వప్రతిపాదనమందును వంగీయులు సిద్ధహస్తులై తమమాతృదేవి కంధరసీమయందు మహాపురుషులమాల్యమునొండు చూపఁజాలుటకు హేతువు వారావేశ పూరితు లగుటయే. వెలుతురుకల చోటున చీఁకటికి చోటు లేనట్లు, ఆవేశమున్న నెలవున భయమునకుఁ గాని సంశయమునకుఁ గాని బ్రదుకు లేదు.

అరువదేండ్లకు మున్ను ఊరు పే రెఱుఁగని వంగభాష నేఁడు దివ్యసింహాసన మేల యధిష్ఠించెనో పాఠకులు గ్రహించియుందురు. ఇందు నేఁ దెలిపిన రవీంద్రుని నుడువులు నా కథనమునకు చేదోడగును. ఇఁక మనమో? వంగీయులహృదయశక్తిని, ద్రవిడుల మేధాశక్తిని మనయం దిముడ్చుకొనియుండియు, మనలను మనము గుర్తించుకొనక స్వీయ సముద్ధరణమును కాంక్షింపక, సాహిత్యవృద్ధినుండియే జాతీయవృద్ధి గోచరించునని ఎఱుఁగక

ఆత్మవిస్మృతులమై పడియుంటిమి. మనభాషయో? ప్రాచ్యఇటాలియన్ అని ప్రసిద్ధినందిన భాష మనయది; అనేకశతాబ్దులకు మున్నే విజయ—నిశానముల నంబరవీథి నెగరింపఁజాలిన భాష మనయది! సౌందర్యమాధుర్యములకు పెన్నిధానము కాఁజాలునని నిరూపించిన భాష మనయది! నేఁడు మూలఁబడియున్న భాషయు మనయదియే! ఏల? పగ్గములు చేతఁ బుచ్చుకొని మూతులు బిగించుకొని, భాషాసతిని వెటిచికట్టు పండితప్రకాండులే యుత్తరమీయవలెను. కాలానుసారమైన గమనికను జూపని భాషనుగుఱించి రవీంద్రుఁడనిన వాక్కు ఎల్లెడల వర్తించు సిద్ధాంతమే కద! రాతినగలందు నిలిచిన తెలుఁగు సర్వాంగసుందరియై ఎట్లు చూపట్టును? ఎట్లాంధ్రభాషాయోషముందులకు జరుగును? ఆంధ్ర హృదయమందలి సహజశక్తి విజృంభింపవలె ననిన, ఆంధ్రసాహిత్యము పునరుద్ధరణము నంద వలెననిన, ఆంధ్రభాష స్వాతంత్ర్య మందితీరవలెను. వంగసీమయందువలెనే మనసీమయందును భాషావిప్లవము తలసూపవలెను. శతాబ్దులకు ముందు శిలాగ్రంథములందు చెక్కఁబడిన లక్షణసూత్రములును వ్యాకరణనియమములును నేటికాగితములందు పునర్ముద్రణ మందినంతనే తమరాతిరూపును, తమకటికిమనసును మాపుచేసికొనునా? భాషాస్రోతమునకు ఆనకట్టయగుటకై వ్యాకరణము నిర్మింపఁబడదు. అట్లిది నిలిచెనేని, దీనిని దెగఁగొట్టుటకు కాల విలంబనము కారాదు.

వంగీయులరాష్ట్రాభిమానము, భాషాభిమానము జోడుచెలిమికత్తెలై వృద్ధి నందినవి. ఈ రెంటిని హృదయసింహాసనమున నిలిపి, వంగీయుఁడు భక్తిపరవశుఁడై భజనచేయును. "అమార్ సోనార్ బంగ్లా" (నా బంగారు బంగాళము) అనియు, "అమారి బంగ్లాభాషా" యనియు ఆవేశపూరితుఁడై ఒకేస్వరమున నీతఁడు గీతాలపన మొనరించును. రవీంద్రుని హృదయమునుండి వెడలిన గీతాపంక్తులు మొన్న చెన్నపురిరేడియోగుండా వెల్లివిరిసినవి:

"తుమారి కొలే, తుమారి బోలే, కొతోయి శాంతి, భాలోభాషా
అమారి బంగ్లా భాషా,
ముదేరీ గరబ్, ముదేరీ భాషా!"

(కొతోయి=ఎంత; భాలోభాషా=ప్రేమ; తుమారికొలే=నీయూరున; తుమారి బోలే=నీ పలుకున; ముదేరీ గరబ్, ముదేరీ భాషా=మా గర్వము, మా భాష.)

రాష్ట్రాంతరప్రదేశములందలి ప్రజాహృదయములను రేడియోలు గావించుకొని యావేశపులు, "మా బంగారు ఆంధ్రభూమి" యనియు, "శాంతిమయి ప్రేమమయి మా ఆంధ్రవాణి" యనియు నావేశపూరితులై యాలాపించిన దినమందే తెలుగుతల్లి జగద్ధాత్రియై శోభిల్లును. అట్టిశుభదినము ప్రభాకలితప్రభాతవిభూతిని ఆంధ్రభూమియం దెపుడు క్రమ్మురించునో కదా!

# వాఙ్మయ వీథి

భాగవతావతరణము (పద్యనాటిక). కవి: నోరి నరసింహశాస్త్రి. సాహితీసమితి, గుంటూరు.

నరసింహశాస్త్రిగారి చేయి మరొక్క కళాకుశలమైన కృతి ప్రసవించింది. కావ్యవిలాసాలు పొల్లెత్తి ఔచితిని ముంచక, పద్యాత్మకమని వట్టి సంభాషణమే ఛందస్సుకట్టడమూ కాక, ఇంపైన 'నాట్యకావ్యము'గా కవి తెలివితో వస్తునిర్వహణము నెఱపినాడు.

'ఘోరారణ్యమువోలె దుర్గమము నై కోలాహలంబట్టు ల
ర్థారూఢస్వరవాక్యహీనమయి పారావారసంకాశ దు
ష్పారంబౌ శ్రుతి'—

దానిని ఉద్ధరించి వ్యాసించి 'గంభీరోజ్జ్వలదివ్యరూపమయి' పరేశుని 'కంఠోద్గతంబౌ శ్రుతి'గా—తాను తెలుసుకొన్న రీతిని—సంభావించ శక్తి చాలని మనుష్యవ్రాతములను 'సత్క్రియారంభోదర్కుల జేయ భారత మహాగ్రంథానుసంధానము' చేసి; చాతుర్వర్ణ్యాన్ని ధర్మసూత్రాలతో సంధించి బంధించడానికి, 'శ్రౌతస్మార్త విధానజాతమును శిష్యవ్రాతముం గూర్చి యాథాతథ్యంబు...తద్ధర్మంబు వేర్వేరుగా' పఠింపజేసి—ఇన్ని చేసిన వ్యాసునికి ఇన్ని సంరంభాలలో ఎన్నడూ లేనిది యిప్పుడు అశాంతి తనమనస్సును పీడించడం చూచి, జగద్రక్షకుని కేదో కొరత కలిగిఉన్న దనుకొన్నాడు: అతనివంకకు భగ్నమయింది వ్యాసునిమనస్సు. కాని: 'సంక్షోభంబె వేభంగి విస్రబ్ధంబై ప్రతిశబ్ద మీనెడి' సమయాన, ఏకైకముగా ప్రత్యేకవిద్యలు పఠించి, కర్మలు చేపట్టి, ఆ అర్థములు వశ్యములై ఉండేనిమిత్తమై గురువువద్ద వాగ్వాదాలు నేర్చిన శిష్యవ్రాతమందు రేగిన వివాదనాదంలో వ్యాసునికి లోకమంతా కలత చెంది కలంకితమై కన్పట్టింది—తనవిద్యలో సమన్వయము లేక శాంతి చెడినట్టు. ఆ శిష్యులకు తానొక హితోపదేశం చేయగలిగినాడు: కర్మ లెన్నిగా ఉన్నా ధర్మమన్నది ఒక్కటే, అదే జగతికి మూలం, దానితత్త్వం తెలుసుకొండి—అని. కాని అతనికే తెలుసు, అతని ఉపదేశవాక్యాలు వారి చిత్తాలలో 'నానామార్గముల్ పొందెడిన్'—

'ద్యావాభూమిసమస్తభూతతతి చింతావ్యాకులంబయ్యె నా
భావంబం దుదయించి తెల్పగదవే వక్తవ్యకర్తవ్యముల్'

అని దేవుని వేడుకొంటాడు. ముల్లోకములూ తిరిగే నారదుడు అవతరిస్తాడు—నారాయణుడే అరూపాన వచ్చినట్టు. వేదము విభజించి ఐతిహ్యములు కూర్చినా మదిని వేదన విడువని వ్యాసుని మొర విని నారదుడు చేయగలిగినా డొకఉపదేశం—ధర్మాధిక్యాన్ని ఉపదేశించిన వ్యాసునికి: 'ధర్మములన్నీ వివరించినావు కాని, నిష్కర్ములు యోగులు అకారణంగా నిరంతరమూ మ్రొక్కి కీర్తించుకొనే మాధవుని సన్నుతి చేసినావు కావు; నిజస్తుతివల్ల కాని అతడు ప్రీతుడు కాడు; అతడు ప్రీతుడు కాక మనశ్శాంతి లేదు. ధర్మకర్మములు వివరించేటప్పుడు, "వర్ణప్రేరిత రూపనామముల భేదము లెంతురు మూఢమానవుల్; వారవి యీశ్వరార్పణశుభంకరబుద్ధి నొనర్చునట్లు" నేర్పవలెను. భాగవతసంహిత పలుకు' మన్నాడు. ఆ నారాయణపుణ్యకథాప్రారంభతవల్ల ఆత్మ ఆనందముతో నిండి, వెంటనే వ్యాసునికి భాగవతం ప్రత్యక్షమై, జిహ్వ

గ్రముమీద వాక్స్రోతస్సు గంగాప్రవాహంవలె ఉప్పొంగింది: 'గంగాధరు డెవ్వడు?' అన్నాడు. నారదుడు శుకుని చెప్పి, 'మోక్షకాంక్షాగురుబుద్ధి నీదుమది గాంచినవెంటనె తా గ్రహించు' నన్నాడు. శుకుడు, వ్యాసుని ఆత్మజుడు, హరికీర్తనలోలుడై, వ్యాసునివిద్యను పెక్కువిద్యలుగా వహించిన శిష్యులను భక్త్యావేశములో నడిపించుకొని, అటు వేంచేసినాడు భాగవతప్రభావంవల్ల; భాగవతజాహ్నవిని వ్యాసునిమనస్సునుండే తనహరి కీర్తనంలో, హరిలీలాప్రసంగంలో, ప్రవర్తింపచేసినాడు. నారాయణుడు 'వ్యాసభాగవతవర్ణితలీలా' శాలి అయినాడు. (వ్యాసుని విద్యలో సమన్వయం సిద్ధించింది.) భాగవతం అవతరించిన దయింది.

వ్యాసునికి మొదట వేదం దుర్గమంగా, కోలాహలంగా, దుష్పారంగా కన్పించి, అవగాహనచేసుకొన్న వెనుకటిఅవస్థలో గంభీరోజ్జ్వలదివ్యరూపంగా అతడు పలికినట్టు చూపి, వ్యాసునిమనోవికాస క్రమం చిత్రించిన సౌందర్యం రచనతుదివరకూ పదను చెడక నిలిచింది. మానుషమనఃప్రవృత్తికి ప్రతినిధిప్రాయమైన వ్యాసునికథ కావ్యానికి హృద్యత తేవడ మటుండగా, వ్యాసుని మనోగతులను, భావాలను, రూపమియ్యడానికే ఏపాత్రమైనా మొలిచి, వస్తురచనను, కావ్యత్వసంపత్తికి తీర్పుమెరిసింది. సందర్భోచితంగా ఛందోగతి మార్చుకొని వంచుకొనడమూ, శైలిధారాళతా గుణాలలో చెప్పక విడువరాదు. హరిలీలాకథనభాగం భక్తిసంపాదకమైన గేయసౌందర్యం చూపుతుంది. రేకులువిరిగే వికాసం కులకకపోయినా, భాషాప్రయోగంలో—కొంత సాంస్కృతికమైన—మనోజ్ఞత ఉండనే ఉన్నది. శ్రీ శివశంకరశాస్త్రిగారి పద్యనాటికలు జ్ఞప్తికి రాకమానవు. వృత్తిచాకచక్యంలో శాస్త్రిగారు అందవేసిన దెప్పుపూ తక్కువే; కాని మనస్వితను, వస్తువిన్యాస కౌశలానికి వారు చూపుతూవచ్చిన పరిచయం ఇక్కడా వారికి గౌరవం సంపాదిస్తూనే ఉన్నది.

కొంపెల్ల జనార్దనరావు

# శృంగాటకం

ఈ సంచికలో శ్రీమతి చావలి బంగారమ్మగారు వ్రాసిన 'పుంతలో ముసలమ్మ' అనే కావ్యం సందర్భ వివరణం అపేక్షిస్తుంది. పుంత అనేమాట (ఉపరథ్యకు) గోదావరీప్రాంతంలో వాడుకలో ఉన్నట్టు అనేకచోట్ల లేనట్టు తెలుస్తుంది. 'పుంతలో ముసలమ్మ' అన్నదీ అలాటిదే. ఆపేరు పెట్టి ఒకరాతిని—ఏ మైలు రాతినో, సర్వేరాతినో—పూజిస్తారు.

*　　*　　*　　*

టాగూరు కవి యీనడుమ మద్రాసులో కళాప్రసంగాలు విరజిమ్మి, ప్రదర్శనాలలో తన కళాదర్శాలకు మచ్చులు చూపి పోయినాడు. అతని లాలిత్యాలూ గాంభీర్యాలూ ఆనందం కలగజేయడం 'లోకవార్త' అయిపోయింది. సందేశ మీయడమంటే ఆయనకు సరదా. సాహిత్యవైభవం మాతృభాషలోనే చిలికి తీయమని ఆయన యిచ్చిన సందేశం విలువైనదే. (దానిని గురించి శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారు ఈ సంచికలో ముచ్చటించి ఉన్నారు.) కాని, తాను నేర్వని ప్రాంతీయభాషల సాహిత్యాన్ని గురించి—ఆ సాహిత్యం ఏ ఆంగ్ల భాషనో పరివర్తితమై తాను చూడగలిగితే తప్ప, కాక, సరియైన భోగట్టా తనకు దొరికితే తప్ప,—విమర్శములు భావిస్తే సమర్థించడం కష్టం. మనభాషలో మన సాహిత్యాన్ని పెంపొందించుకొమ్మన్నపుడు, ఇప్పటికి అలాగు ఎంతవరకు జరిగి ఉంటుందో గమనించడానికి కూడా పూనుకొంటే, తన 'సందేశాని'కే గౌరవం.

*　　*　　*　　*

ఆంధ్రనాటకకళాపరిషత్తువారి నాటకరచన పోటీనిబంధనలు సంస్కారాపేక్షంగా కానవస్తాయి. నాటకం ప్రదర్శనోచితంగా ఉండవలెనని పరిషత్తువారు అపేక్షించడం అనుచితం కాదు గాని, ఆ ప్రదర్శనానుకూల్యం తమ దృష్టిలోనో చేతిలోనో కానవచ్చే వీళ్లనుబట్టి కుదించుకొనక, సాహిత్యకళారీతిగా నాటకంతాలూకు స్వాతంత్ర్యం ఒప్పుకొని, రంగం ప్రతిభాన్వితమైన రచనను నిరూపించుకొనే యత్నంలో పరిణతి చెందడం లక్ష్యంగా నిలుపుకొంటుందని గమనిస్తే ఇన్ని నిబంధనలు అక్కరలేకపోను. రచించిన నాటకం ఎల్లరికీ ప్రదర్శనానుకూలంగా ఉండవలెననీ, ఒకానొక నాటకం అలాగు ఉండగలదనీ భావించడానికి ఆస్కారం లేదు; వస్తువుకంటె రంగం ముందుగా నిలిచి రచనకుమాత్రం కుదింపులు మిగులుతాయి. (కొందరికి ముగ్గురుస్త్రీలూ దొరకరు! వారా నాటకం మానివేస్తారు. అలాగే దేనికీని!) సంగీతం భావప్రకటనానికి వినియోగపరచరానప్పుడు, మూడుగంటల వ్యవధికి హక్కు పొందిన నాటకం రెండుగంటలకు వచనభాగం మించరాదన్న నిబంధనకు అనవసరమైన నిర్బంధముగా లొంగవలసివస్తుంది. బహుమతి పొందిన నాటకంతాలూకు ప్రథమముద్రణాధికారం పరిషత్తువారు నిలుపుకొన్నప్పుడు, ఇంత కాలంలో ప్రకటిస్తామని కూడా వాగ్దానం చెయ్యడం వారికి ధర్మం. లేదా, ఏదో రెండుమూడు సంవత్సరాలు దాటినవెనుక గ్రంథాధికారాలు రచయితకు వదలితే బాగుంటుంది. ఈ నిబంధనలు సంస్కరించి తిరుగ ప్రకటిస్తే రచయితలకు న్యాయమూ ప్రోత్సాహమూ మరింత చేకూరగలవు.

*　　*　　*　　*

నాటకకళాపరిషత్తువారి యీ పోటీవల్ల నాటకరచనకు ప్రోత్సాహం ఏర్పడి కొన్ని మంచినాటకాలు సిద్ధమవుతాయని ఆశించవచ్చు. ఉత్తమమైనదానికి రు ౧౧౧౬ చాలా ప్రశస్తమైన బహుమతి అనేమాట

అటుండగా, ప్రథమముద్రణాధికారం పరిషత్తువారు నిలుపుకొనడంలో ఒకవిధంగా ఉపకారమే జరుగుతుంది: రచించిన గ్రంథం ప్రకటించుకొనే బరువుకూడా గ్రంథకర్తకు తప్పుతుంది. ఎటొచ్చీ ఆఅధికారం నిలుపుకొన్నపరిషత్తు గ్రంథకర్తను ప్రకటించుకోనీయకపోవడానికి అధికారం ప్రయోగించి ఊరకుండక తప్పక తమరు ప్రకటిస్తా రనేనిశ్చయత వెల్లడిస్తూ ఫలానగడువని చెప్పడం, (ఆ గడువులో గ్రంథకర్త ఆశా, జనుల ఆశా నెరవేర్చి గ్రంథంవల్ల తమకు జరగగల వ్యాపారం సాగించుకోడం,) అన్ని నిబంధనలు చేసిన పరిషత్తుపట్ల, తప్పక అపేక్షణీయం.

*　　*　　*　　*

ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి బహుమానాలవల్లా అనేక శాఖల వాఙ్మయరచన ఉత్సాహము కొన్నది, చిత్రకళకుకూడా సహవాస మిచ్చి. గ్రంథాల—అధమం ఉత్తమగ్రంథాల—ప్రకటనం విషయమై విశ్వకళాపరిషత్తువారు పూనుకొనడం సముచితం కాకపోదు. అటువంటిది, ఆ ప్రకటనభారం రచయితలకు వదలడమే కాక ప్రకటనం జరిగేవరకూ పారితోషికంలో కొంత నిలుపుచేయడం—మంచి ఆశయముతోనే అయినా—అసంతుష్టి యిస్తున్నది. గ్రంథం త్వరలో వెలువడేస్థితి యేర్పడుతున్నది, నిజమే. కాని, వారివల్ల రచయితలకు ముట్టిన పారితోషికం గ్రంథ ప్రకటనానికి సరిపోతుందని నిశ్చయంగా చెప్ప వీలులేని సందర్భంలో ఆపారితోషికం అచ్చుపనికిగాను చేసిన కొంతసాయంమాత్రమే అవుతుంది. ఈయేర్పాటు రచనాక్రమాన్ని నిర్బంధించేది కానందుకు సంతోషించవచ్చు. కాని అలాగు రచనకు నిర్బంధమూ తిక్కన చిత్రరచనవిషయమై జరిగిందని అసంతుష్టి జనించి పత్రికలూ, లోకులూ విమర్శములు విసరకపోలేదు. ఏమైనా, ఈయీసందర్భాల జనాభిప్రాయాలు గమనించి విశ్వకళాపరిషత్తువారు పరువైన ఒక తెలుగుపత్రికలో లేఖరూపంగా తమ ఉద్దేశాలు వివరిస్తే చాలామనస్సులకు ఒకవిధంగా శ్రమ తగ్గించినవా రవుతారు.

# విషయసూచిక

# ఉదయిని



సాహిత్యపత్రిక


సంపుటము 1      భావ, శివరాత్రి

సంచిక ౨      శా. శ. ౧౮౫౬


## కిరణాలు

గెథీ మహాకవి ప్రపంచభాషను గురించి కలగన్నాడట.

ఎన్నో సారస్వతములు—ఎంతో సారస్వతము, ఆస్వాదించేటందుకు, వివిధభావ గతులు, అవి కళకట్టినరీతులు అవగాహన చేసుకొనేటందుకు సభ్యజనుడు వలచి మార్గాలు వెదకకపోడు; అవి సాధించేయత్నము చూపకపోడు. స్వయముగా కళారచనకు పూను కొన్నప్పుడు, నరనరాలలో ప్రవహించిఉన్న ఒకభాషతీపులు అనుభవమును, భావమును రంజించగా ఏకాంతమున పాడుకోకనూపోడు. మాతృభాష కొకజండా, ప్రచురభాష కొకటి లేచి ఆకాశవీధుల నేలుతివి. ఈరెండిటికీ వైరుధ్యమని ఒకభ్రాంతి. తనరచన లోకానికి ప్రకటించడంలో, అసలు తనకు సంస్కృతీ రచనాశక్తీ చేకూరిన విధానములో రచయిత సాధారణత్వము సమర్థించడంలేదని యేలాగు చెప్ప వీలవుతుంది? సృష్టికీ అనుభ వానికీ గల బంధుత్వము జ్ఞప్తికి తెస్తే అంతా వివరించినట్టే.

*        *        *

జనులు సమావేశాలు సలుపుకొంటారు. కళాపరిషత్తులు నిలుపుకొని వ్యవసాయ ములు ఫలింపించుకొంటారు. సారస్వతానికి జీవితమునెడగల ప్రయోజనాలలో కొత్త సాఫల్యాలు పరిణతపరుచుకొన్న రష్యా సారస్వతమహాసభ జరుపుకొని శంఖము పూరించింది. ప్రతిదేశమూ భాషాభివృద్ధికై సామాజికములైన యేర్పాట్లు జరుపుకొనడమూ, ఆప్రయ త్నాలు పరిషత్తులలో శిఖరము కట్టడమూ ఎంతో మామూలు. భాష కొకపరిషత్తనే కాక, దేశాని కొకపరిషత్తు కావలెనని కూడా వాంఛ సహజమే అనిపించుకొంటున్నది. భారతదేశా నికి ఇంతవరకూ ఒక కళాపరిషత్తంటూ ఏర్పడలేదు. ఈనడుమ కొన్నిప్రయత్నాలు లేచినవి.

ఇటీవలిది డాక్టరు పి. గుహా-ఠాకుర్తాగారు 'త్రివేణి'లో పిలిచిన ఆహ్వానము. దానిపై కొద్దిగా చర్చలుకూడా జరిగినవి.

* * *

ప్రాంతీయభాషలవారి కళావికాసములు వారిగోడలలోనే మూలుగుతుపోక ప్రతీతికి వచ్చి భారతీయకళావిలసనమంతా ఒక్క ఉద్యానముగా రూపుకట్టడమే కాక, భారతకళాశక్తి దేశాంతరీయులకూ, దేశాంతరముల కళాశక్తి భారతీయులకూ అందించి సంస్కృతి వాగులు కలుపుకొనేటందుకు అట్టి కేంద్రపరిషత్తు సాధక మవుతుందనేమాట నిజం. కాని కొందరు ఒకగురుమండలిగా కూర్చుండి ఇన్ని ప్రాంతాల కళాసంపదలను ముద్రలువేసి బహుమానాలతో కొలవగలమంటే, ఆసంస్థ సంకుచితత్వముతో మూలిగి, దేశీయుల స్వతంత్ర విలసనాలు చూడజాలనిదే అవుతుంది. అసలు భారతకలాపరిషత్తు ఇతరదేశాల పరిషత్తుల కంటె చాలా విలక్షణమైనది కావలెను. ఇతరదేశాలలో ఒక్కొక్క దేశాని ఒక్కభాషా సాహిత్యమే. ఇక్కడ ప్రాంతీయపరిషత్తులు అక్కడి దేశీయపరిషత్తులవంటివి. ఇన్ని భాషలకు కేంద్రపరిషత్తు ఏర్పడడం అన్ని దేశాలమీద—యూరోపాఖండమునకంతటికీ అన్నము—ఒకపరిషత్తు ఏర్పడినట్టు. కాని భారతదేశపు అనుభవైక్యముబట్టి ఈపరిషత్తును ఒక విశిష్టమైన ప్రాభవమూ, ఆనుకూల్యమూ ఏర్పడవచ్చు: ఈ అవకాశమే లేకపోతే దీని ఆవశ్యకతయే కానరాకపోయేది. కాని యిది సాధించుకొనే ఆలోచనలను కొన్ని ఉత్కృష్ట సంస్థలు క్రమశః నేడు చేపట్టుతున్న సంకుచితత్వము భయహేతువై పోతున్నది. అట్టి దుర్గతినుండి కాపాడుకోవలెనంటే, ముఖ్యముగా ఆపరిషత్తు ముద్రాధికారులు వలవక దేశమందలి ప్రతిభాసామగ్రిని ఒక రంగమునకు తేవడమే తొలిలక్ష్యముగా నిలుపుకోవలసి ఉంటుంది. భారతదేశపు గొప్పరచనలు ఏరి లోకమునకు చూపగలనన్న ప్రత్యయము పడయడానికి పూర్వము ఆరచనలు తనమేజాపైకి చేరగలమార్గములు సుష్ఠుగా సంతరించుకోవలసిఉంటుంది. ఇది యెంత వినీతముగా యత్నించినా పూర్ణసాఫల్యమునెడల గర్వించనీయదు.

* * *

ప్రాంతీయసారస్వత రంగములందు కేంద్రపరిషత్తులు ఏర్పడి తత్సాహిత్యగతుల కవిముఖ చైతన్యములుగా నిలవడమే మొదట పెద్దపని. వారి చేతుల కలయికలో భారతపరిషత్తు ఏర్పడడం సులభమౌతుంది కాని, అవి యేర్పడి చక్కగా నడిచే రోజువరకూ భారతపరిషత్తు వేచిఉండ నక్కరలేదన్న ఆశలో అర్థము లేకపోలేదు. కాని అది యేర్పడినా, ప్రాంతీయపరిషత్తుల యేర్పాటుకు చేసే యత్నమే ప్రధానమైనది కాగలదు; వాటి సాయముతో కాక తాను స్వయముగా లక్ష్యము సాధించగల అవకాశము చాలా తక్కువ.

మఱి ఆ భారతపరిషత్తు ఒక్క సాహిత్యానికే కాక, అన్ని సంస్కృతి శాఖలకూ చుంబకము కాగోరినపుడు, అన్ని శాఖల పరిషత్తులతో ఐక్యము పెట్టుకుంటుంది. ప్రాంతీయపరిషత్తులు ఒక్కొక్కటి అన్నిశాఖలూ కలియగట్టుకొనడం మంచిదని చెప్ప వీలులేదు. ఏ శాఖకు ఆ శాఖకే ప్రత్యేకకూటము లుండడం శ్రేయమని అనుభవము ఉపదేశిస్తుంది.

* * *

అథమం, సాహిత్యానికైనా అనేక ప్రాంతాలలో పరిషత్తులు ఏర్పడే ఉన్నట్టు తెలుస్తుంది. అవి తమయందు కేంద్రత్వము ఎంతవరకు సమర్థించుకొన్న వనేవిషయం పరిశీలించవలసే ఉంటుంది తరుచు. (ఏ గుంపు చూచినా ఒకకొంత సేవ చేసే ఉంటుంది, కేంద్రత్వము పొందకుండానే.)

* * *

తెలుగు దేశములో ఆంధ్రసాహిత్యపరిషత్తు పెక్కుసంవత్సరాలుగా ఎంతో సారస్వత సేవ చేసింది. అయితే నవ్యవిప్లవాలకు ఓర్వక అది ఒకప్రక్కకు తొలగ వచ్చింది—అదే కేంద్రమనీ, ఈ ప్రవాహము నడిమిది కాదనీ యెంచి. ఇటీవల అభినవాంధ్రకవిపండితులు కూడి నవ్యసాహిత్యపరిషత్తు కట్టుకున్నారు. ఇప్పుడు స్వప్నమువస్తూఉన్న భారతపరిషత్తూ, ఒకవిధముగా, నవ్యసాహిత్యపరిషత్తే—సాహిత్యశాఖకు సంబంధించినంతవరకు: నవ్య సాహిత్యవికాసమును లోకానికి చూపించడం అది అవలంబించగల లక్ష్యాలలో లెక్క పెట్టుకొంటున్నారు. కనుక ప్రస్తుతప్రవాహమును పట్టిఉన్న నవ్యసాహిత్యపరిషత్తుకే కేంద్రత్వము ఒప్పుకోవలసి ఉంటుందని ఒత్తి చెప్పనక్కరలేదు.

వాడుకభాషలో, క్రొత్త ఛందస్సులలో వచ్చేరచన సాహిత్యముగా గణించనొల్లని వ్యక్తులనూ, గుంపులనూ తప్పించి నవ్యసాహిత్యము చియ్యబట్టి వస్తూనేఉండగా, నవ్యులు క్రొత్త ఛాందసాలు పెంచుకొనక సరియైన విలువలమీదనే దృష్టి నిలిపితే నవ్యసాహిత్య పరిషత్తుకు కేంద్రత్వమూ, నవ్యసాహిత్యానికి అభ్యుదయమూ చేకూర గలుగుతవి. మరెన్నో అభ్యుదయ రీతులు యోజించి అనుసరించవలెనని పరిషత్తు అనుకొనడంకంటె, ఆ ప్రయత్నము కొనసాగించే తోడ్పాటు లెక్కచూచుకోవలసి ఉంటుంది. పరిషత్తువారు సారస్వతమును ప్రజలలోనికి ప్రాకించే యత్నము చేయవలె ననేకంటె, సారస్వతముకు ఆలాగు దింపడం అపేక్షించక, ప్రజలు కొంతఉన్నతి చేపట్టి కర్తవ్యము గుర్తించవలె నన్నదే యెక్కువ న్యాయ్యమైన ఆలోచన.

ఇప్పటికి తగిన స్థూమతు సంపాదించుకోగల భాగ్యము పొందకపోయినా, పరిషత్తు నవ్యులలో ఉత్సాహము పొంగించి తీరుతున్నది. విద్యాప్రవర్శనాల మూలముగానే

యిట్టి సంస్థలు సంపత్తి పెంచగలవని స్మరించి, భారతపరిషత్తుకే తిరుగ ఉపదేశము చూప వచ్చు; ప్రాంతీయసారస్వత రత్నములు భారతపరిషత్తు సేకరించి మళ్లు కట్టితే, అది లోకా నికి ఒక్కొక్కటిగా పూజాపీఠాన నిలిపి సంప్రదాయపు మడిపూజలు పిలువ నక్కరలేదు; ఆ నిగ్గు తనపని తానే చూచుకొంటుంది. ప్రాంతీయపరిషత్తుల చనవుతో పరిపుష్టమైనది కాజా లకపోతే భారతపరిషత్తు వరమని యెంచనక్కరలేదు.

భారతపరిషత్తే పరిణతమయితే, ప్రొ. ఎడ్వర్డ్ థాంప్సనుగారు ఆశించినట్లు, చిన్న భాషలయందు కవితాప్రసాదము పడసినవారు జగద్వేద్యములైన ఆంగ్లాదిభాషలు తెలియని మాత్రాన విఖ్యాతికి నోచుకొననివారు కానక్కరలేదు. ఇదిన్నీ ప్రాంతీయుల లక్ష్యమును ఆకర్షించవలెనని హెచ్చరిస్తే వా రనుసరించే మార్గమునే వ్యాఖ్యానించినట్లు.

* * * *

ఇతరకళాశాఖలలోనూ తత్తదవలంబుల సాముదాయిక వ్యవసాయాలు ప్రతిప్రాం తములోనూ నిర్వహిల్లి నెయ్యములు పెంచుకొంటే భారతదేశానికి పెద్దపండుగలు నిద్ర మేల్కొంటవి. చిత్రకళాప్రదర్శనాలు విరివిగా జరుగుతున్నవి. కాని, చిత్రకారులకు గోష్ఠు లలో ఉండే ఆసక్తి యెంతటిదో తెలియరాదు. అన్నిశాఖలలోనూ మిక్కిలి సంపన్నమైన నాట్యరంగము, పోసీ మనప్రాంతములోనే, పరిషత్తు నిలవద్రొక్కుకొనడమే కాక ప్రశస్త మైన కార్యవిధానములు గీసుకొన్నది. పత్రిక రంగానికి తెచ్చినది.

* * *

‘నాట్యకళ’[1] పత్రికా లోకమున విశిష్టమైన పూజ్యస్థానమునకు నోచుకొన్నది. ఈ సంస్థలకు పత్రికలు చేయగల సేవ, ఉండవలసిన అవసరము స్మరించి ‘నాట్యకళ’కు స్వాగతము పలకడమే కాక, సందర్భాలవల్ల ఏర్పడిన తన గౌరవమును ఇది సత్త్వశః సమ ర్థించుకొంటున్న సంగతి మిక్కిలి ప్రశంసించ దగ్గది. నాట్యకళకు చెందిన పెక్కుత్రోవల— రంగము, నాటక నిర్మాణము, సంగీతము, వివిధభాగాల ‘సంబంధాలు’ మొదలైన పెక్కువిషయాల—సమర్థులూ, అధికారులూ రచించిన వ్యాసములు దీని విజయమును భద్రపరుస్తున్నవి. పత్రిక స్వరూపమున్ను మిక్కిలి అందమైనదై విలువ పెంచినది.

కొంపెల్ల జనార్దనరావు

---

1 త్రైమాసిక పత్రిక. సంపాదకులు : నీలంరాజు వెంకటశేషయ్యగారు. చందా : రూ ౨. కార్యాలయము: 7 తంబుచెట్టివీథి, జి. టి., మద్రాసు.

# సీతాకోక చిలుక

ఎఱుపు పసు పాకుపచ్చన యింద్రనీల
మణిశకలకాంతి నెమలి జిమ్మనుచు విప్పు
కొన్నపించెమ్ము లెగఁబోసికొన్న రంగు
రంగుల హొరంగు, పట్టుచీరల మెరుంగు
టంచుల జెడంగు, భిల్లకన్యావిలోచ
నాంచల చకచ్చకచ్ఛవి, అంబుదముల
దళసరిమెరుంగులోన పచ్చలవెలుఁగు
లొలుకఁబోసిన మెరపు కన్నెల విదల్పు.

* *

ఈ సముద్రమ్ము ఘోషించు నేల? తరఁగ
తరఁగ కదలాడి యొడ్డున విరిగి విరిగి
తెచ్చిన వినీలకాంతులు తేలిపోయి
తగిలి యొడ్డున తెల్లనిమొగము వేసి
నురుసులై కృష్ణసర్పముల్ నూర్లు వేలు
లక్షలును కోట్లు నింద్రనీలమణిశిఖర
దీధితి వెలార్చుకొను శిరస్త్రీవతావి
చాలనోద్ధతములు నిట్లు జారు నేల?
ఒడ్డున విధూతమై మరియును మరీను
తెల్లనై తెల్లనగుచు కంపిల్లు పొట్టు
విడనిగోదుమగింజలవింతదోర
రంగు లొలయుచు నెండి బొణుఁగురైన
ఆలిచిప్పలు నత్తలు నందములకు
నందములు దిద్దు నుండి లేదన్న ప్రాణ
ములును మును కదలాడిన జలధిలోని
చిత్రజంతుసంతానమ్ము చేసికొన్న
గుల్లలగు నిండ్లు సూర్యుని తెల్లకాంతి

తగిలి భగ్గున మండి సంధ్యావినూత్న
మంజులచ్ఛవిసాన్పర్శ మండి మండి
ఊరక నీగాలిత్రోవల నురుకువెట్టు.

* *

ఆకసము క్రొత్తకాంతుల నవఘుళించి
కనపడని ఇంద్రదేవుని కాంతి విరిసె;
రంగుల మొగిళ్లు కాంతులు రాశిఁ బోసి
వెనుక నొదిగిన అస్తమించిన జలేజ
బంధుకాంతికి నొకచోట పద్మరాగ
శకలరమ్యమ్ములై, యొక్కచాయ పుష్య
రాగకాంతిచ్ఛటాసమారబ్ధనూత్న
మోహనావతారమ్ములై ముందుముందు
అంచుల జరీమెరుంగు లద్దించుకొంచు,
మరల నొకచోట మృదునీలిమన్ ధగద్ధ
గితకనత్కాంతి బిట్టు నూఁగించుకొనుచు,
కొంత సంతోషపడినట్లు, కొంత దుఃఖ
పడినయట్టులు, మరికొంత భావమెల్ల
భర్తపై నిల్పుకొన్నట్టి భామయట్లు,
అచట వాసకసజ్జికయట్లు, నచట
వచ్చి యభిసారికం బలె పగిలిపోవ
నేటికో పశ్చిమాశ తా నీవిధాన.
ఆ వెనుక నస్తమించుచున్నట్టి సామి
భానుఁడల పశ్చిమాశ చేపట్టు జారి
పోవుచు దురాశ కాక తా పూర్వ దిక్కు
కొరకు కరములు వెనుకగా క్రమ్మఁజొచ్చె.
పూర్వదిశయు నేదో లేనిపోని యొక్క
రాగవల్లికచే తాను నూఁగులాడె.

* *

ఇది పొడలపాము కాఁబోలు, ఈ శరీర
మెల్ల బహువర్ణసాంకర్య మేచి శిరసు

## సీ తా కో క చి లు క

మాత్ర మొకక్రొత్తరంగున మారిపోయి
మలకలుగ దీని నడచిన మార్గమెల్ల
ఉన్నరంగులు గాక మరొక్క క్రొత్త
రంగు కల్పించుచుండె; ఔరా మరేమొ
వేగమునఁజేసి యొకరంగు విస్తరించి
పలుచఁబడుచుండె; ఆ పల్చఁబడినరంగు
మరియు నొకరంగువోలె సంపత్తిఁ దెచ్చె,
ఇంత పరువెత్తు త్రాఁచున కేమొ వెక్కి
రింత వెట్టిన యట్టుల వృక్షపటలి
చివరల చివుళ్లు రంగు లార్చికొనుచుండె.
కోమల కుహూనినాద సంధామనోజ్ఞ
కంఠకన్నులలో నెఱ్ఱకాంతి తెచ్చి
మేని నల్లనికాంతులు మ్రింగివేసె
ప్రొద్దు క్రుంకెను చీఁకట్లు పొదలనడుమఁ
దూరి యడవులదారుల తారులాడి
నల్లనై అందులో కొంత తెల్లనడియె.
ఇంత చీఁకటిలోకూడ వృక్షశాఖ
లందు నడుమన నడుమన నల్లలాడి
పులుకుపులుకున మిణుఁగురుఁబురువు లొప్పె.
చెట్లకొమ్మల మాధవస్థితిని తెల్పి
కోకిల విచిత్రమగు శీవి క్రుమ్మరించ
నింద్రగోపమ్ములు ధరిత్రి కెత్తిసట్టి
యెఱ్ఱదీపమ్ములై సొగసెల్ల నొలికె.
రంగులు ధ్వనులును విడంబరచఁగరాక
శ్రవణ నేత్రేంద్రియముల యేర్పరచరాని
యొక సమైక్యము స్ఫురియించుచుండె నడవి.

* *

ఒగి ప్రియాగతవేళామహోత్సవమ్ము
చేసికొనుచుండిరేమొ యీచిన్నిపడుచు
లొక్కవిధముగ లేని యీయొప్పులొలుకు
చీరలు ధరించి దశదిశాశ్రీలు తామె

మూర్తి కట్టించుకొన్నట్లు మూఁక లైరి.
యాననోదయవేళా సమాప్తమైన
యీహతాన్మాధురీపుఞ్జ లెచటనుండి
తెచ్చిరో పూర్వజన్మ లందిచ్చుకొనిరి.
సరిగ నీ సమయానికి సాగి వీరి
కన్నులను పోల్చినవి నెమ్మి కన్ను లోలసి.
వారు కట్టిన రంగు రంగారుచీర
లంచుల తదీయభర్తల యాత్మలందు
వెలయు మధురభావస్వప్నములు విసరులాడె.
ఓహోహో! ఈప్రయాణము లెటకో వీఁ
ఇక మధురసంధ్యలు బ్రదుకనీర యేమి?
గంతులను వేయు పిల్లమేఘాలయాట
లింతయును లోకమున చెల్లనీర యేమి?
దొరలిపోయిన జీవమాధుర్యరేఖ
లెల్ల వీ రాఁచుకొనెదరా యేమి యేమి?
సర్వకాంతులలో నున్న సారమెల్ల
వీరె మరి యాదురా యేమి? విశ్వమెల్ల
ఈ మహాకాంతిలో కాని యిముడ దేమి?

* *

పవలుపవలెల్ల మృదుమందపవనవీథి
చిక్కువడిన సీతాకోకచిలుక మరల
మరల తనకాంతి చీఁకటుల్ మలఁగియాడు
కోనలందున మఱచిపోఁగొట్టుకొనియె.
కాని తారకాకాంతులు క్రమ్ముదెంచె
పూర్ణిమాచంద్రరోచులు పొంగిపోయె.

విశ్వనాథ సత్యనారాయణ

# గీతికలు

## ౧

1. ఆ పడవ నెప్పు డొకఁ
డతివృద్ధుఁ డగువాఁడు
అట్టిట్టు నడిపించు — నాఁడు
చిన్నిపిల్లం డొకఁడు
కన్నెపిల్లా లిర్వు
రెక్కి నడిపించువా రా పడవ !

2. కన్నెపిల్లలజడలఁ
గనిపించె గన్నెరుపూ
లిన్ని గ్రుచ్చుకో నెఱ్ఱజిగుల:
చిన్నిపిల్లనిమోము
చిరునవ్వు నవ్వు చదె
పువ్వు నా మురిపించెఁ గలిమి మిగుల.

3. గడ నెత్తి పిల్లండు
పడఁద్రోసెఁ బడ వేట
పడిపోదు మన్నారు బాలికలు.
పకపకా నగె బాలు
నకుటిలపుఁబలుచాలు
చికిలికన్నులు చిట్టితారకలు.

4. ముసలివాఁ డప్పుడే
యొడ్డుపై కరుదెంచి
పడవ పాడయిపోవు ననుచు నఱచె:
ఫరవ లే దని చెప్పి
బాలికలు బాలకుని
త్రోయ మని రీపడవఁ ద్రోయ మనిరి.

5. ముసలివానికి మోము
ముణుచుకొని పోయింది
ఉసురు లయిదును చేత నుంచుకొనియె.
పిల్ల లార్చి పేర్చి
పెరతీరమును గనిరి
పరుగుపరుగున జనిరి పల్లెవంక.

*

౨

"నీ వెట్లు వదలితివి వ్రేపల్లె శ్రీకృష్ణ!
ఓయి కృష్ణా! వినను నీగ్రోవి నీమోవి
గాలిపాటల నాడినట్టి గాథాపైని!
రాధ కనఁబడ దింక, రాసకేళిని గూర్చి
తలపోయ రెవ్వారు ద్వారకాపురిలోన!
ఏమయ్యె నదియెల్ల? కృష్ణ! నీపసితనము
తో మాయమయ్యెనే? దోషమా! అపైని?"

"లేదు లే దో భక్త! రాధ నా లోనిదే.
గ్రోవి నాలోనిదే. కోలుపో నెప్పు డవి.
రమ్మన్న నాతోడ రా నన్నయది రాధ
ఇమ్మన్న నాకుఁ దా నీ నన్న దిఁకఁ గ్రోవి
త న్నాఁడుకొమ్మన్నఁ దగ దాని కన్నాది
అందుచే నాపైని నావిలాసం బెవరి
కగపడదు. వినఁబడదు. అంత నిశ్శబ్దంబు."

కవికొండల వెంకటరావు

# ఫొటోలో

లిల్లీ బేబీ చల్లనిచూపు
కొల్లా గొట్టింది
నామది
కొల్లా గొట్టింది
ఉల్లాసముతో నావైపున కది
ఉరిమి చూచింది
బేబీ ఉరిమి చూచింది
లిల్లీ ఉరిమి చూచింది
ఓహో ఉరిమి చూచింది.

'లిల్లీ, దాదా' యనుచు నేను
మెల్లిగ బిలిచేను
పాపని
మెల్లిగ బిలిచేను
ఉలకక తాను వూరక నుంటే
కనులే నవ్వేయి
లిల్లీ కనులే నవ్వేయి
బేబీ కనులే నవ్వేయి
ఓహో కనులే నవ్వేయి.

ఏ నెట నున్నా లిల్లీ చూపే
ఎదటికి వచ్చింది
పాకుచు
ఎదటికి వచ్చింది
ఏ నే మెరుగక చూచుచునుంటే
ఎత్తుకు పోయింది
నామది ఎత్తుకు పోయింది
ఆ చూ పెత్తుకు పోయింది
కళ్లతో ఎత్తుకు పోయింది
ఆహా ఎత్తుకు పోయింది.

చావలి బంగారమ్మ

# సాహసి

ఎగిరించకు లోహ విహంగాలను;
కదిలించకు సుప్త భుజంగాలను—
    ఉండనీ, మస్తిష్క కులాయంలో,
    మనోవల్మీకంలో!

అంతరాళ భయంకర
ప్రాంతరాలనా నీ విహారం?
ముళ్లదారినా నీ సంచారం?

పలికించకు మౌన మృదంగాలను:
కెరలించకు సుప్త భుజంగాలను.

    హృదయంలో దీపం పెట్టకు!
    మంత్రనగరి సరిహద్దులు ముట్టకు!

శ్రీరంగం శ్రీనివాసరావు

# ఆ శా వా న్

పిబేచ్ఛ మృగతృష్ణికాసు సలిలం పిపాసార్దితః.

—భర్తృహరిః

ఇట్లు వాపోయె దేటి కోయీ కుమార,
ప్రాణసఖి ప్రాణసఖి యంచు పలవరించి ?
ఇంక నైనను శాంతి వహింప వోయి !
నీవు రోదించినను గూడ నిష్ఫలంబె !

సా ధ కు డు

ఏమి చేయుదు తల్లి, యీ హృదయనిబిడ
ఘోరదుఃఖ తుషాగ్నితో కుమిలి కుమిలి
తాళ జాలక యీ వివిక్త స్థలాన
ఏడ్చుచున్నాను కూర్చుండి యేకతముగ.

భూరిదుఃఖతరంగముల్ పొంగి పొరలి
క్రమ్ముకొని వచ్చుచున్నవి గట్లు దాటి.
ఎవ్వ డున్నాడు నాకన్న నిపుడు దుఃఖ
భాజనుం డన్యు డేతత్ప్రపంచమందు !

అ న్వే ష కి

తగునె నీకు కుమార, యీ దైన్యవృత్తి?
ధీరతం దాల్చి యెటో నిరోధింపవలయు
దుఃఖవీచీ పరంపర.—తొలగిపోవు
శోకమున గుండెబరు వని నాకు తెలియు.

అయిన తాలిమి బూని నీయశ్రుసిక్త
గండ భాగమ్ములను, బాష్పకణసమేత
లోచనమ్ములు దుడిచి, విలోల కేశ
జాలముల్ సవరించి నాచాయ చూడు !

బాధ పడినంతమాత్రాన ఫలము కలదె ?
ఇంకనైనను నీవు యోజింప కకట
అర్రు చాపెద వేమిటి కంద నట్టి
మ్రానిపండు భుజింప ! అమాయికుడవు !

సాధకుడు

మానసాబ్ధి నింత మథనమ్ము జరుగంగ
ఉద్భవింప కమృత ముండు టెట్లు?
పడిన బాధ యెల్ల ఫలితంబు లేకుండ
నెట్లు పోవు తల్లి, యెరుక పడదు.

అన్వేషకి

వెర్రివాడవు! కోరిక విడువ లేక
ప్రాణసఖి కోస మింతగా బాధపడెద
వశ్రుమోచన వృత్తాంత మామె చెవిని
జేరెనే యెన్నడైనను చిన్నవాడ?

సాధకుడు

భావవీచికాళి పయనించి ఆయమ
కర్ణగోచరంబు కాకపోదు.
నిఖిల జగములందు నిష్ఫలంబై చను
కార్య మేది కూడ కానరాదు.

అన్వేషకి

సత్యమే యగు నియ్యది శాస్త్రదృష్టి.
నీ విలాపమ్ముచే నామె నిండు మనసు
కరగు చిన్నె లవంబేని కానవచ్చు
చున్నదా నీకు? వచియింపు మోహకుమార!

సాధకుడు

చర్మచక్షువులకు స్పష్టవిధంబున
కానరాదు చిన్నె, కాని తల్లి,
కఠిన హృదయురాలు కాదామె యని మదీ
యాంతరంగసీమయందు దోచు.

అన్వేషకి

మంచిమాట! కాని మరచినట్లున్నావు
ముఖ్యవిషయ మొకటి మొదటినుండి
నీకు నామె కున్న నిరుపమాంతరమును
ఇప్పు డొక్కసారి యెంచి చూడు.

సాధకుడు

ఆమె మహోన్నత హిమవ
ద్భూమీధర శృంగమందు బుట్టి, నితాంత
శ్రీ మెరసెడి భాగీరథి!
సామాన్యుడ మంగళాద్రి సానువునం దేన్.

చిరతర భూరితపఃఫల
పరిపాకంబుననె పడయు భాగ్యం బొదవున్
తరుణీమణి నని, యంతర
మెరిగియె ధ్యానింతు జీవితేశ్వరి నెపుడున్.

అన్వేషకి

ఇంతకన్న నీకు నింకేమి ధ్యేయంబు
కానబడదొ? ఇట్లు కాలహనన
మక్కటకట, చేయు టన్యాయ మన్యాయ!
ముచిత మెరుగజాల కుంటి వోయి!

సాధకుడు

ధ్యేయం బీజన్మములో
ఆయమ విగ్రహము కన్న నన్యముగా నా
కేయదియు గానబడదు. త
దీ యోపాసనన నిర్వృతిం బడయుదు నే.

కాలహననంబు చేయుట
యేలా గనవచ్చు? జీవితేశ్వరి నెదలో
ఆలంబనమూర్తిగ నే
నాలోకన సుఖము నొంద ననవరతంబున్.

అన్వేషకి

వెఱ్ఱివాడ, యింత విగతత్రపుండ వై
మగువ నొకతె నిట్లు పొగడ నేల?
స్వస్వరూప మేదొ స్మరియింప కున్నావు
విడిచిపెట్టినావు విధుల నెల్ల.

ఉ ద యి ని

నవ్వుచున్నవారు నలుగురు నినుఁ గాంచి
లోకభయముకూడ నీకు లేద ?
చెవుడు వీవు తుదకు చెవి బెట్ట కక్కటా
హేతువాద మన్న నించుకైన !

సా ధ కు డు

తల్లీ, నిజమ్ముగా త్యజియించినాను
సిగ్గన్న యూహాయే. జీవితేశ్వరిని
నేను స్మరించిన నిమిషమ్ములోన
ఉన్నత భావమ్ము లుదయించుచుండు.

లోకభయమ్ముతో నా కేల తల్లి.
అంద రన్నివిధాల నను చుంద్రు, నేనో
నిశ్చలబుద్ధితో నిరతంబు నామె
దలపోతు విధులెల్ల త్యజియించివేసి.

హేతు వాదమ్ముచే నేమి ఫలమ్ము ?
వ్యావహారిక దృష్టి వచ్చి బాధింప
అపనయించును దాని నంతరంగంబు.
శాంతి లేకున్న దీ సంగరంబందు !

అ న్వే ష కి

లే దిక లాభము ! నీతో
వాదించిన కొలది నాకు వాగ్వ్యథ. అయో
పోదా నీగాఢభ్రమ !
లే దోయి సుఖంబు నీకు లేశం బైనన్.

సా ధ కు డు

దుఃఖభూయిష్ఠమై తోచు లోకాన
సత్యమ్ముగా గాఢ సౌఖ్యమ్ము కలదె ?
తారతమ్యమ్మును దాల్చి దుఃఖంబె
సుఖము పోలికను తోచుచునుండు జగతి.

* *

## ఆ శా వా న్

నా దుఃఖభార మేనాటికి తొలగు ?
ఏమి చేయుదు ? జీవితేశ్వరి మనసు
కరగెడి మార్గంబు కానరాదాయె !
ఏమి చేయుదు ప్రియా, యేమి చేయుదును !

కవివరుండనయేని గాఢానురక్తి
బహువిధంబుల కావ్యబంధంబునందు
వర్ణించి వర్ణించి వల్గు వాక్కులను
కరగించియుందు నీ గట్టి మానసము !

గాయకుండన యేని గాఢానురాగ
పరిపూర్ణ గీతికా పదసముచ్చయము
కర్ణామృతమ్ముగా గానముచేసి
కరగించియుందు నీ గట్టి మానసము !

శిల్పి నైతినయేని సిద్ధహస్తమున
గాఢరాగవ్యంజకమ్ములౌ స్థితులు
కన్నుల పండువు గాగ చిత్రించి
కరగించియుందు నీ గట్టి మానసము !

కవివరుండను గాను, కాను గాయకుడ,
కాను శిల్పిని, ప్రజ్ఞ కలవాడ గాను.
ఉన్నయోగ్యత ప్రియా, ఒక్కటే నాకు :
అనురాగపరిపూరితాంతరంగుండ !

ఏకాకి నైన నా కెవ్వ రున్నారు
నీకన్న ప్రియతమా, నిఖిలలోకమున !
నను కటాక్షింపవే నాజీవదాత్రి !
నను స్వీకరింపవే నాప్రాణకాంత !

శ్రీ శివశంకరశాస్త్రి

## ఫలశ్రుతి

'బావ' యనుమాట ప్రేమప్రపంచమునకు
నీవు పెట్టినపేరు! నాభావమందు
పద్యములు తోఁచి అక్షరప్రాభవమున
బయలువెడలుటలో శ్రమపడుదు నేను!

ఒక మొలకనవ్వు నన్ను నీవు కరఁగింప
నేరిచినది! రసజ్ఞతా స్ఫోరకములు
చుంబనము లంచు, ఆలింగనంబు లంచు
ప్రతిపదమ్మును అలజడిపడుదు నేను!

నాయని సుబ్బారావు

# సృష్టి

ఎప్పుడో
జయము తేగల ముదమె,
మెచ్చులే జడివీచి
మనసు కదలించినా,
నా చంచు వది పదను
చూచుకో నేమరదు.

పాయవడి చాలు విడు
మసక లన్నీ ముసరి
నా బర్హావనుల
రాగిల్లి రంగులు జారు—
నింగి ముట్టే కొండవనులు నెయ్యము లూరి
గాలిపెన్నిధు లూర్చిపోయ.

మబ్బులందము, చల్లదనము పులకించేటి
నా కలస్వాదురేఖకు బొమ్మ చెదరుట
అనుచు లేనే లేదు.

మనసె తా పాయవిచ్చినచోట, నాకలము
మనసె, సర్వమె, ఊతగా వ్రాసికొంటుంది—

అనురేఖ మదరు మెత్తని చిక్కదనముతో
నాకేల ననిచి సర్వము నర్తనము రేగ—

నా కలముచంచువు కలస్వాదుగీతిగుర్తులు
సర్గపుచ్చేటి వేళ.

కొంపెల్ల జనార్దనరావు

# గడ్డిపువ్వు

తెప్పవోలిక చంద్రబింబము
తేలిపోతో వుంది నింగిని—
అందులో నా ముద్దు ప్రేయసి
వుంది కాబోలు !

లేత చిరున వ్వెందుకో ? సిగ
లోన వెన్నెల మల్లె లెందుకో ?
చేతి సైగలు చేసి నన్నటు
చేర రమ్మను టెందుకో ?

గడ్డిపువ్వుని ! నన్ను, ప్రేయసి !,
గాలితరగల దేలిపోతో
కళ్లలో అద్దాల మెరుగులు
చల్లి కలచెద వెందుకే ?

నీకు నేనే కావలిస్తే,
నింగి వొదులుకు నీవె సీతా
కోక చిలుకవో దేనివో అయి
రాగలవు !—

నే నొద్దు కనకే,
ముత్తెములో రత్నాలో పరుతో
చిత్రమవు నా మబ్బు జలధిని
ఆడుకుంటావు !

గడ్డి పువ్వుని !—రేకు రెప్పల
గలలు కంటో కలవరిస్తో
కలత నిద్దురలోనె ఎప్పుడో
కళ్లు మూస్తాను !

మల్లవరపు విశ్వేశ్వరరావు

# ప్రేమ పర్యవసానం

'చలం'

సుందరశివరావు కాంగ్రెస్ పాకలో ఒకమూల ఆఫీసు తెరిచాడు. వెనక పెద్ద రామపట్టాభిషేకపటమూ, ఒకరిద్దరు కాంగ్రెసు నాయకులూ, ముందు పెద్దపెద్ద అద్దకాల తెరా, కింద తివాసీ, వెనక బాలీసూ, కాయితాలు, పుస్తకాలు ముందూ, స్నానంచేసి, జుట్టు దువ్వి, తెల్లని కద్దరు పంచా, కుర్తా, టోపీ ధరించి కూచుంటే, అతని మనసుకి అత నికే కొంతఘనత కలిగింది. బైటనించి జనసమ్మర్దపు రొదా, రెండుమూడు భాషలలో అప్పుడప్పుడు కీర్తనలూ, తాటాకువాసనలతో కలిసి వాయిద్యాలూ, వినపడుతున్నాయి. కాంగ్రెసు భవనాలు యుద్ధ శిబిరంవలెనూ, తానొక నాయకుడివలెనూ, తన కింది వాలంటీర్లు సేనవలెనూ, నాయకులు పూజ్యులైన దండనాయకులవలెనూ తోస్తున్నారు అతనికి. చలిలో చన్నీళ్లస్నానమూ, కడుపులో వేడికాఫీ అతనికి శరీరస్వస్థతకు తోడు పడ్డాయి.

సుందరశివరావుది కాకినాడ. చిన్నతనంనించీ అతనికి హిందూమతమూ, పురా ణాలూ, అగ్రదేవతలూ అంటే చాలాభక్తి. హిందూమతోద్ధారకులైన నానక్, శివాజీ, తుకారాం, తిలక్, మొదలలైనవా రెప్పుడూ అతని ఆదర్శప్రపంచంలో విహరిస్తోవుం టారు. కాని దేవత లందరిలోనూ శ్రీరాము డతని యిష్టదైవం. రాముడి ధర్మశీలమూ, విధేయతా, ధర్మంకోసం త్యాగమూ, అన్నీ శివరావు స్వభావానికి appeal ఐనాయి.

సుందరశివరావు మొదటినించీ తనజీవితాన్ని మతానికీ, ఆ మతానికి నిలయమైన దేశానికీ అర్పించ తలుచుకున్నాడు. తన తోడివిద్యార్థులతో హిందూమత పునరుద్ధరణ చెయ్య పూనుకుంటే, వాళ్ల మనసులు దీక్షారహితం కావడంచాతా, వాళ్ల ఆశయాలన్నీ పరీక్షకృతార్థత మీాదా, ఫుట్‌బాల్‌మీాదా, సురభినాటకాలమీాదా చలిస్తో వుండడం చాతా, బ్రహ్మసమాజ బోధనలచాత కులాచారసమస్యలు బైలుదేరడంచాతా, అతని ప్రయత్నం సాగక హిందూ పరిపాలన దేశానికి తటస్థిస్తేనే కాని మతోద్ధారణ వీలు లేదని నిశ్చయించుకున్నాడు. బ్రహ్మచర్యం పూనాడు. సంసారము యేదీక్షకు కూడా ప్రథమ అభ్యంతరము.

నాలుగువేలు కట్నమిస్తామని సంబంధం తటస్థించింది. పీటలమీాద కూచుంటావా యింటోంచి నడుస్తావా అన్నాడు తండ్రి. గారాబంగా పెరిగినవాడు కావడంచాత, యెంత మతభక్తివున్నా అతనికి తల్లినీ, బంధువుల్నీ విడవడం చాతకాదు. అది గాక బి.ఏ. ఐతేనే

కాని, మతంలోగాని దేశంలోగాని గౌరవ ముండదు. అసలుసంగతి తండ్రిని చూస్తే అమిత భయం. కనక బ్రహ్మచర్యాదర్శాధిక్యతను ప్రశ్నించి, ఏమో ఏకారణంచేత శ్రీరాముడు గృహస్థాశ్రమాన్ని అవలంబించాడో, అని తర్కించుకుని, సంతానాభివృద్ధిని వేదాలు విధిగా ఆదేశించిన విషయం జ్ఞాపకం తెచ్చుకుని, రాముణ్ణి ఆదర్శంగా, బ్రహ్మచర్య ఆదర్శాన్ని పితృవాక్యపరిపాలనకింద మార్చి, పెళ్లిచేసుకున్నాడు. భార్య కాపరానికి రాగానే ఏకపత్నీవ్రతం తనకీ, పాతివ్రత్యం భార్యకూ ముఖ్యవిధులని నిర్దేశించి, పాతివ్రత్య మేమిటో (అపాతివ్రత్య మేమిటో యెరగని ఆ కమలకు), పురుషులంటే మనసు చలించడమూ, ఆకర్షణా, నిగ్రహమూ, మొదలైనవన్నీ బోధించాడు.

కాకినాడకు కాంగ్రెస్ వొచ్చినప్పుడు సుందరశివరావు వాలంటీర్ల అధిపతికింద చిన్న అధిపతి ఐ ప్రత్యేకంగా ఆఫీసు తెరిచాడు. కమల స్త్రీవాలంటీర్లలో చేరింది. యెంత బోధించినా కమలకు యీ మతభక్తి, దేశభక్తీ వొంటబట్టలేదు. భర్త ఆవేశమూ, భక్తీ, వాటిఅర్థ మేమిటో ఆమె ప్రశ్నించుకోలేదు. ఆమె అన్నకి దగ్గువలెనే, ఆమె తల్లికి ఆచారమువలెనే, కోడికి కుయ్యడమువలెనే, భర్తకి అదో స్వభావమని అంగీకరించింది. కాని యీ కాంగ్రెసుపని చాలా తమాషాగా వుంది. ఇదివరకల్లా కమలకి దేశభక్తి ఏ పుస్తకంలోనో నాలుగు పేజీలు కంఠతా పల్లించడమూ, భర్తయిచ్చే లెక్చరుగూ రూపంలో కనబడేది.

ఇప్పుడా దేశభక్తి చాలా ఆకర్షకరూపాన్ని ధరించింది. పాటలూ, పహారాలూ, గంతులూ.

సుందర శివరావుకి యీ ఆడవాళ్లింత స్వేచ్ఛగా మొగవాళ్లమధ్య తిరగడం రుచించలేదు. స్త్రీ దేశసేవ చెయ్యవలిసిందే కాని స్త్రీ శాఖ ప్రత్యేకంగా వుండి, మొగవాళ్లతో సంబంధం వుండకుండా వుండాలని అతని ఉద్దేశ్యం. అది యెట్లా సాధ్యమో ప్రస్తుతం తోచలేదు కాని ఒక ప్రణాళికను సిద్ధంచెయ్యాలని యోచిస్తున్నాడు.

అది గాక యీ మూడురోజులనించి చూడగా యీ నాయకుల కెవరికీ మతాభిమాన మున్నట్టులేదు. చాలామంది నిరీశ్వరవాదులుగా వున్నారు. అంత యెక్కువగా యీ మహమ్మదీయుల మతంతో చేతులు కలపడం హిందూమత సాంప్రదాయానికి విరుద్ధంగా కనపడుతోంది. ఈ అస్పృశ్యత కూడా ఆలోచించవలిసిన విషయమే! కానీ, యీ ప్రస్తుత నాయకులు స్వరాజ్యాన్ని సంపాయిస్తే, తాను హిందూమత పునరుద్ధరణ చెయ్యవొచ్చు.

బైట పకపకమని నవ్వు వినపడ్డది. ఆ నవ్వు తనధ్యాసల నన్నిటినీ చెదరకొట్టి వెన్నెలనూ, పువ్వులనూ వెదజల్లుతోంది. విసుక్కున్నాడు. మాటిమాటికీ తన ఆఫీసులోకి

# ప్రేమపర్యవసానం

ఆ తెరను ఒక్క వూపుతో పక్కకి లాగేసి, యిసికను తివాసీమీదికి చిమ్ముకుంటూ, ప్రతి చిన్నపనికీ, అనుమానానికీ, తన ఆఫీసులోకి వొస్తుంది ఆ బెంగాలీ పిల్ల, నిర్మల. రామభక్తిలో, కాంగ్రెసు సేవలో, వాలంటీర్ల విధులతో, కంప్లెయింట్లతో, ఏకపత్నీ వ్రతంతో నిండివున్న అతని మనసు ఆమెని చూడగానే, యమునా ప్రవాహమూ, సందేశాల మాధుర్యమూ, చంపకపువ్వుల వాసనా, విప్లవోద్యమతీవ్రతా, వీటివేపు పరిగెత్తి కలవరపడుతోంది. కాని అతనికి మనసులో ఆమె వొదిలివెళ్లే గొప్ప అశాంతి మాత్రమే గుర్తు తెలుసు. ఆమె ప్రతి యువ్వనుడితోనూ బుజాలమీద చేతులు వేసి 'భాయీ' అంటూ గంతులు వెయ్యడం, ప్రతి ముసలివాణ్ణీ (కాంగ్రెసు మహానాయకులనన్నా వొదలక) వెక్కిరిస్తూ నవ్వడం అతనికి రుచించలేదు. కాని యువకుడి ఖద్దరుబుజంమీద మెత్తని జరీతో అల్లిన భుజకీర్తులవలె కనపడే ఆమె వేళ్లను గాని, ఆకాశంలో యెగిరే చిలకల అరుపులవలె, తాటాకు దళ్లల్లోంచి, దేశసేవా తత్పరాలైన హృదయాల్లోంచి, భీషణములైన బిరుసుగడ్డాల్లోంచి, దూసుకు పోయ్యే ఆమె నవ్వునించి గాని, అతను మనసు మళ్లించుకో లేకపోతున్నాడనేసంగతి అతని కింకా తెలీదు. ఒక్కొక్క మాటకు పది చిరునవ్వులు, నాలుగు సంగతులు చెప్పేలోపల ఐదారు గంతులూ, యెవరితో మాట్లాడినా వారిమీదే చాలా యిష్టమున్నట్టు చూపులూ,—పాండవశిబిరంలో వుత్తర జ్ఞాపకం వొస్తోంది అతనికి. అభిమన్యు డెవరు?

నిర్మల ఆ తెరను చేతితో పక్కకు నెట్టకండానే ఆఫీసులోకి తట్టైను యిసిక చిమ్ముకుంటూ దూకి, తివాసీమీద పడి, బాలీసు వెనక నక్కింది.

"రక్షించండి, రక్షించండి: శరణాగతురాలను. ఆర్తశరణ్యా! మీరే దిక్కు నాకు."

చప్పున లేచి అతను 'ఏమిటి?' అన్నాడు.

"ఈ ముసలివాళ్లు_ముసలివాళ్లు_పోనీ ముసలినాయకులు వొస్తే వొచ్చారు. ఈ ముసలినాయకురా ళ్లెందుకు మనకు? మనకి కూర వొడ్డించలా, ఆకుర్రాణ్ణి డెలిగేటుగా పెట్టి ఈ ముసలమ్మల్ని వొడ్డనలో పారెయ్యకూడదూ?''

ఇదేదో హేళన అనుకుని, తన కలవరానికి సిగ్గుపడి, అతను వూరుకున్నాడు.

''ఏం జరిగిందో అడగరేం?''

'' అవును.''

నిర్మలకు నవ్వు ఆగటంలేదు.

"శాంత స్నానంచేసి, బట్టలకోసం పెట్టె వెతుకుతోవుంటే నేను చేరాను...హా! హా! హా! దాంటో ఏముందంటారు. పెద్ద పరికిణీ! దాన్ని చేతులు నిరిచి పైకి లాగి

దానికే కట్టాము ..హా హా హా...డాన్సు...డాన్సు...హా హా హా...నేను పెట్టెమీద తబలా, ఆ మదరాసీపిల్ల నోటితో హార్మోనియం.....ఇంతలో దళనాయకురాలు వొచ్చింది. హా, హా, హా. చివాట్లు! వింటేనా మేము! ఇంతలో లలిత అందికదా, 'నువ్వు కాంగ్రెసునాయకుల వెనక డాన్సు చేయడం ఎంతో అన్యాయమా.' కొట్టింది లలితని లలిత కొట్టింది. ఇప్పుడు రిపోర్టు."

"అక్రమం!"

"ఏమిటి అక్రమం—కొట్టడమా, డాన్సా?"

"అంతా."

"సాయంత్రం యీ ఆఫీసులో డాన్సు. అప్పుడే కాగితాలు అచ్చుకిచ్చి వచ్చాను."

"ఛా!"

నిర్మల లేచింది.

" 'ఛా' కి యాభై యేళ్ళు, నీకు డెబ్బై యేళ్ళు. ముసలి వాడివి. నీతో నేను మొహం పెట్టు కోడ మేమిటి?"

అని వొక్క దూకు దూకింది.

"నేను మళ్లీ వొచ్చేప్పటికి నీ హృదయం మీది బూజుసంతా దులుపుకుని, ఆఫీసుని డాన్సుకి సిద్ధంచెయ్యి."

అని అతని వీపుమీద ఒక్కటి చరిచి పరిగెత్తింది.

ఆ వుదయం అత నింకేమీ పనిచెయ్యలేదు. ఏ అడుగులచప్పుడైనా నిర్మలేనని అర్థంలేని ఆత్రుతతో చూస్తున్నాడు. కొంతసేపటికి రాలేదని కోపంకూడా వొచ్చింది. ఎక్కడ తిరుగుతోందో! వెళ్లి చూస్తే?—ఏమిటి: మరీ మతిపోతోంది! ఏం పుట్టింది తనకి, ఇట్లా వేరేధ్యాసలో పడడానికి?

మధ్యాన్నానికి మరిచిపోయినాడు. భోజనందగ్గిర కూడా నిర్మల కనపళ్లేదు. ఆమె వుండే వేపుకి సుందరశివరావు వెళ్లలేదు.

సాయంత్రం కాంగ్రెసు జరుగుతోంది. అన్నియేర్పాట్లూ చేసి అలిసివొచ్చి, బాలీసుకి జేరబడ్డాడు. నిర్మల మెల్లిగా వొచ్చి ఎదురుగా కూచుంది.

"ఆ నల్లటి కాప్టెన్ లేడూ, అతన్ని అడిగాను, పదిమంది వాలంటీర్లని నాకు వొప్పజెప్పమని. ఎందుకో తెలుసునా, హా, హా, హా, వూరినిండా పోస్టర్లు అతికించాలి.

ఏం పోస్టర్లంటాడు. చూపిస్తే వొప్పుకోడు మరి: కాని నాలో అంత నమ్మకం లేకపోవడ మేమిటి? అంత జమాను ఉన్నాడా, అంతపిరికి మళ్లీ! మళ్లీ అనకండేం! అసలు ఆ కనక రాజుని చూస్తే నాకు పరమ అసహ్యాం! అసహ్యామైన వాళ్లని వెళ్లకొట్టడానికి కాంగ్రె సులోనుంచి........."

"పొద్దున్న ఫిర్యాదు ఏమయింది?"

నిర్మల చేతులు ముకుళించి ధ్యానం చేస్తోంది. అతనూ మాట్టాడక కూచున్నాడు. కళ్లు మూసుకునే నవ్వుతోంది. వేళ్లసందులనించి వెలుగులాగు వొస్తోంది ఆనవ్వు.

"ఏమిటి?"

"నా ప్రార్థన విన్నాడు!" అంది.

"ఎవరు?"

"నీ శ్రీరాముడు."

"ఓ—"

"నీ కెప్పుడన్నా వర మిచ్చాడా?" అని అడిగింది.

"లేదు."

"నా కిస్తాడు."

"పో."

"ఏం వరం—అను ప్రశ్న అడగడమే తెలీదు యీ కాప్టెన్‌కి."

"అడిగాను."

"మా నాయకురాలికి గర్భం రావాలని."

"ఎందుకు?"

"వొచ్చే కాంగ్రెసునాటికి వొస్తే అప్పు డామెరూపం చూడాలని వుంది."

"తప్పు."

"మీకు తప్పు, శ్రీరాముడేగా యీ సృష్టికి కారణం, ఆయనకి తప్పు లేదు."

"అదే పని శ్రీరాముడికి!"

"మరి భక్తవత్సలుడికి అంతకన్న యింక పనేమిటి? మరి వరా లియ్యకపోతే ఎందు కట్టా అక్కడ ఆ పటం? తీసి అవతల పారెయ్యి."

"తప్పు."

"మరి నావరం యిస్తాడా?"

"ఇయ్యడు."

లేచింది. పటాన్ని ఒక్కచూపు చూయించింది. అతను ఆమె నాజూకానికి చెయ్యి పట్టుకున్నాడు.

"వొదులు. నేను నీకోసం మంచిపటం తెచ్చిపెడతా. ఇది పారెయ్యనియ్యి. వాడిబొజ్జ చూస్తే నాకు నేత్రకంటకంగా వుంది. పీపట్ల, మోహనుట్ల! తిండిపోతు—ఒక్క రాక్షసుడు కనపడ్డాడా పరుగెత్తుతాడు—కాదు కాదు—పరిగెత్తనేలేడు."

అతనితో పెనుగులాడింది. ఆమె రెండుచేతులూ గట్టిగా పట్టుకుని ఆపుతున్నాడు. నవ్వుతోంది. జుట్టు రేగింది.

"వుండు, వుండు నువ్వు యీసారి బైటికి వెళ్లినప్పుడు......" అంటోంది ఆయాసంతో.

"ఆ పటాన్ని తీశావా—"
కమల వొచ్చి నుంచుంది గుమ్మంలో. నిర్మలని వొదిలేశాడు.
"కమలా, యీ పటాన్ని తీయించవూ నీ పెనిమిటిచేత !"
కమల మాట్లాడలేదు.
"కమలా, నువ్వతన్ని పట్టుకో నేను లాగేస్తాను."
మాట్లాడలేదు.

"మీ యిద్దరికీ యేదో తగాదా వున్నట్టుంది. తీర్చుకోండి. వొస్తాను." అని వెళ్లిపోయింది నిర్మల.

కమల మొహంవంక కళ్లెత్తడానికి సిగ్గుపడ్డాడు అతను.

"అమ్మ వొచ్చింది. ఈ సాయంత్రానికి నన్ను యింటికి రమ్మంటోంది. మా పిన్ని వొచ్చిందిట !"

"ఏం ! మీ పిన్ని యిక్కడికి రాకూడదూ ? నువ్వు వెళ్లడానికి వీల్లేదు. కాంగ్రెసు పనికంటేనా యీపిన్నులు !"

"పిన్ని కాదు. పిన్నిమొగుడు రిజిస్ట్రారు మరి. అతనికి మాట వొస్తుందిట !"

"చావమను. పిన్నినీ, మొగుణ్ణీ కలిసి కళింగల్లో పడమను. నువ్వు వెళ్లడానికి వీల్లేదు."

కమల కన్నీళ్లతో వెళ్లిపోయింది.

## ప్రేమ పర్యవసానం

సాయంత్రం కమలా, అతనూ నిర్మలా, గోష్ సముద్రం దగ్గిరికి నడిచి వెళ్లారు. ఉప్పుకాలవను దాటించిం తరవాత అతను నిర్మలవేళ్లను వొదలలేదు. గోష్, కమలా బాగా ముందు నడుస్తున్నారు. అతను ఆమెచేతిని వొదలబోయినప్పుడు నిర్మల వొదల్లేదు.

దోవలో యిద్దరు వాలంటీర్లు కనపడ్డారు; అతనికి శాల్యూట్ చేశారు.

"మీ రిద్దరూ యీ సాయింత్రం సామాన్లదగ్గిర వుండవలసినవారు, అవునా? యిక్కడ వున్నారేం?"

"మిగిలినవా ల్లిద్దరూ చూస్తు మన్నారండి. అంత పనిలేదు. కనక కొంచం తిరుగుదామని వొచ్చాం."

"ఇది 'డిసిప్లిన్' భంగం. పదండి వెంటనే నేను వొచ్చి విచారిస్తాను" అన్నాడు.

వాళ్లు కొంచందూరం వెళ్లి అతనికి వినపడేట్టు
"తమ రిట్టా ఆడవాళ్లతో షికార్లు తిరుగుతున్నా రేం?" అన్నారు.
వెంటనే సుందరశివరావు వాళ్లని వెనక్కి పిలిచాడు.

"నేను మీకు గాదు జవాబు చెప్పవలిసింది. నామాట వినడమే మీవిధి. ప్రశ్నించడం కాదు. ఈ మాత్రం 'డిసిప్లిన్' అర్థంచేసుకోలేని మూర్ఖులుండమట్టే మనదేశ మిల్లా ఏడుస్తోంది. మిమ్మన్ని వాలంటీర్లుగా చేరమని ఎవరన్నా ప్రాధేయపడ్డారా? వొప్పుకొన్న వాళ్లు పనిచెయ్యాలి. చెయ్యకపోతే బుద్ధితక్కువయిందని తప్పుకోవాలి. పొండి" అన్నాడు.

వాళ్లు సిగ్గుమొహాలు వేసుకుని దాటారు. నిర్మల అతని జబ్బని రెండుచేతులతో పట్టుకుని—

"బాగా చేశావు—మీవంటివాళ్లు పదిమంది వుంటే స్వరాజ్యం వారంరోజుల్లో వొస్తుంది."

"నేను వొక్కణ్ణి వున్నాగా! పది వారాల్లో రాదూ?"

"నాకు లెఖ్ఖలు రావు!"

తననీ, తనమొహాన్నీ, చేతుల్నీ, జుట్టునీ, ఆమెకళ్లు వెతుకుతున్నాయి. సముద్రంలో అంతమయ్యే మైదానమూ, సముద్రపు పిట్టల అరుపులూ, గాలీ, సాయింత్రపు టాకాశమూ, పక్కన తన జబ్బని పట్టుకుని, తనని పూజించే యీ యువతీ—అతనిమనసు అక్రమమైన కలతపడుతోందని తట్టింది అతనికి.

వెంటనే ముందు నడుస్తున్న కమలవంక చూశాడు. అతనికి జీవితంలో మొదటిసారి తట్టింది కమల అందమైనపిల్ల అని. ఈదేశంలో సామాన్యంగా అందరి నిర్భాగ్యుల వలెనే అతనుకూడా యెన్నడూ భార్య అందాన్ని గుర్తించి యెరగడు. కమల యెంతవరకు తన ఆశయాలకి తోడ్పడుతుందా అని యోచించాడు. ఆమె గుణాల్ని ప్రేమిస్తున్నానని తనని చూచి తనే గర్వపడుతున్నాడు. ఆమెశరీరాన్ని సంసారపక్షంగా వుపయోగించుకున్నాడు. బెంగాల్‌నించి నవ్వులతో గంతులతో గులాబి అందాలతో, నిర్మల వొచ్చి అతని కళ్లు తెరిచిందాకా, స్త్రీని అందాన్నీ వేరుచేసి అతను చూడలేదు.

కమలవంక చూసి యెంత అందమైనదా అనుకున్నాడు—నిర్మలవంక చూసి యెక్కడ వుంది యీ ఆకర్షణ అని ప్రశ్నించాడు. కాని కమలసౌందర్యంవంక చూస్తే అతని మనసు కేమి ఆకర్షణ కలగలేదు. పాపం! ఆకాశనీలంవలె, ఉదయకాంతివలె, అతనికి అలవాటయింది. ఆ ఆకర్షణకాలం వృథాగా జారిపోయింది. తన మాటకి విధేయతతో, తన సేవలో శ్రద్ధతో భక్తిగా, ప్రేమగా, తనఛాయ ఐ బతికే కమలకీ; తనని తిప్పలుపెట్టి, మెచ్చుకుని, తృణీకరించి, కనపడక, తప్పించుకుని, తటాలున మెరిసి, నవ్వి, కోపించి, గంతులువేసే యీ నిర్మలకీ—ఎంతభేదం! అతని హృదయంలో కలిసి గుర్తు లేకుండా మాయమయింది కమల, తనహృదయాన్ని పైటి కీడ్చి, మంత్రించి, జాడించి, వేధిస్తోంది నిర్మల.

తిరిగి యింటికి వెడుతూవుండగా పడమట మెరిసే బృహస్పతివంక చూస్తూ కమల:

"ఎందుకు, కూచున్నంతసేపూ మీవంకే చూస్తుంది నిర్మల?" అంది తటాలున.

"చూస్తేనేం? మనుష్యులవంక చూడకుండా యెట్లా? కళ్లు మూసుకోమంటావా?"

"అదేదోవిధంగా చూస్తుంది."

"అది నీ మనసులో వికారం అంతే. ఘోషు చూడడమూ నీ వంక!"

కమలకి కోపం వొచ్చింది మనసులో! ఉత్తమాటలతో తప్పించుకోవాలని చూస్తున్నాడు.

"ఒకటే నంటారా? వొద్దంటే ఘోషుతోమాట్లాడను. మీరు నిర్మలతో మాట్లాడ్డం మానతారా?"

"భేదం వుంది. నువ్వు మానేస్తే ఆ నింద నామీదే పడుతుంది: నేను మానడానికి కారణం వుండాలి."

"ఆ చూడడంతో ఆగితే బావుండును."

"మధ్యాన్నం సంగతా అనుమానపడుతున్నావు? ఏమీ లేదు, నీభ్రమ."

"ఏమిటి అంటోంది?" అన్నాడు ఘోష్.

"మధ్యాన్నం నేనూ, నిర్మలా రామపటంకోసం పోట్లాడాము. ఆ సంగతి అడుగుతోంది." అని యింగ్లీషులో చెప్పాడు సుందరశివరావు.

"అవును : ఆ రామపటం యెందుకు తగిలించావు, అక్కడ?"

"రాముడంటే నాకు భక్తి."

"నీకు! ఎందుకు?"

"రాముడు, శ్రీమన్నారాయణుడు."

"నారాయణుడిపటమే వుందిగా!"

"కాని ఆదర్శపురుషుడు కూడా."

"ఎందుకో!"

"అంతానూ."

"ఐనా చెప్పు."

"రాక్షసుల్ని చంపి లోకకంటకం మాన్పాడు. గొప్పయోధుడు."

"ఎందరు పోలీసులు దొంగల్ని పట్టలేదు. నెపోలియన్, హానిబాల్ మొదలైన యోధు లెందరు లేరు!"

"మరి తండ్రిఆజ్ఞ ప్రకారం ఎవరు 14 ఏళ్లు దుర్గమారణ్యాల్లో విహారిస్తారు?"

"తండ్రి అక్రమంగా యిచ్చిన వరాన్ని పాలించడం అవివేకమైనపని. తరువాత నాకు అరణ్యాలంటే భయం గాని రాముడివంటి యోధుడికి అదొకగొప్ప యేముంది? పైగా సేవకి భార్య, తమ్ముడూ, పర్ణశాలలూ......అది గాక ఎన్నేళ్లు రాజ్యంచేశాడు."

"పదహారు వేలేళ్లు గావును."

"అన్నేళ్లు రాజ్యంచేసినవాడికి పధ్నాలుగేళ్లు వనవాసం ఒకలెఖ్ఖా—అంటే నీ బతుక్కీ నాబతుక్కీ అరనిమషం అన్నమాట—పెళ్లాన్నెత్తికెళ్లిన వాడితో తగూలాడ్డం ఒక ఘనతా! ప్రతివాడు చేస్తాడు."

"మరి ఏకపత్నీ వ్రతుడే!"

"మరి సీతని అడవికి పంపేప్పుడు ఏమని ఏడుస్తుంది—రాముడి కేం, అందరు వుంచుకున్న స్త్రీలలో నే నొకత్తెను—అంటుంది. దాని కేమంటావు?"

"అబద్ధం."

"ఋజువుచేస్తే పందెంకడతావా? ఇంకోసం దేహం—అంత ఆరోగ్యవంతులైన సీతకీ రామునికీ ఆ పధ్నాలుగేళ్లలో పిల్లలు పుట్టలేదేం? పూర్వంకూడా ఏదో Birth control వుండేదోయ్."

ఈ కాంగ్రెసులో ఏదో సేవాదీక్ష ఎక్కువవుతుం దనుకున్నాడు గాని, తనకాళ్ల కిందనించి భూమే మాయమౌతున్నట్టుంది అతనిప్రాణానికి. ఈ ఆడవాళ్లముందర ఇట్లాంటి సంగతులు మాట్లాడతా డేమిటి?

"దేశంకోసం భార్యనుకూడా త్యాగంచేశాడే! అతను ఆదర్శం కాదా!"

"నిజంగా దేశంమీద ప్రేమ వుంటే అనేకభార్యలకు వందలకొలది తనవంటి యోధుల్ని కనాలి. ఈ దేశసేవకు లందరూ నేర్చుకోవాలి అది. వీళ్లైనచోటల్లా, వందల కొలది పిల్లల్ని కని, యోధుల్ని తయారుచెయ్యాలి. ఈ భీరులందరూ పందులవలె అనామ కుల్ని కని ఎందుకు దేశభారం వృద్ధిచెయ్యడం? శ్రీరాముడే ప్రజలకోరిక ప్రకారం వర్తించేవాడైతే మరి ప్రజలందరూ రాజ్యం చెయ్యమంటోవుంటే అడివికి పోయి నాడేం? అక్కడ తండ్రిఆజ్ఞ పాలించాలి. ఇక్కడ భార్య గనక ప్రజలు అడక్క ముందే నిప్పులో దూకించాలి. కడుపుతో వుంటే తన పనికి అడ్డమని అడివికి పంపించాలి! ఇది స్త్రీల కిచ్చిన గౌరవం యీదేశంలో! ప్రజలకోసం త్యాగం చేశాట్ట! ఎవరు త్యాగం చేసినా ముందు భార్య కనపడుతుంది. ఆ ఆదర్శం పెట్టుకునే భార్యచేత ప్రతివాడికీ చాకిరీ చేయిస్తారు—తండ్రికి, తల్లికి, అన్నలకి, అక్కలకి, అతిథికి—అంత భక్తి వుంటే తను చేసుకోవాలి; భార్య యెందుకు?"

"మరి మన కాంగ్రెసు శిబిరంలో స్త్రీలకు స్వేచ్ఛ లేదూ?"

"ఈ వేడిలో అంతేలే! చూడు: యీ రాజకీయవుధృతం తగ్గగానే మళ్లీ గూళ్లల్లో దాచుకుంటారు. ఈ ఆడవాళ్లుమాత్రం—నలుగురూ హర్షిస్తున్నారు గనక తయారై వొచ్చారు.—కీర్తికోసం—వీళ్లకిమాత్రం నిజమైనస్వేచ్ఛ కావా లనుకున్నావా? స్వేచ్ఛ యిచ్చేసుఖం కావాలి—బాధ్యత కాదు. కమలను నేను కలకత్తా పిలుస్తా ననుకో. కమల వొస్తా నంటుంది నువ్వు లేకండా; ఏమంటావు నువ్వు? అదేరకం అందరూ! కమల యేమంటుంది? ఇంకే ఆడవాళ్లు వొస్తా రంటుంది. అందరూ అంతే!"

రాత్రి పడుకున్నప్పుడు—సముద్రం వొడ్డున నిర్మల పాడినపాటా, ఆమె డాన్సు చేసినప్పుడు కదిలిన చిన్నరొమ్మూ, సన్నని నడుమూ, నవ్వే కళ్లూ, అతని నిద్రను భంగ పరిచాయి.

అతని దేశవ్రతాదర్శమూ, ఏకపత్నీవ్రతమూ మనసుని కుట్టాయి. కాని శ్రీరాముడు అంతదీ_ప్తితో గోచరించలేదు. కమల తనవలె పరపురుషుడితో సంచరి_స్తే తన కెట్లా వుంటుందీ. ఆనిర్మలవుద్దేశ్య మేమిటి? ఆమెతో అంతచనువుగా వుండడం తనఆదర్శాలకూ స్వభావానికీ తగినపని కాదు, ఇట్లా స్త్రీలచూపులచేత చలించేమనిషి తా నేం దేశసేవ చెయ్యగలడు? కాని ఆమెపెదవులు—ఒక్కసారి ముద్దుపెట్టుకోగలిగితే! ఆమెకూడా యిష్టపడేట్టే వుంది. ఒక్కసారి ఆ ఆనందాన్ని పొంది, ఇంక స్త్రీని వర్జి_స్తే సరి! కాని ధర్మమా? కమలయెడల న్యాయమా? కాని కమలాతొనవంటి ఆపెదిమ, ఆ చిన్ని లేతరొమ్ము, చురుకుగా గంతులువేసే ఆకాళ్లు, తన అరిచేతులో గిలగిలలాడిన ఆవేళ్లు—

మర్నాడు సాయంత్రం అతన్ని యువకులు ఉపన్యాసమిమ్మన్నారు. దేశసేవనిగురించీ, దీక్షా, త్యాగమూ, అగ్ని కురిపించాడు. యువకులలో స్వార్థపరత్వాన్ని, ప్రమ_త్తతనూ అతనిమాటలు చీల్చి చూపించాయి. అంతసేపూ నిర్మలకళ్లు అతనిముఖంచుట్టూ, మెడా, బుజాలూ తాకుతో, భ_క్తితో, సంతోషంతో, భయంతో తిరుగుతున్నట్టు తెలుస్తోనే వుంది.

తనని అభినందించే ప్రజలు వొదలగానే కమలవంక తిరిగి,

"ఎట్లా వుంది?" అన్నాడు.

నిర్మలభ_క్తికన్న తన సహధర్మచారిణి కమల మెచ్చుకోవాలి, తన జీవితమంతా ఘనకార్యాలకి పురికొల్పాలి.

"బాగానే వుంది."

ఉపన్యాసతీవ్రతలో వేడెక్కిన అతనిర_క్తం ఒక్కసారి పదిడిగ్రీలు జారింది. వూరుకున్నాడు. మళ్లీ రాత్రి భోజనమైన తరవాత గాని కమలతో మాట్లాడేందుకు సమయం చిక్కలేదు. యీలోపున తనబాధని తరిచి చూచుకుని కమలని ప్రశ్నించా లనుకున్నాడు.

"ఎందుకు 'బాగానే వుంది?' అన్నావు?"

"న న్నడిగారుగా!"

"లేదు. విన్నవాళ్లందరూ—మళ్ళీ భోజనందగ్గిర, నాయకులుకూడా—నేను మాట్లాడిన పద్ధతి అద్భుతంగా వుందన్నారు—"

"నేను బావుండ లేదన్నానా? కాని నాకుమాత్రం—అంతా వు_త్తమాటల్లాగు కనపడ్డది. అట్లా మాట్లాడ్డంకన్న ఏదన్నా పనిచే_స్తే బావుండు ననిపించింది."

"ఏంపని? చెయ్యటంలేదా?"

"ఈకాస్తకేనా అంతవుపన్యాసం! ఏదో జీవితమంతా త్యాగంచేసి, ఎన్నోఏళ్లు బాధలలో గడపినవాళ్లు మాట్లాడాలి. మీాను సుఖంగా భోజనంచేసి కూచుని ఆ త్యాగాలు మాట్లాడ్డం నా కేమీా బాగా లేదు."

"మరి యేం చెయ్యను? త్యాగాలఅవసరం రానీ."

"అప్పుడు మాట్లాడండి. అవసర మొచ్చి త్యాగంజేసి, అప్పుడూ యీావుపన్యాసాలు—యిప్పుడే యెందుకు?"

"మరి నిర్మల యేమంది—యీాసాయింత్రం—'ఈముసలివాళ్లందరూ గొప్పనాయకుల మనేవాళ్లు ఎంతోకాలంనించి ఉపన్యాసాలు అలవాటైనవాళ్లుకూడా నీమల్లే నిప్పులు కురిపించలేదు. నీవు నిలువునా అగ్నే!' అంది. మరి యితరులని పురికొల్పడంకూడా ఒక కార్యం కాదా?"

"మాటలతో ఎవరికీ పురెక్కదు."

కమల తనని అన్యాయంచేస్తోందని అతనికి తోచింది. తన ఘనతని గుర్తించని భార్య! తనమీాద యేమైనా భక్తి వుందా యీాకమలకి!

"చూడండి, రండి వెన్నెలవంక చూద్దాము."

మారు పలక్కుండా కండువా వేసుకుని ఒక్కడూ రైలుకట్టకేసి పోయినాడు.

తిరిగి వొస్తోవుంటే చాలామంది యువకులూ, స్త్రీలూ వెన్నెల్లో, యిసికిలో ఆటలాడుకుంటున్నారు.

నిర్మల అతన్ని చూడగానే పరిగెత్తుతో వొచ్చింది.

వెనక ఎవరో పిలుస్తున్నారు.

"నిర్మలా, వెడుతున్నావేం?" అన్నారు యెవరో.

"నాసుందర్ వొచ్చాడు. నే నింక రాను."

ఏమనుకుంటారు వాళ్లు? కమల తనవంకన్నా చూడకుండా ఆడుకుంటోంది. ఇంకా కోపమే గావును!

"ఏమైనావు నువ్వు? అందర్నీ వెతికాను నీముఖంకోసం!"

అతనిజబ్బని రెండుచేతులతోనూ పట్టుకుంది.

"చూడు, యీాయువ్వన రక్తాన్నంతా చూడు. ఈనాడు యిట్లా ఆడుతున్నారు. రేపు దేశంకోసం బలిపోతారు. నువ్వు నాయకుడివై..."

"నాయకుణ్ణి కావొద్దు, ఏమొద్దు. నన్నూ బలికానీ—"

"నాతో సహా—"

"రా."

అంతే కావాలి కమలకి! తనని నిర్లక్ష్యంచేస్తే తనకిమాత్రం ఏంలక్ష్యం? నిర్మలతో దూరంగా నడిచి వెళ్ళాడు. చప్పున నిర్మల :

"ఆయిసికమీంచి జారదాం—ఎవరు ముందరో పైకి..."

సగం పరిగెత్తి అతనిమెడని పట్టుకుని వేళ్లాడింది ఆయాసంతో.

అర్థ మేమిటి ? ఇంత చనువుగా వుండడం వాళ్ల దేశాచారమా, లేక—

ఈమె బ్రహ్మసమాజపుపిల్ల—వాళ్లలో స్త్రీలు స్వేచ్ఛగా వుంటారు—అందువల్ల నేమో !

ఇసికలోంచి కిందికి దొల్లుతోవుంటే—ఆ నవ్వేబుగ్గలు, గట్టిజాకెట్, ఆ చక్కని బుజాలు, ఆ గంతులు, నవ్వు.... ..

"చూడు—వాళ్లందరూ ఒకచోట కూచుని ముసలివాళ్లమల్లే కబుర్లు చెప్పు కుంటారు. ఈశిబిరానికల్లా—నువ్వూ నేనే పిల్లలం—ఆడుకుందాం..."

ఆటేనా ! అవునా, కాదా ?

"నిర్మలా !"

ఆగి ముఖ మెత్తి చూచింది. అతని కంఠస్వరంలోని అర్థం గుర్తించినట్టుంది. మొగ పిట్ట అర్థం గ్రహించి ఆయత్తపడే ఆడపిట్టవలె చూస్తో నుంచుంది.

ముద్దు పెట్టుకుంటే—

అదీ ఆటే అనుకుంటే—

ఆమె కళ్లల్లోకి చూస్తో నుంచున్నాడు. ఆమె నిర్భయంగా చూస్తోంది. అత నేమీ చెయ్యలేదు. అతనిదీక్షా, అనుభవరాహిత్యమూ, విద్యా, అన్నీ అడ్డపడ్డాయి. పరిగెత్తుతో వొచ్చి గుంపుని కలుసుకున్నారు: ఇసికతో, నవ్వుతో నిండినకళ్లతో—

కమల మర్నాడు ఏమీ సంతోషంగా అతనితో మాట్లాడనే లేదు.

ఘోష్ అతని శ్రీరాముణ్ణి వేటాడి చంప నిశ్చయించుకున్నాడు.

"అసలు శ్రీరాము డున్నాడా ?"

"లే డంటారా ?"

"నేను వున్నాడూ అనను, లేడూ అనను. ఉన్నాడని రూఢిగా అన్నవాళ్లతోనే వాదన. ఉన్నాడని యేమిటి ప్రమాణము ?"

"రామాయణము."

"ఆ ప్రకారం—'ఇలియడ్' ప్రమాణంగా 'ఎఖిలిస్' మొదలైనవాళ్లున్నారా?"

"ఆ, వుండవొచ్చు."

"జీయస్, మొదలైన దేవతలూ—"

"ఆ—"

"అంటే ఒక్కొక్క దేశానికి, ఒక్కొక్క స్వర్గమూ, వేరేదేవతలూ, వున్నారా?"

"అదెట్లా ?"

"ఈనాడు నేను పురాణం వ్రాస్తే ఇంక వెయ్యేళ్లకి దాంట్లో నేను వ్రాసిన మనుషులూ, రాక్షసులూ ఈనాడు వున్నారని ఆనాటివాళ్లు అనుకుంటారు."

"మరి రామాయణం నిలవలేదా యిన్నియుగాలు—"

"దాని సౌందర్యంవల్లా, మనుషుల మూర్ఖంవల్లా నిలిచింది. కవి ఆలోచించి వ్రాసినవన్నీ నిజమంటే......"

శ్రీరాముడు తనని అన్యాయంచేశాడు. అంతకన్న 'గట్టిగా' వాదనకి నిలవక రాముడు—తనని సిగ్గుపాలు చేస్తున్నాడు.

మర్నాడు పొద్దున్నే అతను పనులలో వుండగా నిర్మల వొచ్చింది. అతనిచేతివంకా, కలంవంకా చూస్తో మాట్లాడకండా నుంచుంది. అతను కొంచం తల యెత్తాడా గడగడ వాగుతుంది. కాంగ్రెసునాయకులనడకా, మాటలూ అనుకరిస్తుంది. అతను వ్రాసుకుంటున్నాడన్న మాటే కాని అంతసేపూ అతనిమనసంతా ఆమెమీదా, అతనికాలుని తగులుతున్న కుచ్చెళ్ల జరీ అంచుమీదా, బ్రోదిలో గుచ్చుకున్న మరువంకొమ్మమీదనే వుంది. చప్పున ఆలోచించకండా—

"విడవలేనంత మోహం కలుగుతుం దనుకో ఏం చేస్తావు ?"

"ఆ—"

చాలా అనేశాడు. మార్చాలి.

"ఎవరన్నా ఒకమ్మాయికి, ఒకాయనమీద మోహం కలిగితే—"

"పెళ్లి చేసుకుంటుంది."

"ఆయనకి పెళ్లాముంటే—"

"తప్పు అట్లా మోహించడం చాలా తప్పు. పరదేశాల ఆచారాన్ని మనం అనుకరించకూడదు. అందులో ఆ భార్యని అన్యాయం చెయ్యడం చాలా దుర్మార్గం—పైగా తనతోటి స్నేహితురాలైనప్పుడు—ఏం, అతను గాక యింక ప్రేమించటానికి ఎవరూ లేరా ?"

"మరి యిట్లా ఆడుతూ, నవ్వుతోవుంటే మోహం కలగదా?"

"కలిగినప్పుడు దాచుకోవాలి. అందుకు అసాధ్యమైతే ఆ మోహాన్ని నాశనం చెయ్యాలి. ఏం లాభం మోహించి!"

వెళ్ళిపోయింది.

కాని వెడుతూ ఎంత ప్రేమగా తనవంక చూసిందా అనుకున్నాడు.

కమల మొహంవంక చూడడం సిగ్గుగా వుంది. తా నేమీా చెయ్యకపోయినా అతని హృదయంలోని రహస్యవాంఛ అతన్ని నేరస్థుణ్ణి చేస్తోంది.

అతనికి దీక్షలమీాద భక్తి పోయింది. నిర్మల తనవెంట తిరిగినంతసేపూ, అధర్మమని, తప్పించుకోవాలని చూశాడు. ఇంతకీ నిర్మల తనతో ఆడుతోంది గాని, అంతకన్న దేనికీ సంసిద్ధురాలు కాదు. ఆమె కావాలి తనకి. నవ్వును తెనపెదవులతో అనుభవించాలి. ఆపరుగును, గంతులను తనచేతులలో లీనంచేసుకోవాలి.

రాజాగారి బంగళాలో టీపార్టీకి వెళ్ళారు. కమల రాలేదు.

"నిర్మలా, యిట్లా రా—నీకో సంగతి చెపుతాను."

ఇద్దరూ అందరికీ దూరంగా పున్నాగచెట్టుకింద నుంచున్నారు. నిర్మల అందికదా—

"చూడు—అందరూ అట్లా కూచుని, ఆ పదార్థాల నన్నిటినీ నోట్లోకి తీసుకుంటూ వుంటే చూడ్డం యెట్లా వుంటుంది? ఎప్పుడన్నా యోచించావా? చూడు, ఆ ఆచారి దూరాన్నించి పళ్లెం వొస్తోవుంటేనే పిల్లి పిచికని చూసినట్టు ఎట్లా చూస్తున్నాడో! అంతా తిండి తిండి! ఒకర్నొకరు చూడరు—మాట్లాడరు—ఏదో ఆ తిండిలో మధ్య ఒక పలుకు. యీా వుచితంగా వొచ్చిన యీా పదార్థాలన్నీ మనం యెంత సొమ్ముచెయ్యగలమా అనేధ్యాస!

"ఇంకా ఆకలి లేదే అని దుఃఖం. పదార్థాలు అందకపోతే దుఃఖం. రెండూ సరిపోవాలి.

"మనం మనుషులం కాదనుకో, ఈమనుష్యజాతివంక ఎక్కణ్ణించో వొచ్చి చూస్తున్నా మనుకో, మనకి ఆకలిదప్పులు లేనివాళ్ల మనుకో, ఏమనుకుంటాం? ఈబిళ్లల్నీ, యీా వుండల్నీ వీ ళ్లెందు కిట్లా లోపలికి యెక్కించుకుంటున్నారా అనుకుంటాం—పడవదోనెలో బస్తా లెక్కించినట్టు జేబులు పట్టక శరీరంలోపల వేసుకుని తీసుకుపోతున్నా రనుకుంటాము.

"చూడు ఆపిల్లని యెట్లా ప్రోత్సాహపరుస్తున్నాడో ఆతండ్రి—వూరికే వొచ్చింది బాగా తినమని—

"ఇంక చూడలేను రా—"

వాళ్లిద్దరూ బంగాళా వెనక్కి నడిచి వెళ్లారు.

"తమాషాగా ఆలోచిస్తావే!"

"అంతే కాదు, అనుకుంటానుగదా—ఆపదార్థాలు ఎక్కణ్ణించి వొచ్చాయి—సాయంత్రమప్పుడు చల్లగాలిలో పడుకున్న శనగచేలు, గడ్డిని మేసి గంభీరంగా యింటివేపు నడిచే ఆవులు, మెట్టగా పచ్చనిఆకుల్లో వేళ్లాడే మిరపపళ్లు, సముద్రపు పెద్దఅలలు, అన్నీ అన్నీ యీనోళ్లలోకి దూరేందుకు పదార్థాలని తయారుచేస్తున్నాయని—

"గులాబీపువ్వుని చూస్తే దానివాసన—పన్నీరై మిఠాయిలో కలసి టీపార్టీ వాడి గొంతులో దూరుతుంది—వందలకొలది పువ్వుల్ని నలిపి సారం తీసి వీళ్లగొంతుల్లో పోసేందుకా!

"కాశ్మీర దేశపు కుంకుమపువ్వు, మైసూరు జాజికాయ, మళయాళపు లవంగం—ఆవాసనలు—ఆతోటలు—వాటిని పండించే ఆకర్షకులు అందరూ వీళ్లు అట్లా తిని అజీర్ణాలు తెచ్చుకునేందుకా, రాత్రింబవళ్లు పనిచేస్తున్నారు? అంతే కాక పువ్వు పువ్వుకీ ఎగిరే తేనెటీగ పువ్వుల్ని కాయలు చేస్తోంది పాపం—వీళ్లనోళ్లకోసం. సమస్తమూ తన వుష్ణంతో పండించే సూర్యుడు—"

"ఇంక చెప్పకు నాకు ఒళ్లు మండిపోతోంది. నేను వెళ్లి నువ్వు చెప్పిన లెక్చరంతా చెప్పి ఓకర్ర తీసుకు వాళ్లమీద పడితే యేమంటారో!" అంటున్నాడు గాని అతనిదృష్టి అంతా ఆమెనడకమీదా, ముళ్లు తప్పించుకోడానికి వొంగే ఆమెఅందంమీదా వుంది. దోవ చిన్నదై దగ్గిరిగా వొచ్చినప్పుడు ఆమెచెయ్యి తగులుతుందేమో, ఆమెచెరుగు తగులుతుందేమోనని ఆశపడ్డాడు. ఆతోటా, సాయింత్రమూ, గడ్డిలో పువ్వులూ, పురుగులూ లోకాన్ని కొత్తగా తోపిస్తున్నాయి.

"ఇట్లా కూచుందాము, ఒక్కరవ్వసేపు. వాళ్లు ఉదరాలు నింపుకున్నంతసేపూ..."

అని కస్తూరితుమ్మకింద పచ్చికమీద కూచున్నారు.

"ఏం తింటే యింత ఆనందం కలుగుతుంది! యీపచ్చికా, ఆకాశమూ, ఆ తేనె పిట్ట కూతలూ, యీగాలినిశ్శబ్దం—" అంది.

"నాపక్కన నువ్వూ—" అన్నాడు.

మాట్టాడలేదు. ఆమె మెల్లిగా తలెత్తి—

"నాకు దిగులువేస్తోంది, ఎందుకో : యిట్లాంటిచోట్ల పొందే నిర్మలమైన ఆనందంలో దిగులుకూడా కలిసే వుంటుంది. ఎందుకా అని యోచిస్తా ననుకో, ఒకప్పుడు ఇదంతా వొదిలిపోవలసిందేకదా!"

"వుండు యీవూళ్ళోనే. చాలాసార్లు వొద్దాము యిక్కడికి."

అర్థంకానట్టు చూసింది అతనివొంక.

"అది కాదు, మనం యీలోకాన్ని వొదిలినప్పుడు ఇంతఅందమైన లోకమే వొదిలిపోవాలికదా!" అంది.

"ఇంకా, యింతకన్నా అందమైనలోకాలు యెన్ని వున్నాయో!"

"ఏమో !"

"మరి మీబ్రహ్మసమాజంలో ఏం నమ్ముతారు?"

"మతం అల్లా వుండనీ. మనకి నిశ్చయ మేమిటి ! నిశ్చయమైన, చనువైన యీ ప్రదేశాల నన్నిటినీ వొదిలిపోవాలే అనీ——అదే కాదు——ఆదిగులు ఎట్లా ఎందుకు వస్తుందో తెలీదు. ఇప్పుడూ అంతే——నువ్వూ, యీఅందమూ, నా కింకేం కావాలి? కాని దిగులు——"

"ఐతే పోదాము."

"వొద్దు. ఆదిగులు యెంతో మధురమైనది."

మాట్లాడలేదు. చప్పున అతనిచెయ్యి పట్టుకుని——

"చూడు" అంది రహస్యం చూపినట్టు. పడమట సూర్యుడు అస్తమిస్తో నల్లని మబ్బువెనకనించి తోకచుక్కవలె కిరణజాలాన్ని తూర్పువేపు చిమ్ముతున్నాడు.

నిర్మల వూపిరి బిగపట్టి చూస్తోంది. ఆమె మెరిసేకళ్ళూ, ఎత్తినతలవెనక జాకెటు మీద పడుతున్న జుట్టూ, గడ్డి నానుకున్న ఆమెచెయ్యీ అన్నీ ఆతెల్లనికాంతిలో తడిసి, అతన్ని అనేకవిధాల బాధపెడుతున్నాయి.

"నువ్వు మీదేశం వెళ్లకు."

"వెళ్లక——"

"ఇక్కడ వుండు——మనిద్దరమూ——"

తరవాత ఏమిటో అతనికి తెలీదు. ఆమె చూస్తోంది అతనివంక ఏమి చెపుతాడని——

"నువ్వు వుంటే——నేను——నీనించి, నీకళ్లచూపుతో నాలో ప్రవేశించే శక్తితో, యీదేశాన్ని——యీప్రజలలో యెంతఉత్సాహాన్ని పురిగొల్పనా అనిపిస్తుంది. నువ్వు వెళ్లకు. నువ్వు నాకు, యీదేశానికి, యీప్రజలకు నీఅవసర ముంది. నీమూలాన్న నే నెంత తీవ్రసేవను చూపగలనో నీకే అర్థమౌతుంది."

మాట్లాడలేదు.

“వెళ్ల నను.”
“వెళ్లను.”

“ఇదే వాగ్దత్తం. ఈరోజుతో మనిద్దరిజీవితాలూ ఏకమైనాయి. ఇంక మనిద్దరికి భేదం లేదు. భారతమాతముందు, దేశసేవాదీక్షను తీసుకుంటున్నాము. మనిద్దరికీ యింక భేదం లేదు.”

చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు.

ఇంక ప్రతిదినమూ, ప్రతిసాయంత్రమూ, నెలలు, సంవత్సరాలు, ఆమె కోమలత్వంతో, ఆమెజుట్టు మృదుత్వంతో, ఆమె మెత్తనిమాటలతో, తాను పొందగల ఆనందాన్ని, సాహసాన్ని తలుచుకుని ప్రమత్తుడైనాడు. కొత్తగా మంచివైను తాగినవాడివలె ఉద్రేకవంతుడైనాడు. ఆమెచేతిని పట్టుకుని దగ్గిరిగా లాక్కుని అతన్ని ప్రశ్నించే పెదవుల్ని ముద్దుపెట్టుకున్నాడు. ఆసాయంత్రము చీకట్లో ఒకరి నొకరు అనుకుని వాళ్లు సమస్తమూ మరిచారు.

మెల్లిగా నిర్మల—
“కమల—”అంది.

“కమల—కమల—నాభార్య! దానికీదేశత్యాగం అర్థంకాదు—నువ్వు, నువ్వు—నా దేవతవు–నాసోదరివి–మనప్రేమ పవిత్రము–మనప్రేమ నిర్మలము!” అన్నాడు. ఆమెని కావిలించుకున్న నిమిషంనించి, అతనిమనసు బాధిస్తోనేవుంది. ఏకపత్నీవ్రతమూ, కమల మీదప్రేమా, కమలయెడల విశ్వాసమూ అన్నీ గిలగిల లాడుతున్నాయి అతనిముందు–నిర్మల అన్నమాట అతనియోచనల్ని అందుకుని అతనిసందేహాలకే ప్రత్యుత్తరాల్ని కల్పించింది. అవును, నిర్మలను కావిలించుకోడం పవిత్రము. దేహాలమీద కామం కాదు. ఆత్మ సంయోగానికి చిహ్నము. ఆమె సోదరి. ఇంక భయము లేదు. అర్థమయింది అతనివాంఛ. ఇదంతా దేశసోదరిమీదిప్రేమ. అంతే! ఇంక అతనికి భయం పోయింది. సందేహం పోయింది. ఏమీ సంకోచం లేకండా ఆమెముఖాన్ని ఎన్నోసార్లు ముద్దుపెట్టుకున్నాడు. సంతోషంతో ఆమె అతనిచేతుల్లో వొణికింది.

వీళ్లు వెళ్ళేప్పటికి టీపార్టీ అయిపోయింది. నౌకర్లుతప్ప యెవరూ లేరు. శిబిరానికి వొచ్చేప్పటికి ఘోష్ కోపంతో “ఏమైనారు మీరు? ఎక్కడా కనపళ్ళేదు.” అన్నాడు.

“అట్లా తిరుగుతున్నాము.”

“ఏమిటి? ఒక్కత్తెనీ, ఆడపిల్లని తీసుకుని రాత్రి తిరుగుతున్నావా? నీకు బుద్ధి లేదూ?”

# ప్రేమపర్యవసానం

"ఆత్మలు యేకమైనాయి—దేశసేవలో..."

ఇల్లాంటివేవో అనబోయి 'ఇప్పుడతని కర్థంకాదు, ఆకోపం తగ్గితేనే గాని' అనుకుని ఇప్పుడేమనాలా అని ఆలోచిస్తున్నాడు. నిర్మల ఏమో దూకుడుగా బెంగాలీలో అంటోంది. హిందీ తెలిసిన అతనికి 'నీ కెందుకు నాసంగతి? నీపని నువ్వు చూసుకో. నామీద అధికారంచేస్తే జాగ్రత్త' అన్నట్టుంది.

అతనిచెయ్యి పట్టుకుని తీసికెళ్ళింది. ఆమెధైర్యం తనకి లేకపోయిందికదా అని సిగ్గుపడ్డాడు.

ఆరాత్రినించి నిర్మలసంగతి తలుచుకున్నప్పుడల్లా ఒళ్లు పులకరించింది. జీవితంలో కొత్తఉత్సాహమూ, వెలుగూ కనపడ్డది. నూతనజ్ఞానేంద్రియం ఒకటి తెరుచుకున్నట్టయింది. నిర్మల తనసోదరి, తనమిత్రురాలు, తనకి నవోత్సాహ మిచ్చేశక్తి—ఇంకేంకావాలి. ప్రతిపనీ సహజమైన గానంతో కూడినట్టు తోచింది. కాని కమలతో మాట్లాడేప్పుడూ, ఆమె తనదగ్గరికి వొస్తేనే యేదో భయమూ, కాపట్యమూ తోస్తున్నాయి. ఎందుకంతబాధ? తా నేమి చేసినట్టు? తన కొత్తసంతోషాన్ని కమలకు చెప్పా లనిపించింది. కాని ఏమాటలతో చెప్పాలో తెలీదు. నాలుగైదుసార్లు ప్రయత్నించి వూరుకున్నాడు.

ఎట్లా చెప్పినా ఆమెకి అర్థంకాదు. ఎందు కర్థం కాకపోవాలి? కమలకి తనని అర్థంచేసుకునేటంత ఔదార్యమూ, ఔన్నత్యమూ లేవు, అని సమాధానం చెప్పుకున్నాడు. ఎంత సన్నిహితులైనా ఒకరిభావాలు యింకొకరికి తెలియచెయ్యడం ఎంతకష్టం! భాషాలోపమా, లేక సానుభూతి లోపమా?

పగలంతా పనిలో వూపిరాడలేదు. ఎప్పుడు సాయంత్ర మౌతుందా, నిర్మలని చూద్దామా అనుకుంటున్నాడు. వెన్నెల వొస్తుంది. తానూ, నిర్మలా, కమలని తప్పించుకోవాలి. నిర్మలకూడా పగలంతా తనని తలుచుకుని ఆత్రుతపడుతూవుండాలి. రెండుసార్లు ఆపక్కనించి వెళుతూ చిరునవ్వు నవ్వింది. కాని లోపలికి రాలేదేమో! తన పనితొందరని చూసివుంటుంది. పోనీ తనే పనిని ఆపి వెడితే! కాని ఆవొక్కరవ్వ మాట్లాడించి ఏంలాభం? అంతకన్నా ఆమెనే రానీ; తా నెందుకు వెళ్లాలి?

సాయంత్రం బైట చాప వేసుకుని కూచున్నాడు.

కమల మాట్లాడుతోంది. నిర్మల పత్తాలేదు. నిర్మలసంగతి కమల నడగాలని వుంది కాని ధైర్యం లేదు. ఎందుకు అడగకూడదు? తప్పేముంది?

నిర్మల ఏనిమషానైనా రావొచ్చు. అప్పు డింక ముగ్గురూ తప్పరు. కమల వుంటేనేం? నిర్మలా తానూ దగ్గిరిగా కూచోకూడదా? చేతులు పట్టుకోకూడదా? కనకో చెల్లెలు వుంటె! అట్లా కూచోదా? బుజంమీదమాత్రం చెయ్యి వెయ్యడా? ఒక వేళ కమల ఎక్కడికన్నా వెడితే!

నిర్మల రాలేదు.

"నిన్న లెక్చరులో ఆసింగుగారు ఎవరు, పొట్టిగా లేడూ, పంజాబీ—అత నేమన్నా డంటే—"

"అబ్బా, చావనిద్దూ! వాళ్లసంగతి పోనీ."

"ఎందుకు చిరాకుగా వున్నారు?"

"ఎక్కడన్నా తిరిగివొస్తాను."

అని లేచి వెళ్లిపోయినాడు. నిర్మల ఏమయింది? ఎందు కాఉద్వేగం? తొరతొరగా ఆమెఉండే చోట్లన్నీ తిరిగాడు. చివరికి తాటితోపు వెనక యిసికలో ఘోషుతో మాట్లాడుతూ కూచుంది. శివరావుకి చాలా కోపం వొచ్చింది. కాళ్లు వొణికాయి. పెదవు లార్చుకు పోయినాయి. నిర్మలని చాలా బాధించా లనిపించింది. తిరిగి వెళ్లిపోయినాడు.

కాని తను వెళ్లింతరవాత వాళ్లను వొంటరిగా ఆయిసికలో, ఆచల్లనిగాలిలో, నిర్మలజుట్టులో అతనివేళ్లు—ఆమెబుజాలమీద అతని బుజాలు...

రోజూ తనే చూస్తున్నాడా వాళ్లు కలుసుకోకుండా? వారంకిందట తనెక్కడ వున్నాడు!

పాపం నమ్మి ఆతలిదండ్రులు ఆపిల్ల నిట్లా, పంపితే వొంటరిగా, పవిత్రమైన దేశసేవకై యీకుచ్ఛితుడు, యీపాపి, యీదేశద్రోహి ఆమె మనసుని నెమ్మదిగా కృత్రిమ మార్గాలమీద తిప్పుతున్నాడు. ఏవోమాటలు చెబుతున్నాడు. వెనక్కి వెళ్లాడు. బహుశా, ఇంక తనతో మాట్లాడవొద్దని బోధిస్తోవుంటాడు. ఆమె తలిదండ్రులతో చెపుతానని బెదరిస్తోవుంటాడు.

"ఎక్కడికో షికారు వెడుతున్నారే!" అన్నాడు ఘోష్.

నిర్మల చిరు నవ్వి వూరుకుంది.

అతను సిగ్గూ, బిడియమూ విడిచి కూలబడ్డాడు, వాళ్లదగ్గిర.

వాళ్లిద్దరూ ఒక్కమాట మాట్లాడలేదు. ముగ్గురూ మొద్దుల్లాగు కూచున్నారు. తొమ్మిదయింది. చీకట్లో ఘోష్ సిగరెట్టు వెలుగు కనపడుతోంది. చీకట్లో నవ్వుకుంటు న్నారా? వాళ్లచేతులు తాకుతున్నాయా?

అందరికీ ఆకళ్లు పుట్టాయి గావును ఒక్కమాట మాట్లాడకండా లేచి శిబిరానికి పోయినారు.

శివరావు ఇంక నిర్మలమొహం చూడకూడదని నిశ్చయించుకున్నాడు. తనని పలకరించినా పలకకూడదు. ఇట్లాంటివాళ్లని నమ్మితే అధోగతి తప్పదు.

భోజనం పాకదగ్గిరికి వెడుతూవుండగా నిర్మల పరిగెత్తుకొని వొచ్చింది.

"అబ్బా! దేవుడిమల్లే వొచ్చావు. ఎవడితో మాట్లాడదామన్నా 'ప్రేమా, కామమూ' అనేవాడూ, చేతులూ బుజాలూ తాకించాలని చూసేవాడే గాని, నిర్మలంగా స్నేహంగా మాట్లాడేవాడు ఒక్కడూ లేడు. వున్నతమైన యోచనలే లేవు ఎవడికీ! నువ్వు వొచ్చినా పోడే!" అంది.

సుందరశివరావు కోపమంతా పోయింది.

"మళ్లీ మనం కలుసుకోడ మెప్పుడు—"

"రేపు."

అని అతనిచేతిని గట్టిగా పట్టుకుని కళ్లల్లోకి నవ్వి వెళ్లిపోయింది.

మర్నాడంతా అతనిగదిలోనే వుంది నిర్మల. కాని అంతకాలమూ యెవరోఒకరు అతనితో మాట్లాతూనేవున్నారు. మధ్యాహ్నం వూపిరాడకండా లెక్కలు చూస్తున్నాడు. చప్పున నిర్మల వొచ్చి నుంచుని "కాలేదా, లెఖ్ఖలు!" అంటోంది.

ఆమెచెయ్యి పట్టుకుని కిందికి లాగి ఆమె అల్లరంతా పొయ్యేట్టు ముఖమంతా ముద్దుపెట్టుకున్నాడు—చప్పున వొదిలాడు. ఏమంటుంది? అరుస్తుందో, కొడుతుందో, వుమ్మేస్తుందో!

"తప్పు కాదా?" అంది మెల్లిగా.

గుండె నిబ్బరపడి అప్పుడే భయపడి యెందుకు వొదిలానా అని దిగులుపడి, ఆమెవేపు చెయ్యి జాస్తే దూరంగా జరిగింది.

"వొద్దు—ఇప్పుడు వొద్దు—అట్లా చూస్తా రెందుకు? నే నేమీ అనుకోను—మీ హృదయం నాకు తెలుసు ..........

"మనది పవిత్రమైన స్నేహం, ఈముద్దులవల్ల అపవిత్రమౌతుందా!" అంది.

"అవును" అన్నాడు సందేహించే గొంతుకతో.

"మళ్లీ వొస్తాను."

"మరి సాయింత్రం వొంటరిగా కలుసుకోవాలి."

"వొంటరిగా యెందుకు ? వొద్దు."

"కాదు. నీతో మాట్లాడాలి."

"మాట్లాడేముకదూ? అన్నిమాటలు చెప్పాలా జ్ఞానంకలవాళ్లకి. నా కర్థమయింది కదూ మన స్నేహబంధం !"

"వొస్తేనేం ?"

"ఏం లేదు. ఎప్పుడో తీరికైనప్పుడు చూద్దాంలెండి. ఇప్పు డేమవసరం ?"

ఘోష్‌తో ఎక్కడికో వెళ్లడానికి యిదో యెత్తు గావును అని పరిపరివిధాల ఆలోచించాడు.

సాయంత్రం చారుడివలె చూస్తే ఆడవాళ్లతో వుయ్యాల లూగుతోంది. ఘోష్ ఒక్కడూ ఏదో పోగొట్టుకొన్నవాడివలె మైదానమంతా వెతుకుతున్నాడు.

సాయంత్రం ప్రయత్నించి ఆమెని తక్కినవాళ్లలోంచి విడతీసి—

"నే నింక నీతో మాట్లాడకండా వుండలేను నువ్వొక్కసారి రావాలి."

"వొద్దు, ఎక్కడికీ కదల్లేను."

"బండిచేస్తాను."

"నాకు రావాలని లేదు. ఇక్కడ కూచుని మాట్లాడండి."

తనమాట వినక ఎదురుతిరిగే యీస్త్రీని చూసి అతని పురుషత్వం మండిపడుతోంది. ఆమె ఎవరు ? తనెవరు ? కాని స్నేహంవల్ల కాని, జాలివల్ల కాని, స్త్రీ కొంచం పురుషునికి స్వతంత్రమిచ్చిందా, ఇంక అతను తీసుకునే అధికారానికి అంతం వుండదు. చిటికినవేలు తాకడానికి వొప్పుకుంటే ఇంక ఆశరీరమంతా, మనసూ, స్వేచ్ఛా, అన్నీ తనస్వంతమూ, తనహక్కూ తనఆ స్తే అనుకుంటాడు.

"నువ్వు రాకపోతే, ఇంతమాత్రం నాసరదా తీర్చకపోతే నీకు నామీద ప్రేమ యేమిటి ?"

"నీమాట వినేరకం ప్రేమ వుందన్నానా ? నన్ను మోసుకుపోతే నేను వూరుకుంటా నన్నానా ?"

"కాదు, నీతో మాట్లాడా లంటే—"

"మాట్లాడు, ఇక్కడ ?"

"వొస్తేనేం ?"

"ఎందుకు రావాలి ?"

ఇంక గతి లేక కూచున్నాడు. కాని అంతసేపూ ఆమెని యెట్లా గాయం చెయ్యాలా అని చూస్తున్నాడు.

"పోనీ, అంతఅయిష్టమైతే మానేద్దాం స్నేహం!"

"సరే!" అని లేస్తోంది.

"వెడుతున్నావా? నువ్వు మారిపోయినావు. నీమన సెవరికో యిచ్చావు. యింత చంచల మనుకోలేదు."

"నువ్వింత మూర్ఖుడ వనుకోలేదు."

అని వెళ్లిపోయింది.

అక్కడే అతను ఆలోచిస్తో కూచున్నాడు. చల్లగాలికి రక్తంకూడా చల్లనై వివేక ముదయించింది. నిర్మలకోసం వెతికాడు. ఆమె ఒక్కత్తె వంటశాలలవెనక కూచునివుంది.

"నిర్మలా! నేను శుద్ధగాడిదెను!"

"నే నింకో గాడిదను. రా, యిట్లా వొచ్చి కూచో!"

కొంచంగా చీకటవుతోంది. ఇంగువతాలింపుల వాసనలు కొడుతున్నాయి. మెల్లిగా ఆమెచెయ్యి పట్టుకున్నాడు.

"ఏం చేస్తున్నావు రోజల్లా, చెప్పు" అంది.

చెపుతో నడుంమీద చెయ్యి వేస్తే దూరంగా జరిగింది.

అతను ఆలోచించుకుంటున్నాడు. తాను చేసింది తప్పు. అంతచనువు తనసోదరితో తీసుకోడం అసహ్యమైనపని. బుద్ధిమంతురాలైన నిర్మల ముందు తెరిపిని పడి తనని దూరాన వుంచుతోంది. ఆమెకి కృతజ్ఞుడై వుండాలి. ఇంక తమయిద్దరిస్నేహమూ ఎంత మధురంగా వుంటుంది. ఎంత గొప్పఔన్నత్యాన్ని పొందుతుంది. జీవితమంతా ఎంత రసవంతంగా ఉంటుంది. ఇద్దరూ ఎప్పుడూ నవ్వుతో మాట్లాడుతో—మళ్ళీ ఎప్పుడైనా ఆమె మనసు మారినప్పుడు గట్టిగా, దగ్గిరిగా, విల్లువలె వున్ననడుం, ఆ నవ్వేకనుబొమ్మలూ—ఈ కాటిన్య మేమవుతుంది—వుండదు—తాత్కాలికం—మళ్ళీ ఆరాత్రివలె తనచేతుల్లో వూగుతో—ఆగాడు! ఛీ! మళ్ళీ తలపు లట్లా తిరిగాయి యేమిటి? అట్లా కాదు. ఈమె తనచెల్లెలు—అంతే. అంతవరకే—

పాపం, తను కమల నెంత అన్యాయంచేశాడు! ఇంక ఎన్నడూ, యేస్త్రీనీ తాక కూడదు. తను యేకపత్నీవ్రతం పాలించ తలుచుకున్న యోధుడు.—అతనికి కోపం తెప్పించానేమో; నిర్మల అతనిచేతిని మెల్లిగా వేళ్లతో వెతుకుతోంది. అతిప్రయత్నంతో తన

చేతిని వెనక్కి తీసుకున్నాడు. తనకు మనోనిబ్బరముంది. తాను దేశసేవలో తనజీవితాన్ని ఆహుతిచేయ తలుచుకన్నధీరుడు: ఈస్త్రీ తన కేంలెక్క! తనచేతిని వెనక్కి తీసుకున్నందుకు కోపం రాలేదుకద! తను చేతి నట్లా ఉంచితే, తనచేతిని నడుముచుట్టూ పోనిస్తే వొప్పుకునేదేమో!

చంద్రుడు కాకినాడపురంమీాదనించి ఉదయిస్తున్నాడు. తాటాకుదళ్లూ యిసికా మంత్రంకింది కొత్తలోకం వుదయించినట్టు మేలుకుంది. ఇసిక వెండిగా, చెట్లచిగుళ్లు తళుకు రేకులుగా, పక్కన వున్న గుండిగల్లో నీళ్ళు పాదరసంగా మారాయి. వెన్నెల వాళ్లిద్దరి హృదయాల్లోకి రసత్వాన్ని భగ్గుమనిపించింది. కాని యీామెతో స్నేహం చూసి ప్రజ లేమనుకుంటారు ? అనుకోనీ, తనమనసు పవిత్రమైనప్పుడు ప్రజల అభిప్రాయాలు తుచ్ఛమైనవి.

"నిర్మలా, అట్లా తిరుగుదాం రాకూడదూ ?"

"వొస్తాను, కాని మొన్నటివలె నన్ను బాధించకూడదు."

"బాధించానా ?"

"ఊ !"

"బాధపడినట్టు లేవే !"

"కాని బాధే—మరి చెప్పు."

"నిజంగా బాధించను."

ఇసికలోంచి రైలుపట్టాలు దాటి వెళ్ళారు. ఒక చిన్నపల్లె వొచ్చింది. ఎవరూ బైట లేరు. కాని గుడిశల్లోంచి చిన్నదీపాలూ, భోజనప్రయత్నం చేసే మనుషులసంతోషరవాలు, పిల్లలమారాములూ, వినపడుతున్నాయి. దాటి జీడిమామిడితోపు దగ్గిరికి వెళ్లారు. అక్కడ యిసికలో తీసిన దొరువుగట్టుమీాద కూచున్నారు. ఎదురుగా వెన్నెల నీలమైన నీళ్లమీాదా, అడుగున యిసికమీాదా పడుతోంది. ప్రపంచమంతా వాళ్లిద్దరిప్రేమకోసం సృజించినట్లుంది. ఏయింద్రజాలమంత్రంవల్లనో అసల్లనిచెట్లనూ, మెత్తనియిసికనూ, తెల్లని ఆకాశాన్ని కల్పించి, ఆరాత్రికి వాళ్ల నాలోకంలో వొదిలింది విధి. ఆపలేని 'రొమాన్సు', భరింపలేని ఆనందం అతనిహృదయంలో వుడికిపోయినాయి.

"జీవితమంతా యిట్లా వుంటే యెంత బావుంటుంది."

"వుండదు యీామనుష్యమాత్రులికి. కాని అప్పుడప్పుడు యేదో ఒకరాత్రి యిట్లాంటిది దేవతలు ప్రసాదిస్తారు."

"[illegible] యిట్లా రావడం తెలివితక్కువ పని."

[illegible]

ఆమె మాట్లాడలేదు.

“మనిద్దరమూ, యీజీవితమంతా యిట్లా ఏకమై గడపబోతున్నాము. మనప్రేమ, ఆకాశంలో ఆచంద్రుడివలె నిలిచి మన జీవితాల్ని యిట్లా చల్లగా నిర్మలంగా వెలిగిస్తుంది. నిర్మలా! నాసందేహాన్ని తీర్చు: వెక్కిరింపుకి అన్నావా, నిజంగా అన్నావా, నువ్వు యిక్కడే వుండిపోతావా?”

“వుంటాను.

ఆమె బుజంమీద చెయ్యి వేశాడు. ఆమె ఆలోచిస్తో వూరుకుంది. దగ్గిరిగా ఆనుకుని కూచుని, ఆమెనికూడా లాక్కున్నాడు. తరవాత యింకా చనువు తీసుకోడానికి ప్రారంభం చెయ్యగానే

“ఏమని వాగ్దత్తం చేశారు?” అంది నెమ్మదిగా.

మాట్లాడకండా వొదిలి, దగ్గరగా కూచున్నాడు.

కాని యిద్దరికీ కూడా యేదో హృదయాల్లో గొప్ప ఆరాటం జరుగుతున్నట్టు తెలుసు. చిన్నప్పణ్ణించి అలవాటయిన ఆటంకాలు ఒక్కటొక్కటే ఆయుధాలు పట్టుకుని పైకి లేస్తున్నాయి. సహజంగా అనాదిగా యీ జీవితాన్నే పాలించే శక్తులు, వాటి నొక్కొక్కదాన్నే నరికి కిందికి తోస్తున్నాయి.

నిర్మల కళ్లల్లోంచి కన్నీళ్లచుక్క జారి చెంపమీద వజ్రంవలె మెరుస్తోంది.

“వొద్దు, నేను నిన్నేం చెయ్యను.” అంటూ ఆమెని కావిలించుకుని యిసికమీదికి తనబరువుతో వొరిగాడు. ఆమె మాట్లాడలేదు. ఒకరిపక్కన ఒకరు పడుకున్నారు. కొంచం సేపట్లో జుట్టుకి యిసిక కాకుండా అతను తన బుజాన్ని ఆమెకి యిచ్చాడు. అతను ఆమెని చాలాసార్లు ముద్దుపెట్టుకున్నాడు. కాని త్వరలో ధైర్యం కలగలేదు. ఏ నిమషాన తన మోహాన్ని గుర్తించి నిరాకరించి లేస్తుందో, యే నిమషాన ఆ మహాయింద్రజాలం విచ్ఛిన్నమౌతుందో నని భయం. ఆమెకి తనకున్నకోర్కె లేదనో, లేక స్త్రీకి సృష్టిపెట్టిన భయం వల్ల ఆమె నిరాకరిస్తుందనో, అతనికి సందేహం. అతనిముద్దులకింద ఆమె పెదిమ కొంచంగా కదిలినప్పుడు అతనికి ధైర్యం కలిగింది. గట్టిగా ఆమెమీద పడి వొత్తుకున్నాడు. తరవాత అతని కేమీ సందేహం కలగలేదు. కళ్లు మూసుకుని, తనచేతుల్లో అతనిమెడ కావిలించుకుని యింకా దగ్గిరిగా లాక్కుంటోంది. రొమ్ముకి అతి ఆశతో, అతన్నదుముకుని, అతన్ని కదలనీకండావుంది. వొదిలితే యింకేమన్నా చేస్తాడని భయంవల్లనా లేక ఒక్కనిమషమన్నా అతన్ని వదలలేకనా! కాని ఎంత గాఢంగా వున్నా అట్లా...నిష్కరణుడుగా వుండడం అతనికి బాధగా వుంది. యీప్రపంచంలో, యీ యింద్రజాలలోకంలో, యింక యేం జరుగు

తుందా అని ఆమె చూస్తున్నట్టుంది. ఆమెకి తెలీక పోయినా, ఆమె శరీరంలోని అణువులు, నరాలు, సూక్ష్మజీవులు, అన్నీ, శాంతిలో అంతమయ్యే అగ్నిజ్వాలకోసం తపిస్తున్నాయి.

"నువ్వు నాక్కావాలి" అని ఆమె చేతుల్ని విదిలించుకుని, ఆమెకు మరణబాధతో తుల్యమైన చరమావస్థను కల్పించి ప్రమత్తనుగా చేసిందాకా వొదలలేదు. ఆమెకూడా అన్ని సందేహాలనూ, ఆలోచలనూ వొదిలి, అతనితో సమానంగా, ఆనందంగా, కళ్లు విప్పి చూస్తూ అనుభవించింది ప్రతి చిన్న, చిన్న కామాలనూ, అగాధమైన ఆలింగనాలనూ...

.......................................................

ఆ యిసికలోంచి అతన్ని వొదిలించుకుని లేవడమే ఆవేశంగా లేచి కూచుంది. ఒక్కమాట లేకండా హృదయం పగిలేట్టు ఏడ్చింది.

"ఏం చేశాను? ఏమైనాను? నే నేమైనాను? ఇం కెట్లా బతకను?" అంటూ యేడుస్తుంది.

అత నెంత సముదాయించినా, ఎంత వేడుకున్నా, ఏం ధైర్యం చెప్పినా లాభంలేదు. అతనూ ఎక్కువగా ఆమెకోసం కష్టపడే స్థితిలో లేడు. అతనికి నిద్ర వొస్తోంది. ఆయిసిక లోనే అట్లానే పడి నిద్రపోవాలని వుంది. కష్టంమీద ఆమెతో చేరుకున్నాడు పాకలదగ్గిరికి. ఏడుపు తప్ప ఆమె ఒక్కమాట మాట్లాడలేదు.

మర్నాడు ఆమె అతన్ని చూడకండానే కలకత్తా వెళ్లి ఘోష్‌ని పెళ్లి చేసుకుంది. అతను నెలాఖరులోపల పోలీసు సబిన్స్పెక్టరు సెలక్షనుకి హాజరైనాడు.

# ‘ఈ వియోగ జలధి…’

ఆవంట జానకిరామ్

“కుందేటికి మూడే కాళ్లు !”—చంద్రమతికి పట్టినదే పట్టు !! పాపము యెంతో చెప్పాడు మోహనరావు. లేనికోపము తెచ్చుకొని పరుషవాక్యా లాడినాడు కూడాను. మిక్కిలి ప్రాధేయపడి “నాకోసం, మన ప్రేమకోసం యీ ప్రయాణము మానవూ” అని అడిగాడు. ఆఖరుకు ఆమె వెళ్ళిపోతుందనే బెంగవలన దుఃఖము ఆపుకోలేక మగతనము మరచిపోయి ఆమెముందర యేడ్చివేశాడు: “వద్దు !—నీవు వెళ్ళవద్దు—నిన్ను వెళ్ళనియ్యను. నీవు నాదానవు గావా......యిటువంటిదానవు అసలు నన్ను పెండ్లెందుకు చేసుకోవాలి ?”

అన్నిటికి వొక్కటే జవాబు: “మీకు తెలియదు. నేను వెళ్ళక తప్పదు !”

తుదకు వెళ్లే తీరింది. అపరిమితమైన ప్రేమ కలవాడు అతడు. ప్రేమమాట యెల్లా వున్నా, పట్టుదలకు పుట్టినిల్లు ఆవిడ. ఆమెమాటే కొనసాగినది ! బోయతోట బంగాళాలో నలుగురు పెద్దమనుష్యుల దీవనలు పొందిన రెండునెలల లోపుగా, అతని వెర్రిప్రేమను త్రోసివేసి, ఆమె ఠాకూర్‌గారి శాంతినికేతనానికి వెళ్ళింది. అక్కడ సంగీతసాహిత్యాలట, చిత్రలేఖనట, బెంగాలీ అట—యిటువంటి మహావిషయాలు అభ్యసించడానికి. ఇక్కడ, యితడు బిక్కుబిక్కుమనే హృదయముతో, భయంకరమైన వొంటరితనంతో, నిద్దురే లేని రాత్రులతో, కృశించి పోవడానికి !

అసలు జరిగిన విషయము యేమిటంటే :

మోహనరావు గొప్పమేధావి ! విశ్వవిద్యాలయంలో ఫిలాసఫీ ప్రఫసర్‌గా వుండడానికి అతనిని అలహాబాదునుండి ప్రత్యేకంగా ఆహ్వానించి కొంత బలవంతాన యీదేశంలో వుంచారు. పిన్నవయస్సులోనే పరదేశాలు తిరిగి అక్కడ మన ‘ఫిలాసఫీ’ గురించి, మన పూర్వుల ‘కల్చర్’ గురించి ముచ్చటించి విద్యావంతులందరికి ‘గాంధీగారి యిండియా’ మీద మరింత ప్రేమ కలిగించాడు......మాతృదేశాభిమానమువలన తిర్గి యీదేశానికి వచ్చాడు. కుశాగ్రమైన బుద్ధి. ఒక్కవిషయం తెలియదని లేదు. మనపూర్వు లనేవారే, ‘రాజకుమారుడు చతుఃషష్టికళలు అభ్యసించా’డని, అల్లాగే మోహనరావుకి అన్నివిద్యలు వచ్చు. అన్నిటిని గురించి చక్కగా మాట్లాడకలడు !

కాని, అతనిలో వొక్క గొప్పలోప ముంది: ఓపిక లేదు. బొత్తిగా లేదు. ఏవిషయంలో ? బుద్ధిమాంద్యముగలవా రంటే—అసలు సహించలేడు. మిక్కిలి తెలివికలవారి

లక్షణము కాబోలది. ఎవరినో అడిగాడట వొకమాట: "నీకు బుద్ధిశక్కవ మహానుభావుడు కావాలా, మేధావి అయిన తుంటరి కావాలా" అని!

అట్టి మోహనరావుకు చంద్రమతి లభించింది. ఆమె తెలివికలదే సుమా! కొంత వరకు చదువుకున్నది కూడాను. కాని ఆమెకు బుద్ధిచాకచక్యముకంటే సౌందర్యవిశేషము, రూపలావణ్యములు యితరులను యెక్కువగా ఆకర్షిస్తాయి. మోహనరావును కూడా యీ విషయాలే బంధించాయి ఆమెవైపు. అంతే కాకుండా, వారికుటుంబము చాల 'సంస్కారము' చెందిన కుటుంబము. తల్లిదండ్రులు లేని చంద్రమతిని పెంచి పెద్దదానిని చేసినది ఆమెపినతల్లి భవానీబాయి. పిల్లకు కొంత చదువు చెప్పించింది. చక్కని సంగీతము నేర్పించింది. రమ్యమైన నడతలు అలవాటుచేసింది. అందువలననే, పెద్దపెద్ద పరీక్ష లిచ్చి కొన్ని యేండ్ల పర్యంతం బ్రహ్మచారిగా వున్న మోహనరావు భవానీబాయిగార్ని సేవించి, చంద్రమతిని కోరికోరి, స్నేహితులందరు 'శేభష్' అనేటట్టుగా గృహస్థయ్యాడు.

అతడు మనస్సులో సంకల్పించుకున్న విధంగా గృహస్థాశ్రమాన్ని అన్నివిధాల సక్రమంగా యేర్పాటు చేశాడు. చంద్రమతి వచ్చేసరికి ఆమెకు యేకొరత లేకుండా అన్నీ అమర్చినాడు. అతనికి తల్లి, తోడు, యెవ్వరూ లేకపోయినా, ఎవ్వరో ఆడవారు చేసినట్లే చంద్రమతిని ఆహ్వానించుకొని యింటియందు సర్వవిషయాలు రమ్యంగా చేశాడు!...... ఇంతటివానిమీద ఆమెకు ప్రేమ గాఢ మైందని వేరే చెప్పాలా? అతనిని మనస్పూర ప్రేమించింది. అతనినే దేవునిగా భావించింది. సర్వకాల సర్వావస్థలందు అతనిమూర్తే ఆమెహృదయంలో ప్రతిబింబితమగుతూవుండేది!

ఒకరాత్రి తమలపాకులు నములుతూ, పచ్చకర్పూరపు ఘుమఘుమతో ఆమెముఖం దగ్గర తనముఖం చేర్చి, "చదరంగ మాడుదామా?" అన్నాడు మోహనరావు.

"చదరంగమా? నాకు రాదే" అన్నది ఆమె.

"రాదా? మీ పిన్నిగారు నేర్పలేదా?"

"లేదు; ఐతేనేమి యిప్పుడు మీరు నేర్పవచ్చుగా?"

"అంతకంటేనా!" అంటూ చదరంగపుబల్లను, చిత్రమైన దంతపుబలగాలను తీసుకు వచ్చి ఆమెముందర వుంచాడు. యేమిపాపమో కాని, యెన్నిరాత్రులు నేర్పినా ఆమెకు ఆట తలకెక్కలేదు. ఎన్నోవిధాల ప్రయత్నించాడు...చిలుకకు చెప్పినట్లు చెప్పాడు. కాని, ఆమె ఆటయందు మనస్సు వుంచలేకపోయింది.

ఇద్దరకు—ఆశాభంగము. 'ఇంతసులభవిషయము నేర్చుకోలేకపోయింది' అని అతనికి. 'ఛీ! యీమాత్రం నాకు రాలేకపోయిందా' అని ఆమెకు.

ఒకరోజున ప్రఫసర్‌గారి స్నేహితు డొచ్చాడు, ఒక ముసలాయన. ఆయనకు చదరంగం బాగా వచ్చును. ప్రఫసర్‌గారికంటె బాగా ఆడకలడు. సాయంత్రము ఆరుగంటలకు మొదలుపెట్టారు. ఏడైంది. ఎనిమిదైంది. తొమ్మిదైంది. ఇంకా లేవరు. చంద్రమతి అనేకవిధాల చూచింది మోహనరావుదృష్టి భోజనమువైపు మరల్పడానికి. అనేక కబుర్లు పంపింది. తుదకు తానే వెళ్లినది: "వారిని భోజనానికి లెమ్మనరాదూ! ఆలస్యమవుతోంది" అన్నది. అతడు తల యెత్తి ఆమెవైపు చూచాడు. ఒక్కనిమిషము అపరిమితానురాగంతో ఆమెహృదయాన్ని ముంచెత్తాడు. కాని, ఆమెచూపులలో నున్న దోషారోపణము గ్రహించలేకపోయినాడు. మరల, ఆటలో నిమగ్నుడైనాడు: "బంగారు కాదూ! నీవు భోంచెయ్యి. మేము తరువాత వస్తాములే" అన్నాడు.

ఆమెకు అన్నము సహించినదికాదు ..మరునాడు, చదరంగాన్ని, చదరంగపుబల్లను దాచివేసినది. అతడున్నూ వానిమాట అడుగలేదు.

* * *

ఆంధ్రదేశములో, కళాప్రపంచకములో క్రొత్తఅలజడి కలిగినది. శాంతినికేతనములో నుండిన ఆంధ్రయువకులు కొందరు, (వీరిలో ముఖ్యుడు ప్రఫసర్‌గారి మేనల్లుడు విశ్వం,) బందరుకళాశాల స్నాతకులు కొందరు కలసి మంచిమంచి బొమ్మలను సేకరించి వీనిని దేశమంతట ప్రదర్శిస్తున్నారు. ప్రతిచోట, ప్రతివ్యక్తికి, విసుగు లేకుండా అజంతా బొమ్మలను గురించి, అవనీంద్రుని అతీతభావనాశక్తిని గురించి, చౌక్తాయియొక్క ఉత్తమమైన పుణ్యాన్ని గురించి, వోపికతో ప్రసంగిస్తున్నారు. వీరు విశాఖపట్నం వచ్చినారు. ప్రదర్శనానికి ప్రఫసర్‌గారినే అధ్యక్షులుగా నియమించారు. ఆ వూరిలో యీ విషయాలు వీరికంటే తెలిసిన వారు లేరుగా!

మోహనరావు, చంద్రమతి అందరికంటే ముందుగా అక్కడికి వెళ్లారు. వీరి నిద్దరిని సత్కరించి ప్రదర్శనానికి ఆహ్వానించారు. "రా! చంద్రమ్! కొన్నికొన్ని మంచిబొమ్మలున్నాయి, చూద్దాము" అంటూ ఆమెను చేయి పట్టుకొని తీసుకువెళుతున్నాడు. ఇంతలో కలెక్టరుగారు, వారిభార్య వచ్చారు. సందడిని విని మోహనరావు చంద్రమతితో వారికి ముందుగా వెళ్లినాడు. కలెక్టరుగారిభార్య, అతడు కామ్‌బ్రిడ్జ్‌లో కలసి చదువుకొన్నారు. వారిద్దరికి చాల పరిచయము. ఆమెను చూచి మోహనరావు చిరునవ్వుతో, "మాదేశపు చిత్రకళ చూచారా! ఎంతగొప్పదశలో వుండేదో! ఆ ప్రతిభ యెప్పుడు మరల వస్తుందో" అన్నాడు. అంటూనే, వారిద్దరిని చంద్రమతికి పరిచయముచేశాడు.

"ఓహో! మా మోహన్‌భార్యవా? నిన్ను చూస్తే చాల సంతోషంగా వున్నది. మీ రిద్దరు మా యింటికి రావాలి! సావకాశముగా ముచ్చటించుకోవాలి మనము" అన్నది లూసీ.

కలెక్టరుగారు చంద్రమతితో మెల్లిగా మాట్లాడుతూ, చిత్తరువులవైపు నడువ నారంభించారు. లూసీ మోహను లింకొకవైపు నడచారు. దొరతో నడుస్తూనే వున్నది. ఆయన "యీబొమ్మ బాగున్నది—ఆ చెక్కడపుపని యెంత రమ్యముగా వున్నదో!" అనే అభిప్రాయాలకు ఊకొట్టుతూనే వున్నది. కాని, ఆమెమనసంతా లూసీ మోహనుల మీదనే వున్నది! వారెంతో శ్రద్ధతో బొమ్మలను చూస్తున్నారు. ఒక్కొక్కచోట చాలసేపు ఆగుతారు. కొన్నికొన్నిబొమ్మలముందర అట్టే విస్మయంతో నిర్ఘాంతపోతు న్నారు. ఇద్దరు కలసి కొన్నిఅడుగులు వెనుకకు వచ్చి బొమ్మనుగురించి యేమేమో మాట్లాడతారు. బొమ్మకు దగ్గరగా వెళ్లి యెగాదిగా పదిపర్యాయాలు చూస్తారు! లూసీ మాటలధోరణికి అంతే లేదు. ఇంక అతనికి లోకమే లేదు!

కొంతసేపటికి కలక్టరుగారు లూసీవైపు తిర్గి, "యింకొకపర్యాయము రావచ్చును. ఇప్పటికి వెళ్ళుదమా" అన్నారు.

ఆమె 'సరే' అంటూ, ప్రఫసర్‌గారికి చేతి నిచ్చి, "నీవు, చంద్రమతి రావాలిసుమా తప్పకుండా" అన్నది. అతడు: "ఓ! తప్పకుండా వస్తాము" అంటూ ఆమెదగ్గర సెలవు తీసుకొన్నాడు. అతనిముఖంలో యెన్నడూ లేని సంతోషము కనబడుతున్నది. చంద్రమతి కండ్లముందట అతడు క్రొత్తమనుష్యుడయ్యాడు!

"చంద్రమతీ! ప్రఫసర్‌గారు నిన్ను తీసుకునవస్తారు మాయింటికి. సావకాశముగా యెంతోసేపు మాట్లాడుకుందాము" అంటూ లూసీ ఆమెదగ్గరనుండి కదిలినది. కలక్టరు గారు చంద్రమతికి వంగి అభివందనం చేస్తూ వెళ్ళిపోయారు.

"ఏం చంద్రం! దొరగారిక్కడ స్వదేశకళాభివృద్ధిగురించి యేమైనా తెలుసునా?" అని అడిగాడు మోహనరావు.

"ఏమో! యేమేమో చెప్పినా డాయన! నా కేమీ అర్థముకాలేదు. ఆమెకు మాత్రము చాలా పరిచయ మున్నట్లున్నదే, యీ విషయాలలో" అన్నది ఆమె.

"లూసీకా? ఆఁ, ఇందులోనే కాదు—ఆమెకు అన్నివిషయాలలో ప్రవేశ మున్నది ......చూడు! ఆమూల అవనీంద్రుని బొమ్మ వొకటున్నది. నీవు తప్పకుండా చూడ వలసినది" అని, ఆమె చేయి పట్టుకుని అవైపు తీసుకువెళ్ళినాడు. ఎందువలననో కాని, ఆమె చేయి వదలించుకోబోయినది. అతడు మరింత గట్టిగా పట్టుకున్నాడు.

పెద్దబొమ్మ. పచ్చని గడ్డిమీదనుండి సన్నని పొడుగుపాటి కాడపైన వికసించినది— ఒక్కటే పువ్వు. ఎర్రనిరంగు. ఆపువ్వుకు చాలా పైగా యేదో చెట్టుకొమ్మలు వున్నవి— యెండుతూ యెండుతూ వున్న ఆకులతో!

"ఎంత గొప్పబొమ్మనుకున్నావది! అవనీంద్రుని మహత్వము వర్ణింపగలమా ?" అన్నాడు.

ఆమె చాలసేపు నిదానించి చూచింది. క్రింద సంతకము చూచింది. 'వెల వేయి రూపాయ'లని చదివినది.

బొమ్మ బాగుగానే వున్నది. కాని, అంత ప్రొత్సాహించ... ఉల్లింతలాడవలసిన అగత్యం కనబడలేదు:
గడ్డిమీద పువ్వు—కాదాయ నంటే కొంచెము యెత్తుగా పెరిగింది. పైన, వాడి పోతూవున్న ఆకులు—ఇంతేనా! యిందులో యేముంది?

"ఏం? మాట్లాడవు! చంద్రం—నీకు నచ్చలేదూ?"
"బాగానే వుంది."

"బాగానే వుందా? అయ్యో! అందులో పదపవంతు బాగుగా వ్రాయకలిగిన వారిని నెత్తిమీద వుంచుకుంటా.........లూసీ యెల్లాగైనా యీ బొమ్మను కొంటుం దట" అన్నాడు, నిప్పుమీద నెయ్యి వేసినట్టు.

చంద్రమతి అక్కడనుండి కదలినది. కొంచెముసేపు వుండి యిద్దరు యింటికి వచ్చారు. ఒకరితో వొకరు మాట్లాడకుండా వుండడానికి అనేక మిషలు కల్పించుకొన్నారు.

ఆప్రదర్శనమువలన యిద్దరకూ మరింత ఆశాభంగ మైనది—కాని, వొకరితో నొకరు ఆమాట సంప్రతించలేదు.

విశ్వం వచ్చాడు వీరింటికి. ముగ్గురూ కలసి యేమేమిటో మాట్లాడుకుంటున్నారు. ఇంతట్లోకి కలక్టరుగారి వద్దనుండి కబురు వచ్చినది. "మీరు చదరంగము చాల బాగా ఆడేవారని లూసీ అనినది. ఇబ్బంది లేకపోతే రాగలరా? తమ భార్యగారు కూడ రాగలి గితే సంతోషిస్తాము"—అని సందేశము.

"చంద్రమ్, వెళ్ళుదమా?" అన్నాడు మోహనరావు, వెల్లువయ్యే ఆపేక్షతో.
"నాకు ఆ ఆట రాదుగా—, నేనుకూడా యెందుకు? మీరు వెళ్ళండి" అన్నది ఆమె.

"అబ్బే! ఎందుకులే" అని కాగితము కలం దీసుకొని వ్రాయబోతున్నాడు. ఆమె లేచి వెళ్ళి అతని భుజాలమీద తనచేతు లుంచి, "చూడండి! మీరు వెళ్ళండి—మీరు తప్పకుండా వెళ్ళాలి. అబ్బాయి విశ్వం వున్నాడుగా...యీవేళ మనము చూచిన బొమ్మలను గురించి చెపుతాడు నాకు. నాకున్నూ చాల కుతూహలంగా వున్నది వినాలని. మీరు వెళ్ళండి...వెళ్ళకపోతే నాకు కోపం వస్తుంది" అన్నది.

* *

చాలసేపు మాట్లాడినారు—మేనత్త, మేనల్లుడు. విశ్వానికి శాంతినికేతనము కబుర్లనినా, రవీంద్రునిప్రశంస అనినా, అవనీంద్ర చౌక్తాయిల యెక్కువ తక్కువలను గురించి మాట్లాడడ మనినా, తగని సరదా. నిద్రాహారాలు లేకుండా ముచ్చటించగలడు. అతడు చెపుతున్నాడు. ఆమె వింటున్నది—అప్పుడప్పుడు వొకప్రశ్న వేస్తూ...పదైనది...పదకొండైనది—రెండుగంటలు.

"మామయ్య యింకా రాలేదేమి ?"

"వస్తారులే ! నీకథ కానియ్యి."

అతడు 'శాంతినికేతన'పు విషయాలన్నీ చెప్పినాడు. అక్కడి చదువు యేమిటో, అక్కడి సంగతిసందర్భా లేమిటో, అక్కడ క్రొత్తగా చేరేవారు యెట్లా చేరవలెనో—అన్నివిషయాలలో, అనుకోకుండానే ఆమెను తరిఫీదు చేసినాడు......అతని కేమి తెలును!—

మూడున్నరకు మోహనరావు యింటికి వచ్చాడు, కలక్టరుగారి మోటారులో.

"ఏం విశ్వం ! అత్తయ్యను కళాప్రపంచకము లో ముంచి వేసినావా" అన్నాడు.

విశ్వం దిట్టమైనవాడు—"మామయ్య చదరంగంలో మునిగిపోతే, అత్తయ్య బొమ్మలమాటలలో మునిగినది" అన్నాడు.

"చదరంగము సాధారణపుఆట గాదోయి. అందులో చాలా బుద్ధి వుపయోగించాలి: అందువలననే నా కాఆట చాల యిష్టము. మరియేఆట ఆడను నేను. అందులో, లూసీ చాల బాగ ఆడుతుంది. చాల బాగ ఆడుతుంది. ఆమెను వోడించుట దుస్తరమైనది నాకు."

చంద్రమతి మనస్సులో కర్తవ్యం నిర్ధారణచేసుకున్నది !

* * *

"చంద్రమ్ ! నీవు వెళ్లి ఆరునెల లైనది. సుఖముగా జేరినట్టు వ్రాసిన రెండుపంక్తులు తప్ప నీచేతితో మరల నాకు వ్రాసినావు కావు. మీ'సూపరింటెండెంటు' వ్రాసేకార్డులు చూస్తే నాకు కోపము వస్తుంది. నాలుగుమాటలు వ్రాస్తే అరిగిపోతావా?......

"అంత ప్రేమించినావే !......ఎన్నిమారు లన్నావు : 'మోహన్ ! నీతోటే నాకు లోక మున్న'దని ? మనపెండ్లి గాక పూర్వము నారాకకోసము యెంతగా నిరీక్షించేదానవు! మొట్టమొదటిరాత్రి నాచెంపమీద నీచెంప జేర్చి నీవనినమాట జ్ఞాపకమున్నదా—'నాకంటె అదృష్టవంతురా లెవ'రని ?

"చంద్రం ! ఎట్లు మరచిపోగలవు—అంతటిప్రేమను !.........

"ఇక్కడ అనేకులు అనేకవిధా లంటున్నారు. నాకే నీమీద యిష్టము లేక పంపివేసి నానని కొందరంటున్నారు. పాపాత్ములు! వారి కేమి తెలుసును—నిమిషనిమిషము నీమూర్తి నాకన్నులయెదుట సాక్షాత్కరిస్తుందని:—

"'కనులు మూసిన లోకమోహన మనోజ్ఞ
మూర్తి చిరునవ్వు చిలుకుచు మ్రోల నిలుచు !'

"నీవు నన్ను యెప్పుడు విడిచివుండవని యీ వెర్రిలోకానికి యేమి తెలుసు!—విడిచి వుండవు? పిచ్చివాణ్ణి!—యిప్పుడు విడిచి వుండలేదూ?

"ఈమధ్య విశ్వం వచ్చినాడు. నీమాట చెపుతూ, 'అత్తయ్య శాంతినికేతనానికి వెళ్లినదని నాకు చాల సంతోషము. అక్కడనుండి నా స్నేహితులు వ్రాస్తున్నారు: ఆమె అన్నివిద్యలు నేర్చుకొంటున్నదని. అద్భుతముగా సంగీతము పాడుతుందట! ఆమె లేనిది రవీంద్రుడు ఉపాకీర్తనను సంకీర్తించలేడట.—ఇతరబాలిక లందరికంటె అతీతమైన పాండిత్యము సంపాదించుచున్నదట' అన్నాడు. అప్పుడు నాకు తోచినది: నేనే నిన్ను పంపివేసుకున్నానని. నా మాటలవలన నేనే నిన్ను నాకు దూరముచేసుకున్నాను. కాని, చంద్రం!—నాకు నీవు కావాలి కాని అవన్నీ యెందుకు! నీముద్దుమొఖం చూస్తోవుంటే అందులోనే వుంటాయి నాకు లోకంలో వుండే చిత్రకళలన్నీ. నీవు అనురాగంతో పలుకరిస్తే అందులోనే వుంటాయి సంగీతసాహిత్యాలలో వుండే సర్వసౌందర్యములు!—నాకు నీవు, నీవ్యక్తి, నీప్రేమ ముఖ్యం. నీ వుంటే నాకు మరేమి అక్కరలేదు......

"అయితే—నేను తప్పు చేసినాను: అజాగ్రత్తగా ప్రవర్తించి నీమనస్సును నొప్పించినాను. ఇప్పుడు తలచుకుంటే యెన్నెన్నియో నిదర్శనములు జ్ఞాపకమువస్తున్నాయి—నా బుద్ధిహీనతకు. సున్నితమైన నీమనస్సును బాధించినానని ఆలోచింపకుండా లక్షపర్యాయాలు నీయందు నిరసనభావము చూపించినాను—కాని, నీవు చాల అపోహపడుచున్నావు. ఒక్కమారైనా, నాకు నీయందు గల ప్రేమ మచ్చుకైన, సూదిమొనంతైన తగ్గలేదు.........

"నాకు యేమీ తోచటములేదు. నీవు లేనిదే నాకు లోకము లేదు. ఇక్కడ వీరు చూపే గౌరవాలు, వీరు రెండుచేతుల సమర్పించే ఆహ్వానాలు నాకు విషములా వున్నాయి. వీని నన్నిటినీ, వీనికి పదిరెట్లు నీతో అనుభవించాలని కోరుకొనిన నా కెందు కివ్వి!——చూడు! నీవు తక్షణము బయలుదేరి రావాలి—నీవు రాకపోతే నేనే వస్తాను.——"

అంటూ పెద్దఉత్తరము వ్రాసినాడు మోహన్‌రావు. ఇటువంటివి యెన్ని వ్రాసినాడో యిదివరకు!—జబాబే లేదు.

పదిహేనురోజుల కొకపర్యాయము మాత్రము ఆమె సూపరింటెండెంటు "శ్రీ చంద్రమతీదేవిగారు క్షేమంగా నున్నారు. మీరు ఆమెకు కావలసినసొమ్ముకంటె రెట్టింపు పంపిస్తున్నారట. అంత అనవసరమని వ్రాయమనినారు" అని వ్రాసేది. ఈచీటీలు చూస్తే మండిపడేవాడు మోహనరావు. తనకోపము తీర్చుకొనుటకు తక్షణం ఆమెపేర రెండువందల రూపాయలు టెలిగ్రాఫ్ మనిఆర్డర్ చేసేవాడు!

రూపాయలు! రూపాయల కేమి కొదువ? అతడు విశ్వవిద్యాలయానికే చేసేసేవ అమూల్యము. అతడు వుండుటే ఆసంస్థకు గొప్పగౌరవము! అంతే గాక, యితరపట్టణాల వారు కూడా అతనిని పిలిపించేవారు. ఉపన్యాసాలు యిప్పించేవారు. బహుమానములతో నింపివేసేవారు.

పరదేశములనుండికూడ వుత్తరములు వచ్చేవి. సుప్రసిద్ధులైన పత్రికాధిపతులు అతని వ్యాసములను మరీమరీ కాంక్షించేవారు. కాని, పాపము! యేమి వ్రాస్తాడు? ఒక్కొక్కప్పుడు వ్రాయుట మొదలుపెడతాడా, కొన్నిపంక్తులు వ్రాసినాక ఆకాగితములు అవతల పారవేసి, "చంద్రమ్, నీకు దయ రాదా! ఇంతటి కఠినాత్మురాలవా," అని జాబు వ్రాయ నారంభించేవాడు.

* * *

ఏడాదిలో మారిపోయినాడు మోహనరావు. మునుపటి ఆశయాలు, అందము, కళ, యేమీ లేవు అతనిలో. విశ్వవిద్యాలయపు పనిమాత్రము గడ్డిపోచంతైనా తప్పకుండా చేసేవాడు. కాని, కళాశాల బయటకు వచ్చినాక మనిషి మనిషి కాడు. ఇంతింత గాని పరధ్యానము. ఇదివర కెన్నడూ లేని అజాగ్రత్త. ఆరోజులలో పూట కొకదుస్తు వేసేవాడు! శుభ్రతలో గాని, రంగులమేళనములో గాని చీమతలకాయంతైనా తప్పు వస్తే సహించేవాడు కాడు. ఇప్పుడూ! నల్లలాగు, తెల్లచొక్కా!! ఒకొక్కప్పుడు 'నెక్ టై' మరచిపోయేవాడు. టెనిస్ మానివేసినాడు, చదరంగమంటే తగనిపిచ్చి వుండేది. ఇప్పుడు యెంత గొప్ప ఆటగాడు రమ్మనినా "వీలుండ" దంటాడు.

ఇల్లు చూడవస్తే అశుభ్రత, ఆరమ్యత యేమి లేవు. తనగదిలో కాగితాలప్రోగులు. కుర్చీలు యేమూలవి ఆమూలే. వానిని సర్దుటకు మనిషి వస్తే "యిప్పుడు కాదు. యింకొకమారు" అనేవాడు. వాడు కొంచెము పట్టుదలతో నిలబడితే చేతులో యేదుంటే అది వానిమీద విసరేవాడు!

అయితే, ప్రతిరోజూ లేచిలేవడముతోనే స్నానము చేసి ఆమెగదిలోనికి వెళ్లుతాడు. స్వయంగా గదిని శుభ్రపరుస్తాడు. ఆమె 'శృంగారమేజా' మీద అన్నివస్తువులు ప్రతీదీ జాగ్రత్తగా అమరుస్తాడు, నిలువుటద్దానికి మెరుగిస్తాడు. ఆమెఫోటో వున్నది—పెండ్లి

అయిన మరునాడు లోయతోటలో తీసినది. పెద్దబొమ్మ! దానివద్ద రకరకాల గులాబి పువ్వులు వుంచుతాడు. మైసూరులో యితనికోసము చేసిన అగరువత్తులను వెలిగిస్తాడు. ప్రొద్దున, రాత్రి, అగదిలో గంటసేపు గడుపుతాడు—పాపము !!

* * *

శాంతినికేతనానికంతా వన్నె తెస్తున్నది చంద్రమతి.

చిత్రము! అన్నివిషయాలలో శ్రద్ధ తీసుకొంటున్నది.

మొట్టమొదట కొంచెము కష్టపడినది. కాని ఆ మెపట్టుదలముందర యేఆటంకాలు ఆగలేకపోయినవి. ఏదో గొప్పఆశయము ఆమెను ఆవహించిన దనేవారు తోటివారందరు. కొద్దినెలలలోనే సంగీతమును మిక్కిలి బాగుగా అభివృద్ధి చేసుకున్నది. సహజముగా శ్రావ్యమైన కంఠస్వరము కొంత కృషివలన రమ్యతరమైనది. అందువలననే ఆమె లేనిదే 'ఉషాకీర్తన్' ఆరంభించేవాడు కాడు—'కవి'! సంస్కృతము, యింగ్లీషు, కొంతవరకు బెంగాలీ కూడ బాగుగా అభ్యసించినది. క్రమంగా కళాభవనంలో ప్రవేశించి అక్కడివిషయములు కూడా నేర్చుకొనుట మొదలుపెట్టినది. ఒకనాడు 'ఆచార్యుడు' అడిగినా డామెను: "చంద్రమతీదేవి! నీవు చిత్రకళ అభ్యసింపరాదా?"

ఆమె:—"నాకు వస్తుందా?"

అతడు : "నీకు కాకపోతే యింకెవరికి వస్తుంది?" అంటూ ఆమెను పరిశీలించి చూచాడు. ఆదివ్యలావణ్యము, ఆ చారెడుకన్నులు, కోలముఖము, కెంపుపెదవులు, సౌకుమార్యము, ఆ కోమలపు టరచేతులు, సన్నని పొడుగైన వేళ్ళు, ఆమె మూర్తీభవించిన శృంగారదేవతని చాటిస్తున్నాయి.

ఆచార్యుడు:—"సరిగ్గా కృషిచేస్తే నిన్ను యెంతదానినైనా చేయగలను."

ఆమె:—"ఎంతదానినైనా చేయగలరా? అవనీంద్రునంత!"

"అవనీంద్రుడా! వెర్రితల్లి!! ... ..కాని నిజాగా రేపటినుండి సరిగ్గా ప్రారంభించు" అన్నాడు ఆచార్యుడు.

చిత్రకళకూడా అభ్యసించుచున్నది చంద్రమతి. ఇంక కావలసిన దేమున్నది. ఆఁ, ఇంకొకటి. రాత్రులు పిల్లలందరు నిదురపోయినాక తాను, వొకబెంగాలీ అమ్మాయి తెల్లవారుఝాముదాకా చదరంగ మాడేవారట తరుచు.

కాని, చంద్రమతిమాత్రము చిక్కిపోతున్నది. అన్నం సరిగ్గా తింటోందో లేదో. అందరికి ఆశ్చర్యంగా వుండేది. వేషములోకూడా అందరిపద్ధతులు పరిశీలించి చూచేదే గాని, తానుమాత్రము మిక్కిలి సాధారణముగా వుండేది. ఒక్క నగిషీ లేదు. అనవసరమైన ఆడంబరము లేదు. పువ్వులంటే అపరిమితమైన ప్రీతి. అందరికంటె ముందుగా రకరకాల పువ్వులు

కోసుకువచ్చేది గాని వొక్కపూవైన తలలో పెట్టుకొనేది గాదు. వాళ్లకి వాళ్లకి పంచి పెట్టేది...కొన్నికొన్ని సమయాలలో ఇతరకత్తెలను విడచివెళ్లి వొక్కతె ఆతోటలో యే మూలనో అరగంటో గంటో వుండివచ్చేది. తర్వాత ఆమె కన్నులు చూస్తే సందేహాస్పదంగా వుండేవి.

వారానికి వొకమారు వుత్తరం వచ్చేది ఆమెకు. దానికొరకు ఎంత నిరీక్షించేదో! అది దొరికినాక ఆమెకు లోకమే లేదు. స్నేహితురాండ్రను మరచిపోయేది. పాఠాలను మరచిపోయేది. మరల మరల చదివేది, ఆవుత్తరాలను. వానిని కన్నీటితో పూజించేదని ఆమె సహవాసకత్తెల అభిప్రాయము!

ఒకనాడు వున్నట్టుండి విశ్వుండగ్గరనుండి జాబు వచ్చినది.
క్లుప్తంగా వున్నది.
"అత్తా!

"మామయ్య మనుష్యులలో లేడు. నిన్న నన్ను చూచి మండిపడినాడు! తన నిర్జీవత్వానికి—తన జీవితవినాశనానికి నేనే కారకుడనట! తన రాచనగరును శ్మశానము చేసినానట నేను. ఇంకా యేమేమిటో అని, తనముఖము చూడవద్దనినాడు. చనువు గనుక అడుగుతాను:—ఎన్నాళ్ళు యీపరీక్ష! నీకు యేమాత్రము ఆలోచన వున్నా తక్షణం నీయింటికి వస్తావు—

"నీమేనల్లుడు."

చంద్రమతి నిలువ నీరయినది. ఈపరిస్థితులు వస్తాయని తెలుసు. భర్తను తలచుకొంటే కడుపు చెరువైనది; అబ్బ! ఎంతబాధ! ఎందుకోసము యీచదువు?—ఈ గొప్పతనము? "కవీశ్వరునంతవాని అనురాగము కాల్పనా! వానికింత బాధ కలిగించినాక"—అనుకున్నది.

కాని, ...............

* * *

ఆవేళ రాధాకృష్ణనాటకము. విశాఖపట్టపు పెద్దమనుష్యులందరూ వెళుతున్నారు. ప్రఫసర్ గారినికూడ రమ్మని బలవంతము చేసినారు ఆయన దగ్గరస్నేహితులు. "నేను రాను, నా కెందుకు నాటకములు" అన్నాడు ఆయన. "అట్లా కాదు, యిది యితరనాటకముల వంటిది కాదు. యిందులో వొక ప్రాముఖ్యము వున్నది. దీనికొరకు స్థానమంతవాడు కృషి చేస్తున్నాడు; యిది మన నాటకప్రపంచకములో క్రొత్తఅంకాన్ని సూచిస్తుంది" అని అతని ప్రోత్సహించి బలవంతాన తీసుకువెళ్ళినారు.

మోహనరావుకు మొదట యేమీ అంత శ్రద్ధ లేకపోయినది. కాని, కొంతనాటక మైనపిదప రాధపాత్రయందు పోకవిధమైన యిష్టము కలిగినది. ఆమె చేసే ప్రతి అభినయము ఆమె మాట్లాడే ప్రతిమాట అతనిహృదయములో అలజడి పుట్టిస్తున్నవి.

రాధ కృష్ణునికొరకు నిరీక్షిస్తున్నది. "రేపు వస్తాడు, యెల్లుండి వస్తాడు; యిదిగో! యిప్పుడే వస్తున్నాడు" అంటూ చెలికత్తె ఆమెను వూరడిస్తున్నది. కాని, లాభము లేదు. పాపము! రాధ కృశించిపోయినది. శ్రీకృష్ణ సందర్శనార్థము ఆమెకన్నులు కాయలు కాసినవి. చెలి అనేకవిధముల ప్రయత్నిస్తున్నది—ఆమెకు జీవితమందు, తన్ను అనుసరించిన వారియందు కొంత శ్రద్ధ కలిగించాలని. కాని, యేమి ప్రయోజనము! వియోగములో మునిగిపోయిన రాధను ఉద్ధరింపగలవాడు శ్రీకృష్ణుడే.

తనగోల చెప్పుకొంటోంది .....కృష్ణుని తాను మొదట సందర్శించుట; అప్పుడు అతనికి తనమీద కలిగిన అకారణమైన ప్రేమ. ఆప్రేమవలన, మనుష్యమాత్రురాలైన తాను ఒక గొప్పదేవతగా మారుట—ప్రియుడు తనను వేయివిధాల సంతోషములో ముంచివేయుట. ఇంతలో యిూభరింపరాని యెడబాటు! ఈహృదయశల్యమైన నిరీక్షణ! ఈజీవమే లేని జీవితము!—పాపము! మాట్లాడుతోనే రాధ చెలికత్తెమీద వాలిపోయినది. సహజముగా వానంత టవే ఆమెమాటలు పాటగా మారిపోయినవి.

'ఈ వియోగజలధి గడచిన గదా—యేచు ముదము గనుట—ఓనళినీ......'

ప్రేక్షకులందరు మిక్కిలి శ్రద్ధతో చూస్తున్నారు...అంతా నిశ్శబ్దము...అందరు రాధ చిత్తావేదనలో లీనమైపోయినారు.

మృదులహృదయుడైన మోహనరావు మరిన్ని! అతనికి రాధ మూర్తీభవించిన ప్రేమ స్వరూప మైపోయినది.

'ఏవిధమున గడపుదునో కాలము,
ఎన్నడు మా గోపాలుని గాంతును...
—ఆహా! చెలీ! భరింపగా గలనొకో ..
ఈవియోగజలధి గడచిన గదా...'

ఎంతకఠినుడీగోపాలుడు! అంత ప్రేమించుచున్న రాధను సంతోషింపజేయలేడా! ఇంతప్రేమ అతనికి లెక్కలేదా? పాపము! ఆమె జీవించునా?—మోహనరావు చటుక్కున లేచినాడు. స్నేహితులు ఆశ్చర్యపోయారు. అతనికన్నులు నీరుగ్రమ్మినసంగతి అతనికి తెలియదు...నాటకముబయటికి వచ్చినాడు. ఎల్లా జేరాడో, యిల్లు జేరాడు.

తిన్నగా ఆమెగదిలోనికి వెళ్లి దీపము వెలిగించినాడు. పిచ్చివాడు!—'చంద్రం' అని

పలుకరిస్తూ ఆమె బొమ్మముందర నిలచున్నాడు. కాని, బొమ్మలో చంద్రం లేదు—శ్రీకృష్ణుడు! తానో? రాధ. వెఱ్ఱిమార్పు! బొమ్మకు యెదురుగా వున్న సోఫామీద చతికిల బడినాడు.

తన ప్రేమమూర్తిని వూరికే చూస్తున్నాడు.

క్రమముగా ఆకారము మారినట్లు కనబడినది. కొంచెము కొంచెముగా స్త్రీరూపము తెలుస్తోంది. అతనిహృదయంలో మాత్రము అదే బాధ — వేయిగాలములతో లాగుతో వున్నట్లు...గొప్పజ్వరంలో వున్నట్లు, మండిపోతూవున్న కాక!—ఇక తాను జీవింప కలడా? బొమ్మదగ్గర, బల్లమీద ఆమె బంగారపుగొలుసు కనబడ్డది—పెండ్లినాడు తాను ఆమెకు ఇచ్చినది; 'చదువుకునేదానికి నా కెందు'కని ఆమె తీసుకువెళ్ల లేదు: ఆమెకు మారుగా ఆగొలుసును సంరక్షించుకొంటున్నాడు. దీపపుకాంతిలో ధగధగ మెరుస్తోంది. గొలుసును మెడలో వేసుకున్నాడు. వ్రేళ్ళతో జపమాలను త్రిప్పుచున్నట్లు త్రిప్పుచున్నాడు. పెదవులతో స్పృశిస్తున్నాడు: "చంద్రాం ..చంద్రం...చంద్రం—నిన్ను నేను మళ్లా చూస్తానా!"

* * *

ఎప్పు డొచ్చినదో! ఎల్లా వచ్చినదో! చంద్రం. తన ప్రతిమముందర, బంగారపు గొలుసును నమిలివేస్తూ తన ఆకారానికేసి రెప్పపాటు లేకుండా చూస్తూవున్న భర్తవెనుక జేరింది; అతనితలను తనవక్షానికి జేర్చుకున్నది. అతనిచెంపలమీద తన మెత్తనిచేతుల నుంచి వంగి అతని ముఖములోనికి చూచినది. ఒకవంక చిరునవ్వు తాండవమాడుతోంది ఆమె ముఖంలో, ఒకవంక కన్నీరు కారుతోంది!

"ఇంత వెఱ్ఱి ఆపేక్షా!" అంటూ, అతని పెదవులను ముద్దుపెట్టుకున్నది.

యశోధర:—ప్రభూ! తాము పురవిహారార్థము వేంచేసినప్పటినుండి ఈవిధంగా మారిపోతిరి. నిత్యమూ నిట్టూర్పులూ, కన్నీరూ ఏకధారగా ప్రవహిస్తూన్నవి. నన్నేదో భయము ఆవరించి కబళించివేస్తున్నది. అయ్యో! తామే నన్నిటులు భయపెట్టిన నాహృదయవేదన ఇంక ఎవరితో చెప్పుకోగలను.

సిద్ధార్థుడు:—(కొంతసేపు తేరిపార జూచి) అయ్యో! నిష్కారణముగ నీమనస్సు కలత పెట్టితినే! భయము లేదు యశోధరా! నా కేదో భ్రాంతి కలిగినది, నిద్రపో యశోధరా!

యశోధర:—నన్నుమాత్రమే నిద్రపొమ్మని తా మిటులే మేలుకొని ఉందురా!... అయ్యో! తా మొకసారి కన్ను మూయగూడదా? ఆవిధముగా కంటికీ మంటికీ ఏకధారగా కన్నీరు రాల్చిన నేను నిద్రపోగలనా!

సిద్ధార్థుడు:—ఏమినిద్ర యశోధరా! కనులు మూసేసరికి ఏవో భయంకరమైన దృశ్యాలు కనబడుతున్నవి. ఒక్కొకసారి సప్తసముద్రాలలోనూ నీరంతా తైలమువలె మండిపోయి ఆమంటకు తారలన్నీ వెన్నముద్దలవలె కరిగిపోతున్నవి. ఒక్కొకసారి హోరుగాలికి ఆరిపోయిన దీపావళీ దీపాలవలె తారలన్నీ ఆరిపోవుచున్నవి. ఆమహాంధకారంలో ప్రపంచం అంతా గంభీరనిశ్చల జలసముద్రము కమ్మినటులుండును. ఆజలమును తాకుతూ తాకుతూ, పొరలు పొరలుగా చంద్రబింబము ఉదయిస్తూ ఉండును!

యశోధర:—ఏమి భయంకరమైన దృశ్యములు! ఆ అర్ధనిమీలిత నేత్రములతో ఆలోచించినంతవరకూ అది కనబడతూనే ఉండును. ఒక్క గాఢనిద్రపోయి లేచిన ఇవి అన్నీ పోవును గదా! ఒకసారి అయినా నిద్రపోవాలని ప్రయత్నిస్తిరా తాము! ఆవిధంగా చెక్కిలిపై చేయి చేర్చి ఆలోచించినంత కాలమూ నిద్రవచ్చునా? నేను మెల్లగా పాదము లొత్తుదునా?...ఒక గడియసేపు నిద్రపోగూడదా! ప్రభూ!

సిద్ధార్థుడు:—నా కీజన్మలో నిద్రరాదు యశోధరా! వచ్చినచో ఆనిద్రాగుహ అంతా, భయంకరమైన బిచ్చగాండ్ర ఆర్తనాదాలతో మారుమోగుతూన్నది. ఒక్కొక్కసారి వేలకొలది భిక్షుకులు గోనెలు కట్టుగుని చింపిరిజుట్లతో ఆక్రోశిస్తూ వీధులలో డేకుతూ నన్ను చూచి రొమ్ములు బాదుకొంటున్నారు! వారిఎదుట బుట్టలు నోటితో కరిచిపట్టుకొని మిటమిటలాడే ఎండల్లో రక్తపుబొట్లు నాలుకలనుండి రాలుచున్న కుక్కలు భాగ్యవంతుల దగ్గరకు పోయి బిచ్చమడుగుతున్నవి. ఒకొక్కసారి వీధులోనుంచి పోయే జనసమూహామంతా ఏవో నీడల

వలె తేలిపోతున్నారు. ఒక్కొక్కసారి వారంతా తేజఃస్వరూపులై అనంతతేజస్సులో లీనమై పోతున్నారు!

యశోధర:—ఏమి రాత్రి వచ్చిన దీవేళ నాకు! ఎప్పుడూ భయంకరమైన స్వప్నాల మాటేనా? పోనీ, ఒకసారి రోహిలకుమారుని ముద్దాడి దంతపుమొలకలు ఎంతవరకూ వచ్చినవో చూడకూడదా? లేపి తీసికొని వత్తునా?

[రోహిలుని ఎత్తుకొని వచ్చి దగ్గరగా నిలువబడును. రోహిలుడు ఆవలించి కన్నులు మూయును. సిద్ధార్థుడు రోహిలునివైపూ యశోధరవైపూ తదేకధ్యానంతో చూచును.]

ఇదిగో, రోహిలుని ఒక్కముద్దు పెట్టుకోకూడదా? ఎందుకు ఆవిధంగా తేరిపార చూస్తూ ఆ ఆలోచన?

సిద్ధార్థుడు:—ఒకసారి ఆదీపమువద్దర నిలువబడు యశోధరా! ఆదీపకాంతిలో జాజ్వల్యమానమైన నీనేత్రశోభ చూడవలెనని ఉన్నది.

యశోధర:—(దీపమువద్దర నిలువబడి) ఏమి విచిత్రమైనకోరిక కలిగినది ప్రభూ, నేడు తమకు!

సిద్ధార్థుడు:—(రోహిలునివైపూ, యశోధరవైపూ చూచి కన్నీళ్లు జొటజొట రాల్చును.)

యశోధర:—ఎందుకీ నిరంతరాశ్రుధార ప్రభూ! ఆహృదయవేదన నాతో చెప్పరానిదా? ఆమాత్రపు హృదయ రహస్యము తెలిసికొనుటకు నే నర్హురాలను గాదా?

సిద్ధార్థుడు:—మీయిరువురి కపోలములలోనూ ఆ నవనవారుణ్యము క్రమముగా తగ్గిపోతున్నది కదా!

యశోధర:—రోహిలుడు దినదినమూ చిట్టిచిట్టి నడకలు నడచుచున్నాడు, ఇది సంతోషింప దగినది కాదా?

సిద్ధార్థుడు:—ఆతని ముగ్ధబాల్యము మన కన్నుల కిక కనబడదు కదా!

యశోధర:—అయ్యో! ప్రపంచములో ఎవరైన శిశువులు ఎదుగుతున్నారని విచారించేవా రున్నారా? లోకసామాన్య విషయములో విచార మెందుకు తమకు?

సిద్ధార్థుడు:—విచారము కాదా! యశోధరా! ఈవిశ్వసౌందర్యమంతా ఒక విద్యుత్ప్రవాహంవలె మహావేగంతో ప్రవహించి పోతున్నది. ఆమహాప్రవాహములో ఒక తుషారపరమాణువైనా మనకు మిగలదుకదా?............ఈ తరళ సౌందర్యమంతా కాలనిద్రలో విస్మృతమై ఒక విచిత్రస్వప్నమువలె, స్మరించే వారైన లేక నశించి పోవునుగదా!.........ఏమి నిస్సహాయజీవితము!

యశోధర:—(తల వంచి కన్నీళ్లతో) అయ్యో! నా కనులు చీకట్లు కమ్ముతున్నవి. నేను భరింపలే నీ వేదన! ప్రభూ! న న్నెందుకు భయపెట్టెదరు!

సిద్ధార్థుడు:—ఎంతసేపని రోహిలుని బుజముపై నుంచుకొని మేలుకొందువు యశోధరా! నామాట విని పోయి శాంతముగ నిద్రపోవా!... నేనుకూడ నిద్రపోవుచున్నాను... ఇక నిద్రపో యశోధరా!

[సిద్ధార్థుడు మేను వాల్చును: యశోధరకూడ పోయి శయనించును. రోహిలుడు అప్పుడప్పుడు కదులుతూ కళ్లు నులుముకొనుచుండును: క్రమముగా శిశువూ యశోధరా, నిద్రపోవుదురు. సిద్ధార్థుని భావనా రూపులైన భిక్షుకులు ప్రవేశింతురు.]

అబ్బా! ఏమి ఈ ఛాయామూర్తులు! కదలుచున్న కీనీడలవలె మూగుతున్నారు.

[భిక్షుకుల ఆర్తనాదము వినబడును.]

ఏమి దారుణధ్వని! సముద్రఘోషవలె నా హృదయమున బుసబుస పొంగుచున్నది! సువర్ణస్తంభాలుకూడా పార్శ్వముల నిలబడి ఆ దారుణాక్రందనము వినలేక భోరున ఏడ్చుచున్నవి! ఆరిపోతూన్న దీపముకూడా కన్నీళ్లు రాల్చుచున్నది కదా! పొగలవలె ఉన్న చింపిరిజుట్టులతో దారుణముగ విలపించుచున్న ఈ ఛాయారూపు లెవరోకదా! ఓ ఛాయామూర్తులారా! మీ రెవరు? నాయెదుట నేలపై ఘోర్లి ఎందుకు ఏడ్చుచున్నారు?

భిక్షుకులు:—ప్రభూ! మే మీ రాజ్యమందలి భిక్షుకులము. మా దారిద్ర్యములో ఈ మృత్యుదేవత మా రక్తమాంసాలు నిత్యమూ పీల్చి పిప్పిచేయుచూ, ఎముకలు కటకట కొరికివేయుచున్నది! రక్తాశ్రువులతో మా శిశువు లామెచేలాంచలములు పట్టుకొని నడుచుచున్నారు! మమ్మా దారిద్ర్యమునుండీ మృత్యువునుండీ రక్షించు ప్రభూ!

సిద్ధార్థుడు:—అబ్బా! ఉరుముచున్న మేఘాలవలె ఏడ్చుచున్న ఈ ఛాయారూపులు నా హృదయమును కమ్ముకొనుచున్నారు. వీరి ఆహ్వానరజ్జువులు నన్ను బంధించి లాగుచున్నవి! నే నిది చూడలేను. సర్వమును విడిచిపోవుచున్నాను......ఓ మృత్యూ! నీ వెంత నిర్దాక్షిణ్యముగ ఈ దీనాతిదీనులను నమిలివేయుచున్నావు! కనుపాపలు లేక గవ్వలవలె తెల్లనైన నీ భయంకర నేత్రములతో నన్నెందుకు తేరిపార జూచుచున్నావు? నీ జ్వాలలు నాకివేయగల జీవియే లేదా ప్రపంచమందు! ......అయ్యో! యశోధరా! రోహిలా!......

యశోధర:—(కలవరించును) రోహిలునీ నన్నూ...ప్రభూ! (నిద్రపోవును.)

సిద్ధార్థుడు:—ఆ దీపకాంతిలో యశోధర ఎంత అమాయికముగా నిద్రపోవుచున్నది! రోహిలుని ఎర్రని శిరోజములలో ఆమె సువర్ణకంకణములు అరుణోదయమున సూర్యకిరణములవలె ఎంత మనోహరముగా మెరియుచున్నవి...కజ్జలరేఖాంచి

తములగు నేత్రములపై ఆ దీపకాంతి తామరాకుమీది సువర్ణోదకమువలె ఎంత మనోహరముగా ప్రవహించుచున్నది... నేను వీనిని విడిచి ఎటులు పోగలను !!

[ఒక అస్పష్టగానము వినిపించును.]

ఏమి ఆ దివ్యగానము! నాలో ఏదో దివ్యస్రవంతి ప్రవహించుచున ట్లున్నది!

[తెరలో గానము వినబడును.]

తారుణ్యోజ్జ్వల రాజకుమారా!
త్రావుము జీవితమధు విదిగో!
మృదుకంకణతాళారవముల కే
కదలి యాడు నీ చషమధువు !!
తారారాజత భృంగకుమారులె
త్రాగే రజనీ సుమ మధువు
ఈ రజనీ హాసము లన్నియు నీ
యౌవన మంగళ హారతులు !!
తరళ విశ్వ సౌందర్యము లన్నీ
తారుణ్యారుణ హేమ పాత్రలో
తళతళ మెరిసే తరగములే:
చిటపట బుడగలు చితుగక మునుపే
త్రావుము యౌవనమధు విదిగో !!

సిద్ధార్థుడు:—ఏమి దివ్యసంగీతము. అది మత్తు నిద్రవలె నా చైతన్యమును కప్పివేయు చున్నది!

[అప్పుడు "యౌవనశ్రీ" ప్రవేశించును: ఉజ్జ్వలమై, ఉషస్సుందరమైన శరీరము: కదలుచున్న స్వర్ణచేలాంచలముతో ఆమె జ్వాలాపరీతయైన ఒక స్వర్ణప్రతిమవలె కనబడును: వక్షస్సీమలో కదలు మందార కుసుమాగ్రములు జ్వాలాగ్రములవలె కదలును: పాదమంజీరములకాంతి భూమిపై ముగ్గులుపెట్టి నటు లుండును ? శిరసుపై పద్మనిర్మిత కిరీటము; చేతిలో సువర్ణ మధుపాత్రము.]

ఉజ్జ్వలరూపిణీ, నీ వెవరవు ? ఇంతరాత్రి ఈ శయ్యాగృహములోనికి ఎటులు రాగలిగితివి ?

యౌవనశ్రీ:—(అస్ఫుటమైన మందహాసముతో నిలువబడి ఉండును.)

సిద్ధార్థుడు:—ఓ సుందరీ! నీ కిరీటపద్మముల సువాసనచే నా సర్వేంద్రియములు కలిసి మత్తెక్కి ఒకదానితో ఒకటి పెనవేసికొని పడిపోవుచున్నవి : నే నేవో అనను భూత లోకాలలోనికి పోవుచున్నాను : నాపై మత్తు మందు చల్లే నీ వెవరవు ?

యౌవనశ్రీ:—రాజా! నేను నీ శరీరోద్యాన వసంతశోభను. యౌవనశ్రీని. అనంత మనోరథ పాత్రలతో ఈ యౌవన మధువును త్రాగుటకై వచ్చితిని.

సిద్ధార్థుడు:—నాదగ్గర నీ కేమి కావలయును! నేనేమి నీ మనోరథములు పూరింపగలనని ఇచ్చటికి వచ్చితివి?

యౌవనశ్రీ:—అరుణోదయ కాచపాత్రమున తళతళలాడు సువర్ణ తేజోమధు వంతా ఒక గుక్కలో తాగివేయవలెనని ఆకాంక్ష నాకు! తారాకుసుమోజ్జ్వలమైన ఈ విశాల నీలాకాశమును ఒక్క కౌగిలింతలో నులిమివేయవలెను!

సిద్ధార్థుడు:—ఏమి సుందరోన్నతములైన ఆకాంక్షలు నీవి! నీవచస్సంగీతమోహితములై నా హృదయనాళములు నాగులవలె తోకలపై నిలువబడి తల లూపుచున్నవి. నన్ని ట్లనంతములగు ఆకాంక్షా పథాలకు లాగుకొని పోయే నీ అంతరార్థ మేమి? ని న్నింత మనోహరముగా అలంకరించినవా రెవరు? నీ యీ విశ్వోన్మాదకత్వమున కర్థ మేమి?

యౌవనశ్రీ:—ఇంతకు పూర్వము న న్నెవరూ ఇట్లు లడుగలేదు. ఎందు కీ వ్యర్థ ప్రశ్నలు!

సిద్ధార్థుడు:—నా పై కరుణించియైన నీ అంతరార్థమును వివరింపరాదా?

యౌవనశ్రీ:—ఎందుల కీ వృథా కాలయాపనము? దీనివలన లాభము కలదా? హేమ కంకణములు ప్రతిబింబించిన యీనీలమధువు నెమలికన్నులవలె ఎంత మనోహరముగా మెరయుచున్నదో! చూచితివా? పొంగు దిగిపోవక మునుపే దీనిని త్రాగి సుఖింపలేవా?

సిద్ధార్థుడు:—(కొంచె మాలోచించి) నీ వక్షస్సీమలోని మందార మాలిక లప్పుడే వాడి పోవుచున్నవి కదా జవ్వనీ!

యౌవనశ్రీ:—నీ యౌవనారుణ సుప్రభాతము తెల్లవారు సంగతి నీకు తెలియదు కదా? యువతీతరుణాధరమందారమునుండి సేకరించినది: ముగ్ధహృదయమువలె నిర్మలమైనది! ఎందు కీ మధుపూర్ణపాత్రిక తన్నిపోయెదవు?..................నా మాటలు వినిపించికొనవుకదా!...దూరమున ఆ నదీతీరమున ఏమి చూచుచున్నావు?

సిద్ధార్థుడు:—నాహృదయమున ఏవో అనంత నక్షత్రముల ఆర్తనాదములు ప్రతిధ్వనించుచున్నటు లున్నవి..... దూరమున—ఆ నదీతీరమందలి రెల్లుపొదలలో—కాగడాల వెలుతురులో ఎవరో నిర్దయులు మృతశిశువును పూడ్చిపోవుచున్నారు!! ఎంతనిర్దాక్షిణ్య మీలోకమునకు! తెల్లవారేవరకైనా ఉంచకూడదా ఆశిశువును?

యౌవనశ్రీ:—నామాటలు వినుటయే లేదా ?

సిద్ధార్థుడు:—జీవితము ఈవిధముగా ఉండగా, ఎట్లు వినగలను? నీమాటలలో నీపెదవుల కదలిక మాత్రమే కనబడుచున్నది. నీమాటలు కలవరింతలవలె అస్పష్టముగా ఉన్నవి.

యౌవనశ్రీ:—భావిభయముతో వర్తమాన జీవితము నెందుకు భగ్నము చేసికొందువు. కడచిన జీవితప్రవాహములో ఒక బిందువైన నీకు లభింపదని తెలియునా? నీకు ! అదిగో అటు చూచుచున్నావా ? ఒకసారి నీ వెనుకవైపునకు చూడు !

సిద్ధార్థుడు:—అం దేమి చూడు మందువు ?

యౌవనశ్రీ:—దూరమున దగ్గుతూ, గుంటలుపడిన కన్నులతో, రెల్లుపూలవలె నెరసిన శిరోజములతో నిలువబడి, గతించిన జీవితగ్రంథములోని పుటలు తిరగవేసి నిట్టూర్చుచున్నాడు, అతడే వార్ధక్య పురుషుడు.

ఇంకా అతనివెనుక చూడు ! గుడ్లగూబవలె భయంకరమైన చూపుతో, నల్లని ముసుగుతో, నీవెనుక దీపముతో నిశ్శబ్దముగ నడచు మహాంధకారమువలె మృత్యువు వచ్చుచున్నది. ఎప్పటికైన నీ జీవితదీప మా అంధకారములో మునిగి పోవలసినదే సుమీ !

సిద్ధార్థుడు:—కనుకనే అఖండనిర్వాణార్థినై పోవుచున్నాను! నీదివ్యోపదేశమునకు కృతజ్ఞుడను!

(బయలుదేరును.)

యౌవనశ్రీ:—ఉన్మత్తుడా ! ఈపసిపాపను, ఈముగ్ధబాలికను విడిచి కఠినుడవై పోవు చున్నావా ? చూడు! ఆఅనంతతారక లెట్లు పకపక నవ్వుచున్నవో నిన్ను చూచి !

సిద్ధార్థుడు:—వారిమీద నున్న ప్రేమ మూలముననే వారిని విడిచి పోవుచున్నాను. వారికై అనంతనిర్వాణామృతము తీసికొనివచ్చుచున్నాను ! నీప్రయత్నము లన్నీ నిష్ఫలములు.

యశోధర:—అయ్యో ! (నిద్రలో మూల్గును.)

సిద్ధార్థుడు:—అయ్యో! యశోధరా! (కొంచెమునే పాగి కన్నీటితో రోహిలుని ముద్దుపెట్టుకొని) ఇదిగో నిశ్చయముగ వారి కమృతమును తీసికొని వచ్చుచున్నాను ! యౌవనశ్రీ !!

(నిష్క్రమించును.)

[యౌవనశ్రీ విరగబడి పకపక నవ్వును. ఆనవ్వు పకపక ధ్వనులతో వేగముగా దిగిపోవు సిద్ధార్థుని పద ధ్వనికి తాళమువలె వినిపించును. దీపము ఒక్క వెలుగు వెలిగి ఆరిపోవును ! వత్తినుండి సన్నని పొగ వచ్చును. రోహిలుడు కన్నులు నులుముకొని మళ్లీ నిద్రపోవును.]

# ముత్యాలసరం: ఒక కృషి

శ్రీరంగం శ్రీనివాసరావు (కవితాసమితి)

౧

ప్రపంచంలో వాఙ్మయం మొదట జనిస్తుంది. తర్వాత విమర్శకులు పరీక్షించి దానికి లక్షణం ఏర్పరుస్తారు. మహాకవు లెవ్వరినీ నియమాలు బాధించలేవు. అలాగని నియమాలను ఉల్లంఘించి మహాకవిపదవి సర్థించడమూ పరిహాసాస్పదం. ఒక కవి బుద్ధిపూర్వకంగా ఒక నియమం ఉల్లంఘించడ మన్నది అందువల్ల ఒక సొగసు ఆవిష్కృత మవుతున్నప్పుడే చేస్తాడు. అందుకే అల్పులు నియమం పాటించకపోతే దానిని చేతకాని తన మంటాము. సమర్థుడు తెలిసి ఉల్లంఘిస్తే దానిని ప్రౌఢప్రయోగ మంటాము. మహాకవులను పట్టి చూపించే గొప్ప గీటురాళ్లే ఈ ప్రౌఢప్రయోగాలు.

ఈ ప్రౌఢత్వం ఒక్క వ్యాకరణ సూత్రాలను మాత్రమే చుట్టి ఉండదు. ఎల్లప్పుడూ నూత్నవిశేషాలకోసమే నిరాఘాటవిహారశీలురైన కవులు ఎడతెగని సృష్టి చేసుకుంటూ పోతున్నప్పుడు విమర్శకుడు స్థాయిగా కూర్చొని వారి భావనలో, భాషలో, పద్ధతిలో, ఆదర్శాలలో, సందేశాలలో మహిమలను సమగ్రంగా అధ్యయనించి మూర్ఖుల కళ్లుకూడా తెరుస్తూ ఉంటాడు. అప్పు డతనిని వ్యాఖ్యాత అంటాము. అతడే కొన్ని సామాన్యసూత్రాలకు లొంగే ప్రధానప్రవాహాలకు సంకేతాలు నిర్మిస్తూ ఉంటాడు. అప్పు డతనికి లాక్షణికుడని పేరు.

పూర్వం కాని, ఇప్పుడు కాని, ఎప్పుడు కాని, విమర్శకుడు మహాపండితుడైన ప్రజ్ఞాశీలి అని ఒప్పుకోనక తప్పదు. పండితమనస్సు సాధారణంగా 'రీతి'ని మన్నిస్తూ, ఎప్పుడైనా ఎవడైనా కవి ఎందైనా కొంత తొణికిపోయినట్లు కనిపిస్తే చాలును, పట్టుకొని తీవ్రంగా కదలవేస్తుంది. ఈ పట్టింపు ప్రాచీనకాలంలో మరీ ముఖ్యం. అందుకే అప్పటి విమర్శగ్రంథాలు కవికంఠపాశాలు! కవిసర్పగారుడాలు!

ఆధునికకాలంలో కవితాచైతన్యం సర్వత్రా వ్యాపించింది. కవిని బందులలో పెట్టి నలగగొట్టి వాటిలో అతడు సాముగరిడీలు చేస్తూఉంటే చూస్తూ ఆనందించే ప్రేక్షకులు కారు నేటి రసికులు. వీరు కవి కోరుకునే, అతని పుట్టుహక్కైన స్వేచ్ఛను అంగీకరిస్తారు. కవిని కొత్తనియమాలు నిర్మించుకోనిస్తారు. కాని వీరు విమర్శకులైనప్పుడు ఈ నూత్న నిబంధనలతో కవి ఎట్టి సౌందర్యాలు ప్రదర్శించాడో చూడడానికి కుతూ

హాలం పొందుతారు. మేము పండితుల మనే గర్వం మాని కవికి అర్హమైన ఉన్నతస్థానం ఇవ్వగలిగిన ఔదార్యం చూపిస్తారు వీరు.

ఆధునికకవిత్వం నియమరహితమైన దనే శుష్కవాదం సహృదయులైన విమర్శకులది కాదు. ఎన్నో విశేషపరిస్థితుల కూడికవల్ల రూపం పొందుతున్న ఒకరకపు కవిత్వాన్ని—స్ఫటికానికి వలె ఎన్నో ఫలకాలు కల ఒక క్రొత్త ఉద్యమాన్ని, ఏదో ఒక ఫలకం మాత్రం చూచి తాము ఊహించుకొనిన దనుకొన్నట్లు ఉండనంతమాత్రంచేత, తమ ప్రమాణాలకు లొంగనంతమాత్రం చేత, విమర్శకు—కాదు నిరసనకే, దూషణకే, పూనుకుంటున్న చిత్రమనస్కులు కొందరున్నారు. వీరిలో చాలామందికి బోధపరచుకుందామన్న శ్రద్ధ కాని, బోధపరచుకోవాలన్న జ్ఞానం కాని లేదు. వారికోసం కాదు నా యీ వ్యాసం.

నవీనకవిత్వం బాధ్యతలేని భ్రంశకార్య తత్పరుల అగమ్యగోష్ఠి కాదనీ, శుద్ధాంతఃకరణతో, సత్యసంకల్పంతో అనేకసారస్వతాలలో కావ్యగుణం గవేషించి కొత్త విధంగా కవిత్వసాక్షాత్కారం పొంది కావ్యగానం చేస్తున్నవారి వింతకంఠ మనీ నమ్మిన వారిని నా శ్రోతలుగా నిర్ణయించుకుంటున్నాను.

వారియొక్క సహృదయానికీ, సానుభూతికీ—ఆధునికకవులు విరివిగా వాడిన 'ముత్యాలసరం' అనే ఒకఛందస్సుపై నా యీ సమీక్షను ద్రష్టవ్యము కావిస్తున్నాను.

౨

గుత్తునా ముత్యాలసరములు
కూర్చుకొని తేటైన మాటల,
క్రొత్త పాతల మేలు కలయిక
క్రొమ్మెరుంగులు చిమ్మగా.

అని 1910 వ సంవత్సరంలో శ్రీ గురజాడ అప్పారావు నవీనకవిత్వానికి ఆరంభగతి ప్రయోగించాడు. అప్పు డతని డేమనుకున్నాడో మళ్లీ :

మెచ్చ నంటా వీవు, నీ విక
మెచ్చకుండే మించిపోయెను ;
కొయ్యబొమ్మలె మెచ్చుకళ్లకు
కోమలుల సౌ రెక్కడా ?

అని నిరాసతంత్రి మీటించాడు. ఆ ఊపు ఊపున ఇరవైతొమ్మిది ముత్యాలసరాలు అతని సహజధోరణిని ఒక ఖండకావ్యంగా వెలువడ్డాయి. దానితో ఆధునికకవిత్వానికి కవాటాలు తెరచుకున్నాయి.

'ముత్యాలసరం' అనే ఛందస్సు అప్పారావుగారి స్వతంత్రసృష్టి కాకపోవచ్చును. అంతకు పూర్వమున్న యక్షగానాలు ఈవిధంగా నడిచేరచన లెన్నింటినో చూపించవచ్చును. 'వృషభగతి'అనే రగడలో ముత్యాలసరానికి గల బాంధవ్యం గమనించవచ్చును. ఆ రగడలోని 'కళిక–ఉత్కళిక'లను ఊహించవచ్చును. కర్ణాటుల షట్పదులను పేర్కొనవచ్చును. అక్షరాలా ముత్యాలసరమే అయిన

గుమ్మ డేడే గోపితల్లీ,
గుమ్మ డేడే ముద్దుగుమ్మా,
గుమ్మ డేడే కన్నతల్లీ,
గుమ్మ డేడమ్మా ?

అనే గేయాన్ని తెచ్చి 'ముత్యాలసరం' నవీనతను ప్రతిఘటించవచ్చును. ఏమయినా 'ముత్యాలసరం' అంటే మనకు గురజాడ అప్పారావుగారి పేరే జ్ఞాపకం వస్తుంది. ఏ సన్ముహూర్తంలోనో అత డా గేయం పలికి దానికి 'ముత్యాలసరం' అని నామకరణం చేశాడు. ఒక నూత్నావేశానికి వాహనంగా చేకొని ఒక స్వతంత్రకవిత్వాన్ని విడుదల చేశాడు. గురజాడ అప్పారావుదే ఈ ఛందస్సు.1

---

1 Swinburne గురించి వ్రాస్తూ—

"It is possible that if Philip Sidney had not written—

'Ring out your bells, let mourning shows be spread;
For love is dead:
All love is dead infected
With plague of deep disdaim:
Worth, as naught worth, rejected,
And faith fain scorn doth gain.

From so ungrateful fancy,
From such a female frenzy,
From men that use men thus,
Good Lord, deliver us!'

We might never have heard—

'Then star nor sun shall waken,
Nor any change of light:
Nor sound of waters shaken,
Nor any sound or sight:
Nor wintry leaves nor vernal,
Nor days nor things diurnal;
Only the sleep eternal
In an eternal night.'

ముత్యాలసరాన్ని మాత్రాబద్ధ చ్ఛందస్సులలో ఒకటిగా నేను పరిగణిస్తున్నాను. దీన్ని గణబద్ధం[2] చెయ్యడమంటే బందులలో బిగించడ మన్నమాటే. గణబద్ధాలు కృత్రిమచ్ఛందస్సులనీ, నైసర్గికగమనం లయవల్లనే నిరూప్యమవుతుందనీ, కావున మాత్రాచ్ఛందస్సులు స్వాభావికములైనవనీ నేను విశ్వసిస్తున్నాను.[3] గణాలే కాక యతిప్రాసలుకూడా వైకల్పికంగా ఉండాలి కాని (ముఖ్యంగా గేయరచనలలో), వీటిని తప్పనిసరి చేసుకుంటే ధారాళమైన గమనం కుదరదు. విసువుకూడా సంభవిస్తుంది. వైవిధ్యం ప్రదర్శించడానికి అననుకూలత ఏర్పడుతుంది. వ్యర్థపదాలు ప్రవేశిస్తాయి. అందువల్ల ఈ

---

But the music of *The Garden of Proserpine* is as definitely Swinburne's creation as is the Drama of *Othello* Shakespeare's." అన్నాడు John Drinkwater.

ఇట్లే:

Arthur Hallam మృతికి విషాదిస్తూ Tennyson వ్రాసిన *In Memoriam* లోని గీతాల ప్రాస పద్ధతి మామూలువలె a, b, a, b, కాక క్రొత్తగా a, b, b, a గా

Ring out, wild bells to the wild sky (a)
The flying cloud, the frosty light; (b)
The year is dying in the night; (b)
Ring out, wild bells, and let him die. (a)

అని మార్చి కావ్యమంతా అట్టిగీతాలలో అతడు నిర్వర్తించాడు. కాని ఇట్లు చేయడానికి Tennyson మొదటివాడా కాడా అని తేల్చడంకొరకు అప్పటి పండితులు పాతవాఙ్మయ మంతా గాలించి అందుండి a, b, b, a ప్రాసలో ఉన్న ఒక stanza త్రవ్వి తీశారు. అయినా ఈవిషయం ఇట్లు నిర్ధారణ చేసుకున్న పిమ్మట ఆఛందస్సు Tennyson ది గానే అంగీకరించారు. మందాక్రాంత కాళీదాసుదీ, శార్దూలం శ్రీనాథుడిదీ కాదని మన మేలా గనగలం?

2 అబ్బూరి రామకృష్ణరావుగారు ముత్యాలసరాన్ని గణబద్ధం చేశారు. వా రన్నది: ముత్యాలసరం పాదానికి నాలుగు గణాలు: సూర్యగణం, ఇంద్రగణం—సూర్యగణం, ఇంద్రగణం. కాని ఇంద్రగణాలలో నాలుగుమాత్ర లున్నవే స్వీకరించాలి. అనగా భగణమూ, నలము. ఇంద్రగణాలు కాకపోయినా నగణమూ గగమూ స్వీకరించాలి, నాలుగుమాత్రలుకలవి కావున. అలాగే మూడుమాత్రలు గల లగమును సూర్యగణం కాకపోయినా స్వీకరించాలి. లయ, తాళమూ ఇవి సంగీతానికి చెందినవనీ, ఆమాటకొస్తే వాగ్గేయకారకులు ఏపద్యానికైనా రాగతాళాలు వేసి పాడగలరనీ, మనం సాహిత్యదృష్టిని ఏమరకూడదనీ అన్నారు. మహాకవి—ఎంత rigid, uniform ఛందస్సునైనా వాడి ఎన్నివందల గీతాలైనా వ్రాసి, ఏమాత్రమూ విసువు తోపించ డన్నారు. నిజమే. అల్పుల కెంతస్వేచ్ఛ ఇచ్చినా గొప్పరచన చెయ్యలేరు. సమర్థులు ఎంతబంధించినా విజృంభించగలరు. కాని సమర్థులకే స్వేచ్ఛకూడా ఇస్తే?

3 ఛందస్సులు మూడు తెగలు. సాగదీయడానికి వీలులేనివి. కొంతవరకు సాగేవి. బాగా సాగగలవి. అంటే rigid, semi-elastic. and elastic metres. నాఉద్దేశంలో వృత్తాలు (గణబద్ధచ్ఛందస్సులు) మొదటిరకానికీ, గీత సీసాదులు రెండవరకానికీ, మాత్రాచ్ఛందస్సులు మూడవతరగతికీ చెందుతవి. అందువల్లనే మాత్రాచ్ఛందస్సులు స్వాభావికములని సూచించాను.

విషయాలలో ఆధునికకవులు కొన్ని స్వాతంత్ర్యాలు తీసుకున్నారు. వారు కోరినది వైశాల్యం. ఛందస్సుకు సరిహద్దులు మరికొంచెం పెరివి చెయ్యమంటారు. ఆస్వేచ్ఛా విశాలవాతావరణంలో వారి విహారం చూస్తూకూడా విమర్శకులు వారినాపను నిగ్రహించ గలరా? బంధాలు సడలించడంవల్ల ఎన్నోరకాల లోపాలు ఏర్పడినమాత్రాన అన్నిటినీ గమనించవలసినదే సంతోషపూర్వకంగా—వాటివల్ల నూతనమహార్థాలు ప్రతిపాదించ బడుతున్నప్పుడు.

ముత్యాలసరాన్ని మాత్రాబద్ధచ్ఛందస్సుగానే నిర్దేశించి పరిశీలన సాగిస్తున్నాను.

ఈ ఛందస్సుకు నాలుగుపాదాలు. మొదటిమూడూ దీర్ఘపాదాలు. ఒక్కొక్క దానికి పద్నాలుగేసి మాత్రలు. నాల్గవది హ్రస్వపాదం. దీని స్వరూపంలో చాలా భేదాలున్నవి. ఏముత్యాలసరంలోనైనా దీర్ఘపాదాలలో దేనిని తీసుకుని పరిశీలించినా చాలును.

ఉదా. వి రి గి   పె రి గి తి   పె రి గి   వి రి గి తి
1 1 1   1 1 1 1   1 1 1   1 1 1 1 =14

క ష్ట సు ఖ ము ల   పా ర మె రి గి తి
2 1 1 1 1 1   2 1 1 1 1 1 =14

లయ మూడుమాత్రలూ, నాలుగుమాత్రలు. అనగా త్రిపుటతాళంలో నడుస్తుంది. ఈతాళం తప్పితే మాత్రలసంఖ్య సరిపోయినా పాదం నడువదు.

ఈ కనుసన్న లెవరికోసమో
ఈ మధుగీతు లెందుకొరకో
ఈ సందేశ మే సీమకో
... ...

—మునిమాపు.

(తల్లిబిడ్డలప్రేమ అంటే)
ఇల్లాగు వుండాలటంటూ
... ...
ఏడాది కొకసారి వస్తా
దేడాది కొకసారి తెస్తా (ను)
... ...
రావయ్య ఓ పూలరాజా
రావయ్య ఓ అందకాడా.

—కోకిలమ్మ పెళ్ళి.

# ముత్యాలసరం: ఒక కృషి

రెండవవి నొక్కి—విరిచి, చదివితే లొంగవచ్చును కాని 'మునిమాపు'లో గేయం మాత్రం అవ్యవస్థంగా ఉండిపోతున్నది.

'ముత్యాలసరం' అనగా త్రిపుటలో నడిచే (3 + 4) + (3 + 4) మొత్తం 14 మాత్రలు గల పాదాలు మూడున్నూ, నాల్గవది హ్రస్వపాదమూ గల గేయం. ఇక దీనికే నాలుగుపాదాలకూ ప్రాస, మొదటి మూడుపాదాలకూ ఎనిమిదింట యతీ నియమిస్తే పూర్వపు దస్తులతో ఒక పోతిచ్ఛందస్సు తయారవుతుంది.[4] కాని యతిప్రాసల వాడకంలో మన కవులు ఇచ్చవచ్చినట్లు నడిచారు. ఇష్టమువచ్చినచోటనే ప్రాస వేశారు. ఇష్టమున్నప్పుడే యతు లుంచారు. ప్రాసలకు బదులు యతులు వేశారు. కొన్నిచోట్లనే యతిప్రాసాలు పాటించారు. ఒక్కొక్కప్పుడు పూర్తిగా వీటిని త్యజించారు.[5] కాని ఎప్పుడూ వీరు గమనంమాత్రం ఏమరిపోలేదు.

ఇక చూడవలసినది నాల్గవదైన హ్రస్వపాదం. ఇది సాధారణంగా తొమ్మిది మాత్రలుంటుంది. సంస్కృత సంప్రదాయాన్నిబట్టి[6] అంత్యలఘువును గురువుగా పాటించి ఎనిమిదిమాత్రలుకూడా చెయ్యవచ్చును. ఏదైనా మూడు, నాలుగు మాత్రలదగ్గర విరగక తీరదు.

తొమ్మిది మాత్రలకు ఉదాహరణ:—

తాటిపనమున నాగి చంద్రుడు
తా ను చె వి యో గ్గ (లవణరాజుకల.)
2 1 1 1 2 2 =9

వారి యింటికి పోవలేదు
వదినతో మాట్లాడలేదు.
—దేవాలయము.

కాయ గాయదు పండు పండదు
వలపులోనే పడని పడలి.
—ఒక నర్మము.

ఎనిమిది మాత్రలకు:—

ఆంధ్రజననీ కంఠలంబిత
హారగోచులు ప్రిదిలె నిచ్చట :
ఇట పురాతన నృపయశస్సులు
ను రు గు క ట్టి న వి (ఆంధ్రుడా.)
1 1 1 2 1 1 1

---

4 ఇన్ని నియమాలతో పూడిపెద్ది వెంకటరమణయ్యగారు కొన్ని ముత్యాలసరాలు వ్రాశారు.

5 వీటన్నిటికీ ఉదాహరణాలు అనవసరమని మానివేస్తున్నాను.

6 అంత్యలఘువు గురువుగా దీర్ఘపాదాలలోకూడా వాడబడ్డది.

ఇంతకంటె దీర్ఘమైన పాదంకూడా నాల్గవదిగా వాడబడింది. దీని పరిమితి 12 మాత్రలు.

చెట్లపళ్ళను విలవ తెరుగక
పా ద ర క్ష ల మ ట్టి తిన్ (లంగ రెత్తుము.)
2 1 2 1 1 2 1 2

దీనిలో తుది గురువును ప్లుతముగా చేసి నాల్గుపాదాలకూ సమానదైర్ఘ్యం ఆపాదించవచ్చును. కాని 14 మాత్రలూ పూర్తిగా కల నాల్గవపాదంతో ముత్యాలసరాలు గూడా (అప్పారావుగారిలోనే) ఉన్నని.

వెలుగునీటను గ్రుంకె చుక్కలు,
చదల చీకటి కదల బారెను;
ఎక్కడనొ వొక చెట్టుమాటున
నొక్కకోకిల పలుకసాగెను.
—ముత్యాల సరములు.

తరువాతి కవులలో—

మధుర శృంగారోదయ మ్మా
మంజులోషఃకాలఖండము:
సుధల జిందెడు నీకిసాలయ
సుందరోజ్జ్వలతా విలాసము.
—'ధన్యకైలాసము'నుండి.
విశ్వనాథ

దీనికే యతిప్రాసలూ, అంత్యప్రాసా కూర్చిన అద్భుతమైన వృషభగతిరగడ వసుచరిత్ర లోనిది:

బాల బాలరసాల మిది పిక
పాలిపాలిటి యమరసాలము.
గేలిఁ గే లిడి గ్రుచ్చఁ గడు రా
గిల్లు, గిల్లకు తత్ప్రవాళము.

నాలుగుకంటె హెచ్చుపాదాలతో అక్కడక్కడ హ్రస్వపాదంతో నా 'బాటసారి' అనేగీతం నడుస్తుంది. అంతకు ముందే కవికొండల వెంకటరావుగారు 'శివరాత్రిప్రభ' 7 లో ఈపద్ధతిని ఒక విలక్షణచ్ఛందస్సు చేసి గొప్పగొప్ప విసురులు చూపించారు. అందులో హ్రస్వపాద విన్యాసం గమనించదగ్గది. నాలుగుకంటె ఎక్కువపాదాలు 'కాసులు' అనే గీతంలో అప్పారావుగారు వాడినారు. కాని ఆగీతం స్వరూపరహితంగా ఉన్నది.

7 'శివరాత్రిప్రభ'లో స్టాంజాల ఏర్పాటు ఉన్నది. 'బాటసారి'లో run-on verse యత్నించ బడ్డది. వీటి ఆకృతులు స్పష్టంగా కనిపించడానికి రెండిటినీ పూర్తిగా ఉదాహరిస్తున్నాను.

# ముత్యాలసరం: ఒక కృషి

హ్రస్వపాదంలో విశేషం చూపించినవారిలో వెలువలి వీరరాఘవస్వామిగారొక రున్నారు. 'ముసలమ్మగారి కార్తీకస్నానం' అనే హాస్యరచనలో వీరు తోకముత్యాలసరం అనే ఒక క్రొత్తరకం వాడకం తెచ్చారు. కాని ఇది గురజాడ అప్పారావుగారిలో ప్రథమంగా సూచిత మయియే ఉన్నది.

---

శివరాత్రి ప్రభ

౧

కాలకంఠుని నాగసర్పము
కుబుస మూడ్చి పడగ బున్నంది.
రెండు నాల్కలు
గండు మీసాలట్లు దూసింది,
చెవులు మోసింది ;
'నాగసార' మూదేది యెవరోయి ?
రాగ మొలికించేది యెవరోయి ?
కారు నల్లని కాళరాత్రి.

౨

నొసట గొసరిన మూడోకన్ను
నివురు లూదిన కొలిమి దెగడి
నెగడి ద్రిప్పింది,
పొగలు గప్పింది ;
కమ్మరయితే యినుము కరగ,
సోమరయితే చలిని కాగ,
నెవరు వచ్చేరోయి ?
ఎవరు మెచ్చేరోయి ?
కారు నల్లని కాళరాత్రి.

3

అర్ధభాగపు మహంకాళీ
కర్ధ మది కాలేదొ ?
ఏమో ?
పునుకులా గలగలలు వింటూ
కునుకు గన్నాదో ?
నాథునీ వద్దనదు నాట్యము,
నాథునీ కద్దనదు :
అరరే ! ఆడి పోతున్నాయి :

వాడి ముమ్మొన వాలు,
హుతభుక్,
అజకపాలం,
ఢక్కడుబుడక్
నాల్గు సేతుల నాడుతొతున్నాయి :
అశ్వరథ ! అశరథ !
పందెమూ వేసేది యెవరోయి ?
కుందనము గాసేది యెవరోయి ?
కారు నల్లని కాళరాత్రి.

౪

చంద్రమకుటము,
జటాజూటము,
సాంద్రనీలపు చదల పాపట
సురిగి పోతున్నాయి,
చక్కనీ మువ్వన్నె చర్మము
అక్కళించిన పొట్టపైని
అంటి యుండీ అంటకున్నాడోయి !
ఆకలా అని యనే డెవరు ?
సోకులా అని కనే డెవరు ?
కారు నల్లని కాళరాత్రి.

౫

మోకరింపులు గావు :
అది మరి
బూకరింపుల నిలువు గాదు :
ఆ కడకు బడు నొక్కయంజ
యీ కడకు బడు నొక్క యంజ
ఏకముగ జేయుచును
నడు మొక
రేఖగా దా వంచిగొంచు :
సందియంబే కెంచువా రెవరు ?
చిందు అని తోతెంచువా రెవరు ?
కారు నల్లని కాళరాత్రి.

నడక లంచను నడలు కరపగ
కన్నె పరతెంచేన్
రాజవీథిని
(...............). —కన్యక.

సెమ్మె గోరితివేని కన్నియ
నిమ్మ లేవ-పే
పొమ్మ (.........). —కన్యక.

---

౬

అహంకారము లేదు లోలో
మహార్ణటనము మొగము చాటదు,
మహాదేవా! యభయ మిడు మన
అభినయానకు హస్తమే లేదూ!
రభసమున దన ముందు వెనకల
ప్రభల గలిపించు:
ప్రభలలో ప్రభ నిలుప నెవరోయి?
ప్రభలలో ప్రభ గలుప నెవరోయి?
కారు నల్లని కాళరాత్రి.

బా ట సా రి

కూటి కోసం, కూలి కోసం
పట్టణంలో బ్రదుకుదామని
తల్లిమాటలు చెవిని పెట్టక
బయలుదేరిన బాటసారికి,
మూడు రోజులు ఒక్కతీరుగ
నడుస్తున్నా దిక్కు తెలియక
నడిసముద్రపు నావరీతిగ
సంచరిస్తూ, సంచలిస్తూ,
దిగులు పడుతూ, దీను డౌతూ
తిరుగు తుంటే—
చండ చండం, తీవ్ర తీవ్రం
జ్వరం కాస్తే,
భయం వేస్తే,
ప్రలాపిస్తే—
మబ్బు పట్టే, గాలి కొట్టే,
వాన వస్తే, వరద వస్తే,
చిమ్మచీకటి క్రమ్ముకొస్తే
దారి తప్పిన బాటసారికి
ఎంతకష్టం!

కళ్లు వాకిట నిలిపి చూచే
పల్లెటూళ్లో తల్లి ఏమని
పలవరిస్తోందో...?

చింత నిప్పుల లాగు కన్నుల
చెరిగి పోసే మంటలెత్తగ,
గుండు సూదులు గ్రుచ్చినట్లే
శిరో వేదన అతిశయించగ,
రాత్రి నల్లని రాతిపోలిక
గుండె మీదనె కూరుచుండగ,
తల్లి పిల్చే కల్ల దృశ్యం
కళ్లముందట గంతులేయగ,
చెవులు సోకని పిలుపు లేవో
తలచుకుంటూ, కలత కంటూ,
తల్లడిల్లే,
కెళ్లగిల్లే,
పల్లటిల్లే బాటసారికి
ఎంత కష్టం!

అతని బ్రదుకున కదే ఆఖరు—
గ్రుడ్డిచీకటి లోన గూబలు
ఘూకరించాయి;
వాన వెలిసే మబ్బులో ఒక
మెరుపు మెరిసింది;
వేగుజామును తెలియజేస్తూ
కోడి కూసింది;
విడిన మబ్బుల నడుమనుండీ
వేగుజుక్కా
వెక్కిరించింది.

## ముత్యాలసరం: ఒక కృషి

ఇంకా 1916-వ సంవత్సరపు ఉగాదిసంచికలో 'అప్పారాయస్మృతి' అని వ్రాస్తూ వా. రంగాచార్యులు గారట,

> అప్పరాయ కవీంద్ర చంద్రుం
> డవని విడినాడా ?
> కట్టా
> అవని విడినాడా ?

అని ఉపయోగించారు.

వీరరాఘవస్వామిగారి తోకముత్యాలసరాలలో కొన్ని పోకడలు తమాషాగా పడ్డవి.[8]

> కరువు రోజులలో
> ఆసలే కరువురోజులలో.

---

బాటసారి కళేబరముతో
శీత వాయువు ఆడుకుంటోంది.

పల్లెటూళ్లో తల్లి కేదో
పాడుకలలో పేగు కదిలింది.

8 **Serious poem** గా వ్రాసిన ఒక రచనలో పురిపండా అప్పలస్వామిగారు కొంత గమనార్హమైన లక్షణ్యం చూపించారు.

నేల దున్ని
మొక్క నాటీ
కంచె వేసీ
నీరు పోసీ
  తోట వేశాడు
  ఆతడు
  తోట పెంచాడు.

చివురు దొడిగీ
కొమ్మ లేసీ
ఆకు లేసీ
పొదలుగా ప్రాకినవి
  మింటికి
చెట్లుగా సాగినవి
  మొక్కలు.

చూచి మొక్కలు
ప్రక్క నిల్చొని
కనులలో ఆనంద మెంతో—
శిరము పంకించాడు
  ఆతడు.

ప్రక్క కొమ్మల నెదో ఘూకము
కీచుమంటూ వెక్కిరించింది
ఏమో రెక్కలార్చింది.
...  ...
తోటనిండా
పొదలనిండా
ప్రతీకొమ్మకి
రకరకాలా పూలు పూచాయి.
...  ...
పిల్లయేర్లూ కొండలూ
ఈ విశ్వ మంతా
విస్మయం చెందాయి
మేలూ మేలు మేలన్నాయి.

హిమకణమ్ముల జలకమాడీ
ఉషఃకాంతుల మేలమాడీ
నెచ్చెలులతో గాయకులతో
మహారాణులవలెనె మురిశాయి
  పూవులు
దేవకన్నెలవలెనె మెరిశాయి.

చూచి పూవులు

ఈసందర్భంలోనే కవికొండల వెంకటరావుగారి 'కూలియన్నలకుతుకము'ను కూడా పేర్కొనవచ్చును.

రెండుపాదాలనడుమ ఒక హ్రస్వపాదం ఉంచి దానిని పల్లవిగా చేసి కీర్తనమాదిరిగా బసవరాజు అప్పారావుగారూ, అతని అనుయాయి తురగా వెంకటరామయ్యగారూ వ్రాశారు.

అప్పారావుగారి గేయంలో కొంతభాగం:—

ఒంటిగా నుయ్యాల లూగితివా
నాముద్దుకృష్ణా
జంటగా నను బిల్వ దగదోయీ ?
కంటికంతా జలమయంబై
మింటిపరకును నేకరాశై
జంట దొరకని మహాప్రళయపు
టింటిలో వటపత్ర డోలిక
నొంటిగా...

ఇట్టిదే వెంకట పార్వతీశ్వరుల దుందుభిధ్వానము(పల్లవి : చాటవే—దుందుభి—చాటవే); దువ్వూరి రామిరెడ్డిగారి అభిసారిక. (మొదలు:

గాలి యడుగుల నెవరికోసరము
ఓ మోహశీలా
కదలివచ్చితి వీనిశీధమున.)

'ఆగంతుకి' 'జీవనద్వేషి' మున్నగునవి ఇటువంటి తెగకే సంబంధించినవి.

ముత్యాలసరం పాదాలనే రెండింటినీ, నాల్గింటినీ పల్లవి చేసిన గేయాలకు ఈదిగువ రెండూ క్రమంగా ఉదాహరణాలు.

---

ప్రక్క నిల్చొని
శిరము పంకించాడు
అతని
లేత పెదవుల
మెరుగు నవ్వులు
నాట్య మాడీ
పూల తోటకు
వెలుగు పెట్టాయి.

అతని వెనుక
గాలిలో నొక
వికటహాసం వెక్కిరించింది
ఏదో
వెక్కిరించింది.

మరుదినమ్మున ఎప్పటట్లే
వచ్చి చూచాడు
అతడు
తోటలోనికి వచ్చి చూచాడు.

పూవులన్నీ రాలిపోయి
రేకులన్నీ చిదికిపోయి
నేలలో పాదాలదగ్గర
ధూళిలో పొర్లాడుతున్నవి
గాలిదెబ్బకు తూలిపోతూ
ధూళిలో పొర్లాడు తున్నవి
జాలిగా పొర్లాడుతున్నవి.

## ముత్యాలసరం: ఒక కృషి

ఎందుకో పరుగెత్తుచుంటిని
ముందుగతి తోచనే తోచదు.
—ముందుగతి.

దున్నరా ఈ భరత భూమిని
తొలకరించిన పుణ్యభూమిని
కరువు లేని స్వర్గరాజ్యపు
దొరవు నీ వయ్యేదవురా
—దొరవు నీ వయ్యేదవురా.

కాని ముత్యాలసరం సమకూర్చే ఛందస్సంపత్తి ఇంతటితో ఆగలేదు. ఇప్పటి వరకూ 14 మాత్రల పాదాన్ని ప్రమాణంగా తీసుకుని చూశాము. కాని దీనిని 7 + 7 గా విరిచి ఇంకా చిన్నచిన్న ఛందస్సులు చెయ్యవచ్చును. అనగా అప్పుడు 7 మాత్రల పాదం ప్రమాణం అవుతుంది.

ఉదాహరణకు నా 'జయభేరి'[9] ఛందస్సు తీసుకుంటున్నాను.

నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను.

ఇది త్రిపాత్తు. 7 మాత్రల పాదాలు రెండున్నూ, ఒక దీర్ఘపాదం (దీనిలో 15 మాత్రలు గమనించాలి. ఆఖరి అధికమాత్రవల్ల ఒకవిధమైన పూర్తి సమకూడుతుంది). అనగా ఇది ముత్యాలసరంలో దాదాపు $\frac{4}{7}$ వ వంతు అన్నమాట.

ఇట్టిదే కాని కొంచెం భేదంకల

యముని మహిషపు లోహఘంటలు
మబ్బుచాటున
ఖణేల్మన్నాయి (అవతారం.)

అన్నదానిలో మొదటిపాదం దీర్ఘం (14 మాత్రలు) గాను, మిగిలినవి రెండూ హ్రస్వాలు గానూ ఉన్నవి. దీనినే రెండు పాదాలలోనూ నాలుగు పాదాలలోనూ వ్రాయవచ్చును.

యముని మహిషపు లోహఘంటలు
మబ్బుచాటున ఖణేల్మన్నాయి.

యముని మహిషపు
లోహఘంటలు
మబ్బుచాటున
ఖణేల్మన్నాయి.

'జయభేరి'లో ఒక పాదానికి 21 మాత్ర లున్నవి.

---

9 రచించిన తేదీ 2-6-1933.

చంద్రగాడ్పులు, వానమబ్బులు, మంచుసోనలు

అనగా 7 + 7 + 7, ఒకటిన్నర ముత్యాలసరం పాదం అన్నమాట. అభిరుచి తప్ప వీటిదైర్ఘ్యం నిర్ణయించే మరొక ప్రామాణ్యం లేదు. కాని వీటిని నిర్మించుకొనడములో ఆకృతినీ, నడకనూ, అవి పోషించే భావాన్నీ ఔచిత్యభంగానికి పాలుకాకుండా, పలుచగా పేలవంగా ఉండిపోకుండా చూచుకోవాలి.

3

ఛందస్సు గుర్రంవంటిది. గుర్రం ఎటు తీసుకుపోతే అటల్లా వెళ్లిపోయేవాడు అశ్వికుడు కానట్లే ఛందస్సు లాగుకుపోయినట్లు వ్రాసేవాడు సంవిధానజ్ఞుడు కాడు. మరి ఆ ఛందస్సును లొంగించుకొని దానిచేత చిత్రవిచిత్రరీతులలో కదం త్రొక్కించినవారినే ప్రశంసిస్తాము. ఆధునికకవుల ముత్యాలసరంరచనలగూర్చి ఇట్టి ప్రశంసకూ, సాహసమే అయినా దోష విచారణకూ ఈ భాగం ప్రత్యేకిస్తున్నాను.

ఆధునికాంధ్రకవిత్వానికి గురుపాదులు శ్రీ గురజాడ అప్పారావుగారని అందరి సమ్మతిమీదా తేలిన విషయం. ముత్యాలసరం వారి కానుక. తార్కికులూ, వైయాకరణులూ, కళ్లు మూసుకున్నవాళ్లూ, మడి కట్టుకున్నవాళ్లూ మొదలైన పరిమితక్షేత్ర సంచారులను ధిక్కరించి గురజాడ అప్పారావుగారు మొట్టమొదట నవ్యకవితను ఆంధ్ర దేశంలో ప్రవేశపెట్టారు. ఈ యాథార్థ్యాలన్నింటినీ ఒప్పుకొన్నపిమ్మట వారి ముత్యాల సరం ఛందస్సు అపరిపక్వమనీ వారి కవిత్వం అనగాధమనీ విధిలేక చెప్పవలసి వస్తుంది.

కన్యాశుల్కం వ్రాసిన గురజాడ అప్పారావుగారు మహాకవి కాడని ఎవ్వరూ అన లేరు. 'లవణరాజు కల'లో, 'కన్యక'లో, 'లంగరెత్తుము'లో కవిత్వ స్ఫులింగాలను మరిచిపోజాలము. కాని గురజాడ అప్పారావుగారు ముత్యాలసరాన్ని మెలకువతో నిర్వహించ లేదనే చెప్పాలి. ఈయనతర్వాతికవులలోనే వీరికంటె తీవ్రత, జాగరూకత కాన వస్తున్నవని ఒప్పుకోవాలి. అలక్ష్య ఫలితములూ, ప్రమాద పతితములూ అయిన అనేక వ్యాకరణదోషాలూ, (ఇవి కావు ప్రౌఢత్వద్యోతకం,) నిర్వహణవైవిధ్యం లేకపోవడమే కాక ఎటూ కానిచోట విరువబడి పాడయిన పాదాలూ (ఉదా. 'కాసులు') అప్పారావు గారి ఛందోవ్యవస్థకు బలహీనత ఆపాదిస్తున్నవి. హెచ్చైన అవలక్షణాలవల్ల లక్షణానికే విరూపత తటస్థిస్తుంది.

ఇంతకూ గనిలోనుండి మొట్టమొదట తీయబడిన లోహంవంటిది వీరి ముత్యాల సరం. వస్తువును మాత్రమే స్వీకరించి దానిని చుట్టుముట్టిన వ్యర్థసామగ్రిని త్యజించడం మంచిది.

## ముత్యాలసరం: ఒక కృషి

గురజాడ అప్పారావుగారు ఆంగ్లవాఙ్మయప్రభావం తెచ్చి ఏవిధంగా క్రొత్త కవిత్వానికి కాలువ నిర్మించారో అట్లే వంగసాహిత్యంనుండి మరొకపాయను మొదట రాయప్రోలు సుబ్బారావుగారూ, తరువాత అబ్బూరి రామకృష్ణరావుగారూ తీసికొనివచ్చి నవ్యకవిత్వాన్ని పరిపుష్టము కావించారు. వీరిలో రాయప్రోలు సుబ్బారావుగారు 'జడకుచ్చులు' అనే గీతసంపుటిలో మాత్రం ముత్యాలసరాలను ('తమ్ముడా', 'తిలకము' అనే వాటిని) ప్రకటించారు. సుబ్బారావుగారి దేశభక్తికి ఇవి కొంతవరకు ప్రాతినిధ్యం వహిస్తాయి. ఈ రెండు గేయాలలో హ్రస్వపాదాలు 12 మాత్రలు కలవి. వీరు యతిప్రాసలు సరిగా పాటిస్తారు.

శ్రీలు పొంగిన జీవగడ్డయి
పాలు గారిన భాగ్యసీమయి
వ్రాలినది యీ భరతదేశము
భక్తి పాడర తమ్ముడా

అన్న గీతంలో దీర్ఘపాదా లన్నింటికీ యతిప్రాసలు సరిగా పాటించబడ్డవి. సాధారణంగా ఈ కవి యతిప్రాసలను ధిక్కరించలేదు.

పిపిన బంధురవృక్షవాటిక
ఉపనిషన్మధు వొలికె నిచ్చట.

'తిలకము'లో ఉద్రేకము పౌరాణిక చారిత్రక వీరాంగనలను ఉదాత్తంగా భావించింది.

అబ్బూరి రామకృష్ణరావుగారి 'ఊహా గానము' లోనూ 'మల్లికాంబ' లోనూ ముత్యాలసరాలు లేవు. కాని చాలాకాలంక్రిందట 'కృష్ణాపత్రిక'లో వారి 'వర్షాగమము' అనే ముత్యాలసరాల ఖండకావ్యం పడ్డది. 'నదీసుందరి' అనే వారి నాటకంలో కొన్ని ముత్యాలసరా లున్నవి.

రామకృష్ణరావుగారు పదార్థ గౌరవానికీ సందర్భశుద్ధికీ పేరుపడ్డారు. చ్యుతసంస్కృతి దోషం వీరి రచనలలో ఎక్కడా నాకు కనపడలేదు. ముత్యాలసరం అన్నమాట ఏమిటి, ఏ ఛందమయినా వీరు చెప్పినట్లు వింటుంది.10

ఇటుపైనుండి వచ్చిన ముత్యాలసరాలను గుట్టవేస్తే ఒక పర్వత మవుతుంది. కవుల సంఖ్య కూడా అనల్పమే. అందరికవుల అన్నిముత్యాలసరాల పరీక్ష అనవసరము. కొందరి ముత్యాలసరాలు మాత్రమే చర్చిస్తాను.

---

10 రాయప్రోలు సుబ్బారావుగారికంటె వీరు better technician అని నా ఉద్దేశం. కవిత్వం మీద అభిప్రాయం చెప్పడానికి ఇది స్థలం కాదు.

స్వర్గీయ బసవరాజు అప్పారావుగారి గీతాలసంపుటిలో 'దగాయీాత,' 'వటపత్ర శాయి,' 'విహారము,' 'రామకథాసుధ' అనే ముత్యాలసరా లున్నవి. 'వటపత్రశాయి' లోని వ్యవస్థ ఇదివరకే చూశాము. 'దగాయీాత'లో గొప్ప ప్రత్యేకత యేదీ లేదు. 'విహారము'లో నాల్గు ముత్యాలసరాలు. వీటి దీర్ఘపాదాలు పంౘ్రెండింటికీ ఒకే ప్రాస. 2, 3, గీతాల హ్రస్వపాదాలకు కూడా ఈ ప్రాసమే ఉన్నది. 1, 4, గీతాల హ్రస్వపాదాలు వాటి మూడవపాదంతో యతి పాటించినవి. 'రామకథాసుధ' శంకరుని రామకర్ణామృతము నుండి తెనిగించబడి సమానపాదాలతో శ్రావ్యంగా నడుస్తుంది. దీని మొదటి నాలుగు పాదాలు ఉదాహరిస్తున్నాను.

మార్గమందున మార్గమందున
వృక్షశాఖల రత్న వేదులు
వేదులందున వేదులందున
కిన్నరీబృందముల గీతము...

గాయకుడైన బసవరాజు అప్పారావుగారు తన గేయాలను హాయిగా నడిపించడంలో వింత లేదు.

మాత్రాచ్ఛందస్సు లనేకం ఉపయోగించబడిన 'యెంకి పాటల'లో ఒక్క ముత్యాల సరం గేయమూ లేదు; కాని నండూరి సుబ్బారావుగారి క్రొత్తరచనగా 'వైతాళికుల'లో ఒక ఖండకావ్యం ప్రకటితమైనది. దాని మొదలు

అవు నడిగీ
అడది నడగీ
.........
తూరిచితిరా
గుమ్మపాలు
కమ్మ తేనె.

కర్షకకవి దువ్వూరి రామిరెడ్డిగారూ, కార్మికకవి కవికొండల వెంకటరావుగారూ చక్కని ముత్యాలసరాలు వ్రాశారు. వెంకటరావుగారు 'శివరాత్రిప్రభ'లో భావన లోనూ, గమనంలోనూ ఆవరించిన వైశాల్యం ఇంతట్లో మరెవ్వరూ అందుకోలేరు. కాని క్వచిత్తుగా అందులో వారు అనుప్రాసంకొరకు అర్థం సరిచూచుకోలేదు.

'కోకిలమ్మపెళ్లి' వ్రాసి విశ్వనాథ సత్యనారాయణగారు కథనకవిత్వంలో క్రొత్త లోతు చూపించారు. 'కోకిలమ్మపెళ్లి'లో

అడవిలోనూ కడలిలోనూ
అర్ధరాత్రివేళ అప్పుడు
తొగరు కన్నుల చుక్కకన్నెలు
తొంగి చూస్తారోయ్

## ముత్యాలసరం: ఒక కృషి

నుర్గుతిరిగే కడలినడుమా
చూపు కందీ అందకుండా
తెప్ప వేసుకు పాముపడుచులు
తేలిపోతా రోయ్

అన్నవి కవిత్వవంతములైన వర్ణనలు.

మోదుగులు పూశాయి పెదవులు

అనడం ఒక్క పాదంలోనే చెప్పవలసిన దెంతో చెప్పివేయడం.

చివురులూ కొమ్మలా చివరా
గుబురులూ గుబురులా చివరా
పూవులూ నాలుగూ వైపుల
బుగులుకొన్నాయీ.

వీటిలో లగప్రయోగంవల్ల ప్రౌఢగమనం సిద్ధిస్తున్నది. ఇది దీని తర్వాత చెప్పబడిన

చివురులో యీ నెల్లె పసిరిక
పూవులో, తేనెల్లె పలపల
చిలకతల్లికి కోకిలమ్మకు
వయసు వచ్చిందీ

అనే సుందరమైన భావానికి వాతావరణం కల్పిస్తున్నది.

లగప్రయోగాలు కోకిలమ్మ పెళ్లిలో ఇంకా ఉన్నవి. వీటిలో బాగున్నది:

చిలకతల్లీ సొగసువాకలు
చిలపలై పలపలై యందపు
మొలకలై తేనెలా చినుకులు
గలపరించాయీ

అన్నది.

బాగులేనివి:

తల్లికీ చిలకతల్లంటే
...   ...
గోదుమావన్నెత్రాచల్లే.

లయ తప్పి, నడవని కొన్నిపాదాలు ఇదివరకు చూపించాను. అట్టివే.

పోకిళ్ల మారైంది తల్లికి
...   ...
ఆపాట వింటూనె అడివీ
...   ...
సన్నాయి పాడింది తెల్లని—

ఒకమాత్ర ఎక్కువై నడవను ఈక్రింది పాదం:

గా లి పి ల్ల లు వె దు ళ్ల లో రా
2 1 2 1 1 1 2 1 2 2 = 15

పూల సోనలు కురిసినై, తే
నేల పాటలు విరిసినై, అం
దాల త్రోవలు వెలిసినై, రాజ
నాలు పండినవి

అన్నచోట 'రజనాలు' అని ఉచ్చరిస్తేనే కాని నడక కుదరదు.

ఉద్రేకం సూచిస్తూ ఛందోగమనం మార్చడం.

కోకిలమ్మా అదుగో మళ్లీ
కూసె నంటే కూసెనానీ
వచ్చె నంటే వచ్చెనానీ
బ్రతికె నంటే బ్రతికెనానీ
ఒళ్లు తెలియక అడవిపూటా
పొర్లి పోయిందీ
చెన్ను తరుగని మావిమోకా
చివురు తొడిగిందీ
అంతలోపల నడవి కందం
అతిశయించిందీ

అన్నదానిలో వరుసని ఐదు దీర్ఘపాదాలు వాడడమందూ దగ్గరదగ్గరగా హ్రస్వపాదాలు కూర్చడమందూ కనిపిస్తుంది.

కథనకవితలో 'గీతానందు'ని 'కాపు పెళ్లి' కూడా పేర్కొన దగ్గది.

సంఖ్యలో అనేకములైన ముత్యాలసరాలు వ్రాసినవారు శివశంకరశాస్త్రిగారు. వీరికి సంస్కృత పక్షపాతం మెండు. అందువల్ల చూస్తూ నియమాలు ఎగరకొట్టలేరు. కావున వీరి ముత్యాలసరాలు ఒకే నడక ప్రదర్శిస్తవి. కాని సంస్కృతప్రోద్బలంవల్లనే గంభీరంగా నడుస్తవి. శాస్త్రిగారి ముత్యాలసరాలు నడకనుబట్టి ఏ శిఖరిణీ మాలినీ వృత్తాలో అనుకోవాలి.

వీరి 'దేవాలయము' అన్న ముత్యాలసరాలలో వ్రాయబడిన ఖండకావ్యం నాయకునికీ ఆప్తునికీ సంభాషణ. 'సందేశం' అనే ఖండకావ్యంలో సందేశభాగం ముత్యాలసరంలో ఉన్నది. వీరి పద్యనాటికలలో పాత్రల వేర్వేరు భాషణలుగా వేరువేరు ఛందస్సులు ఉప

యోగించారు. వాటిలో ముత్యాలసరాలు కూడా ఉన్నవి. 'హృదయేశ్వరి'లో కొంత భాగం ముత్యాలసరాలు.

శివశంకరశాస్త్రిగారి ముత్యాలసరంలో సాధారణంగా

a　వివిధ సారస్వత నదీనద
a　విమల జలముల నోలలాడుచు
b　అనిశ మానందాధిగమమున
b　నలరుదము లక్ష్మీ !

అన్నదానిలో వలె ప్రాసకు బదులు రెండేసి రెండేసి పాదాలకు (a, a, b, b గా) యతి వాడ బడి ఉంటుంది. ప్రాసలు కూడా వాడలేదని కాదు. తరుచుగా వాడినది పై పద్ధతిని.

తక్కువ ముత్యాలసరాలు వ్రాసినది కొడవటిగంటి వెంకటసుబ్బయ్యగారు. అనగా ఒక్కటే వ్రాశారు. కాని దాని నిక్కడ స్మరించక తీరదు. అది 'సంధ్యారాగము' అనే వారి గీతాలసంపుటిలో మొదటి ఖండకావ్యం 'ఆతిథ్య' మన్నది.

ఆగు మాగుము తెరువరీ ఆ
యాసఖేదం బపనయింపుము
మా గృహాంగణ కుసుమసముదయ
మధువు లియ్యవిగో

అని అది ప్రారంభ మవుతుంది.

'సఖి'లో చింతా దీక్షితులుగారు 'కవి–కన్యక' అని ముత్యాలసరాలు వ్రాశారు. దానివల్ల ఆవిష్టులై ముద్దుకృష్ణ, కృష్ణశాస్త్రిగార్లు 'దీక్షితు లన్నగారు' అని వ్రాశారు.

కృష్ణశాస్త్రిగారు కొలదిపాటి ముత్యాలసరాలు వ్రాశారు. అవైనా 'కృష్ణపక్షము' లోనే ఉన్నవి. అవి 'వెర్రిపాట,' 'మహాకవి గురజాడ అప్పారావు,' 'చిన్నిపూవే వాడెనా,' 'చుక్కలు' అన్నవి. అప్పటి కింకా పదశిల్పం వారిలో పరువము కాలేదు. 'కృష్ణపక్షం'లో చాలా గీతాలు కృష్ణశాస్త్రిగారి బాల్యక్రీడలు. ముఖ్యంగా ముత్యాలసరాలు.

వీరి ముత్యాలసరంలో గురజాడ అప్పారావుగారి ఒరవడి స్పష్టం. 'చుక్కలు' అప్పారావుగారి 'లంగ రెత్తుము' ను ప్రతిధ్వనిస్తుంది.[11] ఉగాది సంచికలోని (వా. రంగా

---

11　చేతి కందెడు పూలకొరకై
చేయి చాపక చేరి కోరక
దూరముగ లేవంచు వానిని
దూరి వదలితిని.
—చుక్కలు.

అందజాలని పళ్ల కోసము
అ్రరు జాపితి; నేల పాకిన
చెట్లపళ్లను విలవ లెరుగక
పాదరత్నుల మట్టితిక్.
—లంగ రెత్తుము.

చార్యులుగారి) 'అప్పారాయ స్మృతి'ని చూచిన పిమ్మటనే కృష్ణశాస్త్రిగారు 'మహాకవి గురజాడ అప్పారావు' వ్రాశారా అనిపించుతుంది. 'వైరిపాట' అన్వర్థనామధేయంగా ఉన్నది. 'చిన్నిపూవే వాడెనా' అన్నది శకలప్రాయము. ఇవి కాక 'అన్వేషణము'లో ఒక ముత్యాలసరం ఉన్నదంటే ఉన్నది. ఏమయినా కృష్ణశాస్త్రిగారి శక్తిని ముత్యాల సరాలలో కాదు చూడవలసింది.

'మునిమాపు'లో 'వలపు' అనే శీర్షికగల ముత్యాలసరాలు చక్కగా సలక్షణంగా ఉన్నవి.

వేదుల సత్యనారాయణశాస్త్రిగారి 'రాణా ప్రతాపసింహ' నాటకంలో 'జయము భారత భాగ్యలక్ష్మీ' అనే గేయం ఉన్నది. నాకు తెలిసినంతవరకు వీరి ముత్యాలసరం రచన ఇంతే.[12]

'వెన్నెల' అనే పెద్దకావ్యంలో పూడిపెద్ది వెంకటరమణయ్యగారు మన పూర్వ ప్రబంధాలలో ఆశ్వాసాంత పద్యాలవలె ఘట్టము ముగిసినచోట్లన్నింటిలో ముత్యాల సరాలు వేశారు. వాటిలో 'వల్లీవల్లవి' భారతిలో ప్రకటితమైనది.

స్వర్గీయ పెనుమర్తి వెంకటరత్నముగారు కొన్ని ముత్యాలసరాలు వ్రాశారు. వారిలో వికసనోన్ముఖమైన ఒక శక్తి అకాలమున నష్టమైపోయింది.

౪

శాస్త్రదృష్టిని చేయబడిన ఈ ఛందశ్చర్చలో ఒక్కవిషయము మాత్రం ఏమర కూడదు. కావ్యం చిరస్థాయి కావడానికి అందలి రసాధిక్యం కారణ మవుతుంది కాని దాని నిర్మాణసౌష్ఠవం కాదు. అయినా ఆకృతివివక్ష చెయ్యడం వ్యర్థకృత్యము కాదు. కళాశీలి ఛందోరహస్యవేత్త కూడను. సుందరభావమైనా పాడుగా చెప్పబడినయెడల రసభంగము కలిగిన దన్నమాటే. సంవిధానము (technique) వ్యాకరణ చ్ఛందస్సులే కాక తదతీత

---

12 కాదు. ఒకమారు శాస్త్రిగారిని 'ముత్యాలసరా లేవైనా వ్రాశారా? నా వ్యాసంలో ఉదాహరిస్తా'నని అడిగాను. సముద్రపు టొడ్డున నడుస్తున్నాము. శాస్త్రిగారు తాము వ్రాసిన దేవీ లేవు గాని ఇప్పు డొకటి వ్రాస్తానని,

'ఒక్కడైనను మాటలాడడు
ఒక్కడైనను తేరి చూడడు
ప్రక్కనడకల ఎండ్రకీతలె
దిక్కు మన కింకన్'

అన్నారు. శాస్త్రిగారు వ్రాసిన, నాకు తెలిసిన ముత్యాలసరం ఇదొకటి !

మయిన ఒక విపులవ్యవస్థ. కవి తనలో అంతర్గతమైన రసాన్ని పాఠకునిలో బహిర్గతము చేయగలుగుతున్న కార్యమే సంవిధానము. దీనికి ఆఘాతం తగిలితే రసానికే విప్రతిపత్తి సంఘటిల్లినట్లు. కావున తుట్టతుదకు రీతిసదాలు రససముద్రంలోనికే చేరుకుంటాయి.

కవిత్వాన్నీ సంవిధానాన్నీ తీసుకుని కూర్పులు చేస్తే నాలుగు విధములైన జంటలు ఏర్పడుతవి. వీటిలో నాలుగో విధమే సర్వోత్కృష్ట మైనది.

1. —కవిత్వము, —సంవిధానము: అభావ కవిత్వమే కాక అనేక దోష భూయిష్ఠమైన రచన.

2. —కవిత్వము, + సంవిధానము: సలక్షణమైన కవ్యక. కాని నిర్జీవ.

3. + కవిత్వము, —సంవిధానము: ఉదా:

> ప్రీతి పాత్రమైన పెండ్లాము సచ్చిన
> యింటిపాడు నూది యేడ్వలేక
> ఎనడు పొలము విడిచి పని లేక యున్నను
> పామరుండు కాపువాడు కంటె.
>
> —'గాథా సప్తశతి', రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ గారి అనువాదము.

4. + కవిత్వము, + సంవిధానము: ఉదా:

> Between the green bud and the red
> Youth sat and sang by Time and shed
> From eyes and tresses flowers and tears,
> From heart and spirit hopes and fears.
>
> —A. C. Swinburne's *Songs before Sunrise*

ఇందలి మూడో విధాన్ని తీసుకుని కొందరు రసవాదులు 'భావ ముంటే చాలును, ఎట్లు చెప్పినా సరే' అనవచ్చును కాని వారు సర్వసమగ్రత కోరలేదని చెప్పాలి. ఏవిషయంలో కొరవడినా కవిత్వము ఉత్కృష్టము కానేరదు. కావున మహత్తరభావాలను మహత్తర విధంగా ప్రతిపాదించినదే ఉత్కృష్టకవిత్వం.

# వాఙ్మయ వీథి

**అనార్కలీ. కవి: శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, బందరు. రసతరంగిణీ గ్రంథమాల. వెల రూ ౧.**

విశ్వనాథ సత్యనారాయణగారు మహాపండితులు, ఉభయభాషా ప్రవీణులు. నేను పండితుణ్ణి గాను, భాషాప్రావీణ్యమూ లేదు. అయినప్పటికీ వారి నాటకాన్ని విమర్శించడానికి ఎందుకు పూనుకొన్నా నంటే, నాకు నాటకా లంటే సరదా—చదవడానికి, చూడడానికి, చర్చించడానికి. అందులో "నూత్నమార్గవిరచిత దృశ్యకావ్యం" కూడా నని వినడంచేత ఉత్సాహం హెచ్చింది.

అనార్కలీ కథావస్తువు ప్రఖ్యాతమైనది. అనేక భాషల్లో అనేక కృతులకు ఆధారమైనది. కనుక అల్లికలో నూత్నములైన అంశాలు నిరీక్షించలేదు. కాని మార్గంలో మాత్రం నవీనత ఉంటుందని నిశ్చయించాను. అలాగే అయింది.

ఈ అనార్కలీ ఇంగ్లీషు భాషలో వ్రాసివుంటే దీన్ని మంచి 'లిరికల్ డ్రామా' (lyrical drama) అనేవారు పాశ్చాత్య విమర్శకులు. షెల్లీమహాకవి వ్రాసిన 'ప్రామితియస్', 'హెల్లాస్', ఈట్సు కవిసార్వభౌముని నాటకా లనేకములు ఈ తరగతికి చెందినవి. అయితే ఈపేరు పూర్వాంకానికే ఎక్కువగా చెల్లుతుంది. కవిగారు ప్రస్తావనలో పూర్వాంకమునందలి రచనా పద్ధతి గురించి సూత్రధారునిచేత రెండుమాటలు చెప్పించారు. పూర్వాంకంలో నాయికా నాయకులూ, అజీజ్, రనీ వంటి పాత్రలే గాక, పుష్పకన్యకలు, వసంతుడు, మన్మథుడు, కోకిల మొదలైన పాత్రలు వత్తురు. కాని యథార్థముగ వారు ప్రత్యేకపాత్రలు గారు. "చిలుక, కోకిల మొదలైనవి పలికిన పలుకులు, వానియందున్న యర్థమును నాయికా నాయకులు సంకల్పించుకొనిరి. ఆ భావములే చిలుకలు కోకిలలు పుష్పకన్యకలు చెప్పిన ట్లిందు వ్రాయబడినది."

ఈ పద్ధతి నాకు తెలిసినవరకు మననాటకములలో నూత్నమైనదే. కొంతకు కొంత దీనికి సామ్యము పురాతన గ్రీకు నాటకాల్లో చూడవచ్చును. కోరస్సు, సెమికోరస్సు ఈవిధంగానే నాయికా నాయకుల మానసికస్థితిని వర్ణిస్తారు.

"విభావానుభావ వ్యభిచారిభావ సంయోగాత్ రసనిష్పత్తిః" అని భరతసూత్రం. దానికి నిదర్శనపూర్వకమైన వ్యాఖ్యానంగా ఉంటుంది ఈ పూర్వాంకమంతా. శృంగారరసప్రకరణంలో పేర్కొనబడే వివిధావస్థలకీ ఉదాహరణాలు ఇవ్వగలం ఈ అంకంలోని రంగాలనుంచి. సూక్ష్మంగా సూచిస్తున్నాను. రెంటో రంగంలో చక్షుఃప్రీతి, మూడోరంగంలో అరతి, ఆరోరంగంలో తాపం, ఏడోరంగంలో ప్రలాపం, ఎనిదోరంగంలో మూర్ఛ, పదోరంగంలో ధన్యత. ఇవి గాక నిర్వేద, శ్రమ, దైన్య, జాడ్య, గ్లాని, త్రాస, శంకాది సంచారి భావములకును గలవు ఉదాహరణాలు.

ఈ విధంగా కావ్యం రసవంతంగా ఉంది. కాని దృశ్యకావ్యంగా ఈ పూర్వాంకాన్ని ఎట్లు గ్రహించవలెనో నేను ఊహింపలేకున్నాను. 'ప్రబోధచంద్రోదయం', 'సంకల్ప సూర్యోదయం', ఇంగ్లీషు భాషలో 'ఎవ్విరిమాన్' (Everyman) వంటి నాటకాల్లో కామ క్రోధ మద మాత్సర్యాదులే మూర్తీభవించి పాత్రలుగా వచ్చుట ఎరుగుదును. మెటర్లింకు నాటకాల్లో మృగాదులు పాత్రలుగా వచ్చుటయు నెరుగుదును. అయితే వాటిలోని అట్టి పాత్రలకు సంపూర్ణంగా పాత్రత్వం ఆరోపింపబడి ఉంటుంది. అందుచేత నాటకశక్తికి వ్యతిరేకంగా ఉండదు. ఈ పూర్వాంకంలో నంటారా, అలా కాదు. చిలుకలు, పుష్పకన్యకలు,

ఇత్యాదులు నాయికానాయకులకన్న భిన్నమైన పాత్రలు గావు. వ్యక్తములై వాగ్రూపము దాల్చిన నాయికా నాయకుల మానసిక స్థితులు. రంగస్థలంపైన ఈ స్థితులను ప్రత్యేకంగా దర్శించి అన్వయించుకోవడం కంటే చదివి అన్వయించుకొని రసాస్వాదనం చెయ్యడమే సులభమేమో అని నా సందేహము.

ఉత్తరాంకంలో నాకు ముఖ్యంగా నచ్చినవి రెండువిషయాలు. ఒకటి, నాటకంలో అగ్బరు పాత్రగా రాకపోవడం; రెండు, సంభాషణ క్లుప్తంగా ఉంది. కార్యవేగానికి భంగం కల్పించకపోవడం. ఈ గొప్ప అంశం మన ఇతరనాటకకర్తలు సహితం అప్పుడప్పుడు గమనిస్తే బాగుంటుందేమో?

ఇటువంటి ఉత్తమ కృతులు ఆంధ్రవాఙ్మయగౌరవాన్ని పెంపుచేస్తవి.

పా. వే. రాజమన్నారు

## కిన్నెరసాని పాటలు; కోకిలమ్మ పెళ్లి. కవి: విశ్వనాథ సత్యనారాయణగారు, ఎమ్. ఏ., బందరు. రసతరంగిణీ గ్రంథమాల. వెల రు ౧.

ఆదొరకి కూతుళ్ళు ఇద్దరు, చిలకతల్లీ కోకిలమ్మానూ. చిన్ననాడే పలుక మొదలెట్టి తండ్రికి మేను పులకరింపించిన చిలకతల్లి వేదపనసలు చెప్పుకొనే బ్రాహ్మణుణ్ణి తనలో నిలిపివేసింది. ఇంట్లో నిరాదరము పాలయి, చెప్పుకొనేటందుకు నోరయినా లేక ప్రకృతిఅంతటా స్నేహంకోసమై తిరిగే కోకిలమ్మను పూలరేడే వలచాడు. ప్రకృతితల్లితోపాటు తల్లీ వెదకుకుంటూ వచ్చి కాగిలించింది; దీవించి పెళ్ళిచేసింది.

'చిలకతల్లి మహాన్వయంబున
నిలిచినవి సాంస్కృతికవాక్కులు
కోకిలమ్మ తెనుగుపలుకూ
కూడ బెట్టిందీ.'

కావ్యమంతా చెక్కినధ్వని ఇక్కడ కోకిలమ్మ తెనుగుపలుకులో ముడిపడి కావ్యం ముగిసింది. ఈకథ [పొట్టిది] జరిగేటప్పటికి ఈ తెలుగులంతా గొప్ప యెకిమీళ్ళు.

'దొంగనాగరకతలో దేశం
తూలిపో లేదోయ్.'

అందుకే యిద్దరు కూతుళ్లే అయినారు తెలుగురాజుకి. ఇద్దరమ్మలనూ పలపించగల యీకవివాక్కు కోకిలమ్మపెళ్ళికి తెలుగుతీపులు పట్టి అడివినీ, సెలయేరునూ, ఆలాటి సామగ్రిని తలపించే ప్రాకృతగతులతో ఛందస్సును గుంజుతూ నడిచింది. గురజాడ అప్పారావుగారి తీయని లేతనడకలు దాటి వీరి ముత్యాలసరం, కవితా సంపన్నమయిన్ని, పాకరహితమైన విరగబాటు చేపట్టింది, వస్తువు తలచి. అసలు సత్యనారాయణగారి కవిత జాగ్రత్తతోడి దిద్దుబాటుకంటె ఉద్రేకముతోడి విరగబాటే యెక్కువ విందుపెటుతుంది. మరికొన్ని మెలకువలు ఈపాంగులలో అందాలు తెరుస్తవి.

'కోకిలమ్మపెళ్ళి' కంటె పిరివితయిన 'కిన్నెరసానిపాటలు' వీరి కవితాసంపదను మిక్కిలిగా ప్రవహింపించినవి. అసలు కథాకల్పనమే హృద్యమైనది. అత్తగారి ఆసరిందకు అనిష్టమై అడవుల పరుగులువారి, ప్రేమకల మగని అనునయపు కౌగిలిలో కరగి నీరై పారెన భార్య కిన్నెరసానికై అతడు శిలఅయిన క్రమము వాచా కవి చెప్పక, అతనినోటనే,

'ఈ యేడుపు రొదలోపల
నా యెడలే నే నెరుగను
నా యీ దేహమదేమో
రాయివోలె నగుచున్నది'

అనిపించి చూపిన సొగసు వీరి విలక్షణమైన కళావిహారచాతుర్యమును చూపుతుంది. ఈకావ్యములో ఈ దీనకథలో కొన్నిఘట్టాలు కంట నీరు పెట్టకుండా చదవడం కష్టం; రసస్ఫూర్తినిగూర్చి మాటాడగల సహృదయానుభవమంతా ఇందలి కళాజ్యోతికి తృప్తిపడితీరుతుంది. కిన్నెరసానిని ఒక వీరవనితగా, తెలుగుజాతి మనస్సులో ప్రవహించగల నాయికగా సృష్టిచేసి నిజమైన కావ్యసంపత్తి నిర్వహించినాడు కవి. నవ్యకవితలో మొదటిపంక్తిని నిలువగల కొలది కావ్యాలలో 'కిన్నెరసాని పాటలు' ఒకటి. ఇందు ప్రకృతి ఎంతో విస్తృతముగా జీవము పట్టి అనుభవానికి రసశుద్ధి తేగలుగుతున్నది.

'తలిరాకువంటి మె
త్తని యెఱ్ఱ పెదవితో
తార్చి నామోము నద్దగ రావు కాబోలు
నాయెడల్ మిగుల నందపుకుప్ప యని చెప్పి
ఎల్లతావులను ముద్దిడ రావు కాబోలు'

'అని సన్నగొంతుతో' పతికై వనరిన కిన్నెరసాని యేడ్పుతో ఎంతో సన్నిహితమై గాఢమైన అనుభవము సాధరణీకృతికి రావడమే కాక, రచనయున్నూ ఆస్వాద్యముగా నడిచింది. ఈపాకములు కిన్నెరసానిలో తరుచుగా పూచినవి. 'కోకిలమ్మపెళ్ళి'లో అడవీ, అక్కడ తిరిగే కోకిలా కనిపిస్తే ఇక్కడ కోకిలమ్మ పాటలు పుష్పించి ప్రకృతి అంతటా ప్రమోగించింది. 'కిన్నెరనడకలు' రసమయమై, 'గోదావరీ సంగమము' శిల్పవిలసితమై మరీ హృద్యములైన ఘట్టాలు. అసలు గోదావరిలో కలిసిపోయిన కిన్నెరప్రసంగములో సముద్రునిపాత్రము కల్పించడం కవినాటకీయప్రతిభ చాటుతుంది. తనగొంతుతో కవి తాను పాడిన ఒక పాట కాక, ఎన్నోపాటలు రూపాలుకట్టి వచ్చి దీనికి మహాకావ్యత్వము సంపాదిస్తున్నవి.

కొన్ని అతిధోరణులు (వీరు ముక్తసరుగా పాడరు,) వచ్చిగా ఎండుగా పడితే, అవీ వీరి ఉద్రేకము తాలూకు విశిష్టతను తెలుపుతవి: అట్టివికూడా కావ్యగతిలో విడిచిన విచ్చలవిడితనమే కొన్ని ఉన్మత్తములైన సౌందర్య విభ్రమాలను పూచీ వహిస్తుందని స్మరిస్తే అది కవిని అంతటా సమర్థించడం కాదు, గమనించడం.

ఛందోగతుల అందాలు కలుపుకోడంలో స్వరకలితమైన సంగీతాభిజ్ఞత అవసరమని చెప్పేవాదమును కవులు ఒప్పుకోనక్కరలేదు, చరిత్ర ఒప్పుకోదు—కాని, కొందరిపట్ల అజ్ఞానము అందుకు తోడ్పడ్డదవుతుందంటే ప్రతిఘటించ నక్కరలేదు. కవితయందు ఏర్పడేసంగీతమే గమనించినా, సత్యనారాయణగారు పెక్కుపోకడలుగా ఛందోగతులు నడిపించి అందాలు కురిపించినారు.

ఈకవి తనప్రతిభ నాటకయోగ్యమని హక్కు ప్రకటిస్తాడు. అది సర్వశః కావ్యయోగ్యమున్నూ.

ఈసంపుటము ముద్దులు మూటగట్టుతున్నది. సృష్టిపరములైన అడివి బాపిరాజుగారి బొమ్మలు పాటలకు తగిన వింతలైన భావుకసౌందర్యాలు వెల్లడిస్తున్నవి. కిన్నెరసానిబొమ్మ కవితామయమై, ప్రకృతిలో చూడగలమూర్తి యేదిన్ని కాక సూక్ష్మభావాల సమ్మేళనము కట్టిఉన్నది. కిన్నెరకై ఉబికి చూచే సముద్రునిబొమ్మ కన్నులలో, ముద్రలో, భావము కుంభించి గంభీరముగా ఉన్నది.

కొంపెల్ల జనార్దనరావు

# శృంగాటకం

'కళానిధి'1 కథలే ప్రధానంగా ప్రకటించే కొత్త పత్రిక. దీని విశిష్టత, వ్యాసకర్తలకు విరివిగా బహూకృతి యిచ్చే కంకణధారణం; ఇది సాహసికమై మిక్కిలి ప్రశంసార్హముగా ఉన్నది. మొదటి సంచిక నింపిన మూడు కథలూ సాంఘికవైఖరి సంతరించుకొని ఆస్వాద్యముగా ఉన్నవి. సంపాదకులు యౌవన యుక్తముగా తమ ఆశయాలను తెలిపిరి. తక్కిన కళలయందువలె సారస్వతరచనయందూ లక్ష్మీప్రసన్నత అవతరింపించే దీక్షలో సంపాదకులు పాత్రశుద్ధి నేమరకుండవలెనని దేశ మపేక్షిస్తుంది.

* * *

తెలుగుదేశములో పత్రికల సంఖ్య మరీ పెరిగిపోతున్నదని ఫిర్యాదు. ఇతరదేశాలలోనే కాదు, ఇతర ప్రాంతాలలో సహా చక్కగా పోషణ కాంచుతున్న పత్రికలసందడి గమనిస్తే ఆశ్చర్యము కలుగుతుంది. కాని యీ ఫిర్యాదులో అర్థము లేదని రుజువుచెయ్యవలెనంటే, పత్రికలు ఒకేరకముగా, ప్రతిబింబాలుగా, నడవక, వేర్వేరు పాలాలు పట్టడం ఉచితం. అప్పుడీ ఫిర్యాదే రాదు! కాని అప్పుడవి చక్కగా నిర్వహించడానికి తగ్గ ఆదరణ ప్రజలవల్ల చేపడాలి.

* * *

ప్రబుద్ధాంధ్ర, తత్సంపాదకులు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, లేవదీసిన హిందీ—తెలుగుల అధికార సంఘర్షణం భాష పొలిమేరలు దాటి 'హిమాలయోత్తుంగ శృంగం' ముట్టింది: మహాత్ముడు కూడా ప్రసంగించి తీరినట్టు తెలుస్తుంగి. సామాన్యభాష దేశానికి కావలసిన సమయము వచ్చినప్పుడు హిందీకే హక్కున్నది కాని, ఆ అవసర మిప్పుడు కాదు అని చెప్పబోతే, ఇది సమయమే అని చెప్పడానికి పదిహేను సంవత్సరాలూ, కొన్ని లక్షల బుద్ధులూ ఎదురొడ్డగలవు. దక్షిణ భారతములో హిందీ ప్రచారము జరపడంలో భాషలమీద దొంగదాడికూడా నిర్వాహకుల సంకల్పమే అని చెప్పవస్తే అది రుజువుచెయ్యడానికే ఆస్కారము చాలదు. దానంత అది మనభాషకు అదుపు వచ్చిందని చెపితే ఒప్పుకో వచ్చు, మానవచ్చు; కాని, విమర్శభాగ మెటువున్నా, మన ప్రాంతము కట్టుకోవలసిన జాత్యభిమానముకై, భాషాభిమానముకై యీ పత్రిక మ్రోసిన పిలుపు చాలా ప్రముఖమైనది. హిందీ పత్రికలకూ, మనప్రాంతాన గల ముఖ్యమైన పత్రికలకూ ఇక్కడ చేకూరిన ఆదరము విషయమై శ్రీ శాస్త్రిగారు చూపిన తారతమ్యము మొదలైనవి రిక్త సంరంభముగా త్రోసిపుచ్చడం ప్రజలకు సాధ్యంకాదు. ఇట ఆలోచన హిందీమీద కాదు, తెలుగుమీద నిలుపుకోవలసి ఉంటుంది. వంగదేశములో మాతృభాష చైతన్యము రేగి బలిసిన యిప్పుడు ఆంగ్లమువల్ల ఒత్తిడీ లేదు, ఆంగ్లమునెడల వైరుధ్యమూ లేదు.

* * *

మొన్నటి నాటక పరిషత్సభలలో, మద్రాసులో, సత్యనారాయణగారి 'వేనరాజు' నాటకప్రదర్శనము సాంతముగా జరగనీయనే లేదు సామాజికులు. అనేక—రకాలుగా రేగిన ఆ అలజడిని అనేక కారణాలకు కట్టినారు. నేటిసంఘపు ఆచారాభిరుచుల కెదురీత; నదరైన కదలిక యీయని దీర్ఘవాదములు;

---

1 మాస పత్రిక. సంవత్సరం చందా రూ 3. సంపాదకులు, ప్రకాశకులు : కె. కృష్ణమూర్తిగారు, తెనాలి.

రంగాల యేర్పాటులో వైవిధ్యము లేక పోవడం; వాదాలలో సహజ పరిణామము కానరామి; స్థానంవారు హార్మోనియముకు పనిచెప్పకుండా, సామాజికుల చెవులకూ కొంచెము పనే చెప్పడం; కొందరి ఆహార్యములో లోపము; చివరకు కవియందు కిట్టని కొందరి గూడుపుఠాణీ. నటులు విధేయతతో కవివల్ల అభ్యసించిన క్రొత్త నాటకము; అడివిబాపిరాజుగారి కళాదృష్టిని సలహాగా వినియుక్తము చేసుకొన్న ఉత్కృష్టమైన ఆహార్యాదికము; కవి ప్రఖ్యాతి—ఉన్న లోపాలు సామాన్యులకు ఓరిమి చెరిచిన సందర్భాలు నాటకము సాంతము కాకుండా నిలుపు చేయించిన సంఘటనం, అదీ యిట్టి ప్రశస్తమైన సంపుటిలో, అతి అరుదు.

*　　　*　　　*

'వేనరాజు' ప్రదర్శనము సాంతముగా జరిగిందంటే, ఒక గొప్ప క్రొత్తనాటకం ఆస్వాదనకూ, పరిశీలనకూ తేవడమే కాకుండా, ఇంకొక్క విశేషముకూడా తెచ్చిఉండేది. స్థానం నరసింహారావుగారి పృథువు (పాత్ర), ఇప్పటికే రంగములో విహరించవచ్చినది, నిజమైన నిర్వహణము ప్రదర్శించి ఉండేది. 'వేనరాజు'లో పృథువు కెంతో ప్రాముఖ్య మున్నది. పృథువు కెంతో ప్రాముఖ్య మున్నభాగమే (అసలు నాటకములోనే ముఖ్యమైన భాగము) ఆడనీయలేదు. అయినా 'విప్రనారాయణ'లో దేవదేవి, 'వేనరాజు'లో పృథువు స్థానంవారి క్రొత్తపాత్రలుగా మనసులో నిలవగల్గినవి.

*　　　*　　　*

భావోద్రేకము ప్రదర్శించడంలో నిపుణులైన రాఘవాచార్యులుగారు, ఇటు ప్రాచ్య సంప్రదాయపు అంగవిన్యాసరేఖావైదగ్ధ్యము చూపే కూచిపూడి భాగవతులు వేదాంతం రాఘవయ్యగారు స్థానంవారికి తమ నడిమిస్థానం ఇస్తారు. స్థానంవారీరెండుఅంశలూ తమపాత్రనిర్వహణంలో అపూర్వమైన సొగసుతో మేళవించుకొంటున్నారు. పూర్వము భావోద్రేకములోనే ఎక్కువగా నేర్పులు మెఱసిన వీరు ఇప్పుడు జరిగి ప్రాచ్యపక్కివంకకు సాగివచ్చినారని చెప్పవచ్చు. నేటిరంగాన ఈవిధమైన సమ్మేళనము ఇంతసహజముగా కావించినది అసాధారణమైన ప్రతిభా ప్రదర్శనమని చెప్పవలెను.

*　　　*　　　*

కూచిపూడివారి అభినయము ఇంతకాలము అనాదరము పాలుపడ్డా విద్యాప్రియు లెంత భక్తిశ్రద్ధలతో ప్రాచీనకళను నిలిపినదీ చూపి విస్మయము కొల్పింది. ఎంతో ద్రుతమైన అంగవిన్యాసములో అంత సున్నితమైన వైదగ్ధ్యములు చూపి రాఘవయ్యగారు మన ప్రాంతమందలి నాట్యకళ పునరుజ్జీవనము పొందడమే కాక, అది యిప్పుడే ఉత్కృష్టస్థానము పొందగలది అని నిరూపించినవారైనారు.

## విరాళములు

| | | | | రు |
|---|---|---|---|---|
| శ్రీ | గూడవల్లి రామబ్రహ్మం చౌదరిగారు | | | |
| | 'ప్రజామిత్ర' సంపాదకులు, మద్రాసు | ... | ... | ౧౦ |
| ,, | వెమురుమూడి వెంకటకృష్ణరావుగారు | | | |
| | Telugu Translator to Govt., మద్రాసు | ... | ... | ౧౦ |
| ,, | డాక్టరు ఎస్. ఎస్. గంటిగారు | | | |
| | బొంబాయి | ... | ... | ౧౦ |

---

# అభిప్రాయాలు

నేటి తెలుగు కావ్యవాణికి మీ 'ఉదయిని' నాట్యరంగమని మొదటి సంచిక చదివినప్పుడు తోచింది. నేటి కావ్యకర్తల ఉత్సాహము బహుముఖములుగా కావ్యస్వరూపము పొందుతున్నది. అందు ఔచిత్యము పోగొట్టుకోని వానికే 'ఉదయిని' ఆదరణ కద్దని తెలిపింది. పండితులకు, పామరులకు, స్త్రీలకు, పిల్లలకు, తెలుగువారందరికీ 'ఉదయిని' జ్ఞానతేజస్సు ప్రసాదించకలుగుతుందని ఆశిస్తున్నాను.

మీ 'ఉదయిని' నవ్యసాహిత్యపరిషత్పత్రిక నెరవేర్చదగిన ఆశయములనే నెరవేరుస్తోంది. ధనాభావముచేత ఇట్టిపత్రిక నిలిచిపోయిం దనేమాట ఎన్నటికీ తెలుగువారిని సిగ్గుపరచకుండా ఉండును గాక.

బాపిరాజుగారికథ చాలా మనోహరముగా ఉన్నది చదివి ఆనందించాను. బంగారమ్మగారి పద్యాలు ఎక్కడ కనిపించినా నేను మొదట చదువుతూ ఉంటాను. 'పుంతలో ముసలమ్మ' చాలా బాగున్నది. తెలుగుమాటలసొంపు ఆమె బాగా గ్రహించినారని నా ఊహ. మీ కిరణాలు లేతగా, స్వాదుగా ఉన్నవి. ఉన్నతభావగర్భితములు. 'ఉదయిని' సర్వాంగసుందరముగా, ఉన్నతభావాలతో ఒప్పుతూ ఉంది.

చింతా దీక్షితులు

తాము దయతో పంపిన 'ఉదయిని' చేరింది. చాలా సంతోషంతో చేకొన్నాము. ధీరమతులు నడువజాలని మార్గము లుండునా ? నవ్యసాహిత్య గగనరంగమున మీ 'ఉదయిని' చల్లని జ్యోతిస్సులను విరియుగాక. సహృదయ చకోరముల కానంద జ్యోత్స్నలను వర్షించు

గాక. కాలవశమున నత్యుగ్రోష్ణతాపమునకు గుఱియైన రసపిపాసువులకు అకాల జలోదయమై హాయిని స్థాయిని చేకూర్చుగాక.

'కిరణాలు' అనే సంపాదకీయం గౌరవ పురస్సరమగు ఆధికారికలక్ష్యాన్ని చాటింది. చదువుకొన్నవారు చదివేపత్రికగా మాత్రమే ఉండడంకంటే, చదువురానివారిని చదవువచ్చిన వారినిగా చేసేపత్రికగా 'ఉదయిని' వుండాలెనని ఆశిస్తాను. కనుకనే సాధారణజనాన్ని కూడా మనమానవుల్లోనే పరిగణించి, ఉత్తమోత్తమమైన సాహిత్యసౌరభము వారికికూడా అందుబాటయ్యేట్టు పత్రికాధిపతులూ వ్యాసరచయితలూ కొంత ఔదార్యం ప్రదర్శించాలెనని ప్రార్థిస్తాను. మీ 'ఉదయిని' ఈమాటను ఆదటపుచ్చదు కదూ!—సర్వధా—సహ నా వవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై తేజస్వినా వధీత మస్తు, మావిద్విషావహై—అనే ప్రాచ్యశ్రుతితో, వెలివఱచజాలని భావనతో, నా ఆవేదన తెలిపాను.

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి

మీ యాధిపత్యమున ప్రకటితమగుచున్న 'ఉదయిని' సార్థక నామధేయగా వెలయు చుండుఁగాక యని యాశాసించుచు అందలి రచనలఁగూర్చి యించుక నాయామోదము దెలుపు చున్నాను.

శ్రీమతి బంగారమ్మ, బాపిరాజు, దీక్షితులు, వెంకటరావు, కామేశ్వరరావు, సూర్యరావు, పురుషోత్తమశర్మ, నో. న. శా. గార్ల రచనలు అర్థవ్యక్తి ప్రసాదాది సుగుణములు గలవై సుకుమార సుందరములుగా ఉన్నవి. చలం, రాజమన్నారు, సత్యనారాయణమూర్తి, సత్యనారాయణశాస్త్రి, శ్రీనివాసరావు, నరసింగరావు, నారాయణబాబుగార్ల రచనలు ప్రౌఢార్థములు. ముద్దుకృష్ణ, జనార్దనరావుగార్ల రచనములు నా కర్థముకాలేదు. అర్థవ్యక్తి ప్రసాదము కలవై సౌశబ్ద్యముతో మీరు రచించునవి, ప్రకటించునవి రచనలు ఉండునుగాక యని కోరుచున్నాను.

మీ పత్రికకు మీకు అభ్యుదయము కోరు మిత్రుడు,

వేటూరి ప్రభాకరశాస్త్రి

స్తబ్ధతను విదలించి ఆంధ్రహృదయములను సానబట్టుటకు బుట్టిన సాహితి...సఖి...జయంతి ...భస్మీపటలమైన బూదినుండియే 'ఉదయిని'...వెలువడినది. అందమగు అమరిక, అమూల్య రామణీయకము.

—గృహలక్ష్మి.

శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారి 'జయంతి' ఆగిపోయిన తరువాత ఇట్టి సుందరపత్రిక తెలుగునాట బయలుదేరలేదని చేయెత్తి చెప్పవచ్చును. ఆకారముననే కాక ప్రచురిత విషయములందును ఈపత్రిక ముగ్ధమోహనముగ నున్నది. ఉత్తమపత్రిక. ఉత్కృష్ట వాఙ్మయ సృష్టి నాశించు కళాప్రియులు ఆదరింపదగిన పత్రిక.

—ఆంధ్రభూమి.

పత్రిక ఆకారము, సంకలనము చక్కగా ఉన్నవి. వర్తమానజీవనమును ప్రత్యక్షీకరించుచు అభ్యున్నతికై ఆంధ్రులు చూపుచున్న ఉద్గమనాభిలాష కుదాహృతియై ముఖపత్రముమీది అర్థోదయచిత్రము భావబంధురముగా నున్నది.

—ప్రజామిత్ర.

సామాన్యదృష్టికి తేరిచూడరాని తన 'కిరణాల'తో నవ్యసారస్వత ప్రపంచము నుద్దీపింప జేయుమ నిది యుదయించినది. అన్నిరచనలు 'నవ్యసాహిత్య' మనుపేరును చెల్లించుకొను నవి. సంచికస్వరూపము లోపల, వెలుపలకూడ రమణీయమయి నవ్యవాసనల నీనుచున్నది. నవ్యసాహిత్యాభ్యుదయము నాశించు ఉత్తమపథము పత్రిక.

—భారతి.

ముద్దులొలుకుచున్నది. ఇందుగల పద్య గద్య వ్యాసములన్నియు సుప్రసిద్ధులచే రచింపబడి నవి. ఈపత్రిక నవ్యసాహిత్యలోకమున కొక మకుటమువంటి దనియే చెప్పవచ్చును.

—వినోదిని.

Not without some amount of hesitation has Mr. Janardana Rao launched this new Telugu literary journal, for similar enterprises in the past have had an undeservedly brief career. But the need for such a journal is obvious. There are new tendencies in Telugu literature which are demanding their right to exist and be treated with the same respect as the old, as for instance, "Bhava-kavithvam" and "Colloquialism." They need a platform where they can vindicate their claims. 'Udayini,' one is glad to note, offers full scope for doing so. The Editor is all for the modern, as is apparent from the contributions appearing in the first (December) issue of the journal.

... ... ... ... ...

The journal is of a distinctly high order and is well fitted to serve as the organ of Andhra literary renascence. We hope every sincere well-wisher of the Telugu language will extend his or her hearty support to this new journal.

—*The Hindu* (Literary Supplement.)

**Printed at Lodhra Press, Egmore & Published by K. Janardana Rao at 15, Adiappa Mudali Street, Vepery, Madras**

# ఉదయిని

సాహిత్య పత్రిక

(రెండు నెలల కొక సంచిక)

సంపాదకుడు

కొంపెల్ల జనార్దనరావు

సంపుటము 1. సంచిక 3

మే-జూన్ 1935

సాలుసరిచందా రు 4 విడిప్రతి అ 12

15 ఆదెప్పమొదలి వీధి, వేపేరి, మద్రాసు

# విషయసూచిక

# ఉ ద యి ని

సా హి త్య ప త్రి క

సంపుటము 1 యువ, వేసవి

సంచిక 5 శా. శ. ౧౮౫౭

## కి ర ణా లు

నవ్య కవితకూ జూబిలీయే—అంతకంటె ఏలికలతో పోలికలకు పోరాదు కాని.

ఈ పాదశతాబ్దములో నవ్యులు సాధించిన దేమిటని ఒక్కొకచో జిజ్ఞాసతోను, ఒక్కొకచో అవిశ్వాసముతోను, ప్రశ్న రేగుతున్నది. బంగారములో పోదిగి చూచుకో గల గ్రంథచయము ఇన్ని సంవత్సరాలలో పండినది అంత యెక్కువ కాదు. కాని విలువలు కొలిచే కొలతలు ఎంతో పరిణతికి వచ్చినవి. నాటకము, నవల, కావ్యము— అన్నిటనూ అభిరుచి నిశితమై పరిణమించింది. రచనాభ్యాసము అభిరుచిపరుగు అందుకో జాలడమే లేదని చెప్పవచ్చు. సారస్వతులు తమకు తామే పరాజితు లవుతున్నారు తరుచు. నేడు సాధారణముగా మెప్పు పొందగల రచనము వెలువడ్డదంటే, అది సారస్వత భండా రాన పదికాలాలపాటు నిలువగల దన్నమాటే. కాని, వ్రేళ్లపై లెక్కించవచ్చు, ఇటీవల వెలువడ్డ ఎన్నికగన్న గ్రంథాలను. అయితే వాయువు ప్రసవవైఖరితో తొణుకాడు తున్నది.

*            *            *

సారస్వతసేవనంలో సంస్కరణబుద్ధి మేళవించి, సాహిత్యాన్ని తన ముఖ్యమైన ఆశయాలకు వాహకముగా వంచుకోదలచిన వీరేశలింగము నాటి రచనములూ, ఆలాటి యిష్టమే రసకలితంగా చేపట్టగలిగిన చమత్కారి గురజాడ అప్పారావు రచనా నాడు పొందిన ప్రతిఘటనమూ నిరోధమూ కాని, తిరుగ సాహిత్యలక్షణపరంగా గిడుగు

రామమూర్తిపంతులుగారూ, గురజాడ అప్పారావూ నడిపిన ఉద్యమం కొనసాగే టందుకు పొందిన ఆలస్యమూ విమర్శమూ కాని, ఆలాటి ప్రయత్నాలకు నేడు తిరిగి వాటిల్లగల స్థితిగతులు లేవంటే, సంఘస్థితికి ఎంతో మించిన దూరమైన ఆశయాలూ, సాధనలూ నాటివలె నేడు ఉండజాలవని కాదు; సంఘము, జనసామాన్యము, ఏనూత్న భావాలనూ శీఘ్రముగా అవగాహనం చేసుకోగల సంసిద్ధత కనబరుస్తున్నారు. ప్రచార ధోరణి ఇక సాహిత్యరచనలో నిలవలేదు. రచయితలు కళాదృష్టి యెక్కువగా పదను పరుచుకొన్నారు.

*　　　　*　　　　*

రచనాధికారం కేవలము ప్రాచ్యపాండిత్యనిధులకు వదలి ఊరకుండని భావుకుల చేత వివిధసంస్కారాలు సారస్వతంలో అవతరించినవి. వాడుక భాషా, కొత్తకవితా లేపిన ఉత్సాహములో సహజమైననుడీ, భావనిరూపణమూ సారస్వతానికి పెంపు లీనసాగినవి: కొందరు సిద్ధహస్తులు పరిపక్వపడినారు. జనబాహుళ్యములో ఆస్వాదన సౌముఖ్యము పెంపుగాంచింది. రచనోత్సాహము వివిధావలంబనాలు పట్టి పెరుగుదల చూపింది. శుష్కమైన పూజాపీఠమునుండి సారస్వతాన్ని జీవితములోనికి దింపవలెనన్న నాయకుల పిలుపున్ను ప్రచారముఖముగా నిలిచిపోక కళాధోరణికి తావిచ్చి తన్ను సమర్థించుకొన్నది. ఈ పరిణతి కావ్యవీథిని వ్యక్తి జీవితపులోతులు తడవి గాంభీర్యము దాల్చింది.

*　　　　*　　　　*

ఆంగ్లదేశపు 'న్యూ రొమాన్టిక్' సంచలనం, 'ప్రి-రాఫెలిటిజ్మ్,' టాగూరు కవి 'మిస్టిసిజ్మ్,' స్వప్నసామగ్రి, కొత్త తెలుగుకవితను దిద్దుకోసాగినవి. కవి నగ్నమైన స్వీయానుభూతికి కావ్యవాణిలో కదలసాగినాడు. బంధవిముక్తిపేర గురజాడవారు భాషలో చూపిన విచ్చలవిడితనము కావ్యభూమిని ఒకప్రక్క పాయగా వచ్చింది; ప్రధాన మైన కావ్యగతుల భాష తీర్పులు పొంది, భావములో ఏర్పడిన ఐకాంతికత (individua-lism)—ఏ కళారచనమందూ చేపడే నిగ్గయిన అవస్థ—భాషలో ఒకప్రత్యేకమైన రీతి సంతరించింది. అటు విచ్చలవిడితనమున్ను తన పరిచయము ఆరీతియందు ముద్రించు కొని దాని నవ్యతను పట్టిచూప వచ్చింది. ఈ ప్రశస్తమైన రీతి వైలక్షణ్యము నవ్యులు పడసిన ఒక ముఖ్యమైన సంపత్తి.

*　　　　*　　　　*

క్రొత్తి ప్రాభవాలలో, కవి స్వీయానుభూతిని కావ్యమునకు పట్టే లాక్షణిక మార్గాన అభినివేశము చూపుతూ గాంభీర్యము సంపాదించిన వాడయిన్ని, అనుభవ

విస్తృతి యేమరి తాను సంకుచితత్వములో మిగలడం చూచుకొంటున్నాడు. రీతి సౌందర్యము పదనులో తన ఉద్రేకమే కాక భావఅనే ద్రవ్యములో పొందవలసిన నేర్పు తాలూకు అవసరాన్ని గుర్తించి, తొలుత కొంత ఉపేక్షకు నిల్పుకొన్న పాతకవుల రచనలలో కావ్యత్వవిలసనాలు గౌరవించడం నేర్చుకొన్నాడు. కొత్తపోకడ పాతవారిపై ఔత్కృష్ట్యము నిలుపుకొన్నట్టిదే అని చెప్పనక్కరలేదు, అది ఒక కొత్తపోకడ అని మాత్రం స్వీకరిస్తే చాలుననీ, పూర్వులు కథన కవితలో పొందిన ఔన్నత్యము తాము తమ భావకవితలో సాధారణముగా పొందవలసే ఉంటున్నదనీ నేటివారు గమనించ సాగినారు. ప్రాశస్త్యములు నిర్ణయించేపట్ల అనుకృతులను మార్గదర్శకములుగా అవలంబించరాదు కాని, పూర్వకవుల అనుకృతులందు రచనాపాటవమైనా మెఱుగై నిలవగా, నేటి వారి అనుకృతులందు వస్తువూ, రచనా చూపే తేలికతనమువల్ల, నూతనత్వపు ఉత్సాహాతిశయమునుండి పరికరాల, పరిపాకాల పరీక్షకు అవసరము ఏర్పడుతున్నదని చెప్పవచ్చు.

* * *

అనుభవసౌష్ఠవము లేని రీతివిన్యాసము అభిరుచికి నచ్చకపోవడం సహజమే. ఏ క్రియయందూ వ్యక్తిసత్త్వము—personality—వ్యక్తమైనప్పుడే విలువ యేర్పడుతుండగా, సారస్వతముపట్ల అది అపేక్షించడం, సారస్వతమునూ ఒక ఉత్కృష్టకార్యముగానే చేపట్టమని కోరడం తప్ప వేరొకటి కాదు. నవ్యకవిత తన ప్రాముఖ్యము మళ్లీ పెంచుకొనేముందు, వాస్తవజీవనం ముద్రలు, మరింత విస్తృతమైన అనుభవశుద్ధి, రచనా సామగ్రిలో పుష్టిగాంచక తప్పదు. ఒకవేళ కవితకంటెను ఇతర విధానాల సాహిత్యము ప్రాముఖ్యానికి నోచుకోగలదేమో కొంతకాలం. ఏమయినా, భావభరమూ, కళానిర్వహణమూ కూడా—సారస్వతము ప్రయోజనమూ, తత్సౌందర్యమూ కూడా—పరీక్షలో నిగా పొందదగి ఉంటవి.

* * *

ఇంతకూ నేటి స్థితిగతులు నిర్ణయించుకొని భావిసౌభాగ్యానికి మార్గాలు తెరచుకొనే ముందు సింహావలోకనం అవసరమై కన్పిస్తున్నది. పత్రికలలో చెదిరివచ్చిన వాఙ్మయం గ్రంథాలు కట్టి రా జూస్తున్నది. విశ్వనాథ సత్యనారాయణగారు తమ 'రసతరంగిణి' గ్రంథమాలలో స్వీయములూ పరకీయములూ, ప్రసిద్ధిగన్న గ్రంథాలు ప్రచురపరుస్తున్నారు. ముద్దుకృష్ణగారు కావ్యప్రపంచము పరిశీలించి 'వైతాళికులు' ప్రకటించి నవ్యకవిత నిగ్గు చూప యత్నించినారు. ఇతరమార్గాల నవ్యవాఙ్మయ వికాసమున్ను మరి కొన్ని విభాగాలుగా సంపుటాలలో అందజేయ సంకల్పిస్తున్నారు. ఇతరులున్ను కొత్త

సంపుటాలు వెలువరుస్తున్నారు. దేశ మా యత్నాలకు ఇచ్చే ప్రోత్సాహమునుబట్టిన్ని భావివికాసము కొంతవరకు నిర్ణీత మవుతుంది.

*　　　*　　　*

ముఖ్యముగా యువజనము ఈయెడ తమపూచీ గమనించక మానదు. మిక్కిలి దూరపు సంస్కారాలూ, గూఢములైన జీవిత సమస్యలూ పలికే గుడిపాటి వెంకటాచలంగారివంటి విప్లవకారునీ, సాంప్రదాయిక వ్యవస్థలకై శంఖారవములు గర్జించే విశ్వనాథ సత్యనారాయణగారివంటి ధర్మభక్తునీ, సంఘజీవితానికి పురోగతులు సూచించ సమకట్టిన ఉన్నవ లక్ష్మీనారాయణగారివంటి ఆర్థిక మర్మజ్ఞునీ—ఇతర కక్ష్యల వారటుండగా—రసజ్ఞులు అవగాహన పరుచుకోడంలో, వారి అభిప్రాయాల పరిచయముతో ఆగక, వారి వ్రాతల లాక్షణిక సౌందర్యాలు ప్రత్యేకము పరిశీలించి తీరుతున్నారు. ఒక కవి ఆశయాలతో ఏకీభవించ నక్కఱ లేకుండానే ఆతని కవితను కవితగా ఆస్వాదించ వచ్చునట. ఔను. ఏ రచనమూ అలాగే. తిరుగ, ఆ రచయితలున్ను కళావిన్యాసానికీ, తమ ఆశయాలకూ నిర్మాణములో సామరస్యము కుదర్చడానికి యత్నించే తీరుతున్నారు. ఆశయాలకూ కళకూ రచయితలు చూపే సమమైన శ్రద్ధయున్ను, రచనయెడల రచయితలూ సహృదయులూ చూపే సమమైన శ్రద్ధయున్ను భవిష్యముగూర్చి యెంతో ఆశలు సూచిస్తున్నవి.

ఈ నవీనమైన స్థితికి బీజము నాడు—౧౯౧౦ నాడు. నవ్యకవిత, వాడుకభాష ఉద్యమమూ ప్రారంభము కాక పూర్వము ఈ గతులు తెరచుకొని ఉండలేదని స్మరించదగును. వాటివల్లనే, భావుకలోకానికి సారస్వతముతో నెయ్యము స్థిరపడ్డ వెనుకనే, ఈస్థితి సిద్ధించ గలిగిందని స్మరించదగును.

కొంపెల్ల జనార్దనరావు

# మధూదయము

రేయికొసన్ బసిండి నునురేకలు ప్రాఁకక మున్నె పైనమై
పోయెడు మూఁగవీవలుల పుంతల నల్లన నేఁగుదెంచి నే
నే మెలుఁగెత్తి. నీనిలయ నిస్సరణమ్మున నిల్చి పిల్తు "నా
ప్రేయసి, ప్రేయసీ"యని చలింపఁగ యుష్మదుషస్సుషుప్తులే!

పిలు పెడఁబాటువేసటనొ వేకువ సోఁకుటనో మతేమొ జీ
రలువడిపోయెనో పలుకరాక వెఱంగిడె నాకె; తోఁచె కో
మలకరుణాలసమ్ముగ, తమ స్వప్నమయాస్తమయాన నేలొ యు
ల్లలితము గద్గదమ్ము నగు ప్రత్యుషసీ హిమకంఠరావమై!

నీయిలు మోసలన్ ముసరు నింబకషాయశలాటువాసనల్
మోయఁగలేని పయ్యెరల మూలుఁగొ నిశ్వసన స్వనమ్మొ యే
మో యని మేలుకో వలవొ సకియా, దరమీలితమ్ములౌ
నీయెద రేకులన్ బొదువు నీడలు తోడనె మూఁగిపోవఁగా!

ఈయెద సారెసారె కిసింతలు వాఱును సీతుసంకెలల్
వాయఁగ నీమధూత్సవవిభాతశుభోదయవేళ ప్రేయసీ
డాయఁగ తెక్కలార్చి గగనమ్మున చేరు కరంగి పాఱు లోఁ
తీయనిపాట గాఁగ కయితీయని పూవుల తేనెయూటగా!

పాడఱువెల్గులో కొఱడువాఱెడు కోర్కులొ మ్రోడుటాసలో
పోఁడిమి వీడు సౌఖ్యములొ పోయెను పోయిన వేవొ యీయకే
జాడలు: నిత్యనూతన వసంతములో యువజీవకాంతులో
వాడని నందన ప్రసవవాటికలో మన కింక ప్రేయసీ!

కృష్ణశాస్త్రి

# చిన్ని చిలక

౧

ఎన్నాళ్లకొచ్చావె చిన్నారి చిలక!
కన్నారి చూచిన ట్లున్నాదె చిలక!
దానిమ్మలను చూచి తలపోస్తి చిలక!
లేనిమ్మక్రింద నిదానిస్తి చిలక!

౨

బింబాలఁ గాంచి కఁపించానె చిలక
తాంబూరరుతి కెంతో దడిసానె చిలక
వంశకీర్తన విని వణికానె చిలక
మదిలోని సొదలకే అదిరానె చిలక.

౩

అద్దాల కెదురుగా నడలానె చిలక
చిత్రాలముందు కృశించానె చిలక
వెన్నెల రేలకే వెఱిచానె చిలక
కొమ్మల కౌఁగిండ్లె కొలిమాయె చిలుక!

౪

గువ్వజంటలఁ జూచి గునిసానె చిలక
సంజెకెంజడలలో జంకానె చిలక
అడవిపూఁబొదలలో నలసానె చిలుక
గందంపు పందిళ్ల కాఁగానె చిలుక.

౫

శిరసెత్త చుక్కలు చెండాడె చిలక
చెవియొగ్గ తుమ్మెదల్ కవిసాడె చిలక
పసుచుకోర్కులు లోన నుసుకెత్తె చిలక
లజ్జ దాఁగురుమూఁత లాడించె చిలక.

# చిన్ని చిలక

౬

ఉత్తరమ్ము లిఖింప నుంకించి చిలక
తీయని వీథులఁ దిఁగానె చిలక
మొగలి ముంగిళ్ళలో మోమోడి చిలక
మృదువైన పత్రాల వెదికాని చిలక.

౭

నా చేతు లంటి స్వప్నములాయె చిలక
కన్నె గేదఁగిరేకు లన్నియుఁ చిలక
నాయూర్పులకు కంది నలుపెక్కె చిలక
నిగనిగలాడేటి చిగురాకు చిలక.

౮

చైతన్యమయమైన జగతిలో చిలక
విసువక దూతకై వేడానె చిలక
తల లూఁచె జాలితో తరులెల్ల చిలక
సరసులు తొణఁకక కరుణించె చిలక.

౯

మొలఁగఁడే ఆనాఁడు మేఘుండు చిలక
కదలదే కుతుకాన కలహంస చిలక
కన్నెదౌత్యము సన్న కాఁబోలు చిలక
అబల ప్రార్థన మెంత అలకనో చిలుక.

౧౦

భంగపడి యందఱఁ బ్రతిమాలి చిలక
వేఁడికొని దేవతల వేసారి చిలక
భావాంబరమునందె వ్రాసాను చిలక
నా రాగపద మిట్లు శ్రీరామచిలక.

రాయప్రోలు సుబ్బారావు

# పి లు పు

ఆర్ద్రమైన హృదయాంతర్భాగం
బనుకరింపగా గదిలో
ద్వారము లన్నియు బంధించుట
ట్టపు చీకటి క్రమ్మెన్.

ను ధ్యానించుచు నిన్నే పిలుచు
ట్టూర్చుచు నే నుండన్
కఠినాకృతి నిలువగ స్మృతిలో
రసించి నే నుండన్—

స్పష్టంబుగ నా సంజ్ఞాక్షరములు
శ్రవణంబుల ధ్వనియించెన్
శాంతగౌరవము సాదరమధురము
స్వరము నీదిగా తోచెన్.

ఒక్కసారిగా నులిక్కిపడి నే
ఓహో వచ్చితి నంటిన్
ఒక్కగంతుతో నుత్సాహంబున
రికి వీథిలో నుంటిన్.

థి యంతయును విగతజనంబై
చ్చగానివలె నుండెన్
థి యంతయును వెదకితి నీకై
వెర్రివానివలె వృథగా.

ఈవిధముగ నన్నేరియింపంగా
నే మే భూతం బనెనో!
వే నన్నటు నీమందిరమున
రతి బిల్చితివా సఖుడా!

నోరి నరసింహశాస్త్రి

# ప్రవాసి ప్రణయ గీతాలు

౧

ఈ పరవాసవేదన సహింపగలేను; సఖి సరోరుహా
ద్దీపిత మోహసంజనిత దివ్యసుధాస్యవిలాసహాసముల్
నాపయి సోకి, సౌరభవిరాజిత రమ్యనిశీథవేళలన్
రేపు, మదీయమానసశిరీషసుమాంతరరాగరేఖలన్ !

౨

ఈ సెలయేటిపాట విన నేటికిఁ, నేటి నిశాప్రశాంత శో
భాసురభీరహాస్సుధలు భాసిలువేళ, మదీయహృద్విపం
చీ సుకుమారతంత్రులు వినిర్మలమోహనగానమాధురీ
శ్రీసఖమైన గీతికలు, ప్రేమగళమ్మున పాడు ప్రేయసీ !

౩

చేయికి చేయి చేర్చి, మృదుశీతలవాతలతాంతగంధముల్
హాయి నొసంగ, మోహనవిహాయసవీథుల తేలియాడుచుం
బోయెడు నంచదంపతులవోలె, యథేచ్ఛగతిన్ విహారముల్
సేయుదమో శుభాంగి, వికసించిన ఈ తెలిపూలవెన్నెలన్ !

౪

కమ్మని పిల్ల తెమ్మెరల కౌగిళులన్ వికసించి వాసనల్
చిమ్మ శిరీషపుష్పములు చేరువ రాసులు గానవచ్చె ; రా
రమ్మ, మనోహరాంగి, మదిరమ్మును తెమ్మిటు లీనదీప్రతీ
రమ్మునకున్, ప్రియమ్మునను త్రావి సుఖింతము రాత్రియంతయున్ !

౫

వేకువవేళ రేకు లరవిచ్చినపూవులు, యుష్మదీయహే
లాకమనీయకాంతిసుధలం దలపించెడు మాటిమాటికిన్ ;
ఆ కనుదోయివెన్నెలలు నిండిన నాయెద ఈ ప్రవాసఖే
దాకుల జీవితమ్ము క్షణమైనను సైపగలేదు పైదలీ !

౬

మైమర పొందెనేమొ, సుకుమారసమీరకుమారు డీరహ
శ్శ్యామలయామినీరమణి చక్కిలిగింతల కౌగిలింతలన్
ప్రేమతరంగితాత్ముడయి ; లేక, వసంతవనాంతరాపగా
సీమల కోమలప్రసవశీతలశయ్యల సుప్తి జెందెనో !

౭

ఎవ రది యిన్నిశీథమున నీయెడ నేసడి లేక ఏకతం
బ, వడకు హస్తపల్లవము నల్లన దట్టి, వియోగవేదనా
వివశత శుంఠనైన నను, 'ప్రేమసఖా' యని పిల్తు రాత్రుతన్
శ్రవణమనోహరమ్మయిన సన్నని కంఠము నెత్తి జాలిగాన్ ?

దామెర రాజగోపాలరావు

---

# ర చ న

యుగయుగమ్ములుగా నెంతో యోజసేసి
నరుని నిర్మించినాడు విన్ననువు మెఱయ;
మృణ్మయమునుండి రేఖలు మేలుకొలిపి
బ్రహ్మ తన ప్రతిరూపంబు పరిణతముగ.

నరుడు క్రమ్మఱ తన మహోన్నత గభీర
పూర్ణసత్యమ్ము నీక్షించు పూనికతోడ
ఏండ్లు పూండ్లునుగా తపియించి భూరి
తేజ మానందబ్రహ్మమూర్తిని రచించె.

తన మనికి సఫలం బౌట ధన్యుడనని
తనివి సని లోన బ్రహ్మ సంతసము మీఱె;
తన యనల్ప సుశిల్ప సౌందర్య మరసి
ముగ్ధుడై దివ్య విస్మృతి మునిగె నరుడు.

మంగిపూడి పురుషోత్తమశర్మ

*

* *

రెండు లక్షలజనులు,
స్వాతంత్ర్యప్రియులు,
త్యాగశీలురు, వీరులు,
గుమిగూడినారు
ఒక పెద్దమైదానమునను;
జనుల కోలాహలము!
జయజయధ్వానాలు!!
ఉత్సాహము, వెర్రిఆవేశము!!!

ఒక వింతశక్తి
సంపూర్ణ స్వాతంత్ర్యానురక్తి
మనిషి మనిషిని పెనవేసుకుంటు,
గుండె గుండెను సూటిగ దూసుకుంటు,
వెర్రి అన్వేషణాన తిరిగినది,
ఆ మైదానమునె నాడు కలతపెట్టి;

ఇంతలో, వెన్నెలబోసినవ్వులవాడు
వింత ఆకర్షణంపువెర్రివాడు...
అతడు, వచ్చినాడు, ప్రజ మెచ్చినాడు,
సంపూర్ణ స్వాతంత్ర్యానురక్తిని
రగుల్కొలుపు ఆ వింతశక్తికి
వినయాంజలులు ఘటించి
ప్రేరేపించినాడు:

హిమాలయమ్మె

ఆపాదశిఖరము, పులకరింప,
సింధుగర్భమె సుడులుతిరుగ ..

అతని ముందుగ ఆ శక్తి,
తరువాత అతడు తరలినారు...

బోసినవ్వుల విరబోయు

అతని వింత ఆకర్షణాన్ని
మృత శిలావిగ్రహాన ప్రతిష్ఠించి
తమ హృదయాలను నిలుపుకున్నారు
జనులు,
సజీవశాఖనుంచి త్రుంచి
తెచ్చిన ఒక సుమాన్ని
అప్పుడప్పుడు నాటి దృశ్యానికి
అర్పణము సేయు విగ్రహారాధనకు.

ముద్దుకృష్ణ

---

## వి ర హ ము

విరహమే రాజుకొని
మేనంత కుమిలి నా
నుసికూడ బుసకొట్టి
నిన్నె తలపోయు.

చురుకు చూపులచేత
కన్నులే పోయినను
నీరూపె రూపించి
వెలుగులే తీండ్రించు.

ఈ అధ్వాన్నపుం బ్రతుకు
నిన్ను తలపోసికొన
కలతమైకము వీడి
వెలుగుదారుల మురియు.

జనమంచి కామేశ్వరరావు

# శరత్తు

తెక్కలు చాఁచి తీరికగాఁగ గాలిలోఁ దేలిపోయెడు నంచవోలె వచ్చి
సితవస్త్రకృతగరున్మతి నృత్తసమభంగ తురికీల నర్తకసరణి వచ్చి
ఇరుదెసల్ కాంతిచే నొరయ సూర్యున కెదురౌ సితాంబుజలక్ష్మియట్లు వచ్చి
నిమ్నోన్నతములు లేని కులాంగనాచ్ఛకూలంకషప్రేమకల్పముగ వచ్చి
చందిరునివోలె నవనీరజాతబంధు
కిరణసంస్పర్శచేత వెల్గించుకొంచుఁ
దనతనూసృష్టి సర్వ మందముగ వచ్చెఁ
దల్లి కృష్ణాతటిని శరత్కాలమూర్తి.

చిందిపోయెడు వయశ్శ్రీశోభ విరియఁగాఁ బచ్చాకు బంగరువన్నె తిరిగి
వైదూర్యశకలముల్ పట్టి కుప్పలు చేయుగతి నున్న యందాలకంకె వదలి
వలయాకృతములు శోభాతరంగావలుల్ గగనవీథికకు మెట్లుగ నమర్చి
ఇట ముదాకృతి దేవు నెగచి పయోధరప్రౌఢ వారీగజపతిని జేసి
అనయపథజన నేత్రకుట్టన నిమిత్త
మైన పౌష్కల్య మేచి యూహాలకు నూహ
సొగసుసంపాదనము చేయుచున్న దిదిగొ
శరదమలమూర్తి కేదార సస్యలక్ష్మి.

మిన్నను పాములచిన్నదానిగళాన నత్తగుల్లలపేరనంగ మొరసి
అతివాయువేగధూతాప్సరోంగనల చీరలచెంగు లనఁగ గూళ్లులుగ నెగిరి
గగనవార్నిధి తరంగములు నేలను తీరములఁ గట్టు నురుసుతెట్టెలుగఁ దోఁచి
సంకల్పగోఖురాంచలకాంతి వెడఁద యై ధరణికి డిగ్గిన సరణి వచ్చి
కూడి తెక్కలు తపతపఁ గొట్టుకొంచుఁ
గాలు మోపెడుతటి నారికేళవిటపి
గముల కొల్లేటినుండి కొంగలు సహస్ర
ములుగ విడిసె మాలాబద్ధములుగ వచ్చి.

పలుచని బురదలోపల మానిసిని జూచి నెగచి యూకున దూఁకె నీటిపాము
వెలివడ్డ బొరియముంగల నిక్కి తెల్లఁబోయెను గొంగ కెఱగాని యెండ్రకాయ

ఒడ్డున బురదలో గొడ్డు గిట్టలు దిగి పడె జంఘుదఘ్నమై పంటకాల్వ
జనుము చల్లుటకుఁ దీసినపాయ పాపట చక్కఁ దీరిచి దిద్దె సస్యలక్ష్మి
పలుచగా వేఁడియెక్కు పవళ్లతోడఁ
బైరుగాలిపొరల్ తడియారఁజొచ్చె
పగటి కుషసు నా నొప్పె నవార్షుకములు
కాఱులకుఁ దొల్తగా శరత్కాలలక్ష్మి.

అనిలాహతిఁ దబకలాడె నొడ్డులు మోచి క్రొత్తనీరము పెట్టుకొన్న చెఱువు
కాల గ్రుచ్చుకొనె డొంకలు గొడ్లగిట్టలు దిగిన గుర్తులతోడ బిగిసి యెండి
క్రొత్త నూర్చిన వడ్లకు సరికి సరి రేగుపండ్లమ్మ వచ్చె లంబాడిపడుచు
వినిపించె వీధిలోనన గంగిరెడ్లదాసరి సీతపెండిలి సలుపు కేక
బువ్వ చిక్కము కొడవలిఁ బూని బయలు
దేఱె వరికోఁతకొఱకుఁ బాలేరుచాన
ఒక విచిత్రమ్మయగు శోభ నొలుకఁబోసె
వడి శరద్వేళ మాగాని పల్లెటూరు.

ప్రొద్దుటింతల వాయువులు తావికై మెల్ల కొతిమేర చేలపైఁ గొసరులాడె
చిఱుచేఁదు వలచెఁ గోసినజొన్నచేనిలోఁ దొడిమదగ్గర పచ్చిదోసపండు
పండి కోయని మిరపలు పెండ్లికూఁతుంద్రవలె సకుంకుమశోభ కులుకులాడె
వడిసెలతో, తప్పనోడుపు నేర్పెను దల్లి చిన్నిపిట్టకు మొక్కజొన్నచేలఁ
జెలఁగెఁ దలగిల్లిన పొగాకు సెనగతంప
టలును బంతిపూల్ మిరపతోటలకు మధ్య
శరదృతు సమస్తమును బ్రదర్శనము చేసెఁ
గూడి మెట్టపొలాల వికుంఠలక్ష్మి.

చిఱుధూళిపొర కావి చెన్నుగా నిండ్ల కేతెంచె గోవులు తలాడించుకొంచు
తొలిచూలు చేమంతి తుదఁ బిందెవలె మొగ్గదొడిగి పచ్చఁదనమ్ము తొంగిచూచె
వాలుప్రొద్దు షికార్లువచ్చిన గాలులు చిఱుచలితోఁ బరాచికములాడె
చెదరిపోవు మొగిళ్ల నదలించి పరవఁ దోలించె దర్జాల బాలేందురేఖ
పవలు చివరి సగము పరఁగ రాతిరి తొలి
సగము పరిణమించు సొగసు లొలికి

# శరత్తు

జిలుఁగు జిలుఁగు వెన్నెలలు చూడ ననిపించె
సర్వమగు శరత్తు చంద్రిక దని.

పొలపొల విరిసిపోవుచు నల్పు విఱుగుచు మొల్లమ్ముచెడిన మొగిళ్లవలన
పసిపస రేదు మవ్వపు సన్నజాజిమొగ్గల తొలివిప్పు నా వెలదు లగుచు
ఎడపడ్డవానల జడులచే జెమ్మలారిన లేఁతపొరగాలిపనలవలన
మరు సెలకట్టె మాదిరి దూసి చను కమ్మ గేదఁగితావులె స్వాదు లగుచు
చివర తెలిదారముల నూఁగు జిలుఁగు లొలయు
పొట్లపూవలెఁ బెరటిలోఁ బొలుపు లగుచు
నలరు నేడాకులనఁటి మొవ్వాకు జిగికి
నెలవులు శరత్తుతలిరు వెన్నెలలు వచ్చె.

తలపైని మినువాక తెలిమంచు పెఱ క్రాఁగి యొడల నోడిక లగుచున్న యటులు
నిచ్చలు తల్లి తానే కూడి యున్కి సుగమ్ము చెమ్మట మేనఁ గ్రమ్మినట్లు
మౌళిభూష శశాంకు మన్నించుటకుఁ జంద్రకాంతమ్ముగా రూపు గన్నయట్లు
తన లెంకలకు నెండతలఁకు మాన్పంగఁ గ్రొమ్మంచుగడ్డగఁ దానె మలఁగినట్లు
శ్రీఁ బ్రకాశించె నిత్యాభిషేకవారి
వ్యంగ్యభూతదయావాచ్యమై సమూర్తి
నందమూరున నన్నపూర్ణాంబికా స
నాథుఁడై యేలుకొను విశ్వనాథ శివుఁడు.

విశ్వనాథ సత్యనారాయణ

# వేకువ యామిని

నాకురుల రాలి మల్లియలెల్ల నశియించె
నారాజు నాఅంకమే వీడి చనినాడు.
నరకలోకపు యాతనల మేలుకొల్పి
వేకువగాలులే వృశ్చికము లయ్యె.
నాపలిత వేణి గని నవ్వుచున్నది జగము
నా కంటినీరు సన్నె వెక్కిరించినది.

కొరవి గొని నాచీరకొసలె ముట్టింపగా
పరుగుపరుగున వచ్చు తొలికొండభూతాలు
కాలసర్పాలట్లు ఉదయసాగర మలల
నురుగునురుగులు గ్రక్కి పరవళ్లు ద్రొక్కినది.
మబ్బుటంచులె కత్తులై కుత్తుకలు కోయ
తళతళా మెరసినవి, ఈటెలై సాగినవి.

ఏపొదలు, ఏగుహలు, ఏరసాతలసీమ
ఏది నా కాశ్రయమొ, ఏడ నాబ్రతుకొ !

పొడుపుమల గుండాన పొడమి రేగిన చిచ్చు
'ఆకాశరాకాసి' నుదుటికుంకుమ మంట
అపరరక్తాంభోధి నారిపోవదొ ఏమొ,
నా యూర్పుకాళిమల మాసి నుసి కాదేమొ,
ఏది నా కాశ్రయమొ, ఏడ నా బ్రతుకొ ?

పురిపండా అప్పలస్వామి

# ఆంధ్ర—దోమలసభ

చింతా దీక్షితులు

## ౧

యోగాభ్యాసం చేస్తూన్నవాడు ఒకస్థితిలో పశుపక్ష్యాదుల భాషలు తెలుసుకో గలుగుతాడట! నేను ఎంత వద్దన్నా వినకుండా నాస్నేహితుడొకడు యోగాభ్యాసం మొదలుపెట్టాడు. తెల్లారకుండా ఒక గదిలో తలుపులు వేసుకొని కూర్చుని ఏవో ముగ్గులు వేస్తుండేవాడు. అవేమిటంటే ఆసనాలని నాతో రహస్యంగా చెప్పేవాడు. అంతే కాకుండా ఇంజనుగొట్టములో ఆవిరిలాగ చప్పుడుచేస్తూ గాలి లోపలికి ఎగపీల్చి బయటకు వదలి పెట్టుతూ ఉండేవాడు. అదేమిటంటే ప్రాణాయామం—ఎవరితోనూ చెప్పవద్దన్నాడు. క్రమక్రమంగా ఆపిచ్చిలో పడిపోయాడు. కొన్నినెల్లయ్యేసరికి ఏవేవో కొత్తశక్తులు తన కబ్బే యని చెప్పాడు. అందులో ఒకశక్తి పశువుల, పక్షుల, కీటకముల భావాలు వాటిచేష్టల ద్వారాను శబ్దములద్వారాను ఇతరపథములుగాను గుర్తించడం.

అతగాడు చెప్పేమాటలు యథార్థమో కాదో అని అప్పుడప్పుడు ఒక్కొక్క మృగాన్నుద్దేశించి దానిభావము చెప్పమనేవాడిని. ఏదో చెప్పుతూఉండేవాడు. అయితే అతడు చెప్పింది నిజమో కాదో నిర్ణయించడం ఎలాగ?

గోదావరిఒడ్డున గడ్డికి ప్రత్యామ్నాయము కాగితాలు తింటూన్న ఒకగోవును చూపి ఇది ఏమనుకొంటోంది చెప్పమంటే అతడు అక్కడ నిలబడి దానికేసి నిదానించి చూచి కళ్లుమూసుకొని చెప్పేవాడు. "ఇది—ఈగోవు—ఈగోవు ప్రస్తుత సమయాన్ని మనదేశములో ధర్మము క్షీణించిందని విచారిస్తోంది. ఈమానవులు తను కాగితాలు తినడం చూచి గోవుల కుండదగ్గ హక్కులమాట అటుండగా అధమపక్షం కడుపునిండా గడ్డేనా వేస్తారేమో నని ఆలోచిస్తోంది."

ఈమాటలు విన్న నేను ఏమనుకోవాలి?

ఒకనాడు ఒక ఆంబోతు తానే పట్టణ మేలుతున్నట్లు చూస్తూ రోడ్డు కడ్డంగా నిలబడింది. మనుష్యులూ బళ్లూ తప్పుకుపోతున్నారు కాని దాన్ని ఎవరూ పక్కకు తోలడ లేదు భయంచేత.

దాని చిత్తవృత్తి ఎటువంటిదో తెలుసుకోవాలని అడిగాను మాస్నేహితుణ్ణి. అతడ

చెప్పుతున్నాడు—"ఈ మనుష్యులకు బుద్ధి లేదు. లొంగితే బళ్లకు కట్టుకు తిప్పుతారు. ఎదురుకొంటే దూరంగా తొలిగిపోతారు......................బోలెడంత గందరగోళంచేసి, పసుపు రాసి, కుంకుం పెట్టి, ఊరేగించి, పూజించి, అచ్చువేసి వదిలిపెడతారు. మర్నాడు దానికి తిండి దొరికిందా, లేదా అనే సంగతైనా ఆలోచించరు............చస్తే రెండెడ్ల బండిలో ఘుస్తాబుచేసి పడుకోబెట్టి ఊరేగిస్తారు. బదికున్నప్పుడు పట్టెడు గడ్డిపోచలైనా వెయ్యరు...ఈ మానవుల్ని ఏం చేసినా పాపం లేదు."

ఈవిధంగా నాస్నేహితుడు జంతుహృదయాన్ని వెల్లడిచేసేవాడు. అతడిమాటలను బట్టి చూస్తే వాటికి మనుష్యులపట్ల సద్భావ మున్నట్లు తోచదు.

మనుష్యులు తమ కుపకారము చెయ్యడంలేదని వారిని నిందించడమే కాకుండా అకారణంగా మానవుల ఆచార వ్యవహారాలనుగురించి కూడా అవి ప్రసంగించుకోవడమూ నిందించడమూకూడా కద్దు.

ఊరివెలపల చిట్టడవిలోకి మే మిద్దరమూ షికారుగా వెళ్లినప్పుడు అతడు ఒకపక్షి దంపతుల సంభాషణ ఈవిధంగా చెప్పాడు.

"చూడు చూడు, ఇద్దరు ద్విపాత్తులు అలా వెడుతున్నారు."

"వాళ్లఒళ్లు అలాగ వేళ్లాడిపోతోందేం పాపం?"

"ఒళ్లు కాదు వేళ్లాడుతూంట—అవి వాళ్లు తొడుక్కొనే బట్టలు."

"ఎందుకు పాపం వాళ్లవి తొడుక్కోవడం—వాళ్లకి ఒంటిమీద చర్మం గాని వెంట్రుకలు గాని లేవూ?"

"ఉన్నాయి, ఉన్నా ఎందుకో అవి తొడుక్కొంటూరు."

"పాపం మనకు భగవంతుడు రెక్కలూ వెంట్రుకలూ ఇచ్చినట్లు వాళ్ల కివ్వలేనట్లుంది. నిజంగా భగవంతుడు పక్షపాతం చేస్తాడా?"

"జంతువులలో ఉత్కృష్టజంతువులూ నీచజంతువులూ అంటూ లేవూ. ఉత్కృష్ట జంతువుల కుండే సదుపాయాలు నీచజంతువుల కుంటాయా? భగవంతుడి దయకు పాత్రమైన వాళ్లు ఉత్కృష్టజంతువులై పుడతారు. పాపం చేసుకొన్నవాళ్లకి ఏ నరజన్మమో, ఏ సర్ప జన్మమో వస్తుంది."

"అవును పాపం—చూడు తలమీద బుట్టలు బోర్లించుకొన్నారు. మెడకు గుడ్డ పేలికలు చుట్టబెట్టుకొన్నారు. కళ్లకు గంతలు కట్టుకొన్నారు. కాళ్లకు డెక్కలు తగిలించు కొన్నారు......"

"తోడిజంతువులు నవ్వుతారనేనా లేదు వీళ్లకి—"

"వాళ్ల దగ్గిరగా వెళ్లకూడదు. వాళ్ల కళ్లు మంచివి కావు............"

ఈవిధంగా సంభాషణ వెడుతోంది. నా స్నేహితుణ్ణి ఆపి అన్నానుగదా, "పూర్వ కాలాల్లో పక్షిదంపతులు రాచకొమార్తెలనుగురించీ రాజకొమాళ్లనుగురించీ మాట్లాడు కొంటూ ఉండేవిట—ఈకాలంలో ఈవిధంగా మారాయేమి? మళ్లీ జాగ్రత్తగా విను— మన యువరాజుగారి పెళ్లినిగురించి కాని మన మంత్రిగారి కుమారుడి పెళ్లినిగురించి గాని మాట్లాడుతాయేమో."

మా స్నేహితుడు వినాలని మళ్లీ మనస్సు నేకాగ్రము చేసుకొంటూండగా అవి ఎగిరిపోయాయి.

ఈవిధంగానే తమకు బలిభుక్కులని పేరుపెట్టిన్నీ మనుష్యులు తమకు బలులు వేయడం లేదని కాకులు అడ్డమైన తిట్లూ తిడుతూన్నట్లు ఒకమాటు నాస్నేహితుడు చెప్పాడు.

వినోదంగా కొంతకాలం ఈమాదిరిగా కాలక్షేపం చేశాము. ఒకనాటిసాయంకాలం నా స్నేహితుడు మాయింటికి పరుగెత్తుకు వచ్చి—"లే, లే, వెడదాం, రా, చప్పున— కండువా వేసుకో."

"ఏమంత తొందర" అన్నాను.

"టైము లేదు. రావాలి, రావాలి చప్పున" అన్నాడు.

"ఏమిటి సంగతి?"

"దోమల సభ."

"అంటే?"

"నీకు మతిగానే పోయిందా ఏమిటి—ఇప్పుడు దోమలు సభ చేసుకొంటున్నాయి. రా, కాగితాలు, కలం తీసుకురా, వ్రాసుకొందువుగాని—"

"ఎక్కడ ఈ సభ?"

"దానవాయిగుంటలో."

"అక్కడ దోమ లుండవే. ఆరోగ్యకరంగా ఉండేతావుల్లో దోమలు సభ చేస్తవా?"

"అదే తమాషా—వాటికీ ఆరోగ్యకరంగా ఉన్న స్థలాలు కావాలిట—"

"ఈసంగతి నీ కెలా తెలిసింది?"

"రెండుదోమలు నా చెవిదగ్గిర చెప్పుకొంటూంటే విన్నాను."

ఇద్దరమూ బయల్దేరి వెళ్లాము దోమలసభకి.

## ౨

కుంటకు సమీపములో ఒకదోమలదండు ఎగురుతున్నది. చుట్టూ చెట్లు. ఆ ఎగరటంలో ఒకమోస్తరు శబ్దము పుడుతోంది. కుంటసమీపానికి వచ్చేటప్పటికి నా స్నేహితుడు "అయిపోతోంది, సభ, అయిపోతోంది" అన్నాడు.

"దోమ లింకా ఎగురుతూనే ఉన్నాయి" అన్నాను.

"ఎగురుతూనే అవి సభచేసుకోవడం" అన్నాడు. అని అక్కడ ఒకబండమీద కూర్చున్నాడు. కళ్లు మూసుకొన్నాడు. వింటూన్నట్లు అభినయిస్తూ "వ్రాసుకో"అన్నాడు. అతడు చెప్పగా నేను వ్రాసింది ఇదిగో. ఇందులో ఏమీ మార్పులు చెయ్యలేదు. చెప్పింది చెప్పినట్లు వ్రాశాను. ఇందలి నిజానిజాలు బుద్ధిమంతులే తేల్చుకోవాలి.

"సోదర సోదరీ మణులారా—పవిత్రమైన గౌతమీతీరాన్న జన్మించిన మనము తత్ప్రాంతములలోనే సభ చేసుకోక ఈ కుంటవద్ద సభచేసుకోవడం మీకు వింతగా తోచవచ్చు. మనలను తరతరములనుండీ పోషించిన గౌతమి నేడు మన ఉదాసీనతకు కారణముయిందని మనము విచారించవలసిఉన్నది. కాని యీ మార్పుకు బాధ్యులము మనము కాము. పవిత్రమైన గోదావరిని కలుషితము చేస్తున్నది మానవులు. తత్ఫలము ననుభవిస్తున్నది మనము. మానవరక్తమే ప్రధానాహారముగా గల మన మాతృప్రాంతములందలి మానవరక్తమును గ్రహించడమువల్ల రుజాపీడితుల మౌతున్నాము. ఆరోగ్యము చెడుతున్నది. అయితే దేశాంతరము పోరాదా అనే ప్రశ్న పుట్టవచ్చును.

"మన పూర్వులు సంపాదించిన ఈ క్షేత్రమును మనము నేడు కాదని విడిచి వెళ్లడము వివేకముకాదు. జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ అన్న పాతమాట సభ్యులకు కొత్తమాట కాదు. ఏ మహాక్షేత్రమును రాజరాజు, రెడ్డిప్రభువులు, నవాబులు పాలించి మన వంశమును పోషించారో, ఏ మహారాజ్యము చిరకాలమునుండియు ఆంధ్రత్వమునకు నిలయమై యున్నదో, ఏ పవిత్రభూమి శ్రీనాథాది మహాకవుల వాణి కాటపట్టయినదో అట్టి రాణ్మహేంద్రవరమును మన మెన్నటికైన విడిచిపోగలమా? ఒక్కమాట మరవవద్దని సభ్యులను నేను మరీమరీ వేడుకొంటున్నాను. మన పూర్వీకులను పోషించినది ఆంధ్రసామ్రాట్టయిన రాజరాజురక్తము. మన వంశమునకు ఆదిభిక్ష పెట్టింది ఆంధ్రకవితాపితయైన నన్నయ్యరుధిరము. మన కులమునకు ప్రాపుగా నిలిచినది కవిసార్వభౌముడైన శ్రీనాథుని నెత్తురు. నానావిధ భక్ష్యభోజ్యముల ననుభవించిన మహారాజుల, మహావీరుల, మహాకవుల, గాయకగ్రామణుల, పతివ్రతాతిలకముల రక్తమే—వారి ఆంధ్రరక్తమే నేడు మన నాళములలో ప్రవహించుచున్నది. ఈమాటలు తలుచుకొన్న ఏమశకశిఖామణి రక్తనాళ

ములు ఉబుకవు, ఉడుకెత్తవు; మరవకండి, సోదరసోదరీమణులారా, మరవకండి; మశక శేఖరులారా మరవకండి—మన మాంధ్రుల మన్నమాట మరవకండి. ఆంధ్రరక్తము మన నాళములలో ప్రవహించుచున్న దన్నమాట మరవకండి. ఆనాడు ఆంధ్రశత్రువుల రక్తము ఆంధ్రవీరుల కరవాలములతోపాటు త్రాగినది మన తొండములే. ఉత్కళరక్తమును చవి చూచితిమి. యవనరక్తమును త్రాగితిమి. ఆంగ్లరుధిరమును రుచిచూచితిమి. అరవ రక్తమును పానమొనరించితిమి. వలందులరక్త మెట్టిరుచికలదో గ్రహించితిమి. ఆంధ్ర సామ్రాజ్యస్థాపనకు, తద్వ్యాప్తికి, స్థిరత్వమునకు మనమున్నూ కారణ మన్నమాట మరవ కండి. ఆంధ్రతటాకములు మన కాటపట్టులు; ఆంధ్రగిరులు మనకు విహారసీమలు. ఆంధ్రులు మన భోజనంబులు. వంశపారంపర్యముగా వస్తూఉన్న ఇట్టి హక్కులను వదలి స్థానభ్రష్టుల మైపోవుటకు మీరు ఇష్టపడుదురా? ఆంధ్ర-దోమలారా! ఒక విన్నపము. భగవదనుగ్రహామువల్ల మన వంశము నాడునాటికి వృద్ధిచెందుచున్నది. చల్లనిరాజులు మన దేశమును పాలిస్తున్నారు. మనపట్ల గౌరవాభిమానములుగల మన ఆంధ్రమానవ సోదరులు మన పట్టణమునకు పాలనకర్తలై ఉన్నారు. మన వంశాభివృద్ధికి కారణభూతు లైన వారిపట్ల మనము కృతజ్ఞులమై ఉండవలెను. కిందటి జనాభాలెక్కలతో పోల్చి చూడగా నేడు మన జనసంఖ్య నూటికి వెయ్యిరెట్లు పెరిగినట్లు తేలుతున్నది. ఈవృద్ధికి మనము సంతోషించవలసినదే కాని ఒక ప్రమాదముమాత్రము సంభవించుచున్నది. మన జనసంఖ్య యింతగా పెరగడమువల్ల మనకు తగినంత ఆహారము దొరకడములేదు. అంతే కాకుండా ఈకాలపు మానవరక్తము తగినంత ఆరోగ్యకరముగా ఉండకపోవడము ఒక కారణం. దురాచారములకు లోనైన నేటి మానవులు తమ రక్తము మనకు సరిపడడము లేదనిన్నీ రోగకారణ మగుచున్నదనిన్నీ గ్రహిస్తే బాగుండును. పురపాలకు లీ విషయము గ్రహింతురుగాక. ఇక మన కాహారము సరిపోకపోవడానికి కారణ మేమై ఉంటుందని శాస్త్రజ్ఞు లాలోచించగా తేలిన విషయం ఏమంటే—మానవుల జనసంఖ్య తగ్గుచున్నదట. అందుకు కారణము వారు సంతాననిరోధమును కొన్ని ఉపకరణములద్వారా చేసుకొం టున్నారట. ఈవిధముగా వారి జనసంఖ్య తగ్గి మన జనసంఖ్య పెరుగుతూ ఉన్నట్లయితే కొంతకాలానికి మనకు కూడు దొరకదేమో ననే భయము కలుగుతున్నది. కాబట్టి పెద్దల అనుమతిని నేను యువతీయువకులకు ఒక సలహా ఇస్తున్నాను. మానవుల మార్గమును మనమున్నూ అవలంబించి సంతాననిరోధమునకు ప్రయత్నిస్తే బాగుంటుందేమో ఆలోచిం చండి. ('కూడదు, కూడదు' అని కేకలు.) తరువాత తమ చిత్తము.

"పైని నేను చెప్పిన వాక్యములవల్ల మనము మానవులపట్ల ఎంత అభిమానము వహించియున్నామో అందరికీ విదితమే. ఎంతటి ఆంధ్రాభిమానులమో ఎల్లరకూ

సుగమ్యమే. ఇట్టి అభిమానపూరితులమైన మనయెడల మానవులు కృతజ్ఞులై ఉండవలెను గదా! మనలను సోదరసోదరీ భావముతో చూచుకొనవలెను గదా! ఆంధ్రజనని గర్భోద్భవులమైన మనమున్నూ మానవులున్నూ ఏకోదరులవలె మెలగవలెను గదా. కాని అట్లు జరుగుచున్నదా? లేదు. ఇందు కెవరు కారణం? మన మెంతమాత్రమూ కాదని మన యంతరాత్మ మనకు బోధించుచున్నది. మానవులపై ఆధారపడి బ్రదుకవలసిన మన మెన్నడైన మానవులయెడ కృతఘ్నభావము వహించి ఉండగలమా? లేము. కాబట్టి యిట్టి స్థితికి కారణభూతులైన మానవుల నేమనవలెను? వారు కృతఘ్నులు కారా? అవివేకులు గారా? వారిని పోషించే ఆంధ్రగౌతమీనది మనలను పోషించుచున్నది గదా! వారిపై ప్రసరించే ఆంధ్రవాయువులు మనపైనిన్నీ ప్రసరిస్తున్నవి కదా! వారి అస్థికల గర్భస్థము చేసుకొనుచున్న ఆంధ్రభూమి మన కళేబరములనుకూడ గ్రహిస్తున్నది కదా? వారికి ఛాందినీయమైన ఆంధ్రాకాశమే గదా మనకున్నూ మేలుకట్టై ఉన్నది. వారిపై తన కిరణముల ప్రసరించు ఆంధ్రసూర్యుడే గదా మనలనుకూడ తనకిరణములలో ముంచుతున్నాడు! వారి రాజులే గదా మన రాజులున్నూ; వారి మహాకవులే గదా మన మహాకవులున్నూ; వారి కళాప్రవీణులేగదా మన కళాప్రవీణులున్నూ!

"ఈ సంగతి మానవులు గ్రహించారా? లేదు. సరి గదా మనలను వారి శత్రుకోటిలో చేర్చి అంతరింపజేయడమునకు ప్రయత్నిస్తున్నారు. ('సిగ్గు, సిగ్గు' అని కేకలు.) మనవలన వారికి కొత్తజబ్బులు పుట్టుతున్నవట—మలేరియాకు మనమే కారణమట; బోదకాళ్లకు మనమే కారణమట. ఇంకా ఏమేమో జబ్బులకు మనమే కారణమట—రాజరాజుకాలములో ఎన్నడైన ఇట్టిమాట పుట్టినదా? శ్రీనాథు డెన్నడైన యిట్టి యసత్యముల వక్కాణించియున్నాడా? పోతనమహానుభావు డెన్నడైన యిట్టి అవాచ్యముల పల్కియున్నాడా? కృష్ణదేవరాయలనాడైన యిట్టి కింవదంతి పుట్టినదా? విన్నారా సోదరసోదరీమణులారా! నా అనుంగు ఆంధ్ర-దోమలారా! మానవులు మనపై పెద్దపెద్ద పుస్తకములు వ్రాసినారు! మన చిత్తరువులను అచ్చొత్తినారు! మనలను చంపు ఉపాయములను కనిపెట్టి ప్రచారము చేస్తున్నారు! ఇట్టి సందర్భములలో మనము చేతులు కట్టుకొని రెక్కలు ముడుచుకొని కూర్చొనవలసినదేనా? చేతగానివాళ్ల మనిపించుకోవలసినదేనా? ఆంధ్రరక్తము మీ నాళములలో ప్రవహించడములేదా! గతించిన ఆంధ్రవీరుల ప్రతాపము మీ స్మృతికి తగలకములేదా! మానవరక్తపానము మన జన్మహక్కు గాదా; భగవంతుని ఉద్దేశ మేమి? మనల నెందుకు పుట్టిస్త? మొదట మానవులను పుట్టించి వారి రక్తము త్రాగి బ్రదకమని భగవంతుడు మనలను తరువాత పుట్టించియున్నాడు గదా? ఇట్టి జన్మ

హక్కును మనము వదలుకోగలమా? భగవదాదేశమునకు వ్యతిరేకముగా నడుచుకోగలమా? స్వామిద్రోహమున కొడిగట్టగలమా? దేశద్రోహము చేయగలమా?

"ఆప్తులారా! ఈసందర్భమున మీకో సంగతి జ్ఞాపకముచేస్తున్నాను. మన మూల పురుషులు పూర్వము అడవులలో సంచరించేవారు. తృణకాష్ఠజలసమృద్ధిగల ఆస్థలములలో వారు సుఖముగా దైవచింతలలో మునిగి ఉంటూండగా ఈ మానవులే వారిని పట్టణవాసమునకు రమ్మని ఆహ్వానము చేశారు! అమాయకులైన మన పూర్వులు వారి మాటలు మన్నించి పట్టణములలో కాపుర మేర్పాటు చేసుకొన్నారు. ఇప్పుడు, యిన్ని యుగములు గడచినతర్వాత ఈ మానవులు మనలను చంపుటకు—హత్య చేయుటకు ప్రయత్నిస్తున్నారు. చూచారా ఎంత కృతఘ్నులో?

"వాదముకొరకు వారికి మనవల్ల జబ్బులు వస్తున్న వనేసంగతి ఒప్పుకొందాము. వారిలో కొందరిమరణమునకు మనమే కారణ మన్నమాట అంగీకరింతాము. అయితే ఆతప్పుకు ఇట్టిశిక్షలా విధించడం? మన వంశక్షయము చేయడమునకు మానవుడు పూనుకొంటాడా? మనలను ఆబాలవృద్ధము అంతరింపజేస్తాడా? ఇది న్యాయమేనా? ఈ మానవుడు మనల నెంతటి చేతగానివారిక్రింద కట్టివేసినాడు? మనలో వీర్యము చచ్చిన దనుకొంటున్నాడు కాబోలు! మన పరాక్రమ మంతరించిం దనుకొంటున్నాడు కాబోలు! మనలో ఆంధ్రత్వము ఇంకిపోయిం దనుకొంటున్నాడు కాబోలు!

"కడుపుకక్కుర్తికి మనము మానవరక్తము త్రాగుతున్నా మన్నమాట మరవకండి. అది భగవదుద్దిష్టము కాకపోతే మన కీతుచ్ఛరక్తము కానలసివచ్చునా? ఈ మానవులే నా మహా రక్తముతో నిండినవారు? ఎందరు లేరు. కాని మనము భగవంతుని ఉద్దేశమునకు భిన్నముగా నడుచుకోలేము.

"ఇట్టి చిన్నతప్పుకు—నిజముగా తప్పు కాదు, మన జన్మహక్కే—మనలను మారణహోమము చేయదలచాడే మానవుడు! ఈ మానవుడిని ఏమి చేయవలసింది చూడండి అతడు చేసే తప్పులకు? నిష్కారణముగా ఏ కపటమూ ఎరుగని తియ్యటి పక్షులను అతడు ఇష్టము వచ్చినట్లు చంపుతున్నాడే! దీని కేమిశిక్ష? అడవులలో సంచరిస్తూ తమ బ్రదుకు తాము బ్రదికే అనపరాధులైన మృగములను వధిస్తున్నాడే! దీని కేమిశిక్ష? తనపిల్లలతోపాటు తాను సాకి, పిమ్మట పక్షులను, మేకలను, గొర్రెలను పీకలు కోసి తింటున్నాడే! దీని కేమిశిక్ష? భగవంతునిసృష్టికి కళంకప్రాయుడై ఉన్నాడే! భగవంతుని శాసనములను బ్రద్దలు కొడుతున్నాడే! దీని కేమిశిక్ష? భగవంతుడు లేడూ? న్యాయాన్యాయ పరిపాలనము చెయ్యడూ?

"కాని సోదర సోదరీమణులారా! ఒక్కవిషయము మనవి చేస్తున్నాను. అది గుడ్డిలో మెల్ల. మనపై కత్తికట్టి మనలను సంహరించవలెనని పూనుకొన్నమానవుడు పుస్తకములు వ్రాయడముతోనూ, మన బొమ్మలు అచ్చొత్తించి ప్రదర్శించడముతోనూ, మనలను చంపే ఔషధములట—వాటిని కనిపెట్టడముతోనూ తృప్తిజెంది ఊరుకొన్నాడు. ఇది మనము సంతోషించదగ్గ విషయం. ఇందుకు మనము మానవులయెడ కించిత్తు కృతజ్ఞులమై ఉండవలెను. మానవు డెంత వాక్శూరుడో అంత కార్యశూరుడూ ఖడ్గశూరుడూ అయి ఉన్నట్లయితే మనకు నిలవ నీడ లేకుండా ఉండేది. కాని మన అదృష్టమువల్లను భగవదనుగ్రహమువల్లను అత డట్టివాడు కాడు. అందువల్ల మన కంతగా ప్రమాదము లేదు. ఆలోచించగా నాకు తోచినవిషయం ఏమిటంటే—ఈ మానవుడు బదుకుతెరువు కోసమని ఈపుస్తకాలు రాసుకొంటున్నాడే కాని నిజముగా మనపై ద్వేషభావము కలిగి కాదు! చూడండి ఎంత మంది మనపేరు చెప్పుకు బతుకుతున్నారో! పుస్తకాలు రాసేవాళ్లు, బొమ్మలు చెక్కేవాళ్లు, అచ్చువేసేవాళ్లు, సినిమాలవాళ్లు, మాజిక్‌లాంతర్లవాళ్లు, ఆసుపత్రులవాళ్లు, ఆరోగ్యశాఖవాళ్లు, ఉపాధ్యాయులు, ఉపన్యాసకులు! ఇంతమందికి మనము జీవనాధారము కల్పిస్తున్నందుకు మనము గర్వపడవలెను; మానవులు మనయెడల కృతజ్ఞత చూపవలెను.

"పులిమీద పుట్ర అన్నట్లు ఈమధ్య ఆరోగ్యవారములంటూ లేవనెత్తి ఈమానవులు మనలను నిందించడం మొదలుపెట్టారు. మన వంశనిర్మూలనము లక్ష్యముగా పెట్టుకొన్నట్లు ఉపన్యసించారు. ఇందువల్ల మనకేమి ప్రమాదము సంభవిస్తుందో అని చాలాభయపడ్డాము. కాని క్రియకు వచ్చేసరికి ఆరోగ్యవారోత్సవాలన్నీ ఉపన్యాసములతో అంతరించాయి. విందులతో సమాప్తమయ్యేయి. ఇట్టి ఆరోగ్యవారోత్సవాలలో మనమున్నూ హృదయపూర్వకముగా వారికి సాయపడి నిర్విఘ్నముగా అవి జరిగేటట్లు ముందుముందు చేయవలెను. ఇట్టి ఆరోగ్యవారములు నిరంతరమూ జరపగలందులకై ఈసభతరఫున మానవులను నేను ప్రార్థిస్తున్నాను. అరవ ఉద్యోగస్థులు వచ్చి ఆరోగ్యవార సందర్భమున మనలను పారదోలవలెనని ఉపన్యాసము లిస్తూన్నట్లు తెలియుచున్నది. అరవవారి ఉపన్యాసాలకు బెదిరి పారిపోయే దుస్థితి యింకా ఆంధ్ర-దోమలకు పట్టలేదని మనవి చేసుకొంటున్నాను.

"సోదర సోదరీమణులారా! ఒక ముఖ్యవిషయమును గురించి నేను మీకు యింకను మనవిచేయవలసి ఉన్నది. మనము చిరకాలమునుండి పట్టణములో, అనగా పాతఊళ్లో, కాపురమున్నాము. కాని మానవజన సమ్మర్దముచేతనూ ఆరోగ్యకరమైన మానవరక్తము మనకు దొరకనందువల్లనూ మనలో కొందరము ముఖ్యముగా ఆరోగ్యముకొరకై ఇన్నీసుపేట వలసపోయినాము. అక్కడకూడ పరిస్థితులు చెడినవి. అనారోగ్యము హెచ్చుతున్నది. వంశక్షేమము ప్రధానము కాబట్టి మనము—అధమపక్షము కొందరమైనను

వేరొకచోటికి వలసపోవలసిన అవసరము గోచరించుచున్నది. ఆర్యాపురమూ, వీరభద్ర పురమూ, మన మిప్పుడు సభ చేసిన దానవాయిగుంటా వాసయోగ్యములని వింటున్నాను. తీరా ఆరోగ్యము చెడ్డతరవాత చేసేదేమిన్నీ లేదు కాబట్టి ఇప్పుడే జాగ్రత్తపడడము మంచిది. శరీర మాద్యం ఖలు ధర్మసాధన మ్మని గదా పెద్దలు చెబుతారు .................. ..

........................................................................................

అరుగో, అరుగో, మానవులు; చుట్టుకోండి, వాలండి, పొడవండి, తాగండి రక్తం......"

నాస్నేహితుడు తటాలున లేచి "రా, రా, పారిపోదాం రా! మన్ని చూచాయి ఈ దోమలు. ఇక్కడనిలిస్తే బతకనివ్వవు. రా, రా" అంటూ నన్ను లాక్కుపోయాడు. ఈ లోపుగానే వందలాది దోమలు మామీాద పడి చెవ కుట్టాయి. బతుకు జీవుడా అంటూ ఏలాగైతే నేమి యింటిలో వచ్చి పడ్డాము.

నాస్నేహితుడు ఎవరో తెలుసుకోవాలని పాఠకులు పరిశోధనలు చెయ్యవచ్చు. అతగాడిపేరు చెప్పడానికి వీలులేదు. కాని అత డింకా యోగాభ్యాసం చేస్తూనే ఉన్నాడు. జంతుహృదయాలు తెలుసుకొంటూ ఉన్నాడు. అత డిప్పుడు నెల్లూరులో ఉన్నాడు. సాయంకాలాల్లో పెన్నఒడ్డున షికారుచేస్తూఉంటాడు. చేపల సంభాషణ తెలుసుకోవడానికి ప్రయత్నిస్తూన్నట్లు మొన్ననే ఉత్తరం వ్రాశాడు. పర్యవసానం ఇంకా తెలియలేదు. ఇప్పటి కింతటితో సరి.

తాజాకలం—చివరకు దోమలసభ ఏమైనదో, అవి ఎట్టి తీర్మానాలు చేసుకొన్నాయో తెలియదు. కాని దేశములో దోమలబాధ మాత్రం ఎక్కువైనది.

# కళ : నీతి

## (సాహిత్య గోష్ఠి)

ఉభయభాషాప్రవీణ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

" నారీస్తన భర నాభీదేశం
దృష్ట్వా మాగా మోహావేశమ్ "

అని శంకరాచార్యుడు ఢంకా కొడితే,

" త్యాజ్యం సుఖం విషయసంగమజన్మ పుంసా
దుఃఖోపసృష్ట మితి మూర్ఖవిచార ణైషా "

అని రసికావతంసుడు దేవదత్తం పూరించాడు. ఇద్దరూ ఎదుర్కొన్నది ధర్మక్షేత్రమైన కురుక్షేత్రం. ఈ దాయాదుల పరమప్రాప్యం, పరనిర్వృతి.

వాఙ్మయం అంతా ఒక మహాస్రోతస్విని అనుకుంటే అది మందాకినివలె మూడు పాయలుగా చీలి సాహిత్యసముద్రంలో పడుతున్నది.

మొదటిపాయ ప్రభుసమ్మితమైన వేదం. బహు_ఒడ్డుఒరమయినది. రెండవది సుహృత్సమ్మితమైన పురాణపరంపర—స్నేహితుని హృదయంవలె సమరుచికలది. మూడవ పాయ (సత్)కావ్యశ్రేణి : విలాసిని కడగంటిచూపువలె రసికహృదయమును కరచి రసీభవించి వ్యంగ్యంగా కర్తవ్యమునకు త్రిప్పునయక్షిణి.

అసలు ఆర్యహృదయం—

"యా న్యనవద్యాని కర్మాణి, తాని కర్తవ్యాని—నో ఇతరాణి."
"యా న్యస్మాకం సుచరితాని, తాని త్వయా కార్యాణి—నో ఇతరాణి."

ఈతత్వం ప్రతి భారతీయ ప్రముఖుని నెత్తురుబొట్టులోనూ కదలాడుతుంది—మంచుగడ్డల దెబ్బలు తిని చల్లారకపోతే.

ఈ మేలుబంతిని ప్రతి భారతవిజ్ఞుడు శిరసావహిస్తాడు.

తత్వజ్ఞులందరిదీ ఒకమతం—రసజ్ఞులందరిదీ ఒకమతం—ఉభయులూ ఆనందోపాసకులే—కాని సాధన వేరు.

1 . ౧ ఆనందో బ్రహ్మేతి వ్యజానీయాత్
  ౨ రసో వై సః—
2 ౧ వాక్యం రసాత్మకం కావ్యమ్
  ౨ విశ్వశ్రేయః కావ్యమ్.

ప్రథమశ్రేణివారి సాధ్యం బ్రహ్మజ్ఞానం. సాధన వైరాగ్యం—యోగాభ్యాసం. రెండవతెగవారి సాధ్యం రసానందం — తద్ద్వారా, విశ్వశ్రేయస్సు. సాధన సౌందర్యోపాసన—విభావానుభావ సామగ్రి.

మొదటితెగవారి దృష్టిలో రెండవపీఠస్థుల ప్రవృత్తి కేవలం లాలస—అజ్ఞానం. రెండవతెగవారి చూపులో ప్రథమశ్రేణి అంతా ఉట్టి బైరాగిజట్టు — అరసికమైన 'చాదస్తపు'గోల. కావ్యేంగితం యెరిగి కావ్యపరమార్థం గుర్తించి మీమాంసచేసినవారు సాహిత్యాచార్యులు. శిల్పానికి నికషం ఆనందపారవశ్యం. ఆప్రాప్తికి వారి ప్రవృత్తిఅంతా ఏకైకమై నిలుస్తుంది. అందుకోసం వారు ఎన్ని తెన్నులో తొక్కి ఎన్ని అన్వేషణలో చేసి పరమావధికి వచ్చారు. వారి సాధన పరంపరను జాగరూకులై గమనించుకుంటూ పోతేనే వారిలక్ష్యం కరబదరసమానంగా గోచరించుతుంది.

కావ్యసిద్ధిలో ధర్మానికి గాని నీతికి గాని పరోక్షంగానైనా ప్రత్యక్షంగానైనా సంబంధం ఉన్నదా—లేదా? మన తత్వాన్నిబట్టి ఈజిజ్ఞాసకు సమన్వయం యెట్లా అనేది ప్రకృత విమర్శకు మూలకందం.

అలంకారశాస్త్రంలో పరకీయ ఒకనాయిక.

"ఈ పతమున స్వీయాన్యా
సామాన్య లనంగ గలరు సతులు— "
"అన్య యనగ నన్యోఢయు—"

నరస.—1 ప్ర.

అని వివృతి. విద్యానాథుని ప్రతాపరుద్రీయంలో అన్యోఢ లేకపోయినా అభిసారిక ఉన్నది.

"కాంతాభిసరణోద్యుక్తా స్మరార్తా సాభిసారికా."

ఇంకొక ఆలంకారికుని అభిసారిక

"మల్లికామాల్యధారిణ్యాః సర్వాంగీణార్ద్రచందనాః
క్షామవత్యో న లక్ష్యంతే జ్యోత్స్నాయా మభిసారికాః."

నాయికానాయకులను సంఘటించే జట్లు ఉన్నవి. వీరిని సహాయు లంటారు. తాను అగ్నిసాక్షిగా పెద్దలయెదుట తాళికట్టి భార్యగా తీసికొన్న ఆమె స్వీయ.

"త్రపాసామగ్రీకోమలకమనీయ స్వీయ."

ఈమెయందే విషయోపభోగములు అనుభవించి పురుషార్థములు సాధించడం పరమధర్మం. ఉత్తములందరూ హర్షించేపని. కాని పరమరసికుల దృష్టిలో ఇది ఉట్టి దేశవాళీ సరుకు— దినచర్య. చూడండి వారిమాటలు—

'తదేవ సుచరితం కృచ్ఛ్రాల్లబ్ధం యదన్యదారేషు.'
'తలపవ కులాంగనారతి సుతప్రదము.'

(సుఖ— కాదు.)

శాస్త్రకారుడు ప్రకృతి చీల్చి చూపుతాడు. ఏవిషయము నుద్దేశించిన శాస్త్రం ఆవిషయమును అణువుఅణువునా అన్వేషిస్తుంది.

సాహిత్యాచార్యుని పరమలక్ష్యం రససిద్ధి. రసనిష్పత్తికి ఉపకరించే సామగ్రినంతా అతడు తనశాస్త్రంలో కూర్చుకొని వివరిస్తాడు.

నాయికానాయకులూ,వారికి పరస్పరమూ ఉత్కటమయినప్రేమ; ప్రేమసూచనలు, వారిహృదయములను ఉద్దీపింపజేసే వెన్నెల—పువ్వులు—చల్లనిగాలి శృంగారరససిద్ధికి సామగ్రి. అని చెప్పి రసాలంబులగు ప్రేమికుల తరగతులను స్పష్టపరచడంలో అతని పని తీరిపోయింది. దినదినమూ చూచే స్వీయయందూ, సర్వసాధారణ అయిన సామాన్య యందూ ఉండే రతికంటె, కష్టలబ్ధమూ ఉత్కటమూ అయిన పరకీయారతి ఎన్నోరెట్లు రసస్ఫూర్తికి తోడుపడుతుంది కనక ఈమెను నాయికగా పరిగణించడంలో సాహిత్యవేత్త కస్వాభావికత్వం తోచదు. ఆదృష్టితోనే సహాయులనుగూడా చెప్పక తీరదనుకున్నాడు.

అయితే సాహిత్యాచార్యునిదృష్టి ఎట్లాంటిది? తనకు మేలుబంతులయిన దివ్య సూత్రములను మరచిపోయినాడా? లేక తనప్రవృత్తినంతటినీ ఒక కొత్తలోకంలోకి తీసుకుపోయి ప్రజ్వలిస్తున్నాడా? ఆలోచించవలసిందే.

"కావ్యాలాపాంశ్చ వర్జయేత్"—అసలు కావ్యాలు చదవడమే మానుకోండి, ఆరోగ్యంగా ఉంటుం దన్నారు కొందరు. ఈ బాదరబందీ పడలేక, ఈమాటతో సహృదయుని వెన్నెముక విరిగినట్టయి, 'ఆగవయ్యా—కావ్యాలు రెండు రకాలు; సత్కావ్యాని కుండే ఉన్నతలక్ష్యాలు, పరనిర్వృతి, శివేతరక్షతి, యశస్సు ఆదిగా ఎన్నో ఉన్నవి. నీ వన్నమాట అసత్కావ్యానికి చెందనీ—దానిలో ఎంత నిర్వృతి ఉన్నా, ఎన్నో దోషాలవల్ల అది సహృదయసేవ్యం కాకపోడం న్యాయ్యమే' అన్నాడు తిరగబడి.

విద్యానాథుని మాటలను వివరిస్తూ కుమారస్వామిసోమపీథి అన్నాడు: అకర్తవ్యములగు పారదారికాది వృత్తులయందు అకుతుకి అవడంకూడా కావ్యప్రయోజనమే అని. అవతారికయందు ధర్మోపన్యాసం ఇచ్చిన విద్యానాథుడే నాయికాప్రకరణంలో అభిసారికను చెప్పాడు. అయితే అతని తాత్పర్యం?

సాహిత్యవేత్త కావ్యానికి నిర్వచించేది ఆనందపారవశ్యమూ రసస్ఫూర్తీ అయినప్పటికీ ఔచిత్యతత్వాన్ననుసరించి సూక్ష్మాతిసూక్ష్మంగా నీతితో సంబంధం పెట్టాడు.

కావ్యంలో నీతి ఉండాలనే నిర్ణయం యెంతమాత్రం లేదు. కాని అవినీతిని అనౌచిత్యమునూ ఆటంకపరచకపోతే ఉత్కృష్టానందమూ, విశ్వశ్రేయస్సూ చెడిపోతాయి. ఆర్యత్వం చెడి ఆత్మహత్య అవుతుంది. కాబట్టి శాస్త్రత్వసిద్ధికి పరకీయనూ, అభిసారికను, సహాయులను చెప్పాడు కాని వారిని నాయికలుగా ఉత్తమకావ్యాలలో వర్ణించమని కాదు. కానినాడు స్వవచోవ్యాఘాతం అతని తలమీద పడుతుంది.

సంస్కృతసాహిత్యం పరీక్షించి చూస్తే పరకీయ నాయికగా ఉన్న కావ్యం యేదన్నా కనిపిస్తుందేమో చూడండి. వసంతసేన స్వీయవంటిదే కనక సామాన్య నాయికగా గూడ యేదీ కావ్యం దొరకదన్నమాట. ఇక పాంథపంచకాదికంలోనూ, 'భ్రమధార్మిక'ాదులలోనూ పరకీయాప్రవృత్తిని వర్ణించడమూ, కాళిదాసు "యోషితాం తత్ర నక్తం! సౌదామిన్యా కనకనికషస్నిగ్ధయా దర్శ యోర్వీం" అని అభిసారికారీతిని చమత్కరించడమూ, వినోదమాత్రంగా పర్యవసిస్తాయి.

ఆంధ్రవాఙ్మయంలో నేటికిగూడా సాహిత్యమీమాంసలు బాగా విచ్చుకోలేదు. ఉన్న రెండైనా అనువాదములై ఆంధ్రత్వమును తడవుకొనలేకపోయినందువల్ల ఆంధ్ర సాహిత్యం తెన్ను పెరుగు వడ్లూ కలబోసినట్లు అబోధోపహతం అయింది. ఏ విప్రతిపత్తి కలిగినా సంస్కృతమే శరణ్యం. ప్రాజ్ఞుడు తన జిజ్ఞాసను ఉన్నత సంస్కృతసాహిత్యాన్ని బట్టి సమన్వయపరచుకొని తెనుగులో రచన సాగించాడు. కొంతవరకూ అట్లా జరిగిన తరువాత కాలాన్నిబట్టీ, ప్రభువులనుబట్టీ, తనచుట్టూ ఉన్న అభిరుచినిబట్టీ, తనకు తెలియకుండా మారిపోయి ఒకవింత ప్రకృతిలో పడిపోయాడు. 'దేన్ని ఏపరముగా అర్థముచెప్పుకొన్నా' అతని ఉత్కృష్టరచనలకు ఆనందించాం, నికృష్టరచనలకు నిరసించాం.

తెలుగులో సగంమంది కవుల చేతులలోని శృంగారం ఒళ్లు తెలియని లౌల్యవృత్తి. అసభ్యసన్నిపాతం. శుద్ధిచేయని పాదరసం ఎలా కొంప తీస్తుందో, పరిపక్వం కాని శృంగారం అలా రోత పుట్టిస్తుంది.

నీతికి కళాపరమైన ఒకకొత్తపేరు ఔచిత్యం. "అనౌచిత్యా దృతే నాన్య ద్రసభంగస్య కారణం" అని క్షేమేంద్రుడు. సభ్యతచెడిన యేకళావిలసనమునూ సహృదయుడు మెచ్చుకోలేడు. ఔచిత్యంలేని రసన్నివేశమూ, శిల్పమూ, అసభ్యనగ్నమూర్తి.

అట్టి కళనుండి పుట్టేది ఆనందము కాక ఆనందాభాస మాత్రమే అవుతుంది. ఇట్టిది భావుకుని హృదయంలో వెగటు పుట్టించి నీరసంగా పర్యవసిస్తుంది. 'సనాతనరసజ్ఞు' లెవరూ సభ్యతను త్రొక్కిన కళకు గౌరవం ఇవ్వలేదు. వారి మతమును సమన్వయ పరచుకొనలేక,

కళకూ నీతికీ సంబంధం లేదు, కనక కేవలం కళకు (ఔచిత్యం కోల్పోయినా) పూజ జరగాలనడం అవివేకం. సహృదయహృదయోద్వేజకములగు దోషము లెప్పుడూ కళాప కర్షకములే అవుతవి. ఔచిత్యోపస్కృతమగు కళయే ఆనందపారవశ్యమును కూర్చి కళా శీలి తపస్సునకు సిద్ధిగా సాక్షాత్కరిస్తుంది.

అయితే శ్రీమద్భాగవతమున పరకీయలగు గోపికలతో శ్రీకృష్ణుని వివిధ శృంగార క్రీడలు వర్ణితములైనవి. ఉదాహరణం: వస్త్రాపహరణం. కళకు కావలసిన, మృదు త్వము చెడి కొంచెం 'అతి' కనిపించినా దానిని కావ్యమే అంటున్నాం.

తారాశశాంకవిజయంలోదీ పరకీయావృత్తాంతమే. కాని దానిని అసత్కావ్యం అంటున్నాం, ఇందులో కొంచెం కళానందం ఉన్నా. దీని కేమంటారు? అనవచ్చు.

ఋషి శ్రీకృష్ణున కిచ్చిన దివ్యత్వంవలన అతని క్రీడలలో మనకు ఏదో పరమార్థం తట్టి అందలి సన్నివేశాలు అప్పుడప్పుడు వెగటు గొల్పినా మనం ఓర్చుకొని రసమునే వెతు క్కుంటాం. మరీ సహించలేని చోట తెలుగుకవి శృంగారం అనుకుంటాం. దీనికి సమ న్వయం ఉన్నది.

ఇక తారాశశాంకవిజయాన్ని కళాపరంగా అన్వయిస్తా మనవచ్చు. కాని ఆయితి వృత్తం తలచుకొనేసరికే సహృదయుడు సహించడు. తనకు జ్ఞానజ్యోతి ప్రసాదించి, తన్ను ఎన్నోవిధాల ఆదరించిన గురువు భార్య తప్పుదారికి ఈడ్చిందే అనుకోండి—అంతట్లో ఇతని జ్ఞానం ఏమయింది? అని కథమీదే చాలా పేచీలు. కథ అల్లా ఉంచి కళనే చూడండి. కళను మలినపరిచే అసభ్యఘట్టాలు, అవినీత్యుపన్యాసాలు, నగ్నశృంగారం, రసదోషాలు చాలా ఉండడంచేత ఏవిధంగానూ దానిలో ఉత్కృష్టానందం లేదు. లాలసులు తప్ప సహృదయులు మెచ్చుకోలేరు. కావ్యము విశ్వశ్రేయస్సు అన్న ఆంధ్రతాతపాదుని శంఖ ధ్వని అంతరించిపోలేదు కదూ?—

పూర్వాంధ్రకవుల శృంగారశిల్పము బహువిధాల తరువాతవారి నందరినీ ఎన్నో తప్పుదారులకు నెట్టింది. అప్పటి రాజులూ, రాజుల ననుసరించిన ప్రజలూ, వారి రచనల నట్లా మలినపరచి తెలుగు సారస్వతమునకు ఒకవైపు మాయనిమచ్చ తెచ్చిపెట్టారు. దానికి చాలా సిగ్గుపడుతూ ఆధునికాంధ్రరచయితలు నిజమైన కళాస్వరూపమును గుర్తించి స్వల్పంగానైనా చేస్తూన్న దివ్యరచనలకు సహృదయుడు స్వాగతమిస్తాడు. కాని అతు క్కోని పాశ్చాత్యముద్రలు వేసుకొని ఆర్యసాహిత్యములను వికృతపరచి అవకరపురచనల చేయడం ఆత్మవినాశకమూ, అపహాస్యభాజకమూమాత్రమే. ఎరువుసొమ్ము లెప్పుడూ

బరువుచేశే, బసవరాజు అన్నట్టు. పూర్వులను ఆక్షేపించి మనం ఆంధ్రసారస్వతానికి చేసిన మహోపకారం ఏమీ ఉండదు. ఇంక ఎవరినో చూసి మనం తెచ్చిపెట్టుకున్న వికారాలన్నీ సనాతనరసజ్ఞులకు సమ్మతం అనడం వట్టి దబాయింపు.

శిల్పికి ఛాందసునకూ ఎప్పుడూ పడదు. ఛాందసుని శుష్కధర్మముల నెప్పుడూ కళాశీలి ఎదురుకొంటూనే ఉంటాడు. ఇంక సఖ్యపడవలసినది, సహృదయునితో— అతడు కళనుండి కాంక్షించేది విగళితవేద్యాంతరమైన ఆనంద పారవశ్యం. దానికి ఉపష్టంభకమైన ప్రత్యణువునూ తలదాల్చుకొంటాడు. అపకర్షకమైన దాని నల్లా ఖండిస్తాడు. నీతిమాట తలపెట్టకపోయినా అవినీతిని అడుగుపెట్టనీయడు. ఈ పరమార్థములో అతడు భక్తితో పూజించుకొనేది ఔచిత్యమును, తన సభ్యతనూ మాత్రమే. వీటికి ఏవిధంగా భంగం వచ్చి వెగటు పుట్టినా సహించడు.

# మృత్యువు

‘ చలం ’

## TO THE EDITOR, ‘*UDAYINI*’

My dear Editor,

....................Sad I have to hurry through. This is a tremendous effort I have made—to write this at all.......

This is the result of deep fearless thinking and earnest study of ideas in men and books and of a life that has gone beyond trivialities and conventions—the best of what I have achieved so far—of a sincere struggle to seek and understand. So it must meet with a response in thoughtful minds—in obedience to a mundane law—a law in art I have observed—unless what I have written is beyond the comprehension of many of your readers.

I know I will be misunderstood by the few that read—even in this serious attempt of mine—but let it be.

Thank you for the opportunity and impetus you gave for me to express myself and reach out a few other souls—whether they understand or misunderstand me.

I have attempted to materialise in persons and words a thought—an active principle, some form of which should exist, if this life and its aspirations have any meaning at all.

Indeed, I know, my God or his representative, argues like a Socrates, punishes like a third-class magistrate, preaches like a training school teacher, and quibbles like Venkatachalam the rebel-crank with all his pride and prejudices. There is obviously no help for it.

VENKATACHALAM

BEZWADA,
*28th May 1935*

*P.S.*—After reading the letter I see this could be put before my scenes, as an introduction. Is it vanity? Yes, my writing and your publishing is all vanity—pure and strong. Let it go.

*P.P.S.*—If you publish, publish the post script and even the post post script, in all justice to everybody concerned.

# మృత్యువు

## ఒకటో రంగం

చచ్చిపోయినవాళ్లు తేలేలోకం. పెద్దమైదానం. మెత్తనికాంతి సుందరంగా ప్రదేశాన్ని నింపుతోంది. ఆహ్లాదకరమైన గాలి మెల్లిగా, అనేక పరిమళాలతో వీస్తోంది. ప్రపంచంలోని అన్నిజాతులవారూ గుంపులు గుంపులుగా వెడుతున్నారు. ఒక దేశస్తులూ, భాషస్తులూ గుర్తించుకుని దగ్గిరికి చేరుకుంటున్నారు. అందరి మొహాలూ శాంతంగా ఆనందంగా వున్నాయి. ఆగాలిని పీలవడంవల్లనే, ఆకాంతిని చూడడంవల్లనే నూతనోత్సాహమూ, జ్ఞానమూ కలుగుతున్నట్టుగా వుంది.

[కాంతయ్య చాలా ముసలివాడు.]

కాంతయ్య:—ఏం నవ్వుతావు? ముసలివాణ్ణి అనా? నడు నాతో చూద్దాం.

[ప్రసాదరావు కుర్రాడు.]

ప్రసాదరావు:—కాదయ్యా, తాతా, వా జెవడో అదెదో భాషలో పలకరిస్తున్నాడు నన్ను.

కాంతయ్య:—చూడు, నిన్న మనిషి పట్టుకు లేవతీశాడు నన్ను. బతక న న్నారు. కాని ఆ శరభయ్య చివర మాత్ర అది ఒకటి గొంతులో వేశాడు. చూడు పిడుగులాగు ఎట్లా ఐనానో.

[చిట్టెమ్మ వితంతువు.]

చిట్టెమ్మ:—ఏమండోయ్. తెలుగు మాట్లాడుతున్నారు. చూడండి, మావాణ్ణి చూశారా, శీతయ్యని! వాడూ నేనూ కాశీకి బైలుదేరాం. దోవలో నాకు కలరా తగిలింది. కాశీవిశ్వేశ్వరుడికి, నాకు దర్శన మివ్వాలని వుంది గావును, ఆయన దయవల్ల బతికాను. భక్త పరాధీనుడు! కాని మావాడు కనపడడు కద! బాబూ, మీరూ కాశీకేనా!

కాంతయ్య:—(వుత్సాహంగా) కానీ, కాశీకే పోదాం! ఎక్కడికైతే నేం!

[సుశీల పసిపిల్ల యిటూ అటూ పరుగెత్తుతోంది.]

సుశీల:—అమ్మ. మంచి. అప్పచ్చి పెత్తింది. మందు. చేదు. వొద్దు. అమ్మా! నాకు వువ్వాయి పోయింది. చూాలూ. (నవ్వుతోంది.) అమ్మేదీ? (వింటో) ఆ. ఆ. అమ్మ. అమ్మ. పిలుత్తోంది. చుచీలా అంతోంది. అమ్మా. ఇత్తా లా.

చిట్టెమ్మ:—ఎంతధైర్యమో ఆపిల్లకి!

[ఇంగ్లీషుఆమె వొచ్చింది.]

ఇంగ్లీషుఆమె:—Where is my baby? The tiny one should be crying. It is time for her feed. Where am I?...They don't allow me to feed her. I was so ill. Little cuddles. Hullo, Nellie, you! you!

సుశీల:—అమ్మా! అమ్మా!

ఇంగ్లీషుఆమె:—You call me, darling, my own.

కాంతయ్య:—అదేమిటి ఆపిల్లని ముద్దాడుతోంది?

చిట్టెమ్మ:—పిచ్చిది.

(చిట్టెమ్మ బిగ్గిరిగా మంత్రాలు చదువుతోంది.)

[చల్లయ్య వొచ్చాడు.]

చల్లయ్య:—అమ్మా! శుభ్రమైన తెలుగుముక్కలు చెవిని పడుతున్నాయి యిక్కడ. ఏమిటీ మాలలోకం, ఇట్లా బైలుదేరింది, చీమలపుట్టలాగు! కానూరు, వొక్కణ్ణే బైలుదేరితే ప్రపంచమంతా నావెంట పడ్డ దేమిటి? తోవలో పాము కాటేసింది. బారెడు తాచు. చచ్చానను కున్నా. కాని ఇనపముండావాణ్ణి పాముకాటు లెఖ్ఖా నాకు! నాజాతకంలో యెనభై యేళ్ళ ఆయుర్దాయం. నేను చస్తానా?...వీళ్లు తాకుతారేమో కద! సంధ్య వారుద్దామంటే నీళ్లు కనపడవు. ఎన్నో వాగు లుండాలి దోవలో. తోవ తప్ప లేదుకద!

[మార్వాడీ జమనలాల్ వొచ్చాడు.]

జమనలాల్:—చచ్చేముందు దానధర్మాలు చెయ్యండి. నిన్న చావుదగ్గిరికి వొచ్చిం దనిపించింది. తెల్లారిందాకా బతికానా, ఆరువేలు దానమిద్దా మనుకున్నాను. ఎందుకండీ పాడుడబ్బు! చచ్చేప్పుడు వెంట తీసుకు పోతామండీ! ఇందండి తీసుకోండి. వొద్దా! అరే, దేఖో భాయ్. ఈదేశంలో చలామణి కావు గావును.

[వస్తాడు సులేమాన్.]

సులేమాన్:—పదిమంది కలిసి పొడిచి, చచ్చానని గోతులో తోశార్—చచ్చాన్రా! సులేమన్, చావడు, చావలేదు. చావడు. ఒరే పోలీరెడ్డీ, ఇంక నీపెళ్ళాన్ని యెట్లా దాచుకుంటావో చూస్తాను. అది మంచిమనిషండీ! నన్ను నరుకుతారనిచెప్పి ఏం యేడ్చింది, యేం యేడ్చింది?

చల్లయ్య:—సాహేబుగారూ, యేవూరండీ మీది!

సులేమాన్:—మాది యేలూరు; దాన్ని యేం చేశారో పాపం! బలేమనిషి! పడుకుందంటే—ఏం భోగాలండీ! కండకావరంతో తిరుగుతా మన్నమాటే గాని—నన్ను పొడిచి చంపేశారు. కాదు. పొడిచారు యీవెన్నులో. ఎదీ లేదే! పొడిచా రనుకున్నాను.

# మృత్యువు

[రాజన్న రాజకీయఖైదీ.]

రాజన్న:—ఎక్కడికండీ పోతున్నారు మీరంతా? నాలుగేళ్ళయింది మా అబ్బాయిని చూసి. ఎక్కడో వుండాలి యీగుంపులో.

జమన్‌లాల్:—ఏమండీ, రాజన్నగారూ, ఎప్పుడు వొదిలారు జైలులోంచి మిమ్మల్ని? మీ కేదో క్షయ అన్నారు?

రాజన్న:—అవును. మొన్ననే యెక్కువచేసింది. అందుకనే వొదిలినట్టున్నారు. నే నెక్కడ చస్తాను లెండి? మొదటినించీ నాకు ధైర్యమే. భరతమాతకు నేను అవసరం. దేశసేవకై యీశ్వరుడు నన్ను మిగులుస్తాడని తెలుసు. ఆరాముడిలో విశ్వాస మున్నవాళ్ళని చెరచరండీ.

[కృపానిధి, కవి, వొచ్చాడు.]

కృపానిధి:—ఆహా, యెంత రమ్యంగా వుంది. అయ్యా, మీదగ్గిర కాయితమూ కలమూ వుందా? ఒక్క ప్రేమగీతం వొస్తోంది, ఆపారసీఆమెని చూస్తే. భారతికి పంపాలి. నన్ను మీ రెరగరూ? అవునులెండి, కవులకి కీర్తి వొచ్చే కాలమా, దేశమా? కాని వుండండి. కొద్దిసంవత్సరాలలో వింటారు నాపేరు.

[లక్ష్మీయప్పారావు వొచ్చాడు.]

లక్ష్మీయప్పారావు:—అరే మీదికి తోసుకొస్తారేం? ఒరే, వీరన్నా! ఎవరూ లేరు. కొంచెం ఎక్కువ జబ్బు చేసేప్పటికి ఎవరితోవన వాళ్ళు పోయినారు. ఇంతేకదా అధికారమూ. ఐశ్వర్యమూ!

[గుడ్డివాడు, ముష్టివాడు, వొచ్చాడు.]

ముష్టివాడు:—అయ్యా, గుడ్డివాణ్ణి, అవిటివాణ్ణి, ఒక్క కానీ యివ్వండి. అమ్మా, నువ్వన్నా కనికరించు.

చిట్టెమ్మ:—ఒరే, నేను కనపడగా లేంది గుడ్డి యేమిట్రా నీకు? ఎవ్వడురా నువ్వు, అట్లా పైకి వొస్తావు?

ముష్టివాడు:—నిజమేనమ్మా, కనపడుతున్నావు. పోనీలే. ఆక లవుతోంది. ఒక...ఆకలి కూడా లేదే. ఇరవైనాలుగుగంటలు ఆకలితో చచ్చేవాణ్ని—

[వెంకటచలం రిఫార్మరూ, సీతమ్మ యవ్వనురాలూ వొచ్చారు. ఆమె బాలవితంతువు.]

వెంకటచలం:—అమ్మా ఇంకా చిన్నవయసు. ఎంతకాలం వొంటరిగా బతుకుతావు? చక్కనివరుడు వున్నాడు. మీవాళ్ళకి తెలీకముందు వెంటనే యిప్పుడే పెళ్లిచేస్తాను నీకు. ఏమీ తప్పని సంకోచించకు. ఈ ముసలివాళ్ళు చెప్పేవన్నీ నిజమనుకోకు.

సీతమ్మ:—పెళ్ళా? ఎందుకు? చూడండి. ఎంతరమ్యంగా వున్నదో యిక్కడ? హాయిగా ఆడుకుంటాను.

వెంకటచలం:—ఇప్పు డట్లానే వుంటుంది. కాని ఇంక నాలుగేళ్ళు పోతే నీశరీరం వూరు కుంటుందా? నీకేం కష్టం లేదు. ఇంతవరకు నేను నలభై తొమ్మిది పెళ్లిళ్ళు చేయిం చాను.

సీతమ్మ:—శరీరమా? నాకు తెలీటంలేదు. నమస్కారం, వెళ్లండి.

[శంకర్రావు, స్కౌట్, వొచ్చాడు.]

వెంకటచలం:—ఏమిటబ్బా, ఇవాళ మొగవాళ్లు ఆడవాళ్లు వున్నారు. ఒకరివంక ఒకరు చూసుకోరు. తమాషాగా వుంది. నే నేం రిఫారం చెయ్యను?

శంకర్రావు:—ఇదేమి తిరనాళండీ! మా స్కౌట్లు ఇంకెవరూ రాలేదా? ఎవరికన్నా సహాయం కావాలా? ముసలివాళ్లకి, బీదవాళ్లకి, కుంటివాళ్లకి—ఎవరికీ వొద్దా! ఇక్కడ యెవరికీ సహాయం అక్కర్లేనట్లుందే.

[సినీమా స్టార్ వనజాక్షి వొచ్చింది.]

శంకర్రావు:—మీ కేమైనా సహాయం కావాలా?

వనజాక్షి:—నాకా? నా కేం కావాలి? నే నేం సాధారణందాన్ని అనుకుంటున్న ట్టున్నావు. (బిగ్గిరిగా) నేను సినీమా fame వనజాక్షిని.

(అందరూ తనవంక చూస్తారనే ఆశతో చుట్టూ చూస్తోంది.)

ఇదేం దేశం? ఇంతమూర్ఖుల్ని నేను చూడలేదు. నాపేరే విన్నట్టు లేరే! వీళ్లు పశువు ల్లాగ వున్నారు. ఆడదాన్ని యిట్లా రాసుకు పోతారేం? కళ్లు పోయినాయి. అందాన్ని గుర్తించరే! ఇంతగుంపులో నాకు వూపిరి తిరగటం లేదు. ఎప్పుడో ఓ స్వయంవరంసీనులో తప్ప యింతగుంపులో నేను నుంచోలేదు. మోటారు అల వాటై నడవడమే మరిచిపోయినాను—మా డైరెక్టర్ వుంటేనా? ఈ గుంపునంతా ఫిల్ము తీసును.

[సూర్యనారాయణ—మందు లమ్మేవాడు.]

సూర్యనారాయణ:—ఇదుగోనండి—వినండి—ఈమందు వుందే, యిది సులేమాన్ యోగి గారు హిమాలయపర్వతాల్లో కనిపెట్టినారు, ఇది తలనొప్పులకు—

[అందరూ నవ్వుతున్నారు. సిగ్గుపడి వూరుకున్నాడు.]

[ముసలివాడు కాంతయ్య—వేదాంతి—వొచ్చాడు.]

కాంతయ్య:—తొరగా రండి. అట్లా దిక్కులు చూస్తారేం?

సూర్యనారాయణ:—ఎక్కడికి వెడుతున్నాము, మనమంతా?

కాంతయ్య:—చూద్దుగాని రా, ఎక్కడికి వెడితే నేం? బతికివున్నన్నాళ్లూ అడగలేదేం ఆ ప్రశ్న? తీరా చివరికి వొచ్చి యిప్పు డడుగుతున్నావు?

వనజాక్షి:—బతికివున్నన్నాళ్లూనా? ఇప్పు డేమిటి చచ్చామంటారా!

[కాంతయ్య నవ్వుతున్నాడు. చుట్టూ ప్రతివాడు బిక్కమొహంవేసి ఆలోచిస్తున్నాడు.]

సులేమాన్:—సులేమాన్ చచ్చానంటావురా! తంతాను.

[కాంతయ్య నవ్వుతున్నాడు.]

కాంతయ్య:—తన్నులు తన్నే కాలం అయిపోయింది. తినేచోటికి వొచ్చాం.

చిట్టెమ్మ:—మనని యేం చేస్తారు?

సూర్యనారాయణ:—యముడిదగ్గిరికి తీసుకుపోతారు.

వెంకటచలం:—ఏమిటి? యమలోకం వుందీ? అంతా అబద్ధమన్నారు.

[మోసెస్ వొచ్చాడు.]

మోసెస్:—లేదు. ఇక్కడే వుండాలి, డూమ్సుడేవరకు. అప్పుడూ నరకం మీఅందరికీ. నేను బోధించినప్పుడు నవ్వారు. చూడండి ఇదంతా బైబిల్లో చెప్పినట్లు వుంది సరిగ్గా. ఇప్పుడన్నా తెలిసివొచ్చిందా? ఏరీ మీ యమభటులు?

చల్లయ్య:—ఒరే, గోహత్యలు చేసినవాడికి నీకు స్వర్గ మెవ డిస్తాడురా?

సులేమాన్:—ఏమిటి? గోహత్య యేమిట్రా, బ్రాహ్మడా! రేపు అల్లా నీపిలక పట్టుకు జాడించినపుడు తెలుస్తుంది.

చల్లయ్య:—నేను గంగాస్నానం చేశాను, నా పాపాలన్నీ పోయినాయి.

చిట్టెమ్మ:—అయ్యా, శాస్త్రుల్లగారూ, నిజమేనా? నేను గంగాస్నానం చెయ్యలేదు. గోదావరి కాలవలో మునిగానండీ? అదీ దక్షిణగంగ అంటారుకదా!

చల్లయ్య:—లాభం లేదు. ఏదో కొంతవరకు ఆలోచిస్తారు నీసంగతి.

సులేమాన్:—నాకేం భయం లేదు, ప్రతిరోజూ నమాజ్ చేశాను.

మోసెస్:—నేను పశ్చాత్తాప పడ్డాను.

[దాసరి వెంకయ్య వొచ్చాడు. పాడుతున్నాడు.]

వెంకయ్య:—

ఇల్లు వాకిలి నాది, ఇల్లాలు నాదనుచు
ఏల భ్రమసెదవు, మనసా!
కాలునీ వలలోన కానకను చిక్కితివి
కడతేరుటే త్రోవ మనసా!

అయ్యా, ఏమీ శాశ్వతంకాదు. ఒక్కకాసీ ధర్మంచెయ్యండి, నేడో రేపో అందరూ చచ్చేవారే. ఈ నాలుగురోజులే మీ ప్రభ!

రెండోరంగం

పరలోకం.

పెద్దమైదానం మధ్య ఒక స్వరూపము. మబ్బులు పేర్చినట్టు ఉన్నతంగా వుంది, పైన కాబోలు. ఆరూపము అనేకరంగులతో తేజస్సులతో మిరుమిట్లు గొలుపుతోంది. గంభీరమూ, భయోత్పాదకమూ ఐన అనేక గాఢభావాలను ప్రేరేపిస్తుంది. దేశ, కాల, జాతి, లింగ భేదాలకు అతీతమయింది, రూపం నిర్ణయంగా యేర్పడక, మబ్బువలె మారుతో వుంటుంది. చూసేవారినిబట్టి పరిపరివిధాల తోస్తుంది.

వేనకువేలు స్త్రీపురుషులు అన్నిజాతులవారూ, దీపముచేత ఆకర్షింపబడ్డ పురుగులవలె ఆజ్యోతిచుట్టూ చేరుతున్నారు. ఆయనదృష్టి యెవరిమీద నిలిస్తే వాళ్లు ముందుకి వొచ్చి యెదట నిలబడతారు. ఒక్క చూపుతో, ఆవ్యక్తి అంతరాంతర రహస్యాలన్నీ ఆయనకు అర్థమైనట్టు తోస్తుంది.

అప్పుడప్పుడు గుంపులోనించి కొందరు వాళ్లనమ్మకాలప్రకారం, జీసస్, అల్లా, నారాయణ, అని కేకలు వేస్తారు. స్తోత్రాలు చదువుతారు.

ఆయన్ని అధికారి అని పిలుద్దాం.

[పోలీసు సుబ్బన్న వొచ్చాడు. కుక్కపిల్లవలె వెల్లకితలా పడి, వొణుకుతున్నాడు.]

సుబ్బన్న:—పాపిని, యీశ్వరా, పాపిని, హరీ, నేను పాపిని, నన్ను నరకంలో త్రొయ్యకు, నాకు బుద్ధి వొచ్చింది. ఎన్నటికీ బాధించను. లంచాలు తీసుకున్నాను. అదుగో, కరుణమ్మ! దాన్ని చెరిచి, పైగా కైదులో వేయించి—దానిపిల్లల్ని తరిమి—తెలీక చేశాను.

అధికారి:—అవును. అణుచుకోలేని కామం, అర్థంలేని క్రూరత్వం, ఉపయోగంలేని ధనకాంక్ష—తెలీకపోవడం కాదు.

సుబ్బన్న:—రామనామం జపంచేస్తే పాపాలన్నీ పోతా యన్నారు. పోవు.

అధికారి:—నీకు మళ్లీ జన్మ నిస్తాను.

సుబ్బన్న:—నన్ను పందిని, కుష్ఠుని చెయ్యండి.

అధికారి:—(నవ్వి) ఇట్లా రా; అట్లా కుంగిపోకు. ఏమి? పాపాలు చేస్తే నేమి? అవి శాశ్వతం కావు. నీ ఆత్మ జయించి తీరుతుంది. భయపడకు. నీ ఆశలన్నీ కోరుకో.

సుబ్బన్న:—తమకు ఆగ్రహం కలుగుతుందేమో!

అధికారి:—భయపడకు. ఈశ్వరుడు కరుణామయుడు. నాకు తెలుసు నీకోర్కెలు. మీ నూపరెంటుభార్యవంటి సౌందర్యవతి, అధికారం, గొప్పజీతం—

సుబ్బన్న:—అవును. అవును.

అధికారి:—పెద్ద మిలిటరీ అధికారి వవుతావు. ధనము, స్త్రీలు—కరుణమ్మ తనసౌందర్యంతో నీహృదయాన్ని నలిపి చీల్చి పాఠాలు నేర్పుతుంది.

సుబ్బన్న:—అనుగ్రహం.

[ముసలిసన్యాసి.]

అధికారి:—ఇంకా పూర్తికాలేదు నీయోగసాధన, త్వరపడ్డావు.

సన్యాసి:—అవును.

అధికారి:—సిద్ధి పొందావని శిష్యు లంటే నీవూ నమ్మావు.

సన్యాసి:—అవును. ఏకాగ్రచిత్తమువల్ల నానరాలలో పుట్టిన ఆనందాన్నీ, ప్రజల మన శ్శరీరాలమీద నాకుకలిగినశక్తినీ, నామూలాన వ్యాధులకూ, కోర్కెలకూ విదూరులైన పామరుల స్తోత్రాలనూ చూసి మోసపోయి అద్వైతసిద్ధిని పొందా ననుకున్నాను.

అధికారి:—ఈజన్మలో బాల్యమందే యోగమార్గంలో పడతావు. ఇంకా దీర్ఘసంస్కారం కావాలి నీకు.

సన్యాసి:—ఒక్కప్రార్థన: ప్రజలనించి, వాళ్ళ యాచననించి, కృతజ్ఞతనించి తప్పించండి. ఎవరూలేని ద్వీపంలో—

అధికారి:—లోకాభిప్రాయాలను మన్నించావు. నీ ఆత్మస్వేచ్ఛను వాళ్ళగౌరవంకోసం బంధించావు. వాళ్ళగౌరవాన్ని అతిక్రమింపగల వివేకసాధనకే నిన్ను పంపుతోంది. లోకాన్ని ప్రేమించు. కాని లోకంచేత బంధింపబడకు.

[చంటిపిల్ల వొచ్చింది—సుశీల.]

సుశీల:—అమ్మ, అమ్మ.

అధికారి:—రా.

సుశీల:—అమ్మా, నువ్వే, అమ్మ. (ఆయనవొళ్లో దూకింది. ఆయన్ని కావిలించుకుని, ఆనందంతో 'అమ్మ, అమ్మ' అంటోంది.)

అధికారి:—అమ్మ కావాలి కాదా? నీ అమ్మ మూర్ఖురాలు, పిల్లని పెంచడం తెలీక, నిన్ను చంపుకుని, ఏడుస్తోంది నీకోసం; ఎక్కడ వున్నావాఅని చూస్తోంది, ఆకాశంకేసి. వెళ్లు, నలుగురమ్మలచేతుల్లో అతి గారాబంగా పెరుగు. దీర్ఘాయుష్మంతురాలివై, మళ్లీ రా—

[సాలమన్—మిషనరీ.]

సాలమన్:—జీసస్ ఏరీ?

అధికారి:—ఏమిపని ?

సాలమన్:—స్వర్గ మిస్తాడు. మీా రెవరో మీాతో పని లేదు.

అధికారి:—నేనే జీసస్.

సాలమన్:—నా పాపాలకి పశ్చాత్తాపపడ్డాను.

అధికారి:—మరి మీా వదినఆస్తిని తిరిగి యిచ్చేశావా ?

సాలమన్:—పశ్చాత్తాప—అవును తప్పే, నాజీవితమంతా నీ నామం ప్రచారంచేశాను.

అధికారి:—నీవు తీసుకున్న జీతమో! పైగా స్వర్గమా ?

సాలమన్:— మరి బైబిలులో—

అధికారి:—బైబిలులో నీ కున్నదంతా బీదలకు పంచమన్నారు.

సాలమన్:—అది సాధ్యమా? నా కుటుంబమూ—

అధికారి:—బైబిలులో నీకు సాధ్యమైనవాక్యాలుమాత్రమే నమ్ముతావా ? జీసస్ ఉపదేశాలు అనుష్టించడం అట్లా వుంచి, అర్థంచేసుకునేందుకు, నీ కింకా యెన్నిజన్మలో అవసరం—జ్ఞానం సంపాదించుకో. ఇంగ్లండులో పుట్టు—బైబిలుకి వ్యాఖ్యానం వ్రాస్తావు. వెళ్లు.

సాలమన్:—నేను నా జీవితమంతా పరోపకారంలో గడిపాను.

అధికారి:—(నవ్వి) పరోపకారం చేసినవాడికి ఆసంగతే జ్ఞప్తిలో వుండదు—ఆలోచించుకో.

[నరిసింహారావునాయుడు—మహాదాత.]

నరిసింహారావు:—స్వర్గమే యిస్తారో, ఇంద్రత్వమే యిప్పిస్తారో మరి.

అధికారి:—స్వర్గమూ, ఇంద్రలోకమూ—అంటే ?

నరిసింహారావు:—మీాకే తెలీదా? మరి వేదాలలో పురాణాలలో చెప్పారే !

అధికారి:—ఎవరు ?

నరిసింహారావు:— ఈశ్వరుడు వ్రాశా డన్నారు.

అధికారి:—ఎవరు ?




# మృత్యువు

నరిసింహారావు:—ప్రజ లందరూ.

అధికారి:—నమ్మి—దానధర్మాలు అమితంగా చేశావు. పాపం.

నరిసింహారావు:—నాకీర్తి భూలోకంలో ఎంతకాలం వుంటుందో, అంతకాలం స్వర్గ మనుభవిస్తా నన్నారు...మరి స్వర్గమే లేకపోతే, అంతధనాన్ని వ్యయంచేశాను. ఫలిత మేమిటి? మోసం!

అధికారి:—స్వర్గమే యిస్తాను నీకు.

నరిసింహారావు:—లేదన్నారుగద!

అధికారి:—కల్పిస్తాను. ఎట్లా వుండాలి నీకు స్వర్గము?

నరిసింహారావు:—అప్సరసలు, హర్మ్యాలు—ఉద్యానవనాలు.

అధికారి:—భూలోకంలో లేవా? ఐశ్వర్యవంతుడివి. నీ కేమి తక్కువ?

నరిసింహారావు:—నాధనం కర్చుచేశా?

అధికారి:—ఇక్కడ ఏవ్యయమూ లేకండా దొరుకుతాయని ధర్మంచేశావు.

నరిసింహారావు:—కాని శాశ్వతంగా కావాలి,మృత్యువూ ముదిమీ అభ్యంతరపరచకండా—

అధికారి:—నీవు అప్సరసలనూ, హర్మ్యాలనూ అనుభవించివుంటే తెలిసేది నీకు—వాటి క్షుద్రత్వము.

నరిసింహారావు:—పోనీ, నేను ఎన్నివేల ప్రాణులకు ఆనందం కల్పించాను! నిరతాన్న దానం—నామూలాన యెన్నిప్రాణులు—

అధికారి:—నీవేనా, లోకాలలో ప్రాణుల్ని పోషించేది? నీకు ప్రేమ వుండే పోషించావా? నీయింటిపక్కన గజ్జికుక్క అన్నం లేక చచ్చింది జ్ఞాపక ముందా? గోరక్షణసభా! ఆ ముసలిగోవుల్ని చచ్చిపోనీక, చంపక, ఆరోగాలతో యెందుకు జీవితం పెంచావు? భూతదయా? నీయింటో ఎలుకల్ని, బోనుతో నడుం విరిచి, తెల్లవార్లూ మరణ వేదనపెట్టావు. అనాధవై పుట్టి ప్రేమకి అర్థంతెలుసుకో. అన్నం లేక మలమల మాడి, దానముయొక్క విలువ నేర్చుకో.

[ముసలివాడు—కాంతయ్య.]

అధికారి:—నీ కింక కావలిసింది ఏముంది? శుక్రుడిలో జన్మించు.

కాంతయ్య:—నా కింక ఈనాట్యము చాలు. నాకు ముక్తి నివ్వండి.

అధికారి:—ముక్తి! దేనినించి.

కాంతయ్య:—జీవితమునించి—యీ జననమరణాదులనించి.

అధికారి:—ఎందుకు?




## మృత్యువు

నరిసింహారావు:—ప్రజ లందరూ.

అధికారి:—నమ్మి—దానధర్మాలు అమితంగా చేశావు. పాపం.

నరిసింహారావు:—నాకీర్తి భూలోకంలో ఎంతకాలం వుంటుందో, అంతకాలం స్వర్గ మనుభ విస్తా నన్నారు...మరి స్వర్గమే లేకపోతే, అంతధనాన్ని వ్యయంచేశాను. ఫలిత మేమిటి? మోసం!

అధికారి:—స్వర్గమే యిస్తాను నీకు.

నరిసింహారావు:—లేదన్నారుగద!

అధికారి:—కల్పిస్తాను. ఎట్లా వుండాలి నీకు స్వర్గము?

నరిసింహారావు:—అప్సరసలు, హర్మ్యలు—ఉద్యానవనాలు.

అధికారి:—భూలోకంలో లేవా? ఐశ్వర్యవంతుడివి. నీ కేమి తక్కువ?

నరిసింహారావు:—నాధనం కర్చుచేశా?

అధికారి:—ఇక్కడ ఏవ్యయమూ లేకండా దొరుకుతాయని ధర్మంచేశావు.

నరిసింహారావు:—కాని శాశ్వతంగా కావాలి,మృత్యువూ ముదిమీ అభ్యంతరపరచకండా—

అధికారి:—నీవు అప్సరసలనూ, హర్మ్యలనూ అనుభవించివుంటే తెలిసేది నీకు—వాటి క్షుద్రత్వము.

నరిసింహారావు:—పోనీ, నేను ఎన్నివేల ప్రాణులకు ఆనందం కల్పించాను! నిరతాన్న దానం—నామూలాన యెన్నిప్రాణులు—

అధికారి:—నీవేనా, లోకాలలో ప్రాణుల్ని పోషించేది? నీకు ప్రేమ వుండే పోషించావా? నీయింటిపక్కన గజ్జికుక్క అన్నం లేక చచ్చింది జ్ఞాపక ముందా? గోరక్షణసభా! ఆ ముసలిగోవుల్ని చచ్చిపోనీక, చంపక, ఆరోగాలతో యెందుకు జీవితం పెంచావు? భూతదయా? నీయింటో ఎలుకల్ని, బోనుతో నడుం విరిచి, తెల్లవార్లూ మరణ వేదనపెట్టావు. అనాథవై పుట్టి ప్రేమకి అర్థంతెలుసుకో. అన్నం లేక మలమల మాడి, దానముయొక్క విలవ నేర్చుకో.

[ముసలివాడు—కాంతయ్య.]

అధికారి:—నీ కింక కావలిసింది ఏముంది? శుక్రుడిలో జన్మించు.

కాంతయ్య:—నా కింక ఈనాట్యము చాలు. నాకు ముక్తి నివ్వండి.

అధికారి:—ముక్తి! దేనినించి.

కాంతయ్య:—జీవితమునించి—యీ జననమరణాదులనించి.

అధికారి:—ఎందుకు?

కాంతయ్య:—నీ వెరగవా ? అలిసిపోయినాను. విరక్తి కలిగింది.

అధికారి:—నీవిరక్తిని మాన్పడానికే శుక్రలోకానికి పంపుతున్నాను. జన్మలతరవాత జన్మ లెత్తి సమస్తమూ అనుభవించి విరక్తి పొందావు, భూలోకంలో. శుక్రుడు నీకు కొత్త యింద్రియాలను, కొత్త కాంతుల్ని, కొత్త కోర్కెల్ని, కొత్త ఆశల్ని, బాధల్ని కల్పిస్తాడు.

కాంతయ్య:—వొద్దు, నాకే ఆశా లేదు.

అధికారి:—ఎందుకా విరక్తి? విరక్తే మృత్యువు. ఎందుకు నీయింద్రియాల్ని కట్టుకుని, ఏదో ఆనందాన్ని యీశ్వరుణ్ని పొందా లనుకుంటావు. ఈ రసాలు, భోగాలు, దృశ్యాలు అన్నీ యీశ్వరుడు నిన్ను రమ్మనే ఆహ్వానాలు. సృష్టిఅంతా నిండి సౌందర్యంలో నాట్యంచేసే యీశ్వరుణ్ని తృణీకరించి నీవు ముక్తిని పొందుతావా ? నీ కెందుకా తొందర ?

భూలోకాన నీకు విరక్తి జనించినంతమాత్రాన యీశ్వరసృష్టి కొల్లబోలేదు. అనంతంగా నూత్నంగా ఏర్పడే యీ సౌందర్య ఐశ్వర్య ఆనందా లన్నింటికీ అధిపతివి. నీ వా లోకంలో పొందినజ్ఞానం సూదిమొనకన్న యెక్కువ లేదు. గర్వపడకు. వినమ్రుడవై యీ సర్వలోకాలనూ జన్మించి అనుభవించు. కామరూపివై ఆనంద లోకాల స్వచ్ఛంద విహారంలో గడుపు. ప్రేమించు, మధురమైన జీవితాన్ని. నీ శరీరమూ, కాలమూ యివ్వగల ఆనందాల్ని ప్రేమించు.

కాంతయ్య:—మరి యీశ్వరుడిలో లీనంకావడం ఎప్పుడు ?

అధికారి:—ఇప్పుడు లీనంగాక వేరే వున్నావా ?

కాంతయ్య:—మరి నేను వేరుకాదా ?

అధికారి:—వేరైనవాడివి ఏక మెట్లా అవుతావు— యీశ్వరుడివే ఐతే కాని? వెర్రివేదాంతుల పలుకులు మరిచిపో.

[శాంత.]

శాంత:—నీవు పిశాచివి. ఎందుకు చంపావు నన్ను ! నీకాళ్ళు పట్టుకుంటాను. నన్ను మళ్లీ పంపు. రాఘవయ్యదగ్గిరికి పంపు. నేను భరించలేను యీ వియోగాన్ని.

అధికారి:—పాపం ! ఏం చెయ్యను ?

శాంత:—ఏం చెయ్యను ! ఏం చెయ్యలేవా ? చంపడం తెలుసును. ప్రేమమూర్తిట ! ఏమీ ప్రేమమూర్తివి కావు.

అధికారి:—కాను.

శాంత:—మరి అన్నారే!

అధికారి:—ఇతరులమాటలు ఎందుకు నమ్మావు? నమ్మకు. నీ అనుభవం మీాదనే ఆధారపడు.

శాంత:—నీవు ప్రేమమూర్తివి కావా?

అధికారి:—నామాటలోమాత్రం నీకు విశ్వాస మెందుకు? నీవే యోచించుకో.

శాంత:—నీవు రాక్షసివి. ఏమి?

అధికారి:—అవును.

శాంత:—నేనూ రాఘవయ్యా అంత గాఢంగా ప్రేమించుకున్న తరవాత విడతియ్యడానికి నీకు చేతు లెట్లా వొచ్చాయి?

అధికారి:—కరుణవల్ల—ప్రేమలో విషాద మున్నదే విరహంవల్ల రాదు. ప్రేమ పాతిదై, మామూలై ప్రియులు ఒకరి నొకరు ద్వేషించుకోడంలో వుంది విషాదము. ఆమరణంనించి తప్పించాను నిన్ను. సుకుమారమైన నీ హృదయాన్ని రక్షించాను, ఆ అంధకారంనించి. ఇంకొకటి. ప్రేమలో మైమరచి నీదేహయంత్రాన్ని నిర్లక్ష్యం చేస్తే ఎన్నాళ్ళు పని చేస్తుంది?

శాంత:—ఏమీా, ఏనాశనాన్నీ యెరగని శరీరాన్నివ్వకూడదా, మానవులకు?

అధికారి:—ఇనపనరాల నిస్తే నీ ప్రియుడి మృదుస్పర్శలకు ఎట్లా కంపిస్తాయి? ప్రియుడి ప్రేమకన్న విశాలమైనది మాతృప్రేమ. ఈజన్మలో దాన్ని కటాక్షిస్తున్నాను వెళ్ళు.

[రామారావు.]

అధికారి:—నీకు అనూరాధలో జన్మ వెళ్ళు.

రామారావు:—ఇక్కడ యీామూలనే నుంచోనీండి. ఇట్లాంటిసౌందర్యం నేను చూడలేదు.

అధికారి:—అప్పుడే భరించలేవు. అనూరాధలో శిక్షణను పొందాలి ముందు.

రామారావు:—ఏమిశిక్షణ నాకు! ఎందుకు నా కాజన్మ! నా గాఢవాంఛ, నానిరాశ, నా తీవ్రమైన వేదన తెలుసునా మీాకు? ప్రతినిమిషమూ మారే సౌందర్యాన్ని, సంధ్యను, పుష్పాన్ని, జరామరణాల్లో ప్రవహించే యవ్వనసౌందర్యాన్ని, మాయం కాకండా, జారిపోకండా, మారిపోకుండా, నాకుంచెతో బంధించాలని ప్రయత్నించాను, న న్నెందుకు తీసుకొచ్చారు?

అధికారి:—తృప్తి కలిగిందా?

రామారావు:—రంగులా! నా వూహాలో వున్న సౌందర్యానికి ఆ ఏడురంగులు, ఆమూడు వొంపులూ చాలలేదు. చూడండి. మీకిన్నా అర్థమవుతుందా, నామనోదృష్టిలో వున్న పటము? మీరేనా సృష్టికర్త? నదీజలంమీద అస్తమయకిరణాలు పడేప్పటి రంగులమిశ్రమం, అర్ధరాత్రి చంద్రకిరణాలు అలలమీద కదిలేప్పటి చంచలమృదుత్వము, ప్రేమతో కళ్ళు వోరగా పెట్టి ప్రియుడివంక చూసే కన్య దృష్టులలోని కోమలభావం, చిన్నపిల్ల పరిగెత్తేప్పటి తొడల చిన్ని మెరుగులు-ఏరంగులు చిత్రించగలవు? ఏ గీతాలు వ్యక్తపరుస్తాయి? పటం మొద్దులాగు కదలక కూచుంటుంది. జరగాలి. పరిగెత్తాలి. విస్తీర్ణాన్ని కాదు, కాలాన్ని చూపాలి. ఎంతసౌందర్యం? ప్రజలు కన్నెత్తి చూడని, చూసినా అర్థంచేసుకొని అనుభవించని సౌందర్యాన్ని-అమూల్యమైన సౌందర్యాన్ని అట్లా, అంత చవకగా వొలకపోశారు! నిప్పు శిఖల వంటివేళ్ళతో వంట చేయిస్తున్నారు. పువ్వుకన్న కోమలమైన హృదయాలను వెక్కిరింపుమాటలతో చీలుస్తున్నారు. వజ్రాన్ని పశువులమెళ్లో అలంకరించారు. మీకు నిర్లక్ష్యం, తృణీకారం. చిన్నమొగ్గగా వున్నప్పణ్ణించి చిన్ని రేకులమీద చిత్రించిన వర్ణాలు, అడివిలో సముద్రమధ్యాన్ని చిన్ని గుల్లలోపలి పొదిగిన రేఖలు—ఎందుకు అట్లా?

అధికారి:—సంవత్సరం చిత్రించిన పటాన్ని, తృప్తి లేక మూల పడవెయ్యలేదా నీవు?

అట్లానే. ఆ చిత్రించే ఆనందమే బహుమానం. ఇతరులు అర్థంచేసుకోగలరని ఆశ.

రామారావు:—తప్పు అర్థం తీసినప్పుడో! అర్థం కాక, సౌందర్యం చూడక, "బావుంది" అని తల వూపినప్పుడో! నా కెందు కీబాధ! సౌందర్యలేశం నా దృష్టిని పడగానే, నాస్వంతమైనట్టు, నా ఆత్మబంధం ఏదో నాశనమైపోతున్నట్టు నా కెందు కీవేదన!

అధికారి:—సౌందర్యాల సృష్టికర్తకి పుత్రుడివి కనక ఆ సౌందర్యానికంతా అధిపతివి నీవు.

రామారావు:—తక్కిన ప్రజలు?

అధికారి:—ఇంకా ఆ సంస్కారం కలగలేదు. అంతవరకు ధ్వంసం చేస్తారు—పసిపిల్లలు తమ వస్తువులను విరగకొట్టుకున్నట్టు.

అనూరాధలో నీవు వూహింపలేని వర్ణాలు, ఆరువైపులకు జారే రేఖలు, వైశాల్యమూ కాలమూ ఏకమయ్యే ఔన్నత్యము—యీ రంగులకూ, రేఖలకూ వెనకవుండే లావణ్యభావం బోధించగల గురువులు—నీఆత్మకి పురోవృద్ధి అక్కడా—

[రామమ్మ.]

రామమ్మ:—స్వర్గ మెక్కడ! నేను పతివ్రతను.

అధికారి:—నీపతి నరకంలో వున్నాడు.

రామమ్మ:—ఆయనఖర్మం, పాపాలు చేశాడు... అయినా ఆమరణాంతమే కదా పాతివ్రత్యం?

అధికారి:—నావంక చూడు: నీభర్తని ప్రేమించావా?

రామమ్మ:—(ఆత్మలో చూసుకుంటో అప్రయత్నంగా) ఎట్లా ప్రేమించను అట్లాంటి దుర్మార్గుణ్ణి! కాని సేవించాను. పతివ్రతననే కీర్తిని పొందాను.

అధికారి:—సరే. అటువంటి దుర్మార్గుణ్ణి సేవించిన నీచత్వానికి పరిహారం కావాలి.

రామమ్మ:—మరి నేను చేసినత్యాగాలు! ఎన్ని సౌఖ్యాలు వొదులుకున్నాను? నాభర్త కోసం, పిల్లలకోసం—ఎన్ని కష్టా లనుభవించాను.

అధికారి:—త్యాగాలా—త్యాగాలు చేస్తే చేశాననే జ్ఞానం వుంటుందా? కాని విశాలమైన ప్రపంచం, బాధలతో రోగాలతో నశించే జీవు లుండగా, కొవ్వి తిని కూచునే భర్తకూ పిల్లలకు ఎందు కాత్యాగం? ఏమిత్యాగం? నీ కాలమా, శక్తా? నీ స్వంత మా కాలమూ శక్తీ? వాటివిలవ ఎంత? జ్ఞానం లేదు, సౌందర్యపిపాస లేదు, ఆత్మ వికాసం లేదు. నీలో ఏమున్నది త్యాగం చేసేందుకు? సాధారణమైన ప్రేమైనా లేదే?

రామమ్మ:—నాపిల్లల్ని ప్రేమించలేదా?

అధికారి:—ప్రేమించావా? మృగముప్రేమకన్న ఏమైనా అధికమైనదా నీ ప్రేమ? ప్రేమ అనే పేరును అపవిత్రంచేయకు. సేవ చేశావు. అంతే. ప్రేమంటే, మోహమంటే, సహజసంబంధమంటే అర్థం తెలుసుకో. వేశ్యవై పుట్టు.

[ఫిలాసఫర్ వెంకటప్ప.]

వెంకటప్ప:—ఎన్నాళ్లు 'వెయిట్' చేశాను మిమ్మల్నిట్లా చూచి, అడగాలని! ఎన్నిసంవత్సరాలు, ఎంత యోచించాను? ఈసృష్టి మొదలెక్కడ? ఎంతకాలంకిందట! అంతకు ముందు ఏమున్నది? అంతం ఏమిటి? ఎప్పుడు? ఇంకా లోకాలు వున్నాయా? ఆ నక్షత్రాలకు గ్రహాలు వున్నయా? జీవితం వుందా వాటిమీద? ఈరంగులు, శబ్దాలు, వీటిని కల్పించే పదార్థం ఏమిటి? అంతా మాయా? ఈ సృష్టి వుందా లేక మాభ్రాంతేనా? కలా? ఆత్మలనేవి వున్నాయా? వేటికి? మృగాలకూనా? కీటకాలకు, వృక్షాలకు? లోకంలో ధర్మమూ, సత్యమూ, న్యాయమూ వున్నాయా? లోకానికి అతీతములైన వాస్తవాలు వున్నాయా, ఏ సృష్టికర్త హృదయం లోనో—? లేక చదలవంటి యీ మానవ కీటకాలు కల్పించుకున్న మోసాలా? మరి మాక్షుద్రమానసాలకు—

అధికారి:—ఆగు. వీటన్నిటికీ నేనే సమాధానం చెపితే మీలోకంలో ఆ శాస్త్రాలు, నయన్నులు అన్నీ యెందుకు ? నీ ప్రయత్నంఘనత యేముంది ?

వెంకటప్ప:—ప్రయత్నమంతా ఐపోయింది. ఇంక యీ మనసు తనలో తనే చక్రంవలె తిరగవలిసిందే గాని ఇంక ఏమీ తెలుసుకోలేదు.

అధికారి:—ప్రయత్నం అనంతం—నూతనశక్తులూ, యింద్రియాలతో ప్రయత్నం చెయ్యబోతున్నావు—సూర్యుడిలో యీసారి.

వెంకటప్ప:—ఆ అగ్నిలో—

అధికారి:—నీ శరీరమే వేరు.

వెంకటప్ప:—నాకు జన్మలు వొద్దు. ఈ సమస్యలతో బాధపడలేను. నన్ని బాధనించి తప్పించండి—సుఖంగా వేరే చింత లేక బతకగల సాధారణ మానవుణ్ణి చెయ్యండి.

అధికారి:—తిరిగీ జడుడివీ అనాగరికుడివీ అవుతావా ? భోజనంతో, నిద్రతో సుఖంగా జీవించే యీ సామాన్యప్రజాబాహుళ్యంలో చేరిపోతావా మళ్లీ ! ఆబాధ ! అమూల్యమైన ఆమనోతపనను గోల్పోయి యెందుకు ? ఎన్నిలక్షల జన్మలు పొందావు, ఆ బాధని సంపాయించేందుకు ? ఎన్ని అనుభవాగ్నులలో తపన పొంది సంపాయించావు, అజ్ఞానతృష్ణని ? పాపం. పాపం. ఎంతతపన పొందావోయీ !

వెంకటప్ప:—(కోపంతో) నా కెందుకు చెప్పవు యీ సృష్టికారణ మేమిటో? ఈ రహస్యమూ, దాపరిక మెందుకు ?

అధికారి:—నేనే చెప్పగలిగితే, చివరికి యీశ్వరుడైనా చెప్పగలిగితే, చెపితే నీవు అర్థం చేసుకోగలిగితే యీ అపారమైన సృష్టి యెందుకు ? త్వరపడకు వెళ్లు.

వెంకటప్ప:—ఒకప్రశ్నకు సమాధానం చెప్పండి. నేను చివరి పదేళ్లూ సాధించ ప్రయత్నించిన సమస్య—ఎలక్ట్రాన్‌లో—

అధికారి:—తెలుసు—సూర్యుడిలో అర్థమవుతుంది. వెళ్లు.

వెంకటప్ప:—నేను ప్రయత్నించి, ప్రయత్నించి, నామనసులో వెతికి వెతికి, యీశ్వరుడు లేడని నిర్ణయించాను.

అధికారి:—ఎందుకు ?

వెంకటప్ప:—వుంటే, ఇంతకన్న తెలివిగా,'సిస్టమాటిక్'గా వుండేది సృష్టి. ఏమీ అర్థమూ, ఆలోచనా లేనిది లోకం—వున్నాడా యీశ్వరుడు ?

అధికారి:—వున్నాడని తోచిందాకా, సృష్టి అర్థంకనపడ్డదాకా ప్రయత్నించు. తొందరేమి?

# మృత్యువు

వెంకటప్ప:—నమ్మనివాళ్లకు శిక్ష వుండన్నారు.

అధికారి:—నమ్మకపోవడమే శిక్ష. ఆబాధఅంతా అదే!

వెంకటప్ప:—మరి నమ్మే ఆక్షుద్రులు యీశ్వరుణ్ణి ప్రార్థిస్తో, స్తుతిస్తో ఆనందించే ఆ మూర్ఖులు, ప్రపంచసమస్యలే అర్థంగాని పశువులు—వాళ్లు నమ్మగలరు యీశ్వరుడున్నాడని—వాళ్లభయం, స్వార్థం, కాపీనం—అవే వాళ్ల యీశ్వరుడు.

అధికారి:—అవును వాళ్లు నమ్ముతున్నారా? నమ్మడమే వాళ్లశిక్ష—అట్లా క్షుద్రంగా నమ్మడమే వాళ్ల నరకం.

[రిఫార్మర్ శివయ్య వొచ్చాడు.]

శివయ్య:—(పాడుతున్నాడు)

"తల్లీ నీవు_పిల్లలు మేము
దయను చేపీ_తనుపుము
ఉల్లము రంజిల్లగ నీ
యెడి నిడుకొని కాపాడుము
పతితాపావనుడవు నీవు."

అధికారి:—అబ్బా—ఆపు.

శివయ్య:—ప్రభో, నా జీవితమంతా నీ ప్రార్థనలో గడిపాను.

అధికారి:—ఎందుకు?

శివయ్య:—నేను పాపిని. నీవు దయామయుడవు. క్షమించు.

అధికారి:—కాదు. నేను రుద్రుణ్ణి. పాపాలకు శిక్ష ననుభవించి తీరాలి. అన్ని పాపా లెందుకు చేశావు?

శివయ్య:—నేను పాపా లేమీ చెయ్యలేదే?

అధికారి:—పాపిని అన్నావే?

శివయ్య:—ఏవో పాపాలు చెయ్యకండా వుంటానా అనుకున్నాను.

అధికారి:—మరి పాపాలు ఎందుకు చెయ్యలేదు, మూర్ఖుడా? నీకు శక్తి యేదీ? పాపమంటే భయం.

శివయ్య:—నీ ఆజ్ఞానుబద్ధుణ్ణయి—

అధికారి:—నా ఆజ్ఞలు నీ కేం తెలుసు?

శివయ్య:—మరి న్యాయమూ, సత్యమూ, నీతీ—

అధికారి:—ఆమాటలకు అర్థం తెలుసునా? నీవంటి మూర్ఖులు చెప్పిన వ్యాఖ్యానాలు గాక! ఎన్నిజన్మా లెత్తితే అర్థంతెలుసుకోగలవు నీతి అంటే? తెలుసు ననుకున్నావు. నీప్రార్థనలకు మోసపోయి, నీ తర్జుమాలకు నేను వొప్పుకుంటా ననుకున్నావు. నన్ను ఆ సత్యె మనీ, నీతి అనీ ఆరాధించి సుఖంగా పరలోకం కొట్టేదా మనుకున్నావు. నీ భార్యను ప్రేమించావుకదా! ఆమె కురూపి. లోభి, నీచురాలు—అవునా? ఆమెను ప్రేమించావు. కురూపత్వాన్ని, నీచత్వాన్ని, లోభత్వాన్ని ప్రేమించిన నీవు, నన్ను ప్రేమించగలవా? నీ నీచదై వందగ్గిరికే పో.

శివయ్య:—మరి భార్యను ప్రేమించడం విధి, ధర్మము.

అధికారి:—ధర్మమని ప్రేమించావా? ప్రేమఅంటే ఎరుగుదువా! ఎన్నటికన్నా తెలుసుకోగలవా? ఎన్నియుగాలకో! ప్రేమాన్వేషణంలో నీవు శాసించిన వివాహబంధాలను మీరిన వృత్తములను ద్వేషించావు. మూర్ఖుడా!

శివయ్య:—నేను ప్రజలను ప్రేమించాను. వారివృద్ధిని కోరి, సంఘసంస్కారానికై నాజీవితం ధారపోశాను. వితంతువులకు సంసారసుఖం లేదని, కనికరించి—

అధికారి:—మరి భర్తలు వొదిలిన భార్యల సంగతి—

శివయ్య:—అది నీ ఆజ్ఞలకు విరుద్ధము—

అధికారి:—నేను నా ఆజ్ఞల జాపితాను నీకిచ్చానా?

శివయ్య:—మరి పవిత్రవివాహసంస్కారమును—

అధికారి:—లోకం అంగీకరించి మెచ్చుకున్నవి నా ఆజ్ఞ లనుకున్నావు. అంటే నీకు కీర్తినీ, గొప్పతనాన్నీ తెచ్చేవి. ఆలోకంలో సుఖమూ, యీలోకంలో ముక్తీ! ఎంత మూర్ఖుణ్ణి అనుకున్నావు నన్ను! నీహృదయంలో నిజమైన ప్రేమ వున్నదా? వుంటే ఒక్క వితంతువుల యడలనే కలిగింది: అవునా? నీ హృదయపరీక్ష చేసుకో. వితంతువు లంటే ప్రీతి. వాళ్లని అనుభవిస్తే, నరకమని భయం. అందువల్ల వాళ్లకి పెళ్లిళ్లు చేసి, ఆ భర్తలద్వారా, తృప్తిపొందావు. కాదా?

శివయ్య:—అవును. కాని నీ నామాన్ని ప్రచారం చేశాను.

అధికారి—ఎందుకు? యీశ్వరుణ్ణి చూడలేనివాళ్లకి— యీశ్వరుడి నామం ఎందుకు? ఎందుకు యీశ్వరుణ్ణి తలుచుకోడం, స్తుతించడం? ఇంకేమీ పని లేదూ? మనుషుల కన్న మూర్ఖుణ్ణి అని ఆశపడ్డావు. సంస్కరించావా? నా లోకాలు నేను సంస్కరించుకోలేనూ? అజ్ఞానుడివి. లోభివి. మోసగాడివి. ప్రేమించడం నేర్చుకో.

నిన్ను, నీ కీర్తిని. నీ వృద్ధిని మరిచి, లోకాన్ని, ప్రాణుల్ని ప్రేమించడం నేర్చుకో. నేను శాస్త్రాలను, నీతిని, ధర్మాలను వేటినీ ఏర్పరచలేదు. అబద్ధ ప్రచారం మానివెయ్యి. అన్ని న్యాయాలకూ, నీతులకూ అతీతమైన ప్రేమని నేర్చుకో. సౌందర్యాలూ, జ్ఞానాలూ తెలీని మూఢుడివి, జడుడివి. నీ సంస్కారాలూ, సంస్కరణాలూ అవసరం. లేని యీ ఊర్ధ్వలోకాలు నీ కేం అర్థమౌతాయి! శునకానికి వున్న నిర్వ్యాజము, ప్రత్యుపకారాన్ని కోరనిదీఐన ప్రేమను తెలుసుకో, పో.

[తారాసింగ్.]

తారాసింగ్:—మీరు పాలించే భూలోకంలో న్యాయమనేది లేదు. ఇంక యీలోకంలో ఏముందో!

అధికారి:—తారాసింగ్ — పాపం!

తారాసింగ్:—మీరేనేమో యీశ్వరుడు. నలభై యేళ్లు— నా యవ్వనము, వృద్ధాప్యం, అంతా— కైదులో మగ్గాను— మనుషులను, కాంతిని, నవ్వును— ఏ ప్రేమను ఏమీ ఎరగను— మీలో నమ్మకమే పోయింది. పగలు రాత్రి ప్రతిగడియా దూషించాను మిమ్మన్ని, మీ కాఠిన్యాన్ని, మీ అన్యాయాన్ని, ద్వేషిను. శిక్షిస్తారా, శిక్షించండి. అర్థంలేని శిక్షలకు అలవాటుపడ్డ నేను, భయమునూ, బాధనూ వర్జించాను. ఒక్క వర మియ్యండి, మీకు శక్తి వుంటే— నా దేశానికి మోక్ష మివ్వండి.

అధికారి:—అర్హత పొందండి, వ్యక్తులకు గాని, దేశాలకు గాని మోక్షం రాదు.

తారాసింగ్:—జీవితమంతా— నా ఆరోగ్యం, నా ధనం, నా ఆనందం ధారపోశాను.

అధికారి:—నాకు తెలుసు. (అధికారి తారాసింగును కావిలించుకున్నాడు.) ఒక్క ఉద్దేశ్యంకోసం, ఏకాగ్రచిత్తంతో తీవ్రత్యాగం చేసిన యోధుడివి. ప్రజల స్తోత్రాలను, అభినందనాలను, కీర్తిని తృణీకరించి, ఎవరూ యెరగని నరకంలో కాలిపోయినావు, ధీరుడివి. పాపం! నీకు శాంతి నిస్తాను, రా.

తారాసింగ్:—నన్ను హింసించినవాళ్లని— అక్రమంగా, అధర్మంగా, క్రూరంగా నన్ను—

అధికారి:—నిన్ను హింసించినవాళ్లూ, వాళ్లస్వభావానుగుణ్యంగా వాళ్ల ధర్మాన్ని నెర వేర్చుకున్నారు. అగ్ని తాకితే బాధ— అగ్నిమీద ఆగ్రహించి ఏం లాభం?

తారాసింగ్:—కాదు, తెలిసి, యోచించి, అధికారాంధులై, స్వార్థ దురభిమాన పీడితులై, నా నోరు నొక్కి, నన్ను బంధించి నన్ను చీల్చి— రాక్షసులు.

అధికారి:—కారు— నీ కర్థమవుతుంది ముందు. వాళ్లూ నీవంటివారే! నీవంటి త్యాగాలకు సంసిద్ధులే. స్థానబేధం. అంతే. ఈ జన్మలో, నీ హృదయాగ్నిని కవిత్వంలో కరిగించి, కురిపించి, యువకుల హృదయాల్ని ప్రజ్వలింప చేసి— లోకాలే నిన్నారాధిస్తాయి. దేవత్వాని కెత్తుతారు. ఐశ్వర్యం, ఆనందం, గౌరవం— నీవు కోరకలిగినది ఏదీ లోపం రాదు. పాపం, ఎంత నలిగిపోయినావు. నీ ఆగ్రహం శాంతిస్తుంది. జీవితం అర్థమౌతుంది.

నీ దేశభక్తికన్న, నీ శరీరబాధకన్న, నీ కార్పణ్యం, నీ క్రోధం నిన్నెక్కువ కాల్చాయి. వాటికి అతీతుడవు కావాలి.

[నిరీశ్వరవాది చలం.]

చలం:—నువ్వు లేవు, అబద్ధం.

అధికారి:—నువ్వా?

చలం:—వున్నా నీకూ లోకానికీ సంబంధం లేదు.

అధికారి:—నీకూ నాకూ?

చలం:—వున్నా, నువ్వు శక్తిహీనుడివి. నువ్వు లోకాలు సృజించలేదు. సృజించినా నీశక్తికి అతీతాలై నీకు తిరగబడ్డాయి. నువ్వు వుండి యేం చేస్తున్నావు?

అధికారి:—నేను లేనుగా!

చలం:—వుండడం మరింత భయంకరంగా వుంది. మృత్యువుతో నే నంతమౌతానని నమ్మి ఆశపడ్డాను. నన్ను నాశనంకానీక మృత్యువుతోనన్నా నాకు శాంతి నియ్యక యిక్కడ తేల్చావు. నువ్వు వుండికూడా, ప్రజలలో యీ మూర్ఖం, యీ అన్యాయం, యీ రోగాలు, యీ యుద్ధాలు, మరణాలు, విలాపాలు—ఏమి సంతోషం నీకు? రాక్షసివా? నీ కళ్లూ చెవులూ చెదలు పట్టాయా? ప్రపంచంలోంచి నిరంతరమూ భయంకరంగా బైలుదేరే రోదన యిందాకా వినపడదా?

అధికారి:—మరి భయంకరమైన జీవితాన్ని వదలరేం ప్రజలు? మార్గం వుంది కదా?

చలం:—మూర్ఖులు—కాని నీ కేం ఆనందం?

అధికారి:—పుట్టినపిల్ల మూర్ఖురాలు—నిరంతరరోదనంకి, నిద్ర—ఏమి టా ఆనందం తల్లికి?

చలం:—తల్లి సంతోషంకోసం బిడ్డలు వేదన పడాలా?

అధికారి:—బిడ్డకికూడా సంతోషమే. బలహీనురాలై తల్లినించి ప్రేమను పొందే ఆనందం. పిపీలికాది సకల ప్రాణుల నరాలలో, రక్తంలో, ఆత్మలో, బాధలలో కలిసి లీనమై యీశ్వరుడు ఆ వేదననంతా అనుభవిస్తున్నాడని తెలుసా నీకు?

# మృత్యువు

చలం:—ఐతే, నిన్ను చూసి జాలిపడాలి. నీవేనా యీశ్వరుడు ?

అధికారి:—ప్రపంచాన్ని ప్రేమించావు.

చలం:—ఏం లాభం, ప్రేమించి ? క్షుద్రస్వార్థయుత ప్రేమనే గాని, జ్ఞానమూ ఔన్నత్యమూ గల వాస్తవ ప్రేమను చూపి వారి ఆనందానికై తపఃపడ్డవారి నందర్నీ సిలువ వేస్తోంది నీప్రపంచము. ప్రేమించి ఏమిలాభం ?

అధికారి:—ప్రేమించడం నీ వికాసంకోసం. లోకక్షేమం నేను చూసుకోగలను.

చలం:—చూసుకోగలవా ? నీఅంత వ్యర్థుడూ, ఆడంబరపరుడూ లేడు. మాలోకంలో అధముడు కూడా నీకన్న ఉత్తముడు. ప్రజలచాత నీవు పొందేపూజలు, నైవేద్యాలు, బలులు, స్తోత్రాలు, ప్రార్థనలు—లక్షపేర్లతో నిన్ను పిలిస్తే ఏమిటి నీసంతోషం ? బధిరుడివైన నీముందు మోకరించి రక్తపుకన్నీళ్లతో వెర్రిప్రార్థనలు చేసే నిర్భాగ్యుల దైన్యమైనా నిన్ను కరిగించదా ?

అధికారి:—ఆ పూజలన్నీ మానవుల హృదయంలో వుండే భయదేవతకి, మంగళదేవతకి, దైన్యదేవతకి—నాకు కాదు. నా కేమీ ఆనందం లేదు.

చలం:—మరి ఎంతమోసం ! నీమతమని, నీఆజ్ఞలని, నీకు ఆనందమని, నీకరుణ కలుగుతుం దని మోసపోయి నీపేర ఎన్ని దారుణకృత్యాలు, ఎంత వేదన ?

అధికారి:—నిరంతరమూ నిరాకరిస్తున్నాను. నమ్మరు. అగ్నినించి ఎన్ని దారుణకృత్యాలు జరుగుతున్నాయి. అగ్నిని నిరాకరించనా ప్రజలకు ?

చలం:—నోరు లేని పశువులు పడే దినదినబాధ, నోరులేని పసిపిల్లలు పడే నరకబాధ, పంజ రాల్లో పిట్టలు పొందే చెప్పలేని నరాలబాధ—అధికారులు, ఐశ్వర్యవంతుడు సుఖంలో పడే వూపిరాడని మర్యాదబాధ, ఎందుకు ? ఎందుకు ? పాములు, వరదలు, భూకంపాలు, ఎందుకు ? ధనము, జ్ఞానము అన్నీ దాచుకుని నిర్భాగ్యుల్ని పీడించి... నువ్వేనా ఆ నీతిచట్టాలను శాస్త్రాలను కల్పించింది ? ఆ నీతిపేర ప్రజల్ని దండించి నలిపి నాశనం చేసేవాళ్లకి ఏంశిక్ష ? నరకమని భయాలుపెట్టి తప్పుపనులు చేయించి, ప్రేమను, ఔదార్యాన్ని నొక్కి నాశనంచేసి—శిక్షించు శిక్షించు.

అధికారి:—శిక్షించనా ? ఆమూర్ఖులను, అంధులను శిక్షించారా, అని నీవే నిందిస్తావు.

చలం:—అవును. అవును. నా కర్థంకాదు. నాతల చీలికలై పోతోంది. శాంతి. శాంతి.

అధికారి:—శాంతి కాదు. కాంతి కావాలి నీకు. బాహ్యప్రపంచాలకన్న నీలో అంతః ప్రపంచాలు వున్నాయి. వాటిని పరీక్షించు. ఈజన్మలో ప్రజలచేత ద్వేషింపబడి, ఏకాంతవాసములో జ్ఞానార్జన ప్రారంభిస్తావు. వెళ్లు.

చలం:—ఒక్క వరము. ఒకటే ఆశ నాకు. ఏలోపమూ లేనిదీ, సంపూర్ణమైన శరీర, ఆత్మ సౌందర్యాలు కలదీ, చతురత్వమూ, విజ్ఞానమూ కలదీ, ఐన గాఢప్రేమను, నా ఆత్మతృష్ణ నంతా, నా లావణ్య పిపాస నంతా తృప్తిపరచగల దివ్యవ్యక్తి స్నేహాన్ని ప్రసాదించు.

అధికారి:—అట్లాంటి దివ్యవ్యక్తి ఒకటే వుంది యీ ప్రపంచానికంతా. ఆవ్యక్తిస్నేహం ప్రతినిమిషం నీతోనే వుంది. గుర్తించే అర్హత లేదు నీకు. అంధుడివై క్షుద్ర ప్రణయాలతో వేదన పడతావు. అర్హత పొందినకొద్దీ వున్నతమైనప్రేమను పొందు తావు. నే నిచ్చే వర మేమీ లేదు.

చలం:—ఒకప్రశ్న. ముక్తి వుందా ?

అధికారి:—అంటే ?

చలం:—చివరికి—యీ జన్మలతరవాత !

అధికారి:—తెలుసుకో—తొందర లేదు.

చలం:—యోగమూ, మంత్రమూ, భక్తీ, జ్ఞానమూ, విశ్వాసమూ ఇవన్నీ ముక్తి నిస్తా యంటారే !

అధికారి:—అంటారు. అంతే. నిరంతరమూ, తలుచుకోలేనంత అద్భుతమైన ఆనందం ప్రతిజీవికీ జన్మహక్కు. ఎందుకు ముక్తి ? ముక్తి అంటే బాధలనించి—ఆనందం నించి కాదు.

[దుర్గమ్మ.]

దుర్గమ్మ:—దేవా, యీశ్వరా, కరుణించండి. మహాపాపాలు చేశాను. నా జీవితమంతా, నేను చెయ్యనిపాపాలు లేవు. మీ కరుణతప్ప నాకు ఆశ లేదు.

అధికారి:—నీ కెందు కా భయం ?

దుర్గమ్మ:—నన్ను నరకంలో తోస్తారుట. కుండే స్తంభాలకు—కాగేనూనెలో, తోస్తారుట.

అధికారి:—ఏమీ చెయ్యరు.

దుర్గమ్మ:—మరి పాపాలు చేశాను.

అధికారి.—నరకం లేదు.

దుర్గమ్మ:—నా నగలన్నీ యెత్తుకుపోయిన ఆ నరిసింహాం లేదూ వాడికీ నరకం లేదూ ?

అధికారి:—ఎవరికీ లేదు.

దుర్గమ్మ:—యిష్టంవొచ్చినట్టు పాపాలు చెయ్యవొచ్చునా.

అధికారి:—నీ యిష్టం.

దుర్గమ్మ:—ఎన్ని పాపాలు మానుకున్నాను? భయపెట్టారు మూర్ఖులు, ఎన్ని అబద్ధాలు చెప్పారు. చూశి వొచ్చామని చెప్పారు కొందరు.

అధికారి:—అవును, నీకు తృప్తి కాలేదు. అద్భుతమైనవీ, దారుణమైనవీ కార్యాలు తనివి తీరా చెయ్యి, యీసారి.

దుర్గమ్మ:—కాని నా కాబుద్ధి యెందుకు కలిగింది? అందమైన మగవాణ్ణి తీసుకున్నదాకా శాంతి లేదు. ఎప్పుడూ విసుగులేని మన్మథసౌఖ్యాన్ని కోరడం—నన్ను తృణీకరించిన వాళ్లమీది ద్వేషం—ఎంత ప్రయత్నించి, నలిగినా, ఆగుణాలు నన్ను వొదలలేదు. ఎంత నిన్ను ప్రార్థించినా—

అధికారి:—ఆ జన్మకి, నీతో పుట్టినగుణాలు పోతాయా? నీ శరీరపురంగు ఎంత మారగలదో, అవీ అంతే.

దుర్గమ్మ:—(కోపంతో) ఆ, మీరే, మీరే, నన్నట్లా చేశారు. ఆగుణాలతో సృజించారు—తమాషా చూశారు నాబాధ అంతా—

అధికారి:—నిన్ను శిక్షించలేదుగా?

దుర్గమ్మ:—కాని—ఆగుణాలు వుండడంవల్ల నాకు కలిగిన బాధ?

అధికారి:—కాని ఆ గుణాలవల్ల నువ్వు పొందిన ఆనందమో?

దుర్గమ్మ:—అవును అవును.

అధికారి.—నీ స్వభావం ఆగుణాలనించి బైట పడుతోంది గనకనే ఆబాధ.

దుర్గమ్మ:—మరి నన్నన్యాయం చేసినవాళ్లకి శిక్ష లేదా? ఆ నరిసింహానికన్నా చివరికి—

అధికారి:—శిక్ష మాకు వదలరాదూ?

దుర్గమ్మ:—కానీ నా కడుపుమంట—

అధికారి:—శిక్షించిన తరవాత, జాలివల్ల కలిగే ఆ అగ్నిని యేం చేస్తావు?

[కవి—శాస్త్రి.]

శాస్త్రి:—అందరానిది, మాటలలో గాని, గానంలో గాని తెలియపరచలేనిది, ఏనిమషానా నాకు శాంతి నివ్వక ఎడతెగని తృష్ణతో వెర్రివేదనలలో పరువులెత్తించినదీ, ఏదో మహాశక్తి నన్ను కాల్చివేసింది. ఆసమస్యకు అర్థమూ, అంతమూ నీవేనని ఆశపడ్డాను. జీవితంవెనక వుండే ఆనందనృత్యానికి తాళము వేసి, యీ జీవనజలధిలో పొంగి ధ్వనించే గానముతో నాకంఠం మేళవించాలని ప్రయత్నించాను. నాలోని ప్రేమోద్రేకానికి, నా ఆశాగ్ని తపనకు యీ దుర్బలదేహం, అల్పములైన యీ ఇంద్రియాలు తాళుకోలేక, అనంతమైన విశాలత్వానికై పెనగులాడాను. అన్ని

గీతాలలో, గానాలలో నిన్నే వెతికి వేసారి, విసిగి, నీపాదాలు చేరుకున్నాను. నేను చేసినదోషాలు, పాపాలు, యీ అనంతావేశంముందు భస్మమైన ధూమశకలాల వలె తోస్తాయి.

అధికారి:—ఏం కావాలి ?

శాస్త్రి:—ఏం కావాలో నాకు, నా జీవితమంతా వెతుకుతోనే వున్నాను. నీవే చెప్పాలి, నీవే కటాక్షించాలి. వివేకవంతులు నా ఆవేదన నరాలలో పుట్టిన జాడ్య మన్నారు. నీల్యాధికారులు యవ్వనమద మన్నారు. నాతోడికవులు అదొక 'పోజ్' అన్నారు. నాకే తెలియదు. మూఢుణ్ని. నీమీది ఆశ— నీవే నాకు మార్గదర్శకుడవై యీ భూమిలోని, దిక్కులలోని, చుక్కలలోని జీవనాన్నంతా నాదిగా తాగాలనే నా తీవ్రవాంఛని అర్థంచేసుకుని, ఆ బాధలోంచి దివ్య వేణురవాలు పలికిస్తావని నమ్మాను.

అధికారి:—నీవు చంద్రుడిలో జన్మించి అమృతాన్ని చవిచూడు. శాంతి దొరుకుతుంది తాత్కాలికంగా. కాని నీ అశాంతికి అంతం లేదు. నీ అనంతయాత్రా మార్గానికి ఆ అగ్నే వెలుతురు.

# పదునాఱవ శతాబ్ది తెలుగు వాఙ్మయము

డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య, ఎమ్. ఏ., పి హెచ్. డి.

తెలుగువాఙ్మయమునకు పదునాఱవశతాబ్ది మహాయుగమని చెప్పుట అనుచితము కాదు. పదునైదవ శతాబ్దితో అనుకరణములును, అనువాదములును ప్రాబల్యము తగ్గినవి. అక్కడక్కడ ఒకరిద్దఱు ఒక్కొకపురాణము సంగ్రహించుచువచ్చినను అది లెక్కగొన నక్కఱలేదు. హరిభట్టు, వెన్నెలగంటి సూరన్న అను నిద్దఱు కవులు మాత్రమే అనువాద యుగమున కింకను సరియైన పట్టుకొమ్మలై నిల్చినవారుగా కన్పట్టుదురు. హరిభట్టు మత్స్య, వరాహ, నారసింహాది పురాణముల ననువదించుటయే కాక భాగవత పురాణమును చాలవఱకు తెలిగించెను. శిష్టమై రమణీయమైన ఆతని రచనాశైలి ఉత్తమ కవులను తఱుచు తలపించుచుండును. వెన్నెలగంటి సూరన్న కృష్ణదేవరాయల సామంతుడైన బవయరాఘవుని ఆశ్రితుడు. ఆతడు విష్ణుపురాణమును అనువదించి తన ప్రభున కంకిత మొనర్చెను. ఆతని కావ్యము సరళమనోజ్ఞమగు శైలితో నొప్పును గాని, హరిభట్టుచేతి ప్రౌఢికిని, పుష్టికిని దీటురాదు. దాదాపు ఆశతాబ్దినడిమివత్సరముల వాడగు కోనేరినాథునిగూడ ఈసందర్భమున పేర్కొనదగును. సుబోధము, రంజకమునగు నాతని బాలభాగవతము కొంత గుణవత్కావ్యముగనే కానవచ్చును. ఈశతాబ్దినే జీవించెనని చెప్పబడు మొల్లఅను కవయిత్రి రామాయణకథను మనోహరమగు పద్యకావ్యముగ రచించెను. కాని వీ రవలంబించిన రచనా ఫక్కి అప్పటికి అంతరించుచుండెను. అంతకు పూర్వము వీరు జీవించియుండినచో వీరిరచనలు ఎక్కువ జనాదరము పొంది యుండెడివి; నా డంతగ వ్యాప్తి గాంచవాయెను. ఏలయన ప్రజలమనోగతి చాలగ మారి పోయినది. పురాణముల అనువాదములతో వారికి తృప్తిలేకపోయెను. కథావస్తువులందు కాకున్నను చెప్పెడిరీతియందు, నిరూపణమందు, నవ్యతయు, ఉపజ్ఞయు చూపు రచనలు వారు కవులవలన అపేక్షించిరి. అట్లగుటనే ప్రబంధమను నూతనకావ్యపద్ధతి యొకటి నాడు మొలకెత్తెను.

ప్రబంధ మనగా ఎట్టిది? శబ్దతః చూచిన కావ్యనిర్మితి యనియే దానియర్థము; ఈ యర్థమున ఏకావ్యమైనను, ఏపురాణమైనను ప్రబంధమే. ఆంధ్రమహాభారతము ప్రబంధ మని కొన్నియెడల పేర్కొనబడెను; శ్రీనాథమహాకవి తన కాశీఖండమును ప్రబంధమని పిలిచెను. క్రమశః దానిశక్తి కొంత మార్పు చెంది పదునాఱవశతాబ్దిప్రారంభమునుండి

ఒకానొక తెగకు మాత్రమే అది రూఢమయ్యెను. ప్రబంధమనగా శృంగారరసప్రధానమై, నాయికానాయకుల చరిత్రకథనముతోపాటు అష్టాదశవర్ణనముల కాకరమై వెలయు కావ్యమని యేర్పడెను.

వర్ణనయోగ్యములగు పదునెనిమిదివస్తువు లేవనగా: (౧) ప్రభువు, (౨) నగరము, (౩) పర్వతము, (౪) నది, (౫) సూర్యోదయాస్తమయములలో నొకటి (౬) చంద్రోదయము, (౭) ఋతువులు, (౮) సరస్సు, (౯) ఉద్యానము, (౧౦) కన్య, (౧౧)విరహము, (౧౨) దౌత్యము, (౧౩) వివాహము, (౧౪) మద్యపానము, (౧౫) రతి, (౧౬) పుత్రోదయము, (౧౭) యుద్ధము, (౧౮) యాత్ర— అనునవి. మహాప్రబంధమున ఇన్నియు వర్ణితములు కావలెను. అట్టివి మూడునాల్గుకంటె లభింపవు. తక్కినవి యేదో ఒక విషయమున కొఱవడుచుండును. కావున కించిల్లోపసహితములైనను అవి మహాప్రబంధము లనిపించుకొనుటకు అవకాశము కల్పింపవలసి వచ్చెను.

ఇతివృత్తమునుబట్టి ప్రబంధము మూడుతెగ లాయెను: (౧) ప్రఖ్యాతము, (౨) ఉత్పాద్యము, (౩) మిశ్రము.

(౧) రామాయణము, మహాభారతము, పురాణములు మున్నగు ప్రసిద్ధగ్రంథముల నుండి కథావస్తువును గ్రహించి, మార్పులు చేయక వర్ణనాదికములందు మాత్రమే కవి తన చమత్కారము చూపుచు రచించినది ప్రఖ్యాతప్రబంధము. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శృంగార శాకుంతలము ఇందులకు సుపరిచితమగు ఉదాహరణము. కాని ఒక్క అయ్యలరాజు రామభద్రుడు తప్ప పదునాఱవ శతాబ్దిని మరేకవియు పినవీరభద్రుని దారి త్రొక్కినట్లు కానరాదు.

(౨) ఉత్పాద్యమున వస్తువంతయు కవికల్పితమే. ఈకాలమున ముగ్గురు కవులు మాత్రమే ఉత్పాద్యప్రబంధములు రచించినట్లు కానవచ్చును. మల్లన రాజశేఖర చరిత్రమును రచించి, కృష్ణరాయల ప్రతినిధిగ కొండవీటి నేలెడు నాదిండ్లగోపుని కంకితమిచ్చెను. ఎడనెడ దోషసహితమయ్యు నీతనిరచన సుబోధమై మనోజ్ఞముగ నుండును. నెల్లూరి మండలమందలి కందుకూరు గ్రామవాసి కమసాలి రుద్రయ్య సుప్రసిద్ధమగు నిరంకుశోపాఖ్యాన ప్రబంధమును రచించి తన యూరిదేవున కంకితమొనర్చెను. శ్రోత్రియులగు పండితులు నీతిబాహ్యమగు కావ్యమని దీనిని నిరసించినను, శైలీసౌభాగ్యమున కిది మేలుబంతిగా ఎన్నికగన్నది. ఉత్పాద్యరచయితలలో పింగళి సూరన్న తలమానిక మనుటకు సందియము లేదు. ఇతడు పదునాఱవశతాబ్దిసడిమికాలమువాడై, నంద్యాల ప్రభువగు కృష్ణరాజు నాస్థానకవిగ వాసికెక్కెను. ఈతడు రచించిన ప్రభావతీప్రద్యుమ్నము,

కళాపూర్ణోదయము నను రెండుకావ్యములును మిక్కిలి అందమైనవి. తక్కిన ఉత్పాద్య కవులవలె ఈతడును తన ఇతివృత్తమును తానే కల్పించుకొనును; కాని వారివలె కాక, ఈతడు కథ నడపుటలో అపూర్వమైన ప్రతిభయు, ఉపజ్ఞయు ప్రదర్శించును. ప్రభావతీ ప్రద్యుమ్నమందలి కొన్నిపాత్రములు భాగవతమునుండి కాని హరివంశమునుండి కాని గ్రహించిన వనుమాట వాస్తవము; కాని యితివృత్తము, పెక్కుపాత్రములును సూరన్న సృష్టినైపుణివలన నుద్భవిల్లినవి. తనపాత్రలకు జీవము పోయుటయందు సూరన్న గొప్ప నేర్పు కనపఱచును. ఇట్టిది ప్రబంధకవులలో అరుదుగా కానవచ్చును. ఆంధ్రకవు లందరిలో ఒక్కసూరన్నకే నాటకఫక్కి అలవడినది; ఆతని కావ్యముల లోకవిలక్షణమైన రక్తి యిందువలన కలుగుచున్నది. కళాపూర్ణోదయము మాదిరికి ప్రభావతీప్రద్యుమ్నము కంటె కొంతవరకు భేదిల్లును. కావ్యమంతయు గొప్ప ప్రతిభవలన ఉద్భవించిన నిర్దుష్టమగు కళారచనము. ఇతివృత్త మేమి, కథపట్టు లేమి, జీవము తొలకాడుచు మంచి పనితనముతో నొప్పుచుండును. కళాపూర్ణోదయము తెలుగునకు పద్యగత కాదంబరి; చదువరి ఆద్యంతము చదివి, ముగిసినందులకు చింతిల్లును. మధ్యయుగము కవులలో సూరన్న ఉత్తమశ్రేణి నలంకరించును; అతనికి ప్రతివచ్చు కవులు అరుదు. ఆతని శైలి సరళగంభీరమైనది; వర్ణనములు స్వాభావికములును ఔచిత్య మెరిగినవియు నై యొప్పును; కథనము మృదువుగా, నిండుప్రవాహమువలె తీవిగ నడచిపోవును.

(౭) మిశ్రబంధము లేక మిశ్రప్రబంధ మను దానియందు ఏపురాణాదికమునుండియో గ్రహించిన ప్రసిద్ధగాథకుతోడు కొన్ని సంఘటనములును, కథపట్టులును కల్పితములగును. అనగా మాతృకను కవి తన యిచ్చవచ్చినట్లు మార్చుకొనగలడు. ఈజాతి ప్రబంధము పదునారవ శతాబ్దిని మిక్కిలి వ్యాప్తిగాంచినది: ఇందులకు హేతువు, తొలుదొల్త నిట్టివి రచించిన కవులు సిద్ధహస్తులై మిక్కిలి సాఫల్యము పడసియుంటయే కానోపును. కేవల కల్పనాకథలుకృత్రిమరత్నములనియు, ఆద్యకథలు గనినుండితీసి సంస్కృతిలేని మణులనియు, అట్టివి కవికల్పనలతో జోడించిన సానబట్టిన జాతిరత్నములై ప్రశస్తము లగుననియు నొక మహాకవి మిశ్రప్రబంధమును ప్రశంసించియుండెను. ఈమాటలే యిట్టి ప్రబంధమునకు నాడు చేకూరిన ఆదరమును నిదర్శించుచున్నవని చెప్పవచ్చును.

పారిజాతాపహరణకర్తయగు నంది తిమ్మన మిశ్రప్రబంధకర్తలకు మొదటివాడుగా కానవచ్చును. కృష్ణరాయల కంకితమిచ్చిన యీతని యీ కృతి నాటి ఉత్తమప్రబంధ ములలో నొకటి. మధురమైన భాషాశైలి, తీర్చిన అలంకారసంపద, చక్కని రసౌచితి, సున్నితమగు పనితనము దీనికి వన్నె తెచ్చెను. మిశ్రప్రబంధకవులలో నెల్ల అగ్రగణ్యుడు మనుచరిత్రము రచించిన అల్లసానిపెద్దన. ఆతనికాలముననే కాక ఇటీవలి శతాబ్దులలో

సహా పెక్కుకవులు మనుచరిత్రమును ఒరవడిగా గొని రచనలు సాగించిరి. ఆతనివెనుక రచించిన కావ్యము లన్నిటను ఆతని ప్రభావము కాన్పించుచునే యుండును. ఆతనిశైలి మధురమై, సంస్కృతాంధ్రముల అందమగు సమ్మేళనముతో చిక్కనినడక చూపును. ఆతనిఅల్లిక జిగిబిగి యని ప్రసిద్ధి. అందమగు ప్రకృతిదృశ్యము కనులెదుట తెరచుటకు కాని, తనపాత్రములకు జీవముపోసి మానవపదవిని నిల్పుటకు కాని ఆతని కెంతో ప్రయత్న మక్కరలేదు. కృష్ణరాయ లీతని సామర్థ్యమునకు ముగ్ధుడై యీతనిని తన ఆస్థాన కవిగా నియమించుకొనుటయే కాక యీతనికి ఆంధ్రకవితాపితామహుడని బిరుద మొసగెను. కృష్ణరాయలు సహా గొప్పకవి. ఆతడు రచించిన ఆముక్తమాల్యదయను ప్రబంధము ప్రబంధవాఙ్మయముననెల్ల అగ్రగణ్యమని ఆధునికవిమర్శకుల యభిప్రాయము. ఇందలి శైలి మనోహరముగ నుండదు. సాంస్కృతికములతో నిండి, పెటుకుగా నడచును. క్రొత్తగా చదువ చేబూనినవానికి మొగము మొత్తును; కాని కొంచె మోపికపట్టినచో పెన్నిధులు చూపును. ఇది రాయలు రచించినదే యని ప్రతీతి యున్నను, కొంద రిది పెద్దనార్యుని కృతి యనియు, మఱికొందరు రాయలదే యనియు ఇప్పటికిని వాదములు పెంచుకొనుచున్నారు. ఆముక్తమాల్యద కృష్ణరాయలును, పెద్దనయు కలిసి రచించిన కృతియని చెప్పుట సమంజసముగా కానవచ్చును. కృష్ణరాయలదేయని నొక్కి చెప్పువారును ఇందు పెద్దనచేయి పడలేదని చెప్పుట కష్టము. మఱియు, మనుచరిత్ర శైలికిని ఆముక్తమాల్యద శైలికిని మొత్తముమీద కన్పడు భేదము గమనించిన, అంతయు పెద్దన రచించినదే యనుటకు బొత్తిగా వీలు కన్పడదు.

సంకుసాల నృసింహకవియు కృష్ణరాయలనాటివాడే యని చెప్పుదురు. ఇందులకు తగిన నిదర్శనము మాత్రము లేదు. ఈతని కవికర్ణరసాయనము కొలదిపాటి ఉత్తమ ప్రబంధములలో నొకటి. ఇందు నలుబదియైదు వర్ణనము లున్నవట. ప్రబంధకవులలో నెల్ల ఈతడగ్రగణ్యుడని కొందఱు పండితుల యభిప్రాయమే కాని, ఈతనికృతి చదువుటకు నీరసముగ నుండి విసుగు పుట్టించును. రచననుబట్టి చూచిన ఇది ఇటీవలి కాలమున, ప్రబంధము క్షీణదశ నొందిననాట వెలువడినదని భావించనగును. తాళ్లపాకం పెదతిరుమలార్యుడు నీతిశతకమను శతకమును రచించెను. ఇందు ఆనాటి సాంఘిక స్థితిగతులు కొంతవరకు తెలియవచ్చును. ఆతని కుమారుడగు తిరువేంగళనాథుడు, అష్టమహిషీ కల్యాణకర్త, అచ్యుతదేవరాయల కాలమువాడు. రామరాజభూషణుడు సదాశివరాయల కాలమువాడు. ఆతడు రామరాజునకును, ఆతని తమ్ముడగు తిరుమలరాయలకును ఆశ్రితుడు. ఆతడు వసుచరిత్రమను మహాప్రబంధమును రచించెను. ఇది తెలుగున ఉత్తమ కృతులలో నొకటి యన్న ప్రసిద్ధి సార్థకమైనది. ప్రతిభాసంపత్తి కీతడు పెద్దనకును,

సూరనకును తీసిపోవును; కాని వారిని మించిన పనితనమును కావ్యము పొడుగునను కన్పర చును. ఇతివృత్త మల్లుటయందును, పాత్రపోషణమందును ఈతడు చూపిననేర్పు స్వల్పమే యైనను, తనచేతికి లొంగివచ్చిన అలంకారసామగ్రీసంపాదనమందు ఆలోటును మఱుగు పఱుచును. ఏమైనను ఉత్కృష్టాంధ్రకవులలో రామరాజభూషణునికి స్థాన మిచ్చి తీర వలెను. రామరాజు జ్ఞాతియగు రంగప్పరాజు సాంబోపాఖ్యాన మను కావ్యము రచించెను. అదియు కొంత సౌందర్యము కలదియే కాని, అందలి అతిమాత్రములగు శృంగారవర్ణన ములవలన ఇప్పుడది రుచించుట కష్టము.

మతసాహిత్యము:—దేవతామాహాత్మ్యము కీర్తించునవి, క్షేత్రమాహాత్మ్యము కీర్తించునవి, గురుజనాదుల మాహాత్మ్యమును కీర్తించునవియు నిట పేర్కొనదగును. అవి మూడు తెగలుగా విభజించిన వీలుగా నుండును.

(౧) దేవతా మాహాత్మ్యము కీర్తించు కావ్యములు:—అచ్యుతదేవరాయల యాస్థానము నలంకరించి రాధామాధవకవి యను నామాంతరమున బరగు ఎల్లయార్యుడు తారకబ్రహ్మరాజీయము, విష్ణుమాయావిలాసము అను రెండుకావ్యము లిట్టివి రచించెను. అసమగ్రముగ లభించిన తారకబ్రహ్మరాజీయము విష్ణ్వవతారమగు రాముని కీర్తించును. విష్ణుమాయావిలాసమున జీవులను సంసారమగ్నుల జేయుటకు పన్నిన విష్ణుని మాయాలీలలు పెక్కు కథలుగా వర్ణితములైనవి. ప్రసన్నమగు శైలితో నొప్పుచు అపూర్వ శోభావహమగు నీ కావ్యము మిక్కిలి మనోజ్ఞమైనది. ఇందలి వర్ణనములు ఒక్కసారి చదివిన ఇక మఱపునకు రావు. ఇది ఆ శతాబ్దియందలి ఉత్తమకృతులలో నిల్వఁగల దనుటకు సందియము లేదు.

(౨) క్షేత్రమాహాత్మ్యమును కీర్తించు కావ్యములు:—ధూర్జటికవి కాళహస్తి మాహాత్మ్యము ప్రమాణగ్రంథములలోనిది. ఇందు మధుర గంభీరమగు శైలి, పుష్టి గల పాత్రములు, మనోజ్ఞమగు కథనము చదువరి నాకర్షించును. మాహాత్మ్యములు రచించిన వారిలోనెల్ల తెనాలి రామకృష్ణుడు అగ్రగణ్యుడు. ఈతడు రెండు మాహాత్మ్యములు రచించెను. పాండురంగమాహాత్మ్యము మిక్కిలి ఉత్కృష్టమగు కావ్యము. కథా కథనమున రామకృష్ణునికి సాటి యెవ్వరును లేరు. ఈతనిశైలి గంభీరమైనది. అత్తుకొనెడి ముచ్చటైన ఉపమానములు, స్వాభావికములగు వర్ణనములును మెచ్చదగియుండును. వేయేల ? వాఙ్మయమున రుచులును, ఇష్టములును మార్పు చెందినను శాశ్వతమగు జనా దరము నిలుపుకొనఁగల రచయితలలో రామకృష్ణు డొకడు. ఆతని ఘటికాచల మాహా త్మ్యము ఆతని జీవితకాలమున వెల్లడికాక అంత ప్రసిద్ధి నొందలేదు. పాండురంగ మాహాత్మ్యమునకు సరిరాకపోయినను ఇదియు గొప్ప కావ్యమనియే చెప్పనగును.

(3) గురుజనాదుల మాహాత్మ్యమును కీర్తించు కావ్యములు:—పైని పేర్కొన్న రెండు మాహాత్మ్యములును కాక, రామకృష్ణుడు తన జవ్వనమున ఉద్భటారాధ్య చరిత్ర మను కావ్యమును రచించెను. అందు ఉద్భటు డను శైవయోగి చరిత్రము వర్ణితము. ఇది కొన్ని శకలములుగా మాత్రమే లభించినది. అం దాతని కవితాచాతుర్యము కొంత అపరిణతముగ కానవచ్చుచున్నది. తిరువెంగళనాథుని ద్విపదకావ్యమగు పరమయోగి విలాసము వైష్ణవయోగులగు ఆళ్వారుల జీవితకథలను ముచ్చటించును. ఈకవికి ద్విపద చ్ఛందస్సు కరతలామలక మందురు; కాని యీతనికి పూర్వమువారగు రంగనాథుడును, గౌరన్నయు నడిపినంత సాఫీగా ఈతడు ద్విపద నడిపినట్లు తోచదు. ఇదే పేరుగల మరొకకావ్యము రామరాజు మేనల్లుడగు తిమ్మరాజు రచించెను. ప్రబంధ కవిత్వ మిందు లేకపోలేదు కాని, విశేషముగ చెప్పదగ్గ గుణ మేదియు మాత్ర మిందు లేదు.

తుళువ రాజ్యకాలమున మఱియు కొన్ని చిల్లరకృతులు బయలుదేరినవి కాని, అవి యంత గమనింప నక్కఱలేదు. ఈ పై చెప్పినదానివలన, ఆంధ్రకవిత్వ చరిత్రమున నొక మహాయుగమని చెప్పదగ్గ కాలమున, కావ్యవాఙ్మయము ప్రధానముగా ఏమార్గముల వికసించినదో తెలియవచ్చును.

# 'వైతాళికులు'[1]

## కొంపెల్ల జనార్దనరావు

చివరకు ముద్దుకృష్ణగారు ఆధునిక కావ్యరత్నభండారం వెలువరిచారు. నేటికవుల బండారం దీనిలో తెలుస్తుందట.

పెద్దకావ్యాలు విరివిగా రచించే యుగాలతాలూకు సాముదాయిక కళాసత్త్వం తెలియవలెనంటే అనేకగ్రంథాలు చదవవలసి ఉంటుంది కాని, యుగధోరణి సాధారణంగా ఏ ఒకటి రెండు కావ్యాలు చదివినా తెలుస్తుంది: జనుల ఆదర్శాలూ, అవి కవితలో ప్రతిబింబించిన రీతీ తెలియవస్తుంది. ఒక్కకావ్యము తత్కవితాలూకు సామర్థ్యాన్ని చాలావరకు ప్రకటించగలదు.

నేటి ఒకకవి సంగతి తెలియవలెనంటే అనేక ఖండకావ్యాలు పోగుచేసుకోవలసి ఉంటుంది తరుచు. యుగలక్షణాలు ఆలాటి అనేకకవుల రచనలు సేకరించుకుంటే కాని సుబోధములు కావు. ఖండకావ్యాలకు ఈలాటి సంకలనాలు అవసరమూ, వీలూ కూడాను. సంపాదకులు పీఠికలో 'భూతభవిష్యత్తులు అతనికి (కవికి) ఎంత విలువగలవి అయినప్పటికీ ఆతని ఆందోళనా, యత్నమూ వర్తమానానికి చెందినవే—అతని హృదయం కొట్లాట వర్తమానంలోనే' అని చెప్పారు.

> 'ఈ కారణంచేతను, ఏ కవి రచనలలోనైనా సరే, తన సంఘపరిస్థితులు, తన కాలానికి చెందిన వాతావరణము ప్రతిబింబితము కాక మానవు. అంతే కాదు. నిజమైనకవి వీటిని రద్దుచేసుకొని జీవించడు.'

ఆలాగు కవిజీవితానికీ, సంఘానికీ, దేశానికీ, ఆతడు జీవించినకాలానికీ సన్నిహితం కాని కృతికి విలువ లేదని వివరించి వర్తమానయుగానికి చెందిన విలువగల కావ్యాలు ఏర జూచారు. కావ్యం యశస్సుకోసం, అశుభాన్ని పోగొట్టడంకోసం—అంటూ సంఘసంప్రదాయాన్ని సురక్షితంగా చూపుతూ ఉపదేశం ఈయగల వస్తువును ఆలంబనంగా చేసుకొని, పూర్వం కావ్యం ఆలపించారు కవులు. నేడు సంప్రదాయమునెడల భక్తివల్లకంటె, సంప్రదాయంతోడి రాపిడివల్లనే ఎక్కువకవిత్వం పుట్టుతున్నది. వ్యక్తివాంఛలూ, సంఘం వాంఛలూ సమరసపరుచుకొనే నిరంతరవ్యాపారంలో నాగరకత సాగుతూండగా, కవి వ్యక్తి తాలూకు ప్రవృత్తులు, నిగూఢములైన జీవితరహస్యాలు, స్వప్నాలుగా, ఆద్యభూతాలు కొత్తగా కలిసి రూపాలు కట్టుతున్నట్లు, భావోద్రేకముతో కావ్యము పలికి ఆలోచన రేపు తాడు. ఆకావ్యంతాలూకు రమణీయతవల్ల ఆ ఆలోచన అనురోధముపాలై, హృద్యమైన

[1] ముద్దుకృష్ణ సంకలితము. జ్వాల, బెజవాడ. క్రౌను ౨౦౦ పుటలు. వెల రు ౧-౮ అ.

అవగాహనంవల్ల ప్రసరిస్తుంది. సంపాదకులు పీఠికలో 'ఏనూతనదృష్టి అలవరుచుకుంటే సంఘానికి భావిలో ఎక్కువనీతి, ఉత్తమగతి కలుగుతుందో, దానిని కవి సూచిస్తాడు' అనీ, 'భవిష్యత్తులోకి ఉత్తమమార్గాన సంఘాన్ని నడిపించడం తన నిరంతరలక్ష్యంగా ఎంచుకుంటాడు' అనీ చెప్పారు. కవులు మొదలంట రేగి రేపే అనుభవసత్త్వంవల్ల సంఘం తాలూకు నీతికల్పంలో క్రమశః కొన్ని రేకులు విరియవచ్చు. కాని నిరంతరలక్ష్యంగా సంఘవిషయాలు కవి చేపట్టుతా డనే కంటె, సాంఘికప్రవృత్తి సహా తన వ్యక్తిగతమైన అనుభవముపరంగానే పలుకుతాడని యెంచవచ్చు. 'Poets are the unacknowledged legislators of the world' అని షెల్లీకవి చెప్పినా, ప్రపంచమే కాదు, తాముకూడా కవులు తమ జగద్వ్యాపకత్వం మొదట గుర్తించ రనే చెప్పవచ్చు. అది షెల్లీ లాక్షణికంగా— కవి తా నాపదవి పొందవలెననే లక్ష్యంతోనే కవిత చెప్పుతాడని—ఉద్దేశించినట్టు భావించ నక్కరలేదు.

**'It is not the poet's business to save man's soul but to make it worth saving'**

అన్నాడు ఫ్లెక్కర్ (James Elroy Flecker) అనేకవి. మనిషిఆత్మకు ముక్తి నివ్వడం కాదు కవిపని, దానిని ముక్తి కర్హమైనదానినిగా కావించడం.

ఆతడే ఇంకా అన్నాడు:

**'However, few poets have written with a clear theory of art for art's sake, it is by that theory alone that their work has been, or can be, judged;—and rightly so if we remember that art embraces all life and all humanity, and sees in the temporary and fleeting doctrines of conservative and revolutionary only the human grandeur or passion that inspires them......'**

అన్నాడు. కళ కళకోసమే—అది తనయందే పర్యవసిస్తుంది—అనేవిషయం దృష్టిలో ఉంచుకొని వ్రాసిన కవులే చాలా తక్కువ: వారిరచన ఈదృష్టితోనే పరిశీలించాలి. కళ జీవితాన్నంతనీ, మానుషలోకాన్నంతనీ తనలోకి దింపగలది. సంప్రదాయపరత్వమనీ, విప్లవపరత్వమనీ తాత్కాలికములూ అస్థిరములూ అయిన సిద్ధాంతాలు ఏర్పడడంలో ప్రధాన చైతన్యమైన మానుషమహాత్మ్యాన్ని, ఉద్వేజనాన్ని నిరూపిస్తుంది కళ: ఇది జ్ఞాపకం చేస్తాడు ఫ్లెక్కరు. అనేకులు కళలో, కవితలో, సందేశం, ఉపదేశం, కావలెనని వెదుకుతారు. ఒకనీతి గణబద్ధముగా చెప్పినవానికంటె అనుభవాన్ని హృద్యంగా ప్రతిపాదించినవాడు మంచి కళాశాలి అని ఒప్పుకోనివారు కళఅంటే ఉపదేశ మీయడమే అనుకుంటే చర్చ అక్కరలేదు. వారు పూర్వలాక్షణికులనుమాత్రం తమతో ముడిపెట్టుకొని అగౌరవించకుండా ఉంటే సంతోషించాలి. పూర్వులు రసంమీద, రమణీయతమీద భద్రంగా నిలిచి కావ్యలక్షణం వివరించారు. ఆధునికులు చిన్నచిన్నభావాలనుసహా కవితగా కట్టజూడడం నిందాపాత్రముగా చూస్తారు కొందరు. పెద్దకావ్యం వ్రాసి అద్భుతపరిస్తే కాని

ఒకరసం పరిణమించినట్లు కాదన్నది పొరపాటు. ఈచిల్లరభావాలంటే వ్యభిచారిభావము లన్నది పొరపాటు. అనంతములు భావములు, అనంతములు రసములు—అని మన లాక్షణికులు చెప్పకపోలేదు. భావముపట్ల వ్యభిచారిత సాకాంక్షము; ఒకస్థాయిని బట్టి ఒకభావం వ్యభిచారి అవుతుంది. అదే వేరొకచో స్థాయిముఖం కాగలది. కొన్ని భావాలు మాత్రమే స్థాయులనీ, తక్కినవి వ్యభిచారులనీ, ఆ కొన్ని స్థాయులూ మాత్రమే రసత్వం పొందగలవనీ, అవిమాత్రమే కావ్యములో ప్రయోజ్యములనీ, తక్కినవి అవలంబించిన సందర్భాలు కావ్యత్వం పొందవనీ యెంచడం లక్షణకల్పాన్నీ కావ్యశక్తినీ సంకుచితం చేయబోయే అసాధ్యమైన పూనిక. ఏ అనుభవమునుండి అయినా రసం ఉత్పత్తిల్లగలదు. ఏ భావమూ స్థాయిత్వం పొందినప్పుడు ఆ రసాలపట్టికలో తొమ్మిదింట ఒకపేరు కింద నిల బడుతుంది. అయితే పూర్వం విభావాదులు విస్పష్టముగా వివరించి రసపరిణతి చేకూర్చితే, నేడు విభావాదులున్ను వ్యంగ్యములో ఇమిడ్చే కొత్తవ్యవస్థ వాడుకలోనికి వచ్చింది. విభావన, భావాన్ని నాట్యధర్మిగా ఎత్తడం అంతటా సమానమే. రసరచనానికి ఒక్కవిధం కాదు.

Lyric Poetry (భావకవిత్వం) అన్నది అసలైన కవిత్వానికే మరొకపేరు— అని స్మరించాడు Edmund Gosse అనే ఆయన. ఏసత్కావ్యంలో కనిపించే రసఘట్టమైనా కవి ఉద్రిక్తుడై చెప్పినదే. అదే విభావాదికం వ్యంగ్యమాత్రంగా అవలంబించి భావకవిత్వం అనేపేరు కోరుకొంటుంది. ఇది సామాన్యముగా భావకవిత్వం కనబడే స్వరూపం. పూర్వం కవి ఒకకథలో రసం పండించి, తనభావాలూ అనుభవాలూ పరికరసామగ్రిలో ప్రయోగించే వాడు. ఒక్కొకప్పుడు తన అనుభవవిశేషాన్ని ఒకఘట్టంలో, ఉపకథలో చెప్పడమూ విరళముగా కన్పిస్తుంది. 'కళాపూర్ణోదయము'లో సుగాత్రీశాలీనుల కథ విశిష్టమైన అను భూతిని ప్రకటించే కావ్యఖండం—ఖండకావ్యమున్ను. నేటికవిన్నీ తన అనుభవాన్ని ఒక కథావస్తువున ఆరోపించి విషయముఖ భావకావ్యం (objective lyric) సంతరిస్తాడు. కాక విభావాదికం దాచి కేవల రసఘట్టములో ఉద్రిక్తుడై కావ్యం పొంగించే ఫక్కీ తరుచైనది. ఉదాత్తకథావలంబనం మాని, వ్యక్తి స్వీయానుభవం రసీకరించుకొనడంలో అనేక అనుభ వాలు నిత్యజీవితంనుండి కావ్యవస్తుత్వం పొందుతవి.

ఈలాటి కవితావేశంలో, సిద్ధహస్తులైన కొద్దికవుల చేతినుండి వచ్చిన రచనమే కాక, ప్రయత్నాలుచేసే పెక్కురివల్ల భావసంపత్తి భాషాసౌష్ఠవములో రూపొంది కొన్ని మంచి కావ్యాలు సిద్ధించడం అనుభవగోచరం అవుతున్నవిషయం. మన్రో (Harold Monro) అనే ఆయన Twentieth Century Poetry Anthology సంకలితం చేస్తూ, వందమంది వల్ల ఐదువందల మంచికావ్యాలు మనకు దొరుకుతవి, తక్కువులు శాశ్వతంగా నిలవగల

ప్రతిభ లేనివా రయినప్పటికిన్ని, అని చెప్పినాడు. ఎక్కడా అది నిజమే అవుతుంది తరుచు, భావకవితకు సంబంధించినంతవరకు. అనగా ఈలాటి సంకలనాలపట్ల కవులమీదకంటె కావ్యాలమీద ఎక్కువదృష్టి నిలపవలసిన అవసరం ఉంటుంది. ముద్దుకృష్ణగారు కొందరు కవులను ప్రధానముగా మనసులో ఉంచుకొని ఈసంకలనం చేసి ఉండకపోతే ఇంకా చాలా కావ్యాలు ఇందు ఔచిత్యంతో ప్రవేశం పొందగల్గిఉండేవి. అయితే వీరు ముఖ్యులైన వైతాళికులను మాత్రమే ఏరుకొన్నారు.

"ప్రాచీనంలోనే యుగపరపరంగా విస్పష్టమైనమార్పులు కలుగుతూ వచ్చినప్పుడు, ఈనాడు ప్రతిదేశంలోని విజ్ఞానమూ, ఏదేశంలో ఏవ్యక్తికైనా ఇంతసులభంగా అందుబాటులోనికి వచ్చినప్పుడు, ఆధునిక సారస్వతంలో కలిగినమార్పుకన్న రాదగినదే ఎక్కువ ఉన్నదేమో అనిపిస్తుంది" అని ఊహించి సంపాదకులు దీనికి 'వైతాళికులు' అని పేరు పెట్టినారు. నిజంగా ఇది సంధిసమయమే. అదే అయితే, ఇది భావిసౌభాగ్యానికి ఎంతమంచి ప్రారంభం ఇస్తున్నదో అని ఆశ కలుగక మానదు—ఈసంపుటము తిలకిస్తే. మరికొందరు వైతాళికులున్ను ఇందు చేరవలసినవారు లేకపోలేదు. ముఖ్యంగా పింగళి కాటూరి జంట. ఈలోటు ఏకారణంచేత వచ్చినదైనా, ఇందు కూర్చిన కవుల కావ్యాలవల్ల ఆధునిక కవితాసత్త్వం బాగా తెలియవస్తూనే ఉన్నది.

నవ్యకవితకు 'మానిషాద' ప్రాయమైన గురజాడవారి తొలి ముత్యాలసరం కావ్యం ఈలాటి సంకలనానికి మొదట నిలవవలసిందని చెప్పవచ్చు; కాని కథనాత్మకములైన కావ్యాలు సంపాదకు లిందు కూర్చ నెంచకపోవడంవల్ల, ఆకావ్య మందలి కథనచ్ఛాయ దానికి ప్రవేశ మిచ్చిఉండకపోవచ్చు. ముఖ్యముగా వ్యక్తిపరత—ఐకాంతికత **(individualism)**—విషయిముఖతయూ **(subjectivity)**—నవ్యకవితయందు ప్రధానముగాను, ప్రబలముగాను బలిసి వచ్చినవి కాబట్టి, ఇందు ఎక్కువ ప్రవేశము పొందక తప్పదు.

'దేశమును ప్రేమించుమన్నా' అనీ, 'హృదయములు చీల్చి చదువుడో సదయులార' అనీ సోదరజనాన్ని ఉద్దేశించి చెప్పిన దేశభక్తి కవిత్వమే, 'వేగిక్షేత్రము' అనే విశ్వనాథవారి కావ్యములో కవి తనలో తాను ఉద్రిక్తుడై పలుకుకొన్నాడు. వేదులవారు సుమజన్మము ఆరోపించుకొని 'కాంక్ష' ఊరినారు. అదే భావమున, రామిరెడ్డిగారు, అబ్బూరివారు మాతృమూర్తి దివ్యసందర్శనం పొంది నైవేద్యాలు పెట్టినారు. ఒక్కొక భావము ఎన్నెన్నివిధాలనో కావ్యరూపాన అందాలు తిరగగలదు. మరిన్ని కవి ఆభావాన ఎంత తపించినాడో తెలియవస్తుంది: సముదాయానికి చెందిన భావమూ తన లోపలి సహజమైన అనుభవము మేరకు కవి నిరూపిస్తాడు.

## 'వైతాళికులు'

మనఃప్రవృత్తులలో ప్రేమ ప్రధానమైనది కాగా, కవితలో ఆ భావము ప్రబలముగా అవతరిస్తుందని గమనించారు కళాకోవిదులు. అయితే అది ఉదాత్తమైన నిర్వహణం పొందు తున్నదా లేదా అనే పరీక్షలో ఆధునికులు కొంత వెగటు పుట్టిస్తున్నారు. శృంగారములో ప్రలపించిన కొందరు పూర్వులవలె, విప్రలంభములో, కరుణములో ప్రాకృతులై విలపించిన కొందరు ఆధునికుల కవితలు తాము చమత్కారకలితము లయిన్ని అనుకృతులలో—ఒక్కొకపుడు కవి తనను తానే అనుకరించుకొన్నాడు—సాగదీయబడ్డవి. కాని సాధారణముగా ఏకావ్యము తీసుకొన్నా, తెలివితేటలు, సంస్కారము, నాగరకత దాని భావ సామగ్రిని నిబిడితమై ఉండడం తరుచు చూస్తాము. అనుభవంకంటె అది రేపినభావమే ప్రధానంగా చూచుకొంటాడు కవి. ఆ భావముపుష్టికి తోడుపడుతున్న సామగ్రి తాలూకు సంపన్నతమాత్రం ఉపేక్షించరానిది. అనుభవసంపత్తిపట్ల వచ్చే విమర్శాన్ని కవులు గుర్తించవలసినదే అని చెప్పినట్లే, వారి కళాసంపత్తిని లోకము గుర్తించవలెనని చెప్పడమూ ఉచితం.

చిత్తశుద్ధితోడి వీరి కవితావ్యాపారానికి లొంగిన వస్తువులు అనేకం. మూడుపద్యాలలో, ఒక్కపద్యములో కావ్యత్వం తోపజేసేనేర్పుతో వీరు భావనడుమ తీవ్రంగా ఆలాపన అందుకుంటారు. 'స్వామి' తోడిది, ప్రేయసి తోడిది, ప్రకృతిదృశ్యాలతోడిది కవి అనుబంధాలు పెక్కువిధాలుగా నడిచి సుందరమైన స్వరూపాలలో తమ్ము దించుకొన్నవి. (అద్భుతరసం ప్రాముఖ్యాన్ని గురించి కీర్తించినట్లు విశ్వనాథుడు ఉదాహరించిన ఒక అగస్త్యభ్రాత తెలివి మెచ్చుకోతగ్గది.) కవి తన భావోద్రేకములో ప్రకృతిని పునస్సృష్టి చేస్తాడు. ప్రేమానుభూతిలో నాయని సుబ్బారావుగారు కావించినసృష్టి అమోఘమైనది. ఆభావము కవితగా ఆ పరిపాకం పొందినది అరుదు. అసలు వారి కవితయే ఉత్తమపదవిలో నిల్వగలది. ఒక్కొకచో ఈ తలము లంటుతూ, బుద్ధికలితమై నడిచే కృష్ణశాస్త్రిగారి ప్రేమకవితా, విషాదకవితా చేసిన విహారమూ ప్రశస్తం. ఆదర్శాన్ని భావించి రామిరెడ్డిగారు నడిపిన 'స్వాతంత్ర్యరథము' షెల్లీకవి 'Triumph of Life'ని కొంతగా జ్ఞప్తికి తెస్తుంది. అబ్బూరివారి'అప్రాప్తమనోహారికి' అనే కావ్యంలోనూ ఆదర్శపరమైన హృదయద్రుతి కానవస్తుంది. కవి తన స్థితినే కాదు, అభీష్టస్థితిలో సహా తన్ను చూచుకొంటాడు. తన్ను తా దాటి విహరించేక్రమంలో, బాహ్యప్రకృతిని తన అనుభవపుటద్దాలలో చూచి తనభావంతో దానికి సామరస్యం కుదుర్చుకోడం తరుచైన అలవాటైనది కవులలో. కేవల బాహ్యదృశ్యంవల్ల విడివడ్డ భావమేఘాలూ మంచివర్షాలు కురిసినవి: విశ్వనాథవారి 'స్వాగతము,' 'వేగిక్షేత్రము' ఈలాటివి. నాయని వారు, వేదులవారు, సౌదామిని, బంగారమ్మ, బసవరాజు—ఎందరో రమణీయంగా పలికినారు ఈ విధాన. శ్రీ శ్రీ గారి 'ఒకనాటిరేయి' బహుళపంచమిజ్యోత్స్న వారినే కాదు,

నిన్నూ నన్నూ భయపెట్టుతుంది. సహజమైన భాషలో, అమాయికమయిా అందమెరిగిన నడకతో వస్తువును భావమయంగా రచించే పద్ధతి, Imagism మొదలైన నవ్యరీతులు, ఈ గ్రంథాన కానవచ్చే కవు లందరిలో చిన్నవారైన ఈయనలో, మరి ఒకరిద్దరిలో, విరిసే సూచన లున్నవి. ఈ కొత్తపద్ధతులకే వీరు 'జయభేరి' మ్రోగించారు. చిత్తశుద్ధిగల ఈ కవులకు భాషలోను, నడకలోను కూడా కొత్తస్వేచ్ఛలూ, అందువల్ల విలసనాలూ తొలినుండీ రుచించినవి. రాయప్రోలువారి సున్నితమైన కొత్తపాతల సమన్వయం క్రమశః వర్ధిల్లింది. బసవరాజువారి నగ్నమైన, కనుకనే మర్మజ్ఞమైన కవిత, 'శివరాత్రి ప్రభ'వంటి ఉద్విగ్నమైన చిత్రము ఆకట్టిన కవికొండలవారి కవిత, మరికొన్ని, ఒకవంక నవ్యతకు జయపెట్టగా, అబ్బూరివారు నన్నయగాంభీర్యము పాతఛందస్సులా, కొత్తఛందస్సులా కొత్తనడకలలో చూపి, వేములవారు వృత్తరచనలో అప్రతిమానమైన పాకము చూపి, నాయనివారు గీతములో కవితా పరిపాకము పారము ముట్టించి, విశ్వనాథవారు తమ సర్వతోముఖమైన చాతుర్యము విశిష్టగతులలో ప్రదర్శించి, కృష్ణశాస్త్రిగారు వివిధ సంప్రదాయాలూ తమశిల్పనైపుణిలో పాడించి, పాతవారి మెప్పును సహా ఒడుచుకోగల సాఫల్యము చూపుతున్నారు. నండూరివారు పాత్రలను అవలంబించి భాష నాట్యోచితము చేసినా, అది కవితా సౌందర్యాన్నిమాత్రం మనకు చూరయిస్తున్నది. విశ్వసుందరమ్మగారి 'కుపితవిధి,' బంగారమ్మగారి 'తమస్సు'కోమలము లయిా పురుషకవుల లోతు లందుకొంటున్నవి.

నవ్య కవితపట్ల వచ్చే విమర్శలు ఎన్నో దూసుకోసాగినవి. కాని అది సజీవమని చూపడానికి ఈ సంపుటము నిలుస్తున్నది. కాని కొందరు కవుల మరికొన్ని కావ్యాలు ఇందు ప్రవేశము పొందవలసినది. విశ్వనాథవారి 'కొండవీటి పొగమబ్బులు' వారి సామగ్ర్యాన్ని, విశిష్టతను కుంభితముగా పట్టిచూపడమే కాక, నేటి కవిత్వపు ఉన్నతి చూపగల కావ్యము—ఇది గొప్ప ode. పెనుమర్తి వారి 'జన్మాంతరము' వారి మంచి కావ్యాలలో చేరుతుంది. కృష్ణశాస్త్రిగారి 'శిథిలాలయమ్ములో శివుడు లేడోయి' అనే గేయం వారికి మంచి అభిజ్ఞానాలలో ఒకటి. కొన్నికావ్యాలు ఇందలివి తొలగించీ ఉండవచ్చు. అందువల్ల ఆయాకవులను మరింతచక్కగా చూపి ఉండవచ్చునేమో!

ఇంచుమించు నవ్యకవు లందరితోనూ చనువైన నెయ్యముగల ముద్దుకృష్ణగారు వారివారి కవితలను సాంగోపాంగముగా తరిచి ఒప్పిదమైన సంకలనం చేయడానికి తమకు గల అవకాశాన్ని బాగా వినియుక్తం చేశారు. ఆయాకవులను గురించి వీరు గ్రంథము చివర ఇచ్చిన వివరణాలు విమర్శదృష్టీ, రసికతా నిండినవై చదువరికి చాలవరకు సరియైన బోధన ఈయగలిగి ఈసంపుటానికి మంచి ప్రయోజనం సంపాదిస్తున్నవి.

# లేఖ

## 'ఉదయిని' సంపాదకులకు:

ఆర్యా,—'ప్రజామిత్ర'లో 'చెణుకులు' ఆపివేశారని వినడం కొంచెం విచారకరంగా ఉన్నది. వేట కుక్కలూ ఊరకుక్కలూ చెలరేగి quarry ని బెదరగొట్టివేశాయి. అయినా, చెణుకులు వ్రాసినాయన జనహర్షణకంటె ఎక్కువ జననింద పొందడానికి కారణం, ౧ దురుసుతనం, ౨ అజ్ఞానం. మొదటిది స్వభావ దోషమని ఊరుకున్నా రెండవది భావదోషం కాబట్టి ఊరుకోలేము. దీన్నిమాత్రం విమర్శించడానికి అవకాశ మియ్యండి మీపత్రికలో.

'తెలియని వన్ని తప్పు' లని పత్రికాంతరంలో వాకోవడం దిద్దితే సద్దుకోగల మానసిక దౌర్బల్యం. చెణుకుల రచయితకు Swinburne కవిత విషయమై ఒక చిన్నసంగతి తెలిసిఉంటే ప్రజామిత్రలో రమారమి ఒక column మసి కాకపోయేది.

'...అస లిక్కడ ఈ తలకిందులు ఎందు కొచ్చిందంటే 'tears—fears' కోసం. ఇది టెక్నిక్ లోపమా? కాదా? విచారించండి.'

Swinburne ప్రాసంకోసం కక్కుర్తిపడినట్లు తేల్చారు. తమ జ్ఞానంపై తగని నమ్మకం మరొక వంకకు ఆలోచన పోనియ్యదు కాబోలు. అయినా మరోదేశపు కవిని కొలవడానికి మనం తెలుసుకోవలసిన మరేవో కొలబద్దలుంటే ఉండవచ్చునన్నైనా తోచకూడదా ఈయనకు? లేక సిద్ధంగా తమదగ్గర ఉన్న వాట్లతో (వీటి మంచిచెడ్డలతో ఇక్కడ ప్రసక్తి లేదు) కొలిచివెయ్యడమేనా? ఎందు కింత తొందరపడ్డారు చెప్మా! ప్రజామిత్ర పత్రికావిమర్శకుడుగారూ! Tears—fears ప్రాసకక్కుర్తి కాదండీ. వ్యతిక్రమాన్నికూడా ఒప్పుకునే అలంకారం ఒకటి పాశ్చాత్త్యుల్లో ఉందండీ: కావలిస్తే ఆసంప్రదాయం మీకు నచ్చలేదనండి కాని (తెలిస్తే మీ రిలా గనరు కాని!):

ఇక—నాగురించి వ్రాసిన దంతట్లోనూ సహృదయత కెక్కడా లోపం లేదని ఒప్పుకుంటున్నాను. అయితే ఆ అభిప్రాయాలతో మాత్రం నే నేకీభవించలేను. వ్యంగ్యాన్ని ఎప్పటి కప్పుడు చప్పుచప్పున వాచ్యం చేసుకోవడం చెప్పినంత సులభం కాదని నామనవి. అవసరంకూడా కాదని నానమ్మకం. నా గీతానికి వీరి వ్యాఖ్యానం నే ననుకున్నది కాదు. కాబట్టి తప్పు.

నన్ను బాధించిన మరొక్కవిషయం వ్రాసి ముగిస్తున్నాను.

'ఉదయిని' మీది చిత్తరువు ఆంధ్రులప్రతిభకు దిష్టిబొమ్మ కాబోలునని శంకిస్తున్నారు. ఎంత బాధ్యత లేని విసురు!

నా దేవాలయంలో ఒక (తమమట్టుకు వికారమైన) ప్రతిమ ఉన్నది. అది నా దేవుడని తమకు తెలుసు. అయినా తమరు నవ్వుతా రనుకోండి: వెక్కిరిస్తా రనుకోండి: వేళాకోళం చేస్తారనుకోండి. తమ కేం శిక్ష వెయ్యాలో తమరే నిర్ణయించండి.

కళాయాత్రికులకు ఒకడు శాశ్వతంగా ఏర్పాటుచేసిన రాజమార్గం ఏదీ లేదు. ఏమన్నాడు Roger Fry!

"......we have no longer any system of aesthetics which can rule out, *a priori*, even the most fantastic and unreal artistic forms. They must be judged in themselves and by their own standards."

ఆహా!

విశాఖపట్నం,                శ్రీరంగం శ్రీనివాసరావు

౧౦ జూన్ ౧౯౩౬

# వాఙ్మయవీథి

**అలంకారమంజరి.** శే. వేం. రాఘవయ్యంగారు, యమ్. ఏ., బి. ఇ డి., బెజవాడ.

ప్రాచీనులు కావ్యాత్మవిచారంలో స్పృహణీయమైన ఔన్నత్యశిఖరాన్ని స్పృశింపగలిగినారు, కొందరు భ్రమప్రమాదాలకు లోనయినా. వారిరచనలు జటిలమయిన సంస్కృతవాణీనిబద్ధములై తదనభిజ్ఞులకు అందరాని పండ్లయినవి. మూర్తికవ్యాదులు విద్యానాథాదులతో తృప్తిపడి ఊరుకొన్నారు. ఆనందవర్ధనుడు, మమ్మటాచార్యుడూ వారికి—ఏకారణంచేత నైతేనేమి, ఉపేక్షణీయులైనారు. అధమపక్షము ధ్వన్యాలోకమూ, కావ్యప్రకాశమూ అనువాదితములైతే కాని అలంకారశాస్త్రతత్త్వము కేవలాంధ్రులకు అజ్ఞాతమే అనవలసిఉన్నది. సంస్కృతపండితులకు అనువాదములవల్ల అంతగా ప్రయోజనము లేనే లేదు. ఇంక అనువాదము సంస్కృతపరిజ్ఞానము లేనివారినిగూర్చి ఉద్దిష్టమయితే—'అలంకారమంజరిలో' అనువాద ప్రయోజనము ఎంతవరకు సాధితమయినదో తేల్చవలసిఉన్నది.

అనువాదకులు 'తొలిపలుకు'లో అన్నట్లు, "కావ్యప్రకాశికయందలి కారికలను సూత్రప్రాయముగ ననువదించి, వృత్తిని వివరించి, లక్ష్యపద్యముల రచించి, లక్ష్యలక్షణములను సమన్వయమొనరించి, అలంకారమంజరి యనుపే''రిడిరి. సంస్కృతానభిజ్ఞులు యథామూలములను అభినందించినట్లు ఈవిధమయిన అనువాదములను అభినందిస్తారని అనలేము.

కేవలము యథామూలముగా గాని, లేక అభిప్రాయము మాత్రమే గ్రహించి సరళముగా, యథేష్టముగా గాని అనువదించుకోవచ్చును: అనువాదకులు రెండిటికీ మధ్యమార్గాన్ని అవలంబించడంచేత కొన్నికొన్ని కారికావివరణాలలో క్లిష్టతా, దుర్గ్రాహ్యతా తప్పినవి కావు.

అయితే సంస్కృతగ్రంథాలను,తత్రాపి పారిభాషికపదాలతో నిండిన శాస్త్రగ్రంథాలను అనువదించడం కష్టసాధ్యమైనపని. శ్రీరాఘ: య్యంగారు ప్రాచీనానువాదకులవలె గాక వచనములోనికి అనువదించి అనువాదానికి కొత్తమార్గము వేయిం-ు. కొన్నిచోట్ల సరళపద్యములతో లక్ష్యలక్షణసమన్వయ మొనరించారు. ముఖ్యంగా విషయవిభాగంలోకూడా సుగమతకోసమై క్రమాన్ని పరిత్యజించి మూలానికే మెరుగుపెట్టినట్లు అనువదించారు.

పిలకా గణపతిశాస్త్రి

**వ్యాసావళి.** ఉభయభాషాప్రవీణ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు, రామచంద్రపురము, తూర్పుగోదావరి.

శ్రీ హనుమచ్ఛాస్త్రిగారు అప్పుడప్పుడు పత్రికల్లో ప్రకటించిన వ్యాసపంచకం వ్యాసావళి రూపేణ అవతరించింది. సీతమ్మశోకము, పాపరాజా, గురుజాడవాల్మీకి, రెండు నక్షత్రాలు (కాళిదాసభవభూతులు), శబరీసమాలోకనం, వకుళమాలాపరిశీలనం—అనే తత్తద్వ్యాసాల నామకరణమే విషయాలను విశదంచేస్తుంది.

నేటి మనవాఙ్మయంలో విమర్శనలు—అంటే విమర్శనలు అని పరిగణనచేయడానికి అర్హమైనవి—చాలా పరిమితముగా ఉన్నవని మనలో మనం అనుకోక తప్పదు. సారస్వతతత్త్వజ్ఞులు కొందరు—"ఇది కేవల

# విరాళములు

అభిమానుల విరాళములకు కృతజ్ఞత వందరూపాయలు ఇచ్చినవారు శాశ్వత గ్రాహకులు.

శాశ్వత గ్రాహకులు :

శ్రీ వట్టూరి శోభనాద్రిరావుగారు
పఞ్చాయత్ ఆఫీసరు, శాలం

,, గంటి సీతారామయ్యగారు
డైయింగ్ ఎక్స్పర్టు, దాదర్, బొంబాయి

ఒకమిత్రులు

---

| | | | | |
|---|---|---|---|---|
| శ్రీ | జనమంచి కామేశ్వరరావుగారు, బి.ఎస్ సి. | | | రు |
| | రాజమహేంద్రవరము | ... | ... | ౧౦ |
| ,, | గురుభాగవతుల ధర్మారావుగారు, ఎమ్.ఏ., ఎల్.టి. | | | |
| | బరంపురం | ... | ... | ౨౫ |
| ,, | కృష్ణచంద్ర పాత్రోగారు, బి.ఏ.,బి. ఇ డి. | | | |
| | తెక్కలి, గంజామ్ | ... | ... | ౧౦ |
| ,, | డాక్టరు కొరళ్ల రాజారావుగారు | | | |
| | కాకినాడ | ... | ... | ౧౦ |
| ,, | ఈమని సుబ్బయ్యశాస్త్రిగారు | | | |
| | కానూరు అగ్రహారం, పశ్చిమగోదావరి | | ... | ౧౦ |
| ,, | తాతా కృష్ణమూర్తిగారు, ఎమ్.ఏ., ఎల్.టి. | | | |
| | పర్లాకిమిడి, గంజామ్ | ... | ... | ౧౦ |

'ఉదయిని' కార్యకర్త.

Printed at Lodhra Press, Egmore & Published by K. Janardana Rao
at 15, Adiappa Mudali Street, Vepery, Madras.

# ఉదయిని

## సాహిత్య పత్రిక

సాహిత్య పత్రిక

(రెండు నెలల కొక సంచిక)



సంపాదకుడు

కొంపెల్ల జనార్దనరావు

సంపుటము 1.   సంచిక ౫

మే 1936

సాలుసరి చందా రు 4    విడిప్రతి అ 12

15 ఆదెప్పముదలి వీధి, వేపేరి, మద్రాసు

# విషయసూచిక

# ఉదయిని

సాహిత్యపత్రిక

సంపుటము 1 ధాత, వసంతము

సంచిక ౫ శా. శ. ౧౮౫౮


## కిరణాలు

అఖిలభారతోద్యమం సాహిత్యము విషయమైకూడా పొర్లివచ్చి భాషాపరిషత్తుల కర్తవ్యం మరింత మోపుదల చేస్తున్నది. అన్ని భాషలనుండీ మంచి రచనలు హిందీలో తర్జుమా అయి, హిందీద్వారా అన్ని భాషలవారూ ఆ రచనలతో పరిచితి సేకరించుకోడమువల్ల అఖిలభారత సాహిత్య మనేది హిందీలో పరిణమించ గలుగుతుందనీ, అట్టిది ఆవశ్యకమనీ 'హంస' (హిందీపత్రిక) ఘోషిస్తున్నది కొత్తకాదు. భారతీయ సాహిత్యపరిషత్తొకటి యేర్పడింది. అన్నిభాషల సాహితీనిష్ణాతులకు పరస్పర సహాయోగము ఏర్పడి, ఒక భాష దేశ మందరూ ఎరిగి ఆ భాషలో దేశ మంతటి సాహిత్యపు నిగ్గూ సమకూర్చడంవల్ల, శాస్త్ర పరిభాషకై దేశమంతటా ఒకే పదజాలము ప్రచలితం చేయడంవల్ల, దేశాని కంతకీ జాతీయవాఙ్మయ మనేది పరిణమిస్తుందట. ఉన్నతభావాలు కలిగి, జాతి ఐక్యానికి తోడ్పడుతూఉండే వాఙ్మయమే ప్రోత్సాహము పొందబోతున్నది. కేవలము ప్రాంతాల పరస్పర సారస్వత పరిచయానికి మాత్రమే కాక ఈ 'ప్రచార' పరత్వములో భారతీయ సారస్వతము ఏకముఖము కాబోవుతున్నది. సాహిత్యకళను ప్రయోజనాలలో నడిపించడానికి, ఉపయుక్తతతో పరీక్షించడానికి, పూనిక నిలిచింది.

చిరకాలము ఏదో ఒక ఐక్యముతో భారతదేశము అవిచ్ఛిన్నత నిల్పుకొని, నేడు పరాధీనతారూపమైన అనుభవైక్యములో మరింత బిగిసి ఏకముఖ కార్యకారితకు ఐకకంఠ్యను విచ్చినదై, భాషల భిన్నతనుబట్టి యేర్పడే అడ్డంకికి సామాన్యభాష విరుగుడుగా చేకొని హిందీని జాతిపై విప్పింది. దేశమంతకూ సంబంధించిన రాజనైతిక వ్యవహారాలకై, కొన్ని భిన్నప్రాంతాలవారి పరస్పర వ్యవహార ప్రవృత్తికిగాను హిందీ మాధ్యమముగా ఒప్పుదల పొందింది. రాట్నపు చప్పుడులో అక్షరాల చప్పుడును పరా

జితము చేసి ఉపేక్షించిన గాంధిమహాత్ముడు ఇప్పుడు అక్షరాలా జాతీయసారస్వత ప్రయోజనాన్ని ఉద్ఘాటించి నాయకత్వం వహించడంలో మహాత్మునిపై సారస్వతమూ, సారస్వతముపై మహాత్ముడూ కూడా దండెత్తినారు: ఈ అఖిలభారతీయ సారస్వత మనేది జాతీయతకు నచ్చే వన్నెలు చూపవలెనట. ఇందుకు తిరిగి సామాన్య భాష హిందీ సార్థకత కనబరిచింది. సామాన్య భాషగా నిలబడే సందర్భంలో ఉద్ధూతో వచ్చిన రాపిడివల్ల హిందీలో వచ్చే పరివర్తనముకంటె భారతీయ సాహిత్య మాధ్య మముగా దానియందు రానైఉన్న పరివర్తనము గొప్పది. అన్ని ప్రాంతీయ భాషల యందూ సాధారణముగా వాడుక తిరిగే పదజాలము నెడ శ్రద్ధ వహించి, ఆ యా భాషల నుడికారములకు కూడా తావిచ్చి విశాలత అలవరించ బడుతుందట.

*　　　　*　　　　*

హిందీలో ఈ వస్తున్న అఖిలభారతీయ సారస్వతాన్నే జాతీయసారస్వత మనబో తున్నారు. పేరు ఏమి పెట్టినా, దీని ప్రయోజనముమాత్రం పరిమితమై ఉంటుంది. వివిధ భాషా సాహిత్యగతులు హిందీ తెలిసిన ఒక సాహితీకారుడు గమనించడంవల్ల, ఆంగ్లము ద్వారా విదేశీయ సాహిత్యములు ఆకళించుకొన్నప్పటివలె, అతని సంస్కారము పెంపొందుతున్నది. కాక (అన్యదేశీయ సాహిత్యములతో అడుగు కలపవలెనన్న ప్రయ త్నముతోపాటు) భారతీయసాహిత్యముకు వెనుకబడకుండా కాని, అంతకు ముం దకుగిడి దారి చూపడానికి కాని ఉత్సాహపడగలడు. కాని ఒకటి: హిందీభాషవారికి మాత్రం, మన భాషలో ఇతర భాషలనుండి మంచి రచనలు అనువదిస్తే మనకు కలిగే హృద్యతవంటిది చేకూరే మాట వాస్తవం. ఇతర భాషలవారికి తమ భాషలో ఆ రచన వస్తే కాని ఆ హృద్యత లేదు. హిందీలో గ్రాంథిక కృతక భాషనుండి విడబరిచి ప్రజాభాషకు ఎంతో దగ్గరగా వ్రాతభాషను తీసుకపోయే పూనికకూడా ఈ మొగలోనిదే. దానిలో అర్థమే ఉంటే, హిందీలో వచ్చిన ఈ భారతీయ సారస్వతమంతా హిందీవారికి హృదయానికి దగ్గరకు రాగా, (అన్యభాషలయెడ హిందీ అవలంబించే వైశాల్యమును పురస్కరించు కొని) అన్యభాషలవారికి భాషకు సన్నిహితముగా వస్తే గొప్పమాట. ఇది జాతీయ సారస్వతమే అంటున్నారు మరి. మతవాఙ్మయమూ, శాస్త్రవాఙ్మయమూ సంస్కృత భాషలో భారతదేశమందు జాతీయవాఙ్మయముగా ఒప్పుదల కాంచింది. నేడు తిరిగి రాజనైతికవాఙ్మయమూ, శాస్త్రవాఙ్మయమూ జాతీయవాఙ్మయముగా హిందీభాషలో అంగీకృతము కావడములో ఔచిత్యము జారదు. కాళిదాసాది మహాకవుల కావ్యాలు సంస్కృతసాహిత్య మనడంకంటె భారతజాతీయసాహిత్య మనడంలో ఔచిత్యము లేదు. జాతీయత అనేది అపేక్షించే ప్రయోజనాలను ప్రసవించడమే ప్రధానముగా చేసుకో

జాలక, సాహిత్యము అనే రమణీయతొ ప్రధానమైన ఒక కళ తన ముఖ్యక్రియా ద్రవ్యమైనభాషనే యెక్కువబంధువుగా చేకొంటుంది—జాతికంటె. భారతభాగవతములు సహా మనకు తెలుగువే కావలెను; హిందీవారికి తులసీరామాయణమే హృద్యతరము—సంస్కృతము తెలిసినప్పుడుకూడా. జాతీయత ఇన్నిభాషల సాహిత్యమునందూ భావసామగ్రి నింపి ఉద్రేకము ప్రసాదించే దేవత కావచ్చు. కాని, ఈభాషలలోని సాహిత్యము హిందీ అనువాదములో జాతీయసాహిత్యము నిర్మించ రాబోవదు. ఈ అనువాదమును భారతీయసాహిత్యమని గౌణముగా పిలుచుకోవచ్చు; ఆంగ్లభాషద్వారా మనము ఐరోపీయ సాహిత్యమును పరిచయము చేసుకొంటున్నాము; ప్రపంచసాహిత్యమునే రుచి చూస్తున్నాము; ఆభాషద్వారా భావలోకములో తొంగిచూడగల్గుతున్నాము; ఆలాగే హిందీ భారతీయసాహిత్యములకు తెరగా పనిచేస్తుంది. సారస్వతులలో సహా హిందీ మిక్కిలి ప్రచలితము కాగల్గితే, భారతీయ సాహిత్యరుచులు ఒక్కచో ప్రదర్శించే ఉద్యమం సార్థకమవుతుంది.

* * *

ఒక వేళ ఇతర దేశాలవారికి ఇది భారతీయ వాఙ్మయమని ఒక్కచో కనబరచగల మంటే, తిరుగ అది ఏ ఆంగ్లములోనికో అనువదించవలసి ఉన్నప్పుడు, ఒకసారి హిందీలో పరివర్తిత మైనదానికంటె మంచి ఆధారమైన మాతృకనుండే అనువదించడం చెల్లుతుంది. ఇందుకు 'త్రివేణి' వంటి పత్రికలు, ఇటీవల లండనులో ఏర్పడ్డ 'The Indian Progressive Writers' Association', భారతదేశపు 'P. E. N. Associaton' వంటి సంస్థలు ఎక్కువ ఉపకరిస్తవి. 'త్రివేణి' ఈ జూలయి మొదలు మాసపత్రికగా వెలువడుతుందట. మన దేశమందే కాక విదేశీయులకూ మనమన సత్త్వములూ, యత్నాలూ నాటజేయడానికి 'త్రివేణి' యీ నూత్నరూపంలో మరీ కృతకృత్య కాగల్గుతుంది. అథమం పదిసంవత్సరాలనాటికి, 'హిందీ' యెరుగనివారు అక్షరాస్యత లేనివారనిపించుకొనేస్థితి యేర్పడుతుందని శ్రీమతి లీలావతీ మున్షీగారి మతము. సారస్వతలోకాన్ని సహా హిందీ తనప్రాముఖ్యముతో అంతగా ఆకర్షిస్తే ఆశ్చర్యము లేదు కాని, ఆంగ్లపత్రికల ప్రాముఖ్యము కొరవడడం కష్టం.

* * *

కాని యీ భారతీయసాహిత్యోద్యమానికి ప్రాంతీయసాహిత్యాలు కొంత కదలవలసి ఉంటుంది. సాహితీభావముకంటె జాతిభావ మన్నది ఒక్కొకచో ప్రాధాన్యము వహించి, కళకంటె ప్రచారమును ముందుకు నెట్టవచ్చు. తెలుగుకై తలవారు,

తరుచుగా, కళతో నెయ్యముచేసి ప్రచారమునుండి దూరముగా వాహ్యాళి పోయి ఉన్నారు. వారి కీ పిలుపు అలజడి కలగజేస్తే అది ఆప్రచారపక్కనుండి కళను విముక్త ముగా ఉంచగల ప్రతిఘటననే రేపుతుం దనవచ్చు. కాని అది రూపాంతరాలు వహించి వీరి కళారీతులలో రూపాంతరాలు ఘటించడానికి ఇతర ప్రోద్బలాలతో చెయ్యి కలప గలుగుతుంది. పాతకూర్పులనుండి విముక్తిగా లేచిన నవ్యకవిత్వా ఇప్పటికి కరుడు కట్టక తప్పని కావ్యసమయము (poeticism) తానుకూడా మరొక ముక్తరీతులకు ఇప్పటికే దారి వదలుతున్నది. కవిత్వము పాటనుండి మాటకు చేరువ కాగలుగుతూ ఇటీవలి ఆంగ్ల కవితారీతులకు విజయము పల్కుతున్నది. కవిత్వపు ఆభిజాత్యమునుండికూడా విముక్తి పడసి, జీవితఘోషకూ, సహజభాషకూ కవిత చేరువ కాబోతున్నది. ఈ ఉద్యమము ఒక కొత్తపొంగు రచనారీతులలో సారించడానికి వీలున్నది. విలువల ఆలోచనలో తెలుగు లది పెద్దచేతులలో ఒకటిగా నిలుస్తుంది. వీరు హిందీభాషలో, ఆ జాతీయవాఙ్మయపు అనువాదాలలో ఏమాత్రము న్యాయము పొందుతారో చూడవలసిఉన్నది.

* * *

హరి జి. గోవిలుగారి శ్రమ ఫలించి నాగరలిపి ౫౦౦ టైపులనుండి ౧౫౦ టైపులకు వచ్చింది. ఇండో-రోమనులిపి మిక్కిలి సులభముగా నేర్వవచ్చును కనుక అది భారత దేశానికి సామాన్యలిపిగా స్వీకరించవలె నన్న వాదాన్ని నాగరలిపి జయించింది. 'ప్రపంచమంతటితో వ్యవహార' మన్నదానికి ఇప్పుడు ఉద్ధురత కనబడడం లేదు; భారతరాష్ట్రీయత, రాష్ట్రీయ (జాతీయ) సాహిత్యము, అన్నదే ఇప్పుడు ప్రచండముగా సాగుతున్న ఉద్యమము. ఈ ఉద్వేలతలో నాగరలిపి, హిందీ నిలద్రొక్కుకొనక మానవు. అసలు దేశభాషలవారికి సామాన్యభాష కాని, సామాన్యలిపి కాని ఆవశ్యకమా అన్న ప్రశ్న, వాటి పరిమితార్థత గమనిస్తే, లేవనక్కరలేదు. ఇన్నిభాషలు నేర్చుకొనేటందుకు ఒక్క లిపి అవలంబించడం అనుకూలమే అని చెప్పవచ్చు. అయితే అది ఆయాభాషాభూమిలో ప్రవేశించనక్కరలేదు.

* * *

ప్రాంతీయభాషలకూ, ప్రాంతీయ సాహిత్యాలకూ ఈ ఉద్యమం అపకారము చేయకుండడానికీ, ఉపకారము చేయడానికీ కూడా ప్రయోగరీతి పూచీ పడవలెను.

కొంపెల్ల జనార్దనరావు

# రాధ స్వప్నము

ఓచెలి! రాత్రి నేను గల యొక్కటి కంటిని, దానిలోఁ జిరం
టీ చతురాంగజుండు, మన నెయ్యపుఁబ్రోవు యశోదకన్నవాఁ
డాచరణంబొనర్చె నొకయద్భుత మస్మదురోజముల్ మృదు
శ్రీ చరణాంకితంబులుగ నృత్యము సేసె సకింకిణీ ధ్వనిన్.

అది యొక మాయగా హృదయమందున స్వామి నటించుచుండె న
న్నది తెలియంగవచ్చు నయినన్ బతిరూపము కానిపించ దా
పదములు కానిపించుఁ బతి పాదతలంబులు చిల్కముక్కు పూ
లెద వెద చల్లినట్లయి సమృద్ధిగఁ బుల్కలపంట యేర్పడెన్.

నే నిదురించుచుంటి నని నేను నెఱుంగుదు కాని మేలుకొ
న్నా నను నొక్క జ్ఞానకలనంబున దీపితమై విచిత్రరే
ఖా నటనాభిరామ పదకంజములన్, గుచసీమ, కాంతిపా
థోనిధి మెట్టతామరలతోడిగిరిద్వయిపోల్కికిం జనెన్.

ప్రణతి పరంబుగా నెదురుబళ్లుగ వంచిన కాళియాహి చి
క్కని పడగల్ హసించు చనుకట్టున, గజ్జెలు మువ్వలున్ గల
స్వనములు పల్కఁగా నటనసల్పెను, కొమ్మలనుండి రాలు వం
పున బిగువారు క్రొత్తవిసెపూవులువోని పదమ్ము లుంచుచున్.

చివురులఁ గొట్టినట్లు పతిచిన్నిపదమ్ము లనుక్షణమ్మునున్
దవులు నురోజమాళిఁ, బ్రతితాఁకున నూతనమౌ సుఖానుభూ
తి వెలయు నిట్లుగా నిరవధిన్ దరఁగంబడి క్రొత్తరంగగాఁ
గవిసిన వాహినింబలె సుఖానుభవం బొక డేచె దీర్ఘమై.

నా కిపు డింత సిగ్గు నగు, నాథుని యాఁపనికాలు నొచ్చునో
నాక సుఖానుభూతి బడి నాయెద పుల్కలు గ్రమ్మ, జారునో
నాక చెమర్చెఁబో, అసలుకన్నను వడ్డియె ముద్దటందు రా
యాకృతి, నాథహేతు వగు నాసుఖ మాతనికన్న నిష్టమై.

వ్రాలిన నాథు పాదనఖ బంధురదీప్తిఁ గుచద్వయంబు దీ
పాలిడుకొన్న దేవళముపైని విమానము లట్లు తోఁచి, సే

## ఉదయిని

వాలసహస్తముల్ మొగుడ నాతనివెన్క నటత్ప్రయోధ రాం
దోళితమూర్తికిన్ మకరతోరణనైఖరిఁ దాల్చె స్వామికిన్.

ఆ లలితంబు లౌ నడుగు లందము దెచ్చెనో, మున్నెఱుంగఁగాఁ
జాలనో వాని యందము, కుచద్వయి, స్త్రీతరమైన మోహమై
కేలఁ గదించి కౌఁగిట లగించఁగ నేనె తలంతు, స్త్రీలయుక్
స్త్రీలయు మధ్యగా యని వచించితి వే అనుకోక వే చెలీ!

నిదురను మేలుకొంటినని నిశ్చయమైనది యద్ది స్వప్నమ
న్నది నిజమైన దింక నయినన్ బులకించుటయైన నాయెదన్
గదలుచు మన్నయట్లు పసికాళులు దోఁచెడి, మేలుకొన్న నా
యెద యిది మేలుకొన్న దనుటే నిజమా? కలయే యిదా? చెలీ!

విశ్వనాథ సత్యనారాయణ

---

## నవోదయము

కన్నీటిచినుకొకటి క్రింద బడి చితికినది
పెదవిరేకులమీద పద మొకటి మెదలినది
చిరదాస్యకాఠిన్యశృంఖలానిచయమే
సీమసీమాంతాల చెదరిపోయినది.
హృదయనాళకవోష్ణ రక్తప్రవాహాలు
పొంగెత్తి యణువణువు పులకించిపోయినవి.

౨

ఉదయకాంతుల పసిడి తీగొకటి మెఱసినది
మృదుపుష్ప గర్భమున రేకొకటి విరిసినది
లలితసుందరదివ్య లావణ్యనవజీవ
మధుమాన సుధలలో హృదయమే పొంగినది.
హృదయనాళకవోష్ణ రక్తప్రవాహాలు
పొంగెత్తియణువణువు పులకించిపోయినవి.

కొండేపూడి సుబ్బారావు

# హరిజనసుందరి

## (వచనపదం)

౧

నీ రూపం ఎంత సుందరమైంది!
తల్లీ, నువ్వు ప్రకృతిలో లీలా
స్వరూపిణివై పెరుగుతున్నావు.

౨

శుభ్రమైన చిరుగుల పాతచీర కట్టుకొని,
చింతపూరైక తోడుకొని,
నవనవలాడే నీ అందం రేకలు
మరుగుపరుచుకొని,
నువ్వు పొలాల నడుస్తూఉంటే,
నీ పవిత్రమూర్తికి బాహ్య
ప్రకృతి అంతా జోహారులు సమర్పిస్తుంది.

౩

కవి పాడుదా మనుకొని
పట్టణాలలో,
పల్లెటూళ్లలో,
ఉత్తమ కులాల రసంలేని జీవితాలల్లో
విరుచుకుపడే వనితల్ని చూసి,
జలదరించి కళ్లు మూసుకొన్నాడు.
ఇన్నాళ్లనుంచీ ఎల్లా
రాశానా వీళ్లమీద
పాటలు పద్యాలు అనుకున్నాడు.

౪

శిల్పి వాళ్ల రేఖల్లేని ముద్దల మూర్తులు చూసి,
తల వంచుకొని,
పారిపోతూ,

ఇన్నాళ్లనుంచీ ఎల్లా వేశానో వీళ్ల చిత్రాలు
అని అనుకున్నాడు.

౫

శిల్పీ, కవీ శ్రుతికోసం, రసంకోసం, సౌందర్యంకోసం,
తిరిగి తిరిగీ,
తమ యాత్రలు వృథా కాగా,
నిట్టూర్పులు విడుస్తూ,
ఇళ్లకు వేంచేసారు.

౬

ఇంతట్లో మెరుము మెరిసింది నీ శ్యామాకృతి:
నీ గొంతుకలోని సెలయేటి పాట,
నాగరికత గట్లు అడ్డం లేకుండా
ప్రవహించి, పొంగి, పొర్లి పొయ్యే
నీ బ్రతుకు సముద్రం.

౭

నిన్ను వాళ్ల శారదను చేసుకొన్నారు;
వాళ్ల భావపీఠాన్ని అధివసింప చేసికొన్నారు:
వాళ్ల పూజలు నీకు సమర్పిస్తున్నారు.

౮

నీ స్వచ్ఛ రూపం
నిర్మలమూర్తి
వెన్నెలలా, ఆకాశంలా,
పువ్వులా,
వెలుగుతూ, లోతులు తిరుగుతూ,
దివ్యపరిమళాలు విరజల్లుతున్నది.

అడివి బాపిరాజు

# బ్రతుకు

౧

నాకడుపు పంటలో లోకాలు పండినవి
ముగ్ధప్రపంచంబు మోహించినది నన్ను.
నెలరాల డాలు చిందిన చల్వమేడపై
తఱపి వెన్నెలతేట తరకల్లు కట్టినది.
మలుసంజ కనువిచ్చు మల్లెమొగ్గల చాలు
నను జూచి పకపకా ధగధగా నవ్వినది.
కొమరు రాయంచ మొత్తము రెక్క లల్లార్చి
తెలితమ్మిపూగద్దియలపైన విడిసినది.
తెనుగువాగుల గూడికొని సంద్ర ముప్పొంగి
తెలినుర్వుతుటుముతో దీప్తమై వెలిసినది.
తొలుకారు మంపుకత్తెల పల్లువరుసలో
నునునిగ్గునిగనిగల్ నటనాలు నెరపినవి.
నాకడుపుపంటలో లోకాలు పండినవి
ముగ్ధప్రపంచమ్ము మోహించినది నన్ను.

౨

నాకడుపు మంటలో లోకాలు మండినవి
నను కనుంగొని కుమారిల్లినది లోకమ్ము.
పెను గచ్చపొదరు పుట్టను లేచి బుసకొట్టి
పడగ విప్పిన నల్లత్రాచుపా మాడినది.
ప్రళయకాలవ్యోమపథనాట్యదాభీల
నీలనీరదరాజి శిలవృష్టి నెఱపినది.
ధర్మతృషాభీకరధ్వాంతసంఘమ్ము
ధరణీధ్ర గహ్వరంబులలోన నొరగినది.
మత్తద్విరేఫచ్ఛదాకృద్విసీలాంజ
నాత్మ్యశ్రవుల మోవి నతివ కార్చినది.
విగళచ్ఛిరోజావళీమధ్యమంబందు

నీలనీ రేజంబు నెఱి నిగుడించినది.
నాకడుపుమంటలో లోకాలు మండినవి
నను కనుంగొని కుమారిల్లినది లోకమ్ము.

3

మేఘములలోన దీపించు మెఱపువోలె
క్షణిక వృత్త్యవలంబినై సాగుచుండ
నీ చలన జీవన వహన మేటి కనుచు
రిక్కగమి తొంగిచూచి నన్వెక్కిగించు.

హరి రామలింగశాస్త్రి
కొండపల్లి గోపాలరావు

---

# ప ద్యా లు

నాముఖాలోకనమ్మె కంటకమువోలె
నీయెడద జీల్చి బాధించునేని, నాయ
నాథ నిరుపేద బిచ్చదనంపు పల్కె
నీ కతి కఠోరముగ దోచెనేని సకియ
నన్ను క్షమియింపుము.
ఇంక నెన్నడును గూడ
నాయభాగ్యపు మోము గన్పడకయుండ
దాచికొందును జీవితాంతమ్మువరకు
కాని, కాలంపుగతి నెన్నడైన గాని
విధివశమ్మున నీదు జీవిత పథాన
నడుగిడుట గల్గెనేని నాయెడల నేహ్యా
భావ మిప్పటివోలె జూపకుము సకియ.

* * *

నీవు ప్రేమింపలేదు నేనే వృథా భ్ర
మించితి నిజమ్ము, తొలకరి మేఘమట్టు
లాటగా నీవు గురియు వర్షాంబువులనె
ప్రేమసుధ యని యెంచి తపింప నేల ?

తెలికిచెర్ల కృష్ణమూర్తి

# కొన్ని గీతికలు

౧

అంబరము క్రింద నురకే
సంబరముకొలఁది నాడే
లంబాడి చిన్నవానిన్
"అంబేది? చూపు"మంటిన్:
తమ్మిపువ్వు సంగడీనో,
కమ్మనగు పైరుగాలో,
ఉయ్యాలూఁచేటి కొమ్మో,
కొయ్యఁదలఁచేటి పండో;
చూపించు మనెడు వింతన్.
కాని వాఁడొక్క స్త్రీనిన్
ఆనడుమపొలములోనన్
మానితంబైన నడకన్
గానుపించేటి దానిన్,
'అమ్మ'యని వేగఁ జూపెన్;
ఆమె కడ కేగె వడిమై;
ముద్దులిడె నాపె వానిన్;

౨

సూర్యచంద్రుల మంచి సొబగై!
గాలిచెట్టుల మంచి చలువై!
ఈకొండ ఈయెండ ఈపెద్దబాడువలో
చూపట్టుచెట్టునీ డెవ్వనికి ఎవ్వనికి?
గోచి పెట్టుకున్న గోపడికి గోపడికి
గూటిబిళ్లాడేటి పాపడికి పాపడికి!
ఈచెరువు ఈదోనె ఈగట్టుపై కెక్క
వీచునట్టీగాలి ఎవ్వనికి ఎవ్వనికి?
ఈతాలాడునట్టి ఎల్లడికి పుల్లడికి?

# ఉ ద యి ని

ఈలకొట్టీచూచు ఈరడికి పేరడికి !
ఈచిట్టివెన్నెలల నీదారిపోతుంటె
విసరుపూవాసనలు ఎవ్వనికి ఎవ్వనికి ?
గొడ్లుమళ్లేధూళి గుడ్డిపాలేరుఃకు
కూడు గుడ్డా మఱచు కవికుమారునకు.

3

కట్టెలమోపున మొగలిపొట్ట నిడి
చుట్టు గనుచు నడుచు
కట్లెలమోపుం గావాలా యని
గట్టిగ నత డఱచు :
మొగలిపువ్వ కొనుక్కోరాయని వాఁ
డొక్కరి నడుగడుగ.
ఎండిపోయిన పేరుపుపేషుల
నిండు పరిమళముతో
ఆకుపచ్చ పై రేకుల లోలో
పసుపుపచ్చ నెఱిచాయన్
ఆయుదయంబునఁ గోసినదోయన
నతి సుందరమగుచున్
అంగడి నటు నిటు నడచెడువారిని
నాకర్షించుచు నది యొప్పెన్
మోడగుమాఁకును గొడ్డటఁ గొట్టు వాఁ డెటు గొనివచ్చె?
పోడిమిగల యా మొగలిపువ్వునని నాడెందము మెచ్చె.

కవికొండల వెంకటరావు

# హ్రస్వ గీతాలు

౧ అవతలిగట్టు

—ఇవేమి టీ వింత భయాలు ?
—ఇంట్లో చీకటి !

—ఇవేమి టీ అపస్వరాలు ?
— తెగింది తీగ !

—అవేమి టా రంగుల నీడలు ?
—చావూ, బ్రదుకూ !

—ఎచటికి పోతా వీ రాత్రి ?
—అవతలి గట్టుకు.

౨ పరాజితులు

అలసినకన్నులు కాంచే దేమిటి ?
తోణకిన స్వప్నం,
తొలగిన స్వర్గం.

పగిలిన గుండెల నదిమే దేమిటి ?
అవతల ఇవతల
అరులై ఇరులే !

విసిగిన ప్రాణుల పిలిచే దేమిటి ?
దుర్గాతి ! దుర్గతి !
దుర్మతి ! దుర్మృతి !

3 ఆః !

నిప్పులు చిమ్ముకుంటూ
నింగికి నే నెగిరిపోతే
నిబిడాశ్చర్యంతో వీరు...

## అన్న

నెత్తురు క్రక్కుకుంటూ
నేలకు నే రాలిపోతే
నిర్దాక్షిణ్యంగా వీరే!

శ్రీరంగం శ్రీనివాసరావు

---

## అన్న

మన సిచ్చి మాయన్న మాటాడునపుడు
మల్లిపువ్వులతావి మనసెల్ల నిండు
ఆకాశ మై తాను అటనుండి చూచు
భూమి నై నే నతని ఇటనుండి చూతు
నన్ను చూచుచు అన్న అక్కడే యుండు
అన్న చూచుచు నేను ఇక్కడే యుందు
సోదరీ! సోదరా! యని మేము పిలుచు
పిలుపులే యొరులకు పిడుగు లై తోచు
మెరపు లౌ మాయన్న చురుకుచూపులను
మే నెల్ల కంపింప నే నందికొందు
పరితాపభారంబు తన కంపగానె
తనదుఃఖభారంబు తా వంపుతాడు
ఆనందమున దాని నందుకొంటాను
అఖిలజీవులకు నే నది పంచుతాను
మా ప్రేమలను దెల్పు మాటలే లేవు
మాయన్న బోలగా ఏయన్న గలడు?

చావలి బంగారమ్మ
చావలి బంగారమ్మ

*
*   *

సృష్టితరువాత సృష్టి
రేపిన గాలిదుమారము
అనంతహస్తాన
సన్నని పొరలాగ క్రమ్మి,
ఒక చిరునిశ్వాసమునకు
పటాపంచలై పోయినది;

శాశ్వతాన
కాలము పండి,
ముగ్గి, రాలినది
విస్మృతి ధూళిలోనికి!

ముద్దుకృష్ణ

---

# కళ

అరువదియు నాల్గు కళ లున్న వవనియందు:
ఉన్న వవి వాస్తవమ్ము — లేకున్న వవియు
నావిలోకనపథములో నీవు లేక.

లలితవిశ్వకళామధువిలసనమ్ము
తాండవించెదు నాచెలీ, తావకీన
హృదయనిర్గతప్రేమవాహినులలలు.

ఈవు నాలోన అద్వైతభావకలన
ప్రచురిత మ్మైతివో, కళానిచయమూర్తి
నేను నిరతమ్ము—

కొమర్రాజు వినాయకరావు
(నవ్యసాహిత్యపరిషత్తు)

# రెండు కావ్యాలు

౧

'ఎవ్వరే నన్ను గూర్చి భాషించి రన్న
ప్రాణములు పోయిన ట్లుండు లజ్జచేత
ఎందు నన్ను లక్షించి వర్ణింతురో యని
నాకు కవులన్న భయ' మనినావు నీవు.

ఏల ననుమాత్ర మ ట్లాదరించినావు
త్వత్కృపా కటాక్షేక్షణ పంక్తిచేత !

ఏల ఆనందవీచి లాలించినావు
నీ సుధామధురాలాప నియతిచేత !

ఎట్టు లుందు నీమూర్తి వర్ణింప కిపుడు,
కానవత్తువు నిరతంబు కనులు గట్టి;
ఏమి చేయుదు నిన్ను ధ్యానింప కిపుడు,
రాజ్యముం జేయ మన్మనోరాజ్ఞి వగుచు.

౨

సకలలోకైకజనని నీ చరణసేవ
ప్రాప్తమైన దొక్కింత యీ భవమునందె
నీ యకారణ కరుణా పరాయణతను,
భక్తి గురుయుక్తి నిను గొల్తు ప్రత్యహమ్ము.

ఐన నేమమ్మ ఇంత యనాదరమ్ము
పరమమూఢు డీ పాదసేవకునిమీఁద !

కామమే లేని లోకోపకారబుద్ధి
ఏల కామేశ్వరీ ప్రసాదింప వీవు !
ఏటికే వీని కో జగదేకమాత
మానినీలోకమం దీవు మాతృబుద్ధి !

నోరి నరసింహశాస్త్రి

# ఆశ

"కిరణలేశ మొకండు
కరుణ బ్రసరింపుమా
ఇరుల దొంతరలోన
ఇరుకుకొన్నాను."

అని పాడినానోయి
ఆనాటినడురేయి
ఆలకించితి వేమొ
ఆ చిన్నినాపాట.

ఆశాంచలమ్ముపై
అలమె నేదో కాంతి
అరుణరాగమ్ముతో
అర్కోదయ మ్మేమొ!

గాఢాంధతమసమ్ము
కనుకట్టుగా కరగి
భువనమోహనకాంతి
పూర ముప్పొంగునో!

నాజీవితం బంత
నవనవోన్మిషితమై
వింతశోభలతోడ
వికసించునో యేమొ!

కందుకూరి రామభద్రరావు

# PETRARCA

నీపేరు చెవి సోక
నిండుహర్షము రేగి
పొటమరించును మేను
Petrarca!

నిరుపమానం బైన
నీచరిత్రము నన్ను
ముగ్ధమానసు జేయు
Petrarca!

ఆత్మజన్మస్థాన
మా "అరెజ్జో"పురము
ఎంత సుందర మయ్యె
Petrarca!

లలితాంగి యైన ఆ
"లారా" మహామాన్య
ఎంత సుకృతము చేసె
Petrarca!

ద్వావింశతి సమాల
తావకీనాంబకాల్
పడ నేల నామెపై
Petrarca!

నీకవిత్వపు సుధా
నిష్యందమున నామె
అజరామరం బయ్యె
Petrarca!

నీ దేశమో ఇటలి,
నాభూమి ఇండియా:
ఐన నీయెడ ప్రీతి
Petrarca!

---

* Franceesco Petrarca (1304—1374 A. D.).

## PETRARCA

తోచు పోలిక మనకు
దూర మెంతే గాని
దేశ కాలాలలో
Petrarca!

మన మిర్వురముకూడ
మహిళ కుత్కర్షంబు
సమకూర్చినా మయ్యా
Petrarca!

మనకటాక్షప్రభా
మండితాంగన లెల్ల
నిర్జరత్వము గనిరి
Petrarca!

అన్నారు దైవజ్ఞు
లాయుఃప్రమాణమ్ము
నాకు నీయంతె యని
Petrarca!

కవివరోచిత రీతి
గ్రంథభాండారాన
తనువు చాలించితివి
Petrarca!

శిరసు గ్రంథముమీద
చేత కావ్యముతోడ
పో నెంతు నీలాగ
Petrarca!

కలిసికొంద మనంత
కాలాన భాషిత—
ప్రతిబంధకము లేక
Petrarca!

"బదరిక": కాకినాడ

శివశంకరశాస్త్రి

# స్వర్ణయోగి

కొంపెల్ల జనార్దనరావు

[ప్రభువు, యోగి.]

ప్రభువు:—రాష్ట్రము భాగ్యవంతము చేసి లోకులకు ఉన్నతిమార్గాలు కూర్చే నిమిత్తమై నే నీ గుప్తవిద్య వినియుక్తము చేస్తాను—శపథమే.

యోగి:—కోరి నీ విది యెరిగితివి. నీమరణవేళను గాని ఇది యితరునికి తెలియరాదుసుమా!

ప్రభువు:—అదేమి ?

యోగి:—ఇద్ద రిది యెరిగి మనరాదు.

* * *

ప్రభువు:—ఏమి నా కిటు దృశ్యము మారివచ్చి మిరుమిట్లు గొల్పుతున్నది!—ఎవ రక్కడ ? ఈ సన్యాసికి మరణదండము.

యోగి:—ఏమంటివి ?

ప్రభువు:—అడగక పూర్వమే యిస్తిమి జవాబు. ఇది స్వర్ణము ప్రసాదించిన తొలుశాపము కాబోలు!—ఇదే నా రాజదండము చేయించే తుదికార్యమున్ను.

యోగి:—ఇది నా ఆశీఃకిరణము మొలిచిన ప్రభాతము, ఇదీ నా స్వర్ణయోగము. నీవు నేనై యెరుగుదువులే.

# శంపాలత

## (బాలానందం)

### చింతా దీక్షితులు

అనగా అనగా ఒకఊళ్లో ఒకకాపువాడు వానిభార్యా ఉండేవారు. వారు చిలకా గోరింకల్లాగ కలిసిమెలిసి ఉండేవారు. వారు ప్రతిదినమూ చద్దిఅన్నము పిడతలలో పెట్టుకొని పొలానికి పోయి సాయంత్రందాకా పొలంలో పని జేసి రాత్రి అయ్యేసరికి ఇంటికి వచ్చేవారు.

వారికి రెండుకాళ్లు ఎద్దులుకూడా ఉండేవి. ఆ ఎద్దులను ఉదయాన్ని పొలానికి తోలుకు వెళ్లేవారు, సాయంత్రము ఇంటికి తోలుకు వచ్చేవారు.

ఈరీతిగా చాలాకాలం వాళ్లు చేశారు.

పాపం వాళ్లకు పిల్లలు లేరని చాలావిచారంగా ఉండేది. పిల్లలు కలుగుతారేమోనని వాళ్లు బ్రాహ్మలకు దానాలు ఇచ్చారు. రావిచెట్టు ప్రదక్షిణాలు చేశారు. వ్రతాలూ నోములూ పట్టారు. ఏమి చేసినా వారికి సంతానం కలిగిందికాదు.

పోనీ భగవంతుడు మన కింతే ఇచ్చాడు. దీనితో సంతుష్టి పొంది ఉందాము అని వారు మనస్సు సమాధానంచేసుకొన్నారు.

ఒకనాడు తెల్లవారగట్ల వాళ్లు చద్దిమూటలను కట్టుకొని ఎడ్లని తోలుకొని తెల్లారక ముందే పొలానికి వెళ్లారు. పొలంలో మధ్యాహ్నందాకా పనిచేసి చద్దిఅన్నము తిని ఒక చెట్టునీడను పండుకొన్నారు. అప్పుడు కాపువాని భార్యకు ఒకకల వచ్చింది.

ఆవిడకు కలలో మల్లిఖార్జునస్వామి కనిపించి, "నీకు సంతానము లేదని చాలా దుఃఖిస్తున్నావు. నీవూ నీభర్తా దేశాలన్నీతిరిగి ఎవరైనా నీ కడుపున పుట్టుతారేమో కనుక్కో. పుట్టుతామని ఎవరైనా ఒప్పుకొన్నట్లయితే నీకు తప్పకుండా సంతానం కలుగుతుంది"అని చెప్పి మాయమైపోయినాడు.

కాపువానిభార్య కళ్లు నులుపుకొంటూ లేచి భర్తను లేపి తనకు వచ్చిన కలసంగతి చెప్పింది. పగలు వచ్చిన కలను పాటించకూడదని కాపువాడు చెప్పాడు. పగలు వచ్చినా రాత్రి వచ్చినా మల్లిఖార్జునస్వామి ప్రత్యక్షమయ్యేడుగదా: ఆస్వామి ప్రత్యక్షమయి చెప్పిన మాట ఎందుకు అబద్ధమాతుంది అని కాపువానిభార్య చెప్పింది. ఆవిడదైవభక్తికీ నమ్మకానికీ కాపువాడు ఆశ్చర్యం పొంది, "సరే ఏమి చేద్దాము" అన్నాడు.

భార్యాభర్తలిద్దరూ, కూడబలుక్కొని తమ పొలాలూ ఎడ్లూ అమ్మివేసి దేశాల వెంట బయలుదేరారు. వారు త్రోవలో ఒక అందమైన పిల్లవాణ్ణి చూచి, "మాకడుపున పుట్టతావా నాయనా" అని అడిగారు. "మాఅమ్మ కొట్టుతుంది. నే పుట్టను. నిన్ను చూస్తే నాకు భయమేస్తూఉంది" అన్నాడు. వా ళ్లామాట విని సిగ్గుపడి మళ్లీ మాటాడకుండా తమ దారిని వెళ్లిపోయారు.

వెళ్లగా వెళ్లగా వారికి త్రోవలో ఒక చెరువు కనిపించింది. ఆచెరువుదగ్గిర ఒక అందమైన ఆడపిల్ల కనిపించింది. ఆలాంటి ఆడపిల్ల తమకు పుట్టితే ఎంతబాగుంటుందో అనుకొని ఆపిల్లదగ్గిరికి వారు వెళ్లి అన్నారుగదా "అమ్మాయీ! నాచిట్టితల్లివి, నీ విక్కడేమి చేస్తున్నావమ్మా? నీకు బొమ్మలూ పువ్వులూ ఇస్తాము. మాకడుపున పుట్టుతావా" అని.

"నాకు బొమ్మలూ పువ్వులూ ఉన్నవి. నాకు మాఅమ్మా నాన్నా అన్నీ ఇస్తారు. మీదగ్గిరికి నేను రాను" అంది.

ఈవిధంగా వారు అగుపించిన పిల్లలందరినీ అడుగుతూ వెళ్ళారు. కాని ఎవరూ వాళ్లకడుపున పుట్టడానికి ఒప్పుకోలేదు.

"పోనీ, ఎవరైతేనేమి? పుట్టితే చాలును" అనుకొని వాళ్లు ఒక ముసలిఅవ్వ దగ్గిరికి వెళ్లి, "అవ్వా, అవ్వా, మాకు పిల్లలు లేక చాలా దుఃఖిస్తున్నాము. నీవు కాటికి కాళ్లు చాచుకొన్నావు గదా. మళ్లీజన్మములో మాకడుపున పుట్టడానికి ఒప్పుకొంటావా" అని అడిగారు.

"నేను మీకడుపున పుట్టడ మెందుకు నేను ఎవరికడుపునా పుట్టను. అందుకనే రామా కృష్ణా అనుకొంటున్నాను" అంది.

పోనీలే అని వారు కొంతదూరం నడిచి వెళ్లగా వెళ్లగా ఒకఇంటిలో ఒకముసలివాడు కర్ర చేత్తో పుచ్చుకొని గుమ్మందగ్గిర కూర్చుని ఉన్నాడు. వాళ్లు ఆముసలివానిదగ్గిరకు వెళ్లి, "నాయనా, మాకు సంతానం లేక చాలా దుఃఖిస్తున్నాము. నేడో రేపో నీవు కాలంచేస్తావు గదా. మాకడుపున పుట్టడానికి ఒప్పుకోవా" అని అడిగారు.

ఆముసలివాడు ఉలిక్కిపడి, "ఏమిటీ, ఏమిటీ, నేను మీకడుపున పుట్టడమా? ఈ నా ఇల్లూ, వాకిల్లూ, పొలంబ్రాటా ఏమైపోను. నేను ఎవరికడుపునా పుట్టను. ఇవన్నీ చూచుకొంటూ ఇక్కడనే ఉంటాను" అన్నాడు.

ఎవరిని అడిగినా ఎవరూ ఒప్పుకోవడంలేదని వాళ్లు "పోనీ ఎవరైతేనేమి? ఎవళ్లో ఒకళ్లు కావాలిగదా మనకు సంతానం" అనుకొని ఒకబాటప్రక్క ఇద్దరు కుంటివాళ్లు బిచ్చము ఎత్తుకొని జీవిస్తూఉంటే వాళ్లదగ్గిరకు వెళ్లి ఇలాగ అన్నారు: "తిండికి లేక బిచ్చ

మెత్తుకొని మలమల మాడుతున్నారు గదా; పోనీ మీరు చచ్చిపోయి మాకడుపున పుడతారా. మీకు కూడూగుడ్డా లోపం ఉండదు. అన్ని సౌఖ్యాలూ ఉంటవి."

ఆకుంటివాళ్లు కాపువాణ్ణీ వానిభార్యను చూచి, "మేము ఎందుకు చచ్చిపోవాలీ? మేము చచ్చిపోనూ చచ్చిపోము మీకడుపున పుట్టనూ పుట్టము. మా కిలాగ ఉంటేనే బాగుంది"అని అన్నారు.

ఎంతమంది మనుష్యుల నడిగినా ఎవరూ ఒప్పుకోలేదు. ఇంక వారికి సంతానం కలగడం ఎలాగ? పోనీ మనుష్యులు కాకపోతేపోయిరి, జంతువులైనా తమ కడుపున పుట్టడానికి ఒప్పుకొంటాయేమోనని ఒక ఆవుదగ్గిరికి వెళ్ళి, "ఆవూ, ఆవూ, నీకు ఈ పాడు జన్మము ఎందుకు. మా కడుపున పుట్టరాదూ? నీకు అన్నిసౌఖ్యాలూ ఉంటవి" అని అడిగారు. "నాకు ఈజన్మమే బాగుంది. నాకు మనుష్యజన్మ అక్కరలేదు"అని ఆవు చెప్పింది.

ఈలాగే జింకలదగ్గరకూ, పక్షులదగ్గిరికీ, గుర్రాలదగ్గిరికీ వెళ్ళి తమకడుపున పుట్టవలసినదని వారు కోరగా అవి ఏవీ ఒప్పుకోలేదు.

తరువాత వాళ్లు ఒక పెద్దపులి దగ్గిరికి వెళ్లి, "పెద్దపులీ, పెద్దపులీ, మాకడుపున పుట్టుతావా?" అని అడిగారు.

"నాకర్మం కాలిందా ఏమిటి నేను మనుష్యజన్మ ఎత్తడానికి? హాయిగా స్వేచ్ఛగా ఈఅడవిలో నేను తిరుగుతూ సుఖంగా ఉన్నాను. నాకు లోటేమిటి? నాకు మనుష్యజన్మం అక్కరలేదు పొండి" అని గాండ్రించింది.

వాళ్లు భయపడి అక్కడనుండి పారిపోయారు.

తమ కడుపున పుట్టడానికి మనుష్యులూ ఒప్పుకోలేదు, మృగములూ ఒప్పుకోలేదు, పక్షులూ ఒప్పుకోలేదు. ఇంకఏమి చెయ్యడానికీ వారికి తోచిందికాదు. సంతానం లేకుండానే చచ్చిపోవాలి కాబోలు ననుకొని వాళ్లు దుఃఖిస్తూ ఒక చెట్టుకింద కూర్చున్నారు.

అది పెద్దమర్రిచెట్టు. ఆచెట్టుమీద ఒక బ్రహ్మరాక్షసీ బ్రహ్మరాక్షసుడూ కాపురం ఉన్నారు.

పూర్వజన్మంలో వాళ్లు మనుష్యులు. వాళ్లు మనుష్యులుగా ఉన్నరోజుల్లో చాలా పాపాలు చెయ్యడంవల్ల రాక్షసులైపుట్టి ఆమర్రిచెట్టుమీద కాపురం ఉన్నారు.

ఆదారిని వచ్చేపోయేవారందరినీ భయపెట్టుతూ, కొట్టుతూ, రక్కుతూ ఎంతో బాధపెట్టుతూ ఉన్నారు.

పూర్వజన్మలో పాపాలు చెయ్యడంవల్ల తమకు రాక్షసజన్మ వచ్చిందనీ, మళ్లీ మనుష్యజన్మ ఎత్తగలిగితే అన్నీ పుణ్యాలు చెయ్యవచ్చుననీ, దానివల్ల తమకు మళ్లీ రాక్షస

జన్మ రాదనీ వాళ్లు అనుకొంటూ ఉండేవారు. కాని ఆదారిని పోయే ప్రయాణీకులను మాత్రము అనేకవిధాలుగా బాధపెట్టేవారు.

చెట్టుమీదనుంచి బ్రహ్మరాక్షసీ, బ్రహ్మరాక్షసుడూ కాపువాణ్ణీ వాడిభార్యనూ చూచారు. "మీరు ఇక్కడకు ఎందుకు వచ్చారు?" అని చెట్టుమీదనుంచి కేకవేశారు.

కాపువాడూ భార్యా ఆకేక విని ఎవరో చెట్టుమీద ఉన్నారనుకొని తల ఎత్తి చూచారు. వారి కెవరూ కనిపించలేదు. "ఎవరు చెప్మా కేకవేసి మాయమయ్యేరు. దయ్యమూ భూతమూ కాదుకదా"అనుకొన్నారు వారు.

రాక్షసులు మళ్లీ "మీ రెవరో చెప్పుతారా, చెప్పరా. మిమ్మల్ని మింగేసేదా?" అని అరిచారు.

"ఎవరో నాయనా మీరు, మేము చూడలేకుండా ఉన్నాము. మేము సంతానం లేక దేశదేశాలూ తిరుగుతున్నాము. ఎవరైనా మాకడుపున పుట్టుతారేమోనని ఎవరిని అడిగినా పుట్టమన్నారు. మాగతి ఇలాగ అయిందిగదా అనుకొని దుఃఖిస్తున్నాము నాయనా"అని వాళ్లు చెప్పారు.

ఆ మాటలు వినడంతోనే రాక్షసులకు సంతోషమయింది. "మేమిద్దరమూ మీ కడుపున కొడుకూ కూతురూ అయి పుడతాము. మీకు ఇష్టమేనా?" అని రాక్షసులు అడిగారు.

"మీ రెవరు నాయనా" అని కాపువాడూ భార్యా అడిగారు.

"మేము బ్రహ్మరాక్షసులము" అన్నారు వాళ్లు.

ఆమాట వినగానే కాపువానికీ వాని భార్యకూ చాలా భయంవేసింది. "బ్రహ్మ రాక్షసులు తమకడుపున పుట్టడమేమిటి? ఎవరైనా వింటే తమ్మికూడా అడవులలోనికి తరిమివేస్తారు గదా? అయినా బ్రహ్మరాక్షసులను కని ఎలాగ బ్రదకడం" అనుకొన్నారు వారు.

అనుకొని ఆచెట్టుకిందనుంచి లేచి గబగబా పరుగెత్తారు. బ్రహ్మరాక్షసీ బ్రహ్మ రాక్షసుడూ వాళ్లవెంటబడి తరుముకు వెళ్ళారు.

"మీ కడుపున మేము పుడతాము, మీ కడుపున మేము పుడతాము, ఒప్పుకోండి. లేకపోతే మిమ్మల్ని మింగివేస్తాము" అంటూ బ్రహ్మరాక్షసులు అరవడం ప్రారంభించారు.

"అమ్మో, ఈబ్రహ్మరాక్షసులు నిష్కారణంగా చంపివేస్తారు కాబోలు. ఎలాగ" అని వారు భయపడుతూ మరీ గబగబా పరుగెత్తి వెళ్ళిపోతున్నారు.

బ్రహ్మరాక్షసులు వాళ్ళవెంట వెళ్లి వాళ్లను పట్టుకొని, "మీకడుపున పుట్టనిస్తారా? పుట్టనియ్యరా? పుట్టనియ్యకపోతే చంపేస్తాము" అన్నారు.

"మీరు పుడితే మాకు భయంవేస్తుంది. ఎవరికైనా తెలిస్తే మమ్మల్ని బదకనియ్యరు" అని కాపువాడూ భార్యా చెప్పారు.

"మేము పుట్టితే మనుష్యుల్లాగే పుట్టి మనుష్యుల్లాగే ఉంటాము. మేము పుట్టామని ఎవరికీ తెలియదులెండి'' అని రాక్షసులు చెప్పారు.

"పోనీ ఎవరైతేనేమి పుట్టడానికి. సంతానంకోసం ఇన్నిపాట్లు పడ్డాముకదా. నేటికి మీకడుపున పుడతాములని చెప్పినవాళ్లు వీళ్లు కనబడ్డారు. ఎవరైతేనేమి, సంతానానికి? అందరిలాగే వీళ్లూ ఉంటామంటున్నారు గదా? అయినా రాక్షసులుపుట్టారని ఎవరికి తెలియ బోతుంది? పోనీ ఈసంతానం వద్దంటే ఇంకోవిధంగా సంతానం కలిగేమార్గం లేదుగదా? కాదూ కూడదూ అంటే వీళ్లు బ్రదకనిచ్చేవిధం లేదు" అనుకొని కాపువాడూ కాపువాని భార్యా బ్రహ్మరాక్షసులు తమకడుపున పుట్టడానికి ఒప్పుకున్నారు.

ఒప్పుకొన్నందుకు బ్రహ్మరాక్షసులు సంతోషించి వెళ్లిపోయారు.

కాపువాడూ వాడిభార్యా ఇంటికి వచ్చి మామూలుప్రకారము సేద్యము చేసు కొంటూ ఉన్నారు.

౨

కాపువానికీ వానిభార్యకూ ఒకకొడుకూ ఒకకూతురూ పుట్టారు. కొడుకుపేరు నీరదశ్యాముడు. కూతురుపేరు శంపాలత. కొడుకునూ కూతురినీ వారు కంటిలోపాపలాగ ఎంతో ముద్దుగా చూచుకొంటూ ఉన్నారు. కొడుకుకు చదువు చెప్పించారు, సేద్యం నేర్పారు. శంపాలతకు ఎన్నో ఆటలూ పాటలూ వచ్చును. నీరదశ్యాముడూ శంపాలత కలిసి పొలంగట్లులమీద తరుచుగా ఆడుకొంటూ ఉండేవారు.

మల్లిఖార్జునస్వామి దయవల్ల తమకు సంతానం కలిగిందిగదా అని కాపువాడూ భార్యా పిల్లలతోకూడా శ్రీశైలం వెళ్లి మల్లిఖార్జునస్వామినీ భ్రమరాంబనూ చూడవలెనని అనుకొన్నారు. కాని వారిప్రయాణం జరిగిందికాదు. కారణం ఏమిటంటే:

మర్రిచెట్టుమీద బ్రహ్మరాక్షసీ బ్రహ్మరాక్షసుడూ ఉన్నరోజుల్లో ఒకమారు ఒక దొంగలగుంపు ఒక ఊరు దోచుకొని ఆ మర్రిచెట్టుక్రిందకు దోచుకొన్నధనమంతా తీసుకు వచ్చి పంచుకోవాలని అనుకొన్నారు. వాళ్లందరూ కూర్చొని పంచుకొంటూఉన్న సమయ ములో బ్రహ్మరాక్షసులు వాళ్లమీద రాళ్లవాన కురిపించారు. వాళ్లు రాళ్ళవానకు తాళలేక

డబ్బంతా పోగుచేసుకొని అక్కడనుంచి పారిపోవాలని ప్రయత్నించారు. కాని వారు పారి పోకుండా బ్రహ్మరాక్షసులు వారిచుట్టూ మంటలు పుట్టించారు. దొంగలకు భయము వేసింది. ఏవిధంగా తప్పించుకుపోవడానికీ వాళ్లకి వీలయిందికాదు. అప్పుడు వాళ్లు ఆ డబ్బంతా అక్కడ పారవేసి బ్రహ్మరాక్షసులకు మొక్కుకొన్నారు. బ్రహ్మరాక్షసులు దయదలచి చివరకు వాళ్లను వదలిపెట్టారు.

దొంగలు ఏలాగైతేనేమి బ్రతుకుజీవుడా అనుకొని తప్పించుకొనివచ్చి వాళ్ల ఊరు చేరుకొన్నారు.

దొంగలు వదలిపెట్టిన డబ్బంతా ఆ బ్రహ్మరాక్షసులు పోగుచేసి మర్రిచెట్టుకింద ఒక గొయ్యి త్రవ్వి ఆ గోతులో ఆ డబ్బు పెట్టి గొయ్యి పూడ్చివేసి ఆ డబ్బుకు వాళ్లు అక్కడ కాపలాఉండడము మొదలుపెట్టారు.

దొంగలు ఇంటికి వచ్చి తమకు జరిగిన పరాభవము తలచుకొని ఏలాగైనా బ్రహ్మ రాక్షసులమీద కసితీర్చుకోవాలని ఆలోచించారు. ఆఊళ్లో బ్రహ్మరాక్షసులను పట్టే మాంత్రికు లిద్దరు ఉన్నారు. వారు దయ్యాలనూ, భూతాలనూ, బ్రహ్మరాక్షసులనూ మంత్రంవేసి పట్టుకొని సీసాలలోకి వాళ్లని దింపి భూమిలో పాతిపెట్ట గలవారు. దొంగలు ఆ మాంత్రికులదగ్గిరకు వెళ్లి అడవిలో మర్రిచెట్టు ఉందనీ దానిమీద బ్రహ్మరాక్షసులు ఇద్దరు ఉన్నారనీ వాళ్లను పట్టుకొన్నట్లయితే కావలసినంత ధన మిస్తామనీ చెప్పారు. మాంత్రికు లందుకు ఒప్పుకొన్నారు.

దొంగలూ మాంత్రికులూ కలసి అడవికి ప్రయాణమై వెళ్లారు. ఆ మర్రిచెట్టుదగ్గిరికి వెళ్లి మాంత్రికులు చూచారు గాని అక్కడ బ్రహ్మరాక్షసులు కనిపించలేదు. ఆసంగతి దొంగలతో వారు చెప్పారు.

"మనము వస్తున్నామని భయపడి ఈ బ్రహ్మరాక్షసులు ఎక్కడకో పారిపోయినారు. వారిని ఎక్కడ ఉన్నా పట్టుకొని కసితీర్చుకోవాలి" అని దొంగలు మాంత్రికులతో చెప్పి వారికి కావలసినంత డబ్బు ఇచ్చి ఊరూరూ తిరగడం మొదలుపెట్టారు.

చివరకు కాపువాడూ భార్యా పిల్లలూ ఉన్న ఊరు వచ్చారు. మాంత్రికులు కాపువానిపిల్లలను చూచి వాళ్లే బ్రహ్మరాక్షసులయి ఉంటారని గుర్తుపట్టారు.

దొంగలు వాళ్ల నేలాగైనా పట్టవలసిందని మాంత్రికులను వేడుకొన్నారు.

"నరజన్మం ఎత్తినప్పుడు బ్రహ్మరాక్షసులను పట్టుకోకూడదు" అని చెప్పి మాంత్రికులు వెళ్లిపోయారు.

దొంగలకుమాత్రం బ్రహ్మరాక్షసులమీద కోపము పోలేదు. నరజన్మం ఎత్తినాసరే వాళ్ళమీద కసితీర్చుకోవాలని అనుకొన్నారు. కాని నరజన్మం ఎత్తినప్పటికీ వాళ్లు బ్రహ్మ రాక్షసులుగదా, అపకారం చేసేబుద్ధితో వాళ్లదగ్గిరికి వెళ్లితే ఏమి చేసిపోతారో అని దొంగలు భయపడడం మొదలుపెట్టారు. ఏలాగైనా వాళ్లమీద కసితీర్చుకోవాలని ఆలోచిస్తున్నారు.

ఒకనాడు కాపువాడు తనపిల్లల నిద్దరినీ తీసుకొని పొలానికి వెళ్లాడు. నీరదశ్యాముడూ శంపాలతా దూరముగా ఆడుకొంటూన్నారు. కాపువాడు పొలము దున్నుకొంటున్నాడు. ఇంతట్లోకే సాయంకాలమయింది. దొంగ లెక్కడినుంచో వచ్చి నీరదశ్యాముని శంపాలతనూ పట్టుకొని దూరముగా తీసుకొనిపోయి చేతులూ కాళ్లూ కట్టివేసి ఒక పాడునూతిలో పారవేశారు.

కాపువాడు పొలం దున్నడం చాలించి ఎద్దులకు నాగలి తిరగవేసి కట్టి ఇంటికి పోవా లని తన కొడుకునూ కూతురునీ పేరుపెట్టి పిలిచాడు. వాళ్లు ఎంత పిలిచినా మారుపలుకు వినిపించలేదు. చెప్పకుండా యింటికి వెళ్లిపోయారేమో ననుకొని గబగబా ఎడ్లను తోలుకొని యింటికి పోయాడు. ఇంటిలో భార్యను అడిగాడు. పిల్లలు ఇంటికి రాలేదని భార్య చెప్పింది. అప్పుడు భార్యాభర్త లిద్దరూ బయలుదేరి తమపిల్లలకోసమని రాత్రల్లా "శంపాలతా, నీరదశ్యామా" అని పిలుచుకొంటూ తిరిగారు. కాని వారి కెక్కడా వారిపిల్లలజాడ కనిపించ లేదు. "వీళ్లు పిల్లలుకారు, బ్రహ్మరాక్షసులు: మనఇంట్లో ఉండడం ఇష్టములేక ఎక్కడికో మాయమైపోయారు. ఇంతకే మనకర్మం ఈలాగ ఉంది" అని అనుకొంటూ మల్లిఖార్జున స్వామిని ధ్యానముచేసుకొంటూ ఇంటివద్ద ఉండిపోయారు.

నీరదశ్యాముడూ, శంపాలతా పాడునూతిలో పడ్డారు. అందులో కొంచెంనీళ్లు మాత్ర మున్నవి. వాళ్లు కష్టపడి కాళ్లకూ చేతులకూ కట్టిన త్రాళ్లను తెంచుకొని నాలుగువైపులా తాకిచూచారు. ఆ నూతికి ఒకవైపు చిన్నతలుపు ఉన్నది. వాళ్లు తలుపు తీసి లోపలికి వెళ్లారు. అక్కడ వాళ్ల కొక మైదాన మగుపించింది. ఆమైదానమును దాటి వెళ్లగా ఒక తోట కనిపించింది. ఆతోటలోకి వారు వెళ్లారు. అక్కడ ఒక చక్కనిమేడ కని పించింది. వాళ్లకు ఆకలీ దాహముగానూ ఉన్నది. ఆమేడలోకి వెళ్లితే ఎవరైనా కనిపించు తారు, వాళ్ల నడిగితే ఏమైనా తినవచ్చు ననుకొన్నారు. అనుకొని ఆ మేడలో ప్రవేశించారు. ఆ మేడలో ఎవరూ వారికి కనిపించలేదు. మేడంతా తిరిగితిరిగి విసిగి అలసట వచ్చి చివరకు ఒక చాపమీద పడుకొని నిద్రపోయారు.

వారు నిద్రపోతూ ఉండగా ఆ మేడలోకి ఒక చక్కని నాగకన్య వచ్చింది. ఆ మేడ నాగకన్యది. నాగకన్యక వచ్చి నిద్రపోతూ ఉన్న నీరదశ్యాముణ్ణీ శంపాలతనూ చూచి,

"ఈ మనుష్యులు ఇక్కడకు ఏలాగ వచ్చారు చెప్మా, పాదునూతిలో నేను పెట్టుకొన్న గుమ్మం లోంచి వచ్చారు కాబోలు" అనుకొంది.

కొంతసేపటికి నీరదశ్యాముడూ శంపాలతా లేచారు. నాగకన్య వారిచేత స్నానము చేయించి, గంధము పూసి, మంచిబట్టలు కట్టుకోబెట్టి, భక్ష్యాలతో అన్నము పెట్టి ఎంతో ఆదరించింది.

"మీ రిక్కడ కెందుకు వచ్చా"రని నాగకన్య వారిని అడిగింది.

"మేము పొలములో ఆడుకొంటూ ఉంటే ఎవరో దొంగలు వచ్చి మమ్మ కాళ్లూ, చేతులూ కట్టివేసి పాదునూతిలో పారవేశారు. ఆకట్లు తెంచుకొని అక్కడ ఒక వాకిలి కనిపిస్తే దానిగుండా ఇక్కడకు వచ్చా"మని వారు చెప్పారు.

నాగకన్య వాళ్లిద్దరినీ అక్కడ ఉండిపొమ్మని చెప్పింది. కాని వాళ్లు నాన్నా అమ్మా దగ్గిరికి వెళ్లిపోతా మన్నారు. దారి చూపించమన్నారు. "మీరు మళ్లీ అక్కడకు వెళ్లితే దొంగలు మళ్లీ వచ్చి మిమ్మ బాధపెట్టుతారు. ఇక్కడే ఉండిపోరాదా" అని నాగకన్య అడిగింది.

ససేమిరా మే ముండ మన్నారు వారు.

అప్పడు నాగకన్య వారికి మోయగలిగినంత బంగారమూ, రత్నాలు ఇచ్చి వారి ఇంటికి దారి చూపించింది. వెళ్లిపోవడానికి ముందు వారు "మాదగ్గిరికి దొంగలు మళ్లీ వచ్చి బాధపెట్టుతారేమో ? వాళ్లు మమ్మల్ని బాధపెట్టకుండా ఏమి చెయ్యమన్నావు" అని నాగకన్యని అడిగారు.

నాగకన్య వా రిద్దరికీ చెరొక రత్నహారమూ ఇచ్చి అది ఎప్పుడూ మెళ్లో వేసు కొన్నట్లయితే ఏమీ భయము లేదని చెప్పి పంపించివేసింది.

వాళ్లు ఆ రత్నహారాల్ని మెళ్లో వేసికొని ఇంటికి తిరిగి వస్తున్నారు.

త్రోవలో వాళ్లకు ఒకదొంగ కనిపించాడు. వాళ్లు మోసుకువస్తూఉన్న బంగారమూ రత్నాలు చూచి వాళ్ళు మెడలో వేసుకొన్న రత్నహారాలు చూచి వాటిని ఏలాగైనా ఎత్తుకు పోవాలని ఊహించినాడు. వాళ్లకు అడ్డంగా వచ్చి "ఆ మూటలన్నీ ఇచ్చివేసి వెళ్ళండి. లేకపోతే మిమ్మల్ని చంపుతాను" అని దొంగ అన్నాడు.

దొంగను చూచి వాళ్ళు భయపడలేదు. నవ్వుతూ వాడిమాట వినిపించుకోకుండా నడిచిపోయారు. దొంగ కోపంవచ్చి వారిమూటలు బలవంతాన్ని లాగాలని దగ్గిరకు వచ్చి మూటలు పట్టుకొన్నాడు. పట్టుకునీ పట్టుకోవడంతోనే ఒకపెద్దపాము వచ్చి దొంగను కరిచింది. దొంగ అక్కడ పడిపోయి చచ్చిపోయాడు.

వాళ్ళు ఆమూటలు పట్టుకొని ఇంటికి వచ్చారు. కాని వాళ్లయింట్లో ఎవరూ లేరు. వాళ్ళమ్మా నాన్నా ఇంట్లో లేరు. పొలానికి వెళ్లారేమోనని ఇంట్లో మూటలన్నీ దాచివేసి వాళ్ళిద్దరూ కలిసి పొలానికి వెళ్ళారు. కాని పొలంలోనూ కనిపించలేదు. తాము రాకపోడం చూచి నిరాశచేసుకొని మల్లిఖార్జునస్వామి దర్శనంచేసుకోవడానికి వెళ్ళి ఉంటారని ఊహించి వాళ్ళిద్దరూ కలిసి కొంతధనము తమ ఇంట్లో పాతిపెట్టి కొంతధనము మూటలు కట్టుకొని శ్రీశైలముకు ప్రయాణమయ్యారు. పగలు చల్లగా ఉన్నప్పుడల్లా ప్రయాణముచేస్తూ ఎండ వేళ చెట్లనీడ నిద్రపోతూ రాత్రిళ్లు ఏ సత్రములోనో తల దాచుకుంటూ వాళ్లు ప్రయాణము చేస్తున్నారు.

వీళ్లిల్లాగ ప్రయాణము చేస్తూఉండగా వీళ్ల వెనుక ముగ్గురు దొంగలు కూడా వెంటబడ్డారు.

ఈముగ్గురు దొంగలు అసలు బ్రహ్మరాక్షసులమీద పగ తీర్చుకోవాలని పనిచేస్తూ ఉన్నవాళ్లే. నీరదశ్యాముడూ శంపాలతా బంగారమూ రత్నాలూ మూటలు కట్టి తెస్తూ ఉంటే ఆమూటలు లాక్కోబోయి ఒకదొంగ తాచుపాము కరిచి చచ్చిపోయాడు గదా. ఆదొంగ చచ్చిపోవడం ఈముగ్గురు దొంగలూ తెలుసుకొన్నారు. నీరదశ్యాముడిమీదా శంపాలతమీదా వీళ్ళకు మరీకోపం వచ్చింది. ఎలాగైనా వీళ్లిద్దరినీ చంపివెయ్యావలె ననుకొన్నారు. ప్రయాణము చేసిచేసి అలసి ఒకనాటిరాత్రి ఒక పాడుదేవాలయములో నీరదశ్యాముడూ శంపాలతా నిద్రపోయారు. వాళ్లు నిద్రపోతూఉండగా ముగ్గురు దొంగలూ వెళ్లి వాళ్లమూటలను నిమ్మళంగా తీసివేసు కొన్నారు. అందులో ఒకడు వాళ్ళమెడలోఉన్న రత్నహారమును తీయబోగా ఒకపాము వచ్చి వాడిని కరిచింది. వాడు చచ్చిపోయాడు. వాడు చచ్చిపోవడం చూచి భయపడి మూటలు పట్టుకొని మిగిలిన ఇద్దరు దొంగలూ పారిపోయారు.

తెల్లారడంతోనే నీరదశ్యాముడూ శంపాలతా లేచారు. తమ మూటలు తీసుకో వాలని చూచుకొన్నారు. మూటలు కనిపించలేదు గాని ఒకదొంగ చచ్చి పడిఉండడం చూచారు. తమ మూటలు దొంగలు ఎత్తుకుపోయారు గదా అనుకొని ఏమి చెయ్యడానికీ లేక ప్రయాణము సాగించారు.

వెళ్లగా వెళ్లగా ఎండ ఎక్కింది. తోవలో వాళ్ళు కొకనది కనిపించింది. ఎండ ఎక్కువగా ఉండడమువల్ల నదిలో స్నానముచెయ్యవలెనని చెప్పి రత్నహారాలూ బట్టలూ ఒడ్డున పెట్టు కొని వాళ్ళు నదిలోకి దిగి ఈతాలాడుకొంటూ సంతోషంతో చాలాసేపు స్నానంచేశారు. తరవాత నీటిలోనుంచి బయటకు వచ్చి చూచుకుంటే వాళ్ల బట్టలూ రత్నహారాలూ లేవు.

వాళ్లవెనకే దూరమున వస్తూఉన్న ఇద్దరు దొంగలు వాళ్ల బట్టలూ హారాలూ తీసుకొన్నారు. తీసుకోవడం శంపాలతా నీరదశ్యాముడూ చూడలేదు. రత్నహారాలు పోయినందుకు వాళ్లు దుఃఖిస్తూ నదిఒడ్డునే కూర్చున్నారు. చీకటి పడింది. ఆ నదిగట్టున వాళ్లు బిగ్గరగా ఏడుస్తూఉండగా ఆదారిని పోయే ఒక చెంచువాడు వాళ్లను చూచి దయ దలిచి వాళ్లను తన ఇంటికి తీసుకుపోయి బట్టలిచ్చి కడుపునిండా తిండిపెట్టి వాళ్ల సంగతి అడిగాడు. వాళ్లు తమ పుట్టుకదగ్గిరనుంచీ జరిగిన వృత్తాంతము చెంచువాడితో చెప్పారు. చెంచువాడు ఆ ఇద్దరు దొంగలనూ చంపివెయ్యవలెనని విల్లూ బాణాలూ పుచ్చుకొని ఉదయాన్నే బయలుదేరాడు. కొంతదూరం పిల్లలు చెప్పిన గుర్తులనుబట్టి వాళ్లు వచ్చినదారిని వెళ్లగా అక్కడ ఇద్దరు దొంగలూ అగుపించారు.

వాళ్లు బట్టలూ రత్నహారాలూ తీసుకొని బట్టలు నదిలో పారవేసి రత్నహారాలు మెడలో వేసుకు పారిపోయారుగదా! మెళ్లో వేసుకున్న రత్నహారాలు పెద్దపాముల కింద మారిపోయి వాళ్లగొంతుకను గట్టిగా చుట్టపెట్టుకొన్నవి. వాటిని విదిలించుకోవాలని ఎంతప్రయత్నంచేసినా అవి పోయాయికావు. కొంతసేపు వాటితో పెనగులాడి అలసి పోయి ఊపిరిఆడక ఉక్కిరిబిక్కిరై అక్కడ పడిపోయారు. ఇలాగ పడిపోయిఉన్న దొంగలను చెంచువాడు చూచి వాళ్లదగ్గిర రత్నహారము లున్నవేమోనని వెదకిచూచాడు. రత్నహారాలు కనిపించలేదు. చుట్టుపట్ల పడిపోయాయేమోనని అంతటా వెదికాడు. ఎక్కడా దొరకలేదు. ఆసంగతి నీరదశ్యాముడితోనూ శంపాలతతోనూ ఇంటికి వచ్చి చెప్పాడు. వారు రత్నహారాలు పోయినందుకు విచారించినా దొంగలు చచ్చిపోయి నందుకు చాలా సంతోషించారు.

## 3

శంపాలతా నీరదశ్యాముడూ కొన్నాళ్లపాటు చెంచువాళ్లగూడెములో ఉండి పోయారు. చెంచుపిల్ల లందరితోనూ వాళ్లు సహవాసంచేశారు. ప్రొద్దున్నే వాళ్లతో కలిసి వేటకు వెడుతూ రాత్రికి ఇంటికి వస్తూఉండేవారు. రాత్రివేళ వాళ్లందరూ కలిసి చెట్లకింద మంచిమంచి ఆట లాడుకొనేవారు.

అది వెన్నెలకాలము. రాత్రి పుచ్చపువ్వులాగ వెన్నెలలు కాస్తూఉన్నవి. కడుపు నిండా పళ్లు తిని ఒకనాటిరాత్రి వాళ్లందరూ చెట్లకింద చేరారు. చెట్లకింద వెన్నెలలూ నీడలూ వెన్నెలలూ నీడలుగా ఉన్నది. శంపాలత ఆడపిల్ల లందరితోనూ చెయ్యీ చెయ్యీ పట్టుకొని గుండ్రముగా తిరుగుతూ నవ్వుతూ కేరింతాలు కొట్టుతూ కేకలు వేస్తూ ఆడుకొంటూఉన్నది. నీరదశ్యాముడూ చెంచుపిల్లవాళ్లూ కలిసి ఆ చెట్లకిందే

పరుగులెత్తుచూ ఒకరి నొకరు పట్టుకొంటూ పట్టులుపట్టుతూ ఒకరి నొకరు కిందకు పడ వేస్తూలేస్తూ గోలచేస్తూ ఆడుకొంటున్నారు. కొంతసేపటికి ఆడపిల్లలూ మగపిల్లలూ అందరూ కలిసి గట్టిగా గొంతుకెత్తి పాటలు పాడుతూ చప్పట్లు చరుస్తూ చెట్లచుట్టూ గిరున పరుగులెత్తుచూ, మర్రిఊడలు పట్టుకొని ఊగులాడుతూ, చెట్లమీద కెక్కుతూ ఆడుకొన్నారు.

చెట్లమీద నిద్రపోయిన పక్షులు లేచి కిలకిలకిలకిల మని గోలచేసినవి. ఈగోల విని మైదానములో పండుకొన్న జింకలమంద చెంగుచెంగున పరుగెత్తుకపోయింది. చెంచువాళ్లందరూ పిల్లల ఆటలు చూస్తూ వాళ్లచుట్టూరా నిలబడ్డారు.

ఇలాగ ఆటలాడుకుంటూ ఆడుకుంటూ వాళ్లు సమీపాన్నే ఉన్న పాతాళగంగ దగ్గిరకి వెళ్లారు. అక్కడకు వెళ్లవద్దని పెద్ద చెంచువాళ్లు కొందరిని వెనక్కు మరలించారు. కొందరు వాళ్లమాట వినకుండా పాతాళగంగదగ్గిరికి వెళ్లిపోయారు. నీరద శ్యాముడూ శంపాలతాకూడా పాతాళగంగదగ్గిరికి వచ్చారు.

పాతాళగంగగట్టుపొడుగునా ఉన్న బండలమీద వాళ్లు అందరూ కూర్చుని కథలు చెప్పకొంటున్నారు. నీరదశ్యాముడూ శంపాలతా ఒకబండమీద కూర్చు న్నారు. వాళ్లు ఈమాటా ఆమాటా చెప్పకొంటూ, "ఇదే శ్రీశైలమట. ఇక్కడ నాన్నా అమ్మా ఉన్నారేమో చూడవద్దూ" అనుకొన్నారు. అనుకొని ఇంకెవరితోనూ చెప్పకుండా ఆ అడివిలో నడుస్తూ వెళ్లారు. వెన్నెట్లో వాళ్ళు వెళ్ళుతూఉండగా త్రోవలో రెండు ఎలుగుబంట్లు వాళ్ళకి ఎదురుగా వచ్చినవి. వాటిని చూచి వాళ్ళు భయపడి ఒక పెద్దచెట్టువెనక దాక్కొన్నారు. ఒక ఎలుగుబంటి ఇంకో ఎలుగుబంటితో చెప్పతూ ఉన్న మాటలు వాళ్ళు విన్నారు. "శంపాలతా నీరదశ్యాముడూ ఈ అడివిలోనే తిరుగుతున్నారు. వాళ్ళమ్మా నాన్నా ఇక్క డున్నారనుకొని వచ్చారు. వాళ్ళప్పుడే నాగలోకానికి వెళ్లిపోయిన సంగతి వాళ్ళకు తెలియదు" అని ఒక ఎలుగుబంటి అంది. "మరి నాగలోకానికి దారి ఎక్కడ ఉన్నది" అని రెండో ఎలుగుబంటి అడిగింది. తరువాత మాటలు శంపాలతకూ నీరదశ్యాముడికీ వినబడలేదు. వాళ్ళమ్మా నాన్నా నాగలోకానికి వెళ్ళిపోయిన సంగతి విని వాళ్ళు అక్కడా ఏడుస్తూ కూర్చున్నారు. అప్పుడు రెండు పెద్దపులులు మాటలు చెప్పకుంటూ ఆదారిని వెడుతూఉన్నవి. వాటి మాటలు కొన్ని మళ్ళీ వీళ్ళ చెవులలో పడ్డవి.

"పాతాళగంగలో స్నానం చేస్తూఉంటే ఒక నాగకన్య వచ్చిందట. వచ్చి వాళ్లిద్దరినీ తనఇంటికి తీసుకపోయిందట. వాళ్లను వెదుక్కొంటూ నీరదశ్యాముడూ

శంపాలతా యీఅడవిలోకి వచ్చారట. వాళ్లుకూడా......" తరువాతమాటలు వాళ్లకు వినిపించేయి కావు.

అడవిలో ఉన్న జంతువులన్నీ తమకథే చెప్పుకుంటూ ఉన్నాయి ఎందుకు చెప్మా అనుకొంటూ వాళ్లు ఆ చెట్టుకింద కూర్చుని విచారిస్తున్నారు.

అప్పుడు ఆ చెట్టుమీద రెండుపక్షులు కూర్చుని మాట్లాడుకోవడం వాళ్లు విన్నారు.

"నాగకన్య నీరదశ్యాముణ్ణికూడా తీసుకు వెళ్లుతుంది. శంపాలతను కూడా...... అని కొంతమట్టుకు చెప్పి ఊరుకొన్నది.

"ఎందుకు ఊరుకొన్నావు. పూర్తిగా చెప్పలేదు?" అని రెండోపక్షి అడిగింది.

"చూడు, చూడు, ఎవళ్లో ఇద్దరు మనుష్యులు మనచెట్టుకింద కూర్చుని మన మాట లాలకిస్తున్నారు." అని మొదటిపక్షి చెప్పింది.

"వాళ్లకు మనభాష తెలుసునా ఏమిటి, చెప్పుదూ" అన్నది రెండోపక్షి.

"వాళ్లు అసలు మనఅడవిలో ఉండేవాళ్లే. పూర్వము మన అడవిలో కొంతకాలము ఉన్నారు కూడాను. అందుచేత మనమాటలు వాళ్లకి తెలుసును"అని మొదటిపక్షి చెప్పింది.

"శంపాలత ఏమవుతుంది చెప్పుదూ" అంది రెండోపక్షి.

"శంపాలత మనతోపాటు ఉంటుంది. ఇంకోచెట్టుమీదకు వెళ్లి చెప్పుకొందాము రా"అని మొదటిపక్షి రెండోపక్షితో చెప్పింది. రెండుపక్షులూ ఇంకోచెట్టుమీదకు ఎగిరి పోయినవి.

నీరదశ్యాముడూ శంపాలతా ఈమాటలన్నీ విని, "ఈలాగ చెప్పుకొంటున్నవి ఎందుకు చెప్మా"అనుకొన్నారు. ఇంతట్లోకే తెల్లారుతూవుంది. వాళ్లు మల్లిఖార్జునస్వామి గుడిదగ్గిరికి వెళ్లుతున్నారు. త్రోవలో రెండుకోతులు మాటాడుకొంటున్నవి. ఒకకోతి చెట్టుకొమ్మ మీద కూర్చుని ఇంకోకోతితో చెప్పుతూంది.

"భ్రమరాంబఆలయం వెనుక ఒకఎఱ్ఱటి పువ్వులమొక్క ఉన్నది. ఆ పువ్వు దగ్గర పెట్టుకొన్నట్లయితే ఏమి అయిపోవా లనుకొన్నా అది అయిపోవచ్చును" అని.

"పెద్దపులి అయిపోవచ్చా"అని కోతి అడిగింది.

"ఆ అయిపోవచ్చును" అంది రెండోకోతి.

"ఏను గయిపోవచ్చునా"అని అడిగింది మొదటికోతి.

"ఏమి కావాలంటే అది అయిపోవచ్చును"అంది రెండోకోతి.

ఆ మాటలు శంపాలత వింది. నీరదశ్యాముడు ముందుగా నడిచి వెళ్లిపోయాడు. ఆ మాటలు వినలేదు. శంపాలత నీరదశ్యాముడితో ఆ మాటలు చెప్పలేదు కూడాను.

వాళ్లిద్దరూ కలిసి మల్లికార్జునస్వామిని చూచారు. దణ్ణముపెట్టారు. "మా అమ్మనూ నాన్ననూ చూపించవా" అని అడిగారు.

తరువాత భ్రమరాంబ గుడిలోకి వెళ్లి దణ్ణముపెట్టి వాళ్లమ్మనీ నాన్ననీ చూపించమని అడిగారు.

తరువాత వాళ్లు ఆలయముచుట్టూ బొమ్మలు చూచుకొంటూ తిరిగారు.

భ్రమరాంబ గుడివెనుక ఎర్రపువ్వులమొక్క శంపాలత చూచి ఒకపువ్వు కోసుకొని తలలో పెట్టుకొన్నది.

తరువాత వాళ్లిద్దరూ కలసి ఆచుట్టుపట్లంతా వాళ్లమ్మా నాన్నా కోసం వెదికారు. కాని ఎక్కడా కని పించలేదు.

తరువాత పాతాళగంగ వైపు ప్రయాణమై వెళ్లారు. పాతాళగంగదగ్గిర అంతటా వెదికారు గాని వాళ్లమ్మా నాన్నా ఎక్కడా కనిపించలేదు.

నిజంగా నాగలోకం లోకి వెళ్లిపోయారు కాబోలు అనుకొన్నారు వాళ్లిద్దరూను.

"నేను నాగలోకంలోకి వెళ్లి చూచి రానా" అన్నాడు నీరదశ్యాముడు.

"అమ్మయ్యో! నీవు వెళ్లిపోతే నే నొక్కర్తెనూ ఉండగలనా" అంది శంపాలత.

"నీవు యీ శ్రీశైలంలోనే ఉండు. నే వెళ్లి చూచి చప్పునేమళ్లీ వస్తాను. వచ్చి నిన్ను తీసుకవెళ్లుతాను" అన్నాడు నీరదశ్యాముడు.

"నీవు ఎలాగ వెళ్లుతావు? నీకు దారి తెలుసునా ఏమిటి" అన్నది శంపాలత.

"పాతాళగంగలోనుంచి దారి ఉన్నదట. ఇందాకా పెద్దపులులు చెప్పుకొంటూఉంటే విన్నాముకాదూ" అన్నాడు నీరదశ్యాముడు.

"అయితే, నేనుకూడా వస్తాను. మనిద్దరం కలిసి వెడదాము" అంది శంపాలత.

"నీ విక్కడ ఉండి అమ్మా నాన్నా ఇక్కడకు వస్తారేమో చూస్తూఉండు. నేను నాగలోకంలో చూచివస్తాను" అన్నాడు నీరదశ్యాముడు.

"అమ్మా నాన్నా ఇక్కడ కెందుకు వస్తారు. వాళ్లు నాగలోకంలో ఉన్నారటగా" అంది శంపాలత.

"మనకోసం వాళ్లూ తిరుగుతూ ఉంటారేమో? నాగలోకంలోనుంచి మనకోసం వాళ్లు ఇక్కడకు వస్తారేమో నీవు చూస్తూఉండు. నేను నాగలోకంలోకి వెళ్లి చూచి వస్తాను. ఎక్కడో ఒకచోట మనకు వాళ్లు కనిపిస్తారు" అన్నాడు నీరదశ్యాముడు.

"నిన్ను వదలిపెట్టి నే నుండలేను సుమా" అంది శంపాలత.

"ఇప్పుడే వస్తానుకాదూ" అన్నాడు నీరదశ్యాముడు.

"అమ్మో, నాకు భయం వేస్తుంది నే నుండలేను" అంది శంపాలత.

"మా అమ్మవు కావు. ఇప్పుడే వస్తాను ఇక్కడ ఉండు. నాకోసం అమ్మా నాన్నా కోసం చూస్తూఉండు" అన్నాడు నీరదశ్యాముడు.

"నీవు రావేమో?" అంది శంపాలత.

"నేను తప్పకుండా వస్తాను" అన్నాడు నీరదశ్యాముడు.

"నీవు వచ్చిందాకా ఇక్కడే ఉంటాను. మరిఎక్కడికీ వెళ్లను" అంది శంపాలత.

"నేను వచ్చేదాకా ఇక్కడే ఉండు; నాకోసం చూస్తూఉండు. మరెక్కడికీ వెళ్లకు" అని నీరదశ్యాముడు చెప్పాడు.

నీరదశ్యాముడు శంపాలతను ముద్దుపెట్టుకొని కౌగలించుకొన్నాడు. శంపాలత అన్నను గట్టిగా కౌగలించుకొని ముద్దుపెట్టుకొని, "నే నిక్కడే ఉంటాను. చప్పున రా సుమా అన్నా" అంది శంపాలత.

"చప్పున వస్తానులే" అని నీరదశ్యాముడు పాతాళగంగలో ప్రవేశించాడు. శంపాలత చూస్తూఉండగానే నీళ్లలోమునిగి మాయమయ్యాడు.

నీరదశ్యాముడు నీటిలోకి వెళ్లడంతోనే నాగకన్య వానికి కనిపించి చేయి పట్టుకొని లోపలికి తీసుకపోయింది. వెళ్లగా వెళ్లగా అక్కడ ఒక పెద్దబండ కనిపించింది. నాగకన్య ఆ బండ తీసివేసింది. తీసివెయ్యగానే మెట్లు కనిపించినవి. ఆమెట్లవెంట వా ళ్లిద్దరూ నడచి వెళ్లారు. అప్పుడు వా రొకతోటలోనికి వెళ్లారు. ఆతోటలో ఒకమేడ కనిపించింది. నాగకన్య నీరదశ్యాముణ్ణి ఆమేడలోకి తీసుకవెళ్లింది.

"మా అమ్మా నాన్నా ఇక్క డున్నారా?" అని నీరదశ్యాముడు అడిగాడు.

"నీవు వస్తావనే వాళ్లను ఇక్కడ పెట్టాను" అంది నాగకన్యక. అని నీరదశ్యాముణ్ణి ఒకగదిలోకి తీసుకవెళ్లింది. అక్కడ వాళ్లమ్మా నాన్నా కూర్చుని ఉన్నారు. వాళ్లు నీరదశ్యాముణ్ణి చూడడంతోనే లేచి కౌగలించుకొన్నారు. కొంతసేపైన తర్వాత "శంపాలత ఏదీ" అని అడిగారు.

"నేను వెళ్లి తీసుకవస్తాను" అన్నాడు నీరదశ్యాముడు.

"నీవు వెళ్లవద్దు నాయనా. వెళ్లితే మళ్లీ రాగలవో లేదో, మేమైనావెళ్లి వస్తా" మన్నారు వాళ్లు.

# శంపాలత

"నాకోసం పాతాళగంగదగ్గిర శంపాలత కనిపెట్టుకు ఉంటుంది. నేను వెళ్ళితేనే గాని రాదు" అన్నాడు నీరదశ్యాముడు.

ఈవిధంగా వాళ్ళు మాట్లాడుకొంటూ ఉండగా నాగకన్య "నీవు వెళ్ళవద్దులే, నేను వెడతాను" అంది.

"నీవు వెళ్లినా రాదు శంపాలత, నేనువెళ్లాలి" అన్నాడు నీరదశ్యాముడు.

"సరే వెళ్లవచ్చునులే"అని నాగకన్య అతనికి తలనీళ్లోసి కొత్తబట్టలిచ్చి పాయసం కడుపునిండా పెట్టింది. వాళ్లమ్మా నాన్నాకూడా పాయసం తిన్నారు. పాయసం తినడంతోనే వాళ్లు నిద్రపోయారు.

నాగకన్య నీరదశ్యాముణ్ణి మొదట చూచినప్పుడే అతణ్ణిపెళ్లి చేసుకోవా లనుకొంది. అందుకోసమని అతనికోసం అప్పటినుంచీ ఎదురుతెన్నులు చూస్తూఉంది. అతడు రావడం కోసమే వాళ్లమ్మను నాన్ననూ తీసుకువచ్చి తనమేడలో పెట్టుకొంది. నీరదశ్యాముడికి శంపాలతమీద ఎంతో అపేక్ష. శంపాలత కూడా వస్తేతన్ను ప్రేమించి పెళ్లిచేసుకోడేమోనని శంపాలతను రాకుండాజేసింది. శంపాలతకోసం నీరదశ్యాముడు వెళ్లితే మళ్లీ వస్తాడో రాడో, వస్తే తనను పెళ్లిచేసుకొంటాడో చేసుకోడో అని భయమువేసింది. అందుకోసమని వాళ్లకు ఏదో పాయసం పెట్టింది.

వాళ్లు పాయసం తిని చాలాసేపు నిద్రపోయి చివరకు లేచారు. లేచి శంపాలతసంగతి అందరూ మరిచిపోయారు. నీరదశ్యాముడు కూడా మరిచిపోయి నాగకన్యతో తిరుగుతూ, నాగకన్యతో ఆడుకొంటూ పాడుకొంటూ ఉన్నాడు.

కొన్నాళ్లకు నాగకన్యకూ నీరదశ్యాముడికీ పెళ్లయింది. వాళ్లు అక్కడ హాయిగా అన్ని సౌఖ్యాలూ అనుభవిస్తూ ఉన్నారు.

శంపాలత తనఅన్నకోసం చాలాకాలం వేచిఉంది. ఎన్నాళ్లకీ తన అన్న వచ్చినట్లు లేదు. తనఅన్న ఏమైపోయినాడో అని తానుకూడా నాగలోకానికి వెళ్లవలెనని పాతాళగంగలో మునిగింది. కాని ఎంత వెదికినా, నాగలోకానికి దారి కనిపించింది కాదు. పోనీఅని బయటకు వచ్చి పాతాళగంగ గట్టున కూర్చుని, "ఓఅన్నా"అని పిలవడం మొదలుపెట్టింది. గట్టవతల కొండమీదనుండి "ఓ అన్నా" అని మారుపిలుపు వినిపించింది.

శంపాలత రాత్రీ పగలూ ఒక్కవిధంగా గట్టుమీద కూర్చుని "ఓ అన్నా" అని పిలుస్తూనే ఉంది. కాని నీరదశ్యాముడు పలకలేదు.

నీటిలో ఎక్కడైనా ఉంటాడేమోనని తాను చేపగా మారిపోయి నీటిలో యీదుతూ "ఓ అన్నా" అని కేకవేశింది. ఎవరూ పలకలేదు. నదిఅంతా కిందకూ పైకీ ఈదుతూ

"ఓ అన్నా", "ఓ అన్నా" అంటూ శంపాలత తిరిగింది. నీటిలో ఎంత వెదికినా నాగలోకానికి త్రోవ కనిపించలేదు. "ఓ అన్నా" అనే పిలుపుకు జవాబు లేదు.

తరువాత తాను నీటిలోనుండి బయటకు వచ్చి జింకగా మారిపోయి, "ఓ అన్నా", "ఓ అన్నా" అని అరస్తూ అడవిఅంతటా పరుగెత్తి పిలిచింది. "ఓ అన్నా", "ఓ అన్నా" అనే పిలుపు తిరిగివచ్చి దానిచెవులలో పడింది. కాని జవాబు లేదు.

ఇంకా సంతుష్టి లేక పెద్దపులిగా మారిపోయి "ఓ అన్నా, ఓ అన్నా" అని గాండ్రిస్తూ కొండలన్నీ తిరిగింది. గుహాలన్నీ వెదికింది. అడవంతా పారాడింది. "ఓ అన్నా; ఓ అన్నా" అనే గాండ్రింపులు అడవిఅంతటా అలుముకొన్నాయి. కాని జవాబు లేదు.

"ఓ అన్నా, ఓ అన్నా" అంటూ సెలయేళ్లుగా మారిపోయి శంపాలత పిలిచింది. సెలయేళ్లతోకూడా కొండరాళ్లు "ఓ అన్నా, ఓ అన్నా" అన్నవి. కాని జవాబు లేదు.

శంపాలత వాయువుగా మారిపోయి చెట్లకొమ్మలలో దూరి "ఓ అన్నా, ఓ అన్నా" అంటూ శబ్దము చేసింది. చెట్లఆకులు "ఓ అన్నా, ఓ అన్నా" అంటూ ఏడ్చినవి. కాని జవాబు రాలేదు.

"ఓ అన్నా, ఓ అన్నా" అంటూ కార్చిచ్చులుగా మారిపోయి శంపాలత హోరు పెట్టింది. చెట్లకొమ్మలు ఆ అగ్నిలో "ఓ అన్నా, ఓ అన్నా" అంటూ పట పట మని పగిలి పోయినవి. కాని జవాబు లేదు.

శంపాలత నల్లటిమేఘాలలో ప్రవేశించి "ఓ అన్నా,ఓ అన్నా" అంటూ ఉరిమింది. ఆమేఘాన్నుంచి ఆమేఘానికి "ఓ అన్నా, ఓ అన్నా" అనే ఉరుములు వ్యాపించినవి భూమి ఆకాశము అంతా "ఓ అన్నా, ఓ అన్నా" అనేశబ్దముతో నిండిపోయినవి. కాని జవాబు రాలేదు.

అడవిలో జంతువులన్నీ శంపాలతతో కూడా "ఓ అన్నా, ఓ అన్నా" అని పిలిచినవి. చెట్లమీద పక్షులన్నీ శంపాలతతోకూడా "ఓఅన్నా, ఓఅన్నా" అని కూసినవి. చెట్లకొమ్మల ఆకులన్నీ శంపాలతతో "ఓ అన్నా, ఓ అన్నా" అంటూ మర్మరధ్వని చేసినవి.

ఆకాశము "ఓ అన్నా, ఓ అన్నా" అని శబ్దించినది.

పాతాళగంగ శంపాలతతో కూడా "ఓ అన్నా, ఓ అన్నా" అంటూ హోరుపెట్టినది. కాని ఎవరిపిలుపుకూ కూడా జవాబురాలేదు. శంపాలత చిట్టచివరకు ఒక చిన్నపక్షిగా మారి పోయింది. ఆ చిన్నపక్షి శ్రీశైలం అడవులలోనూ కొండలలోనూ ఎప్పుడూ తిరుగుతూ "ఓఅన్నా, ఓఅన్నా" అని పిలుస్తూఉంటుంది. ఆపిలుపు అడవిఅంతా నిండిపోతుంది.

# శంపాలత

శ్రీశైలం యాత్రపోయేవాళ్లు "ఓ అన్నా, ఓ అన్నా" అనే పిలుపు విని ఆచిన్న పక్షిని చూచి చాలా ఆశ్చర్యపోతారు. జాలి పొందుతారు.

ఆ అడవుల్లో తిరిగే చెంచువాళ్లు "ఓ అన్నా, ఓ అన్నా" అనే ఆ చిన్న పక్షిపిలుపు విని శంపాలత కథ వాళ్లపిల్లలకి చెప్పుతూ ఉంటారు.

నీవు శ్రీశైలం వెళ్లినప్పుడు "ఓ అన్నా, ఓ అన్నా" అని కూసే చిన్నపక్షిని చూడలేదూ? అది చెట్లకొమ్మలమీద కూర్చుని మనుష్యు లగుపించినప్పుడల్లా తోక ఎత్తి శరీరం ముందుకు వంచి గట్టిగా,తొందరగా, "ఓ అన్నా,ఓ అన్నా"అని అందరిని పిలుస్తుంది. కాని మనుష్యులందరూ మళ్లీ "ఓఅన్నా, ఓఅన్నా" అంటారు. అది మరీ బిగ్గఱగా "ఓ అన్నా, ఓ అన్నా" అంటుంది.

శ్రీశైలం అడవుల్లో నల్లమలకొండల్లో అంతటా ఈపక్షి తిరుగుతూ, ఎక్కడబడితే అక్కడ ఎవరికిబడితే వారికి కనిపిస్తూ పిలుస్తూఉంటుంది.

ఈమాటు నీవు శ్రీశైలం వెళ్లినప్పుడు ఈ చిన్నపక్షిని తప్పకుండా చూడు. అది కొమ్మమీద కూర్చుని నీవైపు తిరిగి "ఓ అన్నా, ఓ అన్నా" అని పిలుస్తుంది. అప్పుడు నీవు శంపాలత కథ జ్ఞాపకం తెచ్చుకో.

నీవు జ్ఞాపకం తెచ్చుకొంటూఉంటే ఆ చిన్నపక్షి నిన్ను పిలుస్తూనే ఉంటుంది, "ఓ అన్నా, ఓ అన్నా" అని.

నీవు ఎంతదూరం వెళ్లిపోయినా నీవెనక వినిపిస్తూనేఉంటుంది, "ఓఅన్నా,ఓఅన్నా" అనే కేక. నీవు ఇంటికి వచ్చాక కొన్నాళ్లదాకా నీచెవులో వినిపిస్తూ ఉంటుంది, "ఓ అన్నా, ఓ అన్నా" అనే పిలుపు.

# అభినవాంధ్ర సాహిత్యము

కవికోకిల దువ్వూరి రామిరెడ్డి

సంఘమునందును వాఙ్మయమునందును మార్పులు అనివార్యములు. అన్యనాగరకతాసంసర్గ మను బాహ్యనిమిత్తమువలన మార్పులు అలక్షితముగ తల సూపుచుండును. ఒక వాఙ్మయముయొక్క బాగోగులు, మంచిసెబ్బరలు తెలిసికొనవలయు నన్న దానికన్న భిన్నసంప్రదాయము ననుసరించు మఱియొక వాఙ్మయముతోడి పరిచయము మన కుండవలయును. అద్వైతావస్థయందు తరతమజ్ఞాన ముండదు. మన దేశీయ వాఙ్మయము లన్నియు ఏకసంప్రదాయబద్ధములయి సంస్కృతవాఙ్మయమునకు ప్రతిబింబములుగ నుండినవి.

ఆంగ్లేయుల సంబంధమువలన పాశ్చాత్య నాగరకతతో మనకు పరిచయము కలిగినది. వారివాఙ్మయము, వారి ప్రకృతివిజ్ఞానము మనదృష్టి నాకర్షించినవి. వారి పరిపాలనాపద్ధతి మనయందు స్వాతంత్ర్యేచ్ఛను పురికొల్పి జాతీయైక్యమును పెంపొందించినది. సంఘమునం దవతరించిన ఈ నూతనస్వాతంత్ర్యప్రియత్వము రాజకీయవిషయములందే కాక వివిధ సాంఘికచర్యలయందును తలసూపినది. కట్లకు లోనయి బహిర్వ్యాప్తిని కోల్పోయిన సర్జనశక్తులు నేడు సంకుచితావరణమునుండి వెలవురికి ఆత్మోచిత కార్యకల్పనకు సిద్ధములైనవి. వాఙ్మయము సాంఘికజీవితముయొక్క ప్రతిబింబమే కావున సంఘమున చెలరేగిన ఈసంచలనము, ఈ ఆందోళనము, ఈస్వాతంత్ర్యేచ్ఛ దానియందు మాత్ర మెట్లు ప్రకటితము కాకుండును?

ప్రబంధములలోని పచ్చిశృంగారము నేటి యభిరుచులబట్టి మొరటుగ తోచినది. అందలి శబ్దాలంకారములు, భావప్రేరకములు గాక కేవలము బుద్ధిపరిశ్రమకు వినియోగపడు తెచ్చికోలు అర్థాలంకారములు "intellectual gymnastics" అని నిరసింపబడినవి. ఈ యసంతృప్తి ప్రతికూల విమర్శనముతోనే వ్యయమైపోక వాఙ్మయ నిర్మాణమునకు తోడ్పడినది. కందుకూరి వీరేశలింగం పంతులుగారు Vicar of Wakefield, Gulliver's Travels అను ఆంగ్లేయనవలలను మానాగా పెట్టుకొని తెలుగునవలరచనకు మార్గదర్శకు లైరి. వారు షేక్స్పియరు నాటకములను తెనిగించిరి. నాటకములు, ప్రహసనములు, వ్యాసములు, ఖండకావ్యములు, కవిజీవితములు వ్రాసి పంతులుగారు ఆంగ్లేయ వాఙ్మయములోని కొన్నిరచనావిధానములను, సంప్రదాయములను తెలుగులో వెలయించిరి,

వాఙ్మయరచనలలో కలిగిన మార్పులతోపాటు భాషావిషయములందుకూడ కొంత సంచలనము ప్రారంభమైనది. గ్రాంథికభాష కృత్రిమమనియు సహజమైన వ్యావహారిక భాషలో వ్రాయుట ఆవశ్యకమనియు గురజాడ అప్పారావుగారు, గిడుగు రామమూర్తి పంతులుగారు తలంచి అందుకు కావలసిన మందుగుండు సామగ్రితో గ్రాంథికభాషావాదులను ముట్టడించిరి. ఈ యుద్యమమునకు ఫలితముగ వ్యావహారికభాషావాదములోని సహేతుకత్వమును ఇప్పుడు అందరును అంగీకరింపక తప్పినది కాదు.

ప్రపంచవాఙ్మయములనెల్ల జీర్ణించికొని తన శరీరమునకు కావలసిన నెత్తురు కండలుగ మార్చుకొనుటచేతనే ఆంగ్లేయవాఙ్మయము నేడు అపరిమితముగ వృద్ధి చెందుచున్నది. విదేశవాఙ్మయసంబంధము నూత్నసృష్టికి ప్రతిబంధకము కాదు. ఒకవేళ అపూర్వసృష్టి ప్రేరకము కావచ్చును. ఇందుకు ఆంధ్రదేశమున సుమారు ముప్పదిసంవత్సరములనుండి ప్రబలుచున్న అభినవ కవితోద్యమమె తగిన తార్కాణ. ఆంధ్రకవుల ప్రతిభాన రక్తికి నూత్న నాట్యరంగముల నేర్పఱచిన తప్పేమి ?

అప్పారావుగారి ముత్యాలసరములతో అభినవకవితోద్యమము ప్రారంభమయినది. సంక్షుబ్ధ సాగరకల్లోలములలో గాలి వీచినల్లెల్ల కొట్టుకొనిపోవుచున్న అభినవకవితా నావకు కట్టమంచి రామలింగారెడ్డిగారు కర్ణధారులై నిలిచిరి. వారు రచించిన కవిత్వ తత్త్వవిచారమను విమర్శనగ్రంథము ఈ నవీనోద్యమమునకు మార్గదర్శకమైనది. ఈ నవయుగ కవితా ప్రభాతముయొక్క ప్రథమరోచులు రాయప్రోలు సుబ్బరావుగారి కుటీర గవాక్షములో ప్రసరించి ఆయనను ప్రబోధించినవి. సుబ్బరావుగారు అంతకు పూర్వమే కవిత్వ మల్లుచుండిరి. ఆయనరచించిన 'లలిత'యను ప్రథమకావ్యము శబ్దాలంకారయుతమై పూర్వప్రబంధశైలిని తలపించుచున్నను అందే భావికవితా పరిణామముయొక్క సూచనలుకూడ పొడకట్టుచుండినవి. ఆకాలమున నెల్లరకు పూర్వప్రబంధములే పాఠ్యగ్రంథములు. అభినవకవితకు మానా లేదు. ప్రతికవియు సొంతమానాలు సృజించుకొనవలసియుండెను. ఒక సంప్రదాయము కరుడుకట్టిన వెనుక వ్రాయువారి కంత కష్ట ముండదు. పిఠాపురమున సుబ్బరావుగారు స్థాపించిన అభినవకవితాగ్రంథమండలిని (లేక గ్రంథమాలయో నాకు జ్ఞప్తిలేదు) గుఱించిన యొక కరపత్రమును పూర్వ మొకప్పుడు సి. వి. కృష్ణయ్యగారియొద్ద నేను చూచితిని. ఆంగ్లేయ సాహిత్యములోని పేరిన తేనెగడ్డలను అభినవాంధ్ర కావ్యములలోనికి తెచ్చుట ఆగ్రంథమండలి యుద్దేశములలో నొకటియని అందు వ్రాయబడియుండినది. ప్రథమమున సుబ్బరావుగారి యుద్దేశ మెట్లుండినను తరువాత వారు రచించినకావ్యములు స్వతంత్రసృష్టు లనియే చెప్పవలయును. ఆయనవెనువెంటనే యామార్గ మవలం

బించినవారు అబ్బూరి రామకృష్ణరావుగారు. 1915,1916 మొదలు పింగళి లక్ష్మీకాంతం వెంకటేశ్వరరావుగార్లు, విశ్వనాథ సత్యనారాయణగారు, వెంకట పార్వతీశ్వరకవులు, శివశంకరశాస్త్రిగారు, కృష్ణశాస్త్రిగారు మఱి యింక కొందఱు ఈ నవీనమార్గము నవలంబించిరి. తరువాత క్రమక్రమముగ ఇప్పుడు వ్రాయుచున్న కవు లందఱు కొద్దిగనో గొప్పగనో స్వతంత్రముగనే రచించుచున్నారు. వీరందఱు ఏకమార్గావలంబకు లయ్యును వ్యక్తిగత శిల్పపరిపాకము ననుసరించి రచనలలో తారతమ్యము గోచరించును.

ఈ అభినవ కవితోద్యమ ఫలితముగ కొంత పునరుద్ధరణము, కొంత నూతనసృష్టి కొనసాగినది. "ద్విపదకావ్యంబు ముదిలంజ..." అని తిరస్కరింపబడిన ద్విపదలు, పల్లెపదములు, పునర్గ్రహణ యోగ్యములైనవి. ఖండకావ్యములు, గేయములు, నవలలు, నాటకములు, ఏకాంకనాటికలు, ఉపకథలు, వ్యాసములు పుట్టినవి. ఇవియన్నియు తెలుగు వాణికి నూత్నాలంకారములె. ఈ యిరువదియైదు సంవత్సరములనుండి పుట్టిన వాఙ్మయము విమర్శించుటకు తగినంత విరివిగా నున్నది. ఏసమర్థుడైనను నిష్పక్షపాతబుద్ధితో ఈ వాఙ్మయమును విమర్శించినయెడల చాల ఉపయోగకరముగ నుండును.

అభినవకవిత్వమునుగుఱించి యిప్పుడిప్పుడే కొన్ని యాక్షేపములు, ప్రత్యుత్తరములు బయలుదేరుచున్నవి. కాని, ఆక్షేపములవలెనే ప్రత్యుత్తరములుకూడ మూకఉమ్మడిగ నున్నవి. ఈకాలమున వ్రాయబడునదంతయు చెత్తయని తృణీకరించుట యెంత సమంజసమో ఈనాటి రచనలన్నియు మహోత్కృష్టములని ప్రశంసించుటకూడ నంత యవిచారమూలకమె. బాగోగులు ఒక వర్తమానకాలమునకే సంబంధించినవి కావు. చెత్త వ్రాసినవారు పూర్వముకూడ కలరు. అయితే ఆచెత్తకును మనకును నూరులకొలది సంవత్సరముల అంతర మున్నది కావున, ఆచెత్తయంతయు క్రుళ్లి కాలప్రవాహమున కొట్టుకొనిపోయి అంతస్సారముగల యే కొన్నికావ్యములో నిలిచినవి. ఎచ్చటనో దాగియుండినచెత్తలు పురాతనము లన్నంతమాత్రముననే అచ్చొత్తింపబడినవి యిప్పటికిని మనకు దొరకుచునే యున్నవి. ఈకాలమున వ్రాయబడునదంతయు బ్రతికియుండునని యెవరు చెప్పగలరు? ఈసంశయము కాలమే తీర్పగలదు. ప్రతిభావంతులగు కవులు ఏకాలమందైన నుందురు. అయితే వారిమార్గములు భిన్నములుగ నుండవచ్చును.

పోలవరపు రామబ్రహ్మముగారు 'ప్రజామిత్ర'లో ఆధునిక కవిత్వమును విమర్శించిరి. వారివిమర్శలో కొంత సత్య మున్నది. కొంత తొందరపాటు, కొంత పొరపాటు కూడ ఉన్నది. వీరికి వడ్డాది సుబ్బరాయుడుగారు మున్నగు పెద్దకవులతో ఏలాటి తగాయిదాలేదు. రాయప్రోలు సుబ్బరావు, అబ్బూరి రామకృష్ణరావుగార్ల కావ్యములతో గూడ వీరి కేలాటి

యిబ్బంది లేదు. కాని యితరకవులు రచించిన కావ్యములన్నియు చెత్తలని వీ రభిప్రాయ పడిరి. సుబ్బరావు రామకృష్ణరావుగార్ల కావ్యములను మెచ్చుకోగలవారు తదితరులు వ్రాసినదంతయు చెత్తయని యెట్లు తలంచిరో నాకు బోధ పడుటలేదు. వారి కావ్యములలో నున్న గుణములును దోషములును తక్కినవారి కావ్యములలోకూడ నున్నవి. పింగళి లక్ష్మీకాంతం వెంకటేశ్వరరావుగార్ల 'సౌందరనందము', విశ్వనాథ సత్యనారాయణగారి 'ఆంధ్రప్రశస్తి', శివశంకరశాస్త్రిగారి 'హృదయేశ్వరి', కృష్ణశాస్త్రిగారి గీతములు, వేదుల సత్యనారాయణశాస్త్రిగారి ఖండకావ్యములు, జాషువాగారి 'ఫిర్దౌసి', నాయని సుబ్బరావు గారి మాతృగీతములు, సుబ్బరావుగారి 'హంపీక్షేత్రము', బసవరాజు అప్పారావుగారి గేయ ములు, నండూరు సుబ్బరావుగారి యెంకిపాటలు, కుందుర్తి నరసింహారావుగారి పంపాసరస్సు (ఇదియొక ఖండకావ్యము), బొడ్డు బాపిరాజుగారి 'విపంచి' యే వాఙ్మయమునకైన అలం కారప్రాయములుగ నుండగలవు. మచ్చునకుగా కొందఱికవులను, వారికావ్యములను పేర్కొంటిని. చక్కగా కవిత్వము వ్రాయగలకవులు ఇంక నెందఱో నేడు ఆంధ్రదేశమున నున్నారు. ఈ రచనలన్నియు చెత్తలని చెప్పుటకు రామబ్రహ్మముగారు సాహసింతురా? అట్లు సాహసింతురేని వారి యభినవకవితాపరిచయము 1916-వ సంవత్సరపర్యంతమనియే మన మూహింపవలయును. అట్లు గానిచో వారి సహృదయత్వమును మనము శంకింప వలసియుండును.

రామబ్రహ్మముగారు చూపించిన కావ్యదోషములు నేటికవిత్వమున కానవచ్చు చున్నవి. దూరాన్వయము, క్లిష్టాన్వయము, అర్థము బోధపడని పదములకూర్పు, నిరర్థక పదాడంబరత్వము, భావప్రకటనము చక్కగా చేయలేని గజిబిజితనము మున్నగు కావ్య దోషములు ప్రత్యేకముగ ఆయాకవికి సంబంధించిన రచనాలోపములే కాని అవియెల్ల అభినవకవితకు లక్షణములు కావు. కవి మనస్సులోనిభావము స్ఫుటముగా ప్రకటించుటకు తగినంతతీవ్రము కాకపోవుటచేతను, భాషపై కావలసినంత ప్రభుత్వము లేకపోవుటచేతను, భావోచితమైన పదమును వెదకికొనలేకపోవుటచేతను ఇట్టిదోషములు కలుగుచుండును. స్వాతంత్ర్యము చేకూరినవెంటనే సంప్రదాయములమీది ప్రమాణగౌరవము నశించును. అట్లు నశింపనిదే నూత్నసృష్టిని పురికొల్పు సాహస మలవడదు. ఒకొక్కప్పుడు మనము స్వాతంత్ర్యమును దుర్వినియోగ పఱచుచుండుటయు కలదు. స్వాతంత్ర్యము దుర్వినియోగ పడు ననుభయముతో పారతంత్ర్య మనుభవించుట భావ్యము కాదు. తప్పులు చేయనిదే యొప్పులు నేర్చుకొనము. ఒక నూత్నసంప్రదాయము కరుడుగట్టు ప్రథమదశయందు ఇట్టి దోషము లుప్పతిల్లుచుండును. రవీంద్రనాథ టాగూరుగారు కవిత్వమువ్రాయ ప్రారంభించిన కాలముననే నూత్నసంప్రదాయముకూడ అంకురించుచుండినది. దానికి టాగూరుగారు

గూడ కొంతవఱకు బాధ్యులు. ప్రథమమున వీరు వ్రాయుచుండిన బంగాళీకవిత్వము అర్థమగుటలేదని అందఱు గోలపెట్టిరి. ఇప్పుడు మన కవిత్వమున గోచరించుదోషములు అప్పుడు ఆయన కవిత్వములోకూడ దొరలినవి. దీనినిగుఱించి తన "జీవనస్మృతి" యందు కొంత సమర్థించిరి.

ఈసందర్భమున అభినవకవుల కష్టములనుగూడ మనము గుర్తింపవలయును. వార్తాపత్రికలమూలమునను, వివిధవాఙ్మయ గ్రంథబాహుళ్యమువలనను నేడు ప్రపంచమంతటితో మనకు సంబంధ మున్నది కావున మనభావములుకూడ విరివియైనవి. మనభాష మనభావములతోపాటు వృద్ధి పొందలేదు. "New phraseology to express new ideology" అన్నట్లు, క్రొత్తభావములను, అందలి తరతమచ్ఛాయలను వెలిపుచ్చుటకు క్రొత్తరకపు పదములకూర్పు ఆవశ్యకమగును. కవియొక్క భాషాప్రభుత్వము, పదములు కూర్చు నేర్పు ఇట్టియెడ నుపకరించును.

భాష యెప్పటికిని భావములకంటె వెనుకపడియుండును. భావములు మాఱినంత సులువుగా భాష మాఱదు. అయినను కార్యకుశలుడు కొఱముట్లు లేనిలోపమును ఎట్లో పూర్తి చేసికొనును. ప్రతిభావంతులగు కవులు, గ్రంథకర్తలు జన్మించి సమకాలీనభాషను తమ కూర్పునేర్పుచేత వివిధభావ ప్రకటనార్హముగ నొనరింతురు. పదజాలము సంకుచితమయ్యున్నను కవి ఆవశ్యకమునుబట్టి ఒక యింద్రజాలము పన్ని భాషాదారిద్ర్యమును అతిక్రమించును. పూర్వమునుండియు కవులు కావ్యములలో ఉపమాద్యలంకారములను వాడుచున్నారు. భామహునికాలమున నాలుగు అలంకారములె గుర్తింపబడినవి. కాని క్రమక్రమముగ విమర్శకుల పృథక్కరణశక్తివలన అలంకారములు పెక్కులయి మనము వ్రాయు ప్రతివాక్యము, సమాసము, ఏదో యొక యలంకారముక్రిందికి వచ్చునదైనది. కాని మొట్టమొదట ఈ యలంకారముల నుపయోగించినకవి, అవి యలంకారములని, కవితకు మెఱుగుపెట్టుటకుగా వాని నుపయోగించుచున్నా నను జ్ఞానముతో కాక, తాను ప్రకటింపదలచిన భావతీవ్రతను మొక్కవోక స్ఫురింపజేయుటకు పడిన కడగండ్లే యీ యలంకారములని నాయుద్దేశము. తాను చెప్పదలచుకొన్న భావమునకు ఉచితమైనపదము భాషలో నుండిన ఈయుపమాద్యలంకారములకు అవసర ముండదు. భాషకు సహజమైన లోపమె యీయలంకారములకు మూలము. ఒక యుదాహరణము చూడుడు.

న ఖలు న ఖలు బాణః సన్నిపాత్యోఽయ మస్మిన్
మృదుని మృగశరీరే పుష్పరాశా వివాగ్నిః.

దుష్యంతుడు ఆశ్రమమృగమును తరుముకొని వచ్చుచుండగా కణ్వశిష్యులు చూచి దానిని రక్షింప నెంచి, "ఓరాజా, యిది యాశ్రమ మృగము. దీనిని చంప దగ"దని చెప్పిరి. ఆశ్రమ

కురంగమని బెదరుపెట్టినంతనే సార్వభౌముడు భీతిల్లి దానిని వదలునా? దుష్యంతుడు మృగయాప్రియుడు. వేటాడుటకొఱకే వచ్చెను. జీవహింస క్షత్రియులకు క్రొత్తది కాదు. కావున వైఖానసులు ఎట్లయినను రాజుహృదయమును కరుణార్ద్రము కావించి మృగమును రక్షింపవలయును. అట్టియెడ "మృదువైన మృగశరీరమునందు బాణము ప్రయోగింపవలదు" అని ప్రతిమాలిరి. మృదువు అనువిశేషణము బాధ నోర్చుకొనలేని కోమలత్వమును స్ఫురింపజేయును గాని, ఎంతసుకుమారమని వైఖానసుఁడుచెప్పిన రాజుహృదయము ఆర్ద్రమగునో అంతసౌకుమార్యమును స్ఫురింపజేయుటకీ విశేషణము చాలదు. కావున వైఖానసుడు ఆ భావతీవ్రతను. సాంద్రతను ఇట్లు ప్రకటించెను: రాజా, నీవు మృగముపై బాణము వేయుదువేని పూలరాశిలో అగ్గిపెట్టినట్లే! పూవులు చాల పేశలములైనవి. తాకిన కందిపోవునవి. తలనిడికోదగినవి. తనప్రేయసి ధరియించునవి. తాను ప్రణయబహుమానముగ గొన్నవి. దేవుని పూజించుట కర్హమైనవి. ప్రకృతిదేవీ దరహాసములవంటివి. మనోహరములైనవి. ఇట్టి పూలకు నగ్ని రగిల్చినట్లగునా! ఈకార్యము క్రూరము. ఘోరము. ఎంత కఠినాత్ముఁడైనను ఈకార్య మొనరింపఁడు. ఇక సరసుడైన దుష్యంతునిమాట వేఱ చెప్పవలయునా? ఈ సాదృశ్యప్రభావమువలన "మృదువు" అను విశేషణము అంతకు పూర్వము స్ఫురింపజేయలేని యెన్నో భావములు ఇప్పుడు దానికి సంక్రమించినవి.

కవి గాఢమైన తన రసానుభూతిని చెక్కుచెదరనీయక పఠితలహృదయముల స్ఫురింపజేయును. భావమునకు భాష కేవలము సంజ్ఞామాత్రమె. ఒకొక్కప్పుడు మనము భావించిన దొకటి, ప్రకటించిన దొకటిగా నేర్పడును. ఏలయన, భావమునున్నితమైనది. భాష స్థూలమైనది. కావున దీనికొక momentum కలదు. ఇందుకు ప్రతీకారముగ భావము తీవ్రతరము కానిదే భాష భావమునకు లొంగదు. కవి యుపయోగించుసంజ్ఞలు పఠితలకు కూడ తెలిసినవిగనో తెలిసికొనతగినవిగనో యుండవలయును. పదమునకు నిఘంటువు ప్రసాదించు అర్థమునకంటె వేఱుశక్తులుకూడ కలవు. ఆశక్తుల యన్నిటిపైనను కవి యాధారపడి తనభావమును స్ఫురింపజేయును. తనభావము ఇతరుల కెఱుకపడనియంత క్లిష్టసంజ్ఞలతో ప్రకటింపబడియున్న ఆపద్యము మూగ చెవిటివారల సంభాషణమువలె వ్యర్థమగును. కావ్యప్రయోజనమందు శూన్యమగుటవలన దానికి కావ్యత్వహానికూడ సిద్ధించును. F. T. Palgrave గారు "Golden Treasury" అను ఖండకావ్యసంపుటమునకు తాను రచించిన యుపోద్ఘాతమున నిట్లు వ్రాసియున్నారు:— '...that passion, colour, and originality cannot atone for serious imperfections in clearness, unity or truth.' కావ్యమునకు ముఖ్యమైనగుణములలో భావస్ఫుటత్వ మొకటియని ఈవిమర్శకుని అభిప్రాయము.

భావములు వాచ్యములుగనె యుండవలయునా? వ్యంగ్యముగ నుండకూడదా? అని కొందఱు ప్రశ్నింపవచ్చును. భావస్ఫుటత్వము వ్యంగ్యమర్యాదకు విరోధి కాదు. ప్రకరణార్థము గోచరించుచునే తదతిరిక్తమైన వేఱొక భావము స్ఫురించవచ్చును. క్లిష్టార్థసమన్వితములైన పద్యములను దీసికొని యవి వ్యంగ్యప్రధానములని సమర్థించుట ఇప్పుడొక యాచారమైనది. ధ్వనిప్రధానములని యెన్నబడు సంస్కృతశ్లోకములలో ప్రకరణమునకు సంబంధించిన యర్థము సులభగ్రాహ్యముగనే యుండును.

రామబ్రహ్మముగారు బూతుకథల విమర్శించిరి. వీరికి బూతుకథలపై గలిగిన ఆగ్రహము అభినవసాహిత్యము నంతటిపై ప్రసరించి వారి విమర్శనమునకున్న విలువను తగ్గించినది. బూతుకథలు వెలువడుచుండుట యథార్థమే గాని అభినవసారస్వతమంతయు ఈ బూతులుతప్ప మఱి యింకేమి లేదని చెప్పుట ఆసాహిత్యముతోడి వీరి పరిచయ మెంతపాటిదో మనకు గోచరించుచున్నది. మున్నటివైనను నేటివైనను బూతులుబూతులే. నాగరకాభిరుచి గలవారికి అట్టికథలు ఏవము పుట్టించును. అట్టి కథకులు ఏస్త్రీలను సంస్కరించుటకు (గిరీశమువలె) ప్రయత్నించుచున్నారో ఆస్త్రీల ఆత్మగౌరవమునకే అట్టి కథలు భంగకారులుగ నున్నవి. కథలు వ్రాయువా రందరు ఇట్టిబూతుకథలే వ్రాయుట లేదు. ఇట్టి కథలు ప్రచురించుటకు రెండు మూడు మాసపత్రికలె కంకణము కట్టుకొన్నవి.

"సుబోధిని" పత్రికయందు "నవకవులు—బూతుకవనము" అని రామబ్రహ్మముగారు రచించిన వ్యాసము "ప్రజామిత్ర"లోని వ్యాసమునకన్న మఱింతతీవ్రమై బూతుకథలతో వారికిగల పరిచయమును సార్థకపఱచుచున్నది. నవకవు లెవ్వరును బూతుకవనము వ్రాయుట లేదు. వారి కవిత్వములోని శృంగారము సభ్యముగను నాజూకైన యభిరుచిగలదిగ నుండును. కవిత్వము వ్రాయువారిలో కథలు వ్రాయువారిసంఖ్య చాల తక్కువ. వారి కథలలోగూడ బూతు లేదు. అందులో ఒక్కరుమాత్రము అట్టికథలు వ్రాయుచుందురు. ఇకమీదనైనను రామబ్రహ్మముగారు విషయ పృథక్కరణమునందు కొంత పరిశ్రమ చేయుదురుగాక యనియు, అభినవకావ్య సాహిత్యపరిచయము కలిగించుకొందురు గాక యనియు నాయునవి.




# భా ను మ తి

## "చ లం"

[ప ద్మా వ తి కి]

[కౌరవాంతఃపురంలో భానుమతి మందిరం. భానుమతీ, ద్రౌపదీ.]

భానుమతి:—ఆయన అభిమాన ధనులు. ఏ మాత్రపు అగౌరవమునూ సహించరు. మీ యుధిష్ఠిర చక్రవర్తితో సమానమైన సార్వభౌమ పదవికి అధిపతి. భీష్మ ద్రోణాది మహావీరాలంకృత సభాభవనానికి దినమణి. మీరు స్వయముగా ప్రార్థించి ఆహ్వానించిన అతిథి. పూజకు సర్వవిధములా అధికారి. ఇవన్నీ మీరు యెరగనివి కావు. నా కాశ్చర్య మేమంటే, ఇన్నివిషయాలనూ మీరు మరిచి, మనఃపూర్వకంగా అతిక్రమించి, ఆయనను హేళనచేసి నవ్వారా? మీవంక చూస్తే, మీ కళ్లల్లోని దయాశాంతాలను, సౌహృదాన్ని కనిపెట్టి, మీ మాటల్లోని మాధుర్యం, మీ ఆత్మలోని నిర్మలత్వం, యివన్నీ స్వయంగా వీక్షించింతరవాత, మీరేనా అంత అవివేకంగా, అక్రమంగా వర్తించింది, ఎదైనా అబద్ధమూ, పొరబాటై వుండదు గదా అనుకుంటాను.

ద్రౌపది:—(ఆలోచనగా) అవివేకమూ, అక్రమమూ కాదు. అది కొంటెతనం, చిలిపితనం. అవీ సరైన మాటలు నేను చేసినపనికి. కాని బాల్యంలోనే అణిగిపోయినా యనుకున్న ఆ గుణాల్ని ప్రేరేపించిన మీ భర్త—మీతో ఎట్లా చెప్పను.

భానుమతి:—(చిరునవ్వుతో) సందేహించకండి. ఆయనలో నాకు తెలీని లోపాలు లేవనుకుంటాను. ప్రజలు సింహాసనాధిష్ఠుడై న్యాయాన్యాయ విచక్షణత చూపగల మహాప్రభువునే చూస్తారు. కాని నేను విరహంలో, విచారంలో, ఆగ్రహంలో, మోహంలో—అన్ని స్థితులలోనూ ఆయన్ని ఎరుగుదును గద! ఉన్నతమైన పౌరుషం, తన స్వార్థాన్ని లక్ష్యంచెయ్యని ధైర్యం, ముందు వెనకలు రోచించని మొండితనం, కారణం కనపడని అభిమానం, సహించరాని గర్వం, ఏమి చెప్పను? అత్యంత ప్రియురాలనైన నేను, తనను హాస్యం చేస్తున్నానా, కించిత్ గాని తేలిక చేస్తున్నానా, గౌరవలోపం సూచించానా, అని పదే పదే నిష్కారణంగా అనుమానపడతారు. కాని ఆ పిచ్చిగుణాలవల్లనే ప్రేమిస్తాను ఆయన్ని. ప్రేమిస్తేనే గాని యీ

దుర్గుణాల అందం అర్థం కాదు: పిల్లల తప్పటడుగుల్లో, చిన్ని యేడుపులలో వుండే ముగ్ధలావణ్యం. లోపంలేని మనుష్యుల్ని యెట్లా ప్రేమించడం? ఉదాహారణం—ఏమనుకోకండేం? మా పెద్దభావగారితో ఏ సహృదయ సుఖించగలదు? (నవ్వుతో) ఎంగిలిని తాకడం అసహ్యించుకుంటూ, స్త్రీని ప్రేమించాలని నియమం పడతా రనిపిస్తుంది.

ద్రౌపది:—అవును. కాని ఆయన లోపాలు నాకు తెలుసు. ఆ చాదస్తమే వాటిలో వొకటి. ఈ జూదంమీాది మమత రెండోది. ధర్మంమీాది ఆసక్తి మూడోది.

భానుమతి:—మరి చెప్పరా?—నాప్రశ్న!

ద్రౌపది:—ఏమనుకోకు. పాండవుల విభవం—ముఖ్యంగా ఆ రాజసూయయాగ తేజాన్ని సహించలేకపోయినారు నా మరిది. ఆయన చర్య, తన ఆధిక్యం సమర్థించుకోడానికి పడేపాట్లు, ఎవరో తనని లోకువ చేస్తున్నారనే అబద్ధపు అనుమానం, తన ప్రభ ముందు పాండవులది చాలా స్వల్పమని యితరులకు తెలియచెయ్యాలనే దొంగ నిర్లక్ష్యభావం, ఇవన్నీ మాకు వింతనీ తృణీకారాన్నీ కల్పించాయి. అటువంటి లోపాలు చూసినప్పుడే, మొహంమీాది మచ్చని తుడవాలనీ, ఏదో దిద్దాలనీ, కొంచెం సిగ్గు కల్పించాలనీ, వింత చూడాలనీ అనిపిస్తుంది. ఆ చిలిపితనానికి అతీతులు కావడం న్యాయమేననుకో, కాని, నాలో అల్లరి పోయి, నేను మర్యాదతో స్తంభించిపోయేకాలం రాలేదు యింకా. రాణినని, పతివ్రతనని, పట్టమహిషినని ఎంత బోధించుకున్నా లాభం లేదు. యుధిష్ఠిరు డెంత అదిలించినా, నాకు ఇంకా వివేకం కలగలేదు. కాని మీా ప్రభువును అధిక్షేపించిన మరుక్షణమే ఏమనిపించిందంటే, చాలా అనాలోచితమైనపని చేశా ననుకున్నాను. నా చిన్ని హేళనని చూసి, తానూ నన్ను హేళన చెయ్యవలిసింది. కాని ఆయన ముఖం యెర్రనయింది. దెబ్బతిన్న బలహీనుడివలె తల వొంచుకుని, గాఢ నిశ్వాసాలతో వెనక్కి తిరిగి వెళ్లారు. అవమానాగ్నిని రగిల్చి, మూసి, హృదయంలో మూతపెట్టుకున్నారనిపించింది. నా అజ్ఞానం అప్పుడు గోచరమయింది నాకు. ఎంత గాఢవేదనను రేపానో! జన్మకు శత్రువును కోరి తెచ్చుకుంటినే అనుకున్నాను. ఆటలలో బిడ్డ చూరులో నిప్పు పెట్టిన ట్టయింది.

భానుమతి:—అవును. ఎంత బాధపడ్డా రనుకున్నారు? 'భానూ, నాకు కాదు ఆ అవమానం నీకు చేశా రనిపించింది. నీ భర్తకు! తిరిగి గౌరవంగా, గర్వంగా, నిన్ను ధీరుడివలె, యోధుడివలె యెట్లా మోహించగలను? ఆడదానిచేత పరిహాసింప

బడి—ఏమి చెయ్యలేని క్షుద్రుణ్ణి. నన్ను రారాజును, కౌరవవంశాగ్రణిని, తన అతిథిని హేళనచేసింది, తన ఐశ్వర్యమదంలో కళ్లు గానక. అదే పురుషు డైతేనా? నేను ఆ స్త్రీ అవమానాన్ని వెయ్యిరెట్లుగా ప్రత్యవమానంతో ప్రక్షాళనమన్నా చెయ్యాలి. లేక యీ జీవనాన్నన్నా త్యజించాలి' అన్నారు.

ద్రౌపది:—నన్ను, వయసులో విభవంలో చిన్నదాన్ని, నన్ను అవివేకినిని, పిలిచి, 'ఏమిటా నవ్వు, వెర్రిబాలికా!' అని తూలనాడి వుండకూడదా! తానూ తనను చూచి తానే నవ్వి వుండకూడదా? అంత వున్నతస్థాన మలంకరించే ప్రభువునకు అంత సులభాగ్రహం న్యాయం కాదు.

భానుమతి:—నిజమే కాని, చాలా అవివేకమైన పని చేశారు అక్కా మీరు.

ద్రౌపది:—నా లోపాల్ని అర్థంచేసుకుని సానుభూతి చూపేందుకు నాకో భానుమతి లేదు. (చప్పున కన్నీళ్లతో) పాండవ పత్ని కాదు, యింద్రప్రస్థరాజ్ఞి కాదు, రాజసూయా ధ్వరిణి కాదు, అయోనిజాతమైన పాంచాలపుత్రి కాదు, అబల, అవివేకిని, కృష్ణ అనే సామాన్య బాలిక తనని చూసి హేళన చేసింది, అని ఎట్లా తెలియచెయ్యను?

భానుమతి:—నిజమా; ఆయన వేదనను సమయింప చెయ్యాలనే ఆశే వున్నదా మీకు? దాని కొకటే మార్గం. అడగడానికి నాకు ధైర్యం చాలకండావుంది. ఆయన ముందు పశ్చాత్తాపపడగలరా మీరు?

ద్రౌపది:—తప్పక. క్షమించమని ప్రార్థిస్తాను. నేను శిక్షార్హను.

భానుమతి:—మీ భర్తల అనుజ్ఞ —

ద్రౌపది:—ఆ ప్రసక్తి అవసరంలేదు. నేరం నాది. శిక్షకూడా నాదే!

భానుమతి:—ఎంత ఉదారమైన హృదయమండీ అక్కా మీది! ఇప్పటికి నా హృదయం శాంతపడ్డది. నే నెంత వేడినా వినక, నే నెంత సమాధానపరిచినా సమ్మతించక, మిమ్మన్ని, నిప్పువలె పవిత్రమూ, భయంకరమూ ఐన మీ స్వభావాన్ని గాయ పరిచి న్యూనత పరచాలని ఆయన ప్రయత్నం. మిమ్మల్నందర్నీ ఆహ్వానిస్తున్నారని వినగానే ఎంత తల్లడిల్లాను నేను! ఈవిధంగా పరస్పరావమానాలతో, యీ వైరం ఏవిధంగా పరిణమిస్తుందో, ఏ పర్యవసానాన్ని పొందుతుందో! తమ పత్ని అవమానాన్ని పాండవులు సహించగలరా? అభిమానధనుడు, దుర్యోధన చక్రవర్తి—అదంతా ఇప్పు డెందుకు! మీకు ఆయనకు సంధానం కలగచెయ్యనా?

ద్రౌపది:—అవశ్యం.

భానుమతి:—ఈజూదం కాగానే ఆయన వొస్తారు. అప్పుడు—

[సభాభవనంనించి కోలాహలం వినవొస్తుంది.]

ఏమబ్బా అది !

[ప్రాతిగామి వొచ్చాడు. వొంగి భానుమతికి నమస్కరించాడు.]

ప్రాతిగామి:—జయము మహారాజ్ఞికి.

భానుమతి:—ఇద్దరు మహారాజ్ఞు లున్నారు. చూడలేదా, ప్రాతిగామీ !

ప్రాతిగామి:—రాజ్ఞీ, ద్రౌపదీదేవి రాజ్ఞి కాదు, యీనాటినించి.

భానుమతి:—ఏమి, తాగినావా ?

ప్రాతిగామి:—యుధిష్ఠిరుడు—

భానుమతి:—నోరు ముయ్యి. యుధిష్ఠిరుడూ ? యుధిష్ఠిరు డెవరు నీకు ?

ప్రాతిగామి:—పాండురాజ ప్రథమపుత్త్రుడు.

భానుమతి:—బైటికి నడు ముందు.

ప్రాతిగామి:—రాజాజ్ఞ తీసుకొని వొచ్చాను. నా సందేశము వినండి. ఈమెను తీసుకుని రమ్మన్నారు.

ద్రౌపది:—నన్నా, నన్ను తీసుకు రమ్మనడానికి మీ ప్రభు వెవరు ?

భానుమతి:—ఈమెనా ? ఎక్కడికి ?

ప్రాతిగామి:—సభాభవనానికి.

భానుమతి:—ఏమి సాహసము ? నిజమా ? ఎందుకు ?

ప్రాతిగామి:—రాజ్ఞీ!—యుధిష్ఠిరు—యుధిష్ఠిర చక్రవర్తి, జూదములో, తన సర్వస్వమునూ, మన ప్రభువునకు గోల్పోయినారు. తనను, తన తమ్ములను, తనభార్యను. వీరందరూ మన ఆస్థానానికి బానిసలు.

భానుమతి:—ఆ—

[మాటలు లేవు. భానుమతి ద్రౌపదిముఖమువంక చూస్తోంది.]

ప్రాతిగామి:—అమ్మా, దయచేయండి.

ద్రౌపది:—(ఆలోచనగా) నేనా, బానిసనా ? నన్ను వొడ్డినారా ? ఎవరు ? అందరూనా, వొక్కరేనా, జూద మాడింది?

ప్రాతిగామి:—అగ్రజులే.

ద్రౌపది:—నన్ను వొడ్డినారా ? నన్ను !

ప్రాతిగామి:—తన తమ్ములను కూడా.

ద్రౌపది:—ఏమి విపరీతము !

భానుమతి:—అక్కా ! అంత సందేహ మెందుకు? సభకు వెళ్లితే నేమి ?

ద్రౌపది:—నేనా ! ఒకరి ఆజ్ఞానుబద్ధురాలనై వర్తిస్తానా నేను ?

భానుమతి:—ఆగ్రహపడకండి. యుద్ధములోగాని జూదములోగాని అపజయముఅపజయమే.

ద్రౌపది:—ఏమీ ? నేను దాసినా ? నేను ! ద్రౌపది దాసిన ! హాహా ! నీభర్తకు, నీకు, నీ నూర్గురు మరుదులకు !

భానుమతి:—క్షత్రియాంగనవు, అపజయము నంగీకరింపలేవా ! దాసీత్వము నీచమే, కాని, నా కా స్థితి కలిగితే నే నాగ్రహపడను. ఆగ్రహమే అపజయసూచకము. జయాపజయాలు దైవికాలు.

ద్రౌపది:—కొందరు విధికి తల వొంచేవారు, కొందరు విధి నెదిరించి, యుద్ధంచేసి, జయించే వారు. నేను రాను. రానని చెప్పు.

భానుమతి—వొద్దు, అక్కా. సాహసించకండి. విరోధము పెంచవొద్దు.

ప్రాతిగామి:—రప్పించేశక్తి ప్రభువులకు కలదు. వారి దాసి—

ద్రౌపది:—ద్రౌపదిని రప్పించేశక్తి ! అవతారమెత్తాలి.

భానుమతి:—(ప్రాతిగామితో) నోరు ముయ్యి. ఏమి చెయ్యను ? (ఆలోచించి) ప్రభువును సమీపించి రహస్యముగా, అంగరాజు వినకండా, నే నొక్కసారి యిటు దయచేయ మన్నానని మనవిచెయ్యి.

ప్రాతిగామి:—చిత్తము.

(వెళ్లాడు.)

ద్రౌపది:—(దుఃఖమూ రోషమూ ఆపుకుంటూ) నేను దాసినా ! నన్ను సభకు పిలిపించి, ఆజ్ఞాపించి, హేళనచేసి—

భానుమతి:—విచారపడకండి—ప్రభువును సమాధానపరుస్తాను. మీ హృదయం అర్థం కాలేదు ఆయనకి—

ద్రౌపది:—(కన్నీళ్లతో) అది కాదు. నా భర్త నన్ను పరిచిన అవమానముకన్న నీభర్త న్యూనత చెయ్యగలడా ? నన్ను తన ధర్మపత్నిని, ద్రుపదపుత్రిని, అయోనిజను, నన్ను, తన వాహనాలతో, తన అలంకారలతో నన్నూ వొడ్డినారా ? నా యిష్ట మేమిటో, నా కష్ట మేమిటో—

భానుమతి:—తననూ, తన తమ్ముళ్లనూ—ఆయన పత్నివి కాదా? పతికున్న అధికారాలవా?

ద్రౌపది:—నేను స్త్రీని. వారిమీద పగ లేదు మీ సార్వభౌముడికి. నన్ను శత్రుహస్తాల్లోకి, చూసి, చూసి, వొప్పగించారు.

భానుమతి:—శత్రువులని అనకు—

[ద్రౌపది వెళ్లిపోతోంది.]

అక్కా, వుండరా!

ద్రౌపది:—తరవాత వొస్తాను.

[దుర్యోధనుడు వొచ్చాడు.]

భానుమతి:—ఆర్యా? ఏమిపని యిది?

[ఆమె కళ్లవంక చూసి సిగ్గుపడుతున్నాడు.]

ఈ జూదము న్యాయమేనా? నవ్వుతో ఒక్కగడియలో ఎంత విరోధం పెంచి వేసినారు?

దుర్యోధనుడు:—నేను విజయిని.

భానుమతి:—జూదములో విజయులే. రేపు యుద్ధములో—

దుర్యోధనుడు:—నా బానిసలు.

భానుమతి—సింహా లెంతకాలం సేవ చేస్తాయి? వాటిని మీ ఆస్థానంలో భరించగలరా? అడియాసలు మీకు.

దుర్యోధనుడు:—ధర్మంతో కట్టాను.

భానుమతి:—ఆ ధర్మబంధాల్ని కాల్చే అగ్నిని మరిచారు.

దుర్యోధనుడు:—ఆ అగ్నిని అణచడానికే కబురంపాను. భార్యావమానాన్ని కళ్లారా, నిస్సహాయులై సహించిన యీ పాండవులు ఇంక యీ జన్మకు తల లెత్తి ఉర్వి పాలించగలరా!

భానుమతి:—దౌర్జన్యం దౌర్జన్యాన్ని కల్పిస్తుంది.

దుర్యోధనుడు:—కాని, మాటికి ముందు వారు ధర్మపరులని మెత్తిపొదుపులు కట్టుబడతాయి.

భానుమతి—స్త్రీని ఆగ్రహపరచకండి. అబలలము మేము. మా నిస్సహాయత్వమే పురుష బాహాబలాన్ని ప్రేరేపించి అసాధ్యమైన విజయాలు సమకూరుస్తుంది.

మాస్వభావం అనాదిశక్తులతో, నిరంకుశోద్రేకాలతో మిళితమయింది. ఈనీతులూ ధర్మాలూ మే మెరగము. మేమే ఆగ్రహిస్తిమా సర్వనాశన మైతేనే గాని తృప్తి పడము. అందులో ద్రౌపది—ఆమె నెరగరు, మీరు.

దుర్యోధనుడు:—సర్వనాశనమా! కానీ. ఏమీ, మృత్యువుకి భయపడి ప్రతీకారంలేని అవమానాన్ని సహించమనా నీఆలోచన! శత్రుపరాక్రమానికి భయపడి, ధర్మ భిక్ష యాచించే భర్తగలదానివి కావడంకన్న, భర్తృహీన వైతేనే గౌరవనీయు రాలి వౌతావు! ఛీ! భానుమతీ, నీభయం నీ ఆత్మగౌరవాన్ని నాశనం చేస్తోంది గాని, స్త్రీ తిరస్కృతుడనైన నన్ను నీవు క్షమింపగలవా?

భానుమతి:—పాండవుల్ని జయించారు. చాలదా? స్త్రీమీదనా మీప్రతాపము? ఆరని అగ్నిని వెలిగిస్తున్నారు మీరు. సీతాపరాభవమే రావణ సంహారానికి కారణం.

దుర్యోధనుడు:—ఈస్త్రీని యెవరూ ఆశించటం లేదు. ఆమె దుర్మదవిదళనమే కావలిసింది.

భానుమతి:—అన్యాయం. ఆమె పశ్చాత్తాప పడుతోంది.

దుర్యోధనుడు:—ఇప్పటికి కలిగిందా బుద్ధి! అసహాయ పశ్చాత్తాపపడదా? ఐతే రమ్మను సభకు.

భానుమతి:—కాదు—ఇక్కడ—

దుర్యోధనుడు:—వీలు లేదు. సభలో—

భానుమతి:—ఆర్యా, ద్రౌపదిఅవమానం ఆమెది కాదు. నాది. నాభర్త పరస్త్రీ నవమాన పరిచేటంత అల్పుడా!

దుర్యోధనుడు:—ఆ, ఏమన్నావు? అవమానం సహించేటంత అల్పుడు కాదు. ఇంక మాట్లా డకు. (వెడుతున్నాడు.)

భానుమతి:—(వెనకనే వెడుతో) ఆమెని వొద్దీ ఆమెకు భర్తచేసిన అవమానం చాలదా? అబల, స్త్రీ, గనకనే కదా ఈయీదౌర్జన్యము! మీఅతిథి! స్త్రీ. పూజ్యురాలు— కడపటిమాట—

(వెళ్ళారు.)

[కొంచెంసేపట్లో భానుమతీ ద్రౌపదీ వొచ్చారు.]

భానుమతి:—పూజ్యులు, సకలధర్మ విశారదులు మాబావగారు, ఎట్లా తన భార్యని జూదానికి బలిగా అర్పించారో! ఏలోపాలు లేని పరిపూర్ణుల్లోని ఒక్క లోపము సాధారణులలోవలె అణగివుండదు. వినాశనకారణ మవుతుంది. ఈ

ద్యూత మమకారంలో భార్యాగౌరవం, ధర్మం మరిచారుకదా! ఏనాటికైనా యీలోపం సర్వనాశనానికి యీడ్వక మానదు.

ద్రౌపది:—నేను ఐదుగురి పత్నిని.

భానుమతి:—అవమానధూమంలో ధర్మసందేహాలు రెండుపక్షాలవారికీ మరుపై పోయి నాయి.

ద్రౌపది:—సభలోనే ప్రశ్నిస్తాను, యిదేమి ధర్మమని.

భానుమతి:—అవును. నిష్పక్షపాతహృదయులైన మహాత్ములకు నిలయము మా ఆస్థానము. కాని ఇంతకు ముందే యీ అధర్మాన్ని ప్రశ్నించివుండవలిసినదే, యీ అక్రమాన్ని అప్పుడే ఖండించలేదేమో !

ద్రౌపది:—భయము లేదు. భీష్మ, ద్రోణ, విదుర—

భానుమతి:—లాభము లేదు అక్కా. వారు పురుషులు. ఎంత న్యాయపరులు కానీ, ధర్మవేత్తలు కానీ, పురుషసమూహమంతా ఏకమే. స్త్రీ స్వతంత్రించిందా, పురుషశత్రు వవుతుంది. న్యాయ ధర్మ వివేకాలు మూతలుపడతాయి. మీరు సభలో ధైర్యంగా ప్రశ్నించడమే పురుషాధికార ధిక్కారముగా భావిస్తారు. దుర్యోధన తంత్ర మక్రమమే కానీ! పురుషులు నిర్ణయించవలిసిందే గాని, స్త్రీ స్వతంత్రించి, ధర్మాధర్మ నిర్ణయం చేయ అధికారి కాగలదా అని ఆగ్రహించి మీకు ప్రత్యుత్తర మీయరు. మీభర్తలే అంగీకరించరు సభాతిరస్కారాన్ని. స్త్రీ తన అబలతవల్ల అసహాయతవల్ల కన్నీళ్లతో రోదనంతో పురుషహృదయాన్ని కరిగించి జయించాలి గాని, ధిక్కరించిందా, ప్రశ్నించిందా జగద్విరోధి అవుతుంది.

ద్రౌపది:—కానీ. యీ పురుషాధముల బానిసను కావడంకన్న ధిక్కరణచేసి అవమానాన్నే సహిస్తాను—క్షమించు: అధము లన తలచలేదు.

భానుమతి:—కానీ. ఏమో! కడపటికి మీ ధీరస్వాంతంసహితం యీ పాషాణప్రపంచానికి జంకి, యే పురుషసహాయాన్నో వేడుకుంటుందనే నాఅనుమానం. స్వాభిమానమైన స్త్రీని జయించిందాకా నిద్రపోదీ ప్రపంచం. వివేకవతులైన స్త్రీలు తమ అబలాత్వంలో సాధిస్తారీ ప్రపంచాన్ని పురుషులద్వారా.

ద్రౌపది:—ఏమి చేయను ?

భానుమతి:—అనలేను గాని, సభకు పోయి పశ్చాత్తాపపడడంకన్న వేరువుపాయం తోచదు.

ద్రౌపది:—ఏమి? నేనా? క్షమాపణా? నాభర్తల్ని మాయాజూదంలో వోడించి, దాని సల్ని చేసిన విరోధికి క్షమాపణా!

భానుమతి:—అక్కా, మీకన్న దూరదృష్టితో మాట్లాడుతున్నాను. మన కెవరికీ క్షేమ కరం కాని వైరాన్ని పెంచుతున్నారు.

ద్రౌపది:—అపాయానికీ వైరానికీ భయపడి, గౌరవాన్ని భంగపరుచుకుంటామా.

భానుమతి:—కోపపడకండి. మీకూ ఆయన కున్నంత దురభిమానమే వున్నట్టుంది. అందు వల్లనే కాబోలు యీవైరం. మీకే యిట్లా వుంటే, అపహాసింపబడ్డ పురుషపుంగ వుల కెట్లా వుండాలి!

ద్రౌపది:—ఎట్లా వుంటుందో తెలుస్తుంది. ఇది ద్రౌపది, సామాన్యవనిత కాదు.

భానుమతి:—ఆగ్రహించకండి. మీరు అసహాయులు. వారు దుర్మార్గం తలచారు. శాంత యుతమైన ఉపాయమే సాధనం.

ద్రౌపది:—ఏమీ, అనాధనైనప్పుడు నా కా యోచన. నాపాండవసింహాలు జీవించి వుండగా—

భానుమతి:—సింహాల్ని బంధించారు.

ద్రౌపది:—ఎవరు బంధించగలవారు?

భానుమతి:—ధర్మం.

ద్రౌపది:—నాకోసం ధర్మభేదనం చేయిస్తాను.

భానుమతి:—మీరు మీభర్తల్ని అర్థం చేసుకోలేదు.

[దుశ్శాసనుడు కోపంతో బిరబిరా వొచ్చాడు. వాళ్లిద్దర్నీ చూసి ఆగాడు. కొంచెం బెరుకుపడ్డాడు. భానుమతికి నమస్కరించ బోయినాడు.]

భానుమతి:—నాకన్న పూజ్యురాలికి ముందు—

దుశ్శాసనుడు:—ఎవరు? అది...ఆమె...

భానుమతి:—శాంతం.

దుశ్శాసనుడు:—అది...దాసి నాకు...నాప్రభువుకు దాసి...మనందరికీ దాసి.

ద్రౌపది:—ఏమి? నేను దాసినా? సీకు! కృష్ణ! దాసి! కలగంటున్నావు. మేలుకో.

భానుమతి:—నీవు వొచ్చినపని?

దుశ్శాసనుడు.—ఈమెని...దీన్ని ప్రభువు సభకు తీసుకురమ్మన్నారు.

భానుమతి:—ఈమె రాదు.

దుశ్శాసనుడు:—బలం వుపయోగించమని ఆజ్ఞ.

భానుమతి:—దుశ్శాసనా! నా అనుమతి లేకండా, ముందు కబురు లేక, నిన్ని అంతఃపురం లోకి ఎవరు రమ్మని ఆహ్వానించారు? (లేనిఆగ్రహం తెచ్చుకుంటూ) మాయాజూదపు జయంతో కళ్లు నెత్తి కెక్కినట్టున్నాయే!

[ఎదురాడలేక వూరుకున్నాడు.]

దుశ్శాసనుడు:—అన్నగారి ఆజ్ఞ.

భానుమతి:—ప్రభువుకి ఉచితానుచితజ్ఞానం మరుపుకి వొచ్చినప్పుడు, జ్ఞాపకానికి తేవలిసిన సంగతి మరిచే మంత్రులు మీ రెందుకు? పీఠాలు అలంకరించడానికా? తిరిగి వెళ్లు.

దుశ్శాసనుడు:—ప్రభువుఆజ్ఞని వుల్లంఘించలేను. రా. దాసీ.

ద్రౌపది:—నేను దాసిని కాను. భానిసలకి దాసులు లేరు వోడడానికి.

దుశ్శాసనుడు:—ఇంక బలం వుపయోగించాలి.

ద్రౌపది:—ఏమి! బలాత్కారమా? ఎవడురా ద్రౌపదిని ఆమాట లనగలది?

దుశ్శాసనుడు:—నేను—పద.

ద్రౌపది:—ముందు, నన్ను వొడ్డడానికి యుధిష్ఠిరరాజునకు అధికార మెట్లా వుందో మీ సభను నిర్ణయించమను.

దుశ్శాసనుడు:—సభకు వొచ్చి నీవే ప్రశ్నించుకో. నీభర్తనే అడుగు, ధర్మవేత్తకద! ముందు నడు.

ద్రౌపది:—నేను రాను పో.

దుశ్శాసనుడు:—రాకపోతే శిరోజాలు పట్టి యీడ్చి తెమ్మని ప్రభువుఆజ్ఞ.

భానుమతి:—కాదు. అబద్ధం.

దుశ్శాసనుడు:—అవును.

భానుమతి:—కర్ణుడి ఆజ్ఞ—అవునా?

దుశ్శాసనుడు:—ఒక్కటే, వొదినా! యీమె మనవిరోధి. నీభర్తను పరాభవించిన యీ దాసితో నీ కేమిటీ సానుభూతి!

భానుమతి:—మీ పెద్దవదిన కిచ్చిన అవమానము మీ చిన్నవదినది కాదా? నన్నైనా యింతేకద!

దుశ్శాసనుడు:—లక్ష్మణస్వామి—

భానుమతి:—మంచి వుపమానం దొరికింది. లక్ష్మణుడి పరితాపం నీలో కినపడదే!

దుశ్శాసనుడు:—పరితాపం దీనియెడలనా! పద.

ద్రౌపది:—పో, నీచుడా.

దుశ్శాసనుడు:—ఆ! నీచుడా! దాసికన్న కాదు.

(ఆమెని తాక పోతున్నాడు.)

ద్రౌపది:—ఏకవస్త్రను, రజస్వలను—

దుశ్శాసనుడు:—మరీ మంచిది.

ద్రౌపది:—నిరాయుధను, నామీదనా నీపౌరుషము!

[ఆమె జుట్టుపట్టుకోబోయినాడు.]

భానుమతి:—ఆ!

ద్రౌపది:—(తప్పించుకుని) నన్ను తాకావా—నాకు నీచేయి తగిలిందా! పరపురుష—

దుశ్శాసనుడు:—ఐదుగురు భర్తలుగల నీకు పరపురుషు లున్నారా?

ద్రౌపది:—(పళ్లు కొరికి) నీచావుకి ఒక్కభర్త చాలునురా! ఈమాటకు, నన్ను నీ వన్న మాటకు నూర్గురిని కన్న నీ తల్లికడుపు మండిపోదా!

భానుమతి:—హరి,హరీ! ఎంత వుపద్రవం సంభవించింది యీ కురువంశానికి! నాయనా, నిన్ను వేడుకుంటున్నాను. ఆమె మహాపతివ్రత. ఆమెకి ఆగ్రహం కలిగించకు. నాశో సం, నేను—

[దుశ్శాసనుడు వినేస్థితిలో లేడు.]

దుశ్శాసనుడు:—ఏమీ, మావంశం నశించాలా! ఏవంశం నశించపోతోందో చూపుతాను. ముందు నీమానం నశించబోతోంది నిండుసభలో!

(ఆమెజుట్టు పట్టుకుని లాగాడు. తనపనికి తనే భయపడి వొదిలి నుంచున్నాడు.)

ద్రౌపది:—(నిప్పు లురిమే కళ్లతో) ఓరీ, పాపాత్ముడా! నీచెయ్యి తగిలి వూడిన యీ జుట్టు నీరొమ్ము నెత్తుటితో గాని ముడిపడదు. నీమృత్యుశాసనాన్ని నీవే లిఖించు కున్నావు. పద. వొస్తున్నాను.

[ద్రౌపది ముందు బిరబిరా నడిచింది. వెనకాల భయంతో దుశ్శాసనుడు నడిచాడు.]

# ఆధునిక కవిత్వము

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, ఎమ్.ఏ., డి.ఎస్‌సి.

ప్రాచీనకాలంలో కవిత్వము రెండుపాయలుగా ప్రవహించింది. వాఙ్మయాభిమానులైన మహారాజుల ఆస్థానములో సంస్కృతభాషాసంస్కారము ప్రత్యేకముగా పొందిన పండితకవు లుండేవారు. వారు రచించినకావ్యములు ఒకరకము. జానపదులలో అనుశ్రుతముగా వచ్చిన పౌరాణిక వీరగాథలు మనస్సుకి పట్టించుకున్న పామరకవులు రచించిన జానపదసారస్వతము మరొకరకము. ఈ జానపదసారస్వతము మళ్లీ రెండువిధాలు. పొట్టకూటికి పగలల్లా పాటుపడి ఏసాయంకాలపు నీరెండలోనో రావిచెట్టుక్రింద తనవంటివారి కానందము కలిగించడానికి పామరుడు చెప్పే గీతకవిత ఒకమోస్తరు. పతికీ, పిల్లలికీ, భోజనముపెట్టి, తాను భుజించి, పిల్లలని జోకొట్టడానికో, చేసే గృహకృత్యములోని శ్రమ నపనయించడానికో, పదిమందిగా కూడి కూర్చున్న గృహిణుల కాలక్షేపానికో, సువాసిని చెప్పే పాటలు మరొకమోస్తరు. ఈరెండు చిన్నపాయలుకూడా గ్రంథస్థము కాలేదు. నోటినుంచి నోటికే వీటిప్రయాణము. అందువల్ల వీటికి ప్రచారము, దానిమీద ఆధారపడే ప్రఖ్యాతి దొరకలేదు.

పండితకవుల రచనలలో మేధాకల్పన లెక్కువ. ఈకవులందరూ సంస్కృత కావ్యాలు కూలంకషముగా వల్లించినవారే. అందువల్ల సంస్కృత కవిత్వములోని కల్పనలు చాలామట్టుకు దిగుమతిఅయేవి వీరికవిత్వములోకి. వీరు తమ వ్యుత్పత్తిబలము చేత గొప్పకల్పనలు సాధించడానికి మహాప్రయత్నాలు చేసేవారు. వీరిఊహ గారడీవాని మంత్రదండమువంటిది. దానిస్పర్శ తగిలితే సరి, సూర్యుడూ చంద్రుడూ కాలపుహాంత కానిచేతిలో సంగడాలు; తిలకము ఊర్ధ్వముఖ తీక్ష్ణశరాగ్రము. వీరిఊహ సర్వభక్షకుని లాగ దేనినైనాసరే మింగి, కల్పవృక్షములాగ మరి దేనినైనా సరే సృష్టిస్తుంది.

జానపద కవిత్వ మంతా భావాలనిధి. కల్పనలు పామరుల రచనలలో చాలా తక్కువ. వారిమనస్సులకంటె హృదయాలే బలవంతాలు; అందువల్ల వారిరచనలలో భావాలే మిక్కిలిగా ఉంటాయి.

వందనమయ్యా, వందనమయ్యా, విజయరామరాజు
పూసపాటి వారియిల్లు పుట్టినిల్లనుకొంటి
దామెర సంస్థానముమాటే మరచిపోయినాను
నల్లపూసలు నల్లగాజులూ నాకు నిల్పుమయ్యా.

రచయిత మల్లమ్మదేవి అయిపోయి అన్నముక్క లివి. ఇంక స్త్రీలసారస్వత మంతా కల్తీ లేని భావసంచయమే. ఇంకా పామరకవి ఇద్దరు పెద్దగృహస్థుల వియ్యమును

వెండికొండయును భమిడికొండయును డీకొన్నరీతి

అని వర్ణించి ఒక కల్పన విసురుతాడేమో గాని, స్త్రీలుమాత్రం పొరపాటునేనా కల్పన చెయ్యరు.

పూసపాటివారి లోగిళ్లలోను
పురి విప్పి ఆడింది పుణ్యంపు నెమలి.

అని కల్పించినట్లే కనబడి,

భాగ్యపాటివారి లోగిళ్లలోను
పా ల్తాగి ఆడింది పట్టి అమ్మన్న

అని రచననంతా ధ్వనిమంతము చేస్తుంది స్నేహశీలఅయిన మాతృదేవత. పండిత కవుల రచనలలో అలంకారకల్పన మెక్కువ. "శ్రేణుల్గట్టి నభోంతరాళమున బాఱెడి పక్షు లుష్ణాంశుపాషాణవ్రాతము కోష్ణ మయ్యె, మృగతృష్ణావార్ధు లింకెన్" అని చలన చిత్రముమాత్రము రచించి ఊరుకోలేదు పండితకవి! కల్పనకి వీలు చిక్కిందా,

తరణి యిదె క్రుంకుచున్నా
డరుదెమ్మని చంద్రు బిల్వ నరిగెడు రజనీ
తరుణీమణి దూతిక లన
నరిగెం దూర్పునకు నీడ లతి దీర్ఘములై

అని రచించేస్తాడు. ఇక పామరులలో? స్త్రీలపాటలలో ఒకటి చూడండి.

విశాఖపట్నాన విసిరింది గాలి
వింజరపు రేవున్న తేలింది వాడ
వర్తకుని పేరేమి వాడపేరేమి
వాడలో నున్నట్టి దినుసుపేరేమి?
వర్తకుడు అబ్బాయి వాడ నావాడ
వాడలో నున్నట్టి దినుసు ముత్యాలు.

ఊహాగోలుసులు తెంపుకుని పారిపోవడానికి తెగ గింజుకుంటుంది; కాని హృదయానికి ఈరచనలని బంధించే ప్రేమసూత్రాలు బలమైనవి. అందువల్ల మల్లీ భావమువైపే మొగ్గు కనబడుతూంటుంది.

పండితులరచనలలో సౌఖ్యావహమైన శృంగారరసమే ప్రధానముగా నుండేది. వారిరచన రాజులప్రీతికోసము. రాజులకి కష్టాలూ, దుఃఖాలూ గ్రంథాలలోనే గాని

ప్రపంచములో ఉన్నట్లు కనబడవు. అందువల్ల శృంగారప్రధానగ్రంథాలే వారికి ప్రీతి. ఏ చేమకూరకవో తలుచుకుని కరుణరస ప్రధానాలయిన కావ్యాలు రచించితే ఈరాజుల దృష్టిలో అవి 'పాకాన్ని' పడవు. ఆకవే ప్రతిపద్యములోనూ బూతులు బిగించి ప్రబంధము వ్రాస్తే ఆకావ్యము మధురపాకాన్ని పడుతుంది. రాజుల మనస్తత్వా లీరీతి నున్నప్పుడు వారి నాశ్రయించుకున్నకవులు "రమణీప్రియదూతిక తెచ్చియిచ్చే కప్పురవిడెము" కోసము నిరీక్షించారంటే వింత ఏమిటి? పామరులజీవితము కష్టములపుట్ట. కరుణ పట్టినట్లు, శృంగారము కాదు మరి ఏ యితరరసమూ వారిమనస్సులకు పట్టదు. కరుణరసావిర్భావానికి ధర్మము పరాభూతమైనట్లు గోచరించాలి. పరాభూతము కాగల ధర్మము ఇంట స్త్రీలలోను, రచ్చను ధర్మవీరులలోను కనపడుతుంది. కాబట్టి పామరులసారస్వతములో వీరబొబ్బిలికథ, మరాటికథ, దేశింగురాజుకథ మొదలైన వీరగాథలూ, కామమ్మకథ, చిన్నమ్మకథ, లక్ష్మణమూర్ఛ మొదలైన కరుణగాథలూ ఎక్కువ. ప్రజాస్వభావము బాల్యావస్థలాంటిది. పండితస్వభావము యౌవనావస్థ. బాలురకువలె పామరులకు వీరగాథలూ యౌవనులకువలె పండితులకు శృంగారగాథలూ రుచిమంతాలు.

పండితవాఙ్మయము 'ఉండవలసిన'తీరు చూపిస్తుంది. 'ఉండగల, ఉండునట్టి' తీరులలో పండితుల కాదరము తక్కువ. వారి నాయకు లందరూ గంధర్వకుమారులు; నాయికలు, అలంకార శాస్త్రానువర్తినులగు తుంగస్తనులు. ప్రబంధస్త్రీలలో పిడికిలికంటె బలమైననడుము మచ్చుకేనా దొరకదు. భ్రాంతిమంతము, ఉత్ప్రేక్ష, రూపకము వారు సృష్టించే ప్రపంచములో సర్వత్రా విహారము చేస్తూఉంటాయి. కష్టాలుపడినజీవికి తన కష్టముకన్న కఠినతరమైనకష్టము, సుఖజీవనుడగు రాజచంద్రుడికి తన స్వర్గాన్ని మించిన స్వర్గము, పండితకవనము చూపిస్తుంది. పామరులకు ఉన్నతీరులోనే ఆసక్తి. అందువల్ల ఊహాకంటే ఉపమాలంకారమే తప్ప భావనతోడ్పాటు కోరేఅలంకారాలు సామాన్యముగా కనపడవు. సుధేష్ణ ద్రౌపదిసౌందర్యము నెంచుతోంది:

> ఈరూపు ఈరేఖ ఈచక్కదనమూ
> ఏవూరినుండి యిట కేతెస్తి వమ్మా
> మగవారు చూచితే మనసు నిలుపుదురా.

ఉన్నది ఉన్నట్లు మనస్సులో పుట్టినది అట్లే రచించేస్తారు పామరులు. ఒకప్పుడు, మనస్సు వారు చేసేవర్ణనలని వాస్తవికతనుంచి ఆదర్శస్థితికి లేవనెత్తడానికి యత్నిస్తున్నట్లు కనబడుతుంది కాని ఎత్తలేదు. నడిమింటి రామయోగిశాస్త్రి రచించిన 'బాణాసురయుద్ధము' లోనివి పదిపంక్తులు చూడండి:

# సర్వదేవుడు

నేలటూరి వెంకటరమణయ్య, ఎమ్. ఏ., పిహెచ్.డి.

## ౧

ద్రావిడవాఙ్మయములకు జైను లొనర్చిన సేవ మఱవరానిది. స్వధర్మమును స్థాపించుటకై జైనాచార్యులు కొందఱు, క్రీస్తు పుట్టుటకు కొన్ని శతాబ్దములపూర్వము దక్షిణాపథమునకు వచ్చి యచ్చటనే యునికిపట్లు నేర్పరచుకొని జనసామాన్యమునకు ధర్మోపదేశము నేయుచు, దేశమంతటను జినాలయములను జైనమఠములను నిర్మించుచు కాలక్రమమున తమ మతమును స్థాపించిరి. దక్షిణదేశమంతయు జైనాక్రాంతమాయెను. జనసామాన్యమున మతతత్త్వమును బోధించుటకు దేశభాషలు లెస్సగ ననుకూలించుటవల్ల, జైనాచార్యులు స్వమతప్రచారమును దేశభాషలయందు జేయుచు క్రమక్రమమున గ్రంథరచనకు గడిగి, పురాణములు, కావ్యములు, శాస్త్రగ్రంథములు, నీతిప్రబోధకములగు గాథలు, శతకములు, స్తోత్రములు మొదలగు పలువిధములగు గ్రంథములను విరచించిరి. ద్రావిడభాషలను శాసించి, వాఙ్మయములకు అంగుచంగు నొసగినవారు జైనపండితులును, కవులును అని యెల్లవారలును అంగీకరించినవిషయమే.

తమిళ కర్ణాటక భాషలయందు జైనపండితులును కవులును రచించిన శాస్త్రగ్రంథములును కావ్యములును పెక్కు నేటికి గానవచ్చుచున్నవి. వారియందనేకు లిప్పటికిని మహాకవులని కొనియాడ బడుచున్నారు. కాని యాంధ్రభాషయందు జైనగ్రంథ మొక్కటియైనను గానరాదు. ఇందుకు కారణ మేమి? ఆంధ్రదేశమునందు జైనులు నివసించి యుండలేదా? లేక ఆంధ్రజైనులకు, తమిళ కర్ణాటజైనులవలె దేశభాషయందు రుచి పుట్టకపోయెనా?

ఆంధ్రదేశమున జైనులు నివసించియుండలేదనుటకు వీలు కాదు. ఏలన, జైనుల స్మారకచిహ్నములు నేటికిని గాన్పించుచు పూజాపురస్కారములు లేక, ఆతపోష్ణమున గ్రాగుచు వర్షోదకముల దడియుచు నిర్జనప్రదేశములయందు నిలిచియున్న జైన దేవతా విగ్రహము గాన్పించని గ్రామము లాంధ్రదేశమున నెన్నో లేవు. జైనపాడులు, జైన బావులు మొదలగువానినిగూర్చి విశేషించి చెప్పవలసిన యవసరము లేదు. మఱియు, ధర్మామృతము మొదలగు కన్నడ జైనగ్రంథములవల్ల నొకప్పు డాంధ్రదేశమంతయు జైనాక్రాంతమై యుండెనని తెలియుచున్నది. ఇంతే కాదు—కర్ణాటకమున మహాకవులని నేటికిని

ప్రాగత్త నందుచున్న పొన్నడు, ఆదిపంపడు, నాగవర్మ ఆంధ్రదేశజులే. కావున ఆంధ్ర దేశము జైనాక్రాంతమై యుండెననుట సత్యము. ఆంధ్రజైనులును తమ తమిళ కన్నడ సోదరులవలె జనసామాన్యమునకు ధర్మోపదేశము సేయుటకు స్వభాషయగు నాంధ్ర మున గ్రంథములను రచించి యుండరనుట నమ్మదగని విషయము. ఆంధ్రమున క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దము ముగియుటకు పూర్వమే శాసనములను పద్యరూపమున రచించు నాచార మారంభమాయెను. కవనము జాతియందు చక్కగ నభివృద్ధి చెంది, కావ్యరచన సర్వసాధారణముగ నలవడినగాని శాసనములను పద్యరూపముగ విరచించుట సంభవింపదు. కావున నాంధ్రు లప్పటి కెన్నిశతాబ్దములకో పూర్వమే కవితానిర్మాణశక్తి గలిగియుందు రనుట సమంజసము. మఱియు ఆంధ్రదేశజులు అన్యభాషయందు ఉత్తమకావ్యములను రచించ గలిగినప్పుడు మాతృభాషయందు కవనము సెప్ప జాలకుండిరనియు, చెప్ప నుద్య మించి యుండరనియు దలచుట హాస్యాస్పదము. ఒకవేళ కర్ణాటకమున కవిత్వము సెప్పు ఆంధ్రదేశజులు మాతృభాషపై ననాదరము చూపి యుండవచ్చునని యూహించినను, వారిని జూచియైనను స్వభాషాభిమానులగు కొందఱేనియు కావ్యరచనకు గడగకుండిరనుట యుక్తము గాదు.

౨

ఇప్పటికిని కొన్ని జైనగ్రంథముల పరిశిష్టములు మన వాఙ్మయమున మారు మూలలయందు అగపడుచున్నవి. ఇటీవల లభ్యమైన పెదపాటి జగన్నాథకవియొక్క ప్రబంధరత్నాకరము, అజ్ఞాతుడగు వేరొక కవియొక్క 'ఉదాహరణపద్యములు' అను సంకలన గ్రంథములయందు కొందఱు పురాతనులగు కవులు పేర్కొనబడియున్నారు. పై సంకలన గ్రంథకర్త లిరువురును క్రీ. శ. ౧౭ వ శతాబ్దియందలివారని పండితుల యభిప్రాయము. ఇందు 'ఉదాహరణపద్యముల'ను గూర్చినకవి 'సర్వదేవుడు', 'పద్మకవి' యను నిద్దరు జైనకవుల గ్రంథములనుండి పద్యముల నుదాహరించియున్నాడు. సర్వ దేవుడు 'ఆదిపురాణము', 'విరాటము' అను గ్రంథములను, పద్మకవి 'జినేంద్రపురాణ ము'ను విరచించినట్లు దెలియవచ్చుచున్నది. ఈ గ్రంథకర్త లెప్పటివారో కనుగొనవలసి యున్నది.

సర్వదేవుని 'ఆదిపురాణము'లోనిదని యుదాహరింపబడిన పద్య మిది:—

మ. సరసీజాత విరాగకారి పురయోషావక్త్రహృద్ద్యుతి సుం
దరకాంతిన్ దఱిఁగించుఁ బో యని మదిం దర్కించి దోషాకరున్
బుర ముద్దండకరంబు లెత్తి చఱవం బొత్తై నయట్లొప్పు ను
ద్ధుర సౌధాగ్రనిబద్ధకేతువు మహాదోలాభిరామంబుగన్.

# సర్వదేవుడు

'విరాటము' లోనిది:—

సీ. ఇక్షురసాబ్ధి నీ రెట్టిదో యని మది నూహించి యువ్విళు లూరకుండ
విరసంపు ముదిమికిఁ బరిహారంబగు రసాయనమునీఁదికిఁ జిత్త మరుగకుండఁ
దివిరిదేహము దిధించు సిద్ధరసంబు (?) కందువ యచ్చోటి కందకుండ
నాయులఁ జిరతరస్థాయిగాఁ జేయు సుధారసంబున వేడ్క దగలకుండ
గీ. నఖిల జనులకుఁ బంకేరుహాసనుండు। నేర్చి యన్నింటి రుచు లొడఁగూర్చి తెచ్చి
సంచితంబులుగా సంగ్రహించె ననఁగ। భరితజలములై పురసరోవరము లొప్పు.

ఈ పద్యములను జూచి ఇవి 'ప్రాచీనతర రచనముగాఁ దోఁపకున్నది' అని బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారు తమ ప్రబంధరత్నావళియందు చెప్పియున్నారు; కాని శైలి ననుసరించి కవికాలమును స్థూలముగనైనను నిర్ణయించుటకు రెండుపద్యములు తగిన సామగ్రి కాదని నానమ్మకము. ప్రాచీనతమ ఆంధ్రవాఙ్మయస్వరూప మిట్టిదని నిర్ధారించుటకు మనకు గ్రంథసామగ్రి లేదు. మనకు లభ్యమైన యాంధ్రవాఙ్మయమున కంతటికిని ప్రాచీనతమగ్రంథము నన్నయభట్టు భారతమే—కాని ఇది యాంధ్రమున ప్రథమకావ్యము గాదు. నన్నయనాటికి ఆంధ్రకవిత్వము చక్కగ పెరిగి వికసించినది. తత్పూర్వమున ఆంధ్రమున కావ్యరచన చక్కగ నలవడి యుండవలయును. కావున నన్నయకు పూర్వపు గ్రంథములు కొన్నియేనియు లభించిన గాని తత్కాలపు టాంధ్రకవిత్వవైఖరి ఇట్టిదని నిర్ణయించుటకు వీలుగాదు.

'ఆదిపురాణ' 'విరాటము'లను రచించిన సర్వదేవుడు కడు ప్రాచీనుడని తలచెదను. అతడు క్రీ. శ. ౧౦ వ శతాబ్దమున, అనగా నన్నయ భట్టుకంటె ఒకశతాబ్దము పూర్వమున నుండెనని నా నమ్మకము. ఈ నమ్మకమునకు బీజము కర్ణాటక వాఙ్మయమునందు లభించినది. కర్ణాటక కవులయందు పొన్నడను మహాకవి యొక్కడు కలడు. అతడు 'శాంతిపురాణ'మను జైనపురాణమును మల్లప, పొన్నమయ్యల ప్రోత్సాహముచే రచించెను. వీరు ఆంధ్రులు. అనగా ఆంధ్రదేశము వీరి జన్మభూమి. పొన్నడు వీరిజన్మభూమి నిట్లు వర్ణించియున్నాడు:

క. ఆతందెయ భక్తన వి। ద్యాతిశయ మహానిధాన నన్వయ ముపమా
తీతమదం పేట్వోం వి। ఖ్యాత మదెంతెం దొడుంటు వెంగీ విషయం.

క. వెంగీ విషయుం త్రైభువ। నంగళొళగ్గళద విషయ ముపమాతీతం
సంగత సమస్త మత్యు। త్తుంగఫలద్రుమ మమూల్యవస్తు నిధానం.

ఉ. ఆధరణీవధూతిళక మాధరణీ లలనాముఖాబ్జమం
తాధరణీ రమైకనవయౌవన మాధరణీ ప్రియాకటా
క్షాదర విభ్రమభ్రమణ మగ్గళదగ్గదె కమ్మెనాడు వి
ద్యాధర లోకమేనదఱ పోల్వెగ బర్ణనెమె సోలదిర్ణనెమే.

ఇందువల్ల శాంతిపురాణ కృతిపతులగు మల్లపయ్య పొన్నమయ్యల జన్మస్థానము వెంగీ విషయములోని కమ్మనాడని తెలియుచున్నది. మఱియు, కమ్మనాటిలోని పుంగునూరు వారి నిజగ్రామమని 'పుట్టిదుదుపుంగనూరు' అను పద్యమువల్ల వ్యక్తమగుచున్నది. మల్లపయ్య పొన్నమయ్యల యాదేశముపై శాంతిపురాణమును విరచించిన పొన్నకవియు అచ్చటివాడెయని యూహింపవచ్చును.

పొన్నకవికి పెక్కునామము లుండిన ట్లాతని గ్రంధమువలన దెలియుచున్నది. అందు ముఖ్యమైనవి పొన్నం, పొన్నిగం, సవణం, కురుళ్గళసవణం అనునవి. మఱియు నితనికి 'ఉభయకవిచక్రవర్తి' యను బిరుదుగూడ నుండెను. ఇవి కాక, 'సర్వదేవు'డను నామము గూడ నీతని కుండినట్లు శాంతిపురాణములోని కడపటి పద్యమువల్ల తెలియుచున్నది.

> మ. సకలజ్ఞం కవిచక్రవర్తి జినచంద్రేంద్రంగె సద్భక్తిపూ
> ర్వకదిందమ్మన భక్తనుం తదనుజాతం పున్ననుం పేళ్వుదెం
> దుకరం ప్రార్థిసె శాంతినాథకథెయుం లేసప్పినం సర్వదే
> వకవీంద్రం బరెదం బుధర్ పొగళ్వినం తన్నం మహోత్సాహదిం.

కావున పొన్ననికి సర్వదేవుడను పేరుండుట నిశ్చయము. పొన్నడను నామాంతరము గల ఈ సర్వదేవుడే 'ఆదిపురాణము'ను దెనుగున రచించిన సర్వదేవుడని నాతలపు. పొన్నడు వేంగీవిషయాంతర్గతంబగు కమ్మనాటివాడగు జైనకవి. సర్వదేవుడను పేరు గల్గినవాడు. సర్వదేవుడు తెలుగున జైనపురాణమును వ్రాసిన జైనకవి. ఇద్దఱికిని పేరొక్కటే. దేశ మొక్కటే. మత మొక్కటే. ఇద్దఱును కవులు. ఇప్పటికి నాతలపున కాధార మింతియ. భావిపరిశోధన నానమ్మకమును దృఢపఱచగలదని ధైర్యము కలదు.

సర్వదేవనామధారియగు పొన్నడే 'ఆదిపురాణ' 'విరాటము'లను రచియించిన సర్వదేవకవి యగునేని, ఆత డెప్పటివాడగునో కొంచెము విచారించుట యవసరము. పొన్ననికాలము మనకు దెలియును. ఇతడు రాష్ట్రకూటవంశజుడగు మూడవ కృష్ణచక్రవర్తిని తన కవితావిభవముచే మెప్పించి, 'ఉభయకవి చక్రవర్తి'యను బిరుదును బడసెను.

> క. భువనద కన్నడ సక్కద। గవిగళ్ సలెసాలెసోలె సవణం గిత్తం
> సవివేక ముభయకవి చ। క్రవర్తిపెసరం నిజాహితోష్ణం కృష్ణం.

కృష్ణుడు క్రీ. శ. ౯౩౯ మొదలుకొని ౯౬౮ వఱకు రాజ్యముజేసెను. కావున పొన్నడును అప్పటివాడే. పొన్నడు, సర్వదేవుడు అనునవి యొక్కని పేర్లగుటచేత 'ఆదిపురాణ' 'విరాటము'ల రచయితయు నప్పటివాడే. ఇందువల్ల సర్వదేవుడు నన్నయకు పూర్వము రమారమి నూరుసంవత్సరముల నాటివాడని తేలుచున్నది.

# దృక్పథం

## 'గిరి'

### ౧

వొక్కటే వర్షం. ఉదయం ఆరుగంటలకి డి. పి. ఐ. దర్శనార్థం శేఖరం బైల్దేరిన అర్థగంటకి ఆరంభమైనవర్షం ధారాపాతంగా కురుస్తోంది. వానాకాలం సాంతంలో కురువాల్సిన వర్షమంతా ఆనాడే కురువాలన్నట్టు నల్లని మేఘాలన్నీ వొక్కటై ఆకాశమంతా కమ్మాయి భయంకరంగా. కళ్లని మిరిమిట్లుగొలిపేటట్టు మెరుపులు. పిడుగు ఆయింటి మీాదనే పడేటట్టు ఉరుములు.

ఎడమభుజంమీాదినుంచి ముందుకు లాక్కున్నజడని రెండుచేతుల్తో అల్లుకుంటో పద్మ తలుపు నానుకొని శేఖరం వెళ్లినవేపు వీధి చివరదాకా చూపు ఆనించిచూస్తోంది. వాన జల్లుచేత తడిసిన ఆ కడపపసుపు ఆమె కమలంవన్నె కాలుకీ, ఆ తెల్లనిచీర ఆకుపచ్చ అంచుకీ అంటుతోంది. అప్పుడప్పుడు వీచేగాలికి జల్లు విసిరి ముందుకి జాచిన ఆమెముఖాన్ని, రాగివన్నె వెంట్రుకల్ని తడుపుతోంది. ఇంచుమించు నిర్మానుష్యంగా వుంది వీధి. చింత చెట్టు మొదట ఆవొహాటి కళ్లు మూాసుకొని తడుస్తోనుంచుంది. పిల్లల్ని బడికి తీసికెళ్లటానికి సుందర్రావుగారి బంగళాముందు కారు నుంచుంది. శేఖరం తడిసిముద్దయి వొస్తాడు. మొన్ననే జబ్బుపడి లేచినప్రకృతి. చప్పున వెనక్కితిరిగింది పద్మ. దేహాన్ని వొక్కవూపు వూపి నీలాంబరిలో పాట అందుకుంది. గొంతెత్తి ఆరంభించింది. కాని ఆపాట తనచెవులకే అంత యింపుగా తోచలేదు. త్రాటిమీాదినుంచి చినిగి పేలికైన నీలిరవికెను లాగి వొహపేలికని జాగ్రతగా చింపి జడచివరన ముద్దుగా కట్టుకుంది. కిటికీకింద చాపమీాద బోర్లింతగా పడుకొని చేతుల్లో ముఖం యెత్తి ఆనించి దీర్ఘంగా ఆలోచిస్తోన్నాడు రాము. ఈ పన్నెండేండ్ల కుఱ్ఱకి యెప్పుడూ యింత ఆలోచనగా వుండే ప్రకృతి యేమిటని యెన్నో తడవల తట్టింది పద్మకి. నవ్వటం గాని తోడిపిల్లల్తో గంతులువేయటం గాని యీాతని జీవితానికి చాలా దూరం. పద్మకూడా అదే చాపమీాద ఆతనిపక్కన బోర్లింతగా పడుకొని ఆతని మల్లేనే చేతుల్లో ముఖం యెత్తివుంచి కనుబొమలు పైకి లేపి దీర్ఘంగా ఆలోచిస్తోన్నట్టు నటించింది. రాము యిటు తిరిగి చూడటంతోటే పెద్దనవ్వుతో చప్పున ఆతన్ని దెగ్గిరకి లాక్కుంది.

"ఏమిటి రామూ ఆలోచిస్తోన్నావు అంతదీర్ఘంగా?"

"బడివేళైంది యింకా నాన్న రాలేదే మమ్మా?"

"రావాలి యిప్పుడే."

"ఈవాళ పదిహేను. ఈవాళ జీతం యివ్వకపోతే పేరు కొట్టేస్తారు."

నవ్వుతో వ్యూరికే చూసింది. రాము ఆమె జడకుచ్చుని చేతుల్లో తనకి తెలీకుండానే తిప్పుతోన్నాడు.

"తడిసి వొస్తారుకదూ నాన్న ?"

"తడవరు మరి !"

"కారు లేకపోతే బైట అడుగు వేయగూడదమ్మా అసలు."

"అందరికీ యెక్కడినుంచి వొస్తాయి బాబు కార్లు ?"

"కష్టపడి సంపాదించుకోవాలి."

"అందరి కోరికలూ యీడేర్తాయంటే అర్థశూన్యం కాదూ ?"

రాము మాట్లాళ్లేదు. పద్మ తనవేళ్లతో ఆతనికి పాపట తీస్తో, "ఎట్లా వెడ్తావు బడికి యీవానలో ?"

"నా గీతల పాతచొక్కా లేదు, అది తొడుక్కొని వొక్కటే పరుగు."

"ఏం, సుందర్రావుగారి పిల్లల్తో వెళ్లగూడదూ వాళ్లకార్లో ? రమ్మంటారు గూడా కదూ పాపం !"

"నేను వెళ్లను వాళ్లతో."

"ఏం ?"

"ఆ మెత్తలూ అవీ పెట్టి హాయిగా కూచొని ఆమిగిలిన స్థలంలో కుక్కని కూచో పెడ్తారు. నన్ను నుంచోమంటారు. లేదా కింద కూచోమంటారు. వొళ్లు మండుతుంది. తడిసినా నడిచే వెళ్లటం నయం, వొహరికి లోకువగాకుండా."

లోపలి తలుపులోంచి శశి వొచ్చింది, బత్తలా యెడమచేత్తో తడిసిన చొక్కాని యీడుస్తో.

"అయ్యో, ఆవొక్కచొక్కా తడిపావుటే ?"

"చెల్లె యేలుత్తోందే."

పద్మ లేచి నవ్వుతో శశిచేతులోని చొక్కా లాక్కుంది. లోపలికి వెళ్లింది. బుజ్జి పడుకున్నచోట బుజ్జి కాళ్లమీదే కురుస్తోంది. పక్కంతా తడిసింది. వొళ్లు ముట్టి చూసింది. జ్వరం యింకా తగ్గలేదు. బుజ్జిని వొళ్లోకి యెత్తుకుంది. పైట తొలిగించింది. రవికె గుండీ తీసి రొమ్ము అందించింది ఆ గులాబినోటికి.

౨

శేఖరం నీళ్ళు వొడిసేకోటునీ, చొక్కానీ విప్పి తలుపుపక్కన మేకుకి తగిలించాడు. తడి అద్దుకోటానికి తుండు అందించింది పద్మ. పెట్టెలోంచి వెచ్చని ధోతీ చొక్కా తీసింది. ధోతి మారుస్తోన్నాడు శేఖరం. శశి నోట్లో వేలు పెట్టుకొని శేఖరానికేసి నిర్ఘాంతపోయి చూస్తోంది.

"నాన్న చొక్కా తలుపుతే యేమీా అందు. నన్నైతే తిట్తుంది."

పద్మ కళ్లు పెద్దగా విప్పి మూసిన పెదిమలమీాద వేలు పెట్టి అరవొద్దని సంజ్ఞ చేసింది. రాము గ్రహించి చెయ్యి పట్టుకొని లోపలికి తీసికెళ్లాడు శశిని. శేఖరం ధోతి కట్టుకొని చొక్కాగడె విప్పి తొడుక్కోబోయాడు. చినిగినభుజం అవుపడ్డది. పళ్లు బిగపట్టి నేలకి విసిరాడు చొక్కాని. చాపమీాద గోడకి వొరిగి చతికలపడ్డాడు. మళ్లీ పెట్టె తెరిచింది పద్మ. గుడ్డలన్నీ కిందుమీాదుచేసి చూసింది. ఉంకోచొక్కా లేదు. ఆచొక్కానే యెత్తి దులిపి శేఖరంపక్కన వొచ్చి కూచుంది.

"తొడుక్కోవమ్మా! కాస్సేపై నాక కుట్టేస్తాలే."

తొడిగింది. ఆతన్ని కాస్తముందుకి జరిపి వీపులో సరిచేసింది చొక్కాని. తలుపులో నుంచొని విచారంతో చూస్తోన్న రాముని పక్కకి నెట్టి మెరుపులా వెళ్లింది లోపలికి. బ్లాంకెటు తెచ్చి కొనలచింపు అవుపడకుండా కాళ్లమీాద కప్పింది. కుంపట్లో నిప్పు సరిచేసి దగ్గిరగా పెట్టింది. దువ్వెన తెచ్చి పాపట తీసి తల దువ్వింది. నోట్లో సిగరేటు పెట్టి వెలిగించటానికి పుల్ల గీరింది. ఆతను తల ముందుకి వొంచటంతోటే శ్వాసతో ఆర్పింది. మళ్లీ గీరింది. మళ్లీ ఆర్పింది, కొంటెగా. కిలకిలా నవ్వింది.

శేఖరం ఆమె రెండు రెట్టల్నీ పట్టుకొని బ్లాంకెటుమీాదికి వొరిగించుకున్నాడు. రెండుచేతుల్తో ఆమె వికసించినముఖాన్ని పట్టుకున్నాడు.

"నీకు విసుగంటే తెలీదుకదూ పద్మ?"

"ఉహూ."

అట్లాగే చూసాడు.

"డి. పీ. ఐ. మృగంలా ప్రవర్తించాడు కదూ?"

కొంచెం చెదరిపోయిన విషాదం మళ్ళీ ఆవరించింది ఆముఖాన్ని. ఉద్రేకుడయ్యాడు.

"ఎవరో అనుకున్నా. అతను బీ. ఏ. లో నా క్లాసుమేటు."

"నయమే కా మరి?"

ఎరిగినవాళ్లని, వొహనాడు మనని యాచించినవాళ్ళని యాంచించటంకన్న నరకం వేరుండదు. నాతో తన్నులు తిని నానోట్కోసం ప్రాధేయపడ్డవాడు. మనసులోని అస హ్యాన్ని వ్యక్తపరుస్తో, బూటకపుమర్యాదతో, "సారీ" అంటే, "థ్యాంక్సు" అనటం కన్న హీనం........"

"అబ్బా, పోనీద్దూ వెధవది. ఈకుళ్లు ప్రపంచం మనకోసం కాదు."

ఆతని తలని తనవేపు లాక్కుంది.

## 3

రాత్రి తొమ్మిదైంది. జ్వరం యెక్కువైంది బుజ్జికి. స్పృహకూడా తప్పిపోతోంది అప్పుడప్పుడు. శశి రెండుమెతుకులు తిన్నది. రాము తిన నన్నాడు. ఎంతో బలవంతపెట్టింది పద్మ. తాను తింటానని లేచింది. శేఖరం బెదిరించాడు కూడా. అయినా రాము తినలేదు. డాక్టరుదెగ్గిరి కెళ్లాడు శేఖరం. పాలవాడు వొచ్చాదు. పాతలెక్కంతా యిస్తే కాని పాలు పోయ నన్నాడు. మూడునాలుగు రోజుల్లో డబ్బు యిస్తాననీ, బుజ్జికి జబ్బుగా వున్నదనీ అనేక విధాల ఆతిశాంతంగా నచ్చచెప్పింది పద్మ. ఎట్లాగో మూడురోజులుమాత్రం ఆగుతా నన్నాడు.

"డబ్బు లేకపోతే యెందుకమ్మా పాలు తీసుకోటం, ఆతిట్లు తినటం, ఆబతిమాలటం అదీనూ ?"

ముఖమంతా చిన్నబుచ్చుకొని బాధపడ్తో మూలకి కూచున్న రాముని చూసింది.

"మరి యీ బుజ్జి యెట్లా బతకటం బాబూ ?"

"ఈ బుజ్జీ, మేము, లేకపోతే యీఅవస్థలు తప్పేవికదూ ? సాకటం చేతకాకపోతే యెందుకు కంటారమ్మ పిల్లల్ని ?"

నవ్వింది. "మాకున్నవాట్లో మీకోసం అవస్థలు అట్టే యెక్కువ కావు. కాని మీరు లేకపోతేమాత్రం సుఖం వూచీ యేమిటి ! పిల్లలులేని తల్లిహృదయానికి తెలుసు ఆసుఖం !"

శశి పక్కమీద పడుకొని చిన్నమెత్తని తన చొక్కాలోకి దూర్చుకొని పాలు కుడు పుతో యెంతో ఆదరంగా, "ఏలకమ్మా, యేలకూ; ఓ ఓ ఆయీ" అని రాగంతీస్తో పద్మని అనుకరిస్తోంది. పెద్దతుఫానుగాలికి పిల్లవేపచెట్టు వూగినట్టు వెనక్కీ ముందుకీ వూగుతో గలగల నవ్వింది పద్మ.

"చూడు, మీరు లేకపోతే యీమెరుపులుగూడా యీనిశీథజీవితానికి శూన్యం."

"ఏవొక్కరో వుంటే తీపిగా పెంచి మురిసిపోవొచ్చు."

"ఆవొక్కడూ మూర్ఖుడయితే ?"

"మరి పదిమందిలో తొమ్మండ్రుగురు మూర్ఖులే తేల్తే?"

"ఆ వొక్కడు చాలు."

శేఖరం వొచ్చాడు. ముఖం చిన్నబుచ్చుకున్నాడు.

"ఏమిటి శేఖరం, డాక్టరుగారు లేరా యింట్లో?"

"రాలేదు. మం దిచ్చాడు గంటగంటకి యివ్వమని."

"ఇచ్చాడు గదా! చిన్నబోయా వెందుకు మరి ?"

భుజాలమీద చేతులేసి దగ్గిరగా నుంచుంది నవ్వుముఖంతో.

"నాకు తెలుసు, ఫీసునమ్మకం లేక వేరేవిసిట్సు వున్నాయని బొంకాడు గోపాలం."

"పోనీలే, సాయంత్రమేకదూ చూసాడు ?"

మందు యిచ్చారు బుజ్జికి. ఉష్ణం చూసారు. తక్కిన పిల్లల్ని నిద్రబుచ్చారు. శేఖరాన్ని నిద్రపొమ్మని బలవంతపెట్టింది పద్మ. కాని యెవరికీ నిద్ర పట్టలేదు. దీపం తగ్గించి బుజ్జి దగ్గిరే పక్కమీద అడ్డంవొరిగి యేమేమిటో మాట్లాడుకుంటోన్నారు. మార్కెటు గడియారం గంటలు కొట్టినప్పుడల్లా పద్మ లేచి దీపం యెక్కించి మందు యిస్తుంది. వొళ్లు ముట్టి చూసి బ్లాంకెటు సరిచేస్తుంది. మళ్లీ దీపం తగ్గించి శేఖరందగ్గిరగా కూచుంటుంది.

పద్మ వొచ్చి తనకి వొరిగి కూచోటంతోటే ఆమెనడుంచుట్టూ చెయ్యి వేసాడు శేఖరం. దగ్గిరికి లాక్కున్నాడు. ఆమె వెచ్చనిశరీరం పులకరింపజేసింది. కొంచెం బెదురుతో చేతిని తీసివేసుకున్నాడు.

"ఏమిటి, మళ్లీనా ?"

ఆ మసక చీకట్లో ఆతని ముఖానికి ముఖం ఆనించి ఆనందంతో ఆతని కళ్లల్లోకి చూసింది పద్మ.

"అనుమానంగానే వుంది."

"ఈ ముగ్గురితోనే యేగలేకపోతే !"

ఆతనిచెంపని తనచేత్తో నిమర్తో భుజంమీద తల ఆనించి ఆతనిమెడకి దగ్గిరగా అంది.

"అట్లా విసుక్కోకూడదమ్మా. విసుగే బాధ. ఏమైనా విసుక్కోటం మానెయ్యి, బాధే వుండదు."

ఆతనికి దగ్గిరగా జరిగింది.

నాలుగు కొట్టింది గడియారం. పద్మ లేచి దీపం వెక్కించింది. రాము గోడకి వారిగి కూచుని చూస్తోన్నాడు.

"ఎందు కట్లా కూచున్నావు రాము మేకులాగా ?"

"అప్పణ్ణుంచీ మనమాటలు వింటో కూచున్నాడు వెధవ. పడుకో" అని మోచేతి మీద లేచి గద్దించాడు శేఖరం. రాము అక్కడే వారిగి రెండుచేతుల్తో ముఖం కప్పుకున్నాడు.

ఆరుగంట లైంది. బుజ్జికి మందు యిచ్చింది పద్మ. జ్వరం తగ్గింది. ఇహ ఫరవా లేదు, గండం తప్పిం దంది. అయినా వోహసారి డాక్టరుకి చూపెట్టటం మంచిది, తీసుకోవొస్తానని వెళ్ళాడు శేఖరం. శశీ రాము పడుకున్నారు. తలుపు దెగ్గిరేసి దొడ్లో కెళ్ళింది తల్లి.

కెవ్వుమని శశి కేక వినపడ్డది. ఏమైందో అని బెదిరింది పద్మ కాస్త. కాని మళ్లీ యేదు పూ అదీ వినపడకపోవటంచేత కుదుటపడ్డది కాస్త. వొక్కనిమిషం తరువాత తలుపు తెరిచిన చప్పుడైంది. వెంటనే, "పద్మా, పద్మా" అని శేఖరంఅరుపు యేడుపుస్వరంతో వినపడ్డది. వెంటనే పరుగెత్తింది పద్మ. తలుపుదెగ్గిరే ఆమెని అమాంతం కౌగలించుకొని, "పద్మా"అని అరిచాడు. అతని భుజంమీదుగా గదిలోకి చూసింది.

"నాకు వీధిలోంచే అవుపడ్డా డా వెధవ కిటికీలోంచి, తాడు తగిలించుకొని దూకటం. అంతా రెప్పపాటులో అయిపోయింది."

పక్కచుట్టకి కట్టేతాటితో దూలానికి వేళ్ళాడపడ్డాడు రాము. కింద పడుకున్నచోటే గుడ్లు తేలేసి నాలిక బైటికి తీసి పడుంది శశి. ఏబాధా లేక శాంతంగా పక్కమీద పడివుంది బుజ్జి.

అక్కడే నుంచుంది పద్మ. నేలవేపు చూస్తోంది. కుడిచెంపమీద నవ్వు.

"పిరికి ప్రాణాలు. ప్రపంచమే బ్రతుక్కి భయపడిపోతోంది అసలు స్వార్థంవల్ల."

# వాఙ్మయవీథి

జగత్కథ. (హెచ్. జి. వెల్సుగారి గ్రంథమున కనువాదము.) కొమాండూరు శఠకోపాచార్యులు, ఎమ్. ఏ., బి. ఎల్. ఉపోద్ఘాతము డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణ గారు, డి. లిట్. 40 + 760. ప్రకాశకుడు కొ. శఠకోపాచార్యులు, కాకినాడ. 1935. వెల రు 3.

ఈపుస్తకము నిదివరకే లక్షలకొలది జనులు పాశ్చాత్యదేశములందు చదివియే యున్నారు. వెల్సుగారు సుప్రసిద్ధగ్రంథకర్తలు. వీరు ఆంగ్లమునందు ఎన్నియో నవలలను ఇతరపుస్తకములను వ్రాసియున్నారు. వీరి అపూర్వకథలను కొన్నిటిని సినిమారూపముగ గూడ ప్రదర్శించియున్నారు. వెల్సుగారు తమ మేధాచాతుర్యముచే ప్రపంచమునందలి భావి పరిస్థితులను ఎన్నియోమార్లు ఊహించి తమయూహలను గ్రంథరూపముగను వార్తాపత్రికలందును తెలియజేసియున్నారు. కొన్నిమార్లు అతనియూహలు నిజమైనవి. కొన్నిమార్లు అబద్ధమైనవిగూడ. కాని వెల్సుమాత్రము పాశ్చాత్యదేశములందు భవిష్యద్వృత్తాంతములను తెలిసికొనగల ద్రష్ట (seer or prophet) అని ప్రసిద్ధిజెందియున్నారు. కాననే అతనే విషయమునుగూర్చి పరిశోధించి వ్రాసినను తా నిదివరకే వ్రాసినవిషయముల కనుగుణముగ నుండునట్లే యోచించి వ్రాయును. అప్పుడప్పుడు వెల్సు తన యభిప్రాయములను మార్చుకొనవలసివచ్చినది. ఐనను వెల్సు పరిశోధనయందంతయు అతని ప్రత్యేక ఇష్టానిష్టములును, అభిప్రాయములును అతని సౌమనస్యమునకును, నిష్పక్షపాత బుద్ధికిని, న్యాయజిజ్ఞాసకును ప్రతిబంధములుగ నేర్పడుచుండును.

ఈ ముఖ్యాంశమును గమనించిన గాని చదువరి గొప్ప పొరపాటునకు లోనగును. ఈ తెలుగు అనువాదమునకై ప్రత్యేకముగ వ్రాసిన యుపోద్ఘాతమునందు శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణగారు వెల్సుగారి గ్రంథ ప్రాముఖ్యమును గొనియాడిరి. గాని వారు పైవిషయమును గమనించిన ట్లగపడదు. "ఆధునిక ప్రజాపరిపాలనములందు గ్రంథపఠన మలవడినంత విరివిగా ఆలోచనాశక్తి వ్యాపించుటలేదు. అట్టితరి మన ప్రజాపాలకులకు సదోధ్బదజేయ యత్నించువారియెడ సానుభూతి జూపవలెను" అని శ్రీ రాధాకృష్ణగారు తమ ఉపోద్ఘాతమునందు సెలవిచ్చియున్నారు. గాని ఈగ్రంథము ఆలోచనాశక్తిని పెంపొందించుటకు మారు వెల్సుగారి యభిప్రాయములనే ప్రమాణవాక్యములుగ ఘోషించుచున్నది. ఇక సదోధ్బధనుగూర్చి రెండు ప్రత్యేకాభిప్రాయములు గలవు. మొదటిది విషయకథనము. రెండవది స్వకీయాభిప్రాయ ప్రదర్శనము. ఈ రెంటిలో ఏఒక పద్ధతిని గాని లేక రెండుపద్ధతులను గాని అవలంబింప వచ్చును గాని పాఠకునికి విషయము (facts) ఏదో స్వీయాభిప్రాయ మేదో నిస్సందిగ్ధముగ తెలియజేయవలెను. స్వీయాభిప్రాయ ప్రదర్శనమునకన్న నిష్పక్షపాతముగ విషయకథనము జేయుటయే ఉత్తమమార్గ మైనను, వెల్సువంటి మహాశయుని నిజాభిప్రాయములుగూడ ప్రాముఖ్యముకలవే యనవచ్చును. కాని స్వకీయాభిప్రాయముల కనుకూలముగ విషయకథనమును మార్చి పాఠకులకు స్వాభిప్రాయములనే నిష్పక్షపాత విషయకథనముగ జెప్పుట అసమంజసము. వెల్సుగారు ఆంగ్ల

దేశీయులు. జాతిచేతను, కులముచేతను, విద్యావైఖరిచేతను, చిన్ననా డనుభవించిన కష్టములచేతను పరిణామము జెంది వికసించిన అతని మనోభావములకును హిందూదేశీయుల మనోభావములకును సంబంధ మత్యల్పము. ఐనను శ్రీ రాధాకృష్ణగారు తమ యుపోద్ఘాతమునందు విశదీకరించినట్లు వెల్సు ఈగ్రంథమున నిజముగనే ప్రాపంచిక పరిణామమునందలి "విశేషమును, తదర్థమును, అందలి శాశ్వత చిహ్నమును" గమ పరచుటకు ప్రయత్నించియుండినచో ఈపుస్తకము అత్యంతోపయోగకరమని ఘంటాపథముగ జెప్పుటకు అవకాశ ముండెడిది, గాని వెల్సు అట్లు చేయలేదు. అందుకు బదులు శ్రీ రాధాకృష్ణగారే తెల్పినట్లు ఒక అపూర్వమైన ఊహపై నాధారముజేసి వెల్సుగా రీగ్రంథమును వ్రాసియున్నారు. "ప్రపంచమంతట నొకే ప్రజారాజ్య నిర్మాణమును, అంతర్జాతీయ సంఘస్థాపనయు ఇతిహాసభావనని వెల్సుగారి యూహ." ఈయూహకు ప్రపంచచరిత్రమునందు సహకారములగు విషయములు చాలకొద్దియే. ప్రతిబంధకములగు విషయములుమాత్రము అసంఖ్యాకములు. అదియే గాక 'విశ్వజనీనభావమును', 'జగదాత్మకత్వమును' వ్యాప్తి నొందించుటకు ప్రపంచమందంతటను ఒకే ప్రజారాజ్యమును నిర్మాణముజేయుట యొక్కటే మార్గమని చెప్పుటకు వీలుగాదు. అట్టిచో ఈగ్రంథము 'విశ్వజనీనభావమును,' 'జగదాత్మకత్వమును' వ్యాప్తినొందించుటకు 'సహకారియైన'దని శ్రీ రాధాకృష్ణగారు వ్రాయుట కొంత యతిశయోక్తియని తోచకమానదు.

వెల్సుగారికి చరిత్రయననేమో సరిగ అర్థమైనటుల దోచదు. తమ యభిప్రాయములను బలపరచుటకై చేసిన propaganda ప్రయత్నములలో నిదియు ఒకటియని తలచినచో ఈగ్రంథపు అంతరార్థము వ్యక్తమగును. మానవవికాసమునుగూర్చి భౌతికాదిశాస్త్ర, చరిత్రగ్రంథములనుండి తెలియవచ్చు విషయములు వెల్సుగారు సరిగా ఈగ్రంథమున జెప్పినట్లున్నవని తలంచుట గొప్ప పొరపాటు. రాజ్యతంత్రశాస్త్రము కొలది కాలము క్రిందటనే మానవాభిప్రాయములలో ప్రాముఖ్యమందినది. ఆ ప్రాముఖ్యము నానాటికి తగ్గి నేడు పారిశ్రామిక వ్యాపారవిషయములపై మానవదృష్టి కేంద్రీకృతమగుచున్నది. మతాభినిరతియు, ఆహారావశ్యకతయు రాజ్యతంత్రశాస్త్రమునకన్న మానవచరిత్రమునం దెక్కువ ప్రాముఖ్యము బడసినవని యంద రెరింగినదే. మానవచరిత్రమున భిన్నయుగములందు భిన్నభూభాగములు ఉచ్చస్థితియందుండి మరల అడుగంటినవి. కాని మానవుడుమాత్రము చారిత్రికముగ పరిశీలించినచో ఒక పథకమననుసరించి ముందునకు బోవుచునేయున్నాడని నొక్కి చెప్పవలెను. నేటి యన్యాయములను జూచి, మానవుడు ముందునకు బోవుటలేదనియు వెనుకకు బోవుచున్నాడనియు కొందరు వాదించవచ్చును. గాని మతమునకై నేడు మనల మంటల మాడ్తురా? అప్పుల పాలైనవారిని బానిసలగ జేసికొందురా? జనసామాన్యమునకు నే డెక్కువ అనుకూలపరిస్థితులు, స్వాతంత్ర్యము ఏర్పడలేదా? ఈపథకము సరియైనదా కాదా యని మన మిట చర్చించబనిలేదు. కాని ఈపథక మెద్ది, కాలానుగుణముగ ఈపథక మెట్టిమార్పులను చెందుచున్న దను నంశములను ప్రతివాడును గమనింపవలసినదే.

మానవపరిణామమందలి శాశ్వత చిహ్న మేది? మానవచరిత్రమును ముందుకు సాగించుచున్న విశిష్ట విషయ మేమి? వివిధదేశముల ఉచ్చనీచస్థితులకు ఏ విశేషాంశములు కారణము? మానవచరిత్రమునకు ప్రతి దేశమునందును ప్రతియుగమునందును సంభవించిన విశిష్టపరిణామ మేమి? ఏ మహదభిప్రాయములు ఆధునిక మానివవికాసమున ప్రాముఖ్యము నందియున్నవి? ఇవి ఎచ్చట ఎట్లు ప్రారంభించి వికాసము జెందెను. ఏఏ దేశము, ఏఏ జాతి ఎంతమట్టుకు ఆధునిక మానవ వికాసమునందు పాల్గొనియున్నవి? ఇవియే ప్రపంచచరిత్రము వంకు విశదీకరింపవలసిన ముఖ్యాంశములు. ప్రపంచచరిత్రమును నిష్పక్షపాతముగ జదివి విశేషముగ యోచిం

చిన గాని పైయంశములు సుబోధము గాజాలవు. అట్టి ప్రయత్నమునకు వలయునంత తీరిక గాని చారిత్రక జ్ఞానము గాని వెల్సుగారికి లేదు. ఒక్క యూరపుచరిత్రము దప్ప హిందూదేశచరిత్ర గాని చైనాదేశచరిత్ర గాని ఇతర ప్రాచీనచారిత్రక భాగములు గాని సమగ్రముగ వెల్సుగారికి దెలియవు. కాన వానియందలి ముఖ్యాంశములు వెల్సుగారికి గోచరించలేదు. అంతే గాక స్వకీయాభిప్రాయముల వెలుతురున ప్రాపంచిక చరిత్రమును పరిశీలించినందువలన భిన్నాభిప్రాయఆదర్శములు వారికి సరిగ బోధపడలేదు. కడకు ముఖ్యాంశముల నెన్నిటినో వదలి అప్రధానాంశములను ముందుకు దెచ్చిరి. ప్రపంచచరిత్రమున ఐదవఛార్లెస్ చక్రవర్తియొక్క తిండిపోతుతనము వర్ణింప నవసర మేమి ? తాను బ్రదికియుండగనే ఈపిచ్చిచక్రవర్తి తన ఉత్తరక్రియలను జేయించికొనెనట: ఈ ప్రసంగము ప్రపంచచరిత్రమున కెట్లు ప్రధానము ?

1920 వ సంవత్సరమున కొందరు విద్వాంసుల ప్రేరేపణపై వెల్సుగారు తమ 'ఔట్‌లైన్ ఆఫ్ హిస్టరీ' (Outline of History) అను గ్రంథమును చిత్రపటములతో సహా ప్రచురించిరి. అందలి విషయములనే హ్రస్వముగ 'షార్ట్ హిస్టరీ ఆఫ్ ది వర్ల్డ్' (Short History of the World) అని మరల చిత్రములతో ప్రచురించిరి. ఈ చిన్నపుస్తకపుఅనువాదమే 'జగత్కథ'. వెల్సుగారి ఔట్‌లైన్ (Outline) నందున్న లోపము లన్నియు వారి షార్ట్ హిస్టరీ (Short History) యందు ఇంకను విశదముగ గాన్పించుచున్నవి. పాశ్చాత్యదేశములకు, అందున ఇంగ్లాండునకు అత్యంత ప్రాముఖ్యము నొసంగుటచేత హిందూదేశాది ఇతర దేశములను గూర్చి చర్చించుటకు తగినంత యవకాశము లేకపోయినది. చారిత్రకవిషయములు సుబోధము లగుటకు తమ 'ఔట్‌లైన్' (Outline)నం దొసంగిన జాబితాలును పట్టికలును ఇందున లేకుండుటచే పామర జనమునకు విషయము ఇంకను దురవగాహమైనది. కాని ఈ గ్రంథపు అవతారికయందు 'ఈ గ్రంథకర్త వ్రాసిన ఔట్‌లైన్ ఆఫ్ హిస్టరీ అను వివరములుగల విపులగ్రంథమును అభ్యసించుటకు ముందు పూర్వ ప్రయత్నముగ' ఉపయోగించుటకును, "ఔట్‌లైన్ లో వివరముగా నున్న చిత్రపటములను కాలవివరములను నేర్చుకొనుటకు తీరుబాటు లేక కార్యమగ్నులగువారు మానవజాతి మహాప్రవృత్తిని గూర్చిన మనోభావముల మరల జ్ఞప్తికి దెచ్చుకొనుటకును ఈ గ్రంథము ముఖ్యముగ నుద్దేశింపబడిన"దని వెల్సుగారు చెప్పినందువలన, ఆంగ్లజనసామాన్యమునకును, ఇంగ్లీషు తెలిసినవారికిని ఈ షార్ట్ హిస్టరీ (Short History) కొంత ఉపయోగమే. కాని తెలుగున ఇతని 'ఔట్‌లైన్' (Outline) లేకుండుటచే ఇందు వ్యంగ్యముగను సందేహాస్పదముగను ఉన్నవిషయములను తెలిసికొనుటకు ఇంగ్లీషు రానివారికి ఆస్పదము లేదు. అనువాదము చేయుటకు బదులు శఠకోపాచార్యులవారు ఈ గ్రంథముపై నాధారముచేసి ఇందలి సదేహాస్పదములగు విషయములను విశదీకరించియు, మన కప్రస్తుతములగు అంశములను సంగ్రహపరచియు, ఆంగ్లవిమర్శకులు ఇదివరకే చూపించిన ఇందలి దోషములను సవరించియు వేరొక ప్రత్యేకగ్రంథమును తయారుచేసి యుండినచో ఎంతయో బాగుండెడిది. అందునకు బదులు ప్రతిప్రకరణాంతమునందును హ్రస్వముగనో విపులముగనో తమ యభిప్రాయములను శఠకోపాచార్యులవారు తెలిపియుండినందువలన గ్రంథమునకు ఐక్యము చెడి జనసామాన్యమునకు ఆంగ్లగ్రంథమున నున్న ఆకర్షకతగూడ నశించినది.

తెలుగుగ్రంథమున చిత్రములు లేకుండుటయు ఒక గొప్పలోపమే. చిత్రపటములు లేకున్న ఇట్టి గ్రంథముల ప్రయోజన మత్యల్పము. తేజోమేఘమన నేమియో, అజీవయుగ పరిస్థితు లెట్లుండెనో, పురాణ

జీవయుగమునందలి శిలాధాతువు లెట్లున్నవో, కూర్మ్రయుగమునందు ప్రపంచ మెట్లుండెనో మున్నగు విషయములు చిత్రములు లేకున్నచో ఎట్లు అర్థమగును? వెల్సుగారు చిత్రములపైననే ఆధారపడి వానిని ఇనుమంతయు వర్ణించరైరి. అట్టిచో చిత్రములులేని ఈతెలుగు అనువాదమునందు వెల్సుగారి మాటలను ఉన్నవున్నట్టులుగ అనువాదము చేసినచో విషయ మెట్లు బోధపడును? కొన్నివిషయములు ఎంత వర్ణించినను చిత్రసహాయము లేక సుబోధములు గావు. 'గచ్ఛన్నరవానరము' (Pethecanthropus) ను చిత్రసహాయము లేక ఎట్లు వర్ణింపనగును?

వెల్సుగారు తమ ఔట్‌లైన్ (Outline) గ్రంథమును ప్రథమమున ప్రచురించినపుడు దానియందున్న దోషముల నెన్నిటినో విమర్శకులు చూపిరి. గొప్పవిమర్శకులును, విజ్ఞానకోవిదులును దానిని 'inaccurate, illogical, and warped by the author's predilleclions' అని ఖండించిరి. ఒకానొక గొప్ప విమర్శకుడు ఈ క్రిందివిధమున వ్రాసెను: 'The sad truth is that Mr. Wells knows no history, he does not.know what history is; and worse still, he does not know he knows nothing about sueh matters'. ఈగ్రంథమునందలి చారిత్రకదోషములను ఇట వివరించుటకు సాధ్యము గాదు. గాని వెల్సుగారు బుద్ధునిగూర్చియు అశోకునిగూర్చియు వ్రాసిన రెండుప్రకరణములను జదివినవారు మిగత ప్రకరణము లింకెట్లుండునో ఊహించుకొనవచ్చును.

ఇక ఈపుస్తకారంభముననున్న శాస్త్రభాగమునుగూర్చి ఒకానొక గొప్పవిమర్శకు డిట్లు చెప్పియున్నాడు: 'On the scientific side, Mr. Wells's books are unsatisfactory because, though he often makes a parade of the names of ultra-modern scientists, it is clear he knows little or nothing of the latest advances in the study of life—for example, he seems quite unaware of the offensive that is being conducted on a wide and fluctuating front against the Darwinian Theory of Evolution, which was only "a working hypothesis"... The careful study of living creatures, such as birds and insects, has certainly demolished some of the deductions—for example the theory of instinct from the Darwinian hypothesis.'

ఇట్టి విమర్శనలను గమనించి వెల్సుగారు తమ గ్రంథమునందలి లోపములను సవరించి మరల అచ్చువేయించి యుండిన బాగుండును. కాని వా రిదివరకు అట్లు చేయలేదు. శాస్త్రసంబంధమైన నవలలవల్లను, ఇతర గ్రంథములవల్లను వెల్సుగారు చాల కీర్తిగడించి భవిష్యద్ జ్ఞానముగల 'ద్రష్ట' యని పాశ్చాత్యదేశములందే కాక ప్రపంచమంతటను ప్రసిద్ధి వహించియుండుటచేత కావచ్చు, శఠకోపాచార్యులవారు వీరి గ్రంథమునకనువాదము ప్రకటించి తెలుగువారికి గూడ వెల్సుగారి యభిప్రాయములను కొంతమట్టుకు తెలియజేయుటకై ప్రయత్నించిరి. కాని వెల్సుగారి గ్రంథమునందలి లోపములను తొలగించి యుండినయెడల ఈప్రయత్నము శ్లాఘ్యమనుటకు సందియము లేదు.

అసలు ఈగ్రంథము విలువ హెచ్చించునవి పాద టిప్పణులు. వీటి విషయమున ఆచార్యులవా రవలంబించిన పద్ధతియే బాగున్నది. ప్రమాణగ్రంథముల నెన్నిటినో పరిశీలించి, పరిశోధించి విశేషశ్రమకు లోనై ఈ టిప్పణులను తయారుచేసినా రాచార్యులవారు. ఇంతటి పరిశ్రమ చేసినవారు మరి కొంచెము శ్రమ తీసికొని ప్రాచ్య, పాశ్చాత్యదేశ విషయములను సమదృష్టితో వీక్షించి విమర్శించి వెల్సుకృతగ్రంథమువంటి

యొక స్వతంత్రగ్రంథము నే రచియించి యుండిన నెంతో బాగుండెడిది. ఇచట నొక్క విషయము చెప్పవలెను: ప్రపంచచరిత్రలో నుండదగిన పరిణామకర ముఖ్యాంశములనే, వ్రాసినట్లు ఆచార్యులవారు చెప్పియున్నను వెల్సు మూలగ్రంథమునందు వలెనే, ఆచార్యులవారి పాద టిప్పణులయందును ప్రపంచచారిత్రమునకు అప్రసక్తములును, అనుపయుక్తములును, కేవల మాంధ్రులకు మాత్రమే సంబంధించునవియు నైన విషయము లుండుట విచారకరము. ఇట్టివి చదువుటకు క్రొత్తవైనను గ్రంథవిష యైక్యమునకు భంగకరములు.

గ్రంథాంతమున నిచ్చిన అనుబంధములు సామాన్యపాఠకునికి గూడ ఎక్కువ యుపదేశకములుగను, ఉపయోగకరములుగను ఉండుననుటకు సందియము లేదు.

వెల్సుగారి దోషముల కాచార్యులవారు బాధ్యులు కారు. వ్యయప్రయాసముల కోర్చి ఈగ్రంథము నోపికతో తెనిగించి ఆంధ్రులకు ప్రసాదించిన ఆచార్యులవారి యుత్సాహాసక్తులును, భాషాభిమానమును ప్రశంసార్హములు. ప్రపంచచరిత్ర మేమాత్రము, నేవిధమునను దెలియని యాంధ్రుల కీగ్రంథము కొంతవర కుపయోగకరముగ నుండు ననకతీరదు. విమర్శ దృష్టితో జూచినచో నిందు లోపము లున్న నేమి, విషయ బాహుళ్యమునుబట్టి అందరు చదువవలసిన గ్రంథ మిది. దోషముల కేమి, లోపముల కేమి, వేలువేలు గ్రంథముల రూపమున నూతన విజ్ఞానము మన తెలుగులోని కెంత ఎక్కువగ వచ్చిన నంత మంచిది. శ్రీ శఠకోపాచార్యులవా రిట్టి సత్సంకల్పముతో నీకార్యమును నెరవేర్చినందులకు మాననీయులు.

పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, ఎమ్. ఏ, పి. హెచ్. డి.

కవిగారి మనుగడ. గ్రంథకర్త: జయంతి సుబ్బారావు. కవితాసమితి, విశాఖపట్నం. ౧౯౩౫. వెల ౮ అ. ౧౧౮ పుటలు.

బ్రహ్మశ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారికి 'కవిగారు' అన్నదే విశాఖపట్టణ మండల మంతటా ప్రసిద్ధమైన పేరు. వీరు చిరకాలము పెక్కు సంస్కృతిశాఖలలో కృషిచేసిన పండిత ప్రవరులే కాని వీరి పేరు విశాఖమండలము దాటి దేశములో అంతగా పాకలేదు. కాని ఆ మండలమువారు, ముఖ్యముగా కవితాసమితివారు, వీరి విలువను లోకానికి చాట గల్గుతున్నారు. మంచి నడతవల్ల కవిగారు పూజితమునూ, ప్రఖ్యాతినీ బడసిన సంగతి కవిగారి కంటె ప్రసిద్ధమైనది. కాని వీరి 'తెనుఁగు, తోఁబుట్టువులు', రాబోయే నిఘంటువు మొదలైన ఉచ్చగ్రంథములు సారస్వత లోకములో వీరి పేరుకు స్థాయిత్వము చేకూర్చగలవు. ఇవి కాక మరి యెన్నో గ్రంథములను వీరు రచించినారు. వీరి నిరంతరమైన కార్యదీక్ష, ఆదర్శపరత్వము, దేశసేవయందలి ఆసక్తి, భాషాసేవయందలి సిద్ధహస్తత మున్నగు అంశాలు, వారికి శిష్యులై చిరకాలము సాహచర్యము నెరపుతూ వారిని మేలుబంతిగా చూచుకొనే శ్రీ జయంతి సుబ్బారావుగారు ఈగ్రంథములో వివరించిరి.గురువు మతమునుబట్టి గ్రంథకర్తయున్ను తెలుగుమాటలు వాడడములో రుచిగలవా రయిన్నీ శైలి మిక్కిలి ధారాళముగా రుచిగా నడపగలిగిరి.

కొంపెల్ల జనార్దనరావు

## ఉ ద య ని

ఆంధ్ర పత్రిక ధాత సంవత్సరాది సంచిక. సంపాదకుడు కాశీనాథుని నాగేశ్వర రావు, 7, తంబుసెట్టివీధి, జి. టి. చెన్నపురి. ౨౬౦ పుటలు (డెమీక్వార్టో). వెల రు ౨.

ఎప్పటివలెనే ఆంధ్రపత్రిక ధాత ఉగాదిసంచిక, పది పదకొండు త్రివర్ణచిత్రాలతో, అనేకములైన ఇతర చిత్రాలతో అలంకృతమై, ఎల్లవిషయాలకు చెందిన వ్యాసాలు విద్వద్వర్యుల పేళ్లతో విలువకూర్చగా వెలువడింది. పది సంవత్సరాల క్రిందటివరకు ఉగాదిసంచికలలో ఆంధ్రులు అనేకవిషయాలలో దీక్షతో కావించిన అధ్యయనము వ్యాసరూపాన కానవచ్చేది ఇటీవల కొంత తగ్గుదలచూపడం శోచనీయం. ఇటీవల పత్రికలు విరివిగా వచ్చి రచయితల దీక్షకు ప్రోత్సాహము కూర్చేవి కాకపోవడం సాధారణంగా రచయితలకూ పత్రికలకూ ఉండే అనుబంధాన్ని కొంత మార్చినదేమో. శ్రద్ధగా పరిశోధన సలిపే పండితులు పత్రికలయెడ కొంత విముఖులుగా ఉండడం ఉగాదిసంచికలు నిరూపిస్తున్నవి. ఏమయినా ఇప్పటికీ ఉత్కృష్ట రచయితల వ్యాసాలు దీనిలో విరివిగానే కాన వస్తున్నవి. చిత్రము లేలాగో వ్యాసాలూ ఆలాగు, ఆంధ్ర జీవితము నంతనూ సూచిస్తుండడం ఆంధ్రపత్రిక ఉగాదిసంచికకు నిరూఢమైన లక్షణమే అయె.

# శృంగాటకం

ప్రతిసంచికా చీకటినుంచే ఉదయించి, 'ఉదయిని' ఆవిధముగా సార్థకనామధేయ అవుతున్నది. దేశమువల్ల వచ్చిన ఆదరను తక్కువని చెప్పలేము. ఈస్థితి త్వరలో దాటవచ్చునని ధైర్యము లేకపోలేదు. ఆలస్యమైన సంచికకు పాత తేదీ తగిలించడం చందాదారులకు కాని (ముఖ్యముగా) పత్రికకు కాని అంత అనుకూలము కాదనిన్ని, ప్రకృతపు తేదియే వేసి చందాకు సరిపడ్డసంచికలు అందచేయడం నయమనిన్ని తోస్తున్నది. కాని త్వరలో ఆలస్యాలకు తగినన్ని సంచికలూ వెలువరిచి సంవత్సరాలను తృప్తిపరచవలెనని ఆశ. చందాదారులయూ, దానకర్తలయూ తోడ్పాటు ఇందుకు ఆధారము. దానకర్తలు దానకర్తలు కావడములోనే ఔదార్యమున్నది; ఈ విశిష్టసందర్భాలలో అవుతూ రావడములో మరీ ఉన్నది. ఇది ఐదవసంచిక: చందాదారులు తాము బాకీలను చెల్లించి కొత్తవారిపైని నేరము మోపజూస్తే యెంతో బాగుండును.

*   *   *   *   *   *

నవ్యకవితకు, ఒకవిధముగా నవ్యసాహిత్యానికి, ఇరవైఐదు సంవత్సరాల జీవనం లెక్కచూచుకొని పర్యాలోచించడం నేడు మనకు కొత్తకాదు. ఇందులకు ఒకఉత్సవము (అర్థోదయ మనే పేర కాబోలు) జరపడానికి శ్రీ తెలికిచెర్ల వెంకటరత్నంగారు (ఎమ్.ఏ., ఎల్.టి.) మొదలుగాగల పెద్దలు పూనుకొన్న పూనిక ఫలించడం మిక్కిలి అపేక్షించతగ్గది.

*   *   *   *   *   *

రాజమహేంద్రవరము ఈనడుమ సారస్వత ప్రాముఖ్యానికి మిక్కిలిగా నోచుకొన్నదవుతున్నది. నవ్యసాహిత్య కార్యస్థానము అక్కడ చేరినది. రా. బ. మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు పర్లాకిమిడి వదలి, ఆంధ్రదేశ మంతటిలో ఆ అఖండగౌతమీ తీరభూమి ఆవాసయోగ్యముగా ఏరుకోవచ్చిరి. కందుకూరు వీరేశలింగం పంతులు తన వీరపదవికి చిహ్నము శిలామూర్తి కట్టి అక్కడ నిలిచినాడు. బహుముఖాల జాతికృతజ్ఞతకు పాత్రత రచించుకొని జీవనవాహినుల కవాటాలు తెరచిన వీరేశలింగం పంతులుగారి శిలావిగ్రహప్రతిష్ఠాపనం అన్నివిధాలలో సంఘసంస్కారమూ, అంతకంటె బ్రహ్మమతావలంబనమూ ప్రధానముగా నదరుకువచ్చేరీతిని జరిగినా, సాహిత్యగతులు కొన్నింటికి పాదులుపెట్టి, చిన్నకథ, భావకవిత మొదలైన ఫక్కులకు అంటకపోయినా, భావగతికి ఉజ్జీవనమూ, ప్రోద్బలమూ ఇచ్చినవాడు కాగా ఆతని విగ్రహము సారస్వతుల ఉత్సవమునుకూడా నిరంతరము అనుభవిస్తున్నదని చెప్పవచ్చు. ఆతడు మెరిసే ఆగాలిలో నవ్యసాహిత్య అర్థోదయోత్సవము జరిగే సూచన లున్నవి. మరిన్నీ శ్రీరామమూర్తి పంతులుగారి సాన్నిధ్యము ఆఉత్సవానికీ బహుశః ఆ శిలావిగ్రహానికీ నూత్నజీవనం ఇస్తుంది, గౌతమి పొంగి ఆ తలమంతా అభిషేకించవలెనని కవిత అల్లుకొంటుంది కాబోలు.

*   *   *   *   *   *

శ్రీరామమూర్తి పంతులుగారు గంజాం ఆంధ్రుల తరఫున ప్రతినిధిత్వం వహించి అక్కడి ఆంధ్ర క్షేత్రాన్ని ఉత్కలం కబళించిన అక్రమానికి ప్రతిఘటనసూచకంగా రాజమహేంద్రం చేరడం. ఆంధ్రదేశ

చరిత్రంలో చేర్చుకోదగ్గ సంఘటనం. కాని రాజకీయముగా ఈ సంఘటనంవల్ల జరిగే సంచలనం మాట యెటున్నా, సారస్వతరంగములో చాలా ఉజ్జీవనము కలగడానికి అవకాశం ఉన్నది. శ్రీ పంతులుగారు దేశముకొరకు పర్లాకిమిడిలో ఉండిన్నీ వాడుకభాషకు ప్రమాణరూపము గౌతమీతీరంతో, రాజమహేంద్ర భాషతో, ముడిపెట్టుతూవచ్చినవారు, నేడు అనేకవిధాల సారస్వతోజ్జీవనముతో తొలకాడ నోచుకొన్న ఆ పణట్టమే వచ్చిచేరి, నవ్యసాహిత్యపరికరాలతో జోక్యము పెట్టుకొనకుండా ఉంటారని నిరాశ పొంద వీలు లేదు. పౌరులయూ, వివిధసంస్థలయూ స్వాగతానికి సమాధానము చెప్పుకుంటూ శ్రీ పంతులుగారు ఆంధ్రసాహిత్యపరిషత్తువారికిని తమకునూగల మతభేదము చాలా స్వల్పమైనదనీ, అది నిరూపించుకొని సమాధానానికి రావడం సులభమనీ, శ్రీశ్రీశ్రీ పిఠాపురం మహారాజావారితో పదియేను నిమిషాలు సమావేశం దొరకేయెడల వారినికూడా తమవంకకు సమాధానపరచగలమనీ చెప్పిన మాటలు ఫలిస్తే, నేడు సారస్వతరంగంలో వైరుధ్యాలకై ఖర్చుపడే శక్తి మంచికిగాను వినియుక్తమయే అవకాశం ఏర్పడుతుంది.

* * * *

ఆంధ్రవిశ్వకళాపరిషత్తుకు ఒక కర్తవ్యాన్ని విన్నవిస్తూ తాపీ ధర్మారావుగారు (బి.ఏ.) మొదలు గాగల ఐదుగురు ఆంధ్రులు ఈలాగు విశ్వసిస్తున్నారు: "ఆంధ్రకళాపరిషత్తువారికి తెలుగుభాషతో ప్రసక్తి ఉంది. ఆ తెలుగుభాషలో గిడుగు రామమూర్తిపంతులుగారు చేసినకృషి ఎంతగొప్పదో లోకానికే తెలుసును.... అట్టి మహాకృషి ఫలితాన్ని కళాపరిషత్తువారు ఇంతవరకూ ఉపయోగించుకోకుండా ఉండడం చాల దుఃఖకారణం. ఇప్పుడు సంపూర్ణాంధ్రత్వోత్కల రామలింగారెడ్డిగారి ఆధిపత్యంలోనయినా ఈలాటి కొరతలు తీరుతాయని పుట్టెడాసతో నున్నాము.... ఈ జూలయిలో పరిషత్తుని తెరుస్తారు. అలాగా రామమూర్తిగారు తెలుగుపీఠాన్ని అధిష్ఠిస్తారు అన్న సంతోషవార్త ఆంధ్రులకు వినబడునని మావిశ్వాసము."

* * * *

ఏభాషవారిలోనూ రామమూర్తిపంతులుగారివలె ఒకభాషయందలి సారస్వతాన్ని గాలించినవారు ఎందరో ఉండరు. ఆంధ్రులకు విశ్వకళాపరిషత్తు చేపడి ఇంతకాల మయిన్నీ, వీరి అసాధారణపాండిత్యాన్ని తగినరీతి మన్నించకపోవడం పరిషత్తు ఆంధ్రుల సంస్కృతి విద్వత్తులయెడ చూపే అనుబంధవిశేషాన్ని నిదర్శిస్తూ ఖేదకారణమై నిలుస్తుంది. కాగా ఈ ఆంధ్రప్రముఖుల ప్రకటనం గమనించతగ్గది. శ్రీ పంతులుగారికి డాక్టరేటు ఇచ్చి గౌరవించడం, వారిచేత పరిషదుపన్యాసాలు చేయించడం, వారికృషిని—చేసినదానినీ, చేయగలదానినీ—గ్రంథాలుగా ప్రకటించడం లోనైనపనులకు కళాపరిషత్తు ఎప్పుడు పూనుకొన్నా పూనుకోతగ్గదే.

* * * *

మాతృభాషలోని తీపి మనస్సు నెంతో ఆహరించగా, శ్రీ పంతులుగారు 'ఆడిన'మాటకూ 'వ్రాసిన' మాటకూ దూరాలూ సన్నికర్షలూ పరిశీలిస్తూ వాఙ్మయము చులుకితము చేసుకొన్నారు. కాని అవశ్యకాన్ని బట్టి వారిమనస్సు నేటికి సాహితీపరత్వముకంటె భాషాపరత్వముతో ఎక్కువ రంగు తిరిగినదై నిల్చిఉన్న దంటే వారికృషిని సరిగా తెలిసికొన్నట్టే. ఇక పరిషదధికారులు ఆపీఠాన్ని ఎటువలె నిలప నెంతురో. కాని శ్రీ పంతులుగారిని సత్కరించడానికి పరిషత్తు తనకు వీలయినన్నిమార్గాలు చేపట్టదగును.

# వి రా ళ ము లు

| | | | రు |
|---|---|---|---|
| ఒక మిత్రులు (శాశ్వతగ్రాహకులు) | | | ౧౦౦ |
| దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు | | | |
| ఉలవపాడు, నెల్లూరుజిల్లా | ... | ... | ౧౦ |
| ఒక మిత్రులు | ... | ... | ౧౧ |
| మరొక మిత్రులు | ... | ... | ౨౫ |

# అ భి ప్రా యా లు

ప్రియసంపాదక మహాశయా,

వందనములు.

ముద్దులు మూటగట్టుచు వెలువడుచున్న తమ 'ఉదయిని'కి అభినందనములు. అభినంద నాస్పదముగ దానిని 'సంపాదించి' ఆంధ్రలోకమున కొసగుచున్న తమకును అభినందనములు. ఉద్దిష్టోదారమగు నవ్యసాహిత్య నిర్మాణమున కావశ్యకములగు సుందరపరికరములను 'ఉదయిని' క్రమముగ సేకరించుకొనుచున్నది. విశేషించి నాలుగవసంచిక సంతరించు కొనిన యాపరికరములు సుందరతరములు.

నాలుగవసంచికయందలి వ్యాసములు—ముఖ్యముగ గద్యరూపములు—అందును ప్రధాన ముగ 'సీత-కుందమాల', 'ప్రాకృతము: నన్నయకు పూర్వపు సాహిత్యము', 'శ్రీ దీక్షితులు గారి నాటికలు', ఆరనిజ్యోతి', 'శైలబాల'—ఉజ్జ్వలములు, ఉన్నతభావ సమంచిత ములు. అవి రచయితల ప్రతిభకు, పాండిత్యమునకు, పరిశీలనశక్తికి, భావోన్నతికి, రచనా సామర్థ్యమునకు, సంపాదకుని సంస్కారసంపదకు సుత్తమనిదర్శనములు. నిక్కముగ నవి నవ్యాంధ్రవాణి కమూల్యాలంకారములు. అజ్ఞాతపూర్వమగు నవ్యాంధ్రశక్తి వాని యందు ప్రత్యక్ష మగుచున్నది.

మహాశయా, తమకృషికారణముగ నిట్లు నేటి ఆంధ్రహృదయమున నెలకొనిన బీజముల వలన మొలకెత్తి, చిగిరించి, వివిధప్రపంచ సారస్వత సంస్కారబలమున నవలుసాగుచు, విజ్ఞానవల్లరులు నవ్యాంధ్రసాహిత్యరంగమున కెగబ్రాకుచున్నవి. అవి ఆంధ్రవాణికి పుష్టిని తుష్టిని చేకూర్చి, స్వాస్థ్యమును సంతరించి యామెను నవ్యభావరమణీయనుగ నొనరింపగల అమృతమయఫలములను ఫలింపగలవను విశ్వాసము గలుగుచున్నది ఈ విశ్వాసము నిశ్చయార్థ మగుగాక! ఉదయిని చిరంజీవినియై నిరంతరము నవ్యవాఙ్మయాభి వృద్ధిని గావించుచుండుగాక! ఇదియే పరమాభిలాషము. చిత్తగింపుడు...

చెన్నపురి ..

క. సుబ్బరామయ్య

'భారతి' సంపాదకుడు

‘ఉదయిని’...సారస్వతలోకమున నొక నూతనాధ్యాయమును ప్రారంభించినది. దీని కొక ప్రయోజన మున్నది. అది సంపాదకుని రచనలందును ఇతర వ్యాసములందును ప్రతిఫలించుచున్నది. పాఠకుని దిమ్మెరగొట్టక వానియందు ఆలోచనాభాగమును ప్రజ్వరిల్లజేయుచున్నది. ఏ పద్యము జదివినను, వ్యాసము జూచినను అచట ఆగు మనుసట్లుండును...శ్రీయుత గిడుగు వెంకటరామమూర్తిగారు ఆశీస్సును బంపుచు నిటుల వ్రాసిరి:—
“నేటి తెలుగుభాషలో నేటి భూలోకము ప్రతిఫలించేటట్లు చేయగల తెలుగులేఖకులున్ను, తెలుగుకవులున్ను అన్యదేశీయులతో తులదూగ గలవారు తయారవుతున్నారని ఈ పత్రికలు విశదము చేస్తూఉన్నవి.”
ఈ అభిప్రాయముతో నేకీభవించుచు నీ పత్రికను ఆంధ్రలోకము అభిమానించి పోషించునని నమ్మెదము.

—ఆంధ్రపత్రిక.

# ముఖ్యంగా చదవవలసిన గ్రంథాలు—కొన్ని

**హిందూదేశ చరిత్ర :—**

మల్లంపల్లి సోమశేఖర శర్మగారిది. దేశచరిత్రలో ఇటీవల జరిగిన పరిశోధనలను గూడ పరిశీలించి రచియించిన గ్రంథము. ... ... ౧ ౦ ౦

**అమరావతీ స్తూపము, ఇతర వ్యాసములు :—**

మల్లంపల్లి సోమశేఖరశర్మగారిది. ప్రాచీనాంధ్రుల ఔన్నత్యమునకు, కళానైపుణ్యమునకు నిదర్శనముగా ఉండిన అమరావతీస్తూపపు చరిత్ర: ప్రతియాంధ్రుడు చదువవలసినది. మన ప్రాచీనవిద్యాసంస్థలు, అనాదృతవాఙ్మయము మొదలైన వాటిని గురించి చక్కని వ్యాసములు కలవు ... ౦ ౧౨ ౦

**ప్రాచీనాంధ్ర నౌకాజీవనము :—**

భావరాజు వేంకటకృష్ణరావుగారు రచియించినది. పూర్వం ఆంధ్రులు కడలేని సముద్రాలు దాటి ద్వీపాంతరాలతో చేసిన వర్తకవ్యాపారము మొదలైనవిషయాలు ఎన్నో ఇందున్నవి ... ... ... ... ౧ ౦ ౦

**ప్రాచీన విద్యాపీఠములు :—**

డా. చిలుకూరి నారాయణరావుగారు రచియించినది. వేంగి, నాలంద, విక్రమశిల, సుధాన్యకటకము మొదలైన విద్యాపీఠముల చరిత్రము. పెక్కుగ్రంథములు పరిశోధించి రచింపబడినది. ... ... ... ౧ ౦ ౦

**నవకుసుమాంజలి :—**

కీ. శే. జనమంచి వేంకటరామయ్యగారిది. ఇందు రసావహములైన పెక్కు కావ్యములు కలవు ... ... ... ౧ ౪ ౦

**మాలతీ మాధవము :—**

కీ. శే. జనమంచి వేంకటరామయ్యగారిది. ఇది భవభూతికవి నాటకమునకు మనోహరమగు తెలుగుసేత ... ... ... ౦ ౧౨ ౦

**వైశాఖి:—**

కవితాసమితివారి ద్వితీయ వార్షికసంచిక. సరసములగు కావ్యములు, వివిధవిషయాల విలువగల వ్యాసములు, విమర్శములు గల సంచిక ... ... ౧ ౦ ౦

**ప్రభవ :—**

శ్రీరంగం శ్రీనివాసరావుగారిది. ఖండకావ్యముల సంపుటము ... ౦ ౯ ౦

**మాతృపూజ :—**

కొందరు కవుల దేశభక్తిగీతముల సంపుటము ... ... ౦ ४ ౦

'ఉదయిని' కార్యాలయము — ౧౫ అదెప్పమొదలి వీధి — వేపేరి — మద్రాసు

# ఉదయిని

సాహిత్య పత్రిక: రెండు నెలల కొక సంచిక

సంపాదకుడు

కొంపెల్ల జనార్దనరావు

సహసంపాదకుడు

ఆచంట జానకిరామ్

ఆగస్టు ౧౯౩౬

సంపుటము 1 చందా రు ౪

సంచిక ౬ ప్రతి అ ౧౨

15 ఆదెప్పముదలివీథి, వేపేరి, మద్రాసు

# విన్నపము

'ఉదయిని'కి ఈ సంచికతో ఒక సంపుటము పూర్తి. ఇప్పటికీ చాలామంది చందాదార్లు చందాలు పంపవలసే ఉన్నారు. వెంటనే వారందరూ దయచేసి చందాలు పంపితే కాని మా భారము దుర్భరము. సంచిక రూపమునూ, ప్రతిఒక్కంటికి రెండణాలవంతున అయే తపాలఖర్చునూబట్టి మా శ్రమ ఊహించ వీలవుతుంది. అన్ని సంచికలూ తీసుకొని వీపీలు తిరగగొట్టగల పెద్దలకు చెప్పే దేమీ ఉండదు.

వచ్చే సంపుటమునుండి, వచ్చే అక్టోబరునుండి, 'ఉదయిని' మాసపత్రికగా వెలువడనై ఉన్నది. చందా మామూలుగా ఇచ్చే నాలుగురూపాయలే. పాత చందాదారులు ప్రస్తుతము 'ఉదయిని' అక్కరలేదని తోచినవారు మాకు తెలుప వేడెదము. తక్కిన వారు చందా ముందుగా పంప వేడెదము. లేదా, తొలిసంచిక రు 4-4-0 (నాలుగు రూపాయల నాలుగణాలకు) వి.పి. పంపగలము: దయచేసి అది స్వీకరించ వేడెదము. కొత్త చందాదారులున్ను ముందుగా చందా పంపితేనే కాని సంచిక పొందజాలరు. సాధ్యమైనంతవరకూ వి.పి. పద్ధతి తగ్గించడమే ఉభయత్ర మంచిదని విన్నవిస్తున్నాము.

ఏజెన్సీలు పొందగోరేవారు తెప్పించుకొనే ప్రతుల సంఖ్యనుబట్టి ధరావతు కట్టవలసి ఉంటుంది. ఇతర వివరాలకు మా కార్యాలయానికి వ్రాయగోరెదము.

'ఉదయిని' కార్యకర్త

---

# విరాళము

| | రు |
|---|---|
| శ్రీ నాళం బ్రహ్మానందరావుగారు<br>కాకినాడ | ౧౦ |

# విషయసూచిక

# ఉ ద యి ని

సా హి త్య ప త్రి క


సంపుటము 1 — ధాత, శ్రావణము

సంచిక ౬ — శా. శ. ౧౮౯౮


## కి ర ణా లు

### 'ఉ ద యి ని'

'ఉదయిని' ఈ సంచికతో ఒక సంపుటము పూర్తిచేసిన దవుతుంది. ఎన్ని ఇబ్బందులు గడవవలసివచ్చినా, 'ఉదయిని'కి అభ్యుదయమే నిరంతరము అభయమిచ్చి నడిపిస్తున్నది. ఇందుకు కారణభూతమైనవి దానకర్తలయూ, చందాదారులయూ తోడ్పాటూ, సహనమూ మిక్కిలి కృతజ్ఞతాపాత్రములు. అంతే కాక, లోధ్ర ముద్రణాలయాధికారుల సహనమున్ను, సౌహార్దమున్ను ప్రత్యేకప్రశంసకు పాత్రములు.

### కొత్త అధ్యాయము

రెండవ సంవత్సరము—లేదా, రెండవ సంపుటము—ప్రవేశించడమే పత్రికకు కొత్త అధ్యాయము ప్రారంభమైనట్టు. తాను పడిన శ్రమలకూ, తనకు చేకూరిన ఆదరములకూ నడుమ ఆదరములవిజయమే మిగిలి పత్రిక ప్రజాసేవకు ఇంకా నోచుకొన్నదవుతున్నది. ఆ ఆదరమును ఆధారముచేసుకొన్న ధైర్యముతోనున్ను, సేవాపరాయణత ఇనుమడిగా చూపే పూనికతోనున్ను, కార్యమందలి అమితాసక్తివల్లనున్ను 'ఉదయిని'ని కొత్తసంపుటమునుండి మాసపత్రిక చేయ సంకల్పిస్తున్నాము. ఇకపైని వేళపట్టుకు సరిగా పత్రిక అందజేయగలమనే ధైర్యము కలుగుతున్నది. రావలసిన చందాలు సరిగా వసూలయిఉంటే, ఇదివరకైనా పత్రిక కష్టము లేకుండా సరిగా వచ్చి ఉండేది. అయితే, ప్రతికూలస్థితు లన్నిటికి పైని, అభిమానము లేని చందాదారు ఒక్కరూ లేరనే అనుభవాన్ని గుర్తించి తీరినాము. ఇకపైని మరింత అభిమానముతో తెలుగువారు మా ఉద్యమానికి తోడ్పాటు చూపి పత్రికను వినియోగపరుచుకోగలరనే నమ్మికతో 'ఉదయిని'ని మాసపత్రికగా మార్చ సమకట్టుతున్నాము.

మాసపత్రిక 'ఉదయిని'

మాసపత్రిక కావడంవల్ల 'ఉదయిని'కి రాగల అదనమైన ఒత్తిడికి జడుపుకలిగి చందా నాలుగు రూపాయలనుండి ఐదు రూపాయలకు పెంచవలె ననే పెద్దలసూచన కొంత ఆకర్షకముగా లేకపోలేదు. కేవలము ఇప్పటిపుటలలో సగమువంతు పుటలతో సంచిక మిక్కిలి చిన్నదై సుష్ఠుగా కనబడదు కాబట్టి దాదాపు అరవైపుటల గ్రంథము శ్రమ పడి కూర్చి, ప్రతిసంచికయందూ ప్రకటించడం ఇంపుగా కనవస్తున్నది. అట్టియెడల ఆ నాలుగురూపాయలకే పన్నెండు సంచికలు అందజేయడం కొంచెము కష్ట సాధ్యమే అయినప్పటికీ, చందాదారులకు అదనముగా శ్రమ యీయకయే పత్రికను జాగ్రత్తగా నిర్వహించి నెగ్గించవలెనని యెంచినాము. ఇది నిర్వాహకులకు శ్రమ దాయకమనుటలో సంశయము లేదు. కాని, ఈ మార్పువల్ల ప్రజాదరము మెండుగా లభిస్తుందనే ఆశ బలీయముగా ఉన్నది. ముఖ్యముగా పత్రికవిజయానికి అమూల్య సామగ్రి యైన రచయితలకు మా కృతజ్ఞత ఉచిత రీతిని వెల్లడించలేము. ఈపైని మరింత వారిపై బరువు మోపి మా ఋణిత్వాన్ని పెంచుకొని వారి వాత్సల్యాన్ని సమర్థించడం మాకు తీరని కర్తవ్యమై నిలుస్తున్నది. 'ఉదయిని' తొలీమాససంచిక యీ విజయదశమికి (అక్టోబరు 25) వెలువడుతుంది.

* * * * *

నవ్యసాహిత్యపరిషత్పత్రిక

ఆంధ్రదేశంలో చిరకాలంగా సాహిత్యపరిషత్తు ఒకటి ఉండగా నవ్యసాహిత్య పరిషత్తు అని యింకొకటి యేర్పడడం ఒక పెద్ద సంఘటనమని చెప్పవలెను. కాని ఆంధ్రసాహిత్యపరిషత్తు పుట్టుకయే నవ్యగతులయెడ వైరుధ్య మొకటి పురస్కరించుకొని జరిగిఉన్నపుడు, ఈ నవ్యసాహిత్యపరిషత్తు ఏర్పడడంలో వింత లేదు. ఆ యేర్పడడంవల్ల నవ్యసాహిత్యానికిగల శక్తిమత్త్వముమాత్రం వెల్లడి అవుతున్నది. మరిన్నీ, కేవలము ధనాఢ్యుల ప్రత్యేకాదరాన్ని ఆధారము చేసుకొని కాక, తదీయుల దీక్షోత్సాహముల యందే ఆశపెట్టుకొని యేర్పడ్డ నవ్యసాహిత్యపరిషత్తు దేశాన్ని ఆకర్షిస్తున్నదంటే దాని ఉనికికి కావలసినంత శుభకామన చేకూరిన దన్నమాట. దాని ముఖ్యమైన పరికరం నవ్య సాహిత్యపరిషత్పత్రిక అయిన 'ప్రతిభ'[1] వెలువడింది. వ్యక్తులుగా నవ్యసాహిత్యపారి షదులున్నూ 'ఉదయిని'కి ప్రాపులైనవారై, సంస్థతరఫున 'ప్రతిభ'ను వెలువరచడానికి

---

1 'ప్రతిభ'ను గురించిన సమీక్ష ఈ సంచిక 'వాఙ్మయవీథి' కలములలో చూచేది.

నడుముకట్టినారంటే, 'ప్రతిభ'కూ 'ఉదయిని'కీగల నెయ్యముమాట చెప్పనక్కరలేదు. 'ప్రతిభ' 'ఉదయిని'కి తోడై యాత్రాగతికి జీవమూ, సొగసూ పెంపొందించగలదనే ఆశ తప్పక సార్థకము కాగలదు.

రెండు పరిషత్తులు

అనేకవిధాల ఆంధ్రసాహిత్యపరిషత్తు అనల్పమైనసేవ సారస్వతానికి చేస్తున్నదయిన్ని, కొన్ని ముఖ్యధర్మాలు ఉపేక్షించి యింకొక పరిషత్తుకు అవసరం ఏర్పరచడంలో దృష్టివైశాల్యము చాలమికి విమర్శపాల్పడ్డది. కొత్తగా ఏర్పడ్డ నవ్యసాహిత్యపరిషత్తున్ను తిరిగి ఆలాటి విమర్శకే పాల్పడకుండా ఉండడానికి అవకాశ మున్నది. నిజానికి ఇరుపక్షాల వైరుద్ధ్యము ఎక్కువ గణనకు నిల్వ్రానిదని యిటీవలి స్థితిగతులు నిరూపిస్తున్నవి. నవ్యకవులు ఆ పక్షమువారి మెప్పులు సహా పొందినపుడు నవ్యకవితలోని నికృష్టరచనలపై విరోధము ఆధారపరుచుకోడం ఉత్కృష్టమైనపద్ధతి కాదని చెప్పనక్కరలేదు. వాడుకనుడికారము రచనయందు ప్రవేశపెట్టగలిగినవారూ, గ్రాంథికములో సహా అందెవేసిన పాండిత్యనిధులై వాడుకభాషలో చక్కని రచనకు పూనుకొన్నవారూ ఇంకొక వైరుద్ధ్యము తగ్గించగలుగుతున్నారు.

వాఙ్మయములో సంప్రదాయసిద్ధమైన ఉనికి గలదై, నేటి విశిష్టభావగతినిబట్టి వాఙ్మయనిర్మాణక్రమంలో కొన్నిమెట్లుగా ఆభిజాత్యానికి నోచుకొన్నదై, నుడికారానికి ఎక్కువ ఆనుకూల్యము ప్రసాదించిన పూజ్యత గడించి యెంతో ఉత్కృష్ట రచనలు దేశములో మేలుకొల్పి, పెక్కుకలాల మోజుకు నోచుకొన్నదై బిగిసి వాడుక భాష శక్తి పెంచుకొన్న యీరోజులలో, కొన్నిగుణాలు విస్మరించీ, కొన్ని లోపాలు విస్తరించీ దానిని అపాకరింప చూడడంకంటె,—వ్యవస్థలేమికి గర్హించడంకంటె,—కళాశాలల, వ్యుత్పన్నుల కలాల చైతన్యవికాసంలో దాని భవిష్యత్తు భద్రపరచడం శ్రేయస్కరమని యెంచదగును. ఇందులకై వేచిఉండడమే కాక, వ్యవసాయములు సాగించడానికి తమ త్రోవల తాము 'ప్రతిభ'వంటి మంచిరకం పత్రికలు చాలా నిర్వాహకములు కాగలవన్నది అనుభవము చెపుతున్న సంగతి.

అయితే వీటిబ్రతుకు అంత సులభమైనది కాకపోవచ్చు. నికృష్టవాఙ్మయముతో, వేలకువేలు రూపాయల యెత్తునకు జనకోటి కౌతుకపడుతుండగా, ఉత్కృష్టవాఙ్మయమూ, పగిడీచుట్టిన పత్రికలూ పొందుతున్న కడగండ్లు బిగువౌతున్నమాట నిజమే కాని, కొంతపరిశ్రమమీాదట రుచిగల హృదయాలు వందలుగా లేచిరావడానికి చాలా అవకాశం ఉన్నది.

నికృష్ట వాఙ్మయం

కనుకనే, ఎంతటి నికృష్టవాఙ్మయవిజృంభణాన్ని అణచడానికైనా, ప్రభుత్వాధికారాలు దండము ధరించి రావలెనని తత్తరపడ నక్కరలేదు. కాని జనబాహుళ్యము రుచులు విరిగిపోకపూర్వము ఆలాటి వాఙ్మయగతులు అరికట్టడానికి మంచి పత్రికలూ, సంస్కృతిగల వ్యక్తులూ, సంస్థలూ పూనుకోక వగచి లాభము లేదు. ఈ సూక్ష్మవిషయాలలో, ఎక్కడ ఆగవలెనో తెలియని ప్రభుత్వదండముమారు రుచిదండమే యెక్కువ అనుకూలమైనదనే నమ్మిక వాఙ్మయవికాసానికి ఆస్పదమిస్తుంది.

వా స్త వి క త

వాస్తవికత, లోకవృత్తానుకరణం, (Realism,) నేటి సారస్వతములో మిక్కిలి విశృంఖలముగా కలము నడుపుతున్న శక్తులలో ఒకటి. చిరాగత సంప్రదాయసిద్ధములైన రుచి మార్గాలకు భిన్నములయిన్ని కావ్యౌచిత్యాన్ని మిన్నగా పాటించే మంచి రచనలు నేటివి కొన్ని అరుచికరములైన రచనలతోపాటు గణింపబడి అక్రమముపాలు కావడం లేకపోలేదు కాని, ఆ మంచిరచనల సామ్యాభాసములో నికృష్టరచనలు విజృంభించడంమాత్రం చాలా శోచ్యమైనస్థితి యేర్పరుస్తున్నది. ఈవిషయమై 'త్రివేణి' యీ జూలై సంచికయందు తత్సంపాదకులు తమ సహజభావుకమైన అమర్షముతో ఆంధ్రులకూ ఆంధ్రేతరులకూకూడా చూపిన రుచిస్థానము గమనించదగ్గది. అయితే యీ రోచకిత్వాన్ని ప్రయోగించుకొనడంలో, ఆధునికమైన భావగతులవల్ల—ఒక నిరీశ్వరత, చార్వాకత, ప్రకృతి శాస్త్రాలప్రోద్బలము, వట్టినైరాశ్యము, ఇన్నిన్నిటివల్ల, —ఉద్గతమై గంభీరమూ సుందరమూ కాగల సాహితీవాణిని సంప్రదాయపరాయణతలో, గ్రుడ్డి ఆభిజాత్యములో నొక్కివేయక కాపాడడానికి శ్రద్ధ వహించడం చాలా అవసరం.

కొంపెల్ల జనార్దనరావు

# ఒకనాఁటి రేయి

ఒక నిముసంపు నిద్దురయు నొత్తని నా కనురేకు లెన్నఁడే
నిఁక ముకుళింప వేమొ చదలేటిసుమా లయి; నిర్నిమేష తా
రకల విధాన వేసటలు రాని నిరీక్షణ శ్యామికా ప్రతీ
క్షికల పదేపదే కలవరించెడి కోరిక చీల్చుచుండునా?

ఈ శరదిందుమూర్తి హసియింపఁడు చల్లఁదనాలజల్లు లా
శాశల, నాదరిద్రగగనాంతర సైకతపాళి కూర్చ జ్యో
త్స్నా శిశిరమ్ము కాదు, కటిచాయల పాయలు పాయలై నిశా
కైశిక మూరకే ఇముడకే ముడిలో నిడఁబారు నల్లెనన్.

ఆ సుకుమారకౌముదుల నాడు విహాయసగీతికావిలా
సాసవ మాఁకగొన్న మరణాంధ్యములోఁ బడి నీరవించు నే
మో సెలవిమ్ము ప్రేయసి! మధూత్సవపాత్రికఁ దెమ్ము; కాక పే
రాసలఁ ద్రావి యూర్చు బ్రతు కావల నేమయి వేఁగిపోవునో!

వీడని వేఁడి కౌఁగిళుల వేసరిపోవని వేళ పోయె ప
జాడల నీని స్వప్నములచాటుల నీడల రెక్కలార్చె; ఈ
నాఁడు వియోగపుంబ్రతుకు నాశమువోకయె చీఁకటింటి త
ల్పాడిచి తొంగి తొంగి యిపుడో అపుడో యని వేచు పిల్పుకై.

ప్రోయవు చైత్రమాసపదముల్ హరిదంతపదమ్ములందు; శూ
న్యాయతనాంగణాన హిమకాంగముతో చలికారు తొందరల్
సేయును; వెంటవెంటఁ బడి చీరఁగ శైశిర జీర్ణపర్ణవా
తాయతరోదనమ్ములా జరామయ నిశ్వసనస్వనమ్ములో.

రగులు విషాదహాలహల రౌరవకీల హృదంతరాలఁ గా
ల్పఁగ నను లోనఁ దాల్పఁగ భరమ్మొ; వియోగకుటీర మిద్ది నేఁ
టి గతికి రేఁబవళ్ల నొకటే పనిగా జపియించు సోరణం
పుఁగనుల పల్కరించు నలుమూలల ఏడుచు బారుబారునన్.

కృష్ణశాస్త్రి

# అస్థిప్రసాదనము

'వరలక్ష్మీ త్రిశతి.' కర్మశతకము. తొమ్మిదవపది

క్ష్మావ్యోమాఖిల పంచభూతము చితామధ్యస్థ సింహాసనా
గ్రవ్యుత్పన్న భవన్మహాజ్ఞబడియే కాఁబోలు స్తంభీభవ
ద్ధావ్యాత్మీయమహాణుసంచయముతోఁ దానై శ్మశానంబునం
దవ్యుష్టాసువుగాఁ బొనర్చికొని దివ్యాస్థీ! నమస్తే నమః.

అవ్యాలోలమనఃప్రభావము శివాప్రాణేశ్వరత్వమ్ము స
ర్వవ్యాపిత్వము మంత్రవర్ణతతి రుద్రాక్షాది వాసంబు వ్య
క్తావ్యక్తుండగు స్వామి తద్భుజగ జిహ్వాగ్నిచ్ఛటల్తోడి గ్రీ
వావ్యాలంబివిభూష వేమనెద నిన్నస్థీ! నమస్తే నమః.

దీవ్యద్దివ్యసహస్రభానుకిరణోద్దీప్తాత్మమూర్తిప్రథా
భావ్యాశాత్రుటనక్రియా పరిణతప్రౌఢప్రభావాంచితా
నావ్యానంత మహాపదంబుధి పురోన్యస్తోగ్ర కోణాచలా
పవ్యాఘాతనిశాతబాణహతివత్ప్రౌఢా! నమస్తే నమః.

దివ్యాస్థీ! భవదీయమౌ పలితమౌ దేదీప్యమానంబు నా
భవ్యాకారము హేయమయ్యెఁ దలఁపన్ బ్రహ్మాండరాహస్య వి
ద్యావ్యాపారము గోచరించుఁగద నీయందున్ విచిత్రంపు మౌ
నవ్యాఖ్యానము చేయుచుం డుపనిషన్నానామహార్థాళికిన్.

సవ్యామోహామయైన యీజగము దీక్షానంత్య సంక్లప్తిఁ గా
మవ్యాపారమునం దగుల్కొని యసంపద్భాజనంబై చెడెన్
క్రవ్యాదాభ దురామయప్రతతి జగ్ధంబై మహామృత్యు జి
హ్వావ్యోమావృతి లుప్తమయ్యెనని నీవ్యాఖ్యానముల్ నెచ్చెలీ!

నవ్యప్రౌఢమహార్థముల్ భవదుపన్యాసంబు లానందశో
ఖావ్యక్తీకరణ ప్రశస్తములు సంక్లప్తాఖిలక్షోణిగో
శవ్యాపార నిరాసహేతువులు డోలాసంచలద్దుష్ట మా
యావ్యాపాదన లీల లూర్మివిషమోగ్రాంభోదఝుంఝుల్ చెలీ!

# అస్థిప్రసాదనము

హావ్యంబై చెడిపోయె నీజగము మోహాగ్నిచ్ఛటావల్లి రం
తవ్యం బం చతిదుఃఖభాగ్విషయసంతానంబు లో నెంచి, మం
తవ్యం బంచును దారపుత్రనివహోత్తక్లిష్టసౌఖ్యంబు హం
తవ్యం బీయఖిలంబు నంచు విమలార్థం బూఁదె దీవో చెలీ !

అవ్యాజోపకృతీ! సమస్తజగ మే లాహో ! సమస్తమ్ముగా
నీ వ్యస్తంబును నూహా సేయునని నీకే నైజమైనట్టి మా
నవ్యాహారముచే శరీరగత భిన్నద్రవ్య మీరీతి భి
న్నవ్యుత్పన్నము నంచుఁ దెల్పెదవు భిన్నభ్రష్ట మంచుం బొరిన్.

తా వ్యాపించె నదే మహాస్థిక ! భవద్ధర్మోపదేశంబు, నా
యీవ్యగ్రంబగు నాత్మలో నెగసి సర్వేహావిధూతిన్ సదా
భవ్యంబైన మదీయసర్వసృజనాభాగణ్వాణుమ్లాన మ
ధ్యవ్యాక్రోశవివర్తనభ్రమదనంతధ్వాన పూర్ణంబుగన్.

శవ్యాదుల్ భవదీయ సౌరఝరిణీకల్లోల గర్భస్థితిన్
దావ్యాపన్నతఁ బొంద కామరపురీస్థప్రౌఢసౌఖ్యాలిచే
నవ్యుల్ నీకృపకై సతీవిరహితుండై యేను ప్రార్థించెదన్
దివ్యాంభశ్చలనంబు పొందకువె యస్థీ మత్ప్రియార్థంబుగన్.

విశ్వనాథ సత్యనారాయణ

# ఉపహారము

పొటమరించు మున్న పుణికితి నొకకొన్ని,
కసటు వాయకున్న పసరుమొగ్గ,
లఱసగమ్ము విచ్చి, యఱ విచ్చి, నెఱి విచ్చు
నట్టిపూలు పుణికి యందు నిందు;

ఈపువుదండ గ్రుత్తునని యెప్డు దొడంగితినో! అతిప్రయ
త్నాపచితమ్ము లాసుమము లన్నియు విస్మృత యత్ప్రపంచ ధూ
ళీపరమాణుకోటుల విలీనములై పొడమాసిపోయెనో!
చేపడె నేఁటి కీసుమము; చేకొని చేతుఁ బునఃప్రయత్నముల్.

ఒక్కొకసుమమ్మె యేర్చి నీ కుపద సేయ
గుణముకొన నిట్టు లల్లన గ్రుచ్చుచుండఁ
బూర్వ పూర్వ గ్రథితమైన పూలు రాలె;
మొదలు కన్పించ దీ సూత్రమునకు నాథ!

పూలు రాలుఁ గాక, పొలివోక తుది మొదల్
నిలుచు సూత్రమైన నే గ్రహించి
రాలినట్టి పూలమాలిక దెత్తునా?
సాక్షి గాఁగ నా ప్రయత్నములకు.

ఇంత తోఁట నాటి యిచ్చిపోయిన మన్మ
థాతి మన్మథునకు నకట! పుష్ప
శూన్య సూత్ర మెట్లు సూడిద గావింతు
రసవిహీనులగు విరక్తు లట్లు.

ప్రతితరువున్ బ్రతివ్రతతి పల్లవతోరణ గట్టి తోఁటలోఁ
గుతుకము మీఱఁ బూసరులు గ్రుచ్చి సతమ్మును నిన్ను వేచు; నా
యతనములెల్ల మాని, బ్రతుకంతయు మాలికసేయుపొంటె నే
క్షితిరుహమైనఁ గానయితిఁ, జెల్లరె! తీవయుఁ గాకపోయితిన్.

కన్నులవెన్నెలైన నినుఁ గన్గొనఁగల్గి, సుధాప్రపూరమా
తిన్నని నీయెలుంగు విని, తేపకు నే నినుఁ బల్కరించు భా
గ్యోన్నతి గల్గునాఁడయిన నోప్రియ నీయెద వ్రాలి నీగళం
బు న్నవపుష్పమాల నయి పూనక మానుదునా, మనోభవా?

పింగళి లక్ష్మీకాంతం
కాటూరి వేంకటేశ్వరరావు

# స్త్రీ

ఓ నవయువతీ !
ఎవతెవు
నీ వీరాత్రి నన్ను మేలుకొల్పావు ?

ఏ తారాకోమలాంగివో నీవు,
ఏ తేజస్ఫీతదేహవో కాని,
నా స్వప్నప్రాంతరాంతరాళంలో
నీ స్వర్ణాంకితకింకిణీక్వణాహ్వానం
రేకెత్తించి, నదించి, ప్రజ్వలించావే
నాకామం,— కోమలాంగి ! నీ ది
వ్యాకారం నాయెడంద అద్దంలో
ఈకల్యాణముహూర్తమహానిశీథంలో
ఆకు ల్దొడిగిన పూలమొక్కలా నిల్పావో కన్యా !

ఈలోకకఠోరయాత్రలో నాలో
డోలాందోళితభీతభావనాజాలం
జాలై, వాగై, ఓమహాప్రవాహమ్మై,
నాజాగ్రదవస్థనెల్ల ముంచెత్తి,
నాజ్ఞానప్రవృత్తులెల్ల కుంచించి,
నాజీవాన్ని ప్రసుప్తంచేసిన చీకట్లో
ఓ జవ్వనీ !
పూజాపుష్పాంజలితో విరిశావో
తేజఃస్వరూపిణీ ! రాణీ !
తారాజ్వలితలలితకాంతిమయీ !
శాంతిమయీ !

* *

భువనోద్రేకాలు నామనఃప్రాకారం
గమియింపకనే నిల్పుకుంటి నిందాకా;
భవదీయప్రణయవిహ్వలాహ్వానో
త్సవ మెప్పుడో యని తెరచుకుంటి నాహృదయో
ద్భవనద్వారం !

అయినా నీ
వవతరించు టెప్పుడో యీకాలపు
యవనికాంతరం విరజిమ్మకు నాజీవంలో
పవనం నాచెవిలో ఊదిందా ?
భువి చెప్పిందా? దివి చెప్పిందా? నాహృ
ద్భవనాంతర మొకనిరంతరస్వప్నమ్మై
నవసిందికదా, ప్రసుప్తమై, యిందాకా !
ఓయువతీ !

నీ వెవతెవో? నీ పే రేమో?
ప్రవచింతువాకో యీప్రేమోద్ధృత
ప్రశాంత సముజ్జ్వల
వివశత్వంలోనే !

ఓ నాభవతారణీ !
నిరంతరనవతరుణీ !

* *

నీ తారుణ్యం, నీప్రశాంతప్రేమోద్రేకం
నాతాపోపశమ మ్మొనర్చి, నాజీవం
ప్రాతరరుణరాగరంజిత మ్మతి
పూతమ్ము బొనర్చె నీనిశీథంలో !
ఈతమస్సులే ఉషస్సుగా విరిసెన్
నీతనుప్రభూత సుందరత్వంలో !
నాతపనాప్రతిఫలస్వరూపిణి ! వి
స్ఫీతభావనాంబరోచ్చతారానారీమణి !

శ్రీ

భువనాలందలి సుందరోజ్జ్వలశ్రీలూ,
కవనంలో కలగీతమంజుభావాలూ,
నవమందాకిని శీతవాతపోతాలూ,
రవళించెన్, స్ఫురియించె, తళ్కుమన్నా
రో దివిజాంగన! నీ యుపస్థితత్వంలోనే!

* *

బరువై బరువై దిగలాగె మంటిపెనుభూతం,
కరవై కరవై మటుమాయమాయె నానందం,
నరలోకవాసులెల్ల రాల్చు బాష్పజలం నా
నయనాలలోన పొంగిపొంగి కరడయ్యెన్;
మజ్జీవనాంతికంలోనే లోకపుదారిద్ర్యం
కుమిలింది, కుమిలి క్రుంచివైచె నాప్రాణం,
రమణీ!

అది యౌవనోచ్ఛభావబంధుర మ్మాకాలం!
అది నవ్యవిస్తృతవాసంతాభ్యుదయావసరం!
అది మామకవిశాలనవజీవప్రారంభం! నీ
అవతారం నాకన్నుల కట్టిం దా నాడు?—
అవనీతీరాలెల్ల వెదకి వేసరితిన్ నీ
నవకోమలపాదపద్మరజంకోసం!
పలవించా, పలవించా, విలపించా నే నో
కలరాణీ! నీ లలితానురాగబలం కావాలని,—
కానీ,
తెలవారెను, అరుణరక్తిమలు క్రుంకెన్,
తెలికాంతులశశి రోజు రోజు కృశియించెన్,
బల మేది విశీర్ణమయ్యె నాకోమల
తరుణజీవితప్రళయోద్వేగానలం నాలోనే!

* *

జనసంతానంలో కలిగే దుష్కరకల్లోలాలూ,
మనుజులదుర్భరజరామయదారిద్ర్యాలూ,
దినదినపరిదుఃఖితమా నీయిలమాత్రమె నా
మనసును సంకెళ్ల గట్టి బంధించెన్! నే
కనదలచినశోభ సృష్టిజాలంలో, ఈ
మనుజుల దీనార్తరోదనధ్వానంలో
పడి నలిగి, నా
మనస్సులో నీరసమై నీరవమై, భావనలను
కరగించెనో? కరుకుకట్టెనో?— అప్పుడు నీ
ప్రణయబలం యీరీతి వరించిననాడే,
జీవం మోడైనా,
ననదొడుగు నటించు ఎడందలో ఏమైనా
వినబడ్డా కానీ, అది ఒకానొకరొదయే!
ఓ సుమకోమలసుందరోజ్జ్వల
స్త్రీవ్యక్తీ! శక్తీ!
ఆరొదలోపలిరొదయే నాచేయూతై, నాలే
యెదలోపలియెద గలలో కలువరింతయై
మెదిలి మెదిలి నన్నెల్లెడ వెదకించెన్ నీ
యెదిరో తెలియని సహవాససహాయంకోసం!—
అదునే కాలేదో ఆతొలికాలంలో— నా
హృదయంలో ఒంటరినై నే నిలబడి, ఏదో
పదముల సవ్వడికై యెదురుచూచి చూచి
అలసితిన్ నా హృదయేశ్వరి!

* *

రచన

# స్త్రీ

ఈనాడీ యలసిన ఆశాజీవం నిదురించిన యీ
అర్ధరాత్రి నీదరస్మితాహ్వానాలోక మ్మా
యంతరిక్షసీమనుండి దిగి నాపై
కురిసెనో జాలై, తారై మెరిసెనో, పూలై
విరిసెనో!—

ఈలోనే నీ కాంతితనువు నా దేహం
దరిసి, అలపుగొన్న నా స్వప్నజీవితావరణం
మేలుకొలిపి, నా హృదయోద్భవనంలో దీపం
నిలిపితివే! విలసిత లావణ్యశ్రీవై!
స్త్రీవై!
నీవై!
నీ వెవరైనా, నీ పేరేమైనా కానీ!
నవనిత్యయావనానందప్రాణీ!

మల్లవరపు విశ్వేశ్వరరావు

# ఇద్దరు నవకవి మిత్రులకు

నన్ను గాంచినంత మీరు
నమస్కార మిదే యంచు
నవ్వుకున్నారోయ్,
విరినవ్వుతో నన్ను
విసిరికొట్టితిరోయ్ !

మిమ్ము జూడగానె నేను
మిసుము లీను మీలేనువుల
మెచ్చుకున్నానోయ్,
మురిపెమ్ముతో మిమ్ము
ముంచివేసితినోయ్ !

సుధ లీనెడి చూడ్కులు, పువు
దేనె లూరు తీయనుడులు
తీర్చుకున్నారోయ్ ;
బయలుగా మీర లవి
బయటపెట్టుదురోయ్ !

పసివేళటి పాలనునుపు,
ఎలబ్రాయపు ఏటిపొంగు
ఇంకిపోలే దీ
ఎదలో సుస్థిరముగ
పదిలమైనాయోయ్ !

ముఖములోన ముడత లున్న
శిఖ పలిత స్నిగ్ధమైన
ముదిమి రాలేదోయ్ ;
నమ్మకుంటే ఎడద
కుమ్మి చూడండోయ్ !

అమరామృత నిర్ఝర మెద
అడచుకొంటి జహ్నువట్లు
అది కదప నురకే ;
పని వచ్చినప్పుడే
బయటపెడతానోయ్ !

నోరి నరసింహశాస్త్రి

# అభిమన్యుడు

౧

"పోరు పో"రంచు రణభేరి మ్రోగ బయట
"వలదు వల"దంచు నింటిలోపలను నీవు
కంటి కాటుక చెక్కిళ్ల కఱడు గట్ట
జలజలని రాల్తు దుఃఖబాష్పముల వేల!

౨

దూరముననుండి సంగ్రామ దుందుభులను
ఉఱుములంబోలె విని యని కుఱుకు నాకు
కాలు గరగించు నీ యార్తరవము వినిన
పొంగి పోయెడు నెమ్మేను కుంగిపోవు.

౩

పగఱ తెలివిచ్చు కత్తుల వాడి పోట్ల
రాయిడికి చెక్కుచెదరని ఱాతిగుండె
తొలివియోగపు జాలిచూపుల స్రవించు
వేడి కన్నీట కరగి ద్రవింప దొడగు.

౪

భద్ర దంతుల కఠిన కుంభస్థలాలు
చీల్చి ముత్యాల భూమి నర్చించు నాకు
నీ విషాద ముక్తాశ్రులు నేల రాలి
చింది చిటిలిపోవుట చూడ జింత వొడము.

౫

పర నిశితబాణ వర్షప్రపాతములకు
నదురు బెదురును లేక నే నెదురు నడతు
పడతి, కన్నీటి తొలకరి వాన జడికి
గడగడ వడంకు నేడు నాయొడ లదేమొ!

౬

ఒక్కతఱి నే రణావని కుఱికినంత
పగఱ వ్యూహము లన్నియు భగ్నమగును
కలికి కడగంటి చూపు మొగ్గరమునుండి
పోరి తప్పించుకొన నాకు దారి లేదు.

కొడాలి ఆంజనేయులు

# ప్రేతభూమి

మండుతోంది
మండుతోంది
మిన్ను కాల్చి మండుతోంది
పడమటిదెస ప్రేతభూమి.

ఊరిబయట కోనేట్లో
రక్తం చూచెనో
పిట్టలు,
కళవళించి రోదసిలో
గూళ్ళ చేరి దాగున్నవి.
కళ్లంలో తొంగిచూచి
ఊళవేసె నక్కలదొర.

మండుతోంది
మండుతోంది
ఆకలితో మండుతోంది
నాయెదవలె నీయెదవలె
కుమారిల్లి రుద్రభూమి.

రక్తం క్రక్కినపులివలె
చచ్చిన సూర్యునిదేహం
సంధ్యావాహకు లెవరో
కాష్ఠంలో వేల్చినారు.

పొగలే ఇరుళ్ళై జగతిని
భూతంలా కౌగిలిస్తె
వేయితరంగాల జలధి
గడగడమని వణకింది.

పడగెత్తిన నల్లత్రాచుగా
శివమెత్తిన మహాంకాళిగా
కాళనిశీథిని
ఉన్మాదంతో
ప్రళయతాండవం చేసింది.

పురిపండా అప్పలస్వామి

# కొత్త చెప్పులు

'కరుణకుమార'

[ఆదిగాడు ఆ గ్రామమాదిగవాళ్ళకందరికీ కులపెద్ద. అనాదిగా వాడిపెద్దలలగాయితు ఈగౌరవం వంశ పారంపర్యంగా వస్తూఉండడంచేత ఆదిగాడుకూడా తనహయాంలో గౌరవంగానే కాలక్షేపంచేసి నిరుడు సంవత్సరము శ్రావణమాసంలో వచ్చినదూముల్లో కలరాతగిలి పాపం వెళ్ళిపోయాడు. ఇంట్లో వాడిభార్య నరిసీ, పన్నెండేళ్ళకొడుకూ, ఓ యెనిమిదేళ్ళ కూతురూమాత్రం ఉన్నారు. నరిసి కూలికిపోయి రోజుకో ముంతెడుగింజలు చెమటఊడ్చి సంపాదించుకొని పొట్టపోసుకొంటూ పసిపిల్ల లెప్పుడు చేతి కందివస్తారా అని నిత్యమూ అంకాళమ్మకు దణ్ణాలుపెట్టుకొంటూ కాలక్షేపం చేస్తోంది. చిన్నపిల్ల లయినప్పటికీ యిద్దరుపిల్లలూ రోజూ పొద్దున్నే పొలంచాయ పోయి పొయ్యిలోకి ఇన్నిచితుకులూ, కంపా, కట్టా, పేడా పోగుచేసుకొని తల్లికి కాస్త వేన్నీళ్ళక చన్నీళ్ళ్లాగ సహాయంచేస్తూఉన్నారు.

ఆదిగాడు బ్రదికిఉండంగా పెద్దమాదిగ కాబట్టి ఆ గ్రామంలో పదిమంది పెద్దఆసాములయిళ్ళకూ ఉద్యోగంచేస్తూ ఏటా కుప్పనూర్పుళ్ళల్లో ఎట్లాలేదన్నా ఓపందుంగింజలు కళ్ళచూస్తూఉండేవాడు. పైగా ఆసాములయిళ్ళల్లో పసరం చచ్చినపుడల్లా వాడికి తోలు మిగులుతూఉండేది. తోలు కొంతభాగం ఆసాముల చెప్పులకిందా, తోలుబొక్కెనలకిందా, ఎద్దులకు మెడవారులకిందా, ముక్కులపట్టెళ్ళకిందా ఖర్చవుతూఉన్నప్పటికీ, మరికొంత మిగులుతూనేఉండినందువల్ల తద్ద్వారా వాడికి కొంతఆదాయం ఉండకుండాపోయేది కాదు: కాని ఆదిగాడు చనిపోయినతర్వాత ఇంట్లో సంతనలేక, నరిసి పూర్వంఉన్న అన్నియిళ్ళకూ ఉద్యోగం చేయలేకపోయింది. అందువల్ల పూర్వం చేస్తూఉన్న పదియిళ్ళల్లోనూ, ముఖ్యమైన ఏనాలుగైదిళ్ళో తప్ప మిగిలినయిళ్ళను, తనకొడుకు చేతికెక్కివచ్చేవరకు తనకు వల్లకాదని చెప్పి వదులుకొంది. తను మిగుల్చుకొన్న ఆనాలుగిళ్ళకైనా నరిసి సమయానికి మాదిగవాడలో ఎవరినో అన్నా, నాన్నా అని బ్రతిమలాడుకొని, ఆసాములకు ఏం లోపమూలేకుండా ఉద్యోగంజరుపుకొంటూ జీవనం గడుపుకొంటోంది.]

## ౧

చిన్నపరెడ్డి గ్రామంలోఉన్న మోతుబరీ ఆసాములలో ఒకడు. అంతేకాదు, మోతుబరులలోకల్లా కాస్త ముఖ్యుడనికూడా చెప్పొచ్చు. ఆ గ్రామంలో అందరూ లేత కాపులపుట్ట. అంతా ఒకరికొకరు కావలసినవాళ్లు; బీరకాయపీచు. అందువల్ల ఉన్నవాళ్ల ల్లోకి మొదటినుంచీ చిన్నపరెడ్డిది కాస్త తలబిరుసుతత్వం అయినప్పటికీ అతను చేసేదుండ గాలూ, బీదలను పెట్టేహింసా బయటికిరాకుండా సమయానికి గ్రామంలో నలుగురూ కమ్ము కొనిరావడంమూలాన్న పరిశపారిపోతూవస్తున్నవి. పైగా గ్రామమునసబు వాళ్లవాడే

అయినందువల్ల అతడు మరీపేట్రేగుతూవచ్చాడు. దీనికితోడు ఏజన్మలో చేసుకొన్న పూజవల్లనో అతనికి ఈజన్మలో లక్ష్మిందేవికూడా కటాక్షించడంవల్ల అంతా ఒకయేభై, అరవై యెకరాల మాగాణిసేద్యమూ, ఒక డెబ్భైయెకరాల మెట్టసేద్యమూ, ఇంట్లో కావలసి నంత పాడీ పంటా లభ్యమయి, జీతగాళ్లూ నాతగాళ్లూ కలిగి మొదటినుంచీ అతగాడి కమతం కొంత అట్టహాసంతోనే జరుగుతోంది. అదీకాక గ్రామంలో జరిగే చిల్లరతగవు ల్లోనూ, ఇచ్చిపుచ్చుకోవడాల్లోనూ మాటకారికాబట్టి తరుచు చిన్నపరెడ్డికాడికే పార్టీలు వస్తూవుండడం, అతడు పంచాయతీచేసి వ్యవహారాలు పరిష్కారం చేయడం జరుగుతూఉన్నందువల్ల, ఈవిధంగాకూడా అతనికి గ్రామంలో సలుగురిలోనూ కాస్త పెద్ద అనిపించుకోవడానికి హేతువైంది.

ఇక చిల్లరబాపతు అలగాజనానికి ఇతడంటే డొక్కలో మెదలుతూఉండడం తప్పితే విద్దూరమేమిన్నీ లేదు. గ్రామమునసబూ, కర్ణమూ — ఇద్దరూకూడా ఒకరికిం మనుష్యులైనందువల్లనో, లేక అతని జననకాలనక్షత్రబలిమివల్లనో కాలక్రమేణా గ్రామంలోని సివిల్, క్రిమినల్ అధికారాలన్నీ చిన్నపరెడ్డి స్వాధీనపెట్టుకొని అమలుజరుపుతూవచ్చాడు. అతనిమాటంటే సుగ్రీవాజ్ఞా, అతడంటే సింహస్వప్నమూ అయింది అలగాజనానికి. ఆఖరుకు అతనిపలుకుబడి—అతడు నందంటే నందీ, పందంటే పందీని. ఎప్పుడు ఏంతెచ్చి నెత్తిమీద పెట్టుతాడో అని బీదలంతా హడిలి జీవిస్తున్నారు.

నరిసి తనఉద్యోగంలో మిగుల్చుకొన్న యిళ్లల్లో చిన్నపరెడ్డియిల్లు ఒకటి. రెడ్డి చెప్పుల్లో ఒకచెప్పు ఈమధ్య కుక్క ఎత్తుకుపోయి కొరికిపాడుచేయడంవల్ల అతడు నరిసిని పిలిపించి ఒక కొత్తచెప్పులజోడు తయారుచేసి తీసుకురమ్మని చెప్పాడు. ఒకవారంరోజులు వెసిలికయిస్తే తయారుచేయించి తీసుకొనివస్తానని చెప్పి నరిసి వెళ్లిపోయింది.

నరిసి కోరిన వారంరోజులగడువూ అంతకుపూర్వంరోజునే గడిచిపోయింది. కాని యింకా చెప్పులజోడు రాలేదు. కాలికి జోడులేకుండా తిరగడానికి రెడ్డికి ఇబ్బందిగాఉన్నది. ఈవారంరోజులూ ఎట్లాగో కష్టంమీద గడుపుకుపోయినాడు. పోనీ ఆరోజయినా తెస్తుం దేమో అని పొద్దుటినుంచీ చూచాడు. కాని నరిసి రాలేదు. ఉండయాన్నే ఒకసారి తన సేద్యగాణ్ని నరిసియింటికి పంపాడు. అది యింటికి రాలేదని పోయినమనిషి చక్కా వచ్చాడు. ఆరోజు తూర్పుచేలోకి—ఓరెండుమైళ్లదూరం—రెడ్డి కుప్పనూర్పుకి పోవలసి వచ్చింది. వైశాఖమాసం మధ్యాహ్నం పన్నెండుగంట లయింది. అప్పుడే భోంచేసి రెడ్డి బయిటికి వాకిట్లోకి వచ్చాడు. ఎండ తీక్షణంగా కాస్తోంది. జరూరుగా పోవలసినపని. కాలికి చెప్పులు లేవు. పోనీ ఎవరివైనా ఎరువు తీసుకుపోదామనుకొంటే సమయాని కెవరూ

తటస్థపడలేదు. ఇంట్లోకివెళ్ళి పొగాకుకాడఒకటి తీసుకు చుట్టచుట్టి నోట్లోపెట్టాడు. అగ్గిపెట్టె తీసి ముట్టించాడు. శరీరంలో ఒకవిధమైన చురుకుదనం కలిగింది: నరిసి చెప్పులు తీసుకువస్తానని చెప్పినగడువు దాటిపోయి సెకండ్లు, నిముషాలూ, గంటలూ గడిచినకొద్దీ— గడిచిపోతూవున్నదని తలచుకున్నకొద్దీ — చిన్నపరెడ్డికి లోపల కుతకుతపుట్టి ఉడుకు ప్రజ్వలిస్తోంది. చిరుచెమటలుపోసినవి. ఆడదానికింతనిర్లక్ష్యమా అనుకొన్నాడు. ఇట్లా ఆటలు సాగనిస్తే తనసంగతేమికావా లనుకొన్నాడు. నిట్టూర్పు లధికమైనవి. నోటిలో పెట్టినచుట్ట బ్రహ్మాండంగా కాలిపోతూఉన్నది. నిట్టూర్పుతో పీల్చినగాలికి రెడ్డికి నోటిలోకీ ముక్కులోకీ ధూమసముదాయం ఎక్కిపోతున్నది. రెడ్డికి కళ్ళెర్రబారినవి. పీల్చిన పొగ ముక్కుపుటాలగుండా, పళ్లసందులగుండా బయటికి మబ్బుతెరలల్లా వస్తూవుంది. నట్టనడి ఆకాశాన్నుంచి భగవానుడు తనసహస్రకిరణాలతోనూ లోకాన్ని పొదిగి వేడెక్కిస్తున్నాడు. రెడ్డికి శరీరం వేడెక్కిపోతోంది. నరిసి యింకా రాలేదు. కాళ్ళకు చెప్పులు లేకుండా పొలం పోవడమా? మానడమా? వెళ్ళక విధిలేదు. పైన ఉత్తరీయం వేసుకొన్నాడు. చేతిలో కర్ర పుచ్చుకొన్నాడు. సమయానికి గొడుగు అగుపడలేదు. దాన్ని వెతకడానికికూడా అతనికి స్థిమితం లేకపోయింది. ఇంట్లో ఆడవాళ్లు భోజనంచేస్తున్నారు. పొలంపోదా మనుకొని రెడ్డి గడపదాటి నాలుగడుగులువేసి వీధిగుమ్మంలోకి వచ్చేవరకు నరిసి ఒక చిన్నవెదురుపేళ్ళబుట్టలో ఒకజతచెప్పులు కొత్తవి తీసుకువచ్చి గుమ్మంలో అతని కెదురుగా పెట్టింది.

"నిన్న తీసుకువస్తానని చెప్పి ఇంతవరకూ తీసుకురాకుండా ఎందు కాలస్యంచేశావే రండా" అని రెడ్డి గ్రుడ్లు వురిమి అదలించాడు.

"సామీ! నా కింటికాడ సంతనలేదుగదా. ఏలయ్యానో కాళ్లూకడుపూ పట్టుకొని ఉద్యోగంచేయించుకోవాలి. నేను బ్రతిమలాడిన మాదిగాడు నిన్న మాపటికి తయారుచేసి తీసుకువచ్చాడు. కొత్తచెప్పుల కాముదంరాసి తీసుకువద్దా మనుకొని పొద్దుటేలనుంచి ఆముదంకొనడానికి చేతిలో డబ్బులేక, తిరిగితిరిగి, ఆవీధి కోమటాయన్ని బతిమలాడి ఇంత ఆముదపుచుక్క పెట్టించుకొని చెప్పులకు పట్టించి తెచ్చా. ఆముదం పెట్టకుంటే తమరు కోపంచేస్తారని అది పెట్టించేవరకు ఈయేలయింది సామీ" అని నరిసి గడగడ వణుకుతూ తడబడుతూ జవాబు చెప్పీచెప్పకమునుపే చిన్నపరెడ్డికి ప్రపంచం తెలియలేదు. శరీరం అతనిస్వాధీనం తప్పిపోయింది. ముఖం ఎర్రబారింది. కోపంతో వళ్ళంతాకంపించిపోతోంది. పిడుగులుపడేటట్టుగా ఉరిమి, "ఊఁ లంజా! నీ కాముదం చిక్కలేదుగా! తెస్తా నన్న వేళకు తేక ఇంత అలక్ష్యమా? మాదిగలంజె కింత కావరమా?" అంటూ పిచ్చుకమీద

బ్రహ్మాస్త్రం ప్రయోగించినట్టు, తనచేతికర్రతో ఈడ్చి నరిసిని మోదివాడు. వాడ్రేవునను 'చచ్చాను దేవుడా' అని అరుస్తూ, వాతంకమ్మిన కుక్కలాగ గిలగిల గిలగిల గిలకొట్టుకుంటూ తాను నాలుగుసార్లు తిరిగి నడివీధిలో కిందపడి కర్మసాక్షి సూర్యునికేసి మిడిగుడ్లు పెట్టి కళ్లు తేలేసింది.

## ౨

చిన్నపరెడ్డి కుప్పనూర్పుకాడికి తూర్పుపాలెం పోవాలనుకొని బయలుదేరి వాకిట్లో కొస్తే ఇంతగ్రంథం జరిగి నరిసిప్రాణం హరీఅంది. వాకిట్లో నడివీధిని శవం పడి ఉంది. వీధిలో ఇటూఅటూ పారజూచాడు రెడ్డి. మిట్టమధ్యాహ్నం, భోజనాల సమయం, వీధులన్నీ నిశ్శబ్దంగా ఉంది. జనసంచారం లేదు. కాని ఏమిచేయడానికీ రెడ్డికి ఆలోచన తోచడం లేదు. కళ్లకు కమ్మిన కావరంకొద్దీ బుద్ధి మట్టగించి ఆవ్రదేశంలో అలాగైపోతే అనుకోకుండా అయిపోయింది. ఇప్పుడు అతనికి తలవేడి తగ్గింది. క్రోధం చల్లారింది. ఇది మామూలు విషయం కాదని గ్రహించాడు. శవాన్ని ఎంతసేపని ఆప్రకారం వాకిట్లో ఉంచడం? ఎవరికంటా పడకుండా ప్రక్కనున్న గాన్ని దొడ్డిగుమ్మాన్న వాములదొడ్లోకి చేర్పిస్తే, తర్వాతవిషయం నిదానంగా ఆలోచించుకోవచ్చు ననుకొన్నాడు. కాని శవం దొడ్లోకి చేరేవుపాయం ఏదీ? పాలేర్లంతా కుప్పనూర్పులో ఉన్నారయ్యె. ఇంట్లోకి పరుగెత్తాడతడు. భార్యా, తల్లీ అన్నం తింటున్నారు. దాసీపనిచేసే యానాది లక్ష్మి పడమటింటి వసారాలో కూర్చొని బియ్యం బాగుచేస్తోంది. ఖంగారులో ఏమీ తోచక భార్యను పిలిచి ఇట్లా జరిగిందని తొట్రుపడుతూ చెప్పాడు. తల్లి చెవినిబడింది విషయం. అమ్మయ్యో అని తల్లీ భార్యా గుండెలు బాదుకొన్నారు.

"ముందు శవాన్ని వాములదొడ్లోకి చేరుద్దాం రండి. అదేపనిగా వీధిలో ఉంచడానికి వీలులే"దన్నాడు రెడ్డి.

"సరే! యానాది లక్ష్మినిగూడా పిలుస్తాను. ఉండు" అని భార్య లక్ష్మిని పిలిచింది; దానితో రహస్యంగా చెప్పింది విషయం. సంగతంతా వినేసరికి లక్ష్మికి హడలెత్తి "నావల్లకాదమ్మా ఈపని" అని ఊరిబయట తనగుడిసెకాడికి పరుగెత్తింది. "ఆలస్యం అవుతోందర్రా" అనేవరకు, తల్లీ భార్యా రెడ్డీ ముగ్గురూ కలిసి వీధిలోకి వచ్చారు. రెడ్డి తిరిగి ఇటూఅటూ వీధిలో నాలుగువైపులూ పరకాయించి చూచాడు. జనసంచారం లేదు. ఇదే సమయం అనుకొని ముగ్గురూ చెయ్యిచేసుకొని శవాన్ని వాకిటగుండా వాములదొడ్లోకి చేర్చి ఎండుగడ్డివాములో, లోతుగా దూర్చి బయటికి కనిపించకుండా గడ్డి కప్పి వచ్చేశారు.

# కొత్త చెప్పులు

కాని రెడ్డికి మనస్సులో దిగులుగానే ఉంది. తాను చేసినపని ఎవరికంటా పడలేదని నమ్మకమేనా? లేక ఎవరికంటనైనా పడిందా? అని అదే ఆలాపన అతనికి. గుండెలు కొట్టుకొంటూనేయున్నవి. తిన్నఅన్నం అంతా నీరైపోయింది. ముచ్చెమటలు పోసి శరీరం నిస్సత్తువయిపోయింది. మాదిగశవాన్ని తాకినందుకు ముగ్గురు వాహకులూ వీధితలుపూ, దొడ్డివాకిలీ గట్టిగా లోతట్టు బిగించి సందులోని బావిదగ్గర వెంటనే స్నానంచేసి గుడ్డలు మార్చి చలవమడతలు కట్టుకొన్నారు. "శుభంవలె ఇదేం ఖర్మం వచ్చిందర్రా నిండుయింట్లోనూ" అని తల్లి ముసలిది కంటనీ రెట్టుకొంది. "నోరువిప్పితే గొంతుక పిసుకతా"నని రెడ్డి గదమాయించాడు.

మధ్యాహ్నం ఒంటిగంటా రెండుగంటలు కావచ్చింది. సూర్యుడు కొద్దిగా పడమటికి జారుతున్నాడు. రెడ్డి మళ్లా చుట్ట ముట్టించి తూర్పువసారాలో ఇటూఅటూ పచార్లు చేస్తూ తడిసినతల విప్పుకొని జుట్టు ఆరబెట్టుకొంటున్నాడు. కర్తవ్యం ఏమీ స్ఫురించడం లేదు. అంతా చికాకుగానే వుంది. రిచ్చపాటుదశలోనే ఉన్నాడు.

ఇంతలో రెడ్డికి చెప్పు లిచ్చివస్తానని చెప్పి రేపకేళసంగా పోయినఅమ్మ యింటికాడ కూడయినా వండకుండా పొద్దు పడమటికి వాలినా రాలేదే అని పొద్దుటేలనుంచీ కూడూ నీళ్ళూ లేక చూసిచూసి కళ్లు కాయలుకాసి ఆకలికి శోషవచ్చి, అయినా రెడ్డిగారియింటికి పోయి విచారిస్తే మందల తెలుస్తుందని సరిసికొడుకూ, కూతురూ — ఇద్దరూ కలిసి రెడ్డి కెదురుగా వీధిగుమ్మంలో ప్రత్యక్షమైనారు.

"అయ్యా! మాఅమ్మ మీకాడికి చెప్పులు తెచ్చిందే. ఏడబోయిందీ?" అని పిల్లలిద్దరూ రెడ్డి నడిగారు.

రెడ్డికి ప్రాణాలు నిలువునా ఎగిరిపోయినవి. నిలుచున్నమనిషి తటాలున కిందిచీడీ మీదికి చతికిలబడ్డాడు. నోటిలోచుట్ట జారి కింద పడిపోయింది. కాళ్ళూ, చేతులూ పటుత్వం తప్పిపోయినవి. పసిపిల్లకాయ లిద్దరూ అతనికళ్లకు పెనుభూతాల్లాగా కనిపించారు. పిల్లలు వాకిట్లోనుంచి కదలలేదు. జవా బివ్వకుండా ఎంతసేపని ఊరుకోగలడు రెడ్డి? ఇంత మాత్రానికే యింత అధైర్యపడితే ఇక ముందు జరుగవలసినకథంతా ఎట్లాగ నడవడం? ధైర్యం చిక్కబట్టుకోవా లనుకున్నాడు. సకిలించాడు. గొంతు సవరించుకొన్నాడు. చాచుకొన్నకాళ్లు ముడుచుకొన్నాడు. మూతిమీద చేయివేసుకొని మీసం సవరించుకొన్నాడు. జుట్టు దులిపి ముడిగట్టాడు. భార్యను పిలిచి మంచినీళ్లు తెప్పించుకొని ఓలోటానీళ్ళు తాగాడు. పిల్లకుంకల్ని క్షణంలో నమ్మించగలం అనుకొని,

"ఒరే మీ అమ్మ చెప్పు లిచ్చి అప్పుడే యింటికి పోయిందిరా, ఇక్కడ లేదు. అది ఇంటికింకా రాలేదూ?" అన్నాడు.

"లేదయ్యా! పొద్దుటేలనుండి మాకు బువ్వ లేదు. ఇంకా యింటికి రాలేదు. ఎక్కడకు పోయిందో" అని వాళ్ళన్నారు.

"పొండి, పొండి, ఇంటికి పొండి. మీ అమ్మ ఇక్కడ లేదు. ఎందుకు ఎండలో తిరుగుతారు? పొండి" అని తొందరచేసి కూడు లేక ఆకలికి మాడుతున్న పసిపిల్లకాయల కింత అన్నమైనా పెట్టిపంపితే బాగుండునన్న ఆలోచనైనా లేకుండా వాళ్ళిద్దరూ తనదృష్టి పథంనుండి తొలగి బయటికిపోతే చాలు ననుకొని, ఆత్రంతో వాళ్ళను తొందర పెట్టి పంపివేశాడు. దిక్కూ-దెసా లేక, దారీతెన్నూ తోచక వచ్చిన కుర్రకుంకలు వచ్చినట్టుగానే యింటికి పోయారు.

## 3

మధ్యాహ్నం మూడుగంట లయింది. కాలచక్రం గిర్రున తిరిగిపోతోంది. చీకటి పడితేనేగాని తను తలపెట్టినకార్యం సాగదని, ఎప్పుడు పొద్దుగుంకుతుందాఅని రెడ్డి కొంత సేపు ఆత్రపడ్డాడు. కాని అంతలోనే అతనికి పొద్దు గుంకుతుందంటే భయంకూడా వేసింది. మొత్తానికి మనిషి కొంచెం జంకాడు. మొదటున్న ధైర్యం ఇప్పుడు లేదు. గుండె బిగువు జారింది. కాని బయటి కట్లా కనిపించకూడదని మేకపోతుగాంభీర్యం తెచ్చిపెట్టుకొన్నాడు. ఆఖరుకు పొద్దు గుంకింది. చీకటిపడింది. రాత్రి ఎనిమిదిగంట లయింది. తొమ్మి దయింది. నెల యింకా పొడవలేదు. అతని సేద్యగాళ్లల్లో కొంతమంది యింటికి వచ్చారు. వాళ్ళలో ఇద్దరిని-జెబ్బపుష్టీ, పిక్కబలిమీ గలవాళ్లని-చాటుకు పిలిచాడు రెడ్డి. భయపడవ ద్దన్నాడు. ఇదిగో పదిరూపాయలనోటు, ఈనాం తీసుకోం డన్నాడు. జరిగినవిషయం అంతా చెప్పాడు.

"మీరు రెండోఆలోచన లేకుండా ఈశవాన్ని ఊరిబయట పొగడదొరువులో పారేసిరావాలి. ఇదిగో పదిరూపాయలనోటు. ఊఁ! రెండో ఆలోచనచెయ్యడానికి వీలు లేదు. తొందరగా రావాలి. చూడండీ, ఈ రెండు ఈతచాపలలోనూ శవాన్ని చుట్టి తీసుకొనిపొండి. అయిదునిముషాల్లో పని పూర్తిచేసుకురావాలి" అన్నాడు రెడ్డి.

పదిరూపాయలనోటు చూచేవరకు ఇద్దరుముతరాచువాళ్లకూ మేరువు దొరికినట్లయింది. నడుంకట్టారు వాళ్లు. వామికాడికి పోయారు. దీపం తెచ్చేదాఅని రెడ్డి అనేవరకు వద్దన్నారు. శవాన్ని చాపలో చుట్టారు. కాళ్లతట్టు ఒకరూ, తలతట్టు ఒకరూ ఎత్తుకొన్నారు. దొడ్డిగుమ్మంకాడికి వచ్చారు.

# కొత్త చెప్పులు

"ఉండండి! ఉండండి" అని రెడ్డి వాళ్లను అదలించాడు. తాను తలుపు వోర వాకిలిగా తీసి ముందు వీధిలోకి పోయాడు. రాత్రి పదిగంటలు దాటివుంటుం దనుకొన్నాడు. వీధిలో నిశ్శబ్దం గమనించాడు. ఇక వెళ్ళండన్నాడు. ముతరాచు లిద్దరూ కళేబరాన్ని వీధి దాటించారు.

ఇక రెడ్డికి కాస్త స్థిమితం ఏర్పడుతూ ఏర్పడుతూ వుంది. కాని పోయినమనుష్యులు తిరిగి తన కళ్ళపడేవరకూ అతనికి పూర్తిశాంతి చిక్కేటట్టు కనపడలేదు. ఇంతలో వెళ్లిన వాళ్లు పావుగంటలో వచ్చి జయభేరీ మోగించారు. రెడ్డి 'అమ్మయ్యా!' అనుకొని భోజనానికి లేచాడు.

నరిసిపిల్లలిద్దరూ ఆపగలూ, ఆరాత్రీ పక్కయింటి మాదిగయింట్లో కూడుతిని దిగులుతోనే ఆరాత్రంతా గడిపారు. తెల్లవారింది. సూర్యుడు తిరిగీ తనధర్మం నిర్వర్తించడానికి ప్రాక్పీఠాన్ని అధిష్ఠించి ఈవిశ్వప్రపంచంలో జరిగే సమస్తకర్మలూ వీక్షిస్తూ, వాటికి సాక్షీభూతుడైన ప్రత్యక్షదేవతవలె ప్రకాశించిపోతున్నాడు. బారెడు పొద్దెక్కేసరికి ఎవరిదో ఆడదానిశవం ఊరిగమిడి పొగడదొర్వులో పైకి తేలిందని గ్రామంలో పుకారు పుట్టింది. గ్రామమునసబు వెట్టినౌకర్లను పిలిపించి శవాన్ని బయటికి తీయించిచూచి మాదిగనరిసి శవంగా గుర్తించి మాదిగవాడకు కబురుచేశాడు. మాదిగవాళ్లంతా చుట్టబెట్టుకొని నరిసిపిల్లకాయలతో సహా దొరువుకాడికి వచ్చారు. శవాన్ని చూచారు. నరిసి పసిపిల్లలిద్దరూ ముందుకు వచ్చి శవంమీదపడి గొల్లుమన్నారు. "అయ్యో! పసిపిల్లకాయలిద్దరినీ అన్నాయంచేసి పోయిందే" అని పిన్నాపెద్దా అందరూ దుఃఖించారు. కూడా వచ్చినవాళ్లు పిల్లవాళ్లని ఇవతలికి తీసి ఓదార్చారు.

పిమ్మట గ్రామమునసబు పోలీసువారికి రిపోర్టుచేయడంతోటే పదకొండుగంటలికి వచ్చివాలారు వారు. ఈలోపల ఎట్లా పొక్కిందో ఆనోటా ఆనోటాబడి అసలువిషయం— చిన్నపరెడ్డి నరిసిని కర్రతో కొట్టి చంపి రాత్రివేళ శవాన్ని దొరువులో తోయించాడని— ఊరూవాడా పొక్కిపోయింది. లోకం నోరుమూయడానికి మూకుడేదీ? సూర్యుడు నడినెత్తిమీదికి వచ్చేకొద్దీ గ్రామంలో పుకార్లు బలమైపోతున్నవి. కాని ప్రత్యక్షసాక్ష్యం మాత్రం రాలేదు.

ఒక సబినస్పెక్టరూ, ఒక సార్జెంటూ, ఇద్దరు కనిష్టేబులూ వచ్చారు. గ్రామంలో అడుగుపెట్టీపెట్టంగనే పసికట్టారు సంగతి. వారిముక్కుకి కమ్మంగా తగిలింది వాసన. అసలే పాముచెవులయ్యో వాళ్లవి. అందులోనూ ఇసుకలోనుంచికూడా నూనె పిండగల చాతురీ ధురీణులు వాళ్లు, ఘటనాఘటనసమర్థులు. ఇకనేం, రొట్టెవిరిగి నేతిలో పడినట్టయింది. ఇక

సవాలక్షగ్రంథం జరిగించవచ్చు. సబినస్పెక్టరు బాగా సార్వీసుగలచెయ్యి. బహుబింకం గానూ, బెట్టుగానూ నడిపాడు గ్రంథం.

చిన్నపరెడ్డి పట్టూవిడుపూగలమనిషి; ప్రవాహం పొంగి అలలు మీదికివచ్చినపుడు క్రిందికి వంగి తాకుడు తప్పించుకొనే నేర్పరి. అలవాటులేనిపని చేసినందుకు మొదట్లో కొంత అధైర్యపడి కలగచొక్కుకొన్నా రెడ్డి క్రమేణా గంటలు గడిచిన కొద్దీ అంతరంగికులైన ఒకరిద్దరు కావలసినవాళ్ళతోనూ, మునసబుతోనూ సంప్రదించుకొని ఎటువచ్చి ఎట్లా తిరుగుతుందో వ్యవహారం అని తనజాగ్రత్తలో తాను ఉన్నాడు. త్రినేత్రుడికి తెలియకుండా పోలీసువారికీ వీరికీ సంధానం జరిగిపోయింది. చిన్నపరెడ్డి ఇనపపెట్టె కాడికి పోయి లక్ష్మీదేవిని స్తవంచేశాడు. ప్రత్యక్షమై, ముల్లోకాలూ సంచరించుకొనిరమ్మని బయలు దేరింది దేవి. పోలీసు లెవ్వరూ చిన్నపరెడ్డి యింటివైపుకూడా మెదలలేదు పాపం. దక్షిణాపు గమిడిలోవున్న గ్రామమునసబుయింట్లోనే భోజనం వగైరాలకు పోలీసులకు బస. కర్మ కాండ యావత్తూ సహస్రనామార్చనతో అక్కడనే ఓపావుగంటలో పూర్తయిపోయింది.

అయిదుగురు పంచాయితీదార్లు మధ్యాహ్నం ఒంటిగంటకు వెలిశారు. "కడుపులో నొప్పివల్ల బాధపడుతూ, ఆబాధ భరించుకోలేక నడిసి నిన్నటిరాత్రి ఊరిగమిడి దొర్వులో పడి ఆత్మహత్య చేసుకొన్నదిగాని ఇతర అనుమానాస్పదమైన కారణము లేమిన్నీ లేవని పంచాయితీదార్లమైన మాఅభిప్రాయం"అని తీర్పిచ్చి సంతకాలుపెట్టారు పంచాయితీదార్లు. అనుమానా లేమిన్నీ లేనందున శవాన్ని డాక్టరుపరీక్షకు పంపనవసిన అవసరం లేదని పోలీసు వారు శవాన్ని మాదిగెలవశం చేయగా దాన్ని తగురీతిని దహనం చేశారు.

ఎవరిదారిన వారు వెళ్ళారు. మాదిగెలకు సమాచారం యావత్తూ తెలిసి వాళ్లు మనస్సుకితెచ్చుకొని బలవంతులైనప్పటికీ చిన్నపరెడ్డిచేసిన దురంతానికి క్రోధం పట్టజాలక అక్కసం వెళ్ళగక్కుతూ, వాళ్ళలో వాళ్లు మీటింగులుపెట్టుకొని అప్పటిలో ఏమీ బహి రంగంగా చేయ దలపెట్టకుండా, సమయంవచ్చినపుడు ఈరెడ్డిని ముప్పుతిప్పలాపెట్టి మూడు చెరువులనీళ్లూ తాగించాలని తీర్మానాలుచేసుకొని నివురుగప్పినినిప్పులా గమ్మునుని పల క్కుండా ఊరుకొన్నారు.

## ౪

ఆరోజు కారోజు వ్యవహారంఅంతా పరిశపారిపోయి చిన్నపరెడ్డి మనస్సు స్థిమిత పడింది. యథాప్రకారం అతను తనకార్యాలన్నీ చక్కపెట్టుకొంటూ మామూలుగా వీధిలో నలుగురిలోకీ రావడం చేయడం జరుగుతోంది. అంత హడావుడిలోనూకూడా నరిసి

# కొత్త చెప్పులు

తెచ్చినచెప్పులు మరచిపోకుండా అప్పుడే లోపల పోబుట్టలో భద్రపరిచివుంచాడు. కాని కథంతా తలక్రిందయేవరకు ఈగొడవలోపడి చెప్పులసంగతే మరిచాడు. పోలీసువారు వెళ్లిన మూడోరోజున తనకి బయటికిపోవడానికీ చేయడానికీ ఎండల్లో కష్టంగాఉన్నందువల్ల అతను కొత్తచెప్పుల్ని బయటకుతీశాడు. తీసి కాలు పెట్టబోయేవరకు అతనికి నరిసి తటాలున జ్ఞప్తికివచ్చింది. కాలు చెప్పులో దూరడానికి జంకింది. ఒక్కనిముషం నిదానించి ధైర్యం తెచ్చుకొని రెండుచెప్పులూ కాళ్లకు తొడిగాడు. రెండు మూడురోజులు ఆచెప్పులతోనే పొలంఅంతా తిరిగాడు. చెప్పులు కుట్టడంతీరూ అంతా షోకుగానేవున్నది. కిర్రుకూడా ఉంది. కుట్టడం మొగివాడు కుట్టినాడు కాబట్టి లోపంలేకుండానే తయారుచేశాడు. కాని కొత్తచెప్పులకి ఆముదంవేయడంమాత్రం ఆడది నరిసి అనడంవల్ల చమురు అంతబాగా పట్టలేదు చెప్పులకు. అందులో మండు వేసవికాలం అనడంచేత ఎండలకి చర్మం బహు బిరుసెక్కి కొయ్యబారిపోయివుంది. అవసరంకొద్దీ చెప్పులకు చమురు బాగా పట్టిందా లేదా అనేఆలోచన లేకుండా తెచ్చినచెప్పులు తెచ్చినట్లుగానే తగిలించి చిన్నపరెడ్డి పనధ్యానంతో ఇతరపనులమీద తిరుగుతూవచ్చాడు. కాని మూడోరోజుకి, కుడికాలుచెప్పు ఒరుసుకొని పాదంమీద రెండుచోట్ల కరిచింది. దానితో రెండు చిన్నపుళ్ళయినవి. దీనితల్లి కడుపుకాల చెప్పు కరిస్తే తగనిబాధ! అయినా ఇదేంచేస్తుందని పాపం లెక్కపెట్టకుండా మొండికెత్తి తిరిగాడు రెడ్డి. పాదంమీద లేచినపుళ్లు నీళ్లల్లో తడిసినవి. చెప్పులు కరిచిన పుండు నీళ్లల్లో తడవకూడదంటారు మరి. తడవడంతో అవి నీరుపోసి బొబ్బలెక్కినవి. అదే పోతుందని లెక్కపెట్టకుండా చిన్నపరెడ్డి ఆపుళ్లమీదనే మళ్ళా చెప్పులుతొడిగి మొండికెత్తి, బండతనంతో మరిరెండురోజులు తిరుగుతూవచ్చాడు. మళ్ళా యథాప్రకారం కాలు తడుస్తూనేవుంది. దీనికితోడు భోజనంలో పెసరా శనగా మొదలయిన పప్పాదినుసులు తగులుతూ వచ్చినందున పుళ్లు రెండూ చీముపోసినవి. దానితో కాలుకొంచెం బలుపుచేసింది. పోటు జాస్తీ అయింది ఆరోజుకారోజు. కొంచెం పులకరంకూడా తగిలింది. పూర్వపు మొండితనంతో తిరగడానికి వీలులేకపోయింది. కాని చెప్పులు తిరిగి తొడగకపోయినా పుళ్లకి వెంటనే తగిన చికిత్సచేయడానికిమాత్రం అతడుపేక్షచేసి, పైగా భోజనంలో మామూలు ప్రకారం మజ్జిగా పెరుగూవగైరాలు యథావత్తూ వేసుకొని తింటూవచ్చాడు. అందువల్ల కాలిమీద రెండుపుళ్లూ క్రమేణా వృద్ధిఅయి బాధ ఎక్కువైంది. మంచం ఎక్కేస్థితికి వచ్చింది. అప్పటి కప్పుడే పదిరోజులైంది. కాలిపోటువల్ల రాత్రిళ్ళు నిద్రలేదు. కూచోనివ్వదు, నిలవనివ్వదు, పడుకోనివ్వదు కాలు. అప్పటికి గ్రామంలో చట్కారివైద్యాలు కొన్ని చేయించాడు. ప్రయోజనం లేకపోయింది. పదిహేనురోజులైంది. అన్నహితవు తగ్గింది శరీరం నీరసించింది. బాధ జాస్తిఅయింది. మనిషి సగమయిపోయాడు. ఏమిచేయ

దానికీ తోచలేదు. అందులో చైత్రవైశాఖమాసాలు—మండువేసవి. తగనిదాహం—రోజుకు ముప్పై, నలభైసార్లు అన్నప్రాశనమాసం—నిస్సత్తువ—లేవలేనిస్థితి వచ్చింది. మంచం మీదనే సమస్తమూ జరుగుతున్నవి. ఏమేమి వైద్యాలో చేశారు. ఎందరెందరికో మొక్కుకొన్నారు. కాని రెడ్డికి నయంలేదు. ఇరవైరోజులైంది. నెల్లాళ్లుకూడా అయింది. సేద్యం సాద్యం విచారణంతా జీతగాళ్లకే వదిలేశాడు రెడ్డి. ఇంట్లో ఇతరసంతానం లేకపోయె. తల్లీ భార్యా అస్థులరిగిపోయేట్టు చాకిరీ చేస్తున్నారు.

ఇంట్లోస్థితి ఈవిధంగా ఉండగా మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్టు చిన్నపరెడ్డి ఎద్దులలో ఏనుగుపిల్లలాంటి మూడువందలరూపాయల ఖరీదుచేసే ఎద్దుకు ఇవిసిపాపువల్ల జబ్బుచేసి మూడోనాటికల్లా తాంఅని సల్లరాయి బద్దలైనట్లు బద్దలయి పశువులదొడ్లో చచ్చిపోయింది. ఆసంగతి వినేవరకు చిన్నపరెడ్డికి నవనాళ్ళూ కుంగిపోయినవి. దొడ్లో ఉన్న ఎద్దును చూడాలని కోరికపుట్టి అతడొకటిరెండుసార్లు లేచాడుగాని కాలు కింద పెట్టలేకపోయాడు. ఆఖరుకు అతని బలవంతంమీద అతను పడుకొన్న మంచాన్ని నలుగురు సేద్యగాండ్లు సాయంపట్టి మంచంపళంగా అతన్ని దొడ్లోకి తీసుకుపోయి చచ్చినయెద్దును చూపించారు. ఎద్దును చూచేవరకు చిన్నపరెడ్డి బోరుమని ఏడ్చాడు. బెంబేలుపడవద్దని ధైర్యంచెప్పి యింట్లోవాండ్లు తిరిగి మంచాన్ని లోపలికి సాయంపట్టించారు

ఉదయం పదిగంటలకు చచ్చింది ఎద్దు. సామాన్యమైనఎద్దు గాదు. పిల్లఏనుగువలె మంచిబలంమీద ఉన్నది. దాన్ని బయటికి తీయాలంటే ఏనుగుల బైనుతో కావాలి. చిన్నపరెడ్డి మాదిగవాళ్ళకి కబురంపాడు. దొరికింది సమయం అనుకొన్నారు మాదిగలు. నరిసి వాళ్లకడుపులో పెట్టిపోయినచిచ్చు చల్లారలేదింకా. ఆనాటికానాడు సూదులు గ్రుచ్చినట్టు ఒక్కొక్కసంగతే చెవినపడేవరకు వాళ్ళకు రగిలిపోతోంది కడుపులో. కులంములో పట్టుపట్టారంటే అతి మూర్ఖపుపట్టు వాళ్లది. హఠంపట్టితే త్రిమూర్తులు దిగివచ్చినా ససేమిరా అనేరకం. అదిగాక ఇప్పటికి ఎన్నితరాలనుంచో గ్రామంలోకల్లా పెద్దమాదిగ అని గౌరవంతో బహుచాకచక్యముతోనూ తెలివితేటలతోనూ మాదిగవాడలో అనాది కట్టుబాటులు చెడకుండా జరుపుకొన్నారు నరిసిమొగుడు ఆదిగాను, వాడితాతముత్తాతలూను. అట్లాంటి గౌరవంగల కులపెద్దకుటుంబానికి నేటికి చిన్నపరెడ్డిమూలంగా ఇన్ని కడగండ్లు వచ్చినందుకు మాదిగలందరూ శివమెత్తి పరవళ్ళుతొక్కుతున్నారు. ఏమైనాసరే ఆరుమూడైనా మూడారైనా సరే చిన్నపరెడ్డియింటికి ఉద్యోగానికిమాత్రం మాదిగవాడయినవాడెవ్వడూ పోగూడదని ప్రమాణాలుచేసుకొన్నారు. చుట్టుపక్కల పదిమైళ్ళ

దూరంలోగల అన్నిపల్లెల్లోనూ మాదిగవాళ్ళందరికీ వీళ్లే పురెక్కించి సమ్మెకట్టించారు. చిన్నపరెడ్డికి ఈసంగతి తెలియనే తెలియదు.

మాదిగ లెవ్వరూ రానన్నారన్న సంగతి పోయినమనిషి వాపసువచ్చి చిన్నపరెడ్డితో చెప్పాడు. రెడ్డి మంచంమీద ఉన్నాడు. పుళ్లురెండూ క్రమేణా పెరిగి కాలంతా వ్యాపించి పాదమంతా అలుముకొని ఒకపెద్దవ్రణమైంది. పొద్దు గూకివచ్చింది. ఉదయం పదిగంట లకు చచ్చినమొద్దు సాయంత్రంవరకూ అట్లాగే వున్నది దొడ్లో. దేనికని తాపత్రయపడ గలడు పాపం చిన్నపరెడ్డి? ఇంట్లో ఆడసంతనాతప్ప మగసంతనా లేకపోయె. జీతగాళ్లూ సేద్యగాళ్లూ ఏదోయేడెనమండుగు రున్నప్పటికీ వాళ్ళవల్ల అయ్యేపని కాదయ్యె ఇది. వ్యవ హారమంతా అడ్డంతిరిగినట్టు కనపించింది. రెడ్డి తాను స్వయంగా పోయి చూచుకొంటేనే గాని చక్కబడేటట్టు లేదు వ్యవహారం. స్వయంగా వెళ్లినప్పటికీ లాభంవుండేటట్టుగా లేదు. ఏమిచేయడానికీ తోచక గ్రామమునసబును పిలిపించి సంగతి యావత్తూ చెప్పాడు రెడ్డి. ఆరోజు చీకటిపడినందున మరునా డుదయాన్నే తాను మాదిగలను పిలిపించి విచారిస్తానని చెప్పి మునసబు వెళ్లిపోయినాడు.

మరునాడు ఉదయాన్నే మాదిగవాళ్లను పిలిపించి సంగతేమిటని విచారించి పరి ష్కరించేద్దా మనుకొన్నాడు మునసబు. కాని అప్పటికప్పుడే చాలాగాథ పెరిగి అనేక విషయాలు అతని చెవికివచ్చినవి. మాదిగలందరూ సభచేసి సమ్మెకట్టినారనీ, ఒకటి కాదు లక్షయిచ్చినాసరే ఈదెబ్బతోమట్టుకు చిన్నపరెడ్డిగుమ్మం తొక్కడానికి వీల్లేదనీ, ఆసాము లెంతహింసించినా వాళ్లు అన్నింటికీ తెగించివున్నారనీ యిట్లాంటివార్త లనేకం బయలుదేరాయి. తెల్లవారేవరకు గ్రామం అట్టుడికినట్లు ఉడికిపోతోంది. "అంత మదించి కిందూమీదూ తెలుసుకోకుండా ఆడదాన్ని హత్యచేస్తే ఊరికేపోతుందా" అని కొంద రూ, "పాపం నెల తిరగకుండానే చిన్నపరెడ్డి కన్నీకష్టాలు వచ్చిపడ్డ"వని కొంద రూ, "డబ్బుచూపితే వాళ్లే వస్తారు. రా కేంచేస్తారు మాదిగ''లని కొందరూ అంటు న్నారు. చిన్నపరెడ్డికి కావలసిన బంధువులందరూ మాదిగవాళ్లుచేసే ఆలోచనలకి ఆగ్రహ పూరితులై "ఈదెబ్బతో చూడు మాదిగవాళ్లను రూపుమాపుతా''మని హుమ్మన్నుతో గంతులేస్తున్నారు. వ్యవహారం శ్రుతిమించి రాగాన్న పడేటట్టుగా వున్నదని గ్రహించి మునసబు "రవంత నిదానించండోయ్. ఇట్లా తొందరపడే చిన్నపరెడ్డి యింతవరకూ తెచ్చాడు వ్యవహార మంతాను. పూర్వపురోజులు కా వివి. నిదానం మంచి''దని వాళ్లను శాంతపరుస్తూ వచ్చాడు. పేరుప్రతిష్ఠలమాట ఎట్లాగున్నా సమయాన్ననుసరించి మాదిగలను నయాన్నా భయాన్నా సాధించి చచ్చినమొద్దును బయటికి లాగించి కార్యం కొనసాగించుకోవడంకంటె మరోగత్యంతరం లే దనుకొన్నాడు మునసబు.

పదిగంటలు కావచ్చింది. తాను పిలిపించినా గ్రామంలోకి వచ్చేటట్టులేరు మాదిగలు. పూర్తిగా వేడిమీద ఉన్నారు. తొందరపడి ప్రయోజనంలేదనుకొన్నాడు మునసబు. అదిగాక మొట్టమొదట చిన్నపరెడ్డి చేసినదంతా దుర్మార్గంఅని అతనికీ తెలుసు. అందువల్ల మాదిగవాండ్లతో ఎట్లాఅంటే అట్లా అడ్డంతిరిగి మాట్లాడితే వీలులేదని గ్రహించాడు. ఒకసారి చిన్నపరెడ్డియింటికి పోయి మాట్లాడివచ్చాడు. అతడు మహాసముద్రంలో ఉన్నాడు. "నీయిష్టప్రకారం చేసి యెద్దును బయటకు సాగనంపే వుపాయం చూచి మానం కాపాడు మామా"అని చిన్నపరెడ్డి మునసబు రెండుచేతులూ పట్టుకొని దీనంగా ప్రార్థించాడు. మునసబు గ్రామచావడికి వచ్చాడు. గ్రామంలో ముఖ్యులు నలుగురు రెడ్లనూ పిలిపించాడు. విషయం సవిస్తరంగా చెప్పాడు.

"ఊళ్ళో చచ్చినగొడ్డును మాదిగాడు తీసుకుపోకపోతే మరొకరు వీళ్ళతాత ఎవరు వచ్చి తీసుకొనిపోతారనుకొన్నారో ఈమాదిగలు? పిలిపించి నలుగురిలో అడగండి. ఈనాడు వీళ్లు కొత్తమామూలు తీసుకొస్తే అంతేనా? ఆయాటలు సాగనలసిందేనా? పిలిపించండి. ముందు పెద్దమాదిగవాణ్ణి పిలిపించి అడగండి" అని ఆనలుగురిలో ఒకరెడ్డి అన్నాడు. సరేనని పెద్దమాదిగవాణ్ణి గ్రామరచ్చకు పిలిపించారు. మాదిగ లందరూ కూడబలుక్కొని "సరే పోయి నిజం చెప్పేసిరా. భయ మేముంది? మననేం కొడతారా చంపుతారా? చంపితే చస్తాం లే" అని పెద్దమాదిగను పంపారు. వాడు రచ్చకాడికి వచ్చాడు. రెడ్లు నలుగురూ "చచ్చిన యెద్దును తీసుకొనిపోయే ఆలోచనచేసి, ఏదో ఆయనవల్ల నాలుగు పావులు అదనంగానే ఈనాం తీసుకోండి" అని పెద్దమాదిగతో అన్నారు.

"మావాళ్లు వినేటట్టులేదు సామీ! నన్ను ముక్కలుగా కోసినానరే. ఈదఫాకు ఈపనిమాత్రం చేయలేము." అని చెప్పి దణ్ణంపెట్టి పెద్దమాదిగవాడు వెళ్లిపోయినాడు.

వ్యవహారం ఆఖరుకు గడ్డుబారింది. డబ్బాశపెట్టినా తాడు పారేటట్టు కనిపించడం లేదు. ఎద్దు చచ్చి అప్పుడే రెండోరోజు. ఏనుగంతశవాన్ని దొడ్లో ఆవిధంగా పెట్టుకొని యింట్లో సంసారంచేయాలంటే భయంగా వుంది యింటిల్లిపాదికీని. ఏమి తీర్మానం చేశాడో తెలుసుకురమ్మని మునసబుకాడికి చిన్నపరెడ్డి మనిషిని పంపాడు. తాడు బిగుసుకొన్నదని అతడు జవాబిచ్చాడు. చిన్నపరెడ్డికి కాలిమీద రణబాధ జాస్తీగా వుంది. దొడ్లో పసరం బయటికి పోయేదారి కనిపించడంలేదు. ఇతరయెద్దులూ ఆవులూ బర్రెలూ — అన్నీ దిగులుపడి మేతమేయడం చాలించి రాత్రితెల్లవార్లూ నిలబడి అంబా అంబా అని అరుస్తూ గుంజచుట్టూ తిరుగుతూ గలభాచేస్తున్నవి. తెల్లవారి వాటిని బయటికితోసినపుడు ప్రతి పశువూ చచ్చిన ఎద్దుకాడికి పోవడమూ, అదోకవిధమైన బెదురుచూపులతో దాన్ని మూ

చూడడమూ; మూచూడడంతోనే మొన్నటివరకు వాటితోకూడా తిరిగినగొడ్డు అయినప్పటికీ, చలనం లేకుండా పడివుండడం చూచి యితరపశువులన్నీ బెదురుకొని తోకలెత్తి చెవులు నిక్కబెట్టి నాలుగుకాళ్లమీదా ఒక్కసారి యెగిరి గంతువేస్తూ దూరంగా పారిపోవడమూ ఆరంభించినవి. పశువులదొడ్డి అంతా ఖంగాళీఅయి కళావిహీనమై భూతప్రేత పిశాచాదులు తాండవిస్తూవున్నట్టుంది.

మరునాడుకూడా సాయంత్రంఅయింది. మాదిగవాళ్లు ఎక్కినగుర్రాన్ని దిగలేదు. గ్రామం దద్దరిల్లిపోతోంది. ఎవరికీ కర్తవ్యం పాలుపోవడంలేదు. గ్రామమునసబు పోలీసువారికి రిపోర్టుచేద్దా మనుకొన్నాడు. చేస్తే మునసబుఅధికారం చేతిలో పెట్టుకొన్న తననే ఏదోవిధంగా కూలీలచేత ఎత్తించి పారెయ్యమని ఉత్తర్వుచేస్తారేమో అని భయపడ్డాడు.

చీకటిపడింది. ఎద్దుకళేబరం నీచుకంపుకొట్టడం ఆరంభించింది. చిన్నపరెడ్డి ముక్కుకి వాసనకొట్టింది. తనకాలిమీది కురుపువాసనఅయిందీ దొడ్లో ఎద్దువాసన అయిందీ మొదటిలో అతని కవగాహన కాలేదు. రాత్రి పొద్దుపోయినకొద్దీ ఎద్దువాసన ఎక్కువైంది. చిన్నపరెడ్డికి దిక్కు తోచడంలేదు. చూడ్డానికి వారూ వీరూ వస్తూపోతూ వున్నారుగాని మాదిగవాండ్లసంగతి ఎవరికీ అలవికాలేదు. మునసబుకుకూడా ఆందోళన ఎక్కువైంది. గ్రామాధికారిగా వుండి ఇంతమాత్రం పనిచేయించలేకపోయావని పై అధికార్లు చివరి కొచ్చేవరకు తననెత్తిమీదికి తెచ్చిపెట్టుతారేమోనని అతనికి ఖంగారుపుట్టింది. కాని యేంచేయగలడు పాపం? మాలవాడకు చెప్పిపంపి పదిమందిని పిలిపించాడు. కల్లు పోయిస్తానని చెప్పి అనేకవిధాల పోరి వాళ్లను బ్రతిమలాడినాడు. "మాదిగవాళ్లు చేయవలసినపనిని మమ్మల్ని చెయ్యమంటా రేందయ్యా" అని వాళ్లు నోట్లోజవాబు నోట్లో వుండగనే వెళ్లిపోయారు.

తెల్లవారింది మూడోరోజు. ఎద్దును కుక్కలు తినకుండా ఈతాకుచాపలు కప్పి యిటికరాళ్లు ఎత్తిపెట్టారు. చిన్నపరెడ్డి సేద్యగాండ్లను పిలిచి ఈదఫాకు ఎల్లాగో మాట దక్కించమన్నాడు.

"ఎవరు చేసుకోవలసినపనులు వాళ్లు చేసుకోవలసిందేకాని యిట్లాంటిదానిలో లక్ష యిచ్చినా మావల్లగా"దని వాళ్లు తిరగబడ్డారు. తెల్లవారేసరికి ఎద్దుకళేబరం కుళ్లి గబ్బుజాస్తిఅయింది. గవులుకంపు బయలుదేరింది. చుట్టుపక్కల యిరుగుపొరుగువాళ్లకు దుర్భరమైంది వాసన. మాదిగలు చంకలు తట్టుకొంటున్నారు. చిన్నపరెడ్డి డబ్బాశ చాలా చూపించాడు. కాని అలగాజనంగూడా ఆతట్టు మెదలడమే చాలించుకొన్నారు. గ్రామంలో పెద్దలకు గత్యంతరం తోచడంలేదు మునసబు గ్రామచావడిలో సభచేయిం

చాడు. పెద్దల నందరినీ పిలిపించాడు. సభాపతి వేదాంతం సుబ్బావధానిగారినీ, రంగయ్య సెట్టినీ, రెడ్లనూ, చాకలీ, మంగలీ, కుమ్మరీ వగైరా పనిపాటలవాండ్లనూ పిలిపించాడు. అందరూ చేరారు. పెద్దమాదిగనుకూడా పిలిపించమన్నారు. వాడు మళ్లా వచ్చాడు.

సభలో ధర్మసందేహాలు చాలా బయలుదేరినవి. "ఇట్లాంటి ఘట్టాలలో చిక్కు వచ్చినపుడు ధర్మశాస్త్రాలు ఏం చేయవలసిందని చెప్పుతున్నవో చెప్పవలసిం"దని అవధాని గారిని సభవారు ప్రశ్నించారు.

"చెప్పడాని కేముంది? వర్ణాశ్రమధర్మాలకు తల వెంట్రుకవాసికూడా లోపంరావ డానికి వీలులేదు. ఎవరెవరి కులవృత్తులు వారువారు సశాస్త్రీయంగా చేసుకోవడమే కర్తవ్యమని ధర్మశాస్త్రం చెప్పుతున్న"దని అవధానిగారు సెలవిచ్చారు.

మునసబు: అవును స్వామీ! ఇప్పుడు మాదిగలు వాళ్లపని వాళ్లు చేయడానికి నిరాకరించారుగదా. గ్రామంలో ఆపశువు అట్లా కుళ్లిపోవలసిందేనా?

అవధాని: వాళ్లపనివాళ్లు చేయడంలే దనడానికి మాదిగల యిష్టమేనా ఏమిటి? అట్లాంటి అధికారాలు ఏమీ వాళ్లకు లేవు.

మాదిగకులపెద్ద: దణ్ణంపెట్టి చెప్పాతా సామీ! భామ్మర్లందరూ వారిపనులు వారు చక్కంగా చేస్తుండారా అంటా?

అవధాని: అధికప్రసంగం చేయబోకు. బ్రాహ్మణుడు ఏమిచేసినా తప్పలేదని ధర్మ శాస్త్రాలు ఘోషిస్తున్నవి.

మునసబు: ఈవాదన కేమిగాని అవధానిగారూ! ఇప్పట్లో మనం చేయతగ్గ దేముందో తమరు శెలవియ్యాలి.

అవధాని: చెప్పానుగా. ఆపశువును మాదిగవాళ్లే యెత్తి పారవేసితీరవలె.

మాదిగ: "ఎందుకుసామీ! తమరిట్లాసెలవిస్తారు? పెద్దపెద్ద ఆసాములందరూ చేరి మమ్మల్ని ప్రాణాలతో బతకనివ్వకుండా చేశారు. ఒక్కపూట చెప్పలుతేవడం ఆలస్య మైందని చిన్నప్పరెడ్డిగారు ఆడదానిప్రాణం తీసేశారు. ఏమో మాదిగోళ్లంటే అంత అలుసుగా వున్నారుకాబోలు మీఅందరికంటికీని. పైగా సరకారువారుకూడా మీబోటి మారాజులతోనే ఏకీభవించి ఈమధ్య మామాదిగలయీనాంభూములన్నీ పెరుక్కొని కోరులో కలిపేశారు. మాతాతముత్తాతలనాడేనాడు సంపాదించుకొన్నవో ఆ భూములు. ఆసందు మేము కలకటేరుగారికి అర్జీలు యిచ్చుకోగా మాదిగోళ్లకి యినాం భూము లుంచవలసిన అవసరం లేదని దొరతనం ఉత్తరువులుచేశారని మాకు తాకీదు

లంపారు. మామాదిగోళ్ల యినాంభూములన్నీ సర్కారులో కలిసిపోతూవుంటే మీారం దరూ ఏంచేశారు సామీా? గ్రామానికి మాదిగవాడు పనికిరానివాడా? చాకలోడికీ మంగలోడికీ, కుమ్మరోడికీ, కమ్మరోడికీ-అందరికీ మాన్యాలుఉంచి మాదిగోళ్లకిమాత్రం ఎందుకు లేకుండా చెయ్యాలి సామీా? మేం చేయలేము సామీా! ఈచాకిరీలు. తమ రిష్టంవచ్చినోళ్ల చేత చేయించుకోండి" అని చెప్పుతూ సభవిడిచి వెళ్లిపోయాడు.

అవధానిగారికి వ్యవహారం పరిష్కారంచేయడ మెట్లో ఆలోచన తోచలేదు. "మీాయిష్టంవచ్చినట్టుచేసి ఎట్లాగో ఆయెద్దుకళేబరాన్ని బయటికి సాగనంపేవుపాయం చూడండి"అంటూ ఆయన లేచి పీర్రల కంటుకొన్నమట్టి దులుపుకొన్నాడు.

మునసబు "లేవబోకండి స్వామీా! ఈపరిస్థితుల్లో మనం ధర్మశాస్త్రాలు తిరగవేస్తూ శుష్కప్రియాలు చెప్పుకొంటూవుంటే కార్యంలేదు. ఎట్లాగో అనుకొన్నపని జరిగించాలె. పూర్వపుకట్టుబాట్లు ఇప్పుడు లేవు. కాలంఅంతా మారిపోయింది. గ్రామంలో శవం పడివుంటే అది నాపనిగాదని ఎవరిమట్టుకు వాళ్లు చేతులు ముడుచుకొని కూచుంటే ఎట్లా? అది కుల్లి ఊరికంతకీ మోసంతెస్తుంది. కాబట్టి నామాట విని మనలో పిన్నా పెద్దా, బ్రాహ్మణా అబ్రాహ్మణా అనేభేదంలేకుండా అందరమూ చేతులుకలిపి ముందు ఆయెద్దును బయటికిలాగి పూడ్చిపెడదాం రండి"అని అనేవరకు ఇక గత్యంతరంతోచక అక్కడ చేరిన నలుగురు పెద్దలూ సరేనని ఒప్పుకోవలసివచ్చింది.

అవధానిగారుకూడా పరిస్థితులబలాన్ని తప్పించుకోలేక సరే నన్నాడు. పెద్దలందరూ వర్ణవివక్షత లేకుండా సంఘానికందరికీ సంబంధించినకార్యంపట్ల నడుములు బిగించే వరకు, అదినరదాకా తప్పించుకొనితిరిగే చిల్లరజనానికి సిగ్గువచ్చి వాళ్లుకూడా తయారైనారు. అంతా అయిదునిముషాల్లో ఏభైమంది పోగైనారు. ఎద్దు నిక గ్రామంలో వుంచడానికి వీలులే దన్నారు. పట్టండంటే పట్టండని మునసబూ కర్ణమూ అవధానీ పెద్దరెడ్డీ చిన్నరెడ్లూ చాకలీ మంగలీ యానాదీ వైశ్యా—ఒకరేమిటి, సమయానికి చేతికందినవాళ్లందరూ చేరి సాయంపట్టి యెద్దును ఊరిబయటకు తీసుకొనిపోయి ఎట్లాగైతేనేం భూస్థాపితం చేశారు.

మాదిగలందరూ పొట్టలుబ్బా నవ్వుకొంటున్నారు. తమపట్టు నెగ్గిందని సంతోషించారు. "కానీ చూతాం, ఎంతకాలమని యిట్లా మాదిగపనిఅంతా గ్రామస్థులు చేయగలరో, చూతాం లెండిరా"అని వాళ్లింకా బిర్రుమీాదనే ఉన్నారు.

౫

ముందుపరిస్థితులు ఎట్లాగున్నా చిన్నపరెడ్డికి ప్రస్తుతంలో ఒకగండం తప్పింది. కాని గండం తప్పిందని సంతోషిస్తాడా, లేక తనమూలాన్న గ్రామాని కింతకష్టం వచ్చిందని దుఃఖిస్తాడా? పశ్చాత్తాపపడ్డాడు. సమయానికి మాదిగలు కట్టినసమ్మె తలుచుకొని ఆక్రోశ పడ్డాడతడు. కాని తనది నిస్సహాయస్థితి. ఏమి చేయగలడు?

కాలికురుపుబాధ మరీ జాస్తీఅయింది. పాదంఅంతా కుళ్లిపోయింది. బాధ భరించడం కష్టమవుతోంది. ఎన్నిసదుపాయాలుచేసినా తగ్గుదశలోకి రాలేదు. ఇక పల్లెటూరివైద్యం చేయించి ప్రయోజనంలేదనుకొన్నాడు. ఆస్పత్రికిపోయి డాక్టరుకు చూపితేనేగాని వీలులేదని యింట్లో ఆడవాండ్లుకూడా తొందరచేశారు. సరేనని తెల్లవారు జామున బండికట్టుకొని పదిమైళ్లదూరంలోవున్న ఆస్పత్రికి తెల్లవారేసరికు చేరాడు.

డాక్టరు పరీక్షించాడు. అల్పాచమానం చూచాడు. చక్కెర (షుగరు) కనపడింది. వ్యాధి బాగా ముదరబెట్టా రన్నాడు డాక్టరు. కాలు తెగగొట్టవలసివుంటుందేమో అన్నాడు. చిన్నపరెడ్డికి ప్రాణాలు నిలువునా ఎగిరిపోయినవి. ఎందుకనో అప్రయత్నంగా నరిసి జ్ఞాపకంవచ్చింది; బెదురుకొన్నాడు. గుండె దడదడమన్నది. డాక్టరును చూచి బెంబేలుపడ్డాడు. కాలు పరీక్షచేసి ఆపరేషనుచేయాలన్నాడు డాక్టరు; కాని నమ్మకం చెప్పలే నన్నాడు. 'అదృష్ట మెట్లా గుందో, ఆపరేషనుచేయించండి' అన్నది భార్య. చిన్నపరెడ్డి పలకలేదు. నిస్పృహచెంది ఊరుకొన్నాడు. కొత్తచెప్పు లింతపనిచేస్తవని కల లోనూ అనుకోలేదురెడ్డి. మధుమేహరోగికి క్లోరోఫారంఇవ్వడానికి వీల్లేదన్నాడు డాక్టరు. క్లోరోఫారం యివ్వకుండా ఆపరేషనుచేయించుకోవడానికి రెడ్డికి భయంవేసింది. కాని చేయించుకోకవిధిలేనట్లుగా వుంది. బాధ భరించుకోలేకుండా వున్నాడు. ప్రాణం పోయినా మేలే అనిపించిం దతనికి. "డాక్టరుగారూ! తమయిష్టంవచ్చినట్లు చేయించండి" అన్నాడు రెడ్డి.

తెల్లవారింది. ఉదయం ఏడుగంటలకు చిన్నపరెడ్డిని వెల్లకిలా పండుకోబెట్టారు. మనిషికి శవాకారంపడ్డది. డాక్టరుకు నమ్మకం చాలలేదు. ఆపరేషనుకు ముందు జరుగ వలసిన వ్రాతకోతలన్నీ జరిగిపోయినవి. తనతో వచ్చిన బంధువులందరినీ ఆఖరుసారి ఒక పర్యాయం రెడ్డి చూడా లన్నాడు. చూపించి వాళ్లనందరినీ డాక్టరు బయటికి పంపి వేశాడు. తలుపులు వేశారు.

చిన్నపరెడ్డి అయోమయంలో వున్నాడు. ఇద్దరుమనుష్యులు తలతట్టున నిలబడి చెరి యొకరెక్కా పట్టుకొని క్రిందికి గట్టిగా అదిమిపట్టుకొన్నారు. తల ఒకరు అదిమిపట్టి

కొన్నారు. రెండుకాళ్లూ ఇద్దరుమనుష్యులు కదలకుండా పట్టుకొన్నారు. చిన్నపరెడ్డి కళ్లు మూసుకొన్నాడు. నరిసి ప్రత్యక్షమయింది. బారుమని ఒకవెర్రికేకవేసి రెడ్డి పైకి గభాలున లేచి కూర్చోబోయినాడు కాని వీలుకాలేదు. అతని భౌతికశరీరంఅంతా అన్యాక్రాంతమైపోయివున్నది. కళ్లు మూసుకొంటే వెర్రిస్వరూపాలు గోచరిస్తూవున్నవి. చచ్చిపోయినఎద్దు జ్ఞాపకానికివచ్చింది. నరిసి వచ్చి నవ్వింది వికారంగా. కళ్లుతెరిచాడురెడ్డి. డాక్టరు చేతిలో కత్తి కనిపించింది: బాబో యన్నాడు. డాక్టరు కళ్లకు గంతలు కట్టమన్నాడు. కట్టారు. విశ్వమంతా అంధకారమైంది రెడ్డికి. కుళ్లిపోయినకాలిమీదిచర్మం కాగితం ముక్కలా వేలాడుతున్నది. డాక్టరు కత్తెరతీసుకొన్నాడు. కత్తిరించవలసినచర్మం గుర్తుపెట్టుకొన్నాడు. రెడ్డిని పట్టుకొన్నమనుష్యులకు డాక్టరు సంజ్ఞచేశాడు. రెడ్డికి ప్రపంచమంతా నరిసిస్వరూపం అయిపోయింది. కళ్లు మూసుకొనిఉన్నవో తెరచిఉన్నవో అతనికే తెలియలేదు. దాహం దాహంఅని అరిచాడు. ఇన్నినీళ్లు గొంతుకలో పోశారు. రెడ్డికి మళ్లా కొత్తచెప్పులూ, బుట్టాతో నరిసి కళ్లకు ప్రత్యక్షమయింది; విషపునవ్వు, వికారపునవ్వు, జాలినవ్వు నవ్వింది. ఇంతలో పాదంమీద చర్మం పరపరమని తెగిపోతోంది. గుడ్డలా కత్తిరించేస్తున్నాడు డాక్టరు. 'బాబోయి నరసమ్మోయి, నరిసోయ్, చచ్చానురోయ్, చచ్చానురోయ్' అని అరవడం మొదలుపెట్టాడు రెడ్డి. కత్తిరింపు సగం అయింది. ఇక సగం కొరవుంది. చిన్నపరెడ్డికి చలనం తగ్గింది. డాక్టరు కత్తెర మార్చాడు. కాళ్లూ చేతులూ పట్టుకొన్నమనుష్యులచేతులకు రెడ్డిశరీరం చల్లంగా తగిలింది. డాక్టరుతో చెప్పారు. గుండెమీద చేయివేసి చూచాడు డాక్టరు. అప్పటికే హంస లేచిపోయింది. పాడుకట్టెను బంధువుల స్వాధీనం చేశారు.

# ఆద్యంతాలు

వెంపటి నాగభూషణం, ఎమ్. ఏ.

[చిన్న యిల్లు. ముందు వరాండాలో నాలుగైదు కుర్చీలు, రెండు చిన్న టీపాయ్‌లు వున్నాయి. ముందుతోటలోంచి వస్తూన్న చల్లగాలిని ఆనందిస్తూ, ఓ కుర్చీలో కూర్చొని, వెనుకటి "పరంజ్యోతి" పత్రికల్ని తిరగవేస్తూంటాడు నీలాచలం. పాతికేళ్లవాడు. మెడమీదికి పడ్తూన్న పొడుగాటి వెంట్రుకలు, గుండ్రని మొహం, కళ్లకు అద్దాలు. ఓ పత్రికను పరికించడమైన తర్వాత మరొకొక్కదాన్ని తీసి చూస్తుంటాడు.

శ్రీమాలి ప్రవేశిస్తాడు గేటులోనుంచి. సరాసరి, పూలమొక్కల మధ్యవున్న కాలిబాట వెంటవచ్చి వరాండా ఎక్కుతాడు. ఇతనికీ సుమారు పాతికేళ్లే. పచ్చని శరీరం. సిల్కులాల్చీ, సిల్కుపైజామా తొడుక్కున్నాడు. కళ్లకు పాన్స్‌నే. చేతులో కాగితం ప్యాకెట్టుంది.

నీలాచలం శ్రీమాలివంక ఓమారు కన్నెత్తిచూచి, తిరిగి పత్రికావలోకనంలో మగ్నుడౌతాడు.]

శ్రీమాలి (అతని మూకీభావానికి కొద్దిగా వింతబోతూ, ప్యాకెట్టు బల్లమీద పెట్టి, కుర్చీలో కూర్చుంటూ). ఏం నీలం, యిల్లావున్నావు యీదినం? హుషారంతా ఏమైంది? మరిచిపోయినా, ఎల్లుండి రాత్రేకదూ మీరంతాకలిసి ఇంగ్లీషునాటకం ప్రదర్శించేది. ఆవిషయాన్ని గురించి ఎంతో ఆతురతగ వుండవలసినవాడవు, షేక్స్పియరులాగ మొహం పెట్టి — యిలాదిగాలుపడి కూర్చున్నావేం?...సాయంకాలం గదా, షికారన్నా బయ లేరలేదేం?......మాట్లాడవేం, నీలం?...నాటకంవిషయంలో నీకూ వాళ్లకూ ఏమన్నా తప్పా జరిగిందేం? లేకపోతే...గతించిపోయిన టి. బి. ట్రాజిడిని తల్చుకుంటూ విచార పడ్తున్నావా? అరే, తమాషాగా వుందే......మాట్లాడవేం, నీలం?......

[నీలాచలం ఓమారు శ్రీమాలివంక చూచి వూరుకుంటాడు.]

...ఆచూపుకు అర్థం?...నేనొచ్చి ఏం చెడగొట్టలేదుగద రంగాన్ని? చిన్నీ ఏవో చీరెలు కావాలంటే అంగడికివెళ్లి, నాలుగైదు నమూనాలు తీసికొని—యిలావెడ్తూ— ఏంచేస్తున్నావో చూచిపోదాంగదా అని వచ్చాను ..మరిచిపోయినా, చూడు. (ప్యాకెట్టు విప్పుతూ)...ఈ చీరెలు నువ్వుగూడా చూడు. నీ అభిప్రాయమెల్లావుంటుందో... ఇవిగో (చూపిస్తూ) నాలుగూ నాలుగు రకాలు. చూచావ్, యీ అంచులు. ఇప్ప డిప్పుడు క్రొత్తగా వస్తున్నాయి. మంచిపట్టు. కనీసం రెండు మూడేళ్లయినా ఆటి వస్తాయ్—కావాలని పట్టి చింపకపోతే. ఏమైతేనేం. పాతికరూపాయలకు తక్కువలేదు

దేని ఖరీదూను. కొంపతీసి, చిన్నీ నాలుగూ కావాలన్నదా, నా పని అయింది. ఏక్ దమ్ గుండె జారిపోతుంది. ఈ నాయికలతో వచ్చిన పేచీ యిదేనోయ్! నీలం, చెప్తే నమ్ముతావో లేదో,—నీదగ్గర నా రహస్యా లేమీలేవు కాబట్టి చెప్తున్నాను—చిన్ని కోసం—యావరేజిమీద యాభై రూపాయలు వ్యయంచెయ్యని నెలలేదు—యీ ఏడాదిలో మరి, నా సంపాదనా, రాబడీ—నీకు తెలుసుగా......ఈస్థటిక్కు తత్వం యిచ్చి—యిలా కవులనుగాను, ఆర్టిస్టులనుగాను, యాక్టర్లగాను—ఎందుకు పుట్టించాడో దేవుడు. ఈలాంటి టెంపరమెంటు వుండడంగూడా జీవితంలో—ఓ ప్రతిబంధకమే ననుకుంటాను. కళాభిరుచిగూడా తరుచు పిచ్చిలోకి దిగి—మనశ్శాంతిని చెడగొడ్తుంది. తక్కినవాళ్లమోస్తరు పుట్టివుంటే, మనము ఏ బి.య్యే ప్యాసయ్యో, ఏ ఆఫీసులో గుమాస్తాగానో, ఏస్కూల్లో మాష్టరుగానో చేరి—ఏ యాభై అరవై విత్తులో తెచ్చుకొంటూ—పెళ్లామంటూ—పిల్లలంటూ—సంసారగొడవలో మునిగి వుండేవాళ్లం. మనం ప్రయోజకులమైనామని—మనవాళ్లూ—సంఘం—లోకం—అనుకుని మనల్ని కాస్త గౌరవంగా చూచేవాళ్లు. నా కవిత్వం—నీ యాక్టింగు—నా నాటకాలు—సత్యం పెయింటింగు—శాస్త్రికథలు—ఎవరికి కావాలి? దమ్మిడీకిగూడా టికాణాలేనివాళ్లంతా—జీవితంలో యింకెందుకూ పనికిరాకుండా—"ఇచ్ఛాజీవు''లంటూ ఓముఠాగా జేరి—ఆర్టు అంటూ, పొయిట్రీ అంటూ, స్టేజి అంటూ—కాలం వృథాపుచ్చుతున్నారు—అని అందరి అభిప్రాయమూను. మన ఆశలు—ఆశయాలు—సత్తా వాళ్ల కేమన్నా తెలుస్తేగా?...అందుకే చెప్తాను. మన కిల్లాంటి వున్నత ఊహల్ని కల్గించి—వాటి సాఫల్యానికి అనుగుణమైన అవకాశాలు యివ్వక—అందరి ఎత్తిపొడుపులకు గురిచేస్తూ—మనకు మనోవేదనా, అశాంతీ కల్గించడం—యిది, దేవుడు మనకు యీజన్మలో విధిస్తూన్న శిక్ష కాదూ? పూర్వజన్మలో ఏదో పాపం చేసివుండబట్టి, యిప్పుడిల్లా యీస్థటిక్కువాళ్లంగా పుట్టి, పెనాల్టి చెల్లిస్తున్నాం...ఏమంటావు?... మాటాడవేం నీలం?...

[నీలాచలం నిదానించిచూచి ఊర్కొంటాడు.]

...ఎందుకు నీలం—యిల్లా మౌనముద్ర వహించావు. నీ నైజానికి భిన్నంగా ఎందు కిప్పుడు నిశ్శబ్దత ప్రదర్శిస్తున్నావు. నీకుగూడా నాకు కల్గినటువంటి అలోచనలే కలిగి మనస్సును కలవరపెడ్తూన్నాయా? మనమందరం అప్పుడప్పుడిల్లా ఫీల్ కావడం మామూలేగా?—ఇప్పుడు క్రొత్త ఏముంది? ఇంతకూ, ఎవరేమనుకున్నా, ఏంజరిగినా—మనకు పుట్టుకతో వచ్చిన యీ కళాఉత్సాహం, సాహితీరుచి—యివి ఎల్లాగా విడిచి పోవు. నిజమే, వాటికోసం కష్టాలుపడ్తూన్నాం...ఇంకా కొంతకాలం పడాలిసివుంటుం

దేమోకూడా. కాని, చూతాం... ఎన్నిటికేనా మనం నెగ్గలేకపోతామేమో. ఏ దేశం యొక్క, ఏ యుగచరిత్రనైనా చూడు. మతంలోగాని, సంఘంలోగాని, సాహిత్యంలో గాని, కళలోగాని—నూతనమార్గాలు అవలంబించి—ఐహిక విషయములలో మలీమసమైపోతూన్న—ఆ వివిధవిషయాలను మరమ్మతుచేసి—సన్మార్గం కల్పించి—ధన్యులైంది—ఎప్పుడూ గుప్పెడుమందే! వాళ్లు అనేక కష్టాలు అనుభవించారు. నిక్కినవారి యద్దేవకు, హేళనకు గురియైనారు; సంఘంలో స్థానం లేకుండా పోయినారు; ధరించడానికి మంచి దుస్తులూ, ఆరగించడానికి విందులేకుండా యిబ్బందిపడ్డారు; జైళ్లకు వెళ్లారు; కొందరు కొన్నిసమయాల్లో ప్రాణాలనుగూడ త్యాగంచేశారు;—కాని తుదకందరు—చరిత్ర చూపుతున్నట్టుగా—మార్టియర్సుగా, సిరులుగా పరిగణింపబడ్డారు. అల్లాగే మనమూను. అసలు మనదేశమే అధోగతిలోవుంది. అందులోనూ మన తెనుగుగడ్డ—మరీ అధ్వాన్నంగావుంది. ఏ ఒక్కవిషయంలో మనం సజీవులంగా వున్నామో ఆలోచించు. ఇమిటేషన్ తప్ప మన మింతవరకు చేసినెగ్గిన ఘనకార్యం లేదు. ఏయిద్దరు సత్తాగల ఆంధ్రులూ కలిసి హృదయపూర్వకంగా పనిజేసిన పాపాన పోలేదు. ఒక్కసారిగా ఆంధ్రదేశం ఆకాశమంత ఎత్తు లేవాలంటే ఎల్లాసాధ్యం? అంచేత నిస్పృహ చెంది ప్రయోజనంలేదు. ఎవళ్లకు తోచినట్లుగానే అనుకో, వాళ్లు సిన్సియర్‌గా పని చేస్తూంటే చాలు. అనేక నీటిబొట్లు కలిసి నదీప్రవాహమైనట్లు—పలువుర ప్రయత్నాలూచేరి నూతనశక్తివాహినిగా పరిణమిస్తాయి. ఆ దృఢనమ్మకమే, ఆ దృఢనిశ్చయమే మనకు హుషార్ యివ్వనీ! మనమంతా కళాభాయిలాలం. రాజకీయాలతో, మతైకవిషయాలతో, సాంఘికసమస్యలతో—అంతగా మనకి జోక్యంలేదు. చిత్రకళ—స్టేజి—సాహిత్యం—యీ త్రిశూలమే మనకు సుదర్శనచక్రం. వీటి దోహదంతోనే మన ఆశాలతలు వికసించి, విలసిల్లుతై. వీటిద్వారానే మనం దేశానికి ఎంత సేవైనా చేయవచ్చును. "కెల్టిక్ ట్వైలైట్" వెలుగుతో, యీట్సు, ఎ.యి., లేడీ గ్రెగరీ, లార్డు డన్సనీ మొదలైన ఐరిషు కళాకోవిదులు వాళ్ల దేశానికి సంచేయగల్గిందీ మనకు తెలుసుగా!......కాబట్టి మనం దిగులుచెందాలిసిన పనిలేదు. ఏమంటావ్, నీలం?

[నీలాచలం, చేతులోవున్న "పరంజ్యోతి"ని ప్రక్కగాబెట్టి—వూరొక్కంటాడు.]

ఏమిటి, నీలం—యిట్లా వున్నావు—యీదినం. విషయమేమిటో చెప్పు. చేతనైతే సాయపడ్తాను. ఇందాకటినుంచీ వాగేస్తున్నాను—విరామం లేకుండా. ఎరుగున్నావుగా నాధోరణి... నీమనస్సునేం కలవరపెట్టలేదుగద, నేను?

[ఇంతలో లోపల్నుంచి నౌకరు వచ్చి, తెచ్చిన రెండు టీ కప్పులు యిద్దరి ముందూ పెట్టి నిష్క్రమిస్తాడు.]

సమయానికి అందుకుందిలే—టీ! చిచ్చుబుడ్డిలాగు విజృంభిస్తోంది నా ఉత్సాహం. టీ సేవించేందుకు సిసలైన సమయం యిదీ! నీ దగ్గరకొస్తే టీకి లోపం వుండదుగా ఎప్పుడూ. అయ్ భాయ్! టీలోవుండే మజా, యిన్స్పిరేషన్—చెప్పడ మెల్లా, నీలం? విన్నావూ, వెనకటికి కన్ఫ్యూషియస్ అన్నాట్ట, "నీతో కజ్జా ఆడ్డానికి ఎవరైనా వస్తే, ఓ కప్పు టీ యివ్వు, చాలు" అని. అంటే దాంతో ఆ వచ్చినవాడు శీతలించి పోతాడని గాదు; ఆ టీ జనితేన్స్పిరేషనులో, నూతనోత్సాహంలో ఆగ్రహం మరచిపోతాడని. మరచిపోయినా, అసలు చైనా నుంచేగా ప్రథమంలో టీ బయల్దేరింది. మనవాళ్లకింకా టీ తత్వాకా పూర్తిగా బోధపడలేదు. మనబోంట్లు ఏ కొద్దిమందో తప్ప—టీకి అట్టే మంది రాజపోషకులు లేరు. (టీ త్రాగుతూ)...అప్పుడే వేడి తగ్గుతోంది. నువ్వుగూడా తీసుకో, నీలం.

[నీలాచలం తన టీ కప్పును తీసుకొని త్రాగడం మొదలుపెడతాడు. తాను త్రాగడం దాదాపు పూర్తి చేసి, కప్పు బల్లమీద పెడ్తూ శ్రీనాలి]

మైగాడ్! ఖుషీ అయినాడోయ్ ఆత్మారాముడు! (పక్క బల్లమీద విప్పి పడివున్న చీరెల్ని చూస్తూ) మరిచిపోయినా, నీలం, మన మామూలు ధోరణిలోపడి అసలు వచ్చిన పని మరిచిపోయినా. చూడు—యీ చీరెల్లో ఏది బావుందంటావు. తుదకెట్లాగో చిన్నీ యిష్టమొచ్చినట్లే అనుకో... కాని, చిన్నీ టేస్టు నీక్కూడా బాగా తెలుసు కాబట్టి అడుగుతున్నాను. ఊఁ. ఏది నచ్చిందంటావు? ఊఁ!

[నీలాచలం టీ పూర్తిచేసి, చీరెలవంక ఓమారు చూచి, మాట్లాడడు.]

నీలం—ఏం, యివ్వాళ మూగనోమా ఏమిటి, కొంపదీసి. వ్రతభంగానికి నేనే కారణమని తిడ్తావు తర్వాత. ముందే చెప్పు, ఎందుకొచ్చింది. ఇంతకూ, యిది చిన్నీకి సంబంధించిన విషయం కాబట్టి,—చిన్నీ అంటే నాకున్నంత అభిమానం, ఆపేక్షా—నీకూ వున్నది కాబట్టి—సలహా అడుగుతున్నాను.

[ఏదో మాట్లాడడానికి సిద్ధపడ్డట్టుగా, పెదిమెలు కదిపి, ఏమీ ఉచ్చరించకుండా ఊర్కొంటాడు—నీలాచలం.]

ఏం, నీలం? మాట్లాడ దల్చుకోలేదా యేం? ఏదో ప్రయత్నించి కూడా విరమించావేం? (కోపంతో) అవున్లే, ఈ విషయంలో—చిన్నీ విషయంలో—నువ్వు మాట్లాడకుండావుండడమే మంచిది. చిన్నీ సంగతుల్లో కల్పించుకోడానికి అసలు నీకేం

అర్హత, అధికారం వున్నాయి. ఆ విషయం యిప్పుడు నీఅంతట నువ్వే గ్రహించిన ట్టున్నావు. బ్రతికిపోయినావు...(కొంచెం ఆగి) ఆఁ...యిప్పుడంతా బోధపడ్తోందిలే... మాటాడ్డానికి వెరపుచూపుతూన్న నీపెదవుల్లోనుంచి, నావంక నిదానించి చూడ్డానికి జంకుతూన్న నీ కళ్లల్లోంచి, నీ హృదయం నాకు గోచరిస్తోందిలే...(కొంచెం ఆగి)ఆఁ .. నీ రహస్యం యిప్పుడు స్పష్టమైంది నాకు...నాచేతులో చీరెల్ని చూచి—చిన్నీ విషయం మాట్లాడ్డానికి వచ్చానుగదా అని గ్రహించి—దొంగను తేలు కుట్టినట్లుగా—నోప్పును కప్పి పుచ్చచూస్తున్న పసిపిల్లాడిలాగ—నువ్వు యిన్నాళ్లనుంచీ చేస్తూన్న బద్మాషీకి—నిశ్శబ్దత తప్ప వేరేమార్గం లేదన్నట్టుగా ప్రవర్తిస్తున్నావా?...

[ఆ వాక్యాల వాడికి కొంచెం బెదురుతాడు, నీలాచలం.]

...ఎందుకూ_బెదురునటిస్తావ్...ఇన్నాళ్లనుంచీలేని నదురూ బెదుగూ_యిప్పుడు నేను అంటూన్న మాటలతో కలుగుతోందా యేం?.. ఏ జంకూ లేకుండా ఏమని ఉపక్రమించావ్—మొదలు?...నీకు నే చేసిన మేలుకి యీవిధంగానా ప్రత్యుపకారం చేస్తావ్? కల్లకపటాలులేని వ్యక్తివనికాదూ విశ్వసించాను నిన్ను? ఈ విధమైన త్రాచుపామువని తెలిస్తే దగ్గరకు వచ్చేవాణ్ణా, నిన్ను నాదగ్గరకు చేరనిచ్చేవాణ్ణా? నిన్ను చూసిన మొదటిమారే_ఎందుకో నామనస్సు నీవైపు మరలింది. అభిప్రాయాలు, ఆశయాలు వున్నవాడవనీ, స్టేజివిషయాల్లో మంచి అనుభవంకలవాడవనీ, అన్నిటికన్నా—నిష్కల్మషహృదయుడవనీ గాదూ—గ్రహించి నిన్ను మా "ఇచ్ఛాజీవుల" బృందంలోకి జేర్పించాను. నా కవిత్వంగోలలో నేనుంటూంటే—చిన్నీ అప్పుడప్పుడు వొంటరిగా బెంగపడ్తోందనీ—అదీగాక నాటకాల్లో స్త్రీపాత్ర ధరించి నన్నెకెక్కాలనే వాంఛ చిన్నీకూడా వుండబట్టీ—ఆవిడ అభిలాషకు చేయూత యిచ్చి, చక్కని దోహదం చెయ్యగలవాడవు నువ్వేననిగాదూ నమ్మి—నిన్ను తీసుకెళ్లి, చిన్నీకి పరిచయంజేశాను? ఆరాత్రే అన్నది చిన్నీ నాతో:—"మీ నీలాచలం నా కంతగా నచ్చలేదు. ఆతని చూపుల్లో ఏదో దోషముంది. మనకు లాహికీ ఐనవాడుగా తోచడంలేదు"—అని. ఆ సంశయం నిజమైనది కాదనీ, తప్పకుండా ఆవిడె నీదగ్గరే శిష్యత్వంచేసి స్టేజివిషయాలు నేర్చుకోవాలనీ వొత్తిడిజేస్తేగాదూ, చిన్నీ సమ్మతించింది_నీ మొహం చూడ్డానికి? ఏడ్నర్థంనుంచీ చెలిమిచేస్తున్నవాణ్ణి—నాకు తెలుసు—చిన్నీ హృదయం ఎలాంటిదో? ఆరునెలలైందో లేదో—పరిచయం ప్రారంభమై—నేనిచ్చిన అలుసు పురస్కరించుకొని—చిన్నీమీద చెయ్యి వేయబోయినావ్? చిన్నీని కలుసుకొన్నప్పుడల్లా కళ్లతో వైర్‌లెస్ సందేశా లంపుతావ్?...ఏమని ధైర్యం? చిన్నీతత్త్వం ఏం బోధపడ్డదని ఆ సాహసానికి ఉపక్రమించావు?...చిన్నీ రెండేండ్లయిందనుకో భర్తను విడిచేసి...

అయితే మాత్రం?—అల్లరిచిల్లరగా తిరిగే అవ్యక్తురా లనుకున్నావా? ఆలాంటిదే అయితే—యీపాటికి ఆవిడెకున్న అందంతో—ఏ జమీందారునో, మహారాజునో అర చేతిలో చిక్కించుకొని—ఓ వెలుగు వెలుగుతూండేదే! సత్యానికి నిలబడేవ్యక్తి కాబట్టీ—తలిదండ్రులు అజ్ఞానిగావున్న చిన్నప్పుడు—అంటకట్టిన భర్తని కొన్నికారణాల వల్ల ప్రేమించలేక...అక్కడికీ—తన ధర్మంప్రకారం—ఓ ఏడాటి భర్తదగ్గర వుండి చూచింది. పొసగలేదు. అసలు—తత్వాల్లోనే తారతమ్యం వున్నప్పుడు—ఎల్లా అతుకు తుందీ?—అంచేత—భర్తచాటునుండి—అల్లరికి దిగేమనిషి కాదుకాబట్టి—విడిచి వచ్చేసింది!...(తీవ్రంగా చూస్తూ)...ఎందు కల్లా వాడిగాచూస్తావ్. నేనేం బెదురుతా ననుకొన్నావా?...చిన్నీ నా కెట్లా లభించిందనా ప్రశ్నిస్తున్నావ్? ..నాకేం వెరపులేదు చెప్పడానికి...అయినా, అది మా యిద్దరికీ సంబంధించిన విషయం. నీవు తెల్సుకోవల సిన పనిలేదు. ఆవిడకు నేను నచ్చాను;—నాకు ఆవిడె నచ్చింది. మా ఐక్యానికి ఆటంకమేమీ లేకపోయింది...వెనుకాముందూ ఆలోచించుకునే స్నేహితులమైనాం. ఒకర్నొకరం బాగా అర్థంచేసుకున్నాం...మధ్య నువ్వు వచ్చి అంతరాయం కల్గించాలని మాత్రం ప్రయత్నిస్తే నెగ్గగల వనుకున్నావా? ఈ ఆరునెల్లనుంచీ నువ్వు వేసిన ఎత్తులు, చేసిన చర్యలు—అన్నీ నాకు తెలుసు. అయినప్పటికీ విశాలహృదయుణ్ణి, చిన్నీ స్థాయి తెలిసినవాణ్ణీ—గనుక, నిర్లక్ష్యంగా వూరొకున్నాను. నేనేమో తెలిసికోలేను—తెలిసి కొన్నా పర్వాలేదు—అనేదిలాసాతోకాదూ—తప్పుడడుగు లేశావు...ఆనాడు చిన్నీని సినీమాకు తీసికెళ్లి, "లవ్ పారేడ్" ఫిలింలో, జానెటీ, షెవలీరు ముద్దెట్టు కుంటూం డడం చూపి—ఏమిటి కూశాన్? జ్ఞాపకముందా? తర్వాత—నేను మెడ్రాసు మా వాళ్లయింట్లో పెళ్లికెళ్లినప్పుడు, చిన్నీకి తోడుగా వుంటూ, ఓనాడు సాయంకాలం యిన్నిపువ్వులూ, సెంటూ పట్టుకెళ్లి చిన్నీకి యిచ్చి ఏవిధంగా ప్రవర్తించబోయినావో మరిచావా...మరోసారి—నేను జడ్జిగారింటికి టీపార్టీకి వెళ్లినప్పుడు, తలనొప్పితో బాధపడ్తూన్నట్టుగా నటించి చిన్నీచేత అమృతాంజనం రాయించుకొంటూ, దొంగతనంగా ముద్దెట్టుకోబోయినావ్—జ్ఞప్తివుందా? ఇంకా ఎన్నో. ఆఁ. మరిచిపోయినా. ఓనాడు సాయంత్రం, కాగితంమీద ప్రేమగీతాలు వ్రాసి, క్రింద "—ప్రేమతో, నీలం,"—అని దస్కతుచేసి, ఆ కాగితాన్ని, చిన్నీ అల్లుకునే క్రోషీదారం పెట్టెలో పెట్టావుకాదూ? ఇవికావూ గీతాలు: (చదువుతాడు.)

౧

ఒక తరంగము...

వెంటనే—వెనువెంటనే

## ఉ ద యి ని

మరి ఒక తరంగము.

...చకచకా

తరుముకొని, తీరాన్ని

ఒరుసుకుంటూ

క్రిక్కిరిసిపోతూ...

చిరుపొరల

నురుగులో

కరగి, వెను

దిరిగిపోతూ...

నీలాల గగనాన

పాలిపోయిన తళుకు

తేలిరాగా...

మలుసంజచాయలో

తెలివెన్నెలల తేట

లొలికిపోగా...

సరిఖ కొలుకుల జరీపయ్యెద

సరిగా దిద్ది తీర్చుకొని జక్కవకవ

విరహానికి ఎదురు ఈతగా

ఒకటే స్రోతగా...

వలచినా,

నిలువమని

పిలచినా

హోరు—హోరులో

పారమే కనరాని

వారాన్నిధి పొలి

మేర దరియజేశే

కూరిమితో...

నుదులమీదుగా

తడబడి—సడలని నడతో,

విడువని తమితో...

పరవళ్లు పోయినా,

పరుగూన సాగినా...

రజని

# ఆద్యంతాలు

నదీ మదవతీ !

వృథా...

ఈ గమనాయాసమంతా

వృథాయేనటమ్మా ?...

## ౨

కోఁ...

కోయని—

ఒక కోయిల కోయని

కూసిన

లేత—కూతకు

ఒక వనలో—

పసరు పూప పూమొనలో

## ౩

వెన్నెల—

నెలవిరిసిన తెలివెన్నెల—

వెన్నెలకేల

వలపు లలముకొనగా...

వెన్నెల—

నెలవుల మెలి దిరిగిన

లలిత లతా లతాంత సౌరభాలం—

—మధుమాసాలు...

మదనుని చిగురు బాకు మొన

పదునులు

కలసి మెలసి వెలయగా...

నిలువలేని తమకముతో—

చెలువుని

మధు వానిన

ఒక గడుసరి తుమ్మెద

మోతకు...

అరవిరిసిన

విరిచేడియ లం

వరి దరహాసానికి...

# ఉ ద యి ని

వెన్నెలలో—

నెలమేనల్లుని

విలుతరితీపులు—

విరహాన్ని

సరాసరి

మరీ రెచ్చగొట్టడానికి—

ఏమిటి...ఈ...సంబంధం?

చెలిమికి

కలువరించు...జవరాలు!...

ఈ మూడుగీతికలుకదూ కానుకగా అర్పించావు? మహాచక్కనివి కాబట్టి—ఆ కాగితాన్ని నాడైరీలో దాచివుంచాను. అప్పుడప్పుడు చదువుతూండడంచేత—కంఠస్థమైన. (నిదానించి చూచి) కులకబోక—ఆ కాంప్లిమెంటు నీకేనని...నాకు తెల్సులే—నువ్వు గీతాలు గాని, పద్యాలుగాని వ్రాయలేవని. అవి శాస్త్రి సర్దార్ వ్రాసినవి...ధోరణే చెల్తుతుంది. అతనికి తెలీకుండానో, లేక పీడించో, భుక్తంచేసుకొని వుంటావు. ధైర్యంగా చిన్నికి దానంచేశావు...ఆనాడే చిన్ని నాకీకాగితాన్ని నవ్వుకొంటూ అందిచ్చింది. నాకేం ఒక్కటీ తెలీదనుకొన్నావా? ఎప్పటికప్పుడే అన్నీ చెప్పేసేది చిన్ని—నాతో. అనేకసార్లు, నిన్ను తన్ని, వాకిట్లోకి తగిలేద్దా మనుకొందిట. కాని జాలితోనూ, నే నేనున్నా నొచ్చుకుంటా నేమోననీ, బయటకి తెలిస్తే నిన్నందరూ అసహ్యించుకుంటారనీ—ఊరుకొందిట. చిన్ని యొక్క మంచి తెలిసికొని, నువ్వే బుద్ధిమార్చుకొని సరిగావుంటావని నేనూ వూరుకొన్నాను. ఇప్పుడేనా ఏమీ అనవలసినవాణ్ణికాదు. అప్రయత్నంగా ధోరణి అల్లాపోయింది. (కొంచెం జోరు తగ్గించి) ఇంకా ఎందుకూ తీవ్రంగా చూస్తావు. నిన్నేమన్నా చేస్తా ననుకొన్నావా? నువ్వు ప్రవర్తించినట్టుగా మరొకరెవరైనా ప్రవర్తించివున్నట్టయితే—యీపాటికి ఏ ఓఘాయిత్యమో చేసివుండేవాణ్ణి. నిన్ను ఏంచెయ్యడానికీ, ఏమనడానికీగూడా నాకు మనస్కొప్పడం లేదు. నిన్నుచూస్తే జాలిమాత్రమే కలుగుతోంది నాకు. ఈస్థితికి మనిషివికాబట్టి ప్రేమకోసం ఎలా తహతహ పడివుంటావో నాకు తెల్సు. నేనూ ఆఅవస్థ అనుభవించిన వాణ్ణే. నువ్వట్లా నాయికకోసం ప్రయత్నించడంలో తప్పులేదు. కాని, చిన్ని చీరచెంగు పట్టుకుందామని ప్రాకులాడ్డంమాత్రం మనబోటివాళ్ళకు తగినపనికాదు. చిన్ని నీకు కావాలని హృదయపూర్వకంగా నువ్వు అభిప్రాయపడ్డట్టయితే, నీప్రేమేగనుక యథార్థమైనదైతే, ఏంచేసివుంటే బాగుండేదంటే,—నాదగ్గర కొచ్చి—ధైర్యంతో, "ఇదిగో, భాయీ, ఇంతవరకూ చిన్ని నీది. నిజమే. కాని ఆవిడ నాకుకావాలని కోర్కెపుట్టింది, నీదామనిషిని కాబట్టి చెప్తున్నాను—మర్మంలేకుండా. చిన్నిని అడుగు. ఆవిడకు నేను నచ్చితే—

నాకిచ్చెయ్. లేక, ఆవిడకు నాయందు యిష్టంలేకపోతే—సరే—మీరిద్దరూ యథాప్రకారం వుండండి. ఇక ఆవైపు నాఆలోచన్లు పోనీను.”—అని చెప్పాలిసింది. అట్లా అన్నావని నాకు కోపంవచ్చేదికాదు. నీ సరసత్వానికి ఎంతో మెచ్చుకొనేవాణ్ణి...ఆవెంటనే చిన్నీని అడిగేవాణ్ణి...ఆవిడ గనుక నీనేస్తానికి వొప్పుకొని—నాకుబదులుగా, తనప్రేమను నీకివ్వడానికి సిద్ధపడ్తే—హృదయపూర్వకంగా చిన్నీని నీకు అర్పించి—మీయిద్దరి సౌఖ్యానికీ నాచేతనైనట్టుగా తోడ్పడేవాణ్ణి...బర్ట్రాండురసల్ యీఅభిప్రాయాలను యిప్పుడిప్పుడు వెల్లడించాడు గాని, అవి నాకిదివరకే వున్నాయి. ఎంచేతా—ప్రేమఅంటే పవిత్రమైనది గనుక. అన్ని పవిత్రవిషయాల్లోనూ వక్రత్వానికీ, మోసానికీ ఎల్లా తావులేదో, అల్లాగే ప్రేమలోనూ. ప్రేమ హృదయాలకు సంబంధించిందిగాని శరీరాలకుమాత్రమే సంబంధించిందికాదు. అదే ప్రేమకూ వ్యభిచారానికీ భేదం. అందులోనూ, మనమోస్తరు రసపిపాసులు యిల్లాంటివాటిల్లో బోల్తాపడి మామూలు మనుష్యులమోస్తరు కాకూడదు. అంచేతే, నీవు చేసిందానికి నాకు కోపంలేదు...యథాలాపాన తప్పటడుగు వేశావు... నువ్వంటే ఎందుకో నాకు ఆపేక్ష కుదిరింది కాబట్టీ—చప్పున అర్థంచేసికోగలవాడవు కాబట్టీ—యింతగా చెప్తున్నాను. నిన్ను భయపెట్టి భగ్నమనోరథుణ్ణిగా చేయడానికి సంకల్పించుకొన్నానని అనుకోకు. (ఆప్యాయంగా) చాలించు, మరి, ఆవిధంగా ముఖం వ్రేలాడవేయడం...రా, నాతో...చిన్నీ చీరెలకోసం వాకిలికాస్తూంటుంది. సెలెక్షనులో సహాయపడుదువుగాని...చిన్నీ ఏమన్నా అంటుందని భయపడకు. చిన్నీహృదయంగూడా నాదానిమోస్తరే. వేరువిధమైతే నీ కిదివరకే అంపకాలు యిచ్చేది...లే. పోదాం. ఏమీ జరుగనట్టుగానే నడుచుకొందాం?...నేస్తం విడగొట్టుకుందామని యోచించకు. నాకూ చిన్నీకి తగిన ఫ్రెండుని దొరికావు అని సంతోషిస్తున్నాను. నిష్కపటుణ్ణి గాబట్టి నాహృదయాన్ని విప్పిచూపించాను. అర్థంచేసుకో...రా, వెడదాం...నువ్వొక్కనాడు కనపడక పోయినా, ఎట్లాగో వుంటుంది నామనస్సు. చిన్నీగూడా అంటుంది—“చూశారా, నీలం రానేలేదు యీసాయంత్రం, టీకి. ఇల్లంతా చిన్నబోయింది—”అని. నీలం...ఎందు కింతా మూగతనం...వేమంతోనే వున్నావు. బయల్దేరు.

[నీలాచలం మెల్లగాలేచి,—గొప్ప నూతనానుభవం జనింపజేసేకాంతి ముఖాన ప్రకాశిస్తూండగా,—లాల్చీ, పైజామా మడతలు సరిచేసుకొని,—బయల్దేరడానికి సిద్ధమౌతాడు. అతని బుజంమీద చేత్తో చరుస్తూ శ్రీమాలి]

గుడ్‌బాయ్, నీసంగతి నాకు తెలుసుగా, నీలం...జీవితంలో ఎవరికైనా వస్తాయి ఉపద్రవమైన ఘట్టాలు. హీరోలాగ ఎదుర్కొని, రైటుమార్గమేదో తెలుసుకోవాలిగాని, ...మూగనోముపట్టి, పాత “పరంజ్యోతి” పత్రికలు తిరగవేస్తే, సమస్యాపరిష్కార

మాతుందా—సరదా వస్తుందా...సడు...అవిగో—ఆచీరెలు పుచ్చుకో...సువ్వు మోసు కొచ్చావని తెలిసి చిన్నీ సంబరపడ్తుంది. ఇప్పటినుంచీ నూతన అధ్యాయం గాదూ? ఆద్యంతాల ఏకరువుతో—వెనుకటి ఘట్టం సమాప్తిఅయిందిగా, నీలం ?

['తథాస్తు' అనేసూచకంగా తలత్రిప్పుతూ నీలాచలం చీరెలు పుచ్చుకుంటాడు. ఇద్దరూ నడచి పోతారు.]

## చేయూత

ఎవరు కావించిన రచనలకు వారే భాష్యంగూడా వ్రాయడం అట్టే సమంజసమైన పనిగాదు. ఆర్టిస్టిక్ నిబంధన లంతగా, అల్లాంటికృషిని ఆమోదించవు.

"యే నామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానన్తి తే కిమపి తాన్ ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతే ఒస్తి మమ కోఽపి సమానధర్మా
కాలోహ్యాయం నిరవధి ర్విపులాచ పృథ్వీ"

అన్న భవభూతి ధిక్కరణను ప్రకటించే రచయితలను గౌరవించదు పాఠకలోకం. తనవ్రాతలు అందరికీ ఏకమొత్తంగా గాహ్యమౌతాయని ఏరచయితా అభయహస్త మియ్యడు. వ్యాఖ్యాన, దూషణ, భూషణ—అన్నీ చదివేవారివంతు. తన వ్రాతలను సమర్థిస్తూ గాని, మెచ్చుకొంటూ గాని, ఏవ్రాతగాడైనా చేయూత యిస్తే తను "తుమ్మి చిరంజీవ" అని తానే అనుకొన్నట్లుంటుంది. బర్నార్డుషా చేసినా అంతే !

ఈలోపమే నేను చేయబోతున్నట్లుగా కన్పడుతుంది. అయినప్పటికీ—నిర్మొహమాటంగా మొదలెట్టాను. ఎంచేతా ?—అంటే:

నాయీ పైరచన కథో, కథానకమో, నాటకమో, నాటికో, సంభాషణో—అనే సంశయం చదివే వారిలో కొంతమందికి కలుగవచ్చు. స్ట్రిండ్ బర్గ్, మేటరులింక్ మొదలైనవారి కల్పనలతో పరిచయమున్న వారికి "ఆద్యంతాల"ధోరణి నూత్నంగా గాని, వికృతంగా గాని తోచదు. ఇక—తక్కినవారికోసం చెప్పే దేమంటే ?—

మొహమాటంచేత, మర్యాదకోసం—గాక, నియమాలను అనుసరించే—"ఆద్యంతాలు"—నాటక—చిన్ననాటక—రకంలో చేరింది. అసలు రంగంమీద అగుపడేదే యిద్దరువ్యక్తులు. అందులోను ఒకరికి ఓమాటగూడా ఉచ్చరించాలిసిన బాధ్యత లేదు...మిగిలిన ఒకరే—అంతసేపూ గొంతు బాధ కలేటట్లుగా మాట్లాడాలి. గదిలో కూర్చొని చెప్పుకుంటున్న స్వగతమో,—ప్లాటుఫారం యొక్క యిస్తూన్న ఉపన్యాసమో—అనిపించడంలో అసంభవ మేమీ లేదు. కాని, నిదానించి చూస్తే నిజం తెలుస్తుంది. పాత్ర వొక్కటే అయి నప్పటికీ, అతను ముగ్గురు (తాను, చిన్నీ, నీలాచలం) వ్యక్తులహృదయ రహస్యాలను, జీవితాలను వెల్లడిస్తాడు. నీలాచలం—తనమౌనంతోనూ, సంజ్ఞలతోనూ—శ్రీమాలికి తోడ్పడతాడు. ఈముగ్గురియొక్క భావాలే కాకుండా, వాళ్ల "ఇచ్ఛాజీవుల" బృందం ఎందుకు ఏర్పడ్డదో,—ఏం ఆదర్శాలు, ఉద్దేశ్యాలు కలవో,—

# ఆద్యంతాలు

లలితకళల సహాయంతో తన రాష్ట్రానికి తన్మూలంగా దేశానికీ, ఎలాంటి సేవ చేయ సంకల్పించిందో,— వాళ్లది ఎలాంటి అనిరంతిపక్షో,—కాలాన్ని అనుసరించి నూతనభావాలను ఎల్లా యిముడించుకోవాలో,— ప్రేమ ఎలాంటి పవిత్రమైనదో,—విశృంఖలత్వమంటే విచ్చలవిడి ఎలా కాదో,—ప్రేమవంటివిషయంలో గూడా సహనం, సౌశీల్యం, నిర్మోహమూటం, నీతి ఎలా అవసరమో,—ఈస్థటిక్ టెంపరమెంటు పుట్టుక తోనే అలవడ్డవార అభిప్రాయాలు, నాటి ఆచరణ ఎలా వుంటాయో, వాటిసాఫల్యంకోసం ఎంత కష్ట పడాలో,— ముఖ్యమైనవిషయాలన్నీ శ్రీమాలిద్వారా వ్యక్తమౌతాయి.

తనద్వారా కొంతప్రతిపత్తిని, ఉపకారాన్ని పొంది, తనప్రియురాలివిషయంలో తననే మోసగిస్తున్న వాని ఎదుట నిలబడి, శాంతంగా మాట్లాడుతూ "పరస్య న పరస్యేతి మమేతి న మమేతిచ, తదాస్వాదే విభావాదేః పరిచ్ఛేదో న విద్యతే"—అన్న "సాహిత్యదర్పణ" కారుని సూత్రానికి హద్దులు విశదీకరించడం ఎవరికేనా సాధ్యమా?...ఎందుకు కాదూ? శ్రీమాలి చూపలేదూ సాధ్యమని? ఒథెల్లోమో స్తరు ఉడికిపోయి డెస్డిమోనావంటి నిరపరాధిని హత్యచేయడానికి అందరూ సిద్ధపడ్తారు. శ్రీమాలి నిరూపించేది వేరు. అది ఉత్తమమైనదో కాదో—ఊహచెయ్యవలసింది మీరు. "అల్పబుద్ధికి లే వగమ్యముల్" అనేరకంలో చేరినవాడు శ్రీమాలి.

తర్వాత: కళలంటూ, కవిత్వమంటూ, నాటకాలంటూ దేవుళ్లాడుతారే చాలామంది—దానివల్ల ఏమైనా, ఎవరికైనా ప్రయోజన ముందా? —లేక ఊసుపోక చేసే అవకతవకపనులా? ఎట్లా అనుకుంటే అట్లాగు. బంగారం స్వతస్సిద్ధమైన విలువగలది. కాని సరియైనపనికి ఉపయోగించకపోతే రాణించదు. అల్లాగే యీలలితకళలూను. కాలపాగంపర్యంగావున్న అవకాశాలివి. ఎన్నడో, పూర్వంలో, వాటివిలువ పూర్తిగా గ్రహింపబడ్డది....అల్లాగే అవి వినియోగింపబడినై గూడాను....ఇటీవల—అవి కేవలం వ్యాపారసరళిలోకి దిగిపోయినై. నాటకం ప్రదర్శిస్తే—ఎంత గాబడి వుంటుందని ప్రశ్న;—చిత్తరువు గీస్తే—ఎవరు ఎంతకు కొంటారని; పద్యంగాని, కథగాని వ్రాస్తే—ఏపత్రిక ఎంత యిస్తుందని;—లేకపోతే ఏవిశ్వదాత అంకిత మందుకొని ఎంత యిస్తాడని;—యిదీ ప్రస్తుతధోరణి. రూపాయి—అణాల—పైసల వాతావరణంలో మునిగి తేలుతూన్న ఆధునికయుగధర్మమేగూడా యిందుకు కొంత కారణం. కాని అసలుఆదర్శం ఎందుకు మరుగుపడి పోవాలి? ఈలలితకళలు—కేవల ధనార్జనకుతప్ప—మరెందుకూ మార్గాలు కావూ? ఆత్మోన్నతి—ఆత్మోపలబ్ధి—మాట అటుంచి, వాటిమూలంగా సంఘానికి, దేశానికి సేవచేసేందుకు వీల్లేదూ? ఎందుకు లేదూ? ఉందని చెప్పడంలేదూ—శ్రీమాలి? జీర్ణించి భిత్తికలు రాలుతున్న దేశాన్ని పునరుద్ధరింపవచ్చు....పూర్వంలో గ్రీకులు, రోమనులు చేయలా అలాగ? పరిషు రసజ్ఞులు చూపలా యీయుగంలో అలా చేయడానికి వీలున్నదని? మనం మాత్రం...? ఆలాంటి ఆదర్శాలు అర్థంచేసుకొన్నవాళ్లం—గుప్పెడు మందిమే ననుకోండి. అయితేమాత్రం? శ్రీమాలిఉత్సాహం మన లెందుకు ఆవేశించి, కార్యసాధనకు పురిగొల్పకూడదూ? "దృఢమనస్కుడవై యతించిన, సడలిపోదా దాస్యబంధము?—వీడిపోదా నిద్రమాంద్యము?"—అని గాదూ ఓ కవికుమారుడు అన్నాడు...

ఇదంతా "ఆద్యంతాల"లో వున్నదని—నే ననుకుంటున్నాను...ఇది మనస్సులో వుంచుకు చదివితే బాగుంటుందని నాపుద్దేశ్యం. అందుకూ యీచేయూత!

—వెం.నా.

# నాటకములు, నాటకకళ

— పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, ఎమ్.ఏ., పిహెచ్.డి. —

విజ్ఞానవిభాగములన్నిటికంటెను నాటకకళయే మానవుని మనోభావములను జీవితమును విశదముగ తెలియజేయగల సాధనము. అనగా నాటిస్వరూపమునందున్న నాటకకళయే సమగ్రత నొంది, మానవదృష్టియం దెల్లప్పుడును కేంద్రస్థానమును వహించియున్న దని యర్థము గాదు. ఆధునికయుగము నాటకయుగమని నొక్కి చెప్ప సాధ్యము గాదు. ఇది నవలాయుగమని చెప్పినను చెప్పవచ్చునేమో. తత్త్వవిమర్శకులును, శాస్త్రప్రచారకులునుగూడ నవలారూపముగ తమ యభిప్రాయములను వెల్లడించుచున్నారు. తేనెలో పొరలించిన చేదుమాత్రలవలె ఎట్టి అనర్థాభిప్రాయములును, అవివేకపు అంశములును గూడ నవలారూపముననున్న జనాంగీకారమును బడయుచున్నవి.

కాని యొకనవల జనాదరము నెక్కువ పడసినదన్న వెంటనే దానిని నాటకరూపమునకు మార్చి ప్రదర్శింతురు. నవలారచనమునం దున్నతిస్థానమును బొందిననారందరును నాటకములను వ్రాయ బ్రయత్నించి, నాటకకళయందుగూడ తమ సామర్థ్యమును జూప బ్రయత్నించుచున్నారు. సారస్వతవిభాగములందు ఏ విభాగము మానవజీవితమును, మానవాభిప్రాయములను ఎక్కువగ మార్చగలిగినదని పరీక్షించినచో, నాటకకళనే అట్టిదానినిగ పేర్కొనవలసియుండును.

ఇందునకు కారణము నాటకకళయొక్క విశిష్టధర్మమే. నాటకరచయితకన్న నవలాకారునికి సౌకర్యము మెండు. నవలాకారునికి విషయవర్గము (range of material) ఎక్కువ; విశేషాధికారములు (privileges) మెండు. పైగా నవలాకారునికి బాధ్యతలు కూడ చాలతక్కువ. అతని సృష్టియే అతనిని శృంఖలబద్ధునిగ జేయజాలదు. నాటకరచయితల కీ చిక్కులన్నియు గలవు. నవలలను బోలిన నాటకములు గూడ కొన్ని గలవు. కాని వాని ప్రాముఖ్యమునకు కారణము నవలానుకరణము గాదు. నాటకధర్మము నవలాధర్మమునకన్న మృగ్యముగ దోచుచున్నను దాని విశిష్టతయును, దాని అద్వితీయతయును (uniqueness) సూక్ష్మదృష్టికి గోచరింపకపోదు. మానవధర్మములను, మానవాదర్శములను నాటకరచయిత బోధింపగలిగినంత స్ఫుటముగను, సార్థకముగను (effectively), సఫలముగను, సూక్ష్మముగను (subtle) నవలాకారుడు బోధింపలేడు. నాట్యకళ కనుగుణములైన నటువంటి సంగీతాది ఉపకరణములు నవలాకారునికి లేకపోవుటచేత, విషయ సాక్షాత్కారమునకును, అభిమతవస్తు పరిణతికిని (effect desired) నవలా

కారుని కపోలకల్పనమే సర్వాధారము. ఆవేగాతిశయముచే నలరారు ఎట్టి రసవంతమైన పద్యకావ్యమున కైనను నాటకమున కున్నంత భావబోధకశక్తి లేదు. నాటకము సర్వజనభోగ సాధ్యము. మానవుని నిగూఢాంతరాత్మయందుకూడ నాటకము ఆందోళనము కలుగజేయ గలదు. కఠినాత్ముని హృదయమునుగూడ పరిస్పందనము నొందింపగలదు. మానవుని కళా విన్యాసమునందు సారస్వత ప్రథమసృష్టి నాటకరూపముగనే యుండియుండును. అనాగరకు లనబడు మానవజాతులందెల్లను నేటికిని నాటకప్రాయమైన దృశ్యకావ్యమే సారస్వత ప్రయత్న పరమావధి. గ్రీసుదేశపు నాటకకళ వారల ఆద్యాచారకాండనుండి బయలుదేరిన దని మనకు తెలిసియేయున్నది.

నాటకకళయొక్క ప్రధానప్రయోజనము మానవునికి తాత్కాలిక సంతోషము నొనగూర్చుటయే యని స్థూలదృష్టికి గోచరింపవచ్చును. కాని క్రీడాలోలురకు ప్రొద్దు బుచ్చుమార్గము జూపుటయే నాటకకళయొక్క పరమావధియని తలచుటకన్న గొప్ప పొరపాటుండదు. నాటకలక్షణ మిదియేయైనచో నాటకరచయితకర్తవ్యమును నటుని కర్తవ్యమును అత్యంత సులభమని చెప్పవచ్చును. ఏలయన, ప్రేక్షకుల నేదోవిధముగ నుద్రేకింపజేసి, ఇంద్రియాకర్షకరములగు వాక్యములతోను చర్యలతోను వారల నాకర్షించి నంతనే ఈ కర్తవ్యము నెఱవేరును. కాని ఇట్టి యనుభవమునందు ప్రేక్షకుడు దృశ్యవిషయ మునందు మానసికముగ నైక్యముజెంద యత్నింపడు. అందునకు బదులు దృశ్యవిషయ మునసు విమర్శించుచు, నిమిషనిమిషమునకును తన శక్తిసామర్థ్యములను పాత్రల శక్తిసామర్థ్య ములతో పోల్చుకొనుచు, తన యాధిక్యమునకు తన్నే మెచ్చుకొనుచు తృప్తిపొందు చుండును.

సినిమాయందు చార్లీచాప్లిన్ (Charlie Chaplin) అసందర్భకార్యములను జూచునప్పుడును, నాయికానాయకుల దాంపత్య జీవనమునకు భంగకరమగు పరిస్థితుల నవలోకము చేయునప్పుడును, పాత్రలలో నొకరికొకరి కుండు విశేష సందర్భములను పరీక్షించుచున్నప్పుడును, సినిమా ఎంత ఉత్తమమైన దైనప్పటికిని మనము తన్మయత్వము జెందము. చార్లీచాప్లిన్ చేయునట్టి అసందర్భకార్యములను మన మెన్నటికిని చేయజాల మను దృఢవిశ్వాసముతో మనము వాని చర్యలను జూచి నవ్వెదము. మన సుఖజీవనము నకు భంగకరమైన స్థితిగతులు సినిమాయందు జూపినట్లు మన కెప్పటికిని రాజాలవనియు, వచ్చినను మనము వానిని సామర్థ్యముతో నెదిర్చగలమను నమ్మకముతో పాత్రల చర్య లను ఖండించియు, ప్రశంసించియు మన సంతృప్తిని వెల్లడిచేతుము. ఇట్లు తాత్కాలిక సంతృప్తి నొందించుటయే సినిమాయొక్క పరమకర్తవ్యము.

సర్వోత్కృష్టమైన వివేకానుభవ ప్రదానమే నాటకముయొక్క ప్రథమ ప్రయోజనము. అవ్యక్తమైన పామరజన చిత్తక్షోభలను మనోభిప్రాయములను బాహ్యప్రపంచమునకు ప్రస్ఫుటపరచి ఇంద్రియాతీతజన్యమగు మనశ్శాంతిని చేకూర్పగల అమూల్యసాధనమే నాటకకళ. అనవగతముగ మనలను వేధించు అపరిశుద్ధభావములను అణగారినవిగ జేసి, మనస్సునందలి అవ్యక్తమగు కలతలను పోగొట్టగల శక్తి నాటక ప్రేక్షణానుభవమునకు గలదు. కాననే ఉత్కృష్టనాటక ప్రేక్షణమునందలి యనుభవము అప్రయత్నపూర్వకము, అబుద్ధిపూర్వకము. అరిషడ్వర్గములతోను, అజ్ఞానాంధకారముతోను పరివృత్తులై, క్షుభిత మనస్కులై స్వస్థచిత్తతలేని జనబాహుళ్యమునకు ఇట్టి అనుభవము అత్యావశ్యకము.

ఈఅనుభవము బాల్యావస్థయందలి ఆటపాటలలో సహజముగ నుండవచ్చును. కాని ఈ అనుభవమును పొందువారు బాలురవలె గాక అత్యధికముగ నియమనిబంధనలకు లోనైనవారు. కాన ఇట్టి అనుభవము వారియందు స్వచ్ఛందముగ నుద్రిక్తమగుట దుస్సాధ్యము. బాలురనువలె చిన్నచిన్న యాటపాటలు వారల మనస్సుల నేవిధముగను జలింపజాలవు. కాని జీవితమునందలి అధికతరకష్టములను గాని దుఃఖములనుగాని వారు చూచినప్పుడు వారిట్టి యనుభవమును జెందుదురు. ఒకచిన్న యుదాహరణము ఈ యభిప్రాయమును సుబోధముగ జేయును. బంతియాట ఆడలేని బాలునికి బంతియాట చూడవలెనని గాని, చదువవలెనని గాని కుతూహల ముండునట్లు, ప్రపంచమున నాయకత్వమును బడయలేని మానవునికి ఒక నాయకుని గాంచినను, ధీరోదాత్తగుణనిధియగు పాత్రాభినయమును గాంచినను కొంత మనశ్శాంతి యొడగూడును.

మానవునికి తన యభ్యుదయమునందు గల యావేదనయే మానవపరిణామ వికాసములకు మూలకారణము. ఈ యావేదన కొంచెముగనో గొప్పగనో యున్నంతకాలము మానవుడు వీరత్వమును బొందలేకపోయినను వీరపూజ చేయుచునే యుండును. అట్టి వీరపూజ అనాగరకజాతులయందు బుద్ధిపూర్వకముగను మనఃపూర్వకముగను లజ్జాభయముల బాధలేకయును జరుగుచుండును. అనాగరక వీరపూజయందు ప్రతివాడును తంత్రమును నడిపింపగలిగినను తంత్రోపదేష్ట ఆ జాతి పురోహితుడు. ఆ తంత్రము వీరపూజకు ముఖ్యాంగము.

నాగరికత హెచ్చినకొలదిని మానవునికి పార్థక్యమును (individuality), వ్యక్తిత్వమును హెచ్చుచుండును. స్వాతంత్ర్యము హెచ్చినకొలదిని లజ్జాసంశయము లధికమగును. కాన మనోభావములు బహిఃప్రకటితములై మనశ్శాంతిని సంపాదించుటకు ఆస్పదము తక్కువయగును. కనుకనే నాగరకజాతుల వీరపూజయందు ప్రత్యేకతంత్రము నశించినది.

# 'ఏకవీర'[1]

## ఆచంట జానకిరామ్

ఏకవీర ఒక గొప్పనవల—'ఒక విచిత్ర కథామంటపము'; దీనికి ఏకవీర, ఆమె భర్త కుట్టాన్, వీరభూపతి, అతని భార్య మీనాక్షీ నాలుగు స్తంభాలు.

కథావస్తువు సృష్టి మొదలు నేటివరకు—మన హృదయాలలో ప్రేమ ఉన్నంత వరకు, మనలను వేధించే ప్రేమ సమస్య: ప్రేమ ముఖ్యమా? విధ్యుక్తధర్మము ముఖ్యమా? ఈ సమస్యచేతనే పైనలుగురను బాధించి, దీనివలననే వారికి తీరని ఆత్మ పరీక్ష, గొప్పనిగ్రహము, అందుబాటులో జయము—కాని, తుదకు భరించడానికి అలవి కాని ఆశాభంగము కలిపించి విహరించినాడు కవి!

కథ జరిగిన స్థలము మధుర—యించుమించు తిరుమలనాయకుని కాలము. కాని ఎప్పుడైనా, ఎక్కడైనా, యిందులో చిత్రించిన విషయాలు శాశ్వతాలు. ప్రతిదినము మనయెదుట జరుగుతూవుండేవే. కుట్టాన్ సేతుపతిన్నీ వీరభూపతిన్నీ పరమమిత్రులు—వొకరిమీద వొకరికి గొప్పవిశ్వాసము. ఏవిధమైన దాపరికం లేదు—జీవనపుసమస్యలలో వొకరి కొకరు వింతగా బలము నిచ్చుకుంటూవుంటారు. కుట్టాన్ సేతుపతి, రామనాథ పురపు యువరాజు, అదివరకే మీనాక్షిని ప్రేమించివున్నా, ఆమె తలిదండ్రులు సాధారణస్థితిమంతులు కాబట్టి తండ్రి ఆజ్ఞవల్ల కుట్టాన్కు ఏకవీర భార్య అవుతుంది. అతడున్నూ ధర్మబద్ధుడయి భార్య అయింది కాబట్టి ఏకవీరనే ప్రేమించాలని వ్యర్థయత్నాలు చేస్తాడు. చమత్కారం యేమిటంటే: అతడు తన నిజస్థితిని ఆమెకు వెల్లడిచేస్తాడు. చేసి, తాను కష్టపడి ఆమెను ప్రేమించుటకు ప్రయత్నిస్తానంటాడు! ఏకవీర సామాన్యురాలు కాదు. రాచకన్య, అందకత్తె, నవనీతమైన హృదయం కలది—భర్త తన్ను నిరసిస్తే, వోపికతో స్వామిప్రేమకు ప్రయత్నించి తుదకు నిరాశ పొంది, వొకానొకప్పుడు దూరాన్నుంచి తన్ను సమ్మోహింపజేసిన ఒక అందగాని రూపానికి మళ్ళా తన మానస వీథిని తావియ్య మొదలుపెటుతుంది. "తాను నిర్మించిన ప్రేమసౌధమునకు కుట్టాన్ తీసిన నిర్దయాద్వారమునుండి తన తొల్లిటివలపుకాడు ప్రవేశిస్తాడు."

---

[1] రసతరంగిణి శ్రీ. విశ్వనాథ సత్యనారాయణ, ఎమ్. ఏ., బందరు.

కాని, యీమధ్యలో, ఏకవీర ప్రేమించిన అజ్ఞాతప్రియుడు, వీరభూపతి—కుట్టాన్
ప్రాణస్నేహితుడు, తనకు లభింపని ఆమెకోసము తపించి తపించి చివరకు ఆమెమీది
ప్రేమను దట్టమైన పితృభక్తి దొంతరల వెనుక దాచుకుంటాడు. తండ్రి అతనికి మీనాక్షిని
పెండ్లిచేస్తాడు! మీనాక్షి దివ్యవ్యక్తి. ఆమె హృదయాన్నంతా కుట్టాన్ సేతుపతికి
అధీనముచేసి, సర్వకాల సర్వావస్థలందు అతనినే ధ్యానిస్తూవున్న ఆమె పెండ్లిఅయిన
మగనికి సేవజేస్తుంది, స్నేహ మిస్తుంది. కాని ప్రేమను, పవిత్రమైనదేహాన్ని పంచి యియ్య
లేకపోతుంది:

వీరభూపతి: కాళ్లు నొప్పిగా నున్నవి. సేవకుని పిలిచెదవా?

భార్య: నేను పిసికెదను.

వీర: నన్ను నీవు ముట్టికొనెదవా?

భార్య: సేవకభావములో దోషము లేదు. మీరు నూటికట్లే మాటాడెదరు. ప్రభూ! నాకు
దానిపై నిచ్చలేదు. భార్యా భర్తృత్వ సంబంధమున కదియే ప్రధానమా? నా మనస్సున కట్లు తోచుటలేదు.
నే నేమి చేయుదును?

పాపము! వీరభూపతికి రెండు దుఃఖాలు. తనను యించుమించుగా పిచ్చివానిగా
చేసిన మొదటిప్రేమ. ఏదోవిధంగా ఆప్రేమను చంపుకొని, యీ క్రొత్తఆమెయందు
ప్రేమ నిలపా లనుకుంటే ఆమెకు యీ ఖండితమైన విముఖత్వము. ఏమి చేయకలడు!
తన అసహాయత్వాన్ని స్నేహితుడగు కుట్టాన్‌కు వెల్లడిస్తాడు. (ఈ ఘట్టము గొప్పది.)

వీరభూపతి భార్య తన మీనాక్షే అని తెలిసికొన్న కుట్టాన్—ధీరుడు—వొక్క
విశ్వప్రయత్నంచేసి మీనాక్షిని తన చెల్లెలుగా మార్చేసుకుంటాడు. ఈ విచిత్ర
పరిణామము అతనికి వింతబలాన్నిస్తుంది. ఆ నిమిషాన్నుంచి మీనాక్షికూడా తన
భర్తనే ప్రియునిగా భావించి అతనిని అన్నివిధాల సంతోషింపజేసి తాను సంతోషించా
లని పూనుకుంటుంది. కాని వీరభూపతి మాత్రం అంత సులువుగా పరిస్థితులను సమన్వ
యించుకోలేకపోతాడు. అతనికోసము వేయికళ్లతో నిరీక్షిస్తూవున్న భార్యా
ప్రేయసియొక్క యీ క్రొత్తప్రేమను అతడు స్వీకరింపలేకపోతాడు—ఆమెకు దూరమవ
డానికి రాచకార్యాలను సాకుచేసుకుంటాడు. ఈవిధంగా, యింటికి రాకరాక, వొక
రోజున అకస్మాత్తుగా వచ్చినపుడు, తన అంతఃపురములో అవతరించిన తన తొలిప్రేయ
సిని చూస్తాడు. ఆమె ఏకవీర! మీనాక్షి ఏకవీరలు స్నేహితులు గనుక వీరింటికి వచ్చి,
యిక్కడ కూచిపూడి భాగవతుల భాగవతం చూస్తూ తన్మయత్వం పొందిన ఏకవీర.
ఇతన్ని తన మొదటిప్రియుణ్ణిగా గుర్తిస్తుంది—ఒకనిమిషము—వొక్క దివ్యమైన నిమి
షము వీరు లోకాన్ని మరచిపోతారు.

ఆమె యచ్చట, నతఁ డచ్చట నేల యున్నారన్న యూహ పోలేదు. వీరభూపతి పరిష్వంగార్థము దగ్గర దగ్గరకు వచ్చుచుండెను. ఏకవీర చేతులు చాచుకొని నిలంబడినది. ఆమె యొడలెల్ల చెమ్మటపోసెను. .........వీరభూపతి కౌగిలి చేరుకోదగినంతదగ్గరకు వచ్చెను. ఆమె పాదముల క్రింద భూమి యల్లలనాడెను. .........అతఁడామెను గాఢాతిగాఢముగా కౌగిలించుకొనెను.......అతఁడామె పెదవిపై నొక్క ముద్దిడెను. ఆమె జ్ఞానేంద్రియము మాత్రము దానిని తెలిసికొనలేదు......అతని స్పర్శ యీసారి యామెలో నస్థిసంచయమునకుగూడ తాకినది. ఆమెకు హృదయసంచలమునందుమాత్రమే స్థితి. తక్కిన సర్వాణువులందు ప్రళయము..........యుంచుగిస్తను కౌగిలించుకొన్నట్టుగా చైతన్యపు వేడి కానరాని యామె కౌగిలి వీరభూపతి కప్పుడు తెలిసినది. వెంటనే అతనికి ప్రబోధము కలిగినది.......

కాని, ఆమె కుట్టాన్ భార్య అని తెలిసికొన్నప్పుడు వీరభూపతికి పిడుగుపడినట్లవుతుంది. ఏకవీరలో న్యూనత్వం వస్తుంది. ఒకవిధమైన ఆవేశం వచ్చి, వీథిలో పడి, అప్పుడే కాశీ తాళిన్యాయంగా, మధురవీథుల్లో ప్రచారంచేస్తూవున్న క్రైస్తవ మిషనరీ డినోబిలి ప్రయత్నాలకు అడ్డముగుతుంది. అతన్ని వాదనలో వోడిస్తుంది. ఇదంతా ఆవేశపరమైన ఏకవీర. సర్వాతి చేల అయిపోతుంది. అంతఃపురము జేర్పింపబడ్డాక తన నిజస్థితి అంతా తెలుసుకుని, తనకొరకు యుద్ధాలు జయించి తహతహలాడుతూ వస్తూవున్న కుట్టాన్ సేతుభూపతికి యేవిధమైన స్వాగత మివ్వకలదు? పవిత్రమైన ఆమె మనస్సులో తాను, తన మొదటిప్రియుని కౌగిలికి లొంగిన తాను, భర్తకు తగదు!

కుట్టాన్ కన్నులలో ప్రేమ పరిసినది. ఆమె కన్నులలో భయము విరిసినది. కుట్టాన్ మాటాడుద మనుకొన్నాడు. ఆమె పరాంగన కాదు. ఇదివరకే తన్ను ప్రేమించినది. తాను ప్రేమించలేకపోయినాడు. ఇప్పుడా ప్రేమ ముసురుకొనివచ్చినది. 'బాగుగ నున్నావా? ఏమి చేయుచుంటివి?' మొదలగు ప్రశ్నలకు తావు లేదు. తన ప్రేమకు తగిన దొక్కటియే. అది యొక గాఢపరిష్వంగము. తాను మాటాడలేకపోయినాడు. అతని కన్నులవెంట నీరు గిర్రున తిరిగెను. గొంతుకలో గాద్గద్యమేర్పడెను. ఏకవీర యతని నాగుమన్నది. అతఁడొకయడుగు ముందునకు వేసెను. ఏకవీర యానపెట్టినది. కుట్టాన్ నిలిచిపోయెను. ఏకవీర యేడ్చినది. కుట్టాన్ మరల నొక యడుగు వేసెను. ఆమె తన్ను తాకవలదన్నది. తాకినచో చచ్చిపోయెద నన్నది..............

ఏకవీర పారిపోతుంది. కుట్టాన్ ఆమెను వెంబడిస్తాడు.

కుట్టాన్ : ఎక్కడకు పోవుచుంటివి?

ఏకవీర : వైగైనదికి.

కుట్టాన్ : ఎందుకు?

ఏకవీర : నాయొడల మకిలము మున్నది. అది కడిగివేయుటకు.

వైగైనది చూపుమేరలో వుండగా వీరి కెదురుగా ఒక సన్యాసి వస్తాడు. అతన్ని చూచి ఏకవీర కంపించిపోయి కన్నులు రెండు మూసుకొంటుంది. కుట్టాన్ ఆశ్చర్యపడి అతన్ని పలుకరిస్తాడు :

కుట్టాన్ : వీరా ! ఇది యేమి ?

సన్యాసి తలయెత్తెను. ఎదుట గుట్టానును చూచెను. వీరభూపతి కన్నులలో బాష్పము లేర్పడబోయి వెనుకకు మరల్పబడెను. కుట్టానున కనేకములగు నూహలు తోచెను. తన మీనాక్షిప్రేమ యితని సన్యాసమునకు గారణ మనుకొని,

'స్థానాపతీ! క్షమించలేకపోతివి !'

అన్నా డతడు, వీరభూపతి కన్నులలో జాలి పొడసూపెను.

ఇంతట్లోకి ఏకవీర నీటిపొర జేరుతుంది. కుట్టాన్‌కు కోపం వస్తుంది.

'అడుగు వైచితివా, నిన్ను బలవంతముగ నింటికి దీసికొనిపోదును' అని అతనిలో వున్న భర్త శాసిస్తాడు ! "ఏకవీర కదలదు. వీరభూపతి, తనప్రేమ, దాని విచిత్రపరిణామము పూసగ్రుచ్చినట్లు చెప్పెను. తన దేహములో నున్న ప్రతియణువు వీరభూపతిస్పర్శ మనుభవించుచున్నదని చెప్పెను. అది యింకొక విజాతీయస్పర్శ తాళుకోలేదనెను "!!

ఏకవీర విచిత్రంగా ప్రశ్నిస్తుంది : "మీరు నన్నింకను ప్రేమింతురా."

ఆమె పెదవులసందునుండి యొక సన్ననినవ్వు వినంబడెను. తపస్వియైన కుట్టాన్ తా నామెను ప్రేమించుచున్నా నన్న సంగతి చెప్పలేదు. అతడు ప్రేమచే కదలిపోయెను. ప్రేమప్రవాహ మతనిపై విఱుచుకొని పడినది !

కాని, పాపము ! అతనికి దక్కినది నిర్జీవియైన ఏకవీరయే. మీనాక్షి సంగతి మనకు తెలియదు.

కవి మన జీవితాలకు ఆయువుపట్టయిన ప్రేమవిషయాన్ని తీసుకొని పూర్వపు సాంప్రదాయలతో మిక్కిలి ఆధునికంగా చర్చించి, చక్కని కథను నడిపించారు. సమయానుకూలంగా కథపట్టుకు రక్తికలిగేట్టుగా స్థలవర్ణనలు, చారిత్రవర్ణనలు, శిల్పవర్ణనలు, చివరకు సాహిత్యంలోవి, అలంకారశాస్త్రంలోవి, భరతశాస్త్రంలోవి విశేషాలు కొన్ని, కుప్పించి గొప్పకలంతో వ్రాశారు. ఒకచిత్రము : వీరు తమ వ్యక్తుల మనోభావాలను, వారి అనుభవాలను వర్ణించేటప్పుడు పదేపదే వారి కంటివెంట నీరు తెప్పిస్తారు. వీరి నాయికానాయకులు యిట్టే యేడుస్తారు. కాని, ఆ మాటకొస్తే, కొన్ని సన్నివేశాలు అనుభవిస్తూవుండే మనకుకూడా అక్షరాలు నీటితెరలోంచే కనబడతాయి !

## 'ఏకవీర'

గ్రంథమంతా కవి 'సులభశైలినే' వ్రాశారు; కాని, వీరు వొకమోస్తరు గ్రాంథికభాషలో వ్రాయకుండా, యీరోజుల్లో ఎక్కువ అమలులోనికి వస్తూవున్న, మనం అందరము మాట్లాడుకునే, ఆలోచించుకునే, అనుభవించే సజీవమైన వాడుకభాషలో వ్రాస్తే గ్రంథము మన హృదయాలకు మరింతదగ్గరగా పదింతలు గొప్పగా వుండేది. వాక్యాలు యిప్పటివలె విడివిడిగావుండకుండా వొకదానిలోనికి వొకటి దొర్లిపోయి కలసిపోయి, వొకజిగి యేర్పడేది. అయితే, వీరు యించుమించు పూర్వపుభాషను వాడడానికి కారణా లుండవచ్చును. ముఖ్యంగా వీరికి సంస్కృతభాషమీాద ఆపేక్ష కావచ్చును. అనేకములైన ఉపమానాలతోటీ, అలంకారాలతోటి విరాజిల్లుతూవున్న గ్రంథానికి యిప్పటి వాడుకభాష యింకా మనస్తృప్తికరంగా పనికి రాకపోవచ్చును.

ఉపమానాలు వింతవింతవి.

వైగ్గనది యిసుకతిన్నెలను వర్ణిస్తూ, 'ఇసుకతిన్నెలు మొగలిపువ్వొళ్లు చల్లి సిద్ధముచేసిన విశ్రాంతిస్థలమువలె నుండెను' అన్నారు.

ఆకాశమున తెల్లనిమేఘములు గాలికి కదలు దోమతెరలవలె కదలజొచ్చెను.

ఒత్తుగా పరచిన మల్లెపూవులలో నేకవీర గోధుమవన్నె త్రాచువలె ముడుచుకొని పండుకొన్నది.

కనులలో నిండుప గింజలంత బాష్పములు నిలిచినవి.

ఆమె యందే వాడిపోయిన మందారమువలె మంచమున కంటుకొనిపోయి యున్నది.

...సన్నని నీటిపాయలలోని చిఱుకెరటములు త్రాచుపాముపిల్లలవలె నొడ్డునకు కొట్టుకొనుచు వచ్చుచుండెను.

కుట్టాన్ ప్రేమ ఏకవీరవైపు పూర్తిగా మరలిపోవుటకు అతడు గడువుపెట్టినాడు. ఆమె రోజులు లెక్కించుకొంటుంది. రెండవసంవత్సర ప్రారంభమునందు అతడు అంతఃపురంలోకి వెళతాడు. "గదిలో గోడమీాద ఎర్రనిబొట్లు రెండు నెత్తురులు చిమ్మినవి. అప్పుడే రెండవ సంవత్సరము గుర్తుపెట్టిన ఏకవీర చేతికైన నూనె కలిపిన కుంకుమవర్ణ మతని హృదయమునుండి యామె నెత్తురును తీసిన ట్లతనికి తోచెను."

ఒకచోట అద్భుతమైన ఉత్ప్రేక్ష.

...'కస్తూరియు పునుగును నలందబడియున్నవి. ఆవాసన లిల్లంతయు గ్రమ్మివేసినవి. ఆవాసనలచేత దీపము పోవునేమో యనుకొంటిని.' (!)

ఇంకను ఉపమానాలు :

ఆమె పుష్యమాసపు నదివలె పుష్టయు గాక, యెండుచేత గోధుమవన్నెగలదియు గాక, కొబ్బరినీళ్ల వలె నతిశబలయు గాక, యిప్పుడే వికసించి సంపూర్ణశోభతో చెలువారని, పూర్తిగా వడలిపోయి శోభాహీనము గాని నవమల్లికవలె ప్రకాశించినది. ఆమె నిటాలమున కస్తురిబొట్టు సొగసున్నగా, తలపై రావిరేక చంద్రవంకగా, నిటాలస్వేదబిందువు శిరఃస్థగాంగఘురము చెమ్మగా, నామె పార్వతివలె ప్రకాశించినది.

ఈ సంప్రదాయాలు పూర్తిగా ప్రబంధవైఖరి నున్నవి. సంస్కృతభాషతో కలసి వున్న వీరి వర్ణనలకంటె చక్కని తెలుగువర్ణనలు హాయి నిస్తాయి.

చిన్నతుప్పర మొదలుపెట్టెను. పిల్ల లేచి చూరుదాక పోయి తనచేతులు వానలో చాచి చేతులు తడిసిన తరువాత రెండు చేతులు మొగమున రాచుకొనెను. బండివానిని చూచి నవ్వెను.

'వడగళ్లకై వెదకులాడి యొక చప్పనివడగల్లు నోట వైచుకొని పిల్లలు గనుక తగిలిన దెబ్బలు మరచిపోవుచుండిరి!' అని వ్రాసి శర్వాణి వర్ణించారు:

...శిశిరచంద్రజ్యోత్స్నకలహాంతరితవోలె జలదాంతర్నిగూఢబాష్పయై విముఖ కా, మొగలిపొట్లలో నీరు నిలిచి ఖండిత సజలదీర్ఘసితాపాంగభ్రాంతి కల్పింప, రాజహంసి భీతయై ప్రోషితభర్తృకవలె తామరతీగ గూడుగాక క్రింద తల దాచుకొనగా, నెమ్మి పురి విప్పి స్వాధీనపతికవలె నృత్యాభిరామమూర్తి కా, మందార పూవును వదలి రాలేక రాలేక వచ్చిన తుమ్మెదయెడ గన్నేరు ఈర్ష్యాకషాయిత కా, వాసకసజ్జికవోలె నలంక రించుకొని కడిమి మేఘనాథునకు స్వాగతము పూన, బలాకాపాంగ మేఘనీలపటపరివృత యాకాశలక్ష్మి కాల పురుషుని నభిసరించి, విప్రలబ్ధాకృశీభూతదేహయష్టివలె శోక మానుపై మొవ్వువోలె అకులవెంట కన్నీరు గార్చ వర్షాశ్రీ సర్వరసాకృతివలె మోహనాతిమోహన మయ్యెను.

గంభీరము; కాని, ఆడంబరము. ఈవర్ణనకు పద్యకావ్యమందు స్థానము. కాని, కేవలము మానవప్రకృతులను గురించియున్న యీ వచనకావ్యంలో అంత చోటు లేదు.

మానవప్రకృతులను తేటతెల్లంగా మన ముందర పెట్టగల గొప్పశక్తి వుంది వీరికి. మొట్టమొదట కుట్టాక్ వీరభూపతుల ఆంతరంగికమైన అన్యోన్యమును తెలుపుతూ, స్నేహితులంటే వీరే సుమా అనిపిస్తారు: "కుట్టాక్ కుడిచేయి వీరభూపతి కుడిచేతిని పట్టుకొనియున్నది. కుట్టాక్ వీరభూపతిచేయి నొక్కినాడు. కుట్టాక్ దేహ మంతయు వణకిపోయినది. ఆచీకటిలో వీరభూపతి కుట్టాక్ దురవస్థ కనులార చూచుచునే యున్నాడు!......'నీ భార్యను నీవు ప్రేమింతునని వాగ్దాన మిమ్ము'" అని మరీమరీ వొప్పించే వీరభూపతిమాటలవల్ల కుట్టాక్ అర్భకు డైపోతాడు. ఏడుస్తాడు.

## 'ఏకవీర'

వీరభూపతి తన యుత్తరీయపు కొంగుతో కుట్టాన్ కన్నీళ్లు తుడిచెను. వీరభూపతి మరల 'ఏమి వాగ్దానము చేసెదవా! ఇది నీ మేలుకొరకే చెప్పుచున్నాను. నీయందు నాకుగల స్నేహము నీవలన నీ వాగ్దానము తప్పక పుచ్చుకొమ్మని నన్ను ప్రేరేపించుచున్నది. ఇకముందు నీ భార్యతో నీవు సరిగా నుందువని నా చేతిలో చేయి వేయుము!......నాకీ వాగ్దాన మిచ్చిన గాని నే నిందుండి లేవను' అని వీరభూపతి కుట్టాన్ పాదములపైబడుటకు వంగి ప్రయత్నించినాడు. కుట్టాన్ తొట్రుపాటు నంది, 'వీరా! ఎంత మంచివాడవు! ఇన్నాళ్లనుండి యేదో నా స్నేహితుడవనుకొంటిని గాని నేను నీవుగా నూహించుకొనునంతటి ప్రేమ నా యందు నీ కున్నదని తెలిసికొనలేకపోతిని.'

ఇక్కడ మిక్కిలి ఆహ్లాదమైన సంభాషణలు. కొన్ని గొప్ప 'ఆత్మగతాలు' న్నూ: కుట్టాన్ తన పత్నిని చూడడానికి వెళతాడు. ఆమె అనురాగంతో కొడుకు కోడళ్లకు గల ప్రేమనుగురించి ప్రశ్నించి కొంత తెలుసుకొంటుంది. కుట్టాన్ అనుకుంటాడు:

'అందఱును ఏకరీతిగను ప్రేమించుమనుచున్నారు. వీరభూపతి అదేమాట. ఇచ్చట వచ్చిన తల్లియు నదేమాట. ఇందులో నేదో రహస్యమున్నది. నేను ప్రేమించిన స్త్రీని వదలిపెట్టి బలవంతముగా నా మెడకు కట్టిన స్త్రీని నా ప్రేమించవలెనా? నాకర్థముగుటలేదు. ప్రేమించుట, ప్రేమించకపోవుట యనునది నా స్వాధీనములో నున్నదా? ఎవరి స్వాధీనములో నున్నది. భగవంతుని స్వాధీనములో నున్నది. ఏ భగవంతుని స్వాధీనములో నిది యున్నదో ఆ భగవంతుడే నాకీ స్త్రీని తెచ్చి పెండ్లిచేసెను కదా! భగవంతుడు కాదు. నా తండ్రి చేసినాడు. భగవంతుని యిచ్ఛ లేనిది నా తండ్రి యెవరు చేయుటకు? ఈ స్త్రీకిని నాకును సంబంధమేమున్నది? ఏమియు లేకున్నమే మిరువురము భార్యాభర్తలుగా చేయబడుట యెట్లు? పూర్వజన్మములలో నేదో సంబంధ మున్నదో!'

కుట్టాన్లోని—అంతే కాదు—యీ యుగసంధిలో బాధ నొందుతూవున్న అనేక యువకహృదయాల లోని, అంతరంగయుద్ధమంతా పైమాటలలో యిమిడ్చినారు!

మనోభావాలను చేష్టలవల్ల వర్ణిస్తారు కొన్నిచోట్ల:

బండిలో కూర్చున్న మీనాక్షి కన్నులలో వీరభూపతి యాడినాడు. ఎఱ్ఱనిమానిసి. శాంతమైన వదనము.........చక్కనికన్నులు. ఎప్పుడు నవ్వుచున్న మొగము. మీనాక్షి తాగప్పుకొన్న బంగారు పూవులుగల తెల్లని పట్టుసేలువలోపల రెండుచేతులు ప్రక్కల కదుముకొని కన్నులు మూసికొని బండిలో నొకప్రైపున కొదిగి కూర్చున్నది. రింయిమని చల్లని గాలి తెరలసందుగా లోనికి దూరినది. మీనాక్షి కన్నులు మరింత మూసికొని, నక్కినక్కి మూలమూల కొదిగియొదిగి కూర్చున్నది.

వీరభూపతి ఆమె కంత అవసరమైనాడు. అతడు దగ్గరలేమి ఆమె నంత అసహాయగ చేసినది.

## ఉ ద యి ని

కవికి యెక్కువగా పాశ్చాత్యసాహిత్యాలతో పరిచయము కలదనిన్నీ, వానిలో కొన్ని గొప్పతనాలను వీరు తమవిగా జేసుకొన్నారనీ బాగుగా కనబడుతుంది. మోహములేని ప్రేమ, కామేచ్ఛలేని భార్యాభర్తల సంబంధము, యీ గ్రంథములో చూపినంత అందముగ యిదివరకు ఎవరు వ్రాసిన తెనుగునవలలోను లేదని చెప్పవచ్చును.

ఏకవీర మహాప్రబంధ మనవలెను. ప్రేమసంబంధమైన కథ అయినా, వీరరసము ఉప్పతిల్లుతూవుంటుంది. నలుగురూ వీరులే—జితేంద్రియులైన వీరులు ! కొంతవరకు అంతరంగయుద్ధము. తగిలిన గాయములు ఒకరికి చూపించుకొని గర్వింపతగ్గవి కావు. అనుభవించక తప్పదు. నలుగురున్నూ జయము పొందినారు !!

రసతరంగిణివారి యీ ఐదవ కెరటము మన భాషాప్రవాహాన్ని చాలదూరము తీసుకుపోతుంది.

# విద్యార్థి

కొంపెల్ల జనార్దనరావు

[రూపవతి, అజ్మల్.]

అజ్మల్.— అనుగో అక్కడ, ఆ యుద్ధఘోషలో మునిగి తేలుతున్నాడు.

రూపవతి.— సౌందర్యము నిగ్గులు తెలిసినవాడు, తన కళాచాతురికి ఆటపట్టయిన నన్ను వదలి యీ వికారపుసన్నివేశము రుచిగా చూచుకొన్నాడేమి? విద్యార్థీ!

అజ్మల్.— సౌందర్యము నిగ్గులు తెలిసినవాడు కనుక. ఆతని దిద్దుబాటు భరిస్తూ నిష్క్రియనై నిలిచే నీవు ఈదృశ్యముతో సరివస్తావా?

రూపవతి.— దీని కొక శ్రుతియూ, రేఖయూ—ఏ మున్నది? ఇది ప్రళయప్రాయము. సౌందర్యము కొల్లపోయే స్థితి కాదూ ఇది?

అజ్మల్.— అవు నాతడు దానిని ఉద్ధరిస్తాడు.

రూపవతి.— నే నీ యేడుపులో, భయములో నీరు విచ్చుతుండగా ఆతడు నన్ను మరింత వేధిస్తున్నవాడు సౌందర్యం ఏమి ఉద్ధరిస్తాడు! నే నాతని భావాలకు ఉత్తేజన మిచ్చి, ఆతని కళావిలాసాన్ని పొంగులెత్తించిన ప్రేమసీమను, నన్ను వదలి ఆతడు సౌందర్యదూరుడు కాడా అవుతున్నాడు?

అజ్మల్.— నీవు ధన్యురాలవు—ఇది దూరసౌందర్యములే!

రూపవతి.— మీ రిద్దరు కలిసి హిందూమహమ్మదీయుల, రెండు మతాల, రెండు జాతుల మైత్రిని పరిపక్వముచేసి ఒక్క జాతిని సృష్టించుకొన్న సౌందర్యాన్ని మీలో ప్రతిష్ఠించుకొన్నారు సరే. కాని యీ వైషమ్యాలలో, కుట్రలలో, దుండగాలలో విప్లవించిన యీ అర్థములేని ఘోషలో ఒడలు మరవడంలో ఏమి ప్రయోజనమున్నది? ఒక సౌందర్యప్రవాహాన్ని, ఈ మధురమైన జీవితగతిని భంగపరచడం ఎందుకని? నే నీతని తీసుకపోతాను!

అజ్మల్.— ఈ ఘోషకై వెదుకుకొని పోలేదు విద్యార్థి. మా యిరువురి ఐక్యములో సౌందర్యమే ఉంటే ఇందరి ఐక్యం ఎంత అపేక్షణీయం! ఈ వైషమ్యాలు, దుండగాలు, కుట్రలు—ఇవి ఉన్నవి నిజమే: ఈవైరమే ఒక దివ్యమైనస్థితి లేకుండా

భంగపరుస్తున్నది: అది తొలగించడానికే అతడు అవసరము: అది తొలగించడం ఆ సౌందర్యానికి అవసరం. ఈఘోషకై వెదుకుకొని పోలేదు విద్యార్థి! ఈ వికారపు సన్నివేశమే ఆతని వెదుకుతున్నది, అతని స్పర్శకై తపప్రుతున్నది. సౌందర్యము నిగ్గు తేరిగిన ఆత డిది యేలాగున ఓర్వగలడు?

రూపవతి.— జగమంతటా వికారాలే. చేతనైన సౌందర్యాన్ని రచించుకొని భోగించక యిది యేమిటి? తాను అనుసరిస్తున్న కోసను తెంపి, దీని కాంత డంత కావ లెనా! ఆతనివల్ల ఏమవుతుంది? నే నిది భరించలేను. నే నీతని తీసుకపోతాను—విద్యార్థీ!

ఆజ్మల్.— ఆత డీ ఘోషను వెదుకుకొని రాలేదు. తనను స్పర్శకై వచ్చిన యీ వికారమునుండి అతడు పారిపోవలెనా? ఆతడు జడజీవి కాడు. ఆతని సౌంద ర్యము ప్రళయతాండవమందలి బిందువును కోరేది. మహాత్మ్యము భ్రాంతి దేశాన్ని వదలి పోలేదు. ఈతడు వెనుదిరిగి ఒక అంగకము లోపింపజేసి, మరీ వికృత మేలాగు చేయ గలడు ఈ దీనమైన సన్నివేశాన్ని?

రూపవతి.— మరి నామాట యేమిటి? నా యీ స్వప్నసౌధాన్ని భంగపరచి, రక్తాలు చీకట్లు చిమ్మే ఖండజీవితం నాకు మిగిల్చి, తన ప్రాణము పోయి ఏమి సాధించి నట్టు? నేను తీసుకపోవలెనోయీ! విద్యార్థీ! ఆతని నింత అపేక్షించే నాగతి యేమిటి!

ఆజ్మల్.— నీవు శాశ్వతముగా బ్రతుకు. సౌందర్యఖనివి—జీవితములో వైవిధ్యము, ఈ ఆహ్వానముపట్ల వైరుధ్యము చూచి బెదరే నీ చిన్నారిసోయగము దాచు కొని దైవికాలకు దుఃఖించి పోషించుకో!

రూపవతి.— నే నీ కత్తులు భరించలేను. పోనీ నన్నాతడు రానీయడే: నే నేమి చేయను? ఆతడు లేనిదే భూమిమీద నా కింక సౌందర్య మేమిటి? నే నాతని తీసుకపోవలెనోయి—విద్యార్థీ! పలక వేమి బాబూ!

ఆజ్మల్.— విరిగిపడుతున్నారు ఆతని గుంపువంకకే భూతకోటి. భూమే ముక్కలయి తరగెత్తి వస్తున్నది.

రూపవతి.— విద్యార్థీ!—నన్ను చూచికూడా ఆవంకకే పరుగిడుతున్నాడు— డేగవలె, సర్పమువలె, విజయధ్వజమువలె. మరీ దూరమైపోతున్నాడు విద్యార్థి!

ఆజ్మల్.— ఆ సముద్రము పిలుస్తున్నది, ముంచెత్తుతున్నది. కత్తులు, కర్రలు—రక్తము, మంటలు. వీరి పెనుబొబ్బలు గాలినికంటె ఈ కళవళము కళ్లను ముందు చీలుస్తున్నది.

రూపవతి.— నే నిది చూడలేను. ఒక్కక్షణములో కనబడ్డది యింకొక క్షణానికి చీల్చుకపోతున్నది. ఈ ప్రళయములో నా విద్యార్థి ఉరుకుతా డేమి? ఇది నేను చూడలేను! విద్యార్థీ!—ఇంక లాభము లేదు. నామెలుగు వినబడదు. నే నిది చూడలేను.

ఆక్మల్.— నీవు చూడలేవమ్మా! ఉపాసకుడు లేనిదే నిలవజాలని సౌందర్యా నివి నీవు: ఇది చూడలేవు. ఇది చైతన్యము నంతా విద్ధముచేయగల సౌందర్యోపాసన: సౌందర్యప్రతిఘాతము. ఇది నీ అచలసౌందర్యానికి విరుద్ధమై, నిన్ను స్థిరగతిని పాటించిన మనస్సులో ప్రసహించి దానిని లోగొనవచ్చిన ద్రవ్యాల సంఘట్టము! నీ వేమి భరించినావు పో! నీవు దూరముకా—ఈ ఆవేశము నిన్ను పడనేసి పోతుంది!

రూపవతి.— ఇదేమి నీ వింత సివమెత్తుతున్నావు—నన్ను భయపెట్టకోయీ! నా కళ్లలో రక్తాలు చిమ్ముతున్నవి. నా జీవనాళాలు తెగుతున్నవి!

ఆక్మల్.— నీకై నేనూ ఏడ్వగలను. కాని నీవు విద్యార్థికై ఏడ్చి లాభము లేదు.

రూపవతి.— మరి నన్ను రానీయ రేమి? నేను నా విద్యార్థికి తోడుపోతాను.

ఆక్మల్.— నీ విందు చొరనూలేవు. ఇది నీకు కాదు. ఇది మహాభయంకర మైనది. నీ కిందు లొంగేది లేదు. నీవు వీరికై చచ్చి లాభము లేదు.

రూపవతి.— అయ్యో! నన్ను భయపెట్టకోయీ! నీవు నా విద్యార్థికి తోడుపో. నన్ను ఇల్లు చేర్చండి!

ఆక్మల్.— ఇ ల్లెక్కడ? ఇల్లు తగులపడ్డవి. తిరిగి నిర్మించవలె ఇల్లు. ఇళ్లలో జీవము జారింది. జీవము పోసి కట్టవలె ఇల్లు.

రూపవతి.— నన్ను రానీ—నేను విద్యార్థిని విడవలేను. నేను పోలేను పోలేను. జీవము జారి సగము విరిగిన నాసౌధము నేను చూడలేను. నాగతి యేమిటి?

ఆక్మల్.— ఒక ఉపాసనలో వచ్చి కళామూర్తులు మీ రిద్దరు కలిసినారు సరే. అతనిని అనుసరించడమే నీ పని కాదు. నీవు పో. నీ విక్కడ ఆగలేవు. నీ వీ జనముకై చచ్చి లాభము లేదు. అదుగో నీ విద్యార్థిని చూచి పో—ఇదుగో!

రూపవతి.— అమ్మో—ఈ దృశ్య మేమిటి! నే నిది భరించలేను: నా బ్రదుకు: నా విద్యార్థి! నన్ను రానీయరు: నాగతి యేమిటి?

[కొందరు మనుషులు పరుగెత్తుక వస్తారు. చంటిపిల్లలతో ఇద్దరు యువ స్త్రీలున్నారు. రూపవతి వారిలో చిక్కుకొంటుంది. అందరూ పారిపోతారు.]

అజ్మల్.— పోండి పోండి పాపం మీరందరు.

రూపవతి (లోపలనుండి).— అజ్మల్ !

అజ్మల్.—భయం లేదు! పో! రాలేవు, పో!—విద్యార్థి నిప్పురవలు కక్కుతున్నాడు ఒడలినుండి, నోటినుండి—ఒకచోట నేమిటి!—ఆధ్వని ఆతని గళపటిమనే! నెత్తురులా మంటలా అవి! మంటలలో ఆతను దుమికినాడా, ఆతని కన్నుల వెడలిన మంటలా అవి! ఆతడు హిందూమతపతాకలా ఎఱ్ఱనై రోదసిలో తాండవిస్తున్నాడు. నే నది కౌగిలించవలె. హృదయాన ధరించవలె. ఆతని తలపై చంద్రవంక చిందింది. ఆతడు నా విజయపతాక! నా ధర్మపతాక! మానవకోటికి ఆశీఃపతాక! నీవే శివమూర్తిని ఊహించగలను! మరి నా కీ నరాలు సడలుతున్న వేమి?—ఎందరిరక్తమో ఆతడు విస్తరిల్లుతున్నాడు! ఆతని రక్షలో సర్వము ఉపాధులు భద్రపరుచుకో పరుగిడుతున్నది! ఈ శకలాల, అవయవాల, స్వరాల ఐక్యములో మేళ్ళమై పరచిన యీ చైతన్యము నాలో మనస్సు పొంగిస్తున్నది; ఆనందము కాబోలు పొంగివస్తున్నది. ఆతనితో వాదించిన నేను నేర్చినాను కాబోలు ఈ సౌందర్యము. ఆతడు సౌందర్యమై నాకు తన్ను నేర్పుతున్నాడు—దౌర్బల్యము కట్లు తెంపి. తెలిసింది స్వామీ నీ తాండవము! జడసౌందర్యమునుండి పెరిగివచ్చిన నే నిది ఆస్వాదిస్తాను: ఈ కృత్స్న సౌందర్యలీలలో నేనూ లీనమౌతాను!—ఏడి నా విద్యార్థి!—ఓహో, విద్యార్థి ఆత్మకు ఈ శరీరము చాలలేదు—ఆతడు విడివడుతున్నాడు! ఏడి నా విద్యార్థి! నా విద్యార్థి యేడీ!

[పరుగిడిపోతాడు.]

[కొందరు పౌరులు అటునుండే పరుగిడుతూ వస్తారు.]

మొదటి పౌరుడు.— ఈత డెవరు? విద్యార్థివలె ఈత డెవరు?

రెండవ పౌరుడు.— ఈత డెవరో మహమ్మదీయుడు మనల నందరినీ కాపాడుతున్నాడు, తనవారినే కాక.

మొదటి పౌరుడు.— అందరూ తనవారే అతనికి.

మూడవ పౌరుడు.— విద్యార్థి యీ సదమదములో ఉన్నాడా?

మొదటి పౌరుడు.— లేడు. ఆతడు కడతేరినాడు. ఈత డవతరించినాడు.

రెండవ పౌరుడు.— రండి మనము పోదాము.

[పరుగిడతాడు.]

## విద్యార్థి

[ఆజ్ మల్ వస్తాడు, ఇద్దరు గాయపడ్డవారిని తీసుకొని.]

ఆజ్ మల్.— మీరు వదలండి. ఈ గోడమాటు మీకు చాలదు.

[గాయపడ్డవారిని తీసుకొని అందరూ త్వరగా వెళ్లిపోతారు.]

వీథి బడ్డ నాస్త్యలపనానికి నష్ట లేదు. మీరు పొండి!—ఇంకా ఈజనము పోరాడ తా రేమి? విద్యార్థి ఆత్మ విశ్వాస విచ్చినది. ఆశక్తి సిరిలో ఆపహించ దేమి? నే నొక్కడ నేనా యీ విద్యానికి నోచుకొన్నది? మీ రెప్పు డింక చూచేరు?

[పరుగు.]

[మొదటి పౌరుడు మళ్లీ వస్తాడు.]

మొదటి పౌరుడు.— ఈ దేశమి రోదసి నిండి యీ వీరవిహారము! మందరము లాగ, మేరువులాగ—నేను నిన్ను చూడలేకున్నానోయి!— ఈతడు తప్పించినవారు తమలో తామే చెప్పుకొంటున్నారు: అయ్యో!—

[గాఢముగా గాయపడ్డ ఆజ్ మల్, మరికొందరు.]

అయ్యో! నేను నిన్ను చూడలేకున్నానోయి!

నాలుగవ పౌరుడు.— ఎవరీ వింతమనిషి!

ఐదవ పౌరుడు.— పాపం ఒడలంతా గాయాలు, కాల్పులు. ఏమి చేయవలె? ఎవరో ఈతడు?

ఆజ్ మల్.— నేను విద్యార్థిని.

నాలుగవ పౌరుడు.— విద్యార్థిని నేను రక్తాలలో మంటలలో చూచేను.

మొదటి పౌరుడు.— విద్యార్థి కడ తేరినాడు. ఈత డెవరో మహానుభావుడు.

ఆజ్ మల్.— నేను విద్యార్థిని!

మొదటి పౌరుడు.— అయ్యో! ఈతడు స్మృతి తప్పి పలవిస్తున్నాడు. ఇత నింక బ్రదుకడు కాబోలు. ఇతడు చావగా మనము ప్రాణాలు తప్పించుకొని పోవలె— అంతమంది ఆసంకులములో నలిగిపోతున్నారు! ఇత డింక బ్రతుకడు—విద్యార్థివలెనే.

ఆజ్ మల్.— అయ్యో మీరు నమ్మ రేమి. నేను విద్యార్థిని!

మొదటి పౌరుడు.— అయ్యో! ఏడవనా? నవ్వనా? విద్యార్థి చనిపోయినా డనుకున్నాము: ఈతడు తాను విద్యార్థి నంటాడు.

నాలుగవ పౌరుడు.— నమ్మవలెనా ? మహమ్మదీయ వేషములో నీవు విద్యార్థి వేమిటి నాయనా !

ఆజ్మల్.— అయ్యో వీరి కింత నమ్మకాలు లే వేమి ! ఈ జనముకై బ్రతికి లాభము లేదు కాబోలు ! బ్రతికి లాభము లేదు కాబోలు !

[మృతి.]

మొదటి పౌరుడు.— బ్రదికి లాభము లేదా ?— ఈ జనముకై బ్రదికి లాభము లేదా ? ఈ విడివడ్డప్రశ్న రోదసి నిండి కనబడుతున్నది నాకు !

# శేషమ్మ—A STUDY

'చలం'

శేషమ్మకి యీలోకంలో ఏమాత్రమూ ఆనందమూ సౌందర్యమూ కనపడడం మానేసి మున్ఫైయేళ్లయింది. ఇతరులు నవ్వుతున్నా, తింటున్నా, పాడుతున్నా, ఆమెకి విచారమో లేక అసహ్యమో కలుగుతుంది. పిట్టల కూతలూ, పిల్లల నవ్వులుకూడా ఆమెని 'ఇరిటేట్' చేస్తున్నాయి.

"పాడుపిట్టలు—పని లేదు నీటికి. వెధవ అరుపులూ, గోలలూ. అంతకన్న చస్తే నేం?"

ఆమెకి ప్రపంచం దుఃఖమయం, పాపభూయిష్ఠం, అపవిత్రం. దీన్నంతా విడిచి పోవాలని, మృత్యువుని తలుచుకుని అందరూ వినేట్టుగా ఆహ్వానిస్తోవుంటుంది. "ఆ యీశ్వరుడు యెప్పుడు దయతలుస్తాడో, యెప్పుడు పిలిపించుకుంటాడో, యీ నరకం లోంచి నన్ను!"

ఆ యీశ్వరుడు తన తండ్రిలాగూ, తనని భూలోకమనే అత్తవారింటికి పంపినట్టూ మాట్లాడుతుంది. నాలుగేళ్లక్రిందట కలరా తగిలినప్పుడుమాత్రం—

"ఒరే, చస్తానురా, చస్తానురా. డాక్టరేమన్నాడూ? ఆస్పత్రి పెద్దడాక్టర్ని పిలుచుకురా. ఆ పెరుగు తోడుకుందో లేదో చూచావు టే. మాఅమ్మ యెనభైయేళ్లు బతికిందిరా. ఇంత చిన్నదాన్ని నా కప్పుడే యేంచావు? అవునులే. ఈ ముసిసి ముండ చస్తే ఎవరి కేం? అందరికీ పీడ విరగడై పోతుంది." అంది మళ్లీ.

ఆమె మొహాన నవ్వు చూసినవా ళ్లెవరూ లేరు. చిన్నపిల్లలు గంతులేస్తోవుంటే, "ఈగంతు లెన్నాళ్లు? మీ కాళ్లు విరగా. ఇదేం పోయేకాలంరా. సరిగా కూచుని యాడవలేరూ?" అన్నట్టు చూస్తుంది. ఎంత విచారంగా కనపడితే, యీలోకంమీద, యీమాయమీద ఎంత అసహ్యం కనపరిస్తే, ఎంత సౌందర్యాన్ని ద్వేషిస్తే యీశ్వరుడికి అంత సన్నిహితురాలూ, ప్రియతమురాలూ ఐవుంటుంది. ఈలోకంలో తనవంటి సన్మార్గులకు కష్టాలుతప్ప యింకేవీ లేవు కనక సుఖపడేవాళ్లంతా దుర్మార్గులే ఐవుండాలి. తను కష్టాలకోసం ఎంత ప్రయత్నించి ఏరుకుంటుందో ఆమెకి తెలీదు.

"అదేమిటీ ఆకామాక్షి అట్లా పాడుతో వుంటుంది యెప్పుడూ! దేన్ని చూసు కునీ ఆ బోర్లపాటు! ఆ మొగుడివుద్యోగం వూడితే తెలుస్తుంది, అమ్మగారి అదిరి పాటు!"

ఆమెని "యెట్లా వున్నా రమ్మా!" అని అడిగితే యెప్పుడూ "బాగానే వున్నా" నని అనలేదు. అసలు యీదేశంలో ఆమాట అనేవాళ్లే తక్కువ. నిజంగా బాగా వుండేవాళ్లే తక్కువ. బాగా వున్నా కూడా, బాగా వున్నామని తెలుసుకున్నవాళ్లు చాలా తక్కువ. తెలుసుకున్నా, 'బాగావున్నా'మని అంటే దిష్టి తగిలి, అదృష్టం మారుతుం దని ఆమాట అనరు. అంతే కాక బాగా వుండడం దోషమనీ, పాపాత్ములు మాత్రమే బాగా వుంటారనీ, మూర్ఖులుమాత్రమే బాగా వున్నా మనుకుంటారనీ నమ్మకం.

"ఏం బావుండడ మమ్మా! కుర్రాడికి నిన్నటినించి జలుబుగదా! ఇ నవనికు కన్ను (ముక్కు అనాలి) తెరచి యెరగడు. ఆవు పాలివ్వడం మానేసింది. మొన్ననేగా మా తాత గారి సవితితల్లి మేనమామ పోయినాడు. వాడి మనమడు మూడోక్లాసు తప్పిపోయినాడా! రాచ్చిప్ప చిల్లిపడ్డది. నిక్షేపమంటి రాచ్చిప్ప! ఇట్లా వుంది మాగతి. ఏమోనమ్మా యీ కాలంలో అంతా మాయ. మాయ రాచ్చిప్పలూ, మాయ మనుషులూ! అవునటే అమ్మా! ఏం శాశ్వతం? ఈదేహమూ అంతేకద, వూరికే పట్టుకు పాకులాడ తారు గాని."

ఈ వాక్యాలే ఏ దేశాభిమానిఐనా విన్నాడా, అక్కడే మూడుపల్టీలు కొట్టి, "హా భారతమాతా! ధన్యురాలివి. ఇట్లాంటి ఆధ్యాత్మికులైన ముసలమ్మల్ని కన్నావు" అని అరిచి ఆనందంలో మూర్ఛపోతాడు.

"దుగ్గిరాలవారింటో పెళ్లయిందా? వాళ్ల కేం? పెళ్లిళ్లూ చేస్తారు, వొడుగులూ చేస్తారు. వాళ్ల ముత్తాత మూటలు సంపాయించి పడేసిపోయినాడుగా! ఒక నీతా, న్యాయమా? ఏముందీ? పరాయివాళ్లని దోచుకునేదీ, పెళ్లిళ్లు చేసేదీ!"

డబ్బు వుందంటే, అన్యాయార్జితమనే ఆమె వుద్దేశ్యం.

ఎవరన్నా—"అదీ, ఆరత్తమ్మ! మొన్నరాత్రి పారిపోయిందటమ్మా!" అంటే,— శేషమ్మ—"ఛీ, ఛీ. అట్లాంటిమాటలు నాచెవిని పడనీకు. నాకెందుకు? నా రామనామమేమో నేనేమో! సరే కాని, యింతకీ, ఎవడితో?"

"అక్క యింటికి."

"ఇంతేనా? ఐతే విశేష మేముంది? పారిపోయిం దంటావేం?"

"ఏమో వాళ్లంటే నే నన్నాను."

కొంచెం ఆగుతుంది శేషమ్మ యింకా యేమన్నా చెపుతారేమోనని. చెప్పకపోతే—

"నా కెందుకమ్మా! కాని అక్క యింటికి యెవరు తీసికెళ్లారు? ఎవడో మొగాడు వుంటాడు. బాగా చూడమను. వాతలు పెడితే యిద్దర్ని పట్టుకుని—నా కెందుకులే. వాడ్దన్నా నా కెందుకు చెపుతావు! అక్క యింటి కెళ్లిందో, యింకెక్కడికి వెళ్లిందో! ఆ అక్కసంగతి తెలుసుగా! దాని పోకులూ, రవ్వలదుద్దులూ—నా కెందుకమ్మా! బండెడంచాకిరీ తెల్లారి లేస్తే, చస్తున్నాను."

"మీ కోడలు పని చెయ్యదా?"

"అయ్యో, దాని చేతులు పువ్వులుట. దాని కాళ్లు తామరాకులుట!"

"మీ కూతురో?"

"మా కూతురికి గంపెడురోగమమ్మా! అదేం చేస్తుంది, దాని మొహం!"

"అట్లాగమ్మా! బాగానే తిరుగుతోవుంటుందే!"

"మీ కంటికి అట్లాగనే కనపడతుంది. పై పుష్టే గాని, లోపలంతా గుల్ల. ఒకటే ఆయాసం."

"మరి యెప్పుడూ అట్లా చిరుతిళ్లు తింటే—"

"అయ్యో, ఏం తింటుంది? అన్నం అసలే తినదు. ఆ చిరుతిళ్లుకూడా లేకపోతే ఎట్లా బతుకుతుంది?"

"మా కూతురమ్మా, మా సుబ్బలక్ష్మి! దానికి ఒక్కరోజు జబ్బుచెయ్యదుకద!"

"చెయ్యకేమమ్మా! అట్లా తిరిగేవాళ్లు గబాలున పడతారు. మామామ మనమడు అంతే. పిడిగాయిలాగు—"

శేషమ్మ ప్రపంచం, పనీ, ఆచారమూ తెల్లవారకట్ట నాలిగింటికి లేచి, రాత్రి పదకొండింటివరకు (మధ్యాన్నం రెండు గంటలు విశ్రాంతితో) పనిచేస్తుంది. ముప్పై యేళ్లనించి, ప్రతిదినమూ ఆవిధంగా పనిచేస్తోంది. ఆమె పనిచేసినంతసేపూ, ఆమె నోరూ పనిచేస్తోవుంటుంది, మాటలతో, తిట్లతో. తెల్లారకట్టే రాత్రి అల్లరిచేసిన పిల్లల్నీ, మొలికల్నీ తిట్లు; తరవాత పదింటిదాకా దాసీదాన్ని తిట్లు; అల్లరిచేసే పిల్లల్నీ కాకుల్నీ తిట్లు; కాసీకి వీశడు బీరకాయ లివ్వని కూరలదాన్ని, మజ్జిగదాన్ని తిట్లు. ఈ

ముప్పైఏళ్లలోనూ ఒకరోజుకూడా చిక్కనిమజ్జిగ పొయ్యలేదు కదా, ఒక గొల్లదీ కూడా, పుచ్చిపోనికూర లివ్వలేదుకదా ఒక కూరలవాడుకూడా! మధ్యాన్నించి యిరుగుపొరుగువాళ్లనీ, కోడళ్లనీ, కొడుకుల అనాచారాన్నీ, కృతఘ్నతనీ, దేవుణ్ణీ, పిచికల్నీ, తోవ పొయ్యేవాళ్లనీ తిడుతుంది. ఎవరూ లేకపోతే రాత్రి పదింటికి తనని తాను తిట్టుకోడం ప్రారంభిస్తుంది. పని చెయ్యలేకుండా వుండలేదు. అదే ఆమె సుఖం. ఆమె శరీరమే పనిచేసేమర అయిపోయింది. ఆమె 'ఇన్‌టెలిజెన్సు' ఎప్పుడో మానింది పనిచెయ్యడం. 'రొటీన్' తప్ప యింకేమీ ఆమె చాతకాదు. ఒక్క రవ్వ ప్రోగ్రామ్ మారిందా, యిల్లు పడుకుంటుంది. అంట్ల శుభ్రం, యిల్లు కడగడం, పేడ చల్లడం, ముగ్గులూ, ముంగిలీ, మైలమైల అని అరవడం—యిదే బతుకు! ఒక కొత్తపనీ, కొత్తయోచనా రెండూ ఆమె చాతకావు. గానుక్కి కట్టిన యెద్దు నయం. అందువల్లనే మార్పులంటే గుండెలు పగిలి చస్తారు. బెత్తం లేకుండా పాఠం చెప్పమంటే, ముసలి స్కూలుమాష్టరుకి యెట్లా వుంటుందో, యింగువ లేకుండా వంట చెయ్యమంటే ఆమె కట్లా వుంటుంది. ఫీజు లేకుండా పనిచెయ్యమంటే తాలుకాగుమాస్తాకి యెట్లా వుంటుందో, మడికట్టుకోకుండా వండమంటే ఆమె కట్లా వుంటుంది. ప్రపంచం ముక్కలైనా ఆమెకి అంత ఆశ్చర్యం కలగదు. ఇంతపని యిన్నేళ్లు చేసిందా యెవరి కొవుపయోగమంటే యేమీ కనపడదు. అందరూ ఆమెని చూసి విసుక్కునేవాళ్లే గాని కృతజ్ఞత కనపరిచేవాళ్లు లేరు. నలుగురికి భోజనం పెడుతోంది. తాను తింటోంది. ఇంటిని మురికిచేస్తుంది. ఎందుకు? కడగడానికి. కడగడ మెందుకు? మళ్లీ మురికిచెయ్యడానికి. అంతకాలం వంటచేస్తే మూడువందలమందికి భోజనం పెట్టవచ్చు వొకమనిషి. స్వర్గంలో అంట్లు తోమడమూ, బట్టలారవెయ్యడమూ లేకపోతే యేం చేస్తుందో యీమనిషి?

పాపం, ఏ కొత్తకాంతినీ, ఆశనీ, ఆనందాన్నీ, కోర్కెనీ, అన్నిటినీ త్యజించి, ఆ వంటిల్లే తన ప్రపంచంగా, తనబాధే తన ఆనందంగా, తనచేతికి చిక్కిన అయిదారు గురూ దాసీతో సహా, తన నోటితీటను తృప్తిపరచగల సాధనాలుగా, తన ఆచారాన్నీ, తులసికోటనీ చూసుకుని గర్వపడి బతుకుతోంది. భూకంపాలు రానీ, దేశాలు దేశాలు తగలబడనీ, సామ్రాజ్యాలు పడిపోనీ, ఆమె కేమీ సంబంధం లేదు---తన యింటికి వంద గజాల సర్కిల్ దాటి ఆమె మనసు పనిచెయ్యదు.

కాపరము, పిల్లలు, ప్రేమ, ఏమీ లేక తనది, స్వంతంగా తనది అనే ఆస్తి గాని మనిషి గాని లేక, క్రమంగా క్రమంగా మనసు మొద్దైపోయి నిలిచింది ఆమె. ఇంకే ఆసక్తి లేక, ఆ పాతపురాణాలలో విన్న అక్కడక్కడి వచనాలని పట్టుకుని, వాటి వాస్తవత్వంపైన తన ఆత్మపునోభివృద్ధిని ఆధారంచేసుకుని కన్నంలో యెలికవలె బతుకుతోంది.

ఎవరినైనా ప్రేమించడంకన్న ద్వేషించడం సులభం. ప్రేమ మనిషిని తన స్వంతంగా
చేసుకోవాలని ప్రయత్నిస్తుంది. ఈ పేదవితుంతువు స్వంతంకావడానికి ఎవ రంగీకరి
స్తారు? తన కోడలికి ఒక్కొక్క బిడ్డే పుడుతోవుంటే, తన స్వంతం చేసుకోవాలని
చూసింది. ఆపిల్లి ప్రతినిమిషమూ జ్ఞాపకంచేసేది ఆపిల్ల తనదని—చూపుచాతా,
నడవడిచాతా. ఆపిల్లలే మూడేళ్లు రాగానే అందరికన్న లోకువ గనక కర్రలు తీసుకుని
బాదేవారు ఆమెని. ప్రేమ లేక, సంతోషం లేక, జీవితంలో యింటరెస్టు లేక, తను
ఏబాధపడ్డా కరుణించేవారు లేక, ఇంక విధి లేక యీ బండచాకిరిలో తన శక్తినీ,
ద్వేషంలో తన ప్రేమనీ, తిట్లలో తన ఆనందాన్ని, సార్థకం చేసుకోవాలని ప్రయత్ని
స్తుంది. ఇట్లా ఎందరు ఎందరు యీదేశంలో యిట్లా కొయ్యబారిన ఆత్మలతో తమ
జీవితాన్ని యితరుల జీవితాన్ని క్షోభపెట్టి మృత్యువులో చివరికి తప్పించుకునే స్త్రీలు!
కాని మృత్యువులోనైనా తప్పించుకుంటారా? వాళ్ల జన్మలో వుందా యీలోపం, వాళ్ల
నిట్లా చేసిన సంఘపరిస్థితులలో వుందా? వాళ్లు సంఘా న్నిట్లా ఎండపెడుతూన్నారా,
సంఘం వాళ్లని కొయ్యల్ని చేస్తోందా?

# లేఖలు

## 'జగత్కథ' విమర్శనము

'ఉదయిని' సంపాదకులకు:

ఆర్యా,—వాఙ్మయ విమర్శకులు సరియగు విచక్షణతో సంఘవ్యతికరములు ప్రసాదదాయకములు అగు గ్రంథముల బ్రోత్సహించుట యవసరము. కాని కొందరు దానికి వ్యతిరేకము చేయుచున్నారు. ఈ మేనెల 'ఉదయిని'లో 'జగత్కథ' యను గ్రంథమును డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు విమర్శించియున్నారు. 'జగత్కథ'లో చాలాభాగము హెచ్. జి. వెల్సుగారి Short History of the World అను ఆంగ్ల గ్రంథమున కనువాదము. ఈ అనువాదము చేయుటకు శరకోపాచార్యులుగారిని నేనే ప్రోత్సహించితిని. మరియు వెల్సుగారును శరకోపాచార్యులుగారును ఈ తర్జుమాహక్కులు నిర్ణయించుకొనుటకును నేనే సహకారినైతిని. Short History ని Thinkers' Library లో ప్రచురించిన Rationalist Press Association (London) అను హేతువాదప్రచురణ సంఘమువారి పక్షమున చెన్నరాజధానికి నేను కార్యదర్శినయి యుండుటచే నాసంస్థవారి సేవకై యీపని సమకట్టితిని. డా. శ్రీనివాసాచార్యులుగారు వ్రాసిన ఈ తీవ్రవిమర్శలో విజ్ఞానచరిత్రలగూర్చిన కొన్ని మూలసిద్ధాంతములే పూర్వపక్షము చేయబడినవి. అందువలన వానిని బహిరంగముగ సమర్థించుట నాబాధ్యత యగుటచే నే నీక్రిందివిషయములను వ్రాయవలసివచ్చినది.

"గొప్పవిమర్శకులును, విజ్ఞానకోవిదులును" వెల్సుగారి గ్రంథము సవ్యముగ లేదని 'ఖండించి'రట. 'ఒకానొక గొప్పవిమర్శకుడు' వెల్సుగారికి చరిత్రయన నేమో తెలియదనియు, 'వెల్సుకు తన యజ్ఞానమే బోధపడలేదనియు వ్రాసెనట. ఈ పేరులేని విమర్శకు లేయేవిషయముల ఖండించిరో, అందు కాధారము లేవియో ఆ విమర్శలో తెలుపలేదు. ఇట్లు వివరముల నీయక సూచనలచే మహనీయులపై దోషారోపణల జేయుట భావ్యము కాదు. డార్విను తన సిద్ధాంతమున కాధారముగ తెల్పిన విషయములలో కొన్నివివరముల గూర్చి దరిమిలా పరిశోధకులు కొన్ని భిన్నాభిప్రాయముల జెప్పిరి; కాని ఆభేదవిషయములు మూలసిద్ధాంతమును, దాని కాధారములగు మూలసూత్రములను ఎంతమాత్రమును మార్పవు. సరికదా మరింత బలపర్చునని వైజ్ఞానికప్రముఖు లందరును అంగీకరించియున్నారు.

పరిశోధనలును అనుభవములును హెచ్చినకొలదిని, ప్రపంచమందలి జీవకోటి కొన్ని సుప్రసిద్ధసూత్రములకు లోబడి క్రమవికాస మొందుచున్నవనియు, నరజాతి యభివృద్ధిగూడ ఇట్టి సూత్రములకు లోబడియే యున్నదనియు, జీవతత్త్వపు ముఖ్యస్వభావ మేకరీతి జేయనియు వైజ్ఞానికులును, తత్త్వజ్ఞులును అంగీకరించియే యున్నారు. విజ్ఞానపరిశోధనలు ప్రాథమిక స్థితిలోనే యుండి చాల విషయము లెవ్వరికిని తెలియని స్థితిలో ఆరంభకుడగు డార్విను కొన్ని వివరములగూర్చి పొరబడుట సహజమే. అట్టి స్థితిలో ఆరంభకులగు ప్రాచీనుల గోరంత లోపముల కొండంత జేసినంతమాత్రమున ప్రకృతిసిద్ధాంతము లసత్యములని నిర్ధారణ కాదు. విజ్ఞానపరిశోధనలు శైశవస్థితిలో నున్నప్పు డఖండప్రతిభతో మూలసిద్ధాంతములను తప్పకుండ గనిపెట్టినందుకు వారు దూషణకు బదులు భూషణకే తగుదురు. వైజ్ఞానికవిమర్శ యన సత్యపరిశోధనము;

ఆ పరిశోధనలు సృష్టిరహస్యమును, జీవతత్త్వమును, దాని యథార్థములను గమనించి విజ్ఞానసత్యమును తెల్పుటలో అంతటి పూర్వులును గొప్పపండితులును, మతాచార్యులు గూడ నమ్మి ప్రచారము చేయుచుండిన అనేక "సిద్ధాంతము"లు గూడ ఖండింపబడక తప్పదు. అది చాల కష్టకార్యమైనను సత్యశోధకుల కది తప్పదు. "క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్కవయో వదంతి" అని ఉపనిషత్తు ఘోషించుచున్నది. అందుచే నీ క్రొత్త నిరీక్షణను ప్రకృతితత్త్వజ్ఞులైనను చాలమంది పండితమ్మన్యులకు మనఃక్లేశము గలిగి, కొందరు మతాచార్యులును పూర్వాభిమానులగు పండితులును వెల్సుగారిపై దండయాత్ర చేసి, 'ఉదయిని' వ్యాసములో నుదాహృతమైన రీతిని నిందాగర్భితపదములతో దూషించిరి. అట్టి మొదలు తుద లేనివిమర్శ లన్నిటిని సత్యమనియు, వాని ననుసరించి వెల్సుగారు తమ గ్రంథమును సవరింపవలెననియు మన విమర్శకులు భావించిరి. ఆ ప్రతిపక్షులు వ్రాసిన వానిలో నున్న కొన్నిటికి రెండు పూర్వపక్షములకు వెల్సుగారు జవాబు నిచ్చియే యున్నారు. (Forum Series లో ప్రకటితమైన Mr. Belloc objects to the Outline of History ని చూడుడు.) వెల్సుగారు విజ్ఞానచరిత్రల నన్నిటియందు పారంగతుడు, ప్రత్యేక పరిశోధకుడు కాకపోవచ్చును; అంతమాత్రమున నాతడు కేవల సామాన్యుడని, ఊహాధారముననే యాగ్రంథము రచించెనని సూచించుట కేవల మన్యాయము. వెల్సుగారు జంతుశాస్త్ర పట్టభద్రుడై విశేషముగ గ్రంథపఠనాదులచే విజ్ఞానము వృద్ధి చేసికొని, విజ్ఞానచరిత్రములందలి సారము గ్రహించెను. ఆయన నవలలు మున్నగునవికూడ కేవల మూహాధారములు గావు; అవి వినోదమునకొరకే వ్రాయబడినవియు కావు. అందు చాల విజ్ఞానభావములు గల్గి విశేష జ్ఞానప్రదములై యున్నవి. ఆర్థిక సాంఘికవిషయముల గూర్చియు ఆయన చాల ఉద్గ్రంథముల వ్రాసెను. కాని యెంత విద్వాంసుడైనను ప్రపంచచరిత్రవంటి మహాగ్రంథమును వ్రాయుట సుసాధ్యము కాదు.

(ఆ పద్ధతి నాంగ్లమున గూడ ఇంకెవ్వరును రచింపకపోవుటయే అందలి కష్టమును తెల్పును.) అందువలన ఆయన తాను మహావిద్వాంసుడనని గర్వింపక, విజ్ఞానచరిత్రాది ఆయావిద్యాశాఖలందు పారంగతులనిపించుకొని జగత్ప్రసిద్ధులైన కొందరు విజ్ఞులచే తన చరిత్రగ్రంథపు ఆయాభాగముల బరిశోధింపజేసియే ప్రచురించెను. (Outline of History ఉపోద్ఘాతమును చూడుడు.) Outline గ్రంథపుసారమే జగత్కథకు ముఖ్యమాతృకయగు **Short History of the World.**

ఐనను ఈ ఆంగ్లగ్రంథమం దెట్టి లోపములును లేవని నేననుటలేదు. భూమియుత్పత్తిమొదలు ఆయాయుగములందలి జీవవికాసమును సర్వదేశములయొక్కయు సర్వకాలములందలి చరిత్రను సమన్వయించు ఇట్టి మహాగ్రంథము నెట్టి విద్వాంసు డెందరు విజ్ఞులసహాయముతో వ్రాసినను అందు లోపము లుండుటలో నాశ్చర్యము లేదు. మానవుని జ్ఞానము ఎల్లప్పుడును అసంపూర్ణము. మరియు ప్రతివ్యక్తికిని కొన్నిప్రత్యేకభావము లుండును; అట్టిభావములు మహాగ్రంథముల వ్రాయునప్పు డందు జొరపడుట సహజము. అందువలన పరిశోధకుల మనోవృత్తినిబట్టి గ్రంథమం దనేక లోపములు గాన్పింపవచ్చును. కాని వానిచే ఈ గ్రంథమునందలి ముఖ్యప్రణాళికకు హానిలేదు. ఈగ్రంథపు మూలసిద్ధాంతము యథార్థమని నిష్పక్షపాతు లంగీకరింపక తప్పదు. అవసరమని తోచినచోట Short History 1934 లో పునర్ముద్రణములో చివరిరెండు అధ్యాయములలో కొన్ని అంశములను వెల్సుగారు మార్చియున్నారు. ఆభాగ మాప్రకారమే 'జగత్కథ'లోను వ్రాయబడినది. వెల్సుగారికి గల్గినంత వైజ్ఞానిక చారిత్రజ్ఞానము మనయాంధ్రదేశమున నుదయించినచో ప్రజాసౌష్ఠవము చాల పెంపొందగలదని మా ముఖ్యాభిప్రాయము. అది ఆయనకు తెలియదనుటయు రాధాకృష్ణునిగూర్చిన అనుచితప్రసంగమును

అటుండనిచ్చి, శ్రీ శ్రీనివాసాచార్యులుగారు విమర్శలో సక్రమముగ జెప్పిన లోపముల బరిశీలింతము. బుద్ధాశోకుల గూర్చిన అధ్యాయములబట్టి మిగిలిన అధ్యాయము లింకెట్లుండునో గ్రహింపవచ్చునని, ఆగ్రంథపు లోపముల నందు వివరించుట సాధ్యము కాదని మాత్రము వారు వ్రాసిరి. కాని ప్రత్యేకలోపము లేవియో తెలుపరైరి. బుద్ధాశోకులగూర్చిన అధ్యాయములు సమగ్రములు కావు; వృత్తాంతములనుగూర్చి ఆంగ్లపూర్వగ్రంథవాక్యములతో బోల్చినచో కొన్ని స్వల్పభేదములును కలవు. కాని యేచరిత్రలోనైనను సంగ్రహముగ వ్రాయునప్పు డట్టి లోపము లుండును. మరియు దృక్పథమునుబట్టియు భేదము లుండక తప్పదు. కాని చాలమంది యితర చరిత్ర కారులకన్న బుద్ధాశోకులగూర్చి వెల్సుగారు కొన్నివిషయములను చాల బాగుగనే వ్రాసిరి. వెల్సుగారికి మన ప్రాచ్యఖండపు బుద్ధాశోకులగూర్చి (ఇతర ప్రాంతములగూర్చిన దానికన్న) సదభిమానము చాల హెచ్చుగనుండుట ఆశ్చర్యకరము గాదు. ఆయన దృక్పథము పాశ్చాత్యదృక్పథమే. అందువలన ఈ అధ్యాయములనే గ్రంథము కంతకు పరీక్షాస్థలముగ గ్రహించుటకు భావ్యము కాదు.

5-వ చార్లెసుతిండిని ఉత్తరక్రియలనుగూర్చి వెల్సుగారు వ్రాసినది యథార్థముగాదని విమర్శలో వ్రాయబడినది. 5-వ చార్లెసు మహాచక్రవర్తులలో నొకడైనను వానప్రస్థుడైనట్లు ఆయన లోకాతీతమగు మహాత్యాగము కావించెననియు చారిత్రకులు తరుచు వ్రాయుదురని వ్రాసి, నిజముగా ఆయనచర్యలబట్టి చార్లెసులో నట్టి ఘనత గాని నిజమగు జ్ఞానిత్వాదులు గాని లేవనుటకు, దానిని వెల్సుగారు పరిహసించిరి. (వ సగా తీవ్రచరిత్రపఠనచే వ్యాకులచిత్తులగు వారికి హాస్యరసభరితమగు దీనిచే మనోవిశ్రాంతి కలుగును.)

ఇట్లు నేను వ్రాసినందున వెల్సుగారి భావములన్నియు అంగీకారయోగ్యము లేయనియు, వారి ప్రపంచ చరిత్రగ్రంథము లోపరహితమనియు నాయభిప్రాయ మెంతమాత్రము కాదు. మరియు అనువాదకులగు శఠకోపా చార్యులుగారికిని అట్టిభావము లేదని జగత్కథలోని టిప్పణులవలననే స్పష్టమగును. "అనువాదముచేయుటకు బదులు శఠకోపాచార్యులుగారు ఈగ్రంథముపై నాధారముచేసుకొనియు ఇందలి సందేహాస్పదవిషయములను విశదీకరించియు మన కప్రస్తుతములగు విషయములను సంగ్రహపరచియు.. ఇందలి దోషములను సవరించియు వేరొకగ్రంథమును తయారుచేసియుండవలసిన"దని విమర్శకులు 'ఉదయిని'లో వ్రాసిరి. ఈ యనువాదగ్రంథము కన్న స్వతంత్రగ్రంథము వ్రాయుటే సులభమని తోచినను వెల్సుగారి గ్రంథముతో సంబంధములేనంత స్వతంత్రగ్రంథమును సామాన్యులు వ్రాసినను అది జనులలో ప్రామాణికముగ చలామణి కాదనియు, ప్రపంచ చరిత్రమును గూర్చిన యేగ్రంథమును అందరికిని తృప్తికరము కాజాలదనియు శఠకోపాచార్యులుగారు భూమిక (౫-వ పుట)లోనే వ్రాసిరి. వెల్సుగ్రంథముపై నాధారముచేసుకొని దానిని సవరించివ్రాయుటకు వీలులేదని విమర్శకులు గ్రహించకపోవుట శోచనీయము. వెల్సుగారు జీవించియున్నారు. ఆయన గ్రంథములకు కాపీరైటు కలదు. ఆయన మూలగ్రంథము నేరీతిగాను సంగ్రహించుట, మార్చుట జరుగనిపద్ధతినే అనువాదమున కంగీక రించినారు, ఆయన అంగీకారములేకుండ దానినిమార్చి స్వతంత్రగ్రంథమును పేరుతో ప్రచురించి గ్రంథచౌర్యము (plagiarism) చేసిన ఆక్షేపణకు లోనగుటకన్న కొంత 'రాయల్టీ'ని వెల్సుగారికిచ్చుకొను నష్టముకును విచిత్ర శైలిగ్రంథమును దుస్సాధ్యమగు అనువాదముచేయు కష్టమునకును లోనై, 'జగత్కథ'ను రచించుట, శఠకోపా చార్యులుగారి న్యాయశీలతను సూచించుచున్నది. మూలగ్రంథములోని లోపములను గమనించుటవలననే (వెల్సుగారితో గ్రంథపాఠముగురించి జరిగినయొడంబడిక గమనించియు) శఠకోపాచార్యులుగారు తమ టిప్పణులలో వివిధముఖ్యాంశములను జేర్చుటయే కాక, కొన్నిచోట్ల వెల్సుగారి యభిప్రాయము

లాక్షేపణీయములని తోచినప్పుడు టిప్పణులలో తమ భేదాభిప్రాయములను వైజ్ఞానికుల భిన్న సిద్ధాంతములను సహేతుకముగ నిరూపించియే యున్నారు. (ఉ: జగత్కథ ౩౮౭, ౬౩౩—౬౩౫, ౧౩, ౧౮ పుటలు చూడుడు.) టిప్పణులందు "ఆంధ్రదేశమునుగూర్చి వ్రాసిన సంగతులు ప్రపంచచరిత్రమునకు అప్రసక్తములు అనావశ్యకములు" అనియు విమర్శకులు ఆక్షేపించిరి. ఆంధ్రసామ్రాజ్యము, బౌద్ధ, జైన మతవ్యాప్తి, క్రైస్తవ వ్యాపారసంబంధములు, ఆంధ్రులవ్యాప్తి, విజయనగరసామ్రాజ్యము, ఇట్టి ప్రధానవిషయములే అందు వ్రాసియున్నవి. వానిని సంబద్ధములగు సందర్భములందే వ్రాసినట్లు శఠకోపాచార్యులుగారు భూమిక (౩౦వ పుట)లో వ్రాసియున్నారు. ఆంధ్రసంస్కృతికి ప్రపంచచరిత్రతోగల సంబంధము, నాగరికలోకమున ఆంధ్రుల స్థానమును తెలిసికొనుట యవసరము కాదా? చరిత్ర సామాన్యమున ఆంధ్రులకు స్థానమే లేదా? ఆంధ్రులే పాఠకులుగా నుద్దేశించిన 'జగత్కథ'లో ఆంధ్రుల ప్రశంసయే కూడదని విమర్శకుల భావమా? ఇట్టి విమర్శలు పాఠకులను నిరుత్సాహపరచునే కాని ఆంధ్రపాఠకులకుచికి సవ్యమార్గమును ప్రదర్శింపదని తోచుచున్నది.

మూలమందలి చిత్రపటముల నిందు ప్రచురించకుండుట గొప్పలోపమని, తేజోమేఘము, శిలాధాతువులు మున్నగువాని వివరణమే యిందు లేదని విమర్శకులు వ్రాసిరి. వాని వివరణము గ్రంథమున లేకపోలేదు. మరియు అనువాదకులు తమ టిప్పణులలోను వీనిని విశదము చేసినారు. (ఉ: 'జగత్కథ' ౧౫వ పుట.) చిత్రపటములు Outlineలో నేకాని Short History of the Worldలో లేవు. జగత్కథలో Short Historyలోని పటము లన్నిటినే గాక రెండు క్రొత్తపటములగూడ చేర్చియే యున్నారు. Outlineలోని కొన్ని చిత్రపటముల నిందు చేర్చుట మంచిదే; కాని ఇప్పటికే 'జగత్కథ' అచ్చొత్తించి ప్రచురించుటలో శఠకోపాచార్యులుగారికి కలిగినబాధ నావలె స్వయముగ తెలిసినచో విమర్శకు లట్లు వ్రాసియుండరు. మన ఆంధ్రపాఠకులు కాలక్షేపము కొరకు లేక వినోదమునే యిచ్చు కథలను, నవలలను, లేక మూఢభక్తినే ప్రోత్సహించు ప్రాచీనమతసంబంధ గ్రంథములనుమాత్రమే కొందురు; కాని విజ్ఞానవ్యాప్తి గావించు ఇట్టి వాఙ్మయమున కాంధ్రలోకమున ద్రవ్యరూపముగ సహాయప్రోత్సాహములు లేవనియు, చిత్రపటముల గూడ జేర్చుటచే విశేషద్రవ్యవ్యయము కలిగి, పుస్తకపు కిమ్మతు నింకను హెచ్చించుటయు, అందుచే కొనుబడి యింకను తగ్గుటయు జరుగునని గమనింపవలసివచ్చెను.

Outline of History తెలుగున లేనందున ఈ 'జగత్కథ' అంగ్లము తెలియని ఆంధ్రుల కుపయోగకరము కాదనియు మన విమర్శకులు వ్రాసిరి; Short History ఏవిధముగను Outline గ్రంథమునకు అనుబంధము కాదనియు, "వేరుగా నిర్ణయించి వ్రాసిన సామాన్యచరిత్ర"యనియు, సామాన్యపాఠకులందరికిని సులభముగ నుండుటే దాని ముఖ్యోద్దేశమనియు వెల్సుగారి పీఠికవలననే స్పష్టమగును. Outline గ్రథంపురీతి విపులగ్రంథమును శ్రీ శ్రీనివాసాచార్యులుగారుగాని ఇతర మహాశయులుగాని ఆంధ్రమున వ్రాసిన మంచిదే; కాని దాని ప్రచురణ ప్రయత్నము నారంభించినగాని అందలి కష్టములు విమర్శకులకు గ్రాహ్యములు గావు. మరియు క్లుప్తమగు 'జగత్కథ'కే ఆంధ్రజనప్రోత్సాహము సందిగ్ధమగునప్పు డింకను విపులమగు గ్రంథము పాఠకలోకము ప్రోత్సహింపగలదాయని యింకను సందేహింపనగును. ప్రస్తుతస్థితిలో అది ఆర్థికముగ జయప్రదమగుట యసంభవము.

తనకు సాధ్యమైనంతవరకు వ్యయప్రయాసములకు సంకోచింపక శఠకోపాచార్యులుగారు చాల టిప్పణులను అనుబంధములను చేర్చి, మూలగ్రంథమును చాల వృద్ధిచేసి జగత్కథను ప్రచురించినారు. పాశ్చాత్య దృక్పథముచే గలిగిన వైపరీత్యములుగూడ టిప్పణులవలన సవరింపబడినవి. అట్టిస్థితిలో 'జగత్కథ' లోప భూయిష్ఠమని విద్వాంసులును విమర్శలో సూచించుట నవ్యవాఙ్మయమును ప్రోత్సాహకరము కాదు. ఆంధ్రమున ఇట్టి వాఙ్మయము చాల అవసరమైనను, ఇట్టి గ్రంథముల బ్రచురించువా రరుదు. విమర్శకులు గ్రంథములం దలి నిజమగులోపముల గనపర్చుట మంచిదే; అది గ్రంథకర్తల కుపయోగకరము, మార్గదర్శకముగ నుండుట భావ్యము. 'ఉదయిని'లోని విమర్శ ఆరీతిదిగ గన్పట్టదు. ఇది కొంతవరకు నవ్యవాఙ్మయమంతకు సంబంధించుటచే నింతదూరము వ్రాయవలసివచ్చినది. గనుకనే తుదకు శ్రీ విమర్శకాచార్యులవారు వ్రాసిన రీతిని "ప్రపంచచరిత్ర మేమాత్రము నేవిధమునను దెలియని యాంధ్రుల కీ గ్రంథము" అవ్యాజానురాగముతోను, గడుమన్ననతోను సమర్పింపబడినది.

కాకినాడ — ఎమ్. వి. వి. కె. రంగాచార్యులు, బి. ఎ.

20—7—1936 — Hon. Secretary, R.P.A., for Madras Presidency.

[పై లేఖకు డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారి సమాధానము:]

ఆర్యా,—జగత్కథ విమర్శనమునుగూర్చి శ్రీ ఎమ్. వి. వి. కె. రంగాచార్యులుగారు వ్రాసిన వ్యాసము సామూలాగ్రముగ జదివితిని.

రంగాచార్యులుగారి వ్యాసము నారంభమునందు ఈక్రింది వాక్య మున్నది:

> "శ్రీనివాసాచార్యులుగారు వ్రాసిన ఈ తీవ్రవిమర్శలో విజ్ఞానచరిత్రలగూర్చిన కొన్ని మూల సిద్ధాంతములే పూర్వపక్షము చేయబడినవి. అందువలన వానిని బహిరంగముగ సమర్థించుట నా బాధ్యతయగుటచే నే నీ క్రిందివిషయములను వ్రాయవలసివచ్చినది."

ఇట్లు ప్రారంభించియు ఏలకో నే జేసిన పూర్వపక్షములను రంగాచార్యులుగారు చర్చించనేలేదు. ఉదాహరణముగ నా విమర్శలోని మొదటి పూర్వపక్షమును గైకొందము. "'ప్రపంచమంతట నొకే ప్రజారాజ్యనిర్మాణమును, అంతర్జాతీయసంఘస్థాపనయు ఇతిహాసభావమని వెల్సుగారి యూహ.' ఈయూహకు ప్రపంచచరిత్రమునందు సహకారములగు విషయములు చాలకొద్దియే. ప్రతిబంధకములగు విషయములు మాత్రము అసంఖ్యాకములు. అదియే గాక 'విశ్వజనీనభావమును', 'జగదాత్మకత్వమును' వ్యాప్తి నొందించుటకు ప్రపంచమందంతటను ఒకే ప్రజారాజ్యమును నిర్మాణము జేయుట యొక్కటే మార్గమని చెప్పుటకు వీలుగాదు" అని నా విమర్శనమునందు నేను వ్రాసితిని. ఎందులకో రంగాచార్యులుగారు దీనిని చర్చించనైనలేదు.

వెల్సుగారి చరిత్రమును విమర్శించిన ఆంగ్లవిమర్శకులలో నొకరి యభిప్రాయమును నా విమర్శనమునం దుదాహరించితిని. ఈ విమర్శనము సాధారణముగా మన కందరికిని తెలిసిన Illustrated London News అను పత్రికలో ప్రచురించియున్నందున అందరికిని తెలిసియేయుండునని భావించితిని. కాని ఆ విమర్శకుని పేరు తెలుపలేదని శ్రీరంగాచార్యులుగారు న న్నాక్షేపించినందున ఇట వివరించెద. అతని పేరు Osborn,

ఇంచుమించుగ అన్ని పత్రికలకన్న Illustrated London News పత్రికకే యధికవ్యాప్తి (circulation) కలదు. ఇందలి విమర్శన లెప్పుడును కేవల మొక్క విజ్ఞానాభివృద్ధిదృష్టితోనే చేయబడుచున్నవి గాని ఎప్పుడును పక్షపాతబుద్ధితో చేయబడునవి గావు. ఈకారణముననే ఈపత్రిక సర్వజనామోదమును బడయుచు దినదినప్రవర్ధమాన మగుచున్నది. హిందూదేశమునందుగూడ ఇంతకన్న నెక్కువవ్యాప్తిగల ఇంగ్లండుదేశపు పత్రిక లేదని తలతు. గనుకనే ఈపత్రికయందలి విమర్శనమును నే నుదాహరించితిని. ఈ ఆంగ్లవిమర్శకుడు శక్తిమంతుడనియు, జ్ఞానైకరతుడనియు, పక్షపాతపుఁవ్రాతలు వ్రాయువాడు కాడనియు నా సంపూర్ణవిశ్వాసము. ఆంగ్లదేశమునందు పామరజనమునకును, పండితులకునుగూడ ఇతనినిగూర్చి సాధారణముగా నిట్టి యభిప్రాయమే కలదు. రంగాచార్యులుగారు హిలేరి బెల్లక్ (Hilaire Belloc)గారి ఖండనమునుగూర్చియు, అందునకు వెల్సుగారొసగిన ప్రత్యుత్తరమునుగూర్చియు ప్రస్తావనజేసియున్నారు. బెల్లకు రోమనుక్యాథలిక్ (Roman Catholic) మతాభివృద్ధియందే లగ్నమనస్కుడై, ఆ మతవ్యాప్తికై తన జీవితమును ధారపోసినవాడు. రోమనుక్యాథలిక్ మతదృష్టితోనే చరిత్రలు వ్రాసినవాడు. అట్టివాడు చూపిన తప్పులను పరిగణింప నవసరములేదు. నే నిచ్చినది, అట్టి పక్షపాతదృష్టితో విమర్శించినవాని యభిప్రాయము కాదు. కేవలము ప్రపంచదృష్టితోమాత్రమే చూచినయెడల వెల్సు గ్రంథమునం దెట్టి లోపములు గాన్పించునో అట్టివానినిమాత్రమే నా విమర్శనమునందు తెల్పితిని. రంగాచార్యులుగారే వ్రాయుచున్నారు, "వెల్సుగారి భావములన్నియు అంగీకారయోగ్యములేయనియు వారి ప్రపంచచరిత్రగ్రంథము లోపరహితమనియు నా యభిప్రాయ మెంతమాత్రమును గాదు" అని. ఇక నేనుమాత్రము చెప్పిన దేమి?

వెల్సుగారు ఈ గ్రంథము ప్రచురించునప్పటికి ప్రపంచచరిత్రమునుగూర్చి విశదమగు అభిప్రాయము లుండలేదు. కాని అప్పటినుండి ఇప్పటివరకును ఈవిషయమునుగూర్చి ఎందరో మహామహులు యోచించి, పరిశోధించి, తమ యభిప్రాయములను విశదీకరించియున్నారు. చరిత్ర యన నేమి? చరిత్రము నెట్లు వ్రాయవలెను? ప్రపంచము నంతటిని ఒకటే యవిభక్తఖండముగ (unit) పరిగణించి చరిత్ర వ్రాసినయెడల ఏయే నూతనాంశములు వ్యక్తమగును? అట్టి దృష్టితో జూచినట్లయిన ఏయంశములు ప్రధానములై, ఏ యంశము లప్రధానము లగును? మొదలగు ఎన్నియో విషయములనుగూర్చి అనేక వ్యాసములును, పుస్తకములునుగూడ ఇటీవల ప్రచురించియున్నారు. వెల్సుగారి దృష్టికి భిన్నదృష్టితో పరికించి వ్రాసిన ప్రపంచచరిత్ర గ్రంథములుగూడ ఎన్నియో వచ్చినవి. మదరాసునందలి కన్నిమరా గ్రంథాలయమునందుగూడ కొన్ని కొన్ని ఈ లక్షణగ్రంథములును, అత్యుగ్రంథములును గన్పట్టుచున్నవి.

ఇట్టిస్థితిలో వెల్సుగారి గ్రంథమును సమగ్రముగ విమర్శించుటకు అతని ఔట్‌లైన్ ప్రథమమున ప్రచురించిననాటికన్న నేఁ డెక్కువ యనుకూలము లున్నవి. అంతే గాక వెల్సుగారికి అనుకూలురును ప్రతికూలురును ఐన విమర్శకు లెందరో ఈగ్రంథము నిదివరకే విమర్శించియున్నందున ఇందలి సత్యాసత్యము లెవ్వియో కనుగొనుటకు నాటికన్న నేఁడు మన కెక్కువ యవకాశ మున్నది. సాధ్యమైనంతవరకును అట్టి యనుకూలములను, అవకాశములను ఉపయోగపఱచుకొనియే నేఁడు నా విమర్శనమును వ్రాసితిని. ఎన్ని చరిత్రములు వచ్చినను ప్రపంచచరిత్రమును ప్రప్రథమమున వ్రాసిన కీర్తి వెల్సుగారిదే. దాని నెవరును కుంచితము చేయజాలరు. కాని తప్పులని నే విమర్శనమునందు జూపిన 'మూలసూత్రములను' సమర్థించి నే జెప్పిన రీతిని ప్రపంచచరిత్ర ముండదగదని ఖండించి రంగాచార్యులుగారు ప్రపంచచరిత్రము నెట్లు వ్రాయవలెనో విశదీకరించియుండినచో చాల బాగుగ నుండెడిది.

బుద్ధాశోకులనుగూర్చి నేను వ్రాసినదానిని ఆక్షేపించుచునే రంగాచార్యులుగారు,

"బుద్ధాశోకులనుగూర్చిన అధ్యాయములు సమగ్రములు కావు; వృత్తాంతములగూర్చి అయా పూర్వపుపుస్తకములతో బోల్చినచో కొన్ని స్వల్పభేదములును కలవు. కాని యే చరిత్రలో నైన అంత సంగ్రహముగ వ్రాయునప్పు డట్టి లోపము లుండును. మరియు దృక్పథమును బట్టియు భేదము లుండకతప్పదు. కాని చాలమంది యితర చరిత్రకారులకన్న బుద్ధాశోకుల గూర్చి వెల్సుగారు కొన్నివిషయములందు చాలబాగుగనే వ్రాసిరి. వెల్సుగారికి మన ప్రాచ్య ఖండపు బుద్ధాశోకులగూర్చి (ఇతరప్రాంతముల గూర్చినదానికన్న) పరిచయము చాల తగ్గియుం డుట ఆశ్చర్యము గాదు. ఆయన దృక్పథమును పాశ్చాత్య దృక్పథమే."

అని సమాధానముకూడ వారే వ్రాసియున్నారు.

ఇక నొక్కయంశము. ఆంధ్రులనుగురించి నేను వ్రాసిన విషయమును అపార్థముచేసికొని రంగాచార్యులుగారు ఏమేమో తోచినదెల్ల వ్రాసియున్నారు. రంగాచార్యులుగారి కున్నంత లేకపోయినను నాకును కొంత ఆంధ్రాభిమానము గలదు. అందునిమిత్తమే ఆంధ్రదేశచారిత్రమును నా యభిమానకార్యరంగముగ జేసికొని పనిచేయుచున్నాను. ప్రపంచచరిత్రమున ఆంధ్రులకు స్థానము కలదన్నచో అది కోస్తా వ్యాపారము వల్ల మాత్రము కాదు. కాని ప్రపంచచరిత్రమున ఆంధ్రులకు స్థానము లేదనిమాత్రము నే ననను. జగత్కథ గ్రంథకర్తగారు టిప్పణులందు వివరించినది ప్రపంచ చరిత్రముగ ఆంధ్రులస్థానమునుగూర్చిన చర్చ గాదు; నిర్ణయముచేయు విషయములును గావు. వారు వర్ణించినది కేవలము హిందూదేశచరిత్ర. హిందూదేశచరిత్రము సంగ్రహముగనైనను విశదీకరింపవలసివచ్చుట జగత్కథకు అవసరమని ప్రతివిమర్శకాచార్యులవారు అభిప్రాయ పడినచో నా యభిప్రాయభేదమును వారు కొంత సహింపగలరు.

చారిత్రకలోపముల నెత్తుట ఎందుకు. శాస్త్రవిషయములలో (science matters) రంగాచార్యులు గారు ప్రస్తావించిన ఒక్కవిషయమునుమాత్రము గైకొందము. "డార్విను తన సిద్ధాంతమున కాధారముగ తెల్పిన విషయములలో కొన్నివివరములగూర్చి దరిమిలాపరిశోధకులు కొన్ని భిన్నాభిప్రాయములను దెల్పిరి; కాని ఆ భేదవిషయములు మూలసిద్ధాంతమును దాని కాధారములగు మూలసూత్రములను ఎంతమాత్రమును మార్పవు. సరికదా మరింత బలపర్చునని వైజ్ఞానికప్రముఖులందరును అంగీకరించియున్నారు" అని రంగాచార్యులుగారు వ్రాసియున్నారు. ఈవాక్యమున "మూలసిద్ధాంతము", "మూలసూత్రము" అన నేమో విశదముగాలేదు. డార్విను సిద్ధాంతములో Theory of Instinct ఒక మూలసూత్రము గాదనియా రంగాచార్యులుగారి యభిప్రాయము? డార్విను "మూలసిద్ధాంతమును, దాని కాధారములను" ఏవిధముగను బలపర చుటకు బదులు అందు కొన్ని ముఖ్యములగు మార్పులను గావించియున్న ఒకటి రెండు అంశములను పైన దెల్పిన Osborn విమర్శకుడే ఈక్రిందివిధముగ సంగ్రహముగ తెల్పియున్నాడు: "Evolution, as now accepted does not guarantee the development of homo-sapiens into homo-pacificus. The careful study of living creatures, such as birds and insects, has certainly demolished some of the deductions—e.g., the Theory of Instinct—from the Darwinian hypothesis............'the survival of the fittest' is nothing less than the urge and pressure of God knocking sense into hippopotami, men, water-lilies, blue tits, spiders and roses." దీనికి రంగాచార్యులుగారైనను, మరి ఏఇతర జీవశాస్త్రజ్ఞులు

(biologists) ఐనను సరియైన సమాధాన మొసగిన గాని రంగాచార్యులుగారి పైన జూపిన వాక్యము పాక్షికముగ ఎట్లో వెల్సును సమర్థించుటకు మాత్రమే చెప్పినట్లు ఎంచవచ్చును.

మనకు డార్విన్సుపై గౌరవ మున్నంతమాత్రాన అతని కాలమునుండి నేటివరకును జరిగిన యభివృద్ధి నేమాత్రమును గమనించక డార్విను చెప్పిన విషయములనే సతతము వల్లె వేయుచుండినయెడల మనము డార్వినును గౌరవించిన ట్లగునా? అట్లయినయెడల కోపర్నికస్ (Copernicus) నకు పూర్వులగు శాస్త్రజ్ఞులను దూషించిన ట్లగునని జ్యోతిఃశాస్త్రమును (astronomy) వ్రాయువారు భూమిచుట్టును సూర్యుడు తిరుగుచున్నాడని వ్రాయవలసినదే! న్యూటను (Newton)ను అగౌరవపరిచిన ట్లగునని ఐన్‌స్టయిన్ (Einstein) గారి రిలెటివిటీ థియరీ (Theory of Relativity)ని వదలివేయవలసినదే! డార్విను సిద్ధాంతముల ననుసరించుట లోపము గాదు. కాని డార్విను తన సిద్ధాంతమును ప్రతిపాదించిన నాటినుండి నేటివరకును, అనగా ఈ 76 సంవత్సరములలో జీవశాస్త్రవిషయమున జరిగిన అనల్పపరిశోధనమునందలి ప్రధానాంశములను వదలి వైచినచో అది యొకలోపముగనే ఎంచబడును.

శాస్త్రీయములైన ఇట్టి ఒకటిరెండు లోపములను మాత్రము చూపినాను. రంగాచార్యులుగారు మాత్రము లోపములు లేవనెదరా? ఈ సందర్భముననే వారు వెల్సుగారి నెట్లు ఖండించుచున్నారో చూడుడు: "ఐనను ఈ ఆంగ్లగ్రంథమం దెట్టి లోపములును లేవని నే ననుటలేదు. భూమి ఉత్పత్తి మొదలు ఆయాయుగములందలి జీవవికాసమును సర్వదేశములయొక్కయు సర్వకాలములందలి చరిత్రను సమన్వయించు ఇట్టి మహాగ్రంథము నెట్టి విద్వాంసు డెందరు విజ్ఞులసహాయముతో వ్రాసినను అందు లోపము లుండుటలో నాశ్చర్యము లేదు." ఇది ఆచార్యులవారిమాట. వారే చెప్పుచున్నారు: "వైజ్ఞానిక విమర్శయన సత్యపరిశోధనము; ఆపరిశోధకులు సృష్టిరహస్యమును జీవతత్త్వమును దాని యథార్థములను గమనించి విజ్ఞానసత్యమును తెల్పుటలో అంతకు పూర్వము గొప్పపండితులు మతాచార్యులుగూడ నమ్మి ప్రచారము చేయుచుండిన అనేక సిద్ధాంతములగూడ ఖండించుట తప్పదు. అది చాల కష్టకార్యమైనను సత్యశోధకుల కది తప్పదు" అని. ఇక నేను మాత్రము వ్రాసిన దేమిటి? వారి యుద్దేశ్యానుసారమే నేను వ్రాసినది—అది నిష్ఠూర మైనప్పటికిని. లోపములను జూపినపుడు, అవి సరియైన వైనపుడు, ఆదరబుద్ధితో గ్రహించిన గాని ఏగ్రంథమునుగూర్చిగాని సత్యవిమర్శనము రాదు. సత్యవిజ్ఞానము పెంపొందదు.

వెల్సుగారు జంతుశాస్త్ర పట్టభద్రులని నాకు తెలియును. కాని అంతమాత్రముచేతనే రంగాచార్యులుగారు చెప్పినట్లు వెల్సునవలలలో నున్న శాస్త్రవిషయముల (scientific matters) నమ్మి, అవి సరియనియు, 'విజ్ఞానప్రదము'లనియు, రంగాచార్యులవారివలె నే జెప్ప సాహసింపను. The First Men in the Moon అను అతని ఒక ముఖ్యనవలను గైకొందము. చంద్రగోళముపైన ఇద్దరుమానవులు ఒకరితో నొకరు మాటలాడుకొనగలిగిరనియు, ఇతరధ్వనులు చేయగలిగిరనియు వెల్సుగారు ఈనవలయందు వ్రాసియున్నారు. ఈసందర్భమున అది నవలయని మాత్రమే మనము గుర్తించుకొనవలయును. శాస్త్రగ్రంథము కాదు. చంద్రగోళముపైన గాలి (atmosphere) ఏమాత్రమును లేనందునను, ధ్వనికెరటములు గాలియున్న గాని ప్రసరించనందునను అచ్చట మనచెవివద్ద నొక నగారా వాయించినను మన కేమాత్రమును వినబడదనియు, వెల్సుగారివ్రాత కెట్టి యాధారమును లేదనియు కొంత యోచించిన బోధపడును. చమత్కారమునకే గాని వెల్సుగారు మాత్రము అదియే సత్యమని వ్రాసియుందురా? వారి యుద్దేశ్యమున అది నవలయే. వీనిలో కొన్ని కాకతాళీయన్యాయముగ శాస్త్రసమ్మతములైనను గావచ్చును.

# లేఖలు

వెల్సుగారి గ్రంథములందు ఏవో కొన్నిలోపము లున్నవని చెప్పినంతమాత్రమున ఆయనఘనత ఏమియు తక్కువకాదు. ఆధునిక ప్రపంచమునందలి గొప్పవిజ్ఞానవేత్తలలో వెల్సు ఒక్కడన్నది నిర్వివాదాంశము. ఎంత గొప్పవాడైనను విషయము వచ్చినప్పుడు లోపము లున్నచో తలపెట్టకుండ ఉండలేము. లోపములను లోపములని చెప్పక మానలేము.

గ్రంథముద్రణ ప్రకటనవిషయముల నాకంటె రంగాచార్యులుగారికి ఎక్కువ అనుభవజ్ఞాన ముండ వచ్చును—వారు హేతువాద ప్రచురణసంఘము (Rationalist Press Association) వారి పక్షమున చెన్న రాజధానికి కార్యదర్శి గనుక. నేను కేవలము విజ్ఞానాభివృద్ధికరదృష్టితో మాత్రమే చూచి ఈగ్రంథప్రాశస్త్య మునుగూర్చియు గ్రంథమునందలి విషయములనుగూర్చియు విమర్శనజేసితిని.

"ఆంధ్రపాఠకులు చాలవరకు తత్కాలవినోదమునే యిచ్చుకథలను నవలలను, లేక మూఢభక్తినే ప్రోత్సహించు ప్రాచీనమతసంబంధ గ్రంథములను మాత్రమే కోందురు" అని రంగాచార్యులుగారు వ్రాసి యున్నారు. అనుభవజ్ఞులు గాన వారు వ్రాసిన ఈవిషయము నిజమని ఒప్పుకొన్నను, 'విజ్ఞానవ్యాప్తి గావించు' గ్రంథములను సులభముగ పామరజనముగూడ అర్థముచేసికొని శ్రద్ధదీసికొనునట్లు వ్రాసినయెడల అట్టి గ్రంథములు ఎక్కువగ అమ్ముడుపోగలవనియు, వానికి తగిన ప్రోత్సాహమును ఆంధ్రలోక మొసంగుననియు నా యభిప్రాయము. శ్రీ శఠకోపాచార్యులవారు ప్రత్యేకముగ నొక స్వతంత్రగ్రంథమే వ్రాసియుండినచో, గ్రంథప్రచురణమునందు కొంత వ్యయము తగ్గి, గ్రంథము ఆంధ్రజనబాహుళ్యమునకు సులభముగ నర్థమై ఉత్సాహమును బుట్టించి తగుప్రోత్సాహమును పొందియుండునని ఇప్పటికిని నేను విశ్వసించుచున్నాను.

ఇంతకును మాననీయులైన శఠకోపాచార్యులవారిని నిరుత్సాహపరుపవలెనని గాని, వారిగ్రంథమును తెగడవలెననిగాని ఎంతమాత్రము నాయభిప్రాయము కాదు. ఇది గమనింతురుగాక. విజ్ఞానవాఙ్మయమును పెంపొందింపవలయుననియే నాయాశయము. ఇందుల కెందరు నడుములుకట్టిన నంతమంచిది. వ్రాసియే యున్నాను నావిమర్శనయందు, "ఆచార్యులవారి ఉత్సాహాసక్తులును, భాషాభిమానమును ప్రశంసార్హము" లని; "వెల్సుగారి దోషములకు ఆచార్యులవారు బాధ్యులు కా"రనికూడ. మరల చెప్పుచున్నాను నావిమర్శలో చెప్పినసంగతులనే, "విమర్శదృష్టితో జూచినచో నిందు లోపము లున్ననేమి, విషయబాహుళ్యమునుబట్టి అందరు చదువవలసిన గ్రంథ మిది...దోషముల కేమి, లోపముల కేమి, వేలువేలుగ్రంథముల రూపమున నూతన విజ్ఞానము మన తెలుగులోని కెంత ఎక్కువగ వచ్చిన నంత మంచిది," యని.

మద్రాసు
27–7–1936

పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

# వాఙ్మయ వీథి

హిందూదేశము : క్రైస్తవ ప్రభుత్వ నిర్మాణ తత్త్వము. అనువాదకుడు మహీధర జగన్నాథరావు. విశ్వసాహిత్యమాల, ముంగండ, తూర్పుగోదావరి. ౨౦౧ పుటలు. ౮ అణాలు.

కొన్ని సంవత్సరాల క్రితము 'మోడరన్ రివ్యూ'లో మేజర్ బాసుగారు మనదేశంలో యిప్పటి ప్రభుత్వము యేవిధంగా నాటబడి, యెదిగి, శాశ్వతమైనదో తెలియజేస్తూ, ఆదివరకు అందరకు తెలియని కొన్ని క్రొత్తవిషయాలను నిదర్శనాలతో నిరూపించి చాల అలజడి కలిగించినారు. ఈ వ్యాసాలనే Rise of the Christian Power in India (హిందూదేశంలో క్రైస్తవరాజ్యాంగప్రభుత్వవిజృంభణము) అనీ, Consolidation of the Christian Power in India (హిందూదేశంలో క్రైస్తవరాజ్యాంగప్రభుత్వస్థాపన) అనీ రెండు గ్రంథాలుగా ప్రచురించారు. రెండవ గ్రంథానికి అనువాదమే జగన్నాథరావుగారిది.

'అనువాదము' అనడముతోనే 'మాతృక'లోని అభిప్రాయాలను, విషయాలను, ముఖ్యంగా వాతావరణాన్ని యెంతవరకు మన భాషలోనికి తేగలిగినామో చూడవలసివుంటుంది. అవకాశాన్నిబట్టి విషయాలను అన్నిటినీ తీసుకురావచ్చును గాని, అభిప్రాయాలతోను, వాతావారణంతోను అసలుగ్రంథానికి ప్రతి యేర్పరచుట చాలకష్టము. ఈకష్టమైనపనికి పూనుకొనుట అనువాదకుని కార్యదీక్ష సూచిస్తుంది. కాని, బాసుగారి గ్రంథాన్ని ఆంధ్రదేశానికి బాగుగా పరిచయం చేయకలిగిన వీరు, భాషాంతరీకరణంలో చాల లోట్లు చూపించినారు. సరియైన భాషాపద్ధతి (style) లేకపోవుటవల్ల, అనువాదము చదువుటకు చాల కటువుగా వుంటుంది. అచ్చుపొరపాట్లకు లోటు లేదు. (అది గ్రంథకర్త తప్పు కాదు.) అయితే, విదేశ ప్రభుత్వము యేయే అక్రమపు మార్గాలమీద ఆధారపడి, ఎట్టెట్టి కుతంత్రాలను సాయంగా తీసుకొని, యిప్పటికి శాశ్వతంగా కనబడుతున్నదో సవిస్తరంగా వెల్లడిచేశారు. వీరు జరిగిపోయిన గాథను మరల ప్రస్ఫుటంగా చూపించి కంపింపజేస్తారు ; మనము పడిన అవమానాలకు కన్నుల నీరు తెప్పిస్తారు ; మన బానిసతనానికి కోపం తెప్పిస్తారు;—ఇప్పటి మన మాంద్యమును పోగొట్టడానికి చాల తోడ్పడతారు.

'విశ్వసాహిత్యమాల' వారి ఆశయాలు గొప్పవి. తక్కువ వెలతో మంచి పుస్తకాలు చందాదారులకు సరిగా అందజేయుట మాటలు కాదు. వీరి యితర గ్రంథాలు యింతవరకు 'లియో టాల్‌స్టాయి', 'ఇటలీ'. గ్రంథమాల ఆంధ్రభాషాభ్యుదయానికి తప్పక సాయపడుతుంది.

ఆచంట జానకిరామ్

కోపదారి మొగుడు. రచయిత చేమమళ్ల కామేశ్వరరావు, పిఠాపురము. వెల ౪ అణాలు.

ఇది యొక సాంఘికవృత్తమును గూర్చిన నాటకము. "ఆనేకమంది కోపదారులైన మొగాళ్లు తమ భార్యలను పెట్టేబాధలు చూసి వీటి నివారణ కొరకు నాటకం రాయాలని ఉద్దేశించాను" అని నాటకరచయిత

తన ఉపోద్ఘాతములో చెప్పుకొన్నాడు. ఈ ఉద్దేశ్యం ఈ నాటకరూపంగా కొనసాగునో లేదో చెప్పజాలము, గాని "కోపదారులైన మొగాళ్లు తమ భార్యలను పెట్టేబాధలు" మాత్రము నాటకరచయిత ఎట్టి మొహమాటమును లేక విశదముగ—కొన్ని సందర్భములందు అత్యధికముగా—వర్ణించినాడు. కథానాయకుడగు కోపదారి మొగుడు స్కూళ్ల డిప్టీఇనస్పెక్టరు. కాని ఇతని కోపమంతయు మొదటిభార్యపైననే. ఆమెను కన్న కష్టముల బెట్టి, ఆమె టైఫాయిడ్ జ్వరముతో బాధపడి చనిపోయిన వెంటనే "జీవితమంతా మంచారిపోయినట్లు అయిపోయిం"దని ఏడ్చి, పునర్వివాహపుమాట ఎత్తిన మండిపడుచునుండి, పిదప కొంతకాలమునకే వీరేశలింగంగారి తోటలో నున్న 30 ఏండ్ల వయస్సుగల ఒక వితంతువును వివాహముచేసికొన నుద్దేశించును. ఆమె కిదివరకే ముగ్గురుపిల్లలున్నను, తనకుకూడ ఇద్దరుపిల్లలున్నందున "సంసారపు టనుభవంలో ఇద్దర మొకటే స్థితిలో నున్నం"మన పూర్తిగా పరస్పరమైత్రి పొసగుట సులభమని నిర్ధరించి ఆమెను వివాహముచేసికొనును. ఈ వివాహమునకు తన సవతియన్నకొడుకు గోపాలం మాత్రమే కాక తనముసలి మేనమామ జగన్నాథం కూడా అంగీకరించి తగుమట్టు సాయముజేతురు. ఇరుగుపొరుగువారి ఊబుసుపోకలు, పూర్వాచారపరాయణుల యధిక ప్రసంగములు, అమ్మలక్కల వ్యాసంగములు మొదలగు సందర్భములను నాటకరచయిత ముచ్చటగను జీవితానుకరణముగను చిత్రించియున్నను, ఒకొక సందర్భమునందు మాత్రము కేవలము అది సామాన్యముగ గన్పడి కావ్యములకును నాటకములకును ఉండవలసిన వస్తువిశిష్టతను గోల్పోవుచున్నది. చిట్టెమ్మ జీవితవిధానమును, ఆమె యవసానదశయు ఈ నాటకరచయితయందు నిగూఢముగ నున్న స్వభావచిత్రణ (characterization) రసోత్పాదకర శక్తులను సూచించుచున్నవి.

కాని నాటకరచయిత భిన్నలక్ష్యములను తన మనస్సునం దుంచుకొనుటవలన కథయొక్క బిగి సడలినది. ఒకటి రెండుపాత్రల స్వభావచిత్రణము (characterization) గూడ వన్నె దప్పినది. నాటకాగ్రేసరులుగూడ ఒకొకమారు లోనగు నొకముఖ్యలోపమునకు ఈ నాటకరచయితకూడ లోనైనాడు. స్వభావచిత్రణమూలముగనో మరి ఇంకేవిధముగనో రసోత్పత్తి కలిగించుటయే నాటకరచయితయొక్క పరమావధియని వీరు గమనించిన ట్లగపడదు. ఈ ముఖ్యసూత్రమును ముందుంచుకొనక, కొన్నికొన్ని విషయములనుగూర్చి ప్రచారము (propaganda) సలుప నుద్దేశించి పాత్రలరూపముగ ప్రేక్షకులకు తానే యుపన్యాసముల నిచ్చుటకు గడంగినందున ఔచిత్యమునకు భంగము కలిగి, రసవంతముగ ప్రారంభమైన ఈనాటకము తుదకు sunday sermon గ మారిపోయినది. స్వభావచిత్రణమునుబట్టియు, కథావస్తువునుబట్టియు, రసపోషణమునుబట్టియు వ్యక్తమగుచున్న తమ కొన్నియభిప్రాయములతో తృప్తినొందక పాత్రల సంభాషణరూపముగ మరల నొకమారు వేరొకవిధముగ తన వివిధాభిప్రాయములను నొక్కి చెప్పుటకు ప్రయత్నించుటవలన ఈకళంకము సంభవించినది. ఇట్టి ప్రయత్నమే లేకున్నచో ఈనాటకము నాలుగవ అంకముతోనే పరిసమాప్తిజెందియుండును. నేటి వర్ణాశ్రమపరిస్థితులను గూర్చియు, వర్ణాంతర శాఖాంతర వివాహములను గూర్చియు, communalism వల్ల కచేరీలయందును కళాశాలలందును కలుగు హానినిగూర్చియు, విగ్రహారాధనను గూర్చియు, "పెళ్లిళ్లలో డబ్బు తగలెయ్యడం" గూర్చియు, ఇతర విషయములనుగూర్చియు చర్చయే అనవసరమైయుండును. తిండిపోతుగను, సామాన్య వృద్ధునిగను చిత్రించిన జగన్నాథమును తుదకు సంఘ సంస్కార నాయకునిగ జేయ నావశ్యకత యుండియుండదు. కొంత వ్యక్తిత్వము నొసంగి చిత్రించిన గోపాలం అను పాత్రమునకు తుదకు వ్యక్తిత్వమును పోగొట్టి సంఘ సంస్కార నాయకుడగు జగన్నాథమున కొక సామాన్య అనుచరునిగ జేయ నావశ్యక ముండి

యుండదు. ఏవిధముగనైనను తన యభిప్రాయముల నన్నిటిని తెలియజేసి కొంత propaganda చేయవలెనను నాటకరచయితయొక్క ఉద్దేశమే దీని కంతటికి కారణము. విమర్శదృష్టితో జూచినచో, ఈ నాటక రచయిత నాలుగంకములను ఒక్కపెట్టున వ్రాసి, పిమ్మట కొంతకాలమునకు ఐదో అంకమును తీరికగ వ్రాసి మిగత భాగమున కతికించినట్లు గన్పడుచున్నది.

నాటకమునంతటిని మూడు రోజులలో వ్రాసితినని నాటకరచయిత తమ యుపోద్ఘాతమునందు చెప్పుకొనియున్నాడు. ఇట్టి రచనవలన రసోత్పాదనము సుకరమైనను, స్వభావచిత్రణము మాత్రము కొన్ని లోపములకు గురియగుచున్నది. అట్టి లోపము లిందుగూడ కొన్ని గాన్పించుట యొక విశేషము గాదు. రంగముల సంఖ్య నధికముగ పెంచి ఒక్కొక్క రంగమును చాల చిన్నదిగ చేయుట రసపోషణమునకు అనుకూలమగు విధానము కాజాలదు. ఈ చిన్న నాటకమునందు ఇరువదియొక్క రంగము లున్నవి. కొన్ని కొన్ని రంగములు రెండు పుటలనుగూడ మించవు. గాన ఇట్టి నాటకములను ప్రదర్శించునపుడు ప్రేక్షకుల దృష్టిని కథావస్తువునందు కేంద్రీకరింపజేసి రసోత్పత్తిని కలిగించుట చాల కష్టము. భాషావిషయమున నాటకరచయిత యవలంబించిన మార్గము ఆధునిక సారస్వతాభివృద్ధియం దుత్సాహమున్న ఎల్లరకును సంతోషదాయకమే.

పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

సాహిత్యతత్త్వవిమర్శనము. రచయిత జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఎమ్.ఏ., బి.ఎల్. ఆంధ్ర పబ్లిషింగ్ హౌస్, ౨౧ ఎర్రబాలుచెట్టి వీధి, జి.టి., మద్రాసు. డెమ్మీ ౨౦౬ పుటలు. రు ౧-౮-౦.

సాహితీ హృది, శైలి, మాతృభాష, లలితకళలు, నాట్యకళ మొదలైన వివిధవిషయాలను పట్టి యిందు పదుమూడు సారస్వతవ్యాసము లున్నవి. 'ఉత్తమ సారస్వతమును, ఉత్తమజీవనమును, ఉత్తమమతమును వేఱుచేయుట అసాధ్యమని నాతలంపు' అన్న వీరివాక్యమువల్ల సారస్వత ప్రయోజనముపై వీరి కెంతటి తాత్పర్యమో తెల్లమవుతున్నది. సృష్టియందూ, కవి హృదయమందూ, కవి కృతియందూ కలశక్తి ఒక్కటే అనిన్నీ, అదే 'సాహితీహృది' అనిన్నీ వివరించడానికి వీరు వివిధవిషయాల తమకుగల విపుల పరిజ్ఞానమును వినియోగపరిచినారు. ఇందలి వ్యాసము లన్నిటనూ ఏదోవిధముగా ఈ దృష్టి సూత్రముగా ఉన్నది. సాహిత్యాదికళలను పరిశీలించేటప్పుడు కూడా వీరు ఈ 'హృది' దృష్టితోనే చూచుటవల్ల, వానికిగల ఒకవిశిష్టమైన స్వరూపము, విభిన్నత వీరికి గోచరించలేదు. అనేక వ్యాసాలలోని గోష్ఠి ఒక్కటే ఐనది. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ (ఆంగ్ల) ఉపోద్ఘాతమున, వీరి వివిధవిషయముల పాండిత్యమును మెచ్చుకుంటూ, క్రమశః వీరికి విజ్ఞానము వికసించి, శైలి సాఫుదేరి, విషయైక్యమున్నూ, రచనాసౌందర్యమున్నూ రాగలవని ఆశించి, 'కష్టతరమైన విమర్శకళయందు వీరి కసిగల పూనికకు' జయము నపేక్షించిరి. ఏ విషయము అవలంబించినా, విపులముగా ప్రసంగించగల సామర్థ్యము వీరి కున్నది.

కొంపెల్ల జనార్దనరావు

గోలకొండ పత్రిక పదునొకండవ సంవత్సరాది సంచిక. ట్రూపుబజారు, హైదరాబాదు, దక్కను. సంపాదకుడు కొండా బాలకృష్ణా రెడ్డి.

ఇందు ప్రసిద్ధులైన మాడపాటి హనుమంతరావుగారు, నుసర్ల శ్రీరామనరసింహంగారు, వరుగంటి సీతారామయ్యగారు, రాయప్రోలు సుబ్బారావుగారు, సురవరము ప్రతాపరెడ్డిగారు, శేషాద్రి రమణకవులు

## ఉదయిని

మొదలైనవారు పలు విషయాలను గురించి పలు వ్యాసాలు వ్రాసిఉన్నారు. పత్రికలు తామున్న ప్రదేశానికి తగిన సేవ చేయగలిగితే దేశము మొత్తానికి ఒక ప్రత్యేకమైన సేవ చేసినట్లే. గోలకొండపత్రిక ఆంధ్రదేశ మంతటికీ పనికివచ్చే విషయాలలో శ్రద్ధ తీసుకొనడమే కాక, నిజామురాష్ట్రమునకు అనల్పమైన సేవ చేస్తున్నది. నిజాంరాష్ట్రమందు సగభాగ మాక్రమించిన తెలంగాణపు తెలుగువారి శ్రేయోభివృద్ధులను గురించి తెలుగువా రెల్లరు తెలిసికొనుట ఆవశ్యకము కనుక నిజామాంధ్రులు తలపెట్టుతున్న ఉద్యమాలకు, స్థాపిస్తున్న సంస్థలకు, ఇట్టి పత్రికలకు తగిన ప్రోత్సాహ మొసంగుట అవసరము. గోలకొండపత్రిక క్రమాభివృద్ధి జెందుట ఆనంద దాయకము. ఈ పదునొకండవ సంవత్సరాది సంచిక అనేకములైన మంచి వ్యాసాలతో విరాజిల్లుతూ, వ్యావహారికములైనటువంటీ, సాంఘికములైనటువంటీ సమస్యలను పెక్కింటిని ముందుపెట్టుతున్నది.

ప్రతిభ. నవ్యసాహిత్య పరిషత్పత్రిక. మొట్టమొదటి సంచిక. సంపాదకుడు తెలికిచర్ల వెంకటరత్నం. నవ్యసాహిత్యపరిషత్తు, గుంటూరు. వెల ౮ అణాలు. సంవత్సరపు చందా ౨ రూపాయలు. త్రైమాసికి.

నవ్యసాహిత్యపరిషత్కార్యాలలో ఒకటైన పత్రికా నిర్వహణము ప్రారంభమైనది. 'ప్రతిభ' తొలి సంచికలో సంపాదకులు నవ్యసాహిత్యపరిషత్తు చరిత్రము ౧౯౩౩ లో అది యేర్పడ్డది మొదలు వివరించి దాని లక్ష్యాలను, కార్యవిధానమును వివరించినారు. మరిన్ని వివిధ సారస్వత, విద్యావిషయాల పైని అభిప్రాయాలు వెల్లడించి పత్రికకు గొంతు ఉన్నదని చూపినారు. ఇందలి వివిధ వ్యాసాలున్ను నవ్యసాహిత్యపరములై పరిషత్కార్య పరాయణతకు ఆ త్తిఉన్నవి. కాకినాడలో జరిగిన నాలుగవ పరిషత్సమావేశానికి అధ్యక్షులైన కావ్యవ్యాకరణ తీర్థ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి అధ్యక్షోపన్యాసము, 'ఆంధ్రవాఙ్మయం: పుట్టు పూర్వోత్తరాలు' అన్నది, పేరుకు తగి ముఖ్యంగా సాహిత్యచరిత్రాన్ని అంతను సంగ్రహముగా పరామర్శి స్తున్నది. '...పురాణాలు తెలుగులోనికి తర్జుమాలు చేసినా, లేక పురాణాల ఆధారాలమీద పెంచి ప్రబంధా లుగా మూటకట్టినా, ఫలితం ఒక్కవిధంగానే ఉంది కాబట్టి........క్రీస్తుశకం 19 వ శతాబ్ది ఆఖరుదాకా ఉన్నసాహిత్యం పురాణసాహిత్యం అన్నమాట' అని వీరు ఆ సాహిత్యమునంతనూ ఒక్కమూటకట్టి, 'పరిశేష న్యాయంచేత...పురాణసాహిత్యం కానిదంతా గాని, లేక, ఈ నవయుగంలో [పరిశేషన్యాయంచేత 19 వ శతాబ్దికి ఇటీవల] ప్రాదుర్భవిస్తూఉన్న సాహిత్యంగాని, నవ్యసాహిత్యంగా మనం అనుకోవచ్చు' అని నవ్యసాహిత్యాన్ని విడదీసినారు. ప్రబంధవాఙ్మయముపై వీరు పోసిన విమర్శనమును బట్టి సహా పురాణాలకంటె భిన్నమైన 'ఫలితం' వాటివల్ల కనబడుతున్నప్పటికీ అవి పురాణయుగములోనే అణప బడ్డవి: 'ఫలితము'ను బట్టియే సాహితీలక్షణ నిరూపణము కాని, ఈ యుగవిభజనము కాని చేయుట ఒప్పిదమే అని వీరి అభిప్రాయముగా కన్పడుతున్నది. నవ్యసాహిత్యమునందు విశిష్టత వివరించ పూనుకొన్న వీరు దానిని ఆ విశిష్టతనుబట్టి విడగొట్టితే బాగుండేది. కాని, ఆంధ్రసాహిత్యమున్ను, సంస్కృత ప్రాకృతాది సాహిత్యములున్ను విరివిగా తరిచిన శ్రీ శాస్త్రులుగారు నవ్యసాహిత్య మును గర్హించేవారిని తీవ్రముగా విమర్శించి నవ్యసాహిత్యాన్ని సమర్థించడానికి తొలినుండీ పూనుకొన్న ప్రఖ్యాతి సామర్థ్యాలకు వీరి అధ్యక్షోపన్యాసం తగియే ఉన్నది. కుందూరి ఈశ్వరదత్తుగారు 'శాసనముల లోని తెలుగుభాష' అనే వ్యాసమందు ఆ భాషనుండి మచ్చుకి కొన్నివిశేషాలను చూపి అవి వైయాకరణులకూ

# అ ం బ

పి. గ ణ ప తి శా స్త్రి

అంకితం శ్రీమతి చిరంజీవినికి

≡ ౧ ≡

[భీష్మునిసేనానివేశం. ఎదురుగా కొలనులో పటకుటీరం ప్రతిబింబించి ఉంటుంది. ఆకాశాన వర్షామేఘాలు కొలనునీళ్ళలో మెల్లి మెల్లిగా తాబేళ్ళగుంపుల్లాగ ప్రయాణము చేస్తూ ఉంటవి. వీణె మీటుతూ అంబ అర్ధ నిమీలిత నేత్రాలతో ప్రార్థన చేస్తున్నది.]

అంబ

సజల జలద కజ్జల
రథచారిణి!
సరస హారిత శాద్వల
తల విహారిణి!
సకల భువన శోక
తరళవాహిని !
సర్వాశాంతర నిరత
నినాదిని !

ఓ నాజీవన వర్షా !
రావో ఓ నవవర్షా !

యుగయుగ మాధవ
యువ విరహాశ్రులు
కరగు నంట నిన్
గలిసి యేరులయి !
పెరిగిన కాంక్షా
తరళహారములు
కలియునో యిక నీ
కరుణార్ద్రాశ్రుల !

రావో ఓ నవ వర్షా !
ఓ నాజీవన హర్షా !

నిద్రిత తరుగణ
నీరవ మానిశి !
నిలుచున హృది యొక
నిమిష మ్మొగసి !
లలిత బలాకా
కలకల రవళులు
చలిత జలధరాం
చలముల నురలగ,

రావో ఓ నవవర్షా !
ఓ నాజీవనహర్షా !

[వర్షాదేవి ప్రవేశిస్తుంది]

అంబ

[ధ్యానభారంలో అర్ధనిమీలిత నేత్రాలతో]
దివ్యరూపిణీ, రజనీసమయాన అన్యులు చొరరాని నాభవనంలో ప్రవేశించిన నీవు ఎవరు?

వ ర్షా దే వి

రాజపుత్రీ, నేను సకలలోక శోక రూపిణిని, వర్షా దేవతను. నీఅఖండ ప్రార్థన అవధరించి నిన్ను అనుగ్రహించడానికి వరాలతో వచ్చినాను.

అ ం బ

[ సంభ్రమాశ్చర్యాలతో ] లోకజీవన దాయినీ, వర్షాదేవివా నీవు ! ......[లజ్జారుణ కపోలాలతో] కరుణా స్వరూపిణివైన నిన్ను దర్శించి, పవిత్రురాలిని కావడం కంటె నాకు మ రే కాంక్షా లేదు దేవీ !

దే వి

రాజకుమారీ, నిఖిలలోక శోకావర్తాలతో ప్రవహించే కరుణావాహినిని సుమా నేను ! ప్రచండవాతాలవల్ల పెల్లగిలే తరుస్కంధాలలో హృదయోన్మూలక జీవలోక దుఃఖాలను వహిస్తున్నాను. వర్షార్ధరాత్రాలలో పూరిగుడిసెల చూరులనుండి నిశ్శబ్దంగా రాలి ప్రవహించే జలబిందువులల్లో ఆర్తులై, అల్లల్లాడే దరిద్రుల దుఃఖభారాన్ని ప్రవహింప జేసుకొంటున్నాను. ఇలా లోకదుఃఖాలన్నీ భరించి, వాళ్ళఆనందానికి ఆత్మార్పణము చేస్తూవుండే నేను ఒకానొక ముగ్ధ కన్యక హృదయ భారాన్ని హరించలేనా! నీకాంక్ష ఏమిటో ఒకసారి నాకు తెలియ జేస్తావా ?

అ ం బ

దేవీ, ఈమాత్రం తెలుసుకోలేవా ?

దే వి

నీవు సౌందర్యరాశివి. ఈవర్షర్తు సౌభాగ్యమంతా హారిత సౌందర్యజ్వాలతో నీకు నీరాజనం ఎత్తుతున్నది. రాజాధిరాజ తనయవు నీకు అలభ్యమైనకాంక్ష ఉంటుందా తల్లీ! ఉంటే, నేను అన్యురాలను కానుగదా చెప్పు.

అ ం బ

[ఏమో చెప్పబోయి లజ్జావనత వదనంతో] అబ్బా, ఎంత ప్రయత్నించినా ధైర్యం చాలడంలేదు.

దే వి

కుమారీ, ఇంత బేలవు? నిన్ను ఎలాసంతృప్తి పరుస్తానో !

అ ం బ

[ లజ్జా నమ్ర నేత్రాలతో] అమ్మా ! సాళ్వేశ్వరునికోసం స్వయంవర నేపథ్యంతో నిరీక్షిస్తున్న నన్ను, భీష్మసేనాని సమస్త రాజన్యులను నిర్జించి తీసుకుపోతున్నారు! ఆ దూరవనాంచలాన, ఆ నదికి అవతలఒడ్డున నాహృదయేశ్వరుని సేనానివేశము. ఆయనకు నాహృదయం తెలిపి ప్రార్థిస్తే, నన్ను రక్షిస్తాడేమోకదా! కాని తల్లీ, నన్ను ఎవరు కరుణిస్తారు! [బాష్పకణం జారుతుంది]

దే వి

వెర్రితల్లీ, ఇంత అల్పకాంక్షితానికి ఇంత సంకోచమా! నా నీల జలద రథంలో నిన్ను ఎక్కించుకొని, మెరుపు మెరిసేటంతలో సాళ్వేశ్వరుని సన్నిధానంలో దింపనా?

అంబ

కాని, దేవీ...నాహృదయం...ఏదో సందేహంతో వేగిపోతున్నది. [కన్నీరు కొనగోటితో విదిలించివేస్తుంది]

దేవి

ఎందుకు సందేహం అంబా! అంత చెప్ప గూడనిదా!

అంబ

ఒకవేళ సాళ్వేశ్వరుడు నన్ను కరుణించడేమో! [దీనంగా చూస్తుంది]

దేవి

ఎంత విచిత్రశీలవు! రాజలోకమంతా నీ కటాక్ష కిరణాంకురానికి మహోదధిలాగ ఉప్పొంగి పోలేదా? అభిసారికావేషంలో వెళుతున్న నిన్ను దర్శించడానికి ఈప్రకృతి అంతా చిగిరించి ప్రఫుల్లపుష్పనేత్రాలతో అల్లల్లాడి పోదా? చూడు, ఆ శీతల సురభిమందమారుతాలు ఎలా నీచేలాంచల ప్రాంతాన నిస్తబ్దంగా నిద్రిస్తున్నవో! సాళ్వేశ్వరుడు నీ అభిసారికావేషం చూసి వర్షావేశాన నీపాదప్రాంతాన వాలిపోడా! ఎంత బేలవు!

అంబ

అయితే దేవీ, నేను సౌందర్యవతినా? నన్ను సంతోషపెట్టడానికి ఇలా అనడం లేదుగద! నా దీనవేషం చూస్తే, నిజంగా ఆయన మనసు కరుగుతుందా? నాకేదో భయం వేస్తున్నది తల్లీ!

దేవి

అంబా, మహారాజతనయవు? నీ అలంకరణానికి కొరత ఉంటుందా? మిసమిస లాడే చిగుళ్ళనుంచి నీ దేహసౌందర్యాన్ని మెరుగుపెట్టనా? జలదాంచలాల్లో చిక్కుపడ్డ మెరుపుపూలతో నీకబరిని అలంకరించనా?

తెర

== ౨ ==

[సాళ్వుని సేనానివేశం. గాయాలవల్ల స్పృహతప్పి శయ్యపైన పడి ఉంటాడు సాళ్వుడు; మధ్యమధ్య మూలుగుతూ ఉండి చివరకు]

సాళ్వరాజు

ప్రతీహారీ......

ప్రతీహారి

మహాప్రభూ!

రాజు

నేనెక్కడున్నాను?

ప్రతీహారి

యుద్ధభూమికి........సమీపాన........ సేనానివేశంలో....విశ్రాంతి.. . తీసుకొంటున్నారు.

రాజు

కౌరవసేనలు ఎంతవరకు పారిపోయినవి?

ప్రతీహారి

ప్రభువువారు తీవ్రజ్వరములో ఉన్నారు. కొంచెంవిశ్రమించండని దాసురాలి మనవి!

రా జు

[విసుగుతో] మన సేనానాయకులు జయించ లేదా...కౌరవ సేనను?

ప్రతీ హా రి

క్షమించాలి! నాలుగురోజు లయింది. మన సేనలు...పరాజయం పొందింది. భీష్మసేనాని రాజకన్యను హరించుకు పోయినాడు. ఏలిన వారు గుడారంలో చికిత్సపొందుచున్నారు.

రా జు

అంబను తీసుకువెళ్ళినాడా భీష్ముడు! మన సేనానులకు పరాజయమా! ఏమిది, స్వప్నావస్థా! అదుగో, చూడు! నదికిఅవతలతీరాన ఆమెరుపు కాంతుల్లో ఎన్ని కరవాలాలు మృత్యుజిహ్వాలలాగ మెరిసి పోతున్నవో! రక్తాంబర ధారిణియై అంబ శ్వేతాశ్వంపై నుంచి సేనలను పురికొల్పుతున్నది. ఆమె చేతి విసురుకు కాశీరాజుసేనలు సముద్ర తరంగాలవలె పొంగిపోతున్నవి...అదుగో, నవ్వుతూ ఆమె నావైపే వస్తున్నది. ఏమి, ఆసేన గంభీరఘోష...అదుగో, విను విను.

ప్ర తీ హా రి

[నిదానించి చూచి] నాకెవరూ కనబడడం లేదే! సందులలోనుంచి గాలి హోరుమని ఆక్రందిస్తున్నది.

రా జు

కాదు ప్రతీహారీ! కొద్దిదూరంలో ఎవరో వస్తున్నట్టు నా హృదయంలో స్పందిస్తున్నది. ఒకసారి చూచి రా! అదుగో పదధ్వని!

ప్ర తీ హా రి

[వెళ్ళి, తిరిగివచ్చి] క్షమించాలి! నిజంగానే ఎవరో యువతి సఖీద్వితీయయై, ద్వార సమీపాన వేచిఉన్నది. సెలవైతే...

రా జు

తక్షణం!

[ప్రతీహారి నిష్క్రమిస్తుంది. అంబ ప్రవేశించి తలవంచుకొని ఒకమూల నిలుస్తుంది.]

రా జు

[లేచి కూచుని] అబ్బా! నా హృదయం సంశయ బంధనాలతో పెనవేసి, ఆశా ఝంఝానిలం చెలరేపే అవగుంఠనవతీ! ఎవరు నీవు!

అంబ

[గద్గదికతో] నేను... నేను... దురదృష్ట దేవతను...అంబ[illegible]

[illegible] జు

[తటాలున శయ్యామీద పడిపోయి] ఎంత కాలానికి వచ్చావు అంబా! అబ్బా! నా హృదయంలో రక్తబిందువైనా లేకుండా పిడచ కట్టి, పిండివేశావుగదా! భీష్ముని సేనానివేశంలో నుంచి ఎలా రాగలిగావు అంబా! ..ప్రతీహారీ.

ప్రతీహారి

[ప్రవేశించి] దేవరవారి ఆనతి?

# లలితకళావస్తు ప్రదర్శనము

పదునాలుగవ ఆంధ్రమహిళామహాసభతోపాటు కడపయందు లలితకళాపరిశ్రమల వస్తుప్రదర్శనము ఏర్పాటు చేయబడినది. లలితకళాపరిశ్రమలుగాక, కడపజిల్లాలోని ఇతర కుటీరపరిశ్రమలు కూడ ప్రదర్శింపబడినవి.

16-వ తేదీ ఉదయము యీ ప్రదర్శన ప్రారంభోత్సవమును జరుపుచు శ్రీమతి మాగంటి శకుంతలాదేవిగారు, పరిశ్రమల ప్రాముఖ్యతను దెలుపుచు, ఆ పరిశ్రమలు స్త్రీల వలననే ఎట్లు అభివృద్ధికి వచ్చునదియు వివరించుచు, గాంధిమహాత్ముని వార్ధా విద్యావిధానములో నివి అత్యంత ప్రాముఖ్యత నొందియుండుట యొక్క పాశస్త్యమును విపులపరచుచు, భారతదేశపు ధనమును భారతీయులే అనుభవించుటకు భారతదేశ పరిశ్రమలనే ప్రోత్సహించవలెననియు, ఈ విషయమున స్త్రీలు శ్రద్ధబూనిన తప్పక ఫలితమును పొందవచ్చునని హెచ్చరించుచు ఉపన్యసించిరి. సభకు శ్రీ బేగం అమీరుద్దీన్‌సతిగారు అధ్యక్షతవహించిరి.

వస్తుప్రదర్శనములో ప్రదర్శింపబడిన వస్తువులలో స్త్రీలచేత చేయబడిన వాటికే ప్రాధాన్యత నిచ్చియుండుటవలన ఈ ప్రదర్శనమునకు ఒక ప్రత్యేక ప్రాముఖ్యత కలిగినది.

శ్రీమతి సౌందరమ్మాళ్ గారి చేతి కాగితపు పరిశ్రమ, శ్రీమతి సుబ్బారెడ్డిసతిగారిచే చిత్రింపబడిన అద్దముమీాద చిత్రములు, గవర్నమెంటు మిడిల్ స్కూలు బాలికలచే తయారుచేయబడిన సబ్బులు, లేకి చెక్కలపైన వివిధరంగుల చిత్రములు, దంతముతోను కర్రతోను చేయబడిన దువ్వెన్నలు, గంధపుచెక్కలతో చేయబడిన వీవన, లేసుకుట్లు మొదలగు వస్తువులు పనితనములో, అందములో, మన్నికలో వేటికిని తీసిపోనంతటి ఉత్తమ తరగతికి చెందుచున్నవై యున్నందున, స్త్రీలచే చేయబడిన వీటినిచూచి ప్రేక్షకులు విస్మయానందములను వెలిబుచ్చిరి.

ఆంధ్రదేశమందు వస్తుప్రదర్శనములే చాలతక్కువ. అందును స్త్రీలచే తయారు చేయబడిన వస్తుసముదాయమును ప్రదర్శించునవి అసలు కానరావు. గృహపరిశ్రమలు గాని, లలితకళలుగాని లలితాంగులయిడలనె లలితమంజులముగ రాణించును. వీటిని స్త్రీలోకము చేపట్టిన శీఘ్రఫలితమును పొందవచ్చును. అట్టియెడ, కేవలము స్త్రీలచేత తయారుకాబడిన వస్తువులను ప్రదర్శించి స్త్రీలలో ప్రబోధ మొనర్చుటకు ఇట్టి వస్తుప్రదర్శనమును ప్రధమ ప్రయత్నముగ నేర్పాటుచేసియున్న ఆహ్వానసంఘమువారు మిక్కిలి అభినందనీయులు.

# ప్రసవకాలమును దెలుపు పట్టిక.

సాధారణముగ స్త్రీలు గర్భము ధరించిన 280 దినములకు ప్రసవించెదరు. కడపటి బహిష్ఠయైన మొదటిదినము మొదలు లెక్కపెట్టుకొనవలయును. క్రిందకనుబరచిన పట్టిక మొదటిపంక్తి జనవరి 1-వ తారీఖున గర్భము ధరించినయెడల రెండవపంక్తి అక్టోబరు 8-వ తారీఖున ప్రసవించెదరు.

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జనవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జనవరి |
| అక్టోబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | నవంబరు |
| ఫిబ్రవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | | | | ఫిబ్రవరి |
| నవంబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | | | | డిసెంబరు |
| మార్చి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మార్చి |
| డిసెంబరు | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 33 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | జనవరి |
| ఏప్రెల్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | ఏప్రెలు |
| జనవరి | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | | ఫిబ్రవరి |
| మే | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మే |
| ఫిబ్రవరి | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మార్చి |
| జూన్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | జూన్ |
| మార్చి | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | ఏప్రెలు |
| జూలై | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జూలై |
| ఏప్రెల్ | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 23 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మే |
| ఆగస్టు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | ఆగస్టు |
| మే | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | జూన్ |
| సెప్టెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | సెప్టెంబరు |
| జూన్ | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | | జూలై |
| అక్టోబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | అక్టోబరు |
| జూలై | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | ఆగస్టు |
| నవంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | నవంబరు |
| ఆగస్టు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | సెప్టెంబరు |
| డిసెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | డిసెంబరు |
| సెప్టెంబరు | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | అక్టోబరు |

నిఘంటునిర్మాతలకూ ఉపయోగకరములని చెప్పినారు. ఇందు '"అందు" కళ' అని వీరు చూపిన ఉదాహరణాలు తమ పని తాము చేయవు. కాని యిందు కొన్ని విశేషాలు (విరివిగా కాకపోయినా,) లేకపోలేదు. ఛందశ్శాస్త్రరహస్యాన్ని గాలించిన శ్రీ గిడుగు సీతాపతిగారు 'పద్యరచన' అనే మెచ్చదగిన వ్యాసం వ్రాసినారు. వృత్తాదులలో సహా పాటలలోవలె 'తాళము', గుప్తముగా, ఉంటుందనీ, కేవలము మాత్రాక్షరముల గణము ఏర్పరుచుకొని వాటిలెక్కతో కట్టిన పద్యలక్షణము లయగతులకు అనుకూలపడక వికటగితులుకూడా బోధించేది కావడానికి వీలుండడంచేత పద్యలక్షణం లయప్రధానంగా అవగాహన చేసుకోదగుననీ, మరిన్నీ అక్షరాల ఊతను (accent) బట్టి నడక మారుతూఉంటుంది కాబట్టి, కేవల గణ ప్రాధాన్యమును పాటించక నడకను పాటిస్తూ, నడకలు ఎన్ని రకాలుగానో నడిపించుకోడానికి వీలుండగా, సంప్రదాయ విరుద్ధమని జంకక ఆంగ్లకవులవలె వివిధ ఛ్ఛందోగతులు సృష్టించుకొని నవ్యకవులు రచన సాగించవలెననీ, కృతకభాషను వదలి వ్యావహారికము పాటలకూ పద్యాలకూ ఉపయోగపరుచుకో చెల్లుననీ, వాడుకభాషను సహా ఛందస్సు ప్రతికూలమని యెంచనక్కరలేదనీ వీరు ఇంపుగా తెలిపినారు. ఆంగ్లమున మిస్ కాథరీన్ విల్సన్ వలె వీరు మన ఛందస్సును సంగీత శాస్త్రదృష్ట్యా పరిశీలించడానికి పూనుకొన్నారు. సంగీత శాస్త్ర జ్ఞానము కవికి ఉపయోగపడే పరికరాలలో ఒకటి అన్నది నిజమే కాని, దానికి అమితప్రాముఖ్యము నిచ్చిన ప్రమాదమునకు పాల్పడకపోతే వీరి భాషాలు ఛందస్సంస్కారానికీ, తదవగాహనానికీ చాలా మార్గదర్శకములు. మండపాక పార్వతీశ్వరశాస్త్రిలుగారు 'రాష్ట్రేతరాంధ్రులు: నవ్యసాహిత్యము' అనే వ్యాసం వ్రాసినారు. సంపాదకులు తెలికిచర్ల వెంకటరత్నంగారు 'భాషాసంస్కరణము' అనే వ్యాసంలో మన భాషకు గల సంస్కరణావశ్యకతను గురించి చర్చించినారు. చింతా దీక్షితులుగారి 'సూపరెంటు కూతురు' అనే కథ, శ్రీరంగం శ్రీనివాసరావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, మల్లవరపు విశ్వేశ్వరరావు, నోరి నరసింహశాస్త్రి ప్రభృతుల పద్యాలు మంచి సాహిత్యరచనములు. నవ్యసాహిత్యములో నవ్యతర గతులు చూపే శ్రీనివాసరావుగారి రచనలు మరికొన్ని రచనలతోపాటు ఈ సంచికకు తగిఉన్నవి. బ్రహ్మశ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారున్ను, డాక్టరు బుర్రా శేషగిరిరావుగారున్ను వ్రాసిన జాబులు నవ్యసాహిత్యము గురించి ఉద్బోధము ఇస్తున్నవి. గ్రంథసమీక్షలతో, సంపాదకుల విజ్ఞాపనములతో, అందమైన తీర్పుతో ఇది మంచి పత్రికలలో ఒకటై ప్రవేశిస్తున్నది.

వీణ. మాసపత్రిక. సంపాదకుడు పాటిబండ మాధవశర్మ, ఎమ్.ఏ. (ఆనర్సు),
తేలప్రోలు, కృష్ణాజిల్లా. వెల ౪ అణాలు. సాలుచందా రు ౨ లు.

ఇది సర్వవిషయాలూ ప్రసంగించే మాసపత్రిక. కాని లలితకళావిమర్శకూ, సాహిత్యరచనములకూ ప్రాధాన్య మిచ్చి చక్కని రచనములు వెలువరుస్తున్నది. దీనికి మంచి రచయితల తోడ్పాటు కలదనుటకు పెక్కుశాఖల కృషి చేస్తున్న సారస్వతులు దీని సంపాదకవర్గము నలంకరించడమే తార్కాణ. ముఖ్యముగా యువజనుల ఉత్సాహమునకు ముఖపత్రము కాగల సూచనలు దీనిలో కనబడుతుండడం ప్రశంసార్హము. అనేకవిధాల పత్రికానిర్వహణము కష్టసాధ్యమైన యీ దేశాన, ఈ రోజులలో, తక్కిన అన్ని పత్రికలకంటె ఖరీదైన కాగితముతో, మంచి తీర్పుతో, ఏబదిపుటల గ్రంథము ఇంత తక్కువ చందాకు అందజేయ [illegible] యువజనుల పూనిక మిక్కిలి కొనియాడతగ్గది.

జరిగినది తక్కువ అనియే యెంచవలెను. మాడర్న్ రివ్యూ, త్రివేణి వంటి పత్రికలు ఈవిధమైన ప్రయత్నము సాగిస్తున్నాయి, ఈలాటి సార్వజనిక సన్నివేశాలకు అనుకూల పరిస్థితు లేర్పరచగల ప్రయత్నాలు విడివిగా ఈ ఒక దృష్టితో జరగవలనే ఉంటుంది. అఖిల భారత దృష్టితో హిందీ మాధ్యమముగా సారస్వతము కేంద్రీకృతము చేస్తున్న మున్షీ ప్రభృతుల పూనిక మిక్కిలి ప్రశంసార్హమే కాని, ఇతర దేశాలలో సహచారమని వచ్చినపుడు ఆంగ్లములో తిరిగి యింతపనీ జరగవలనే ఉంటున్నది. పి. ఇ. ఎన్. వారి కార్యవిధానము ప్రతీక్షించదగ్గది.

* * * *

కాని యీ సందర్భములో వంగదేశమువిశిష్టత గమనించదగ్గది. భారతదేశములో ఇన్ని భాషలున్నా ప్రపంచ మహాసభలందు భారతదేశ మొక స్వరూపముగా ప్రతినిధిని ఆహ్వానిస్తారు. సాహిత్య విషయము భాషపై ఆధారపడ్డదన్నది ప్రసిద్ధమే అయినా, భారతదేశానికి శ్రీమతి సోఫియా వాడియాగారు ప్రతినిధిగా పోయినది. ప్రాంతాలు గణించడం కష్టమే. కాని వంగప్రాంతానికి మాత్రం ప్రత్యేకం డాక్టరు కాళిదాస నాగ్ గారు ఆహ్వానం పొందినారంటే, వంగభాష ఇన్ని భాషలలో ఒకటయిన్నీ ప్రపంచ దృష్టి నాకర్షించినదై అన్ని ప్రాంతీయ భాషలకూ మేలుబంతియై, స్వభాషలయందయినా ప్రతిభావ్యక్తులు ప్రాంతములందే అణగిమణగి పోవడానికి బదులు ఆయా భాషకూ ప్రాంతానికీ ప్రఖ్యాతియే సంపాదించగలవని బోధిస్తున్నది. ఇందుకు టాగూరు కవి మున్నగువారి రచనలు మాడర్న్ రివ్యూ పత్రిక ఆంగ్లములో వెలువరించి ప్రపంచానికి పరిచితపరచడంవద్దనుంచీ జ్ఞాపకము చేసుకోవలనే ఉంటుంది. భాషాఖండమందు సాహిత్యకృషీ, అది వెల్లడికి తెచ్చే ఏర్పాటూకూడా అనేకవిధాల ప్రతిప్రాంతమందు జరగవలనే ఉంటుంది. అపరివ్యక్తముగానైనా, పరిషత్తులూ, పత్రికలూ ఇందుకు చాలా ఉపకరిస్తవి. వీని 'యేర్పాట్లు' రచనా స్వచ్ఛందతను కుంటుపరచకుండా చూడడం ఒక మెలకువగా మాత్రం నిలుపుకోవలె.

* * * *

భారతీయసాహిత్యమునకు ముఖపత్రికగా బయలువెడలి సంవత్సరము కాకపూర్వమే, పదకొండుసంచికలతోనే, 'హంస' (హిందీమాసపత్రిక) అంతరించింది. సేఠ్ గోవిందదాస్‌గారి 'సిద్ధాంత స్వాతంత్ర్య'అనే నాటకము ప్రకటించిన 'హంస' ప్రభుత్వమువారు అందులకై కోరిన రు ౧,౦౦౦ ధరావతు ఇచ్చుకో లేకపోయింది. పెద్ద సన్నాహముతో నెలకొన్న యీసంస్థ తన మహదాశయాలను నిర్వర్తించుకొంటున్న సంతుష్టి తీరినంత పడయక పూర్వమే అంతరించడం ఎల్లరకూ దుఃఖదాయకము.

* * * *

జి. కె. ఛెస్టర్‌టన్ మరణించి ఆంగ్లవాఙ్మయ నిర్మాతలనుండి ఒకవిచిత్రమైన పీఠము ఖాళీచేసి మృతజీవులలో చేరుకొన్నాడు. మాగ్జిమ్ గోర్కీ రష్యను వాఙ్మయపీఠికి దురదృష్టము మిగుల్చుటతో ప్రపంచ వాఙ్మయ వాటిలో ఒక మహాకృషిని వదలిపోయినాడు.

* * * *

ఋషి కావ్యకంఠ అయ్యలసోమయాజుల గణపతిశాస్త్రిగారు, ఆంధ్రవాల్మీకి వాసుదాసుగారు కీర్తి కాయులై ఆంధ్రజనావళికి నష్టము వాటించినారు. వావిలికొలనువారు ఆర్యకథానిధి, సుభద్రావిజయ నాటకము, రామాయణము మొదలైన వివిధకృత్యులకు చేరిన గ్రంథములు రచించి ఆంధ్రులమనస్సుకూ బుద్ధికీ కూడా చేరువకు వచ్చినవారు.

# టి. సి. యన్. గోల్డన్ మెటల్

## జ్యూయలరి మార్కువారి

## వివిధరకముల గాజులు




ఈ గాజులు అచ్చంగా బంగారు గాజుల లాగే కాంతిలోనూ, వన్నెలోనూ మెరిసి పోతున్నాయి. నలుపు కావడములేదు.

**2 సంవత్సరములు గ్యారంటి యిచ్చెదము**

పెద్దసైజు గాజులు 2 యించిలు మొదలు
పైబడినది జత 1-కి రూ. 3 0 0

మధ్యమసైజు $1\frac{3}{4}$ ఇంచి మొదలు 2 ఇంచిలకు
లోగా వుండునది జత 1-కి రూ. 2 8 0

బేబీసైజు $1\frac{3}{4}$ ఇంచికి లోబడినది
జత 1-కి రూ. 2 0 0

వి. పి. ఖర్చులు జత మొదలు
6 జతలు వరకు రూ. 0 6 0

గాజులకు ఆర్డరు చేయువారు వుపయోగించెదువాళ్ల గాజుల చుట్టుకొలతను ఇంకితో మార్కుచేసి పంపండి.

వలయువారు:—

## టి. సి. నాగలింగప్ప
## అండు కంపెని,

280 వాల్ టాక్సు రోడ్డు,

పార్కుటవున్ పోస్టు, మదరాసు.

2 అణాల ఖరీదుగల మా చక్కనిబొమ్మల

కేట్లాగు ఉచితము.

ఏజంట్లు:— పటేలు స్టోర్సు,

మునిసిపల్ హైస్కూల్ రోడ్,

బెజవాడ.

